
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంథాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**SaiRealAttitudeManagement**(SAI RAM) **- సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## TTD(తిరుమల తిరుపతి దేవస్థానం)

## http://ebooks.tirumala.org



# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ओ३म्

आन्ध्रभाषायां ऐदं प्राथम्येन प्रकाशिता प्रामाणिका

# चतुर्वेद - संहिता

( ऋषिदेवताछन्दस्वरमन्त्रानुक्रमणिकासहिताः ऋग्यजुस्सामाथर्ववेदानां मूलमन्त्राः । )

## चतुर्वेदभूमिका सहिता


**सम्पादकः, लिप्यनुवादकः, परिशोधकश्च:**

सिद्धान्तालङ्कारः, विद्याभूषणः, आर्षविद्याविनोदः

आचार्य **डॉ. मर्रि कृष्णारेड्डी** एम्.ए; एम.एड्; पीएच.डि



प्रकाशकाः

**वैदिक साहित्य प्रचार समितिः**

3-30, हानुमाननगर, चैतन्यपुरी 'X' रोड, दिल्सुखनगर, हैदराबाद - 500 060

फोन : 040-24051322, 98495 83929

**2006**

# PUBLISHED FOR THE FIRST TIME IN TELUGU

## THE AUTHENTIC

# CHATURVEDA SAMHITA

Original hymns of RUGVEDA, YAJURVEDA, SAAMAVEDA AND ATHARVAVEDA along with Rishi, Deity, Prosody, Swara and Anukramanika of hymns)

*Along with*

# CHATURVEDA BHOOMIKA

**Editor, Transcriber, Research Scholar**

*Siddhantalankara, Vidyabhushana, Arshavidyavinoda*

*Acharya* **Dr. Marri Krishna Reddy,** *M.A., M.Ed., Ph.D.*

**PUBLISHER**

**VAIDIKA SAHITYA PRACHARA SAMITHI**

*3-30, Hanuman Nagar, Chaitanyapuri 'X' Road, Dilsukhnagar, Hyderabad - 50 060*

***Ph : 040-24051322, 98495 83929***

**2006**

ఓ౩మ్

తెలుగులో మొట్టమొదటిసారి వెలువడుతున్న ప్రామాణికమైన

# చతుర్వేద సంహిత

(ఋగ్యజుస్సామాథర్వవేదముల మూలమంత్రములు. ఋషి, దేవత, ఛందస్సు, సర్వము, మంత్రానుక్రమణికలతో)

## *చతుర్వేదభూమికాసహితము*


లిప్యనువాదకులు, సంపాదకులు, పరిశోధకులు

సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద

**ఆచార్య డా॥ మఱ్ఱి కృష్ణారెడ్డి** ఎం.ఏ., ఎం.ఎడ్. పిహెచ్.డి.



ప్రకాశకులు

వైదిక సాహిత్య ప్రచారసమితి (రిజిష్టర్డ్), హైదరాబాద్ - 500 060.

దూరవాణి : 040-24051322; 98495 83929

**2006**

వైదిక సాహిత్య ప్రచార సమితి ప్రచురణలు - 1

## చతుర్వేద సంహిత


| | | |
|---|---|---|
| ప్రథమ ముద్రణ | : | 1000 |
| ద్వితీయ ముద్రణ | : | 1000 |
| తృతీయ ముద్రణ | : | 1000 |
| సర్వ హక్కులు | : | సంపాదకునివి |
| సృష్టి సంవత్సరము | : | 197,29,50,006 (ససంధి)<br>196,08,54,006 (అసంధి) |
| విక్రమాబ్దము | : | 2062 |
| కల్యాది | : | 5106 |
| దయానందాబ్దము | : | 182 |
| శాలివాహన శకము | : | 1927 వ్యయనామ సం॥ర వైశాఖ బ॥ దశమి, హనుమజ్జయంతి |
| క్రీస్తు శకం | : | 2006 మే |
| **మూల్యము** | : | **రూ. 1600/- (పదహారు వందలు)** |



ప్రతులకు

1. మల్లి రాధాకృష్ణారెడ్డి
   3-30 హనుమాన్‌నగర్, ఆర్యసమాజం ఎదురుగా,
   చైతన్యపురి క్రాస్ రోడ్డు, దిల్‌సుఖ్‌నగర్
   హైదరాబాద్ - 60
   ఫోన్ : 040-24051322, 98495 83929

2. మల్లి కృష్ణారెడ్డి
   వేదపీఠం, వేదగిరి
   కొందుర్గు - మం, మహబూబ్‌నగర్ - జి. ఆం.ప్ర. - 509207;
   సెల్ : 98495 83929


## మనవి

ఈ వేదసంహితల విక్రయము ద్వార వచ్చు ధనముతో వేదభాష్యములను మాతృభాషలో ముద్రించి ప్రతి ఒక్కరికీ సరళంగా అర్థమయ్యే విధంగా అందించబడును. ఉదారముగా విరాళము నొసగు దాతల పరిచయము గ్రంథములందు ప్రచురించబడును. ప్రతి తెలుగువారి ఇంట ఈ వేదమును ఉంచవలయునన్న మా దృఢసంకల్పం మీ దాతృత్వం ద్వారా నెరవేరుతుందని ఆశిస్తున్నాము. తద్వారా ఆంధ్రరాష్ట్రములో వైదికధర్మము పునఃప్రతిష్ఠితమై సమాజములో శాంతి, సహజీవనం మొదలగునవి వర్ధిల్లగలవని మా నమ్మకం.

## అభినందన పూర్వక ఆశీస్సులు

వేదమాత సేవలో అహోరాత్రములు నాతోపాటు భక్తి శ్రద్ధలతో పరిశ్రమించి నా కంటే ఎక్కువ తపనతో ఈ గ్రంథ నిర్మాణమునకు సహకరించిన నా అర్ధాంగి అనురాగమయి **'రాధ'** దీర్ఘసుమంగళిగా జీవించునట్లు అనుగ్రహించుమని పరమాత్మను ప్రార్థిస్తూ ఆశీర్వదిస్తున్నాను.

ఇట్లు
మల్లి కృష్ణా రెడ్డి

ఓ౩మ్.

# వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము.

# దీనిని చదువుట - చదివించుట; వినుట - వినిపించుట

# మానవులందరి పరమధర్మము

- మహర్షి దయానంద సరస్వతి

చరిత్ర కందని కాలములో దివ్యజ్ఞానసంపన్నులు, దయాళువులైన మహర్షులు మనకందించిన వాఙ్మయం వేద వాఙ్మయం. మహా మహిమాన్వితులైన ఆ మహర్షుల ద్వారా భగవంతుడావిష్కరించిన నిత్యసత్యాలే వేదాలు. వేదమనే పునాది పైనే కాలము గడిచేకొలది ఎన్నో ధర్మహర్మ్యాలు వెలసినాయి. కనుకనే సమస్త సాహిత్యానికీ, ధర్మానికీ, సంస్కృతికీ వేదం మూలాధారమని భారతీయుల విశ్వాసం.

ఇట్టి 'వేదాలను - వేద సంస్కృతి' ని రక్షించుకొనుట ప్రతి భారతీయుని కర్తవ్యం.

- చతుర్వేదభూమిక నుండి



మహర్షి దయానంద సరస్వతి



పరమపూజ్య స్వామి రామ్‌దేవ్ బాబా



మద్గురువరేణ్యులు పండిత గోపదేవ శాస్త్రి



ఏతద్గ్రంథ నిర్మాతలు డా॥ మర్రి కృష్ణారెడ్డి దంపతులు

## గ్రంథ సమర్పణము

మచ్ఛ్రేయోభిలాషులు-శాశ్వత వేదపోషకులునైన

గా॥ శ్రీమాన్ పలగాని సోమసుందరరావు, పద్మావతి పుణ్యదంపతుల

ఏకైక సుపుత్రుడు

చి॥ దుర్గాప్రసాద్

చి॥ల॥సౌ॥ భార్గవి ల

వివాహ శుభసందర్భమున

"ఆయురారోగ్యైశ్వర్యాది భోగభాగ్యములతోపాటు

పుత్రపౌత్రాదులనొసగి సదా సుఖశాంతులనివ్వాలని"

ఆ వేదమాతను ప్రార్థిస్తూ... ఈ గ్రంథ రాజమును

కానుకగా సమర్పిస్తున్నాము...

వారు

**మర్రి కృష్ణారెడ్డి - రాధాదేవి**



నూతన వధూవరులు



శ్రీ వి. సోమసుందరరావు దంపతులు



వేదగిరిపై 'వేదపీఠ, వేదమందిర, వేదాశ్రమ' నిర్మాణం
వేదగిరి పీఠాధిపతి - వేదముల అనువాదకర్త
వేదభాష్యమహాభాస్కర: శతాధిక గ్రంథకర్త
బ్రహ్మశ్రీ పండిత లోక మలహరి సిద్ధాంతాచార్య
'వేదపీఠ, వేదమందిర, వేదాశ్రమ' నిర్మాణ సమితి (రి) ఉద్దేశ్యములు
◆ "వేదగిరి క్షేత్రము"నందు ఆగమశాస్త్ర ప్రకారంగా సర్వాంగ సుందరంగా నిర్మించ తలపెట్టిన ఈ దివ్యవేదమందిర నిర్మాణానికి నాలుగు వేదాలలోగల 20,417 మంత్రములలో ఒక్కొక్క మంత్రమును రూ. 1,116/-ల చొప్పున దత్తత ఇచ్చి ధన సేకరణ చేసి దత్తత తీసుకున్నవారి పేరు, ఊరు మంత్రము క్రింద చెక్కించి వేదమందిరము నిర్మించుట ◆ వేద పాఠశాల స్థాపన ◆ వానప్రస్థ సంన్యాస (వృద్ధ) ఆశ్రమాలను నెలకొల్పుట ◆ పర్యావరణపరిరక్షణకు యజ్ఞమంటప నిర్మాణం ◆ ధ్యాన-యోగ మందిర నిర్మాణం ◆ వేదానుసంధానకేంద్రస్థాపన ◆ ఆర్షసాహిత్య గ్రంథాలయ స్థాపన ◆ వేదగిరిని యాత్రాస్థలంగా తీర్చిదిద్దుట
స్థలము : వేదగిరి, తూంపల్లి గ్రా॥, కొందుర్గు మం॥, మహబూబ్‌నగర్ జి॥. సెల్ : 98495 83929
అధ్యక్షులు
MLA
ఉపాధ్యక్షులు
కార్యదర్శి
సహాయ కార్యదర్శి
కోశాధికారి
సలహా మండలి సభ్యులు
డా॥ పి. శంకరరావు
MLA
అదార్య డా॥ మల్లి కృష్ణారెడ్డి
శ్రీ కె. రుద్రారెడ్డి
Ex DCCB Chairman రంగారెడ్డి
శ్రీ ఏపి. జితేందర్‌రెడ్డి
Ex. MP, మహబూబ్‌నగర్
శ్రీ జి. జయపాల్ యాదవ్
Ex MLA
శ్రీమతి మల్లి రాధాదేవి
వేదగిరి
శ్రీ నాగిళ్ళ లింగమూర్తి

# మానవులందరరూ వేదమును చదువవచ్చును

యథేమాం వాచం కల్యాణీమావదాని జనేభ్యః।
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ ॥

యజు. ౨౬.౨

(యథా) ఎట్లు నేను (జనేభ్యః) మనుష్యులందరకొఱకు (ఇమాం) ఈ (కల్యాణీం) సంసారసుఖమును, ముక్తి సుఖమును ఇచ్చునట్టి (వాచం) ఋగ్వేదాది చతుర్వేద వాణిని(ఆవదాని) ఉపదేశించుచున్నానో అట్లు మీరును జేయవలెను (బ్రహ్మరాజన్యాభ్యాం) బ్రాహ్మణ క్షత్రియులకొరకు (అర్యాయ) వైశ్యులకొరకును (శూద్రాయ) శూద్రులకొరకును(స్వాయ) వారి భృత్యులకొరకును, స్త్రీలకొరకును (అరణాయ) అతిశూద్రులకొరకును మానవమాత్రులందరికిని వేదమును ప్రకాశపరచితిని. అనగామానవులందరును వేదములను చదివియు, చదివించియు; వినియు; వినిపించియు విజ్ఞానమును వృద్ధి పరమకొని దుఃఖములనుండి దూరులై ఆనందమును పొందుదురుగాక!

# వేదమాత ప్రాశస్త్యము

స్తుతామయా వరదా వేదమాతా ప్రచోదయన్తాం పావమానీ ద్విజానాం ఆయుః, ప్రాణం, ప్రజాం, పశుం, కీర్తిం, ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యాం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్

అథర్వవేదము ౧౯. ౭౧.౧.

ఓ మానవులారా! మీకొరకు (మయా)నాచేత (వరదా) వరములనిచ్చు (వేదమాతా)వేదమాత (స్తుతా) ప్రాశస్త్యము వెల్లడించబడినది. (పావమానీ) పవిత్రముగావించు వేదమాత(ప్రచోదయన్తాం) కర్మరతులగు (ద్విజానాం) ద్విజులకు ( ఆయుః) ఆయుస్సును (ప్రాణం) ప్రాణము - ఆత్మబలము ను, (ప్రజాం) మంచి సంతానమును (పశుం) గోవులుమున్నగు పశుసంపదను (కీర్తిం) కీర్తిని (ద్రవిణం) ఐశ్వర్యమును (బ్రహ్మవర్చసం) బ్రహ్మతేజస్సును- అనగా విద్యాబలము మొదలగు వరములను ప్రసాదించునదియై యున్నది. ఇట్టి వేదమాత అధ్యయనం ద్వారా లభించు ఆయుష్యాది పదార్థములను (మహ్యాం) నాకు (దత్వా) సమర్పించి (బ్రహ్మలోకం) మోక్షపదవిని (వ్రజత) పొందెదరుగాక!

ఓ మానవులార! విజ్ఞానాది సుఖైశ్వర్యాభివృద్ధికొరకు ఈ వేదములను వెల్లడించితిని. మీరు పూర్ణవిద్వాంసులైన వేదవేత్తల ద్వారా నిరంతరము సాదరపూర్వకముగా భక్తిశ్రద్ధలతో వేదవాణిని అభ్యసింపుడు. దీని మూలమున సర్వోన్నత కీర్తి ప్రతిష్ఠలను సంపాదించి బ్రహ్మజ్ఞానులలో ఖ్యాతినిపొంది సమస్తఐశ్వర్యములను పొందుడు. (మానవులందరు వేదములను చదివి ద్విజులై పరబ్రహ్మప్రాప్తిని పొందవలెనని భావము.)

## వేదధర్మమనే క్షీరమునుండి వెలువడిన మీగడ - భారతీయ సంస్కృతి

# వేదం - వేదప్రాశస్త్యం




.... వేయిమాటలేల అణువు మొదలు విశ్వాంతరాళ ఖగోళ రహస్యములు సమస్తము వేదాలయందు నిక్షిప్తమైయున్నది.

# కృతజ్ఞతా నివేదనము

నాలో ఈ మహోన్నత మహత్కార్యసంకల్పమును కలిగింపజేసిన చరాచరజగత్కర్త, సర్వాంతర్యామి, సర్వవ్యాపక పరమేశ్వరునకు భక్తి పూర్వక నమస్కారములు.

ఈ సంకల్పమునకు నిమిత్తకారకులు చతుర్వేద సంహితామూలసంపాదకులు పూజ్య పరమహంస జగదీశ్వరానంద సరస్వతీయతీంద్రులకు వినయపూర్వక ప్రణామములు.

నాలో నిద్రాణమై ఉన్న శక్తిని తట్టి నిద్రలేపి ఈ మహత్కార్యము కొరకు ద్విగుణీకృత ఉత్సాహ పరిశ్రమలతో అహర్నిశలు పరిశ్రమింపజేసిన పం. వేంకయార్య, మాసెట్టి శ్రీనివాసరావులకు.....

గ్రంథారంభమునుండి సమాప్తివరకు ధైర్యమును కలిగిస్తూ గ్రంథములను సమకూర్చి పెట్టిన పూజనీయులు శ్రీ కొమ్మారెడ్డి నారాయణరెడ్డి గారికి.....

వేదానువాద కార్యమునకు కొంతకాలము కార్యాలయమునిచ్చి ఆవాసము నేర్పరచిన గౌరవనీయులు శ్రీ మద్దయానంద ఉపదేశక మహావిద్యాలయం ప్రధాన్ శ్రీ మ్యాడం యెల్లయ్యగుప్త గారికి, మరికొంత కాలము భోజనావాసముల నేర్పరచిన వందనీయులు శ్రీ కలవాయి రాధాకృష్ణారావు గారికి.... షేర్‌మార్గ్‌లో అన్ని వసతులు గలిగిన తమ స్వంత గృహమును వేద రచన చేయుచున్న కారణంగా నాకు సహకరించాలనే సద్భావనతో కొంతకాలం ఉండుటకు ఇచ్చి పుత్రవాత్సల్యమును కనబరిచిన ప్రఖ్యాత వైద్యులు పూజనీయులు డా॥ శ్రీ గుడిపాటి వేంకట రమణయ్య ఎమ్.బి.బి. ఎస్. గారికి, వేదనిర్మాణ సమయంలో నాకవసరమున్నప్పుడు భోజనాదులను సమకూర్చిన శ్రీ సర్వవేంకటేష్, ధనలక్ష్మి మెస్, లకడీకాపూల్, హైదరాబాద్ గారికి ... ...

వేద ప్రచురణ కార్య ప్రచారకర పత్రమును ప్రచురించుటకు సహకరించిన పూజ్యులు శ్రీ స్వ. మణికొండ భూపతిరావు మెమోరియల్ చారిటబుల్ ట్రస్టు అధిపతులు శ్రీ మణికొండ సోదరులకు, సహృదయులు శ్రీ కోటకొ లక్ష్మయ్యగారికి, దానశీల డా॥ మీనపల్లి సంజీవరావు గారికి ... ...

వేదసంహిత నిర్మాణమునకు సలహాలందించిన పం. మదనమోహన్ విద్యాసాగర్ గారికి, పం. విజయవీర్ విద్యాలంకార్ గారికి, కొలిపెట్టి సుదర్శనాచార్య సంతోష్‌నగర్, హైద్రాబాద్ వారికి, పం. లోకానులహరి గారికి, ఆచార్య సత్యవ్రత్ గారికి, మునప్ప గారికి, చిన్నయ్యవానప్రస్థి గారికి, పం. నారాయణరాజు గారికి, హరికిషన్ రెడ్డి వేదాలంకార్ గారికి, శ్రీధర్ గారికి, శ్రీమతి వసుధాశాస్త్రి గారికి, శ్రీమతి ముక్తావాణీ శాస్త్రి గారికి, డా॥ కోడూరు సుబ్బారావు గారికి, పం. భావజాల కుమారస్వామి గారికి, శ్రీ దామెర సత్యనారాయణ శర్మగారికి, వెన్నా పోలిరెడ్డిగారికి, శ్రీమతి & శ్రీ వైష్ణవి ధర్మతేజ దంపతులకు... ఆర్థిక సహాయము చేసిన మిత్రులు శ్రీ భద్రసేన గారికి...

గ్రంథారంభమునుండి సమాప్తివరకు పుత్రవాత్సల్యముతో నాకుటుంబమునకు సమర్పణభావంతో త్వరగా మా కార్యము పూర్తగుటకు మాగృహకార్యంలో పూర్తిగా సహకరించిన మా అత్తమ్మ బుచ్చమ్మగారికి....

వేదమును కంప్యూటర్ (డి.టి.పి.)కి ఇచ్చినప్పటినుండి శుద్ధప్రతి తయారగువరకు మాతో పాటు శ్రమించి మాకు సమయానికి భోజనాదులు సమకూర్చిన పుత్రసమానుడు చి॥ రాజకుమార్ రెడ్డికి, చి॥ వేమారెడ్డికి, మేనకోడలు కుమారి అనితకు...

తమ కంప్యూటర్‌ను ఈ వేదప్రచురణకే ఏర్పాటుచేసినట్లు పూర్తి శ్రద్ధాభక్తులతో లాభాకాంక్ష లేకుండా డి.టి.పి. ని సర్వాంగ సుందరంగా తయారు చేయించిన ఎస్.కె.స్టూడియోస్ అధిపతులు ప్రియమిత్రులు శ్రీ చంద్రశేఖర్‌రెడ్డి, నాగార్జునరెడ్డిగారలకు.... మిత్రులు శ్రీ వీరన్న గారికి.....

యజుర్వేదమొత్తమును, అథర్వవేద సగభాగమును, ఋగ్వేదాథర్వవేదముల మంత్రాను క్రమణికలను శ్రద్ధగా టైపుచేసిన శ్రీమతి ఆర్. వాణి, శ్రీమతి వి. వాణి ద్వయమునకు... సామవేదమును, యజుర్వేద, సామవేద మంత్రాను క్రమణికలను ఓర్పుతో నేర్పుగా టైపుచేసిన శ్రీమతి అరుణజ్యోతి (ఎం. ఎస్సి.)కి... సంపూర్ణ ఋగ్వేదమును, మిగతా అథర్వవేద సగభాగమును భూమిక మొదలగు సమస్త గ్రంథమును టైపుచేసి మెరుగులు దిద్దిన శ్రీ డి. ఎన్. మూర్తి, శ్రీ పి. శ్రీనివాస్, శ్రీ ఆనంద్, శ్రీ ప్రసాద్, శ్రీ రమణలకు...

వైదికసాహిత్యప్రచురణ ప్రచారసమితిని స్థాపించుటకు తమమనోధనములతో పూనుకొనిన శ్రీ బండారి రమేష్‌గారికి, శ్రీ బిజ్జ జనార్దన్ గారికి, శ్రీ మర్రి అనంతరెడ్డి గారికి, శ్రీ కొమ్మారెడ్డి నారాయణరెడ్డి గారికి, శ్రీ యం. వి. సుబ్బయ్యగారికి, డాక్టర్ మురళీధరరావు గారికి, శ్రీ చిన్నయ్య వానప్రస్థిగారికి, శ్రీ లక్ష్మారెడ్డిగారికి, శ్రీ నాగిళ్ళ లింగమూర్తి గారికి, శ్రీ కరణం ప్రహ్లాదరావు, (స్టేట్‌కౌన్సిల్ మెంబర్) కుల్కచర్ల గారికి, శ్రీ తంగెళ్ళపల్లి వేంకటరెడ్డి గారికి (ప్రిన్సిపాల్) శ్రీ పి. వేంకటేశ్వరరెడ్డి గారికి, శ్రీ ఏ. సుధాకర్ మొదలగువారికి....

చతుర్వేద సంహిత యను యీ బృహద్గ్రంథమును ప్రచురించుటకు ధన సహాయం చేసినవారికి చేయుచున్నవారికి చేయబోవు వారందరికిని నా హృదయపూర్వక ధన్యవాదములు తెలుపుతూ వేదమాతవీరికి దీర్ఘాయురారోగ్యాది ఐశ్వర్యములను ప్రసాదించాలని, ఇలాంటి శ్రేష్ఠకార్యముల నెన్నింటినో చేయు సత్సంకల్పములను వారి హృదయమున జనింపజేయవలయునని కోరుతూ....

ముద్రణ బాధ్యతను భక్తితో స్వీకరించి లాభాపేక్ష లేకుండా సుందరంగా ముద్రించి అందంగా బైండింగ్‌చేసి ఇచ్చిన శ్రీ అత్తునూరి ప్రభాకర్ (ఇన్నోవేటివ్ ఇంప్రెషన్స్, ఖైరతాబాద్, హైదరాబాద్) గారికి, మరియు శ్రీ అన్నే సుబ్రహ్మణ్యం (విశాల్ గ్రాఫిక్స్, మాసబ్‌ట్యాంక్, హైదరాబాద్) గారికి.....

వేదములపై మేధావుల అభిప్రాయ సేకరణ అను అంశముపై తమ అమూల్యాభిప్రాయములను వ్రాసిచ్చిన పండితులకు, ప్రముఖులకు.....

ఇంకా ఈ కార్యంలో తమవంతు సలహా సహకారములందించిన సహృదయులందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాకుసుమాంజలులు.

సదావేదమాతసేవలో
బుధజన సమారాధకుడు
**మర్రి కృష్ణారెడ్డి**

# మల్లి కృష్ణారెడ్డి గారి సంక్షిప్త పరిచయము

శ్రీ మల్లి కృష్ణారెడ్డి మహబూబ్‌నగర్ జిల్లా కొందుర్గు మండలం, రావిర్యాల గ్రామంలో స్వర్గీయ శ్రీమతి శివలీలమ్మ, స్వర్గీయ శ్రీ బుగ్గారెడ్డి దంపతులకు 16-12-1967 మార్గశిర పౌర్ణమి రాత్రి 10.15గంలకు జన్మించారు. అయిదవ ఏటలో తండ్రిగారు స్వయంగా అక్షరాభ్యాసం చేయించి కృష్ణశతకం నేర్పించారు. తమవెంట ప్రతి శనివారం జరుగు రాత్రిభజనకు తీసుకొని వెళ్ళేవారు. మరియు వీధిబడిలో చేర్పించి శతకాలు, పెద్దబాలశిక్ష మొదలగు అంశాలు నేర్పించారు. ఆదేవిధంగా ప్రభుత్వపాఠశాలలో కూడ చేర్పించి విద్యాభ్యాసం చేయిస్తుండగా వీరి పన్నెండవ ఏటనే తండ్రి గారు అకస్మాత్తుగా తనువు చాలించారు. మేనమామగారగు గాలిరెడ్డి కోస్గి మండలం వాస్తవ్యులు వీరిని కోడంగల్ ప్రభుత్వ వసతిగృహంలో చేర్పించి పదవ తరగతి వరకు చదివించారు. హాస్టలులో భోజనం చేసి తనకు తెలుగుబోధించు శ్రీ బసవరాజస్వామిగారి ఇంట్లో ఉంటూ తెలుగు, సంస్కృతముల అధ్యయనం చేశారు. సంస్కృతాంధ్ర భాషా కవి పండితులైన శ్రీముదుంబై వరదాచార్యులు శ్రీ చోర్వుల విశ్వనాథశర్మగార్ల దగ్గర కవిత్వరీతి నేర్చుకున్నారు. పదవ తరగతిలో ప్రవేశించేంతలోనే సంస్కృత భాషా ప్రచారసమితివారు నిర్వహించు విశిష్ట పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. 1984లో పదవతరగతియందు ఉత్తీర్ణులై స్వయంగా హైదరాబాద్ చేరుకొని శ్రీ వేంకటేశ్వర వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాల బోయిన్ పల్లి సికింద్రాబాదులో రెండు సంవత్సరాలపాటు ప్రీ డిగ్రీ కోర్సు చదివినారు. 1986లో అదృష్టవశాత్తు దయానంద ఉపదేశక మహా విద్యాలయం, దయానందనగర్, మలక్‌పేటలో పండిత గోపదేవ శాస్త్రిగారి దగ్గర చదువుకునే అవకాశం లభించింది. నాల్గు సంవత్సరాలపాటు భక్తి శ్రద్ధలతో శుశ్రూష చేసి ఆరు శాస్త్రములను, పది ఉపనిషత్తులను, వేదవాఙ్మయమును బాగా అధ్యయనం చేశారు. తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి సంస్కృతంలో బి.ఏ చదివి తర్వాత తెలుగు ఎం.ఏ. పట్టా పొంది, తదుపరి రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠం తిరుపతిలో సంస్కృతంలో బి.ఎడ్,ఎం.ఎడ్ డిగ్రీలను పొందినారు.

విద్యాభ్యాసంతో పాటు రచనా వ్యాసంగమును కూడ కొనసాగించి దశాధిక గ్రంథములను వెలువరించిన కారణంగా ఉస్మానియా విశ్వవిద్యాలయం వారు ఎం. ఫిల్. లేకుండా నేరుగా పి. హెచ్. డి. చేసే అవకాశము ఇచ్చినారు. పరిశోధనా కార్యం చేస్తున్న తరుణంలోనే భారతీయులకు పరమ ప్రమాణమై సృష్ట్యాదిలోనే ప్రపంచానికి జ్ఞానభిక్షపెట్టిన నాలుగు వేదములను తెలుగువారికి అందించాలనే దృఢసంకల్పం కలిగింది. వెంటనే ఆ పని ప్రారంభించి 1997 నుండి 1999 వరకు అనగా రెండే రెండు సంవత్సరాలలో నాలుగువేల పుటలు గలిగిన నాలుగు వేదములను 500 పుటల విశాల పీఠికతో మంత్రానుక్రమణికలతో ప్రామాణికంగా సిద్ధంచేసి ఆంధ్రులకందించారు. ఈ మహత్తరమైన కృషిని చేసి మొట్టమొదటిసారి చతుర్వేదాలను తెలుగు వారికందించిన ఘనతను పొందారు. నేటివరకు తెలుగులో ఎవరూ చేయని పనిని వీరు పిన్నవయస్సులోనే సాధించి తెలుగువారి ముందుంచుట ఎంతో ప్రశంసించవలసిన విషయం.

ఏ పీఠాధిపతులు, మఠాధిపతులు, తిరుమల తిరుపతి దేవస్థానం లాంటి ధర్మసంస్థలు చేయని మహత్తరబృహత్కార్యాన్ని నిరుపేదయై, గృహస్థుడై, నిరుద్యోగియై, అర్థబలము - అంగబలములేని వాడయ్యికూడ ఒకే ఒక దృఢసంకల్పముతో మహామేధావులు సైతం ప్రశంసించే విధంగా తెలుగువారికి వేదాలను పరిచయం చేయడమన్నది అసాధారణ విషయం. విశేషవ్యక్తులకు తప్ప సామాన్యులకిది సాధ్యంకాదు.

ఈ రచనావ్యాసంగం పుట్టుకతోనే వచ్చినది. తన పన్నెండవ ఏటనుండే కవిత్వమును వ్రాయనారంభించినారు. వీరి కలంనుండి జాలువారిన మొట్టమొదటి కవితను చూడండి.

ప్రాణులను ప్రేమించుమన్న - ధర్మమునే చరించుమన్న
కలతలను కరిగించుమన్న - కలహాలకు దిగకుమన్న.
కాలమును కాజేయకన్న - కష్టమెప్పుడు రాదోయన్న
కట్టుబాటున నుండుమన్న - కార్యమును సాధించుమన్న

అని వ్రాసిన తన కవిత్వానికి తానే ఆదర్శప్రాయుడై విలువైన కాలాన్ని వ్యర్థంచేయకుండా తనముప్పై ఏళ్ళ వయస్సులో 60 ఏళ్ళలో చేసే పనిచేశారు. ఇది అందరికీ ఆదర్శం. ఆచరణీయం. మానవుడై పుట్టినందుకు ఏదో ఒక మంచి చేస్తూనే జీవితం కొనసాగించాలన్న అభిప్రాయం వీరి జీవన విధానాన్ని - చేసిన కార్యాన్ని బట్టి చూస్తే తెలుస్తుంది.

శ్రీ కృష్ణారెడ్డి కర్షకులైన కుటుంబములో పుట్టి హలమును బట్టక కలమును చేబట్టి జ్ఞానాహారమును పండించుటకు సాహితీ వ్యవసాయమును చేస్తూ నేటివరకు అమూల్యములైన దశాధిక గ్రంథములను వెలువరించినారు. వీరి రచనలలో ప్రతి సామాన్యునికి పనికొచ్చేవి. '1. విద్యార్థి జీవిత విజయరహస్యం. 2. కుటుంబంలో ఎవరెవరితో ఎలా మెలగాలి?' అనునవి. ఇవి వేలాదిగా జనులహృదయములలోకి వెళ్ళి మిగుల జనాదరణను పొందినవి.

ఒక రైతుకుటుంబంలో మారుమూల గ్రామంలో పుట్టిన సామాన్యుడు అసామాన్యకృషి, పట్టుదలతో మాన్యుడై నిరంతర నిర్విరామ సాహితీ నిర్మాణ కార్యములో ముందుకు సాగుతున్న కృష్ణారెడ్డి జీవితంలో 1991లో అర్ధాంగిగా అడుగుపెట్టిన శ్రీమతి రాధ అనుకూలవతియైన భార్యగా దొరకడం వీరి విజయాలకు కారణం. వివాహితులైనప్పటికీ కూడ ఉన్నత విద్యనభ్యసిస్తూ ఏమీ చదువని తన భార్యను సైతం డిగ్రీస్థాయివరకు తీసుకువచ్చి చదివించుటయును,

వేదసంహితలను మాతృభాషలో పొందుటవలన కలిగెడు ప్రయోజనాలను వెలిబుచ్చిన

# మేధావుల అభిప్రాయములు

సేకరణ: కృష్ణారెడ్డి

అపౌరుషేయములగు మానవధర్మాలు మాతృభాషలో లభ్యమై వాటిని అందరు తెలుసుకున్ననాడే ప్రేమతో పీడింపబడనటువంటి సమసమాజ నిర్మాణము జరుగుతుంది.

కొమ్మారెడ్డి నారాయణ రెడ్డి, కొల్లూరు, మెదక్.

వేదములు అపౌరుషేయములు. మానవజాతి మనుగడకు మూలాధారములు.......

మరింగంటి భట్టరాచార్యులు, పర్తుపల్లి, ఖమ్మం జిల్లా.

వేదాలు జీవిత గమ్యమును బోధించేవి...........

- జీరెడ్డి బాలమల్లారెడ్డివ్యాకరణశిరోమణి, స్నేహపురికాలనీ, హైదరాబాదు.

సృష్ట్యాదినుండి గల ప్రకృతి పరిణామమే సంక్షిప్తముగాను, క్లుప్తముగాను నిక్షిప్తము జేయబడిన అఖండ విజ్ఞాన నిలయమే ఈ చతుర్వేదములు. ........

కే. నారాయణరెడ్డి, బి.యస్.సి. ఎల్.ఎల్.బి. హెచ్.డి.పి., మలక్‌పేట కాలనీ, హైద్రాబాదు.

కం॥ భేదవుభవరోగాదుల, వేదమువే దూరపరచ విశ్వేశ్వరుడే, ఆదిని మనుజుల పోరవు, రోదన మాన్యవుల నాస ఋషులకు నొసగెన్॥.......సంగమేశ్వరసంగం కవి, జోగిపేట, మెదక్ జిల్లా.

ఉదాత్తభావనలకు మంత్రాధిదేవతా ప్రభావములకు నిలయములు వేదములు......

డా॥ కల్వకుంట్ల కోదండరామాచార్యులు, మామిళ్ళగూడెం, ఖమ్మం.

సృష్ట్యాదిలో మానవులకు పరమాత్మని ద్వారా ఇవ్వబడిన పవిత్ర గ్రంథములే వేదములు..... స్వాతంత్ర్యసమరయోధుడు నారాయణరావు మార్, మ్యా వల్లకుంట, హైదరాబాదు.

వేద శబ్దానికి జ్ఞానమని అర్థం. దీన్ని ఈశ్వరుడు సృష్ట్యాదిలో మానవులకిచ్చాడు....

వేదనిధి ఎస్.బి.ఐ. కాలని, కొత్తపేట, హైదరాబాదు.

వేదాలను నేను చదవలేదు. వినలేదు. కాని వాటిపేర్లు వింటేనే నాలో ఒక విధమైన ఆనందానుభూతి కలుగుతుంటుంది......

పి.వి. మల్లికార్జునరావు, బి.కామ్, ఎమ్.ఏ., ఎమ్.ఏ.,ఎమ్.బి.ఏ. బోయివాడ, కరీంనగర్.

ఒకనాడు- లోకంలో వేదాధ్యయనం చేసి దానిని పఠనపాఠనముల ద్వారా పూజాక్రియా, ఆధ్యాత్మిక ప్రవచనములద్వారా ఒక వర్గం తమ ప్రత్యేకతను సాధిస్తుండగా వేదాలలోని ప్రయోగశరణ్యమైన వైజ్ఞానిక స్థితిగతులను నిరూపించే దిశగా మరోవర్గం సాధికారికమైన కృషి చేస్తుంది........వల్లూరి లక్ష్మణరావుగాంధీఎమ్.ఎల్., ఎమ్.ఏ., రామమూర్తిపేట, కావలి, నెల్లూరుజిల్లా.

వేదములు అపౌరుషేయములు. దీనిలో ఇహమునకు సంబంధించిన అంశములేగాక పరమునకు సంబంధించిన అంశములనేకములున్నవి..........

లక్కోజు సూర్యనారాయణ ఎమ్.ఏ., బి.ఎస్.సి. బి.ఇడి., గోపాలపురం, తూర్పుగోదావరిజిల్లా.

హిందూమతానికి అతిప్రధానమైనవి వేదములు. వేదములలో లేని విషయములు లేవు. శాస్త్రజ్ఞులు, వేదవేత్తలు కలిసి పరిశోధించి వేదరహస్యములు వెలువరించి లోకానికి ఉపకరించవలసిన అవసరమున్నది....

అవంటశివరామకృష్ణమూర్తి, భాషాప్రవీణ,ఎమ్.ఏ., ఎమ్.ఏ., ఏలూరు - పశ్చిమగోదావరిజిల్లా.

సునిశితంగా భగవత్స్వరూపాన్ని వర్ణింపగల్గేవి. అజ్ఞానాంధకారమును పారదోలేవి వేదములు...

మరింగంటి మల్లేశ్వరాచార్యులు, విద్వాన్, ఎమ్.ఏ. హెచ్.ఏ.సి. కాలనీ, బాలానగర్, హైదరాబాదు.

ధర్మ, కర్మ ప్రమాణాలపైన నడుస్తున్న సనాతన జాతి భరతజాతి. మన జాతి ఆచరించే అత్యుత్తమ సత్కర్మనిష్ఠలన్నిటికీ వేదాలు ప్రమాణాలు....

కోమారిగాంధీ బి.ఏ., బి.ఇడి., తణుకు, ప.గో.జిల్లా.

వేదాలు మానవునికి ఆధ్యాత్మిక జ్ఞానశక్తిని అందిస్తాయి. తెల్లనిపాలు శాంతికి చిహ్నం. వేదాలు మనశ్శాంతికి సంపూర్ణ జీవిత గమనానికి తార్కాణం....

జనగామ చంద్రశేఖర శర్మ, ఎమ్.ఏ., బి.ఇడి., (ఎమ్.ఇడి.,), బాలిపేట, నిజామాబాదు.

వేదాలు భారతీయ నాగరకత, సంస్కృతికి చెందిన దర్పణాలు. ఆధ్యాత్మిక, ధార్మిక జీవనాడి ప్రతిబింబాలు......

లకులోట శ్రీలంగుప్త, స్వాతంత్ర్యసమరయోధుడు, వెంకటేశ్వరనగర్, చింతపల్లి, నల్గొండ.

మిగత మతములకు కాలనిర్ణయం చేయదగినది. వేదములు అపౌరుషేయములు. ఆద్యంత రహితములు........ కె.వి.రమణ.

వేదములను ఋషులు సమాధిస్థితిలో నున్నప్పుడు భగవదనుగ్రహము వలన వినినట్టి వాక్యసముదాయము. కాబట్టియే వానిని అపౌరుషేయములనిరి. వేద శ్రవణ మననములవలన బ్రహ్మానందమును అనుభవములోనికి తీసుకొని రావచ్చును. వేదములు విశ్వవ్యాప్తముగా చేసినచో మానవులెల్లరూ వేద ధర్మమునుసరించినచో భూమియంతయూ దివిగా మారునని భగవదనుగ్రహము సృష్టిజాలమునకంతటికిని సంచిపెట్టవచ్చునని మా ప్రగాఢ విశ్వాసము.........

రాంపల్లి భట్టర్ భరతాచార్యులు, సీనియర్ ఇంజనీర్, న్యూనల్లకుంట, హైద్రాబాద్.

వేదములు పౌరుషేయములైనను అపౌరుషేయములైనను మానవుని మనిషిగా, మహాత్మునిగా తీర్చిదిద్దుతున్నవనుటలో సందేహమిసుమంతయు లేదు........

ఉపాధ్యాయరత్న, ప్రతివాదిభయంకరలక్ష్మణాచార్యులుఎమ్.ఎ.ఎల్., కూకట్‌పల్లి, హైదరాబాదు.

నల్లగొండ.

భారతీయ సంస్కృతీ సంప్రదాయములు వేదములపై ఆధారపడియున్నవి. కావున వేదములను గౌరవించి వేద విహితమార్గమున మానవాళి ప్రవర్తించుట శ్రేయోదాయకము........

డా॥ వారణాసి భిక్షమయ్య శర్మ ఎమ్.ఎ., పి.హెచ్.డి., న్యూ వెంకటేశ్వరకాలని, నల్లగొండ.

మానవాళికి శ్రేయోభివృద్ధికి, నిరంతర, పఠన, గ్రహణ, ఆచరణములకు ఏకైక సన్మార్గ బోధకము వేదము..........రాపోలు రామారావు బి.ఏ., బి.ఇడి., కొడగండ్ల, వరంగల్ జిల్లా.

వేదాలు ప్రపంచానికి జీవనమూలములు. సమస్త మానవీయ ధర్మాలకు పట్టుకొమ్మలు, భారతీయ తాత్విక అంతర్వాహినులు జ్ఞానమునకు మూలస్కంధములు, సృష్టిరహస్యములు పొందుపరచుకున్న జ్ఞానభాండాగారములు. చతుష్షష్టికళలు పరిఢవిల్లే విద్యుల్లతలు, సామాజిక, సాంకేతిక, విజ్ఞాన సూత్రములకు సంక్షిప్త స్వరూపములు, వేయిమాటలేల......అణువు మొదలు విశ్వాంతరాళ ఖగోళముల రహస్యములు సమస్తము వేదాలయందు నిక్షిప్తమై యున్నవి......

అష్టావధాని, మధురకవి దేవగానమురామమూర్తి ఎమ్.ఎ., కామారెడ్డి.

ప్రపంచములోనే ప్రప్రథమగ్రంథం ఋగ్వేదం. యజుస్సామాథర్వవేదములు మానవజాతినంతటినీ ఆదర్శవంతంగా తీర్చిదిద్దుటకు వలసిన విజ్ఞానఖనులు...............

వైద్య డా॥ సైదమల్ల నాగక్రపథు ఎమ్.ఎ.,ఎమ్.ఫిల్., పి.హెచ్.డి., సిద్దిపేట.

భారతీయ ప్రాచీనసంస్కృతికి, భావిసంస్కృతికి ప్రధానమైన ఆధారం వేదం.......

చిటిప్రోలు వేంకటరత్నం ఎమ్.ఎ.,ఎమ్.ఫిల్., సంతోష్ నగర్, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా.

మహర్షులచే తపఃపూర్వకమైన దేహాతీతస్థితిలో విని, దర్శించిన విశ్వజనీన మానవ ప్రవర్తనము గూర్చి తెలిపిన అమృత వాక్కులు.........

వంయు భీమశంకర శాస్త్రి డి.వో.పి., బి.ఎల్., అగ్రహారం వీధి, మండపేట.

వేదాలు గొప్పవి, పురాతన మైనవని అందరూ చెప్పుతుంటారు. కాని వాటిని చదివినవారెందరు? చదివినా అర్థం చేసుకున్న వారెందరు? కావున వాటి అర్థాన్ని తెలుసుకొని ఆచరించినప్పుడే అవి సార్థకమౌతాయి.....

డా॥ లక్కా చంద్రమోహన్, ఎమ్.ఎ., బి.ఇడి., పి.హెచ్.డి., మారుతీ నగర్, హైదరాబాదు.

వేదాలు విశ్వశాంతికాముకములేకాక సకలవ్యక్తులకు కర్తవ్య బోధకములు కూడా. మనువు పేర్కొన్న, ప్రతివ్యక్తికి సంబంధించిన వైయుక్తిక ధర్మములన్ని కూడా వేదప్రతిపాదితములే........

సముద్రాల శఠగోపాచార్య ఎమ్.ఎ.,ఎమ్.ఫిల్., వక్కలగడ్డ, హన్మకొండ, వరంగల్.

వేదములు భగవత్తత్వమును తెలిసికొనుటకు మూలములైనవి. తద్వారా జ్ఞానవంతమైన ప్రాణికోటి ముక్తినొందుటకు వీలగును..........

సంతపురం నరసింహాచార్యులు పి.ఓ.ఎల్., ఎమ్.ఓ.ఎల్., భవానీనగర్, నాచారం, హైదరాబాదు.

వేదాలలో సుప్రతిష్ఠితమైన ధర్మం సార్వజనీనం. సార్వకాలికం. వేదాలు విజ్ఞానానికీ, ప్రజ్ఞానానికీ నిలయాలు.......

నేమూరి వేంకటేశ్వర శర్మ బి.ఏ.,పి.జి.డి., బి-6, యఫ్-6, కృపాకాంప్లెక్స్, నేరేడుమెట్టు, సికింద్రాబాదు.

వేదము అనగా జ్ఞానము. జ్ఞానమును సంపాదించవలయునన్న వేదములు చక్కగా పఠించవలయును..... మందపాటి వీరభద్రశర్మ భాషాప్రవీణ, పాలకవీడు, నేరేడుచర్ల, నల్లగొండ.

ప్రపంచములో భారతదేశానికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. గౌరవం ఉంది. వైదిక ధర్మమూ, సంప్రదాయమూ ఈ దేశంలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో నెలకొని ఉండడమేదానికి కారణం...... బి. రామస్వామి, కార్మిక సంఘసేవకుడు, 197, కన్నాలబస్తి, బెల్లంపల్లి, ఆదిలాబాదు.

వేదములందు భారతీయసంస్కృతి ఎంతో చక్కగా వివరింపబడి ఉంది. అందులో సర్వమానవసమానత్వం తెలుపబడిఉంది..........

పువ్వు రమేశ్ ఎమ్.ఎ.,ఎ.ఎ.పి., 16-65, శ్రీ కృష్ణనగర్ కాలనీ, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు.

వేదములు పరమేశ్వర నిశ్శ్వసిత రూపములు. నిత్యములై అపౌరుషేయములైన వాటిద్వారానే ఈ జగత్సృష్టి జరుగుచున్నది........

వైశ్యరత్న, దానశీల కటకమాయి రాధాకృష్ణారావు, బంగారం వ్యాపారం, సుల్తాన్ బజార్, హైదరాబాదు.

వేదములు సకల లోకధర్మ పర్యవసానములు. కేవలము మానవులకే గాక దేవతలకు కూడ వేదములు పవిత్రమైన జ్ఞాననేత్రములు........

తంగెళ్ళపల్లి వేంకటరెడ్డి. (బి.ఏ.ఎమ్. ఉగ్రకళాశాల, షాద్‌నగర్.)

శాశ్వతముగా సుఖప్రాప్తి కలుగవలెనన్నను, అనిష్టము పరిహారింపబడవలయునన్నను ఈ లౌకికోపాయములుపయోగించవు. అలౌకికములైన ఉపాయము తప్పక కావలయును. ఈ అలౌకిక ఉపాయమును తెలియజేయునదియే వేదమని మన సంస్కృతి బోధించు చున్నది.........

పుండరీకం, అశోక్‌నగర్, హైదరాబాదు.

ప్రపంచ పుస్తకభాండాగారము నందే మొట్టమొదటి పుస్తకంగా ప్రాచ్యపాశ్చాత్య పండితులచే ప్రశంసింపబడినదే వేదం........ పి. వేంకటేశ్వరరెడ్డి, మణాపురం, మహబూబ్‌నగర్.

వేదములు మన ప్రాచీన భారతీయ మహర్షులు ద్రష్టలుగా అవతరింపజేసిన అపౌరుషేయ మహాసంపదలు....

చింతా రామమనోహరరెడ్డి, ఎమ్.ఎ., ఫ్లాటు నెం. 4, అరవిందనగర్, దోమల్‌గూడ, హైదరాబాదు.

వేదములు ప్రాచీన భారతసంపదలలో తలమానికములవంటి అమూల్యసంపదలుగా మన మహర్షులకు భగవదత్తాలై అవి అవతరించాయి........ సం. లోకములహరి, నిజామాబాదు.

## మీ గృహాన్ని ఇలా దేవాలయంగా మార్చండి

పరమేశ్వరుడు ఈ లోకంలో రెండు వస్తువులను సృష్టించాడు. ఒకటి ఈ చరాచర జగత్సృష్టి. రెండవది - ఈ సృష్టిరహస్యాలను తెలుసుకునే వేదసృష్టి. మొదటిది కర్మసంబంధమైతే రెండవది జ్ఞానసంబంధమైనది. ఈ జ్ఞానంతోనే కర్మ చేయాలి. పొందాల్సిన (మోక్ష) ప్రయోజనాన్ని పొందాలి.

ఈ చరాచరజగత్ సృష్టినిండా పరమేశ్వరుడు వ్యాపించి యున్నట్లు వేదమునందంతా పరమేశ్వరుడే యున్నాడు. వేదమంటే జ్ఞానమనికదా అర్థం! జ్ఞానమే అతని స్వరూపం. ఆ జ్ఞానానికి నిలయమైనదే వేదం. వేదం ఎక్కడుంటే అక్కడ వేదేశ్వరుడున్నట్లే కదా! కావున వేదం కలిగిన ప్రతిస్థలమూ పవిత్రమైనదే. వేదం ఉన్న ప్రతి ఇల్లూ దేవాలయమే. వేదమే స్వరూపముగా కలవాడు పరమేశ్వరుడు. ఆ పరమేశ్వరుడే జ్ఞానానంద ప్రదాత.

సంకుచితములైన మతములు మానవునకు సుఖశాంతుల నివ్వవు. విడదీసేది మతము. కలిపేది ధర్మము. ఆ ధర్మాన్ని తెలిపేదే వేదము. ఈ ప్రపంచములో గాలి, నీరు, భూమి, ఆకాశము, సూర్యుడు మొదలగునవన్నీ మానవులకెట్ల సమానముగా నున్నవో అట్లే వేదధర్మం కూడా అందరికొరకై ఉన్నది.

వేదమునుండే సమస్త భాషలు పుట్టినవి. సర్వవిద్యలు జనించినవి. మతమతాంతరములు వెలసినవి. సముద్రములోని నీరు మేఘాలై వర్షించి తిరిగి సముద్రాన్నే చేరునట్లే వేదములోనుండి పుట్టినవన్నీ తిరిగి వేదములోనే కలిసిపోతాయి. అలా కలిసిననాడు వసుధంతా ఒకే కుటుంబముగా విరాజిల్లుతుంది. అందుకే వేదం "కృణ్వంతో విశ్వమార్యమ్" ఈ విశ్వాన్ని శ్రేష్ఠముగా జేయుమని "మనుర్భవ" మానవుడవు కమ్మని "జనయా దైవ్యం జనం' ' మంచి సంతానాన్ని కని పెంచి సంస్కారవంతుల జేసి ఈ భువిని దివిగా జేయుమని బోధించుచున్నది.

ఇలాంటి ఎన్నో దివ్యప్రబోధములను జేయు వేదభాగవామని మనమంతా కులమత భేదం లేకుండా మన గృహములలో ప్రతిష్ఠింపజేసుకొని గృహమే దేవాలయంగా మార్చుకుందాం. రండి! వేదాలవైపు తిరగండి. Back to the Vedas

## మీ సంతానానికి అందించే అసలైన సంపద ఇదే

ప్రతిమనిషీ సంపాదించాల్సిన అసలైన సంపద ఒకటుంది. అది మాత్రమే నిజంగా మనలను దైవం వైపు నడిపిస్తుంది. అటువంటి సంపదను ఎంత సంపాదించుకుంటే అంతమంచిదని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అదే జ్ఞానసంపద. మనిషిని మోక్షపథంవైపు నడిపిస్తూ జీవితంలో ఆనందకాంతులు నింపే జ్ఞానంచేతనే జీవితం శోభిస్తుందని "నహి జ్ఞానేన సదృశం" జ్ఞానంతో సమానమైనది ఏదీ లేదని భగగవద్గీత చెబుతోంది. "విద్యయాఽమృతమశ్నుతే" విద్యవలన మోక్షాన్ని పొందుతాడని వేదం చెబుతోంది. విద్య అంటే యుక్తాయుక్త వివేకం కలిగించేదని, అదే వేదవిద్యయని,అదిమాత్రమే జీవితాన్ని తరింపజేస్తుందని ధర్మశాస్త్రం చెబుతోంది. మనం బ్రతికి ఉన్నా మరణించినా జీవునితోపాటు మోక్షపర్యంతం జ్ఞానం అంటిపెట్టుకొనే ఉంటుందని యోగశాస్త్రం చెబుతోంది. ఇట్టి జ్ఞానం వేదాధ్యయనం ద్వారానే పరిపూర్ణమవుతుందని, ప్రతిమానవుడు ప్రతిదినం వేదమును చదువుచు - చదివించుచు; వినుచు - వినిపించుచు జీవితమును గడపాలని, ఇదే మానవులందరికి పరమధర్మమని మహర్షి దయానందసరస్వతి ఎలుగెత్తి చాటినాడు.

మరణ సమయంలో తనవెంట వచ్చేదే అసలైన సంపదని తన వెంటరానిదేదీ సంపదకాదని నీతిశాస్త్రం చెబుతోంది. ఈ లోకంలో చాలామంది (కోటానుకోట్లలో ఏ ఒక్కరిద్దరో తప్ప) తన వెంటవచ్చే సంపదను వదలివేసి తనే స్వయంగా వదలివెళ్ళే భౌతిక సంపదలను రాత్రింబవళ్ళు కష్టపడి జీవితాన్ని ధారబోసి గుట్టలుగా సంపాదిస్తారు. ఏ ఒక్క చిల్లిగవ్వైనా తన వెంట తీసుకొనకుండా వెనుదిరిగ్గైనా చూడకుండా ఎటువెళ్ళుచున్నాడో కూడా తెలియకుండా గమ్యంలేని అనంతయాత్రకు బయలుదేరుతాడు.

తన వారసులనుకునేవారు తమకు సంపదంతా అనాయాసంగా సంతరించినందువల్ల దాని విలువను తెలుసుకొనక విలాసాలకు, వినోదాలకు హారతికర్పూరంలా తగలేస్తూ, భోగలాలసులై, తుదకు భ్రష్టులై, చరిత్రహీనులై, తమ సంతానికి ఆదర్శరహితులై తమతోపాటు తనవారిని సైతం అంధకారంలోకి తీసుకొనిపోయేవారవుతారు. ఇదే భౌతికసంపద వల్ల కలిగే ప్రయోజనం. అదే తండ్రి జ్ఞానసంపదను సంపాదించి తనూతరించి, తన సంతానానికి అందించి వారినీ తరంపజేసి తన తోటివారికి కూడా అందించడంవల్ల సమాజం కూడా బాగుపడుతుంది. ఇదే జ్ఞానసంపదవల్ల కలిగే ప్రయోజనం.

కాబట్టి మీ సంతానానికి కావలసింది జ్ఞానసంపదే. ఆ జ్ఞానం నేటి చదువులవల్ల వచ్చేదికాదు. నేటి చదువులు కేవలము భోగజీవితానికి మాత్రమే పనికి వచ్చేవి. వేదవిద్యయే మానవుణ్ణి జ్ఞానిగా, సంస్కారవంతునిగా తయారు చేస్తుంది. ఎన్నటికీ తరగనిది - నిత్యం ఆనందాన్ని కలిగించేది, జీవితాన్ని సార్థకంచేసేది ఈ వేదవిద్యమాత్రమే.

బుద్ధిమంతులైన తల్లిదండ్రులు తమ సంతానానికి ఇట్టి వేదసంపదనే సంపాదించి పెడతారు. వేదవిద్యనే నేర్పిస్తారు. తమ ఇంట్లో విలాసవస్తువులకంటే వేద శాస్త్రాదిసద్గ్రంథాలకే ప్రాధాన్యతనిస్తారు. తమ గృహాన్ని గ్రంథాలయంగా మారుస్తారు. వీరు కష్టార్జితమైన ధనముతో తమ సంతానానికి అనంతమైన జ్ఞానసంపదను వారసత్వంగా అందిస్తారు. ఇది నిజమైన తల్లిదండ్రులు చేసేపని. జడవస్తువులకంటే జ్ఞానాన్ని కలిగించే పుస్తకములనే ఇవ్వండి.

## వేదాభిమానులకు విన్నపం

ఇందుమూలముగా ప్రత్యేకంగా వేదాభిమానులతో మనవిచేయునది ఏమనగా! వేదములను - వేదభాష్యములను ఇంత విస్తృతస్థాయిలో ముద్రించు ప్రయత్నము ఇతఃపూర్వము ఏ సంస్థనుండియు, ఏ వ్యక్తినుండియు జరిగియుండలేదు.

భారతీయ విజ్ఞాన సంపదకు మూలకందములనదగిన వేదముల రహస్యములు - సారాంశములు ఆంధ్రజగద్వ్యాప్తము చేయవలయుననే సత్సంకల్పముతో ఈ కార్యక్రమమునకు పూనుకొన్నాము. కావున భారతీయ సంస్కృతికి ఆధారములైన వేదసాహిత్యముద్రణ ద్వారా వేదధర్మప్రచారానికి అధికాధిక ధనమును వెచ్చించి ఈ **"వైదిక సాహిత్య ప్రచారసమితి"** (రి) అను సంస్థను ప్రోత్సహించవలసిందిగా కోరుచున్నాము.

## ఇంటింటావేదం - మా నినాదం

కులమత ప్రాంతభేదం లేకుండా ప్రతి ఒక్కరి ఇంట్లో వేదం ఉండాలని, ప్రతి ఒక్కరు వేదం పట్ల కనీసం భక్తిశ్రద్ధలు కలిగి ఉండాలనేది మా ఆలోచన. అదే మా ఆవేదన.

"చీకటిని. తిడుతూ కూర్చోవడం కంటే ప్రయత్నించి ఓ చిన్న దీపాన్నైనా వెలిగించాలన్న తలంపుతో, వేయిమైళ్ళ ప్రయాణమైనా ఒక్క అడుగుతోనే ప్రారంభమవుతుందన్న యోచనతో, మహానదులనదక సైతం చిన్నపాయతోటే ప్రారంభమవుతుందన్న ప్రేరణతో ఈ మహోజ్వల మహోన్నత వేదధర్మప్రచారమహోద్యమానికి వేదభాష్యముల ముద్రణతో అంకురార్పణ గావిస్తున్నాం."

కష్టనిష్ఠురములకు వెరవక, లాభనష్టములను బేరీజువేయక వేధధర్మ ప్రచారమే లక్ష్యంగా ముందుకు సాగుతున్న మాకు వైదికధర్మ ప్రచారాభిలాషులే సహాయకులు. తమ మనోధనములతో సహకరించు వారు మాకు ఆప్తులు. చరాచర జగత్సృష్టికర్తయైన ఆ పరమేశ్వరుడే ప్రేరకుడు. వేదసాహిత్యభవ్యనిర్మాణానికి మా వర్తమానజీవితాన్ని పునాదులుగా వేయుచున్నాం. మా యావజ్జీవితం వేదధర్మప్రచారానికే అంకితం. నిరంతరం నిర్విరామంగా, నిర్మాణాత్మకంగా ఆంధ్రదేశమంతటా **"ఇంటింటా వేదం"** అను నినాదంతో వేదధర్మప్రచారం చేస్తూ ధార్మికుల గృహములలో, దేవాలయాలలో, గ్రంథాలయాలలో, శోధనాలయాలలో వేదాలను, వేదభాష్యాలను, వైదిక సాహిత్యాన్ని లాభాపేక్ష లేకుండా ఉంచాలన్నదే మా ముఖ్యోద్దేశ్యం.

**గమనిక :** ఈ వేదసాహిత్య విక్రయము ద్వారా, దాతల ద్వారా వచ్చు ధనము వేదముద్రణ మరియు వేదధర్మ ప్రాచరమునకే వ్యయం చేయబడును. ధార్మికులైన మీరు ఈ వేదధర్మ ప్రచారోద్యమానికి త్రికరణశుద్ధిగా తనుమనోధనములతో సహకరించి సాక్షాత్ వేదస్వరూపుడైన ఆ పరమేశ్వరుని కృపకు పాత్రులై ఆయురారోగ్యైశ్వర్యాదుల పొంది ఈ జన్మలో సుఖసంతోషాలను, పరజన్మలో సద్గతులను పొందగోరుచున్నాము.

**సూచన :** మీ ధనమును నగదుగా గాని, డి.డి, చెక్కురూపములోగాని **"వైదిక సాహిత్య ప్రచారసమితి"** అనుపేరనే చెల్లించి రసీదును తప్పనిసరిగా తీసుకొనవలయును. ఎం.ఓ.లు స్వీకరింపబడవు. వేదసంపుటములను తీసుకొను సమయములో రసీదును చూపించవలసి యుండును. లేదా మీకు కేటాయించిన 'కోడ్' నంబరునైనా తెలియ పరచవలయును.

## వైదిక సాహిత్య ప్రచార సమితి స్థాపనోద్దేశ్యం - లక్ష్యం

- వేదవేదాంగ వేదోపాంగ బ్రాహ్మణారణ్యకాదివైదిక గ్రంథములను అందరికీ అర్థమయ్యే రీతిలో అందించుట.
- అనూదిత వైదిక సాహిత్య పునర్ముద్రణ.
- ఆంధ్రదేశం నలుమూలలా వేదధర్మప్రచారం.
  వేదపాఠశాలస్థాపనం. వేదప్రచారకుల నిర్మాణం
- కాలుష్యనివారణకు-సకాలవర్షప్రాప్తికి సత్యాగ్నిహోత్రమే శరణ్యమని విస్తృతప్రచారం.
- విశ్వములోని సమస్తసమస్యలకు వేదోక్తవైదికజీవనవిధానమే సంపూర్ణ సమాధానమని తెలియపరచుచు ప్రచారం చేయుట.
- కులమత ప్రాంతవర్ణవయోభాషాదిభేదం లేకుండా వేదసంబంధమైన ప్రతి అంశమును ప్రచారం చేయుట.
- వేదగిరిపైన చేయబడు ఈ క్రింది కార్యములకు వేదసాహిత్య విక్రయముద్వారా వచ్చు ధనములో కొంత భాగమును ఖర్చుచేయుట.

1) నాలుగు వేదాలలో ఉన్న 20,417 మంత్రాలను శిలలపై చెక్కించి వేదమందిరాన్ని నిర్మించుట.

2) వానప్రస్థ, సంన్యాస, వృద్ధ ఆశ్రమాన్ని నెలకొల్పుట.

3) వైదిక అనుసంధాన కేంద్రమును స్థాపించుట.

4) వైదిక సాహిత్య గ్రంథాలయాన్ని ఏర్పాటుచేయుట, ధ్యానమందిరాన్ని నిర్మించుట.

5) వేదగిరిని సందర్శనీయ సుందరయాత్రాస్థలంగా తీర్చిదిద్దుట.

ఓ౩మ్

వేదమూలమిదంజ్ఞానమ్

కృణ్వంతో విశ్వమార్యమ్

# చతుర్వేద భూమిక

# చతుర్వేద భూమిక

## వైదిక వాఙ్మయం

## ఉపయుక్త గ్రంథ సూచి


గ్రంథము — రచయిత

1. వేద పరిచయము — పం. వినాయకరాజయోగీంద్రులు — రాజమండ్రి

2. వైదిక సిద్ధాంతము — మూలం : రామప్రసాద్ జీ
అనువాదం : శ్రీరామకవచం.
ఆర్యప్రతినిధిసభ — హైద్రాబాద్

3. వేదము-మానవకళ్యాణము — మూలం: గంగా ప్రసాద్ ఉపాధ్యాయ
అనువాదం : పం. రుద్రదేవ్
ఆర్యయువక పరిషత్ — సికింద్రాబాత్

. వైదిక ధర్మము - ఆర్యసమాజము :
మూలం : పం. ధర్మదేవ్‌జీ
అనువాదం : పం. రుద్రదేవ్‌జీ
ఆర్యప్రతినిధి సభ — హైదరాబాద్

. వేధములలో విజ్ఞానము — లేఖకులు : అన్నేకేశవార్యశాస్త్రి
లేఖకులు : ధూళిపేట రాజరాత్నాచార్యులు
శ్రీవిద్యా పబ్లికేషన్స్ — హైదరాబాద్

వేద రహస్యము — మూలం : మహాత్మ నారాయణ స్వామి
అనువాదం : పం. విశ్వమిత్ర
వైదిక ధర్మగ్రంథ మండలి — మహబూబాబాద్, వరంగల్

వేదమే ఈశ్వరీయ గ్రంథముస్వతంత్రానువాదము:
టి. సూర్యనారాయణ
గాయత్రి విజ్ఞాన కేంద్రము — సికింద్రాబాద్

8. మహిళల క్రాంతి పథానికి వేదములు వేగుచుక్క — టి. సూర్యనారాయణ
గాయత్రి ఆశ్రమం — సికింద్రాబాద్

9. వైదిక ధర్మము - ఉపాసన — వేంకటేశ్వర శాస్త్రి

10. వేదోపదిష్ట మానవకర్తవ్యము — పండిత రాజరత్నాచార్యులు
వైదిక ధర్మ ప్రచారక సమితి — హైద్రాబాద్

11. వేదము-సమాజ విధానము — స్వామి ఓమానంద సరస్వతి — హైద్రాబాద్.

12. ఆర్ష విజ్ఞాన సర్వస్వము — ప్రధాన సంపాదకులు :
డా॥ యస్.బి. .రఘునాథాచార్యులు — తిరుపతి

13. ఋగ్వేదాది భాష్యభూమిక — మూలం : స్వామి దయానంద సరస్వతి
అనువాదం : ఆచార్య గోపదేవ శాస్త్రి — హైద్రాబాద్

14. సత్యార్థ ప్రకాశము — మూలం : స్వామి దయానంద సరస్వతి
అనువాదం : ఆచార్య గోపదేవ శాస్త్రి — హైద్రాబాద్

15. వేద వాఙ్మయం — డా॥ముట్నూరి సంగమేశం — తిరుమల తిరుపతి దేవస్థానం

16. భారతీయ విజ్ఞానం — శ్రీ జటావల్లభుల పురుషోత్తము — తిరుమల తిరుపతి దేవస్థానము

17. వ్యవహార భానువు — మూలం : స్వామి దయానంద సరస్వతి
అనువాదం : ఆచార్య గోపదేవ శాస్త్రి — హైద్రాబాద్

18. యజుర్వేదభాష్యము — మూలం : స్వామి దయానందసరస్వతి
అనువాదం : అన్నేకేశవార్య శాస్త్రి

19. చతుర్వేదసంహితా — సంపాదకులు- స్వామి జగదీశ్వరానంద సరస్వతి

20. సంస్కారవిధి — స్వామి దయానంద సరస్వతి

21. సంస్కృత సాహిత్య చరిత్ర — సుజాతారెడ్డి మరియు గోపాలరెడ్డి
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# చతుర్వేద భూమిక

## వేదపరిచయము

ప్ర॥ : వేదమనగా నేమి?

ఉ : 'వేద' శబ్దము 'విద్ జ్ఞానే' అను ధాతువునుండి జనించినందున వేదశబ్దమునకు 'జ్ఞాన' మని యర్థము. మరియు నున్నదున్నట్లు తెలుపు జ్ఞానమునకే వేదమనిపేరు. అత్యంత ప్రాచీనములైన నాలుగు గ్రంథములను వేదములందురు. (౧) ఋగ్వేదము (౨) యజుర్వేదము (3) సామవేదము (౪) అథర్వవేదము. వీనికంటే ప్రాచీనమైన ధర్మ గ్రంథము మరియొకటి ప్రపంచమున లేదు. ఇతర గ్రంథములన్నియు వేదములకు తర్వాతనే రచింపబడినవి.

ప్ర॥ : వేదములనెవరు రచించిరి?

ఉ॥ : వేదములు మానవ రచితములు కావు. సృష్టికర్తయగు ఈశ్వరుడు సృష్టి యొనర్చి యారంభమున మానవులకు మేలొనర్చు నిమిత్తమై ఋషుల హృదయమున వేదములను ప్రకాశింప జేసెను. సృష్టిలో మొదట అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు అను నలుగురు మహాఋషులుత్పన్నులైరి. వారిలో నగ్ని హృదయమున ఋగ్వేదము, వాయువు హృదయమున యజుర్వేదము, ఆదిత్యునియందు సామవేదము, అంగిరసుని హృదయమున అథర్వవేదము ప్రకాశించెను. వారు తదుపరి మానవులలో ఆ వేదముల ప్రచార మొనర్చిరి. తర్వాతనేర్పడిన ఋషులు ఆ వేదమంత్రములకు వ్యాఖ్యానాదుల నొనర్చి ఇతర గ్రంథములను రచియించిరి. ఇవియన్నియు వైదిక వాఙ్మయము పేర వ్యవహరింప బడుచున్నవి.

ప్ర : ఇందులకు ప్రమాణ మేమి?

ఉ : తస్మాద్యజ్ఞాత్సర్వ హుత ఋచస్సామాని జజ్ఞిరే
ఛందాంసి జజ్ఞిరే తస్మాద్యజుస్తస్మాదజాయత య. 3౧.౭.

అర్థము : ఎల్లరకు పూజ్యుడగు ఆ పరమాత్ముని నుండి ఋగ్వేదము, సామవేదము, (ఛందాంసి) అథర్వవేదము, యజుర్వేదమును జనించినవి. అను ఈ మంత్రమే ఇందులకు ప్రమాణము.

ప్ర : వేదములు నాలుగు వేర్వేరుగ నుండనేల ? ధర్మ గ్రంథమొక్కటిగా నుండవలెనుగదా?

ఉ : నాలుగు గ్రంథములను వేదమని చెప్పబడుటలో నెట్టి యాటంకము ఉండదు. రచనా భేదము, విషయ భేదము ననుసరించి వేదము నాలుగు పేర్లతో నాలుగు గ్రంథములుగా వ్యవహరింపబడుచున్నది. ఛందోబద్ధ వేదము ఋక్కు అనియు, గద్యాత్మక వేదము యజుస్సనియు, గీతాత్మకము సామమనియు, ఛందస్సులు అథర్వమనియు వేరువేరు నామములతో వ్యవహరింపబడుచున్నవి. అందువలననే ఋగ్వేద మంత్రములు సామవేదమునను చూడనగును. దీనిని పురస్కరించుకొనియే "**ఋచ్యధ్యూఢం సామగాయతే**" అని మీమాంసకులు చెప్పుదురు.

యజుర్వేదమున యాజ్ఞిక క్రియాకలాపముల వర్ణనము విశేషముగ చూడబడును. అథర్వమున కృషి, చికిత్స, రాష్ట్రము, వివాహము మున్నగు విషయములు వివరముగ బోధింపబడియున్నవి. ఆయా వేదములను ప్రకటించిన నలుగురు ఋషులును సమకాలికులే. వారు సృష్టిలో నారంభముననే యుండిరి. నాలుగు వేదములు ఒకే సమయమున ప్రకటింపబడుటచేత నాలుగు వేదముల నామములను నాలుగు వేదములందును జూడనగును.

(౧) "**ఋక్సామాభ్యా మభిహితౌ గావౌ**" ౧౦-౮౫-౧౧ ఈ ఋగ్వేదమున ఋక్సామ శబ్దములున్నవి.

(౨) "**విశ్వేదేవా అనుతత్తే యజుర్గురుహే యజుర్గుహం**" ఋ. ౧౦-౧౨-3. ఈ ఋగ్వేదమున యజుర్వేద నామమున్నది.

(3) "**అగ్నిర్జాతో అథర్వణా విదద్విశ్వాని కావ్యా**" ఋ. ౧౦-౨౧-౫. ఇందు అథర్వణ పదము చూడనగును.

ఇక యజుర్వేదమున :

(౧) "**ఋక్సామయోః శిల్పేస్థః**", య.౪.౯.

(౨) **అథర్వభ్యోఅవతోకా**. య. 30-౧౫

ఋక్సామ అథర్వ శబ్దముల ప్రయోగము చూడనగును : "**యత్ర ఋషయః ప్రథమజా ఋచః సామయజుర్మహీ ఏకర్షిర్యస్మిన్ నార్పితః స్కంభంతం బ్రూహి కతమః స్విదేవసః**" అ.౧౦-౭-౧౪

ఈ అథర్వణ మంత్రమున ఋక్, సామ, యజుశ్శబ్దములు ప్రయోగింపబడి యుండుట జూడనగును. అందువలన నాలుగు వేదములు ఒకే కాలమున ప్రకాశింపబడి నట్లెంచ వలెను. ఇయ్యవి నాలుగుగా విభజింపబడినను అన్నియు వేదములే వేదమొకటే నాలుగుగా వ్యవహరింపబడు చున్నదనినను దోషములేదు. వేదమును 'త్రయీ' అనియు 'చతుర్వేదము' అనియు వ్యవహరింతురు.

ప్ర : వేదపఠనము వలన లాభమేమి ?

**పావమానీర్యో అధ్యేత్యృషిభిః సంభృతంరసం తస్మై సరస్వతీదుహే**
**క్షీరం సర్పిర్మధూదకం** ఋ. ౯-౬౭-౩౨.

అర్థము : (యః) ఏమానవుడు (ఋషిభిః సంభృతం) ఋషులచే రక్షింపబడినదియు (పావమానీః) పవిత్రమైనదియునగు (రసం) రసమును (అధ్యేతి) అధ్యయనము చేయునో (తస్మై) ఆపురుషుని కొరకు (సరస్వతీ) వేద విద్య (క్షీరం) పాలు, (సర్పిః) నెయ్యి, (మధు) తేనె, (ఉదకం) నీరు, (దుహే) ఇచ్చును.

సృష్ట్యాదిలో నావిర్భవించిన వేదరూప జ్ఞానమును ఋషులు స్వాధ్యాయ ప్రవచనముల ద్వారా సజీవముగా సురక్షిత మొనర్చిరి. ఓసిపేరే సరస్వతి, వేదవిద్య, శాశ్వతము, రసభరితము, వేదవిద్యాధ్యయనము చేయువారికి ఆ విద్య స్వయముగా పాలు, నెయ్యి, తేనె, నీరు నొసంగును. అనగా వేద విద్యా పఠనమున లౌకిక, పారలౌకిక శాంతి లభించును. అట్లే అథర్వ వేదమునందు :

**స్తుతామయా వరదా వేదమాతా ప్రచోదయంతాం పావమానీద్విజానాం।**
**ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యం దత్వా**
**వ్రజత బ్రహ్మలోకం॥** అ. ౧౯.౭౧.౧

అర్థము : (వరదావేదమాతా మయాస్తుతా) వరముల నిచ్చు వేదమాతను నేను స్తుతించితిని. (ప్రచోదయంతాం ద్విజానాం పావమానీ) ఏ విద్వాంసులీ వేదమాత యొక్క ప్రేరణ మును పొందిరో వారి నామె పవిత్రులను చేయును. ఓ వేదవిద్వాంసులారా! (మహ్యం) నాకు (ఆయుః) జీవనము (ప్రాణం) ప్రాణ శక్తిని (ప్రజాం) సంతానమును (పశుం) పశువులను (కీర్తిం) యశస్సును (ద్రవిణం) ధనమును (దత్వా) ఇచ్చి (బ్రహ్మ లోకం) మోక్షమును (వ్రజత) పొందింపుడు (పొందుడు.).

వేదములను చదువుచు, చదివించుచు తదనుకూలముగా జీవన నిర్వహణ మును చేయుటచే మానవులకీ లోక మందభ్యుదయమును, జీవితాంతమున నిఃశ్రేయసమును కలుగును. ఇహ పరలోకములు రెండును సుఖకరములగును కావున వేదములను చదువ వలయును

ప్ర : **వేద పఠనము వలన సుఖము లభించునా?**

ఉ : వేదములను చదివి తదుపదేశాను సారము ఆచరించుట వలన తప్పక సుఖము లభించును చూడుడు:

**కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః**
**ఏవంత్వయి నాన్యథే తోఽ స్తి న కర్మ లిప్యతే నరే॥** (య. అ. ౪౦ మం.౨)

అర్థము : వేద విహితములైన కర్మలనే యాచరించుచు మానవుడు నూరేండ్లు జీవింప గోరవలయును. కర్మలను కర్తవ్య బుద్ధితోనే చేయవలెగాని ఫలాపేక్షచే తగదు. బంధములనుండి విడివడి మోక్షసుఖమొందుట కిదియే మార్గము. వేరొండు మార్గములేదు.

ప్ర : **వేదములను చదువుటయు, వానియర్థముల నెరుంగుటయు మిక్కిలి కష్టము. దీని నెట్లరు చేయగలరా ?**

ఉ : మోక్షము గూడా శ్రమ లేక లభించదు. పిండికొద్ది రొట్టె గదా ! యథాశక్తిగా వేదవిషయముల నధ్యయనము చేయుటకు యత్నింపవలయును. దీనివలన క్రమముగా చెడుగులు దూరమగును. మంచి విషయములలో ప్రవృత్తి కలుగును. పాపము తగ్గుచున్న కొలది పుణ్యము వృద్ధియగును. దుఃఖములు దూరమగును.

ప్ర : **వేద పఠన మాత్రముననే దుఃఖవిముక్తి కలుగగలదా ?**

ఉ : వేదానుకూలమైన ఆచరణ లేక కేవల వేదపఠనముచే కార్యము నెరవేరజాలదు. రోగి ఔషధయోగము చదివినంత మాత్రముననే రోగ విముక్తుడు కాలేడు. ఔషధ సేవనము వలననే రోగి రోగ విముక్తుడు అగును. అట్లే వేద మంత్రపఠనమున కేవలము కర్తవ్య జ్ఞానము సిద్ధించును కర్తవ్య పాలనము చేయునంత వరకు వానికి యదార్థమైన లాభము గలుగనేరదు. చూడుడు.

**"ఉత త్వః పశ్యన్నదదర్శ వాచముతత్వః శృణ్వన్నశృణోత్యేనామ్**
(ఋ. ౧౦ ౭౧ ౪)

అర్థము : ఒకడు చూచుచుండియు చూడడు. ఒకడు వినుచుండియు వినడు అనగా ఎవడు వేదమును చదివిగాని తదుపదేశమాలించిగాని యాచరింపడో వాడు అంధునితో లేక బధిరునితో సమానుడగును.

**"అధేన్వాచరతి మాయయైషవాచం శుశ్రువాం అఫలామ పుష్పామ్"**
(ఋ. ౧౦ ౭౧ ౫)

అట్టి వానిని మాయా వినిర్మిత (గారడి విద్యచే చేయబడిన) ధేనువును వెంటబెట్టుకొని తిరుగాడు వానినిగా నెంచవలెను. అది పాలనీయదు. అదే విధముగా వేదానుకూల కార్యాచరణ లేని వాడు వేద విద్యా వృక్ష పుష్పములను గాని ఫలములను గాని బడయజాలడు. కావున మానవులు వేదములను పఠించి విషయములను తెలిసికొని యాచరింపవలయును. వేదములను పూర్తిగా చదువజాలనివారు వేదవిషయములను ప్రతిపాదించునట్టి చిన్న పుస్తకములనైనను చదువవలయును.

ప్రశ్న : **"స్త్రీశూద్ర ద్విజబంధూనాం త్రయీ న శ్రుతి గోచరాః" అని స్త్రీ శూద్రౌ నాధీయాతామితి శ్రుతేః అనియును చెప్పునట్టి ఈ ప్రమాణ వాక్యముల చేత**

బ్రాహ్మణేతరులగు స్త్రీ శూద్రాదు లెవ్వరు వేదములు చదువుట కర్హులుగారని వారికి వేదాధికారము లేదని నిషేధింపబడియున్నది గదా?

ఉ : మీరు చూపిన ఈవాక్యములు వేదప్రమాణములు గావు. అవి స్వార్థపరులగు దేశద్రోహులు మహర్షులపేరుతో రచించిన వేద విరుద్ధమగు కల్పిత వాక్యములై యున్నవి. కావున యవి నమ్మక వాటిని త్యజించి పై వేద వాక్యములనే నమ్మవలయును. యెందుకన వేదకర్తయగు దేవుడు నిష్పక్షపాతియు, న్యాయకారియు, దయానిధియు గనుక తన వేదము సర్వమానవుల యొక్క పురోభివృద్ధికై నందరికి నొసంగియున్నాడు. అదిగాక '**శ్రుతిస్మృతి విరోధేతు శ్రుతిరేవగరీయసీ**' అను ప్రమాణరీత్యా దైవదత్తమగు శ్రుతికిన్ని అనగా వేదమునకున్ను, మానవప్రోక్తమగు స్మృతికిన్ని యెచ్చటనైన నొక ధర్మనిరూపణము చేయుటలో విరోధభావములుండిన మానవనిర్మితమగు స్మృతివాక్యమునువదలి దైవదత్తమగు శ్రుతివాక్యమునే ప్రమాణముగా నంగీకరింపవలయునని విశుద్ధహృదయులగు మహర్షులే తమస్మృతులయందు నిశ్చితముగా చెప్పియుండ నిక సంకుచితహృదయులగు దేశద్రోహుల మాట లెట్లు నమ్మవలయును? గనుక నెచ్చటనైనా మహర్షులు రచించిన స్మృత్యాది గ్రంథములందు కేవలం వేదవిరుద్ధమగు వాక్యములుండిన యెడల స్వార్థపరులచే ప్రక్షిప్తములు చేయబడినవని గ్రహించవలయును.

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః**

**బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయచార్యాయ చ స్వాయ చారణాయ ॥**

సర్వమానవులకును పరమపితయగు దేవుడు అందరి క్షేమముకొరకు తన వేదము నిచ్చియున్నానని పై వేదమంత్రములో స్త్రీలకొరకును, శూద్రులకొరకును, అతి శూద్రులకొరకును అని పేరుపేరున ఘంటాపథముగా చెప్పియుండగా నట్టి భగవద్వాక్యమగు వేదమునకు విరుద్ధముగా స్త్రీ శూద్రాదులకు వేదాధికారము లేదని చెప్పుట యెంతటిన్యాయమో యోచింపుడు. అదిగాక వేదములందు స్త్రీలు వివాహాదికార్యములలో విధిగా పఠింపవలసిన మంత్రములెన్నియోయుండగా స్త్రీలు వేదములు చదువగూడదని చెప్పుట యెంతటి వివేకము? అట్లు చెప్పువారు వేదములు చూచియెరుగరనియే తలంచవలయును యెందుచేతననగా పిల్లికోడు నందు దొంగలకు శిక్ష చెప్పియుండలేదని యెవరైన మనతో చెప్పిన యెడల నతడు పిల్లికోడు చూచియెరుగడనియేగదా మనము తలంతుము. మరియు కొంతవరకు వేదముచదివినవారుగూడ నట్లే చెప్పిరేని వారు అర్థము లేని గ్రుడ్డి పాఠములు వల్లించియుందురని గ్రహించవలయును.

ప్రశ్న : వేదములు స్వరముతప్పి చదివిన యెడల ననేకయనర్థములు సంభవించునని చెప్పుట నిజమేనా ?

ఉ : అది సర్వదా అబద్ధము. అయితే వేదములు స్వరయుక్తముగా చదువుకున్న వినువారల కంఠశ్రవణరంజకముగా నుండునుగాని అర్థము గ్రహించుటకుగాని భక్తికి గాని కంఠస్థము చేయుటకుగాని వేదపారాయణము చేయగోరువారు ఉదాత్త అనుదాత్తాది స్వరయుక్తముగా పఠింపలేకపోయిన యెడల 'ప్రచయ' స్వరముతో అనగా సామాన్యముగా శ్లోకములు చదువునట్లు పారాయణమొనరింపవచ్చును. మొదట యెంతటివారైనను వేదములను సుస్వరముతో చదువజాలరు. మరియు ప్రారంభములో అనేక తప్పులు గూడ చదువుచుందురు. అంతమాత్రము చేత వారికెలాంటి దోషముసంభవించదు. మరియు చెట్టుకెన్ని వంకరలున్నను అందులో తీపునకు చెడుగులేనట్లు భక్తితో వేద పఠనము చేయువారలకు స్వరదోషము లేమియు నుండవు.

నేడు మహాపాపాత్ములగు దేశద్రోహులు కొందరు వేదములను స్వరయుక్తముగా చదువకపోయిన మీకనేకములగు అనర్థములు వాటిల్లునని చెప్పుచున్నారు. గావున స్వార్థపరులు గల్పించిన అపోహాలెన్నటికిని అంధవిశ్వాసముతో నమ్మక దైవదత్తములగు వేదప్రమాణములనే నమ్మవలయును. తల్లి యెట్లు తన చిన్న బిడ్డలు వచ్చి రాని మాటలచే యెన్నితప్పులు మాట్లాడినను విసుగు జెందక ముద్దుగా వినిఆనందించునట్లే వేదమాతయగు పరమాత్మ భక్తుల వచ్చిరాని వేదవాక్యములను విని హర్షించుచుండును

ప్రశ్న : వేదములందు గూడ మానవులకు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్ర, అతి శూద్రాది జాతి భేదములు చెప్పబడియున్నవా ?

ఉ : వేదములందు మానవులందరు సజాతీయులు అనగా నొకే జాతివారనియు వారిలో స్వగతభేదములు అనగా ఉత్తమ మధ్యమ, అధమ, అధమాధమ గుణకర్మస్వభావములనెడి భేదము లుండుట చేత వారికి బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర అతి శూద్రాది నామములు చెప్పబడియున్నవి.

ప్ర : అట్లయిన వేదములందేవి తెలుపబడియున్నవి ?

ఉ : వేదములందు మానవులు ధర్మార్థకామమోక్షములనబడు చతుర్విధ పురుషార్థములను బడయుటకు కావలసిన పర, అపర విద్య లన్నియు చెప్పబడియున్నవి అందులో కొన్ని క్రింద ఉదాహరణముగా వివరించబడినవి చూడుడు

## సూచనగా ఋగ్వేదములో కొన్ని విద్యలు

| మండ. సూ. మం | విషయము |
|---|---|
| ౧౦ - ౩౭ ౧ | నుండి ౮ వరకు కృషివిద్యావిధానము |
| ౧-౨౫ - ౭ | సముద్రములపైన ఓడలునడుపు పద్ధతి |
| ౧ - ౫౫ - ౬ | పరదేశములకు సముద్రయానము చేయు విధానము |
| ౨ - ౩ - ౬ | బట్టలు తయారు చేయువిద్య |
| ౩ - ౫౩ - ౧౯ | బండ్లు, రథములు మొదలగు లోహపువస్తుల విద్య |
| ౬ - ౩ - ౪ | హేమవిద్య అనగా బంగారు తయారు చేయువిద్య |
| ౧ - ౧౪౦ - ౧౦ | యుద్ధవీరులకు వజ్రకవచాదులు చేయువిద్య |
| ౬ - ౪౬ - ౧౧ | సేనావ్యూహములు నిర్మించుట(యుద్ధములందు) |
| ౬ - ౨౬ - ౨౯ | రథములు నడపుట మొదలగు సంగ్రామ విషయములు |
| ౨ - ౪౧ - ౫ | ఉత్తమ స్థానములు నిర్మించు విద్య |
| ౪ - ౪ - ౧ | ఏనుగులపై స్వారీచేయువిద్య |
| ౫ - ౨౭ - ౨ | బంగారునాణెములు చేయువిద్య |
| ౨ - ౭ - ౧౬ | ఆయుర్వేదవిద్యయు విరిగిన అవయవములకు |
| ౧ - ౧౧౭ - ౧౩ | చికిత్సాది సాధనముల విద్యయు |
| ౧-౧౧౬-౧౫ | |
| ౧ - ౧౧౬ ౧౬ | గ్రుడ్డివానికి కృత్రిమకన్నులు ధరింపజేయువిద్య |
| ౧ - ౬౪ - ౧ | నుండి నక్షత్ర విద్య, చంద్రగతి మాస ఋతు అయనముల పరివర్తనము |
| ౧ - ౧౬౪ - ౪౮ | వరకు కాలనిర్ణయము. |
| ౧ - ౧౧౦ - ౨ | అవయవములవ్యాసము జరుగు రహస్యము |
| ౧౦ - ౮౬ - ౬ | పృథివి యొక్క కీలు వర్ణనము భూగోళవిద్య |
| ౫ - ౧౦ - | పూర్తి సూర్యచంద్రగ్రహణాదుల వివరము |
| ౧౦ - ౮౫ - ౧౧ | ద్వాదశరాసుల వర్ణనము అనగా జ్యోతిషము |
| ౧ - ౧౬౧ - ౧౩ | ఖగోళ విద్య |
| ౮ - ౩ - ౨౭ | నుండి ౨౮ వరకు వివాహవిధి |

### సూచనగా యజుర్వేదమునందలి కొన్ని విద్యలు

| | |
|---|---|
| ౩-౪౧, ౩-౪౨, ౩-౪౩, ౩-౪౫, ౩-౫౦ | గృహస్థాశ్రమముయొక్క ధర్మములు |
| ౧౯-౭౭, ౩౬ -౧౮, ౧-౫, ౧౯ | ౩౦ మానవధర్మములయొక్క విధానములు |
| ౨౦ - ౪ నుండి ౧౦ వరకు | |
| ౨౮ - ౪౦ నుండి ౫౦ వరకు | సర్వసమిత్వరాజ్యాంగ విధానము |
| ౩౧ ౧ నుండి ౩౧ - ౨౨ వరకు | సృష్టి విద్యారహస్యము |
| ౧౪ - ౧౫,-౧౯ - ౪౭ | పునర్జన్మ, పునర్జన్మవిషయములు |
| ౩౨ - ౧౧ | బ్రహ్మ విద్యా రహస్యము |
| ౯ - ౬ | పృథివ్యాదిలోకలోకాంతరములయొక్క భ్రమణ విషయములు |
| ౩౩ - ౪౩ | ఆకర్షణానుకర్షణ విషయము |
| ౨౩ - ౯, ౨౩ - ౧౦ | ప్రకాశ్య ప్రకాశక విషయము |
| ౧౮ - ౨౪, ౧౮ - ౨౫ | గణిత విద్యావిషయము |
| ౨౩ - ౬౧, ౨౫ - ౧ నుండి ౨౧ - ౮ వరకు | శారీరక శాస్త్ర రహస్యములు |

### సామవేదము

ఇందు కేవలం పరమాత్మని యొక్క స్తుతి, ప్రార్థన రూపములగు భజన సంకీర్తనాది గీతాగానాదులు చేయు విధానములు చెప్పబడియున్నవి. నేటి ప్రపంచమునగల గానవిద్యయంతయు సామవేదమునుండి వెలువడినదే. మరియు నేటికింకను సామవేదమునందుగల గానవిద్యలో సహస్రాంశముగూడ లోకంబున బయలు పడలేదు. సంపూర్ణముగు సామవేద గానవిద్యావిశారదులు సామగానము చేత మానవులనే గాక పశుపక్ష్యాదిజంతుజాలము లన్నిటిని గూడ మైమరపించి వశపరుచుకొనగలరనుట అతిశయోక్తి గాదు.

ఎందుచేతననగా అందుకు దృష్టాంతముగా నిప్పుడు సామగానము నందలి నాగస్వరముతో పాటబాడి పాములను తన్మయత్వముగావించి పాముల వాండ్లు పాములను పట్టుకొనుచుండు సంగతి అందరకు విదితమేగదా! అటులే పూర్వము తుంబుర, నారదాది మహర్షులు గూడ యుద్ధభూములకు వెళ్ళి యుద్ధవీరులను సామగానముచే తన్మయత్వముగావించి అనేకయుద్ధములు నిలిపివేయుచుండిరని మనుపరాశరాది గ్రంథములందు చెప్పబడియున్నది.

నేటికట్టిగానవిద్యావిశారదులింకను లోకంబునతయారుగాలేరు. తయారైయుండిన పూర్వోక్తప్రకారము చేయగలిగియుందురు. అట్లు తయారుగాక పోవుటకు లోకంబున వేదప్రచారము లేకపోవుటయే ముఖ్యకారణమని గ్రహింపవలయును.

### సూచనగా అథర్వవేదమునందు కొన్ని విద్యలు

| కాం. ప్ర - అను - మం. | విషయము |
|---|---|
| ౧౩ - ౨౩ - ౪ - ౧౬ నుండి | |
| .. .. .. ౧౮ వరకు | |
| .. .. .. ౨౦ నుండి | బ్రాహ్మవిద్యా విధానము |
| .. .. .. ౨౧ వరకు | |

౧౦ - ౪ - ౭ - ౮
౧౧ - ౪ - ౭ - ౨౭ } సృష్టి విద్యావిధానము
౧౩ - ౪ - ౪ - ౪౭ నుండి

౧౩ - ౪ - ౪ - ౪౯నుండి
౧౩ - ౪ - ౪ - ౫౦నుండి } అఖండబ్రహ్మోపాసనవిధి
౧౩ - ౪ - ౪ - ౫౩నుండి

౧౧ - ౩ - ౫ - ౩ నుండి ౭ వరకు బ్రహ్మచర్య విధానము
౧౯ - ౭- ౫౫ - ౩ నుండి ౪ వరకు పంచమహాయజ్ఞముల విధి

౧౮ - ౩ - ౧ - ౧
౧౪ - ౧౪ - ౨ - ౧౮ } నియోగవిషయము
౧౯ - ౧ - ౮ - ౨

౩ - ౬ - ౨౭ - ౧ నుండి ౬ వరకు భగవద్భక్తి విధానము
౬ - ౧౦ - ౬౮ - ౧ నుండి ౨ వరకు రాజకీయ రహస్యము

## ఋగ్వేదము

అష్ట ౧- అ ౮- వ ౮- మం ౩ తుగ్రోహభుజ్యమశ్వినోదమే
అష్ట ౧- అ ౮- వ ౮- మం ౪ తిస్రఃక్షపస్త్రిరహాతి వ్రజ
అష్ట ౧- అ ౮- వ ౮- మం ౫ అనారంభణేతదవీరయేథా
అష్ట ౧- అ ౮- వ ౯- మం ౧ యమశ్వినాదదుః శ్వేతమశ్వ
అష్ట ౧- అ ౩- వ ౪- మం ౨ అయఃపవయోమధువాహనే రథే
అష్ట ౧- అ ౩- వ ౫- మం ౧ త్రిర్నోమశ్వినాయజతాదివే
అష్ట ౧- అ ౩- వ ౩౪- మం ౩ అరిత్రంవాందివస్పృథుతీర్థే
అష్ట ౧- అ ౬- వ ౯- మం ౪ వియేభ్రాజన్తేసుమఖాస
అష్ట ౧- అ ౩- వ ౨౪- మం ౬ అనోవామతీనాయాతం
అష్ట ౧- అ ౩- వ ౨౩- మం ౧ కృష్ణంనియానంహరయః
అష్ట ౧- అ ౩- వ ౨౩- మం ౨ ద్వాదశప్రధయశ్చక్రమేకంత్రీణి

ఈమంత్రములలో నవవిధవిమానాదివిద్యలు చెప్పబడియున్నవి. అందు ౧. భూమిమీదను ౨. భూమిలోపలను ౩. నీటిమీదను ౪. నీటిలోపలను ౫. అగ్నిమీదను ౬. అగ్నిలోపలను ౭. గాలిమీదను ౮. గాలిలోపలను ౯. గాలిలేని (బైలులోను) ఆకాశములోను గమనముచేయు యానములైయున్నవి. మరియు అష్ట ౧- అ ౮- వ ౨౧- మం ౫యుయువం పేదవేపురువారమశ్వినాను మంత్రములో తారావిద్య (టెలిగ్రాం విద్య) చెప్పబడియున్నది. అట్లే ఆయామంత్రములలో ఆకాశవాణి (రేడియో) విద్య అనగా ఆకాశమునందు విద్యుత్తరంగములద్వారా వార్తాలాపములు చేయు విద్యయును అలాగే సమ్మోహనాస్త్ర, ఆగ్నేయాస్త్ర, వారుణాస్త్ర, పాశుపతాస్త్ర, ప్రళయాస్త్ర (ఆటంబాంబు) బ్రహ్మాస్త్రములనెడి మారణాస్త్రవిద్యలును గలవు. "వేదమూలమిదంజ్ఞానమ్" అను వాక్యప్రకారము నేడు ప్రపంచమునగల విజ్ఞానము (సైన్సు) కంతకును వేదమే మూలకారణమైయున్నది. ఇందుకు నిదర్శనముగా నిప్పటి విజ్ఞానము (సైన్సు) నకు నెలవైన జర్మనీ దేశపునివాసియు నాలుగు వేదములను జర్మనీభాషలోనికి అనువాదమొనర్చిన ప్రవీణుడు నగు ప్రొఫెసర్ మోక్షముల్లరును జర్మనీలోని వివిధకళాశాలాధ్యక్షులును (ప్రిన్సిపాల్సు) వేదములందుగల మహత్తరమగు విజ్ఞానమును (సైన్సును) తమకు విపులముగా తెలుపుటకొరకు రావలయునని భారతదేశపు వేదవేత్తలైన పండితులకు వ్రాసినలేఖలు గూడ గలవు.

అదిగాక ప్రపంచమున యింతకుముందుండి గతించినట్టియు యిప్పుడుండునట్టియు యిక వెలువడబోవునట్టియు విద్యాధర్మములన్నియు వేదమున గలవు. యెందుచేతననగా! వేదకర్తయగు దేవుడు సర్వజ్ఞుడు గనుక నతనికి తెలియనివిద్యలుగాని ధర్మములు గానిలేవు. గనుకనే సమస్త విద్యాధర్మము లన్నియు తన వేదమునందు వివరించియున్నాడు.

మరియు పైనజెప్పబడిన వేదోక్తములగు నవవిధవిమానాదివిద్యలలో నేడు ప్రపంచమున కొన్నిమాత్రమే వెలువడియున్నవి. ఇంకను గాలిలేని బైలులో గమనము చేయు విమానాదులు వెలువడలేదు. అవి వెలువడిన నాడు మనమిప్పుడు పాతాళలోకమునకెట్లు గమనాగమనములు అగ్నియానములనెడి స్టీమర్ల ద్వారా చేసి వారితో సంబంధబాంధవ్యములు జరుపుచున్నామో అటులే బుధబృహస్పతి అంగారకాదిగోళములకు వెళ్ళి ఆ గోళవాసులతో సంబంధ బాంధవ్యములు జరుపగలము.

## ప్రాచీన భారతీయుల విజ్ఞానము

ప్రశ్న : భారతీయులు పూర్వము విజ్ఞానవేత్తలైయుండినది నిజమైనప్పటికి చరిత్రకారులు పూర్వము భారతీయులు కేవల మనాగరికులుగా నుండిరనియు వారికి ఇనుము, ఉక్కు మొదలగు లోహపు పనులవిధానము గూడ తెలియదనియు, వారు

రాతికత్తులతోను విల్లంబులతోను జగడము లాడుచు అసభ్యులై వస్త్రములు లేక ఆకులు చుట్టుకొని యుండిరనియేల వ్రాసిరి?

ఉ: ఇప్పటిచరిత్రకారులగు మహాశయ రమేశ్ చంద్రదత్తు ప్రొఫెసర్ మాక్షుముల్లర్ మొదలగువారు సుమారు అయిదువేల సంవత్సరములనాడు జరిగిన భారతయుద్ధానంతరము భారతీయులు అనాగరికులై యుండిన విషయములను మాత్రమే వ్రాసిరిగాని అంతకుపూర్వము భారతీయులు మహోన్నతదశయందుండిరని చెప్పు మనుస్మృతి, రామాయణము, మహాభారతము మొదలగు భారతదేశపు ఇతిహాసగ్రంథముల ప్రకారము సంగ్రహించి నిష్పక్షపాతబుద్ధితో భారతదేశపు ప్రాచీన చరిత్రనంతయు వ్రాయక అప్రాచీనవిషయములందే ఆధారపడి భారతదేశపుచరిత్రను వ్రాసి చెరచివేసియున్నారు.

వారు భారతదేశపు ప్రాథమిక సమయములను ఈ క్రింది విధమున నెట్లు విభాగించియున్నారో చూడుడు (౧) వైదికసమయమనియు, (౨) బ్రాహ్మణ గ్రంథసమయమనియు (౩) ఉపనిషత్ గ్రంథసమయమనియు (౪) సూత్ర గ్రంథ సమయమనియు (౫) బౌద్ధమత సమయమనియు (౬) పురాణ మతసమయమనియు నానావిధములుగ విభాగించియున్నారు. మనుష్యశరీరమునకు అవయవాదులును వృక్షమునకు శాఖాదులును యెట్లు అంగోపాంగములుగా నున్నవో యట్లే బ్రాహ్మణగ్రంథములు ఉపనిషత్ గ్రంథములు, సూత్రగ్రంథములు వేదములకు అంగోపాంగములై అనుచరములుగానున్నవిగాని కల్పిత పురాణ గ్రంథములు మాత్రము కొంతవరకు వేదానుకూలముగను కొంతవరకు వేద విరుద్ధముగాను యున్నవి. అట్లే బౌద్ధమతగ్రంథములును గలవు. ఇక ఇతర మతగ్రంథములన్నియు కేవలము వేదవిరుద్ధముగా నున్నవి. ఇందుచే కాలము వైదికసమయమనియు అవైదికసమయమనియు చెప్పవలయునేగాని పైవిధముగా నెట్లు భాగింపనగును.? ఎంతవరకు దివాకరుడు (సూర్యుడు) గాని దీపాదులుగాని ప్రకాశించుచుండునో అంతవరకు ప్రకాశకసమయమనియు, సూర్యుడస్తమించి దీపాదులు తీసినప్పుడు అంధకారసమయమనియు చెప్పునట్లే నెంతవరకు భారతీయులు వేదవేదాంగాది ధర్మముల ప్రకారము ప్రవర్తించిరో అంతవరకు వైదికసమయమనియు, యెప్పుడైతే భారతీయులు వేదవేదాంగాది ధర్మముల నతిక్రమించి ప్రవర్తించిరో అప్పటినుండి అవైదిక సమయమనియు చెప్పవలయును, అనగా వైదికసమయము విజ్ఞానసమయమనియు అవైదిక సమయము అజ్ఞానసమయమనియు చెప్పవలెను.

అదిగాక మానవుడొకప్పుడు శాలువగప్పుకొని మరొకప్పుడు షొక్కా వేసుకున్నంతమాత్రాన వాని స్వరూపములో భేద మేమియు గలుగదు. మరియు 'గో' శబ్దము వికృతమై ఇంగ్లీషులో 'కౌ' అయినంత మాత్రాన అవునందేమియు మార్పుగలుగనేరదు. ఈ విధముగానే వైదిక శబ్దము లొకప్పుడు సమస్త భాషలలో వికృతములై పోయినవి. అంతమాత్రముచేత వేదము నశింపదు. ప్రపంచమునందలి భాషలన్నియు, విద్యలన్నియు వేదమునుండియే వెలువడినవి. ఆకాశమనెడి బైలు యెట్లు సర్వవ్యాపకమో వేదమట్లే సర్వదేశీయమైయున్నది అనగా! అది సమస్త భాషలలో నంతర్గతమై వికృతరూపమున నున్నది. గనుక ఆదికాలమున ప్రపంచమంతయు వైదిక పద్ధతి ననుసరించి యుండినది.

ఆదికాలమున ప్రపంచమంతయు వైదికపద్ధతియై యుండిన దనుటకు నిదర్శన మేమనగా! వైదిక సమయమున 'అపగానస్థాన' మనబడు చుండిన దేశమిప్పుడు 'అఫగనిస్థాన' మనబడుచున్నది. 'ఆర్యస్థానము' 'ఇరాన్' అని పిలువబడుచున్నది. 'హరివర్ష' మిప్పుడు 'యూరోప' నబడుచున్నది. 'పాతాళ లోక' మిప్పుడు 'అమెరికా' యనబడుచున్నది. 'అజపద' దేశమును 'ఈజిప్టు' అనుచున్నారు. 'పాలీస్థాన' మును 'పాలెస్టైయిన్' అనుచున్నారు. 'ఆర్యవాహము'ను 'అరబీ' అనుచున్నారు. 'యవనదేశము'ను 'యూనాని' యనుచున్నారు. 'శర్మణదేశము'ను జర్మనీ యనుచున్నారు. 'ధనమార్గ' దేశమును 'డెన్మార్క్' అనుచున్నారు. 'సుయోధన' దేశమును 'స్వీడన్' అనుచున్నారు. 'నారావజము' 'నార్వే' యనబడుచున్నది. 'ఆర్యఖండము' 'ఐర్లండ'ని పిలువబడుచున్నది. 'త్రివిష్టపము'ను 'టిబెట్' అనుచున్నారు. గావున నిందుచే ఆదికాలమునందు వేదసంపన్నులగు భారతదేశపు రాజర్షులచేత సమస్త దేశములు పాలింపబడుచుండిన వనియు తదితర దేశముల రాజులందరును భారతదేశపు రాజశాసనమునకు సంబద్ధులై మాండలికులుగా నుండిరనియు సృష్ట్యాదినుండియు భారతయుద్ధము వరకు సమస్తదేశములకును రాజశాసన కేంద్రస్థానము భారతదేశములోనే స్థిరపడి యుండెననియు తెలియుచున్నది. అందుకు నిదర్శనముగా సుమారు అయిదు వేల సంవత్సరములనాడు జరిగిన మహా భారతయుద్ధము గొప్ప ప్రపంచయుద్ధమనియు అట్టి యుద్ధమునకు యూరపుదేశపు బిడాలాక్షుడు - చైనాదేశపు భగదత్తుడు - ఈరాన్దేశపు శల్యుడు మొదలగు విదేశముల రాజు లందరు భారతయుద్ధమునకు తప్పనిసరిగా భారతదేశపురాజుల ఆజ్ఞ శిరసావహించి వచ్చిరనియు భారతమనెడి ఇతిహాసగ్రంథములో చెప్పబడియున్నది. అట్లే ఉపనిషత్తులయందును స్మృతులయందును మొదలగు భారతదేశపు చరిత్ర గ్రంథములలోను భారతీయులందు పూర్వము అనేకులు మహావిజ్ఞానసంపన్నులు గలరని చెప్పబడియున్నది.

**భారతదేశపు స్త్రీలు**: వీరిలో చాలామంది పురుషులతో పాటు సంపూర్ణ విద్యావతులై యుండిరి. రాజకీయకార్యములందేమి ఆధ్యాత్మిక విచారములందేమి అచంచలమగు ప్రజ్ఞ గలవారై యుండుటయేగాక పవిత్రమగు నడవడిక గలిగి పురుషులకు సర్వవిధముల సహాయపడు చుండిరి. పూర్వము భారతదేశపు స్త్రీలకు యిప్పటి అన్యాయకరమగు పరదాపద్ధతి యెంతమాత్రమున లేదు.

వేయిమాటలేల? పూర్వము భారతీయులు మహావీరులుగాను సంపూర్ణ ప్రజ్ఞగల పారిశ్రామిక వేత్తలుగాను సత్యధర్మ పరాయణులుగాను ప్రామాణికులుగాను విజ్ఞానవేత్తలుగాను యుండి రనుట కేమాత్రమును సందేహము లేదు.

**ప్రశ్న : అట్లయిన నేడు భారతదేశము ఆర్థికముగాను రాజకీయముగాను వైజ్ఞానికముగాను యితరదేశములకంటెను వెనుకబడి యుండుటకు కారణమేమి?**

**ఉత్తరము** : నేడు భారతదేశము వెనుకబడియుండుటకు సుమారు అయిదువేలసంవత్సరములనాడు జరిగిన ప్రచండమగు భారతయుద్ధమే కారణము. ఎట్లన గా ! భారతదేశము సృష్ట్యాదినుండియు భారతయుద్ధము వరకును మహోన్నత దశయందుండెను. అప్పుడు ప్రపంచమునందలి మానవమాత్రులందరు గూడ వేదమతావలంబులై యుండిరి. అట్టి వేదమతమనబడు కల్పవృక్షమునకు వేరుపురుగులవలె కొందరు విషయాసక్తులగు రాజులు చక్రవర్తులై నందున వారిలో లోలోపలనే ఈర్ష్యా విద్వేషములనబడు అంకురములు మొలచి వృద్ధిబొంది పరిపక్వమై తుదకు భారతసార్వభౌమ కుటుంబములోగల అన్నదమ్ముల బిడ్డలకే అంతఃకలహములు గలిగి తుదకు అంతఃకలహములే గొప్ప ప్రపంచయుద్ధముగా పరిణమించెను. అప్పుడు ప్రపంచమునగల రాజులందరు రెండు కక్షలై యుద్ధరంగమున నిలుచుట తటస్థించెను. అట్టి అనివార్యమగు ఘోరసంగ్రామము భూమిమీదనేగాక ఆకాశము మీదగూడ ప్రచండముగా విమాన యుద్ధముజరిగెను. అట్టి భయంకర యుద్ధమున ఆగ్నేయాస్త్ర, వారుణాస్త్ర సమ్మోహనాస్త్ర, పాశుపతాస్త్ర, ప్రళయాస్త్ర (ఆటంబాంబులు), బ్రహ్మాస్త్ర ప్రయోగములు జరుపుటచే విజ్ఞానవేత్తలగు వీరవరులందరు సమూలముగా నాశన మొందిరి. దేశమునగల కళాకౌశలాది కర్మాగారములన్నియు ధ్వంసమై పోయినవి. ఉపదేశకులు అరణ్యముల చేరిరి సత్పురుషులు సన్యసించి మరుగైపోయిరి. దేశమంతయు నిర్వీర్యమైపోవుటచే ఆనాడు భారతభూమి విధవాస్త్రీ సమూహముల రోదనలచే మారు మ్రోగుచుండెను. అప్పుడు విషయలోలురగు దురాచారులచే వామమార్గ సంఘములేర్పడి వేదములకు బదులు కల్పితపురాణాదిగ్రంథములు నెలకొల్పబడెను. అప్పటినుండి భారతీయులు నానాటికి వేదవిజ్ఞానము నుండి పతితులై పరస్పర మతనిందలు గావించుకొనుచు అనేక చీలికలై ఐకమత్య మనునదిలేక తిరిగి యుద్ధములు జేయుచు తుదకు విదేశీయుల పాదాక్రాంతులై దేశమున విజ్ఞానమును వృద్ధిచేసుకొనుటకు స్వాతంత్ర్య మనునదిలేక బానిసత్వమున జిక్కికొని యితర దేశములన్నిటికంటె హీనస్థితికి వచ్చిరి. తిరిగి యిప్పుడిప్పుడే స్వాతంత్ర్యసౌధమున ప్రవేశించిరి. పూర్వము భారతయుద్ధమునకు ముందుండిన ఉన్నతదశకు భారతదేశ మింకను రాలేదు. అట్టి స్థితికి రావలయునన్న చాలాకాలము పట్టును.

ఎందుచేతననగా ఉన్నతమగు విద్యాధర్మములన్నిటికిని మూలకారణమగు వేదవిజ్ఞానభాస్కర కిరణోదయ ప్రకాశ మిప్పుడిప్పుడే యగుచున్నది. యేనాడు ***భారతీయులు దైవదత్తమగు వేదవిజ్ఞాన సంపన్నులై యుండగుదురో ఆనాడే విశ్వమునకు శాంతిభిక్ష నొసంగుదురు.***

ప్ర : వేదమందీశ్వర స్వరూపమెట్టిది?

ఉ : ఈశ్వరుడు సృష్టికర్త :

**సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్**

దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః (ఋ ౧౦ - ౧౯౦- 3) విధాత ఈశ్వరుడు సూర్యచంద్రులను పృథివ్యంతరిక్షద్యులోకాదులను పూర్వమురచించినట్లు రచించెను. ఈశ్వరుడు కల్ప కల్పాంతరములందును ఇట్లే సృష్టిని రచించు చుండును. అతడు అనాది, అనంతుడు అతని స్వభావముకూడ ఆద్యంతములు లేనిది. సృష్టి రచనయే ఈశ్వరుని స్వభావము. అందుచే ఈశ్వరుడు ప్రతికల్పమునందును ఒకే విధమైన సృష్టి నొనర్చును.

**యః పృథివీం వ్యథమానా మదృంహద్యః పర్వతాన్ ప్రకుపితాఁ అరమ్ణాత్**
**యో అంతరిక్షం విమమే వరీయో యో ద్యామస్తభ్నాత్ స జనాస ఇంద్రః**
**(ఋ - ౨-౧౨-౨).**

అర్థము : ఓ ప్రపంచ ప్రజలారా! ఎవడు కదలుచున్న ( ద్రవీభూతమయిన ) పృథివిని ఘనీభవింపచేసెనో, కంపించుచున్న పర్వతములను స్థిరీకరించెనో, విశాలాంతరిక్షము నేర్పరచి ద్యులోకములను సుస్థిర మొనర్చెనో యతడే ఈశ్వరుడు.

ప్రశ్న : కొందరు ఈశ్వరుని సృష్టికర్తగా నంగీకరించరు గదా ?

ఉ : అది సరికాదు వేదములందీశ్వరుడు సృష్టికర్తగా చెప్పబడినాడు.

సఖా పితృతమః పితౄణాం కర్తేము లోకముశతే వయోధాః

ఋ - ౪-౧౭-౧౭

ఈశ్వరుడు (సఖా) హితైషి (పితా) పాలకుడు (పితౄణాం పితృతమః) ఎవరు ప్రపంచమందు రక్షకులో వారిలో నుత్తమరక్షకుడు. (కర్తా) కర్త (ఉరు) నిశ్చయముగా (ఉశతే) భక్తులకొరకు (వయోధాః) దీర్ఘజీవనమును సంపదలనుప్రసాదించువాడు. ఈ మంత్రమున కర్తయను శబ్దము స్పష్టముగా కనబడుచున్నవి.

(౨) ఈశ్వరుడు సర్వవ్యాపకుడు, నిరాకారుడు -

**సపర్యగాచ్ఛుక్రమకాయ మవ్రణ మస్నావిరం శుద్ధ మపాప విద్ధం, కవిర్మనీషీ పరిభూః**
**స్వయంభూర్యాథా తథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః**

**(య. ౪౦-౮)**

(సపరి + అగాత్) ఈశ్వరుడు అంతట ఉన్నాడు. (శుక్రం) స్వచ్ఛుడు, నిర్మలుడు, (అకాయం) నిరాకారుడు. (అవ్రణం) వ్రణరహితుడు, (అస్నావిరం) నాడీ బంధరహితుడు అనగా జీవుడు శరీరధారణమొనర్చి నరముల చేతను బద్ధుడైనట్లు ఈశ్వరుడెప్పుడును బద్ధుడుకాదు. (శుద్ధం) శుద్ధుడు, (అపాపవిద్ధం) పాపములచే లిప్తుడు కాడు, (కవిః) జ్ఞానవంతుడు (మనీషీ) ఆలోచించువాడు. (పరిభూః) సమస్త ప్రపంచమును పరివేష్టించినవాడు - అతనికి వెలుపల నేదియును లేదు. (స్వయంభూః) ఇతరవస్తువులపై నాధారపడక స్వయంస్థితిగల వాడు. (శాశ్వతీభ్యః సమాభ్యః) నిత్యులగు తన జీవులకొరకు (యాథాతథ్యతః) తగినట్లు (వ్యదధాత్) వ్యవస్థ నొనర్చెను.

**ఈ మంత్రమునందున్న విషయములు :**

(౧) ఈశ్వరుడొకడే (౨) అతడు నిరాకారుడు (౩) ఎప్పుడును శరీరమును ధరించడు. రామకృష్ణాదులు శ్రేష్ఠ పురుషులు. వారు ఈశ్వరావతారులుకారు. గర్భమున ప్రవేశించు ప్రతివారును నాడీబద్ధులే. కావున రామకృష్ణులు నాడీ బద్ధ శరీరధారులనుటలో సందియము లేదుకదా! ఈశ్వరుడట్టివాడు కాడనుట నిర్వివాదము (౪) ఈశ్వరుడు శుద్ధుడు, నిర్మలుడు, జ్ఞాని (౫) అతడు అజరుడు, అమరుడు. కాని అల్పజ్ఞులగు జీవుల కొరకు అనువగు వ్యవస్థ నొనర్చెను. జీవులకు మృతిలేదు. వారును నిత్యులు, అజరామరులు. అందువలననే వారిని (శాశ్వతీస్సమాః) నిత్యులగు ప్రజలు అని చెప్పబడినది. జీవులు నిత్యులు నిరాకారులేకాని (అస్నావిరం అవ్రణం అపాపవిద్ధం) అనగా వారు నాడీ బంధములందు చిక్కుకొనినవారు మాత్రము కారు వారు పాపములచే లిప్తులు. సర్వ ప్రాణులు అజ్ఞాన వశులై పాపమొనర్తురు. అందువలన పాపముక్తులగుటకు విధానమవసరము పరమాత్ముడీ విధానమును (వ్యదధాత్) రచించును. కావున అతడు విధాత.

విధానము రెండు తెరగులు (౧) ఈశ్వరుడు ఋషుల హృదయములందు వేదరూప జ్ఞానము నొసంగుట (౨) సృష్టిరచనాక్రమము, వీనిని మానవులు బాగుగా పరిశీలించి సృష్టి నియమములనన్వేషింతురు. వేదజ్ఞులైన విద్వాంసులు వేదములను పఠించి సృష్టి నియమముల నెరుంగుదురు. దీనినే శాస్త్రమందురు. సృష్టి నిరీక్షణము చేసి దాని నియమముల నెఱుగువాడు వైజ్ఞానికులు (సైంటిస్టులు) అనబడుదురు. అందువలననే వేదజ్ఞానము, విజ్ఞానము (సైన్స్) రెండును పరస్పరవిరుద్ధములు కావు. సరికదా! పరస్పర సహాయకములనవచ్చును. అవిచ్ఛేద్యములైన సృష్టి నియమములెవ్వరు నుల్లంఘింప జాలరని విజ్ఞాన శాస్త్రము బోధించును. ఈ జ్ఞానము భౌతికము (ఫిజిక్స్), రసాయనికము (కెమిస్ట్రీ), శారీరకము (ఫిజియాలజీ), మానసికము (సైకాలజీ) యని పలు తెరగులుగా వర్గీకరించబడినది.

ఈ వర్గీకృత శాస్త్రములు వేరువేరు. కావున వీనికి మూల నియమ మొక్కటియే. వేర్వేరైన శాస్త్రముల సమన్వయపరచు శక్తి సృష్టిలో నున్నది. తృణమునుండి సౌరమండలము వరకును, చీమనుండి సామజము వరకును గల యన్నిటిలోని నియమమొకేరీతిగ నున్నది. ఒకే విధముగు నియమము లనేకములున్నప్పుడు వానిని వేర్వేరుగానీయక ఒకే సూత్రమందు బంధించు నియంత యొకడుండును. ఈ నియంతనే వేదములు 'బ్రహ్మ' (ఈశ్వరుడు) యనుచున్నవి.

**యో విద్యాత్ సూత్రం వితతం యస్మిన్ ఓతాః ప్రజా ఇమాః**
**సూత్రం సూత్రస్య యో విద్యాత్ స విద్యాత్ బ్రాహ్మణం మహత్**

సత్యమైన బ్రహ్మజ్ఞాన మెవరికి గలదను ప్రశ్నకీ మంత్రము సమస్త సృష్టియందు ఓత, ప్రోతమైయున్న నియమముల నెఱుంగు మనుజుడు మాత్రమే బ్రహ్మజ్ఞుడను ప్రత్యుత్తర మిచ్చుచున్నది. (యస్మిన్ ఓతాః ప్రజాః ఇమాః) అతడే నియమముల యొక్క మూలనియమమును కూడ తెలిసికొనును. అనగా సృష్టి నియమముల నన్వేషింపక విజ్ఞానము (సైన్స్) నవహేళన చేయువాడు బ్రహ్మ నియమముల నెఱుగజాలడు. కావున బ్రహ్మము నెఱుగలేడు. అట్టివారు తముకు తోచినట్లు కర్ణాకర్ణిగా వినిన కల్పితగాథలను నాధారమొనర్చుకొని ఈశ్వరుని రూపకల్పన చేయుదురు. కొందరు అశ్వత్థవృక్షమును, మరి కొందరు గంగను, సర్పములను, ఆవును, రప్పలను వృషభమును, పరమేశ్వరునిగా భావించి పూజింతురు. వారు సృష్టికర్త నియమముల నన్వేషింపరు. వాస్తవమైన విజ్ఞాన వేత్తయే బ్రహ్మ విదుడని, నిజమైన బ్రహ్మ విదుడే విజ్ఞానవేత్తయని వేదమంత్రము తెలుపుచున్నది.

**విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే** (ఋ. ౧.౨౨-౧౯)

సృష్టి పరివ్యాప్తములైన ఈశ్వర వ్యవహార నియమములను గుర్తింపుము. వానిని జూచియే నీవు నీ కర్తవ్యమును చక్కగా తెలిసికొనగలవు. వేదమంత్రములను చిలుక పలుకుల వలె కేవలము వల్లించుచు ఈశ్వర నియమములపైపు దృష్టి సారింపలేనివాడు ఈశ్వరుని తెలిసికొనలేడు. ప్రపంచమునందీశ్వరోపాసకులు చాల తక్కువగా మున్నారు. ఈశ్వరస్థానమున మానవులను, ఇటుకలను, రాళ్ళను, నదులను పర్వతములు మొదలగు వానిని పూజించువారు బహుళముగా నున్నారు. ఈ భ్రాంతియే మానవుల దుఃఖములకు కారణము. ఈశ్వరుని దక్క తక్కినవాని నుపాసించకుమని వేదమందు స్పష్టముగా చెప్పబడి యున్నది.

**మా చిదన్యత్ విశంసత. సఖాయో మారిషణ్యత** (ఋ. ౮-౧-౧)

మిత్రులారా! ఈశ్వరుని తప్ప అన్యుని ఉపాసింపకుడు. ఈశ్వరుడను భ్రమతో అన్యమును ఉపాసించుట మహాపాపము. కావున దీని బారినుండి తప్పుకోవలెను.

**ప్ర : ఈశ్వరోపాసనకు సరియైన విధాన మెద్ది?**

ఉ : ఈశ్వరుని నియమ చింతనయే ఈశ్వరోపాసనము. మనస్సులో నీశ్వరుని ధ్యానింపవలెను. ఈశ్వరుని గుణకర్మస్వభావములకు అనుగుణముగా తన గుణకర్మ స్వభావములను సరిదిద్దుకొనవలయును. చూడుడు.:

**యుంజతే మన ఉత యుంజతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః**
**విహోత్రా దధే వయునా విదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః**

(య. ౩౭-౨)

అర్థము : (విపశ్చితః విప్రాః) మేధావంతులగు విద్వాంసులు (బృహతః) సర్వజ్ఞుడగు నీశ్వరునియందు (మనఃయుంజతే) మనస్సు నిలుపుదురు. మరియు (ధియోయుంజతే). తమ బుద్ధులను తదనుకూలమొనర్తురు (ఏకఃవయునావిత్) సృష్టి నియమముల నెఱిగిన యేకైక విద్వాంసుడు (హోత్రావిదధే) యజ్ఞవిధానమును సమార్జించును. (దేవస్య సవితుః) జగత్ప్రేరకుడైన ఈశ్వరుని యొక్క (పరిష్టుతిః) స్తుతి (ఇన్మహి) నిస్సందేహముగా చాలా గొప్పది. ఈశ్వరునిలో నెన్నియో గుణములున్నవి. విద్వాంసుడు ఆ గుణములను స్మరించుచు ఆ గుణములకనుకూలముగా వర్తించి తనను, లోకము నుద్ధరించును. ఈ ఉపదేశమే గాయత్రి మంత్రమందును ఉన్నది.

**తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి**
**ధియో యో నః ప్రచోదయాత్** (య. 3-3౫)

అర్థము : (యః) ఎవడు (నః) మా యొక్క (ధియః) బుద్ధులను (ప్రచోదయాత్) ప్రేరేపించునో (సవితుః) ఆ జగన్నిర్మాతయైన (దేవస్య) దేవుని యొక్క (వరేణ్యం) వరింపదగిన (తద్భర్గః) ఆ పాపవినాశములగు గుణములను (ధీమహి) మేము ధ్యానింతుము. ఇది మంత్రాభిప్రాయము. చేతులను జోడించుటగాని, మంత్రములను జపించుటగాని ఈశ్వరపూజ కాజాలదు. ఈశ్వర గుణచింతనము చేయుట వలనను సృష్టిని గంభీర దృష్టితో నవలోకించుట వలనను, ఈశ్వర గుణకర్మ స్వభావముల కనుకూలముగా తన గుణకర్మ స్వభావములను రూపొందించు కొనుటవలననే మానవునకు కళ్యాణము సిద్ధించును. 'పంచదార' - 'పంచదార' యనిన నోరు తీయన కాజాలదు. పంచదార తినుట చేతనే నోరు తీయబడును. కేవల నామోచ్చారణము ఈశ్వర పూజ కాదు ఈశ్వరోపదేశములను ఆచరణము నందుంచుటయే ఈశ్వర పూజ యగును.

## వేదములో రాష్ట్రీయగీతము

ఇక ఆదర్శ ప్రాయమైన రాష్ట్రమందు ఏయే వస్తువులుండవలెనో వాని యుత్తమ వర్ణనము యజుర్వేదమందలి ౨౨ వ, అధ్యాయమున ౨౨వ మంత్రమందున్నది. ఇందలి విషయములు సర్వకాలములకును, సర్వదేశములకును లాభదాయకములుగా నుపయోగపడును. కావున దీనిని ప్రపంచ సకల రాష్ట్ర గీతముగా నంగీకరించి గాన మొనర్పనగును.

**ఆ బ్రహ్మన్ బ్రాహ్మణో బ్రహ్మవర్చసీ జాయతాం।**
**ఆ రాష్ట్రే రాజన్యః శూర ఇషవ్యో ఽతివ్యాధీ మహారథో జాయతాం।**
**దోగ్ధ్రీ ధేనుర్వోఢా ఽనడ్వానాశుః సప్తిః పురంధి ర్యోషా జిష్ణూ రథేష్ఠాః।**
**సభేయో యువాస్య యజమానస్య వీరో జాయతాం।**
**నికామే నికామే నః పర్జన్యో వర్షతు। ఫలవత్యో న ఓషధయః పచ్యంతాం।**
**యోగక్షేమో నః కల్పతామ్।** యజు. ౨౨.౨౨

ఓ ఈశ్వరా : ౧) మా నేత (మార్గదర్శకుడు) యగు బ్రాహ్మణుడు (బ్రహ్మవర్చసీ) ఉత్కృష్టమైన ఆత్మజ్ఞాన సంపన్నుడగుగాక, అతడు స్వార్థియు, లోభియు, నీచమార్గములైన లౌకికేచ్ఛలయందు నిమగ్నుడు కాక ప్రజాజీవనమందున్న ఆదర్శమును నెలకొల్పువాడగునుగాక ! (౨) రాష్ట్రమందలి క్షత్రియులు శూరులు, వీరులు, అస్త్ర, శస్త్రధారులు, ఆరోగ్యవంతులు, శత్రుసంహార మొనర్పజాలిన మహారథులు నగుదురుగాక! అందువలన మా రాష్ట్రము నాక్రమించు కోరిక ఎవరి మనస్సులందును కలుగజాలకుండుగాక ! (3) గోవులు క్షీరప్రదములు (౪) వృషభములు భారవాహక శక్తివంతములు. (౫) అశ్వములు జవయుతములు నగునుగాక ! (౬) స్త్రీలు ఆరోగ్య సౌందర్యములతో (పురంధిః) శరీరములను పెంపొందించుకొందురుగాక! వారు నిర్బలులు, రోగులు గానట్టి సుదృఢ

సంతానవంతులగుదురుగాక ! (౭) రథేష్ఠా (రథే + ష్ఠా) సైనికులు విజయేచ్ఛగల వారగుదురుగాక ! జయాకాంక్షులై నిస్వార్థబుద్ధితో సంగర మొనర్చువారు విజయులగుదురు గాక ! (౮)(అస్య యజమానస్య యువా వీరః సభేయో జాయతాం) ఈ యజమాని యొక్క యువక పుత్రుడు వీరుడై సభలలో పాల్గొనదగిన గుణవంతుడగును గాక. ఇతని సంతాన మయోగ్యమని ఎవ్వరను జాలకుందురుగాక ! (౯) (నికామే నికామే నః పర్జన్యో వర్షతు) అతివృష్టి, అనావృష్టి దుఃఖములు లేకుండ అవసరానుకూలముగ వర్షములు కురియుగాక ! (౧౦)(ఫలవత్యో నః ఓషధయః పచ్యన్తాం) మా కొరకు సస్యములు బహుళముగా ఫలించుగాక ! (౧౧) (యోగక్షేమో నః కల్పతాం) తన చెంతలేని యవసర వస్తువులను ప్రాప్తమొనర్చుకొనుట యోగము, ప్రాప్తించిన దానిని రక్షించుకొనుట క్షేమము. ఓ పరమేశ్వరా ! మా రాష్ట్రమునందీవస్తులోపము లేకుండుగాక! అవశ్యకవస్తు సకలము చక్కగా నుత్పన్నమై సకల ప్రజానీకమునకు సంపూర్ణ లాభదాయక మగుగాక ! వస్తువులు దుర్వ్యయ మొనర్పబడక మితముగా వ్యయింపబడుగాక !

పై విషయములు ప్రతి రాష్ట్రమున కావశ్యకములే. రాష్ట్ర ప్రజలీగీతిని దృష్టియందుంచుకొని ఇందుదాహృతము లైనవాని సమకూర్ప యత్నించినచో మానవ కళ్యాణము తప్పక సిద్ధించును.

## వేదము - విజ్ఞానము

### జనకల్యాణార్థము వైదిక విజ్ఞానము

విజ్ఞానము మనుష్యునకు స్వాభావికముగ నవసరమై యున్నది. మనము సంఘర్షణ ముద్వారా అగ్నిని పుట్టించుచున్నాము. బొగ్గులను రగుల జేసి రొట్టెలు కాల్చుకొనుచున్నాము. స్ఫోటక పదార్థాలతో పర్వతమును ముక్కలుగా బడగొట్టుచున్నాము. కుళాయి ద్వారా నీటిని పైఅంతస్తునకు గొనిపోవుచున్నాము. బావిలో నుండి నీళ్ళు తోడుటకు గిరకను ఉపయోగించుచున్నాము. మోటగట్టి పొలమునకు నీరందజేయుచున్నాము. శీతకాలమందు ఉన్ని గుడ్డలనుపయోగించుచున్నాము. ఈ మొదలుగా గల చిన్న చిన్న పనులందును ''ఆలోచనవానివైపునకు బోకున్నను'' విజ్ఞానముతో గూడిన నియమములు పనిచేయుచునే యున్నవి. విజ్ఞానము లేని మనుష్యుడు కుంటివాడు. విజ్ఞానముచేతనే క్రూరమృగముల నుండియు, శత్రువుల నుండియు రక్షించు కొనుటకు మనుష్యుడు శస్త్రాస్త్రముల నిర్మించుకొనుచున్నాడు. దూరదేశములకు శీఘ్రముగ బోగల్గుటకు యానముల నిర్మించుచున్నాడు. ఉపయోగకరమైన వస్తువుల నుత్పన్నము చేయుటకు కర్మాగారముల నిర్మించుచున్నాడు. ఇక ధార్మిక క్షేత్రమందును, రాజనీతిశిల్పాది క్షేత్రములందును ఉన్నతికలుగజేయుటకు వేదములందెట్లు ప్రేరణలు గలవో అట్లే వైజ్ఞానిక క్షేత్రమందును ప్రగతి కలుగ జేయుటకు గూడ వేదములు ప్రేరేపించుచున్నవి. అయినను వేద దృష్టిలో విజ్ఞానోపయోగము జన కల్యాణార్థ మవశ్యముగ గలదనొప్పును. వేదములందుల్లేఖింపబడిన కొన్ని వైజ్ఞానిక విషయముల నిట నుదహరించుచున్నాము. గమనింపుడు.

### వ్యోమయానము

వేదములలో ననేక స్థలములందు ఆకాశమున ప్రయాణము చేయుటకు వ్యోమయానమును గూర్చి వ్రాయబడియున్నది. దానికి గుఱ్ఱము లేదు. కళ్ళెమును లేదు. కేవలం మూడు చక్రములతో నాకాశమున సంచరించగలదు.

**అనశ్వో జాతో అనభీశురుక్థ్యో౩ రథ స్త్రిచక్రః పరివర్తతే రజః ॥౪.౩౬.౧॥**

మరొక స్థలమందు మీరు పక్షులెగురు చందమున విద్యుత్తు ద్వారా చలించెడు విశాలమైన రెక్కలుగల ''వ్యోమయానమునందు గూర్చుండి ఎగురుడని, దానిలో శస్త్రాస్త్రములుండవలెనని, అట్లే అవసరమైన భోజనాది పదార్థములుండదగునని సైనికులనుద్దేశించి వ్రాయబడియున్నది. గమనింపుడు.

**ఆ విద్యున్మద్భిర్మరుతః స్వర్కై రథేభిర్యాత ఋష్టిమద్భి రశ్వపర్ణైః।**

**ఆ వర్షిష్ఠయా న ఇషా వయో న పప్తతా సుమాయాః ॥ ఋ. ౧.౮౮.౧ ॥**

వర్తమానకాలమందు వ్యోమయానములకు రాజహంసాది నామములు పెట్టబడుచున్నట్లు, ఋగ్వేద దశమమండలమున కపోత నామక వ్యోమయాన వర్ణనము కలదు. ఇతర దేశయాత్రగా నొక కపోతము మరొక దేశమునకు రాగల్గినది. ఆ దేశవాసులు దాని నెదుర్కొనుము వితరదేశ దూతయగు నీ కపోతము ఒకానొక కోరికతో మా భూమికి వచ్చినది. దాని నేమాదరించుచున్నాము.

**దేవాః కపోత ఇషితో యదిచ్ఛన్ దూతో నిరృత్యా ఇద మాజగామ।**

**తస్మా అర్చామ కృణవామ నిష్కృతిం శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే ॥**

ఋ.౧౦.౧౬౫.౧

మన పొరుగుదేశమగు పాకిస్తాన్ యానము కొన్ని సమస్యలపై వార్తాలాపము లొనర్చుటకు మన దేశమునకు వచ్చుచున్నట్లది యథార్థముగ నటువంటి సమస్యయే యుననగును. ఇక నీ మంత్రమును పావురమను పక్షివిశేష కపోతనామము విమానమునకు ప్రయుక్తమై యున్నది. ఇట్లే మరొకచోట సామాన్యవాచక 'వి' శబ్దము పక్షి కొఱకు వచ్చుచున్నది.

వేదా యో వీనాం పద మంతరిక్షేణ పతతామ్। వేద నావః సముద్రియః॥

ఋ. ౧-౨౫-౭.

ఇందువలన వరుణుని స్తుతించుచు నతడు ఆకాశమున నెగురెడు విమానములు, సముద్రమున నడిచెడు పడవలను ఎరుగుచున్నాడని జెప్పబడినది. పడవలతో సమానముగ పక్షివాచక 'వి' శబ్దమున కర్థము విమానమని గ్రహించుటమిగుల ఉపయుక్త మనవొప్పును.

## జ ల యా న ము

అశ్వియుల ద్వారా జలయానమును ప్రయోగించుటకు, వర్తకుడగు భుజ్యుని సముద్రమును దాటించుమని, వేదమందొక కల్పిత కథా నుపదేశింపబడినది. తుగ్రుడను రాజు తన దేశపువర్తకుడైన భుజ్యుని వాని సహచరులను జలపడవలందు దేశాంతరమునకు బంపుచున్నాడు. ఆ పడవలను చలింపజేయు అశ్విద్వారా మూడు దివరాత్రములు నిరంతరము జలప్రయాణము చేయించి వారిని సురక్షితముగ దాటించుచున్నారు.

**తుగ్రోహ భుజ్యుమశ్వినోద మేఘే రయిం న కశ్చిన్మమృవాఀ అవాహాః।**
**త మూహథు ర్నౌభి రత్మన్వతీభిః అంతరిక్షప్రుద్భి రపోదకాభిః।**
**తిస్రః క్షప స్త్రిరహాతివ్రజద్భి ర్నాసత్యా భుజ్యుమూహథుః పతంగైః।**
**సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షడశ్వైః॥**

ఋ ౧-౧౧౬ ౩-౪

ఇచట ఓడలయొక్కయు జలనావలయొక్కయు విశిష్టతను గోచరింపజేయుగల కొన్ని విశేషణములు ప్రయోగింపబడినవి. ఆ నీటి పడవలు మునిగిపోకుండ నీటిపైన చలించునని 'అంతరిక్షప్రుద్' అను పదము సూచింపజేయుచున్నది. అపోదకములపై జలప్రభావము పడదు. అనగా నవి వాటర్ ప్రూఫులవంటివని భావము. గాలిపటములవలె నీటిపై అతి వేగముగ ఎగురుచున్నట్లగుపడును. అవి శతపదములుగలవనియు, అపుటకును, నడుపుటకును అనేక యంత్రములు కలిగి యుండుననియు గలదు. ౬ ఇంజనులు కలిగియుండుటవలన షడశ్వపదము ప్రయోగింపబడినది. ఈ ప్రసంగమున బేర్కొనబడిన తుగ్ర, భుజ్యు, అట్లే అశ్వినౌ శబ్దములు గూడ యౌగికములు. రాజార్థమున ప్రయోగింపబడిన తుగ్రశబ్దము తుజి హింసా బలాదాన నికేతనేషు' అనుధాతువునుండి ఔణాదిక రక్ ప్రత్యయము చేర్పుటవలన నిష్పన్నమగును. దీనినిబట్టి రాజు శత్రుహింసకుడు, బలవంతుడు, సంగ్రహశీలుడు అని విశదమగుచున్నది. 'భుజ్యు' అనగా భోగ్యపదార్థముల గోరువాడని అర్థము. ఇట ఇచ్ఛార్థమందు క్యచ్ ప్రత్యయమేర్పడినది. అశ్వినౌ శబ్దార్థము అశ్వములుగల దవియు లేదా గతిని కలుగజేయునదనియు నెరుగనగును.

మరొక మంత్రమునలో సముద్రమున మునిగి నడువగల యానము యొక్క వర్ణనము కూడ గలదు. ఇక నది అవసరమైనపుడు పక్షివలె నాకాశమున నెగురగలదు. దానినిగూడ 'అశ్వినౌ' అనువారడు తుగ్రుని పుత్రుడైన భుజ్యుని ఉపయోగార్థము నిర్మించెనుయ ౧౧ వ

**వేతం చక్రథుః సింధుషు ప్లవమ్। ఆత్మన్వన్తం పక్షిణం తౌగ్ర్యాయకమ్॥**

ఋ ౧-౧౮౨-౫॥

## జలఘటక తత్త్వములు

ఇప్పటి విజ్ఞానవేత్తలు ప్రయోగశాలలయందు ఆక్సిజన్ మరియు హైడ్రోజన్ నామక రెండుగ్యాసులే (ధాతువులను ఆవిరి చేసిన పదార్థాలతో) జలఘటకతత్త్వములని జూపుచున్నారు. వానియందు విద్యుద్ధారను ప్రవహింపజేయుటవలన జలముత్పన్నమగు చున్నది. అట్లే విద్యుతముద్వారా ఆ జలమును భేదించుటవలన నది పై బేర్కొనబడిన గ్యాసులందు విభక్తమగుచున్నది. ఈ రహస్యము క్రింది మంత్రమున వర్ణింపబడినది. గమనింపుడు-

**మిత్రంహువే పూతదక్షం వరుణం చ రిశాదసమ్।**
**ధియం ఘృతాచీం సాధన్తా॥** ఋ ౧-౨-౭॥

ఇందు పై బేర్కొనబడిన రెండుగ్యాసులకు (ఆవిరిపదార్థముంచే) క్రమముగ మిత్ర-వరుణ నామము లివ్వబడినవి. జలమునకు ఘృతశబ్దము ప్రయోగింపబడినది.

**ఘృత మిత్యుదక నామ జిఘర్తేః సించతి కర్మణః** నిరుక్తము ౭-౨౪॥

అథర్వణవేదమందొకచోట మిత్రవరుణుల కలయికచే వర్ష మేర్పడునని జెప్పబడినది.

**'న వర్షం మైత్రావరుణం బ్రహ్మజ్యమభివర్షతి'** అథ-౫-౧౯-౧౫॥

ఋగ్వేదమందలి ఈ మంత్రమున వసిష్ఠుడు మిత్ర వరుణులచే నుత్పన్నుడని అట్లే ఊర్వశీ యొక్క మనస్సుచే అధిజాతుడని జెప్పబడినది. ఇచ్చటగూడ వసిష్ఠుడన్న వర్షబిందువులని భావము. ఇక మిత్రవరుణులు చెప్పబడిన రెండు వాయువులని, ఊర్వశీ విద్యుతమని భావము. ఉతాసి మైత్రావరుణో వసిష్ఠ

**ఉర్వశ్యా బ్రహ్మన్ మనసోఽధిజాతః** ఋ ౭-౩౩-౧౧.

## వర్షము గురిపించుట

ఒక్కొక్కప్పుడు వర్షము గురియవలసిన యవసరము విశేషముగ నున్నను వర్షము గురియదు. మేఘములు కప్పుకొన్నను వర్షము గురియదు లేదా మేఘములురానేరావు. అట్టి పరిస్థితియందు వర్షము గురిపించే ఉపాయములందు వర్తమాన విజ్ఞానము సంలగ్నమై

యున్నారి. అనగా వైజ్ఞానికులు విమానముద్వారా పైకి వెళ్ళి కొన్ని పదార్థములను జల్లి మేఘములను గురిపించేపరీక్షలు చేయుచున్నారు. ఐన నిది అసంభవమని చెప్పుటకు వీలులేదు. కాని అధిక వ్యయసాధ్యమని తెలియుచున్నది. కాని వేదమంత్రములద్వారా కృత్రిమ రూపమున వర్షము గురిపించుట నుల్లేఖింపబడియున్నది. ఋగ్వేదమందలి వృష్టికామసూక్తమందు దేవాపి ఆర్ష్టిషేణుడు వైజ్ఞానిక ప్రయోగముద్వారా యజ్ఞముచే ఉత్తర సముద్రము ( ఆకాశము) నుండి అధర సముద్రమునైపునకు వర్షముగురిపించుట యందు సఫలుడగుచున్నాడు.

**ఆర్ష్టిషేణో హోత్ర వృష ర్నిషీదన్ దేవాపి ర్దేవసుమతిం చికిత్వాన్ ।**
**స ఉత్తరస్మా దధరం సముద్ర మపో దివ్యా అసృజద్ వర్ష్యా అభి ॥**

ఋ ౧౦-౯౮-౫ ॥

ఆకాశమున జలము దేవతలచే నవరోధింపబడి యున్నదని మొదటి మంత్రమున స్పష్టముగా జెప్పబడినది. అనగా మేఘములు కప్పుకొనియున్నవి కాని వర్షము గురియదు. అట్టితరి దేవాపి తన కళచే వానిగురిపించు చున్నాడని భావము. ఈసూక్తమందలి అంతిమమంత్రమున అగ్నిని సంబోధించుచు, మీరు రాక్షసులను అనగా వృష్టిబాధక భౌగోళికపరిస్థితిని నష్టపరచి ప్రచురముగ జలమును గురిపించుడని జెప్పబడినది. నేడు మేము పూర్ణముగ విజ్ఞానవిదులముగాకపోయినను, వేదముద్వారా ప్రేరితులమై ఈ విషయమున ప్రగతిజేయుచు ప్రకృతిపై విజయము బొందగలము.

### కృత్రిమ కాలు నమర్చుట

రాత్రిపూట రణభూమియందు యుద్ధము చేయుచు 'ఖేల' అను యోధుని 'విశ్పలా' అను భార్యయొక్క కాలు తెగి, "విహంగముయొక్క రెక్కవిరిగి పడినట్లు" పడిపోవును. 'ఖేల' అను వీరుడు సంగ్రామమును ఆటస్థలిగా భావించువాడు. 'విశ్పలా' అనగా ప్రజలను పాలించుటయందు సమర్థురాలగు వీరాంగన అని యర్థము. ఇంక అశ్వినౌ అను చికిత్సకులు, ఆమె కాలుండిన స్థానమున క్రొత్త ఉక్కు కాలును, ఆమె సులభముగా నడవగల్గునట్లు అమర్చుచున్నారు.

**చరిత్రం హి వేరివాచ్ఛేది పర్ణ మాజా ఖేలస్య పరితక్మ్యాయామ్ ।**
**సద్యోజంఘామాయసీం విశ్పలాయై ధనేహితే సర్తవే ప్రత్యధత్తమ్॥**

ఋ౧-౧౧౬-౧౫

ఇది సామాన్యముగ నడవగలుగుటయేకాదు. "ధనే హితే సర్తవే" అని జెప్పబడినది. దీనికి సాయణాచార్యులు "శత్రువులందలి నిహితధనమును జయించుటకు వెళ్ళుట అనగా యుద్ధము చేయుట" అని అర్థము జేసియున్నారు. ఇట్లు వేదదృష్టిలో తెగిన కాలుకు బదులుగ శల్యవేయగల సుదృఢమైన కృత్రిమ కాలును అమర్చగల్గుదురనుట.

### వృద్ధుని యువకుని జేయుట

వర్తమానకాలమందు కొందరు వైజ్ఞానికులు, వృద్ధుని యువకునిజేయ గల ఔషధము నావిష్కరింపబోవుచున్నారు. వేదమున నీ విద్య యొక్క వర్ణనము గూడ జిక్కుచున్నది. 'అశ్వి' అను వైద్యులు, ఒక జీర్ణశరీరముగల చ్యవానుని తమ సంజీవనీ క్రియచే యువకుని జేయుచున్నారు.

**యువం చ్యవాన మశ్వినా జరన్తం పున ర్యువానం చక్రథుః శచీభిః ॥**

ఋ. ౧-౧౧౭-౧౩

### పురుష సంతానము నుత్పన్నము జేయుట

ఏ స్త్రీలకు ఆడబిడ్డలే పుట్టుచుందురో, వారికి పుత్రసంతానము కొఱకు శమీ వృక్షముపై మొలచిన రావిని సేవింపవలెనని, వేదమందు నుపాయము జూపబడినది. కాని దాని సేవనమెట్లు? ఏవిధమున? ఏసమయమున చేయవలెను? వీని అనుసంధానము జేయుట భిషగాచార్యులకార్యము.

**శమీ మశ్వత్థ ఆరూఢస్తత్ర పుంసవనం కృతమ్।**
**తద్ వై పుత్రస్య వేదనం తత్ స్త్రీష్వా భరామసి ॥** అథ ౬-౧౧-౧

ఇవ్విధముగ వేదములందు ప్రతిపాదింపబడిన కొన్ని వైజ్ఞానిక విషయములిట సంక్షిప్తముగ నుల్లేఖింపబడినవి. ఇంక నెన్నియో వైజ్ఞానిక విషయముల వర్ణనము వేదములందు మూలరూపముగ లభించుచున్నది. వానివలన ప్రేరణ బొంది ఆ విషయమున నగ్రగణ్యులము కాగలము. వ్యోమయానాదుల నిర్మాణ విధానము వేదములందు వ్రాయబడనందున నా వర్ణనములు నిరర్థకములు. వాని వలన యేమేమి చేయగలము నొక సందేహముత్పత్తియగుచున్నది. కాని వేదములు ప్రేరణలకు మాత్రము స్రోతస్సులు. మనము ఏమి చేయవలయును? ఎట్లు ప్రగతి చేయవలయును ? అను నీ ప్రేరణలే వారములనుండి లభించుచున్నవో మరి మనమెట్లుచేయగలము? అనునది మన బుద్ధిద్వారా తెలుసుకొనవలెను. నేడు కూడ నెవరు వైజ్ఞానిక విషయముల నావిష్కరించి యున్నారో వారు ఎక్కడైన అక్షర రూపమున జదివి ఆవిష్కరించిరా ? ఎట్లు వారాకార్యముల జేయగలిగిరో మనము గూడ జేయగలుగుదుము. ప్రేరణము లా వేదముల నుండి మాత్రము పొందగలము.

## వేదములో సమాజ సంఘటనము

మానవుడు సామాజిక ప్రాణి. అతడొంటరిగా నుండ నిచ్చగింపడు. అయినను మానవులందరును నొకటిగా నుండరు. ప్రతి వాని గుణములు, రుచులు, ప్రవృత్తులు భిన్న భిన్నములుగా నుండును. ఇంతటి భిన్నతయున్నచో సమాజవ్యవస్థ ఎట్లేర్పడును? అను ప్రశ్న ఉదయించును. గుణ కర్మ స్వభావములు సమాజ వర్గీకరణమున కాధారములని వేదములంగీకరించినవని వేదమును చదువువారందరీ యజుర్వేద మంత్రము నెఱుంగుదురు. కాని దాని యాశయములను గ్రహించుటలో కొందరు భ్రాంతి నొందుచున్నారు.

బ్రాహ్మణో౭స్య ముఖమాసీత్ బాహూ రాజన్యః కృతః।
ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత (యః 31-11)

ఈ సమాజ రూపశరీరమునకు ముఖము బ్రాహ్మణులు, బాహువులు క్షత్రియులు. ఊరువులు వైశ్యులు, పాదములు శూద్రులు అని మంత్రాశయము. సువ్యవస్థ సమాజమును తెలుపుటకు శరీరమునకంటె వేరొండు మంచి యుదాహరణము లేదు శరీరమందు మూడు విషయములు గోచరించును.

(1) అవసరములన్నియు భిన్నములు, వీని కార్యములు భిన్నభిన్నములే. (2) ఈ అవయవములన్నియు పరస్పర సహకారవములు. భిన్నవములయ్యును పరస్పరము సంబంధితములై, వ్యవస్థితములై యున్నవి. అవి విడిపోలేవు. పరస్పర విరుద్ధములు కావు. మృదువైన నాలుక కఠినమైన దంతములకు సన్నిహితముగా నుండును. అయ్యవి పరస్పర సహాయకములగుచున్నవి. (3) సర్వావయవముల (సమిష్టికృషి) సహయోగమునే శరీరము పుష్టివంతమగుచున్నది. వాని సహయోగము జీవనమునకు లక్షణము, అసహయోగము మృత్యువునకు లక్షణము. భిన్నములయ్యు సహయోగమును నిర్వహించు నవయవములు గలదే స్వస్థ శరీరము. అసహయోగారంభమే రోగసూచకము, మృత్యువాహకము అత్యంతోపయుక్తము. సోదాహరణము నైన ఈ మంత్రమును గ్రహించుటలో కొందరు మొదటి విషయమును మాత్రమే స్వీకరించి కడపటి రెంటిని విస్మరించిరి. ఈ పొరపాటు కారణముగా జరిగిన వర్గీకరణము హిందువులలో భిన్నతలను కలహములను పుట్టించినది. వ్యవస్థను విచ్ఛేదమొనర్చినది. బ్రాహ్మణులకు, క్షత్రియులకు మధ్య యుద్ధములు జరిగినవి. వైశ్యులకు, శూద్రులకును మధ్య కలహము లేర్పడినవి. బ్రాహ్మణులలోని యంతశ్శాఖలలో కూడ ఈర్ష్యాస్పర్థలు రేకెత్తినవి. సమస్త సమాజమునకు నష్టము వాటిల్లునట్లు హిందూజాతి వేలకొలది వర్గములుగా విభక్తమైనది.

ఉపమానోపమేయముల నెరుగని వారి వలననే ఇట్లు జరిగినది. వేదమందు సూచింపబడిన నియమము సకల మానవ జగత్తుకు వర్తించును అనగా సమాజము నాలుగు పెద్ద భాగములుగా విభజింపబడుట యుక్తము. (1) జ్ఞానవృద్ధి యొనర్చు బ్రాహ్మణులు ముఖతుల్యులు. (2) బలవంతులైన క్షత్రియులు బాహు తుల్యులు. (3) వ్యాపారము నెఱపు వైశ్యులు జంఘసమానులు. (4) ఇతర శ్రమజీవులగు శూద్రులు పాద సమానులు.

ఈ విభాగములు సంస్కృతమున వర్ణపదముచే చెప్పబడినవి. ఇచట వర్ణ శబ్దమునకర్థము రంగుకాదు. 'వృఞ్ వరణే' అను ధాతువునుండి నిష్పన్నమైన వర్ణశబ్దము - మనుజుడు సమాజమునకు తానై చేయగోరిన కర్తవ్యమును బోధపరచును. ఈ వర్ణము బలవంతముగా నెవ్వరికిని అంటగట్ట బడునదికాదు. మానవుడు తానుగా దానినెన్నుకొనును. ఈ ఎన్నికయందు అభిరుచి, శక్తి రెండును చూడబడును. ఎవని మస్తిష్కము మంచిదో ఎవరికి జ్ఞానవృద్ధిలో నభిరుచి యుండునో, ఎవడు పలు విధములగు వైజ్ఞానికానుసంధానములను ఆవిష్కారముల నొనర్చి సమాజ సమృద్ధికి తోడ్పడునో వాడే బ్రాహ్మణుడు, శరీరబలము కలిగి ఆతతాయులనుండి సమాజమును రక్షించు వాతడే క్షత్రియుడు. ధనధాన్యోత్పత్తిని కళాకౌశలోన్నతిని సాధించు నాతడే వైశ్యుడు. సేవ మాత్రమే చేయగలిగి పై మూడు వర్గముల వారొనర్చు కార్యములకు సహాయమొనర్చు నాతడే శూద్రుడు, ఈ బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రపదములు జన్మమూలకములుగా వాడుట తగదు. గుణకర్మ స్వభావానుసారముగా నీ వర్గీకరణము జరిగినది. భేదభావమునకు మాత్రము కాదు సరికదా. సహయోగమునకే ఇది యుద్దేశింపబడినది.

సమాజమందలి ఈ నాలుగు పెద్ద వర్గములు సమాజము పెరుగుచున్న కొలదిని ఆ యా వర్గమందలి విశేష కార్యమును బట్టి విస్తరిల్లవలసి యుండును. ఒక జనపదమందు ఒక దుకాణము మాత్రముండును. అచ్చటనే ఉప్పు, మిర్చి మొదలగు వాటితో పాటు బట్టలు కూడ విక్రయింపబడును. సామాన్యములగు ఔషధములు కూడ యమ్మబడును. కాని నగరమందు ఒక్కొకటి దుకాణములే పలువిధములుగా యుండును. ఇట్లే బట్టల దుకాణములు కూడా. ఇదే విధముగా సమాజము విస్తృతమైనపుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రములనేక వర్గములుగా విభజన యగుదురు. కాని వారందరంతగా భిన్నులైనను పరస్పర ఘాతకులు గాక సహాయకులగుటయే ఇందలి గొప్ప తనము. సమాజమును శరీరముతో పోల్చి వర్గములలోగల పారస్పరిక సహకారమునే వేదమంత్రము బలపరచుచున్నది. ఈ వర్ణవ్యవస్థ జన్మాది గౌణనియమములపై నాధారపడి యుండరాదు. స్వాభావికములైన ప్రవృత్తులు యభిరుచులు మాత్రమే దీని కాశ్రయములు కావలెను

సుసంఘటిత సమాజమునకు కృషి, ధనము, ఉద్యోగము, కళాకౌశలములు, యాత్రాసాధనములు, సేన, విద్యాధ్యయనాద్యనేకవిషయములావశ్యకమగుచున్నవి. వేదములలో ఈ విషయములన్నియు వివరింపబడినవి.

## వేదములలో ధనవిషయము

ప్ర : **ధన విషయమున వేద విధానమేమి?**

ఉ : ధనములేక జీవనము జరుగుట కష్టము . ఋగ్వేదారంభమందిట్లున్నది.

**అగ్నినా రయి మశ్నవత్ పోషమేవ దివేదివే।**

**యశసం వీరవత్తమమ్** (ఋ. ౧-౧-౩)

(అగ్నినా) ఈశ్వరోపదేశముల ననుసరించి (రయిం) ధనమును (అశ్నవత్) ఆర్జించవలయును. (దివేదివే) ప్రతి దినము (పోషం) పోషించునది. (యశసం) కీర్తినిచ్చునది (వీరవత్తమమ్) శక్తిని సంపాదించునది. అనగా అవినీతిగా ధనము నార్జించకుము. ఈశ్వరాజ్ఞాబద్ధుడవై ధర్మమార్గమున ధనము నార్జించుము. నీవు నీ కుటుంబపాలన పోషణము కొరకు చాలినంత ధనము నార్జింపుము, ధనమువలన నీ కీర్తివృద్ధి కావలయును. ధనమును ధర్మమార్గముననే సంపాదించుము. ధర్మమార్గముననే వ్యయింపుము మరియును :

**ఊర్జం బిభ్రద్ వసువనిః సుమేధా అఘోరేణ చక్షుషా మిత్రియేణ**

**గృహానైమి సుమనా వందమానో రమధ్వం మా బిభీతమత్** (అ. ౭-౬౦-౧)

(సుమనసావంద మానోరమధ్వం) మీరు నిర్మల హృదయముతో నాకరినాకరు సన్మానించుకొనుచు సుఖింపుడు. (మాబిభీతమత్) నావలన భయపడకుడు. ఏలనగా స్వార్థినై నేను మీకు కష్టము కల్గించను. (ఊర్జంబిభ్రత్) నేను తేజోవంతుడను (వసువనిః) ధనము నార్జింతును. (సుమేధా) మేధావిని. నేనవినీతిపరుడను కాను. (అఘోరేణ మిత్రియేణ చక్షుషా గృహాన్ యేమి) ప్రసన్నమైన స్నేహదృష్టితో నేనిల్లుజొత్తును. నేను ప్రియముగా వర్తింతును. ధనమార్జించి మీకందరికి సుఖమునిత్తును. ననుగని భయము నొందకుడని గృహస్థుడు తన కుటుంబము లోని వారితో చెప్పును. స్వార్థులైన దుష్టులు తామార్జించిన ధనమును తమకొరకే వ్యయము చేయుదురు.

**ఇమే గృహా మయోభువ ఊర్జస్వంతః పయస్వంతః॥**

**పూర్ణావామేన తిష్ఠతస్తేనో జానంత్వాయతః** (అ. ౭-౬౨-౨)

ఈ గృహములు పాడిపంటలతో నిండి శక్తి వంతములు, సుఖవంతములగుగాక. వానియందుత్తమ వస్తువులుండుగాక ఉదార హృదయులు మాకు స్వాగతమొనర్తురు గాక ఉదారులు ప్రేమయుతులు, కార్య శూరులునగువారి యిండ్లు పాడి పంటలతో సమృద్ధములై సుఖదాయకములగును. కృపణులు, లోభులు, సోమరులు ఏమాత్రము నభివృద్ధినొందలేరు.

**ఉపహూతా భూరిధనాః సఖాయః స్వాదుసమ్ముదః।**

**అక్షుధ్యా అతృష్యాస్త గృహామాస్మద్బిభీతన** (అ ౭-౬౦-౪)

(భూరిధనాః) విశేష ధనము నార్జించువారు (సఖాయః) తోడ్పా నీశ్వరస్తుతి యొనర్చువారు. (స్వాదుసమ్ముదః) జీవనానందమును గ్రోలువారు (అక్షుధ్యా) క్షుధోపహతులు గానివారు నగు (గృహాః) గృహస్థులారా। (మాస్మద్ బిభీతన) నా వలన భయమునందకుడు.

ధనవంతుడైన మానవుడు దర్మాత్ముడు, దానశీలుడైనచో నతనిని ఇంటివారును ఊరివారును తుదకు దేశీయులును గౌరవింతురు.

వివాహ సమయమున పతి నేను నా పత్నిని రక్షింతు నని ప్రతిన సేయును, దానికి విరుద్ధముగా వివాహమందే భార్యతోపాటు ధన, కనక, వస్తు, వాహనాది సకల సామగ్రి నాశించువారు కొందరుందురు. వారిని గూర్చి :

**అశ్లీలాతనూర్భవతి రుశతీ పాపయాముయా।**

**పతిర్యద్ వధ్వో వాససః స్వమంగ మభ్యూర్ణుతే** (అ. ౧౪-౧-౨౭)

వధువుతెచ్చిన వస్త్రములతో నాచ్ఛాదింపబడిన వరుని శరీరము కలుషితమగుచున్నది. వధువుద్వారా సంప్రాప్తమయిన ద్రవ్యముతో భోగముల ననుభవించ నెంచువారి శరీరములు కలుషితములగును. అందుచే వరదక్షిణ గ్రహించుటయు, వాంఛించుటయు పాపమని వేదము తెలుపుచున్నది.

సకల పవిత్రతలయందును అర్థ పవిత్రత శ్రేష్ఠము, ఆవశ్యకమునునైయున్నది.

**శుచీ వో హవ్యామరుతః శుచీనాం శుచింహినో మ్యధ్వరం శుచిభ్యః।**

**ఋతేన సత్యమృతసాప ఆయన్ శుచిజన్మానః శుచయః పావకాః॥**

(ఋ. ౭-౫౬-౧౨)

(మరుతః) ఓ ప్రపంచమానవులారా! (వహశుచీనాం) పవిత్రులగు మీయొక్క (శుచీహవ్యా) వస్తువులు పవిత్రములే యగుగాక. (శుచిభ్యః శుచిం అధ్వరం హినోమి) మీరు శుద్ధ ధర్మ మార్గమున సమార్జించిన పదార్థములతో యజ్ఞ మొనర్పుడని నా యాదేశము. సత్యములైన శుద్ధ వైదిక నియమముల ద్వారా మీ జీవనమును, ఇతరుల జీవనమును పవిత్రమొనర్చు వారగుడు. లంచము, జూదము, అవినీతి, పరద్రవ్యాపహరణ మున్నగునవి. అధర్మార్జనములు నగుచున్నవి. ఇవి కుటుంబములనేకాక దేశములను, సైతము నాశనమొనర్చును.

## వేదములో పశుసంపద

పశుసంపద సకల సంపదలయందు ఉత్కృష్టమైనది. అథర్వ వేదము ౧౩ కాండమందు పలుమారులీ ప్రార్థనా మంత్రము చూడబడును.

**త్వం నః పుణే! పశుభిర్విశ్వరూపైః**
**సుధాయాం మా ధేహి పరమే వ్యోమన్**

ఓ పరమాత్మా! (త్వం) నీవు (నః) మమ్ములను (విశ్వరూపైః పశుభిః) అనేక విధములైన పశుసంపదతో సంతుష్టులనుగా నొనర్పుము. (పరమేవ్యోమన్) ఈ విశాల ప్రపంచమందు (మా=మాం) నన్ను (సుధాయాం) అమృతమందు (ధేహి) యుంచుము. అనగా వివిధ పశుసంపదలతో నన్ను సుఖవంతునిగా చేయుము.

## పశు ఉత్పత్తి వర్ణనము

**తస్మాదశ్వా అజాయంత ఏచకేచోభయాదతః గావోహ జజ్ఞిరే తస్మాత్**
**తస్మాజ్జాతా అజావయః పశూంస్తాంశ్చక్రేవాయవ్యానారణ్యా గ్రామ్యాశ్చయే**
(అ. ౧౯.౬-౧౨)

పై పండ్లు క్రింది పండ్లు గలిగిన యశ్వము నా ఈశ్వరుడే సృష్టించెను. అతడే గోవులను, మేకలను రచించెను. ఆ ఈశ్వరుడే గాలియందు వనములందు గ్రామములందు సంచరించు ప్రాణులను సృష్టించెను.

మనుష్యుల యునికితో పశువులకు సంబంధమున్నది. మనుష్యులయందును పశువులయందును ఉండు జీవులు సమానులే. అందుచే య. ౩౬-౧౮ లో "మిత్రస్యాహం చక్షుషాసర్వాణి భూతాని సమీక్షే" మేము సకల ప్రాణులను మిత్రదృష్టితో వీక్షింతుముగాక యని చెప్పబడినది. మానవుల యిండ్లయందు పాకబడు గుఱ్ఱములు, గాడిదలు, ఆవులు, ఎడ్లు, గొఱ్ఱెలు కుక్కలు మొదలగునవి తమ యజమానులను సేవించుచు తమ తమ సంస్కారములను గూడ ఉన్నతపరచుకొనును. యుద్ధాశ్వములు నిజస్వామిని సేవించుటయే కాక వాని రక్షణ మున తన ప్రాణముల నర్పించును. గొల్లవాని కుక్కలు గొఱ్ఱెలను కాపాడునంతటి తీవ్రబుద్ధి కలిగియుండును. దక్షిణాఫ్రికాలోని కింబర్లీ నగరమున గనులనుండి వజ్రములు తీయబడును. అచట కుక్కలకు వజ్రముల కాపాడుటకు శిక్షణనీయబడును. దొంగలు కావలా మనుష్యులకు ఆశజూపగలరేమోగాని ఆ కుక్కలను లోగొనలేరు. పశు, మనుజుల సహనివాసము పరస్పర లాభదాయకమని పై విషయముల వలన స్పష్టమగుచున్నది.

ఈ సహనివాసముల మానవులకు తమ కార్య కలాపము లందు సహాయము లభించుట, పశువులకు ఆంతరిక సంస్కారములు వికసించుట జరుగును. అందువలనే యజుర్వేదపు తొలి మంత్రమందు "యజమానస్య పశూన్ పాహి" యజమాని పశువులను రక్షింపుమని యున్నది. ఏమైనను పశుసంపద శ్రేష్ఠమైనది. మనము పశువులు లేకున్నను యంత్రములతో పనిని నడుపుకొనగలుగుదుము. కాని జడయంత్రములపై నిర్భరమై పశుపాలనను ఉపేక్షింపచేసిన సభ్యత ఎంతటి సౌకర్యదాయకమైనను, ఆకర్షణీయమైన దైనను పశు వికాసమున కవకాశమొసంగని దోషము ఆ సభ్యత యందుండును. కావున పశుసంపద నుపేక్షించుట భావ్యముకాదు.

**స నః పవస్వ శంగవే శం జనాయ శమర్వతే శం రాజన్నోషధీభ్యః**
(సా ౧-౧-౩)

ఓ పరమాత్మా! (నః) మమ్ములను (గవేశం) ఆవులకు శుభకరములుగా (శంజనాయ) పరివారమునకు శుభకరములుగా (శంఅర్వతే) అశ్వములకు సుఖకారులుగా (శం ఓషధీభ్యః) వృక్ష లతా గుల్మములకు వృద్ధికారులముగా (పవస్వ) ప్రేరేపించుము. ఈ మంత్రమందు గోవులను అశ్వములను గురించి విశేషముగా నుల్లేఖింపబడినది. ఇవి తక్కినయన్నిటికంటె విశేషముగా మనకుపకరించును. ఆవును ధేను వందురు. ధేనువనగా త్రాగుటకు పాలిచ్చునది యని యర్థము. యౌగికార్థదృష్ట్యా పాలిడు జంతువులన్నియు ధేను శబ్ద వాచ్యములే. భారతదేశమందు ఆవు, గేదె, గొఱ్ఱెలు ధేను శబ్దవాచ్యములైనట్లే, అరేబియా దేశమందు ఒంటె కూడ ధేను శబ్దవాచ్యమే యగును. గుఱ్ఱములకు అర్వత్ అను పేరుగలదు. వానిని వాజి యని కూడ వ్యవహరింతురు. గార్దభములపై స్వారిచేయు దేశములందు రాసభము కూడ వాజియే, అనడ్వాన్ (అనస్+వః) బండినిలాగునది. కావున ఎద్దును అనడ్వాన్ అందురు. ఇట్లే బండిలాగు దున్నలు, ఎడ్లు, లొట్టియ్యలు, కొండమేకలు అనడ్వాన్ శబ్దవాచ్యములే.

మానవులకు నిజపరివార రక్షణమువలె వీని రక్షణము కూడ అవశ్య కర్తవ్యము. పశువులన్నిటిలో గోవు శ్రేష్ఠమైనదిగా అంగీకరింపబడినది. సంస్కృత భాషయందు గో శబ్దమున కనేకార్థములున్నవి.

**క్షీరం దాన్నం తథా జ్ఞానం లోకేభ్యో దీయతే యయా।**
**గోమాతా సా సదా సేవ్యా దేవః పృథ్వీ సరస్వతీ॥**

పాలు ఇచ్చునది గావున గోవు మనకు మాత. అన్నమిడునది యగుటవలన భూమి మనకు

మాత. జ్ఞానమొసంగునది యగుటచే సరస్వతి మనకు మాత. సంస్కృతమందు పై మూడింటికిని గోశబ్ద ముపయోగింతురు. అందువలన గోవు సర్వదా పూజింపదగినది.

**ఇహైవ గావ ఏత నేహో శకేవ పుష్యత ఇహైవోత**

**ప్రజాయధ్వం మయి సం జ్ఞాన మస్తు వః** (అ. 3-౧౪-౪)

(గావః) ఓ గోవులారా! (ఇహ ఏవ ఏతన) నా ఇంటిలోనికి రండు (శకా ఇవపుష్యత) గ్రాసమును భుజించి పరి పుష్టములగుడు. (ఇహ ఏవ ఉత ప్రజాయధ్వం) ఇచటనే లేగలను గాంచుడు. (మయివః సంజ్ఞాం అస్తు) నాపై మీకు ప్రేమ గల్గుగాక.

**సం జగ్మనా అబిభ్యుషీరస్మిన్ గోష్ఠే కరీషిణీః**

**బిభ్రతీః సోమ్యం మధ్వనమీవా ఉపేతన** (అ. 3-౧౪-3)

(అస్మిన్ గోష్ఠే) ఈ గోష్ఠమందు (అబిభ్యుషీః) నిర్భయులై (సంజగ్మనాః) ప్రేమపూర్వకముగా నుండుడు. (కరీషిణీః) ఇందే మలవిసర్జన చేయుడు. (సోమ్యం మధుబిభ్రతీః) అమృతతుల్యమగు మధురక్షీరముల నిడుడు. (అనమీవా ఉపేతన) మీరు నిరోగులుగా నుందురుగాక.

**మయా గావో గోపతినా సచధ్వమయం వో గోష్ఠ ఇహ పోష ఇష్ణుః**

**రాయస్పోషేణ బహులాభవంతీర్జీవా జీవంతీరుప వః సదేమ**

(అ. 3-౧౪-౬)

(గావః) ఓ గోవులారా! (మయాగోపతినా సచధ్వం) మీ యజమానుడనగు నాతో నుండుడు. (అయంగోష్ఠః ఇహ) ఇచట నున్న ఈ గోష్ఠము (వః పోషఇష్ణుః) మిమ్ము పోషింపతగినది. (రాయస్పోషేణ బహులాభవంతీః) మాకుగల ధనధాన్య సంపదలతో పరిపుష్టములై వృద్ధినొందుడు. (జీవాః) మానవులమగు మేము (జీవంతీః వః ఉపసదేమ) సజీవములగు మిమ్ము సేవింతుముగాక.

ఈ మంత్రమందు గోరక్షణము దానివలన ధనధాన్య సమృద్ధి చెప్పబడియున్నది. "జీవంతవః" ఈ శబ్దమువలన యజ్ఞములందు పశుహింస, మాంస భక్షణము మున్నగునవి వేదమున మచ్చుకైనా లేవని తెలియుచున్నది. వైదిక సంస్కృతియందు ఏ ప్రాణికిని కష్టము కలిగించు ప్రసంగములేదు. సర్వజన వికాసము, సర్వప్రాణి కళ్యాణము ఈ సంస్కృతి యొక్క మూల సూత్రము. తమ స్వార్థము కొరకు ఇతర ప్రాణుల హింసించు యధికారము మానవులకులేదు. '**అహింసా పరమో ధర్మః**'. అహింసయే పరమోత్కృష్ట ధర్మము.

## వేదములో కృషి సంపద

పశుసంపద పిదప చెప్పదగినది కృషిసంపద

**ఏకో ద్వే వసుమతీ సమీచీ ఇంద్ర ఆపప్రౌ పృథివీ ముతద్యామ్**

(ఋ. 3-30-౧౧)

(ఏకః ఇంద్రః) ఒకే ఒకడగు పరమాత్ముడు (ద్యాపృథివీం ఉతద్యాం) పృథివ్యాకాశముల రెంటిని (సమీచీవ సుమతీ ఆపప్రౌ) విస్తార ధనసుదాయకములుగా రచించెను.

పృథివీ ద్యులోకములను రెండింటిని (వసుమతీ) ధనదాయకములని వేదమున చెప్పబడినది. మేఘము వర్షించినచో పృథివి సస్యోత్పత్తి చేయగలదు కాని మానవుడు తన జ్ఞానముతో భూమిని సాగుచేసి ఆహారోత్పత్తి చేయవలయును. పశువులవలె కేవల మీశ్వరునిపై నాధారపడరాదు.

**సీరాయుంజంతి కవయో యుగా వితన్వతే**

**పృథక్ ధీరా దేవేషుసుమ్నయా**

(అ. 3-౧౭-౧)

(దేవేషు సుమ్నయా) దేవప్రియులైన (ధీరా కవయః) బుద్ధిమంతులు, జ్ఞానులునగువారు (సీరాయుంజంతి) నాగలితో దున్నుదురు. (పృథక్ యుగా వితన్వతే) ఎద్దుల మెడలపై కాడి నుంతురు. వ్యవసాయము చేయువారి నీ మంత్రమందు దేవప్రియులనియు, కవులనియును, ధీరులనియును చెప్పబడినది. ఏలనగా యావత్ప్రపంచము కొరకై ఆహారోత్పాదన మొనర్చుట శ్రేష్ఠులు జ్ఞానులునగు పురుషుల కర్తవ్యము. పృథివి వసుమతి. దానియందు సంపద నిండియున్నది. కాని జ్ఞానపరిశ్రమ లుపయోగింపబడనిచో అన్నోత్పత్తి జరుగనేరదు. అజ్ఞానులైన ఆటవికుల చెంత ఏ ప్పతము లైన భూవసతులు పడియున్నవి. వానిలో నెవరును నాగలిచే నేల దున్నరు. అచటివారు భూమినుండి ఆహారమును గైకొనజాలరు. శిక్షితులు, విజ్ఞాన వేత్తలునైన వారి అధికారము క్రిందికి భూవసతులు వచ్చినచో అచటి వారికేకాక అన్య దేశీయులకు కూడ ఆహారము పుష్కలముగా లభించును.

**యునక్త సీరా వియుగాతనోత కృతేయోనౌ వపతే హ బీజం విరాజః శ్నుష్టిః**

**స భరా అసన్నో నేదీయ ఇత్ సృణ్యః పక్వమాయవన్** (అ. 3-౧౭-౨)

(యునక్తసీరా) నాగలితో దున్నుము. (యుగాః వితనోత) కాడిని సవరించుము. (కృతయోనౌ) పొలములో చాళ్ళు నేర్పరచుము (ఇహబీజం వపత) దానియందు విత్తనము నాటుము. (విరాజః శ్నుష్టిః సభరా అసత్) ఈశ్వరుని కృపవలన మా భాగ్యము

సమృద్ధమగుగాక. (న వేదీయుఖత్ సృణ్యః పక్వం ఆయవన్) మా పంటలు కోతకువచ్చును గాక ! - మనము బుద్ధి పూర్వకముగా నాగలితో భూమిని దున్ని చాళ్ళలో విత్తనములు వేయుదుమేని ఈశ్వరుని కృపచే పైరులు పెరిగి కోతకు వచ్చును. వానిని మన కొడవళ్ళతో కోసికొందుము.

ఋగ్వేదము మం. ౧౦- ౧౦౧ సూక్తములో శబ్దాంతర ములచేత ఈ యాశయమునే ప్రతిబింబింపచేయు మంత్రములున్నవి.

**యునక్త సీరా వియుగా తనుధ్వంకృతే యోనౌ వపతేహ బీజం।**
**గిరాచపృష్టిః సభరా అసన్ నోనేదీయ ఇత్ సృణ్యః పక్వమేయాత్** (మం.౩)

**సీరాయుంజంతి కవయో యుగా వితన్వతే పృథక్ ధీరా దేవేషు సుమ్నయా**
(మం. ౪)

నిరాహావాన్ కృణోతన సంవరత్రా దధాతన సించా మహా అవత
ముద్రిణం వయం సుషేకమనుప క్షితమ్ (మం. ౫)

మూడవ మంత్రమందు 'గిరా' మరియు 'పృష్టి' అను రెండు శబ్దములున్నవి. అందు గిరా వాణి - జ్ఞాన ద్యోతకము మరియు పృష్టి అన్నద్యోతకము. వీనివలన జ్ఞానవంతుడే మంచి రైతు కాగలడు. ప్రపంచమందు ప్రాణులకు రైతే అన్నదాత యగుట సమాజమందతనికి ఉన్నత స్థానముండవలయును. ౫వ మంత్రమందు "ఆహావాన్ నిహ కృణోతన" అనగా గోవృషభాదులు నీరు త్రాగుటకు అనుకూలముగా జలాశయములను నిర్మించు విధానమున్నది. 'ఉద్రిణం అవతం' అనగా నీటితో నిండిన చెఱువులు, కుంటలు, బావులు వరత్ర అనగా త్రాడు, వీనితో బొక్కెనలను కట్టి భూమిని తడుపుటకై నీరు లాగుదురు. వేదములందు భూమిని దున్నుట, విత్తనము చల్లుట, నీరు కట్టుట, సస్యములు కోయుట మున్నగు ఉపదేశములున్నవని దీని తాత్పర్యము.

యజుర్వేదము అ. ౧౮- ౧౨ వ మంత్రమందు అనేకములగు ధాన్యముల పేర్లు చెప్పబడియున్నవి.

వ్రీహయశ్చమే యవాశ్చమే మాషాశ్చమే తిలాశ్చమే ముద్గాశ్చమే ఖల్వాశ్చమే ప్రియంగవశ్చమే అణవశ్చమే శ్యామాకాశ్చమే నీవారాశ్చమే గోధూమాశ్చమే మసూరాశ్చమే యజ్ఞేన కల్పంతామ్॥

ఇచట (వ్రీహి) - వడ్లు (యవ) యవలు (మాష) మినుములు (తిల) నువ్వులు (ముద్గ) పెసలు ఇట్లే ఖల్వ. ప్రియంగవ, శ్యామాక నీవారాది వివిధములైన ధాన్యములను పండించు విధానమున్నది. "యజ్ఞేనకల్పంతాం" అనగా యజ్ఞము వలన నివి ఉత్పన్నములగుగాక యని యున్నది. ఇచట యజ్ఞమను కర్మము కృషి - యజ్ఞము. వ్యవసాయము చేయుటయును యజ్ఞమే యగును. యజ్ఞము అగ్నిహోత్ర మొనర్చి ఆహుతులిచ్చుట మాత్రమే కాదు. జీవనోపాధికై వలయు పదార్థములనుత్పత్తి చేయుట కూడ యజ్ఞమే. ఈ వివరణము ద్వారా ప్రతి రైతు యజమానుడు లేక యజ్ఞకర్త యనబడును. పురాణ గాథలలో జనకుని సునాశీరుడు లేక నాగలి దున్నువాడు అన్నారు. ఈ సునాశీర శబ్దము వేదమునుండి తీసికొనబడినది.

శునా శీరా హవిషా తోషమానా సుపిప్పలా ఓషధీః కర్తమస్మై

(శునాశీర) అనగా - హలమా! హలమునడుపు మానవులారా! (హవిషాతోశమానా) జీవనోపాధికములగు పదార్థములతో ప్రసన్నచిత్తులై (అస్మై) ఈ ప్రజలకొరకు (ఓషధీః) పైరులను (సుపిప్పలాః) చక్కగా పంట పండునట్లు (కర్తం) సిద్ధపరచుడు.

ఇచట శునాశీరా, తోశమాన అను పదములు ద్వివచనాంతములు. కృషిని, కర్షకులకును కూడ సంబోధించినవి. శునా అనగా నాగలి సీరా అనగా దాని పిడికోల. ఈ రెండును కృషి కార్యమునకు ప్రతీకములు - కృషి కార్య చిహ్నములు.

సమస్త మానవ జీవనము యొక్క భౌతిక వస్తుభారము వ్యవసాయముపై నాధారపడి యుండుటచే వైదిక విజ్ఞానము కృషిని సర్వోత్తమ కర్మగా పేర్కొన్నది.

కృషి యజ్ఞమును కొఱత లేకుండ సుసంపన్నమొనర్చుటకు ఖనిజ పదార్థము లావశ్యకములైయున్నవి. వాని ప్రాప్తికై ఖనిజ యజ్ఞము వేదమున నిట్లు ప్రతిపాదింపబడినది.

**అశ్మా చ మే మృత్తికా చ మే గిరయశ్చ మే పర్వతాశ్చ మే**
**సికతాశ్చ మే వనస్పతయశ్చ మే హిరణ్యం చ మే ఽయశ్చమే శ్యామం చ మే**
**లోహం చ మే సీసం చ మే త్రపు చ మే యజ్ఞేన కల్పంతామ్**
(య ౧౮-౧౩)

ఇచట (అశ్మా) రాయి (మృత్తికా) మట్టి (గిరయః) గుట్టలు (పర్వతాః) పర్వతములు (సికతా) ఇసుక (వనస్పతయః) అడవి కఱ్ఱ (హిరణ్యం) బంగారము (శ్యామం) వెండి (లోహ) ఇనుము (త్రపు) సీసముల యొక్క వర్ణనమున్నది. ఈ పదార్థములు యంత్రాదుల నిర్మాణమునకు పనికివచ్చును.

### వ్యాపార విషయమున వేదమేమి చెప్పుచున్నది.?

ఇంద్ర మహం వణిజం చోదయామి స న ఏతు పుర ఏతా నో అస్తు

నుదన్వరాతిం పరిపంథినం మృగం స ఈశానో ధనదా అస్తు మహ్యమ్
యే పంథానో బహవో దేవయానా అంతరాద్యావా పృథివీ సంచరంతి తే మా
జుషంతాం పయసా ఘృతేన యథాక్రీత్వా ధనమాహరాణి (అ. ౩ . ౧౫ . ౧౨)

ఇచట వణిజ వ్యాపార మొనర్చువారికి ఇంద్రశబ్దము వాడబడినది. వ్యాపారమునకు ఎగుమతి దిగుమతుల సౌకర్యమవసరము. మార్గమధ్యమందు (పరి పంథినం) వైరులు దోపిడి గాండ్రు, మృగవ్యాఘ్రాది ఘాతుక జంతువులు బాధపెట్టకుండ మండవలయును.

(యే బహవో పంథానః) ఏ విశాల మార్గములు (ద్యావా పృథివీ అంతరాః) భూమ్యాద్యాకాశము లందున్నవో ఎచట (దేవయానాః) వాయుయానములు నడచునో (తే మాపయ సా ఘృతేవ జుషంతాం) ఆ మార్గములు నాకు జీవనోపయుక్తములగు ఘృతదుగ్ధముల నిడుగాక (యథా క్రీత్వా) దానిచే నేను వ్యాపార మొనర్చి (ధనం) ధనమును (ఆహరాణి) గైకొందునుగాక.

ఇచట వ్యాపార మండలములు, వ్యాపారములు, వాయుయానములు, పేర్కొనబడినవి. వణిజ వైశ్యుడు ఇంద్ర శబ్ద వాచ్యుడు. అతని వాయుయానము దేవయానము (క్రీత్వా) క్రయవిక్రయము లొనర్చియే వ్యాపారి ఒక దేశపు సరకులనింకొక దూరదేశములకు చేర్చగలడు. దీనివలననే ధనము లభించును. మానవజాతికి చెందిన నాలుగు వర్ణములలో నొక భాగమైన వైశ్యుడు ఉత్పత్తి, కృషి కళాకౌశలాదులు, ఎగుమతిదిగుమతులు, వినిమయము, ధనప్రాప్తి మున్నగు వివిధములైన వ్యాపార విభాగములతో సంబంధము కలిగియుండును.

ప్ర : ఏయే గ్రంథములు వేదానుకూలములు ?

ఉ : నాలుగు వేదములకు ఆరు వేదాంగములు : శిక్ష, కల్ప, వ్యాకరణ, నిరుక్త, ఛంద, జ్యోతిషములు. నాలుగు ఉపవేదము లున్నవి. ౧. ఆయుర్వేదము(మెడిసిన్) ఇది ఋగ్వేదమునకు సంబంధించినది. ౨. ధనుర్వేదము : యజుర్వేదమునకు చెందినది. దీనిలో యుద్ధవిద్య తెల్పబడినది. ౩. గంధర్వ వేదముసామవేదమునకు సంబంధించినది దీనియందు సంగీత విద్య గలదు. ౪. అర్థవేదము ఇది అథర్వవేదమునకు సంబంధించినది. ఇందు అర్థశాస్త్రము మొదలగునవి వివరింపబడినది. (మెకానిక్స్ ఎకనామిక్స్)

౨. శాఖలు : వేదములే కాక వేదములకు ౧౧౨౭ శాఖలున్నవి. ఇవి బ్రహ్మాది ఋషులు రచించిన వేదవ్యాఖ్యాన గ్రంథములు. ప్రస్తుతము వీనిలో కొన్ని మాత్రమే లభించుచున్నవి.

౩. బ్రాహ్మణములు : వీనికి దిగువన బ్రాహ్మణములున్నవి. బ్రహ్మ యనునది ఈశ్వరుని మరియు వేదము యొక్క పేరు. ఈ గ్రంథములలో వేదము మరియు ఈశ్వర సంబంధిత విషయ పరిశీలనముండుటవలన నీ గ్రంథములు బ్రాహ్మణములని పిలువ బడుచున్నవి. ఇక సనాతన ధర్మావలంబులగు బ్రాహ్మణులు వీనిని వేదముల భాగముగనే భావించుచున్నారు. కాని ఇది సరికాదు. వేదములు కేవలము సంహితా మాత్రములే (మంత్రభాగము). బ్రాహ్మణ గ్రంథములందు వేదము యొక్క వ్యాఖ్యానము. యజ్ఞాదులందు వీని వినియోగము తెల్పబడినది. బ్రాహ్మణములందు, విఖ్యాత పురుషుల చరిత్రలు కూడ లిఖింపబడినవి. అవి వేదభాగములు గావు. ప్రతిచోటను వేదమంత్రముల మొదటి భాగమును గూర్చి చర్చించబడినది. కావున యివి వ్యాఖ్యాన మాత్రములేగాని వేదములు గావని తెలియుచున్నది. ప్రతి వేదమునకెన్నియో బ్రాహ్మణములున్నవి. ముద్రితములైన కొన్నిమాత్రము ప్రస్తుతము లభించుచున్నవి. అవి దిగువ తెల్పబడినవి

ఋగ్వేద సంబంధిత బ్రాహ్మణ గ్రంథములు

౧. ఐతరేయ బ్రాహ్మణము.

౨. కౌషీతకీ బ్రాహ్మణము

యజుర్వేద సంబంధిత బ్రాహ్మణ గ్రంథములు

౧. శతపథ బ్రాహ్మణము

౨. తైత్తిరీయ బ్రాహ్మణము

సామవేద సంబంధిత బ్రాహ్మణ గ్రంథములు ౧. తాండ్య మహాబ్రాహ్మణము ౨. దైవదత్త బ్రాహ్మణము ౩. షడ్వింశ బ్రాహ్మణము. ౪. మంత్ర బ్రాహ్మణము ౫. జైమినీ ఉపనిషద్ బ్రాహ్మణము ౬. జైమినీ ఆర్షేయ బ్రాహ్మణము ౭. ఆర్షేయబ్రాహ్మణము ౮. సంహితోపనిషద్. ౯. వంశ బ్రాహ్మణము ౧౦. సామ విధానబ్రాహ్మణము.

అథర్వవేద సంబంధిత బ్రాహ్మణ గ్రంథము : ౧. గోపథ బ్రాహ్మణము.

౪. ఆరణ్యకములు : అరణ్యకమనగా అడవికి చెందినదని యర్థము. వనవాస మొనర్చు వానప్రస్థులచే లిఖించబడినవియో, లేక వనవాస సమయమందు పఠించ బడెడివియో యైనందువలన యీ గ్రంథములు అరణ్యకములైనవి. ఆత్మ మరియు పరమాత్మలకు చెందిన గూఢ విచారములతో నీ గ్రంథములు నిండియున్నవి. వీనికి బ్రాహ్మణ గ్రంథములతో సంబంధమున్నది. మరికొన్ని వీని భాగములై యున్నవి. బ్రాహ్మణములవలెనె ఆరణ్యకములలో చాల భాగము నేడు లభించుట లేదు. లభించెడి వానిని దిగువ వివరించనైనది.

ఋగ్వేదము యొక్క ఆరణ్యకములు :(౧) ఐతరేయారణ్యకము. (౨) శాంఖాయనారణ్యకము. యజుర్వేదము యొక్క ఆరణ్యకములు :౧) తైత్తిరీయారణ్యకము (౨) బృహదారణ్యకము.

**౫. ఉపనిషత్తులు :** 'ఉపనిషత్' శబ్దమునకు సమీపమున కూర్చుండుట యని అర్థము. అనగా గురు చరణ సన్నిధిని గూర్చుండి ఏ విద్యను బడయుదుమో అది ఉపనిషద్ అగును. అట్లయినచో ఉపనిషత్తులు శతాధికముగ నున్నవి. కాని పదునొకండు మాత్రమే ప్రసిద్ధములైనవి.

౧. ఈశ : ఇది యజుర్వేదము నందలి ౪౦వ అధ్యాయము. దీని పాఠము ఈశ శబ్దముతో ప్రారంభమగుచున్నది. కావున దీనికి ఈశోపనిషత్ అను పేరు పెట్టబడినది.

౨. కేన : కేన శబ్దముతో నారంభించబడినది. గావున దీని పేరు కేనోపనిషత్తు అయినది. దీని అసలు పేరు తల్వకార్. ఇది సామవేదము యొక్క ఉపనిషత్తు.

౩. కఠ : యజుర్వేదము యొక్క శాఖ కఠ . దీని కాధారము కావుననే నిది కఠోపనిషత్తయినది. ఇది కూడ యజుర్వేదము యొక్క ఉపనిషత్తే.

౪. ప్రశ్న : ఆరుగురు ఋషులు పిప్పలాది ఋషికడకేగి, అడిగిన ఆరు ప్రశ్నల వర్ణనము దీని యందున్న కారణమున దీని పేరు ప్రశ్నోపనిషత్తు అయినది. ఇది అథర్వవేదపు ఉపనిషత్తు.

౫. ముండక : ఒక మంగలి, సకల సంశయములను తుత్తునియలుగా ఖండించిన కారణమున దీని పేరు ముండక అయినది. ఇది అథర్వ వేదము యొక్క ఉపనిషత్తు.

౬. మాండూక్య : గ్రంథకర్త వలన దీనికీ పేరు వచ్చినది. అథర్వ వేదమునకు చెందినది.

౭. ఐతరేయ: దీనికి కూడ గ్రంథకర్త పేరే వచ్చినది. ఇది ఋగ్వేదముయొక్క ఉపనిషత్తు.

౮. తైత్తిరీయ : తిత్తిరి ఋషిచేత తిత్తిరీయ శాఖ రచింపబడెను. ఆ శాఖ నుండియే యీ గ్రంథము వెలువడినది. కావున దీనికి తైత్తిరీయమను పేరు పెట్టబడినది. దీనికి యజుర్వేదముతో సంబంధము గలదు.

౯. బృహదారణ్యక :ఇది ఆరణ్యకములలో గూడ చేరియున్నది. శతపథ బ్రాహ్మణము యొక్క చివరి అధ్యాయము. మరియు పెద్ద భాగము. కావుననే దీనికి బృహత్ (పెద్ద) పేరువచ్చినది. యజుర్వేదమునకు చెందినది.

౧౦. ఛాందోగ్య : ఛాందోగ్య బ్రాహ్మణుడు దీనిని వెలువరించెను. కావున నిది ఛాందోగ్యోపనిషత్తు అయినది.

౧౧. **శ్వేతాశ్వతరోపనిషద్.**

ఉపనిషత్తులు బ్రహ్మవిద్య యొక్క అద్వితీయ గ్రంథములు. విచారశీలురు, ఈశ్వర విశ్వాసులు దీనికి సంపూర్ణ ముగ్ధులైరి. ఔరంగజేబు అన్నయగు దారాశికోహ వీనిని ఫారసీ భాషలోని కనువాదము చేయించెను. ప్రపంచమందలి అనేక భాషలలోనికి యివి అనువదింపబడినవి. జర్మనీ యొక్క విఖ్యాత వేదాంతి శోపన్‌హార్ వీనిని తన జీవనస్మరణ సమయములందలి శాంతిప్రోతస్సులని పలికెను.

**౬. దర్శనములు :** దర్శనమనగా చూపించునది. బోధించునది యని అర్థము.

భిన్న భిన్న పదార్థముల యథార్థమును బోధించుననియు, ప్రాపంచిక సమస్యలను తెలియజెప్పుననియు నగు యీదర్శనములు మనకు సహాయకములగుచున్న కారణమున వీనికి దర్శనములను పేరు వచ్చినది. ఈ దర్శనములు పరస్పర వ్యతిరేకములని కొందరు అభిప్రాయపడుచున్నారు. కానిఅది పొరపాటు. వేదములు స్వతఃప్రమాణములని భావించుననియు, మోక్షమును తన లక్ష్యముగా నుంచుకొను నట్టివియునగు గ్రంథములు పరస్పర వ్యతిరేకములగుట అసంభవము. అవి యన్నియు తమ తమ దృష్టికోణముల నుండి సృష్టి మరియు జీవన సమస్యలను బోధించి, పరిష్కరించు యత్న మొనర్చినవి.

దర్శనములు ౬. అవి :

౧. వైశేషిక దర్శనము: దీనిని కణాదముని రచించెను. ఇందు విశేష పదార్థముల యొక్క నిరూపణ చేయబడినది. కావుననే దీనికి వైశేషిక నామ మిడబడినది.

౨. న్యాయ దర్శనము : దీనిని గౌతమముని రచించెను. ఇది తర్కమును ( లాజిక్) బోధించును. యుక్తి ద్వారా ఏవిషయమునైనను రూఢి పరచు విధాన మిందు తెల్పబడినది.

౩. సాంఖ్య దర్శనము : దీనిని కపిలముని రచించెను. ప్రకృతి - పురుషుల వివేచన మొనర్చి, వాని ప్రత్యేక స్వరూపమును, వాని పరస్పర సంబంధమును చూపి, ఆ దశ యొక్క వర్ణనము నీ దర్శనము చేయుచున్నది. పురుషుడు ప్రకృతి బంధనము నుండి ముక్తుడగుచున్నాడు.

౪. యోగదర్శనము : దీనిని పతంజలి ముని రచించెను. ఆత్మ- పరమాత్మల సాక్షాత్ దర్శన మొనర్పజేయుటే యీ దర్శనము యొక్క ఉద్దేశ్యము.

౫. ఉత్తర మీమాంస : (వేదాంతము) ఇది వ్యాసముని కృత దర్శనము . మానవుని యొక్క ముఖ్య లక్ష్యమగు పరమాత్మ ప్రాప్తిని చూపించుటే యీ దర్శనోద్దేశ్యము.

౬. పూర్వ మీమాంస : జైమినీ కృతమగు దీనిలో యజ్ఞముల విధానమున్నది.

౭. శ్రౌత : స్మృతి సూత్ర గ్రంథములు. వీనిలో శ్రుతి-స్మృతి విహిత యజ్ఞముల, సంస్కారముల విధానము లున్నవి.

౮. స్మృతి శాస్త్రము : వేదముల సార్వభౌమిక నియమముల నాధారమొనర్చు కొని ప్రతి కాలమందును తత్వ విదులగు రాజులు, మునులు, మునీశ్వరుల వర్ణాశ్రమ ధర్మముల వ్యాఖ్యానము, రాచరిక కృత్యముల వ్యవస్థ రూపమును యీ స్మృతి శాస్త్రమందున్నవి. స్మృతులన్నిటిలో మనుస్మృతి అధిక గౌరవమును పొందినది. కాని దీనిలో కూడ ప్రక్షిప్తములు, వేద విరుద్ధ విషయములున్నవి. అవి, అంగీకార యోగ్యములు కావు. ప్రస్తుతము మనకు లభించు స్మృతులలో నారద, దేవల, పరాశరములు అధిక ప్రసిద్ధములు.

## వేదము - వేదవిషయములు

సృష్టి నియమ శాస్త్రము : భూమియొక్క ప్రత్యేక భాగములనెరుగుటకు భూగోళము మరియు అట్లాస్ ( భూచిత్రపటము) యెంతయవసరములో, యటులనే సృష్టివిషయముల గ్రహించుటకు సృష్టి యను చిత్రపటము, వేదములను శాస్త్రములవసరములై యున్నవి. వేదములు సృష్టి నియమ శాస్త్రము లని గ్రహించవలెను.

సృష్టి నియమ శాస్త్రములో నదీ పర్వతాది విషయములేకాక జగత్తు మరియు ప్రాణుల నున్నతిగావించు నియమములుండవలయును. కేవలము జగత్సంబంధ విషయములేగాక జగత్తును సుఖశాంతిప్రదముగ నొనర్చు విధిజ్ఞానముకూడా దానిలోనుండవలయును. ఇట్టిది వేదముతప్ప మరొకటి లేదు. అందుచే జగదారంభమున వేదముండవలసిన యావశ్యకత యెంతయోకలదు.

డాక్టరు వాలెస్ ఒకచోట నిటుల వ్రాసియున్నాడు. జగద్వ్యవస్థ నియమములు మరియు జగత్కార్య విధాన నియమములను వేదఋషులు తెలిపియున్నారు. అట్టి నియమములు జగదుత్పత్తికి పూర్వమే యవసరమై యున్నవని వారు గ్రహించిరి.

(కాస్మోంజి ఆఫ్ ది ఋగ్వేద, హెచ్. డబ్లు. వాలెస్)

వేదములద్వారా యీ నియమములు ప్రకటింప బడినవని డాక్టరు వాలెస్ గారి యభిప్రాయము. అందుచే వేదములు జగదారంభములో నుండుట అత్యావశ్యకమని పైన చెప్ప బడినది.

మరొక విద్వాంసుడు క్రింది విధముగా తెలిపియున్నాడు. ఈశ్వరీయకృత గ్రంథములు రెండు౧. ప్రాకృతిక నియమ రూప గ్రంథము ౨. సృష్టిమూలోగల్గు ప్రాకృతిక నియమములు, జగన్నిర్మాతయొక్క జ్ఞానము బలము మరియు దయ బ్రహ్మాండములోని ప్రతిపదార్థమున స్వర్ణాక్షరములతో సంకేతమై యున్నవి. (టిండ్ కేటక్ ౧౦ ౪ ౧౯౦౬, పేజి ౫)

మరొక యిరువురి యభిప్రాయముల నెఱుగుట అవసరమై యున్నది. అందు మొదటిది ఫ్లింట్ మహాశయుని యభిప్రాయము . అతడిటుల వ్రాసియున్నాడు. ప్రకృతినియమములు, జగద్రచనా కార్యములు మరియు దైవకటాక్షము, ముక్తికవసరములగు నీశ్వరజ్ఞానేచ్ఛాదుల ప్రకటించుటకు సరిపోవు గంభీర పరిశోధనలు, మేధాశక్తి సాధించుకార్యములు, ఈశ్వరీయ జ్ఞానసహాయమునే నెరవేరగలవు. (థీఇజమ్, ఆర్ ఫ్లింట్, పేజి. ౩౦౨,౩౧౦)

ఇక రెండవ యభిప్రాయము - జర్మను దేశీయ ప్రసిద్ధదార్శనికుడగు కాంటు మహాశయునిది. అతడిటుల వ్రాసియున్నాడు. ఈశ్వర ప్రదత్త జ్ఞానము మొదట లభించినందువల్లనే లోకములో నియమాచార వ్యవహారములలో పవిత్రత మరియు తార్కిక జ్ఞానములో పరిపూర్ణత గలిగినది. అటుల నది ప్రాప్తించనిచో నెనియు నటుల కాజాలదను విషయము అంగీకరించదగినదే.

ఇట్టి కారణములుండుటచేతనే, వేదములు అపౌరుషేయములని భారతీయులు ప్రాచీనకాలమునుండి నేటివరకంగీకరించుచున్నారు.

ఫిలప్ అను మహాశయుడు టీచింగ్ ఆఫ్ వేదాస్ అను పుస్తకములో ౨౩౪ వ పుటయందిటుల వ్రాసినాడు. వేదానుయాయులగు నార్యుల యున్నతాభిప్రాయములకు కేంద్ర మాదిమ యీశ్వరీయజ్ఞానమే. డాక్టరు ఫ్లేమింగ్ గూడా యీశ్వరీయజ్ఞానప్రాప్తి సిద్ధాంతము సమర్థించి యున్నాడు.

If we are to obtain more solid assurances it cannot come to the mind of man graphing feebly in the dim light of unassisted reason. But only by a communication made directly from this Supreme Mind to the finite mind of man (Science and Religion - by Seven Men of Science, Lecture by Dr. Flaming).

జడవాదియగు హైకెల్ కూడా ఇల్హామ్ ఈశ్వరీయజ్ఞానము యొక్క సంభావమంగీకరించినాడు. అతడిటుల వ్రాసినాడు. ఈశ్వరుని సత్తానంగీకరించినచో, నీశ్వరుని ద్వారా జ్ఞానప్రాప్తి జరుగుననుట యెట్టి విజ్ఞాన విరుద్ధ విషయముగుండజాలదు. అతని వాక్యములివి :

They may or may not receive such information but there is no Scientific ground for dogmatism on the subject nor any reason for asserting the inconceivability of such a thing. (T.O. Mazing, quoted in the Materialism by Dorah Dinah Ranga P.52)

అమెరికా నివాసియగు థామస్ పేన్ యను ప్రసిద్ధ విద్వాంసుడు బైబిల్ ఈశ్వరదత్త

జ్ఞానముకాదని ఖండించియున్నాడు. బైబిల్ యొక్క లేఖకులు దానినెటుల సంకలనము చేయవలెనో యెరుగలేకపోయిరని యతడు ఋజువు పరచినాడు. ఇల్హామ్ (ఈశ్వరీయదత్తజ్ఞానము) ను గుఱించి యాతడు చూపిన యుక్తులు వేదముల విషయములో చక్కగా సరిపడును. అతని యభిప్రాయ మీక్రింద నివ్వబడుచున్నది.

Revelation is a communication of some thing hick the person to whom the thing is revealed, did not know before. For if I have done a thing or seen it done, it needs no revelation to tell me. I have done it or seen it nor enable me to tell it or to write it. Revelation therefore cannot be applied to any thing done upon earth of which man is himself actor or the witness and consonantly all the historical part of the Bible which is almost the whole of it is not within the meaning and compass of the work revelation and therefore is not the work of the God. (Age of Reason . P. 10-11)

పై వాక్యములలో మానవ చరిత్ర లేనిదే యీశ్వరీయజ్ఞానమని స్పష్టముగా చెప్పబడియున్నది. అందుచే వేదములే యీశ్వరీయజ్ఞానమని నిర్ధారణ కాగలదు ఏలనన వానిలో నితిహాసాదులు లేవు.

## వేదములెట్లు పుట్టినవి?

ఋగ్వేదములో వేదోత్పత్తిని గుఱించి యిటుల వర్ణింపబడి యున్నది.

**బృహస్పతే ప్రథమంవాచో అగ్రం యత్ప్రైరత నామ ధేయం దధానాః ।**
**యదేషాం శ్రేష్ఠం యదరిప్రమాసీత్ ప్రేణాతదేషాం నిహితం గుహావిః ॥**

(ఋ. ౧౦-౭౧-౧)

ఈశ్వరుడు వేదవాణికి స్వామి. ఆ వాణి దివ్యఋషుల హృదయములలో నుత్పన్నమగును. ఆ వాణిని ఋషులు తమ హృదయములనుండి బహిర్గతమొనర్చి దానితో వస్తువులకు నామములనొసంగి, యుచ్చరింతురు.

ఈ మంత్రములో జ్ఞానములభించు క్రమమున్నది. జ్ఞానము వాణి (భాష) ద్వారా ఋషుల హృదయములలో ప్రకటితమగును. జ్ఞానగ్రాహకులగు నాదిమదివ్యఋషులు దానిని లోకమున వ్యాపింపజేతురు. మన మీకార్యక్రమము నంతఃకరణముయొక్క ప్రేరణగా దలంచగలుగుదుము. మానవుడు సత్కార్యముల జేయదలంచినపుడాతని సంకల్పముచే, హృదయమందుత్సాహ సంతోషములు జనించును. దుష్కార్యముల జేయబూనినపుడాతనిలో అనుమాన భయాదులు గలుగును. ఈ ద్వివిధములగు కార్యములలో నుత్సాహ నిరుత్సాహాదులు గల్గినపుడు వానిని హృదయముతోనే మానవుడు గ్రహింపగలడు. వాగ్శ్రవణేంద్రియములకట పనియుండదు. అంతఃకరణ ప్రేరణ వల్లనే ఇది జరుగును. ఈశ్వరీయజ్ఞానము కూడ అంతః

కరణ ప్రేరణవల్లనే దైవ్యఋషుల హృదయములలో గల్గును. తమ హృదయములతోనే ఋషులు దానిని గ్రహింపగలుగుదురు.

ఋషి దయానందుడంతఃకరణ ప్రేరణను ఈశ్వర ప్రేరణగా నంగీకరించియున్నాడు. పైథాగరస్ కూడా నిటులనే భావించినాడు.

But there is a voice of Conscience within us the utterence of Divine law independent of human status and traditions, self evident, irrefrigable. (Science of Language of Max Mullar Vol. II, Page 396)

### 1. ఎపి క్యురస్ అభిప్రాయము :

గ్రీకు దార్శనికుడగు ఎపిక్యురస్ జ్ఞాన ప్రాప్తి విధానమును గురించి యిట్లు వ్రాసినాడు. ఈశ్వర ప్రేరణచే మానవుడు మొదట తనకు తెలియకనే భాషాప్రయోగము గావించినాడు. నిదురలో కలవరించినటుల, నిరుద్దేశ్యముగా దగ్గుట, తుమ్ముట లేక హా యను విచారసూచక శబ్దములు ప్రకటించినట్లుగా, మానవునినుండి భాషవెడలెను. (Materialism, byD.D. Thanga - P 52)

### 2. ఉపనిషత్తుల యభిప్రాయము :

బృహదారణ్యకోపనిషత్తులో నిట్లున్నది.

**అస్య మహతోర్భూతస్య నిశ్వసితమేతద్ ఋగ్వేదః॥**

ఆ మహాభూతుండగు పరమేశ్వరుని నిశ్వాసమునుండియే ఈ ఋగ్వేదము వెడలినది.

### 3. మాధవాచార్యుల యభిప్రాయము :

మాధవాచార్యులు పరమేశ్వరున కిటుల వందనమాచరించినారు.

**యస్య నిశ్వసితం వేదా యో వేదేభ్యోఽఖిలం జగత్।**
**నిర్మమే తమహం వందే విద్యాతీర్థం మహేశ్వరమ్॥**

సమస్త విద్యలకు నిధియగు పరమేశ్వరునకు నేను నమస్కరించుచున్నాడు. అతని నిశ్వాసమునుండియే వేదములు వెడలినవి. మఱియు వేదములతో నాతడు సమస్త జగత్సృష్టి గావించినాడు.

### ౪. శంకరాచార్యుల అభిప్రాయము : 'అత ఏవ చ నిత్యత్వం'

అను వేదాంత సూత్రము నకు భాష్యమువ్రాయుచు శంకరాచార్యులిట్లు తెలిపియున్నారు. **అతశ్చాతీతకల్పానుష్ఠిత ప్రకృష్టజ్ఞానకర్మణా మీశ్వరాణాం హిరణ్యగర్భాదీనాం వర్తమానకల్పాదౌ ప్రాదుర్భవతాం పరమేశ్వరానుగృహీతానామ్ సుప్తప్రబుద్ధవత్ కల్పాంతర వ్యవహారానుసంధానోపపత్తిః**

జగదారంభమున వేదములుత్పన్నమైనవని శంకరాచార్యుల యభిప్రాయము. పై

సూత్రభాష్యమున నాలుడిదే యభిప్రాయమును ప్రకటించినాడు. సూత్రములో వేదమునిత్యమైనదని ప్రతిపాదింపబడినది. వేదమీశ్వరీయజ్ఞానమగుటచే తప్పక యదియునిత్యమైనదే. వేదములీశ్వరీయజ్ఞానమని తలంచినను మానవాభ్యుదయ నిశ్శ్రేయససిద్ధికై కావలసిన జ్ఞానము మాత్రమే ఈ వేదమని గ్రహించవలెను. ఇక ఈశ్వరీయజ్ఞానమనినచో నది యనంతమైనది.

**వేదజ్ఞానము - భాష :**

జ్ఞాన ప్రాప్తిగలుగు విధమెటింగినపిమ్మట, జ్ఞానము భాషతో పాటు లభించినదను విషయ మెఱుగుటవసరమైయున్నది. భాష లేక విషయమర్థము కాజాలదు. శబ్ద జాలము లేకుండ యేనైమిత్తిక జ్ఞానమైనను ప్రకటింపబడజాలదు. అందువలనే మహాఋషి పతంజలి జైమిని మొదలగు తత్వవేత్తలు శబ్దమునిత్యమైనదని తెలిపియున్నారు. ప్లేటో కూడా దీనిని సమర్థించినాడు. పైథాగరస్, ప్లేటో మొదలగువారి యభిప్రాయముల ననుసరించి భాషాజ్ఞానములవిభాజ్యములని, మాక్సుముల్లరు ఋజువుపరచినాడు. ఈయవిభాజ్యతా సిద్ధాంతము భాషావిజ్ఞానమునకు పునాది వంటిదని యతడు తెలిపినాడు. భావములేకుండా శబ్దముండనపుడు శబ్దములేక భావముకూడ యుండదనియంగీకరించుటలో వెనుకముందాడవలసిన పనిలేదని యతని యభిప్రాయము. భావము మఱియు భాష యొకేనాణెముయొక్క రెండుప్రక్కలు. భావమునుండి భాషను, భాషనుండి భావమును వేరుజేయజాలము. శబ్దమువీడి యర్థము, యర్థమునువీడి శబ్దముండుటసంభవము. షేలింగ్ యను విద్వాంసుడు కూడా దీనిని సమర్థించినాడు.

**Without language, says Schooling, it is impossible to conceive philosophical, may even any human consciousness (Scnence of Language by Max Muller Page. 98)**

మనము శబ్దములతోనే భావములను ప్రకటించెదమని హేగల్ చెప్పియున్నాడు(We think in names) అథర్వణవేదములో "దేవస్య పశ్య కావ్యం న మమార న జీర్యతి" యను ప్రసిద్ధ వాక్యము గలదు. ఇందు వేదమును కావ్యమని చెప్పబడియున్నది. 'కు-శబ్దే' యను ధాతువునుండి 'కావ్యము', 'కవి' యనీ శబ్దములుత్పన్నమగును. కావ్యమనగా శబ్దమయ జ్ఞానమని యర్థము. వేదము పరమేశ్వరునిచే నివ్వబడిన శబ్దమయజ్ఞానము. ఈశ్వరుడు కేవలము జ్ఞానమునేయొసంగినాడు. మఱియు ఋషులు తమశబ్దము లలో దానిని ప్రకటించినారను యభిప్రాయముకూడా నిరాధారమని పై మంత్రభాగముచేలన స్పష్టమగుచున్నది. వేద ప్రకటనకు పూర్వము భాషలేకుండెను. ప్రపంచములో వేదభాషయే యతి ప్రాచీనతమభాష.

వేదభాషకు పూర్వము మరే భాషయు లేదు.

వేదభాషకు పూర్వము మరొక భాష, భూమండలముపై నున్నట్లు కనిపించుటలేదు. మాక్సుముల్లరు తన భాషావిజ్ఞానగ్రంథములో నీ విషయమంగీకరించియు, వైదికభాషను సమస్తభాషలకు జననిగా తలంచక, అగ్రసోదరియని వ్రాసినాడు. భాషలకు జననియగు మూలభాషయేదియో తెలుపజాలకపోయిను. కొందరు భాషాశాస్త్రజ్ఞులు, వైదిక భాషకంటె పూర్వమేదో యొక భాషయుండి యుండునని యూహించుచున్నారు. వారు యిట్లు చెప్పుచున్నారు.

'వింశతి' యను సంస్కృత శబ్దము ప్రయోగాధిక్యతచే 'బీస్' యని హిందీలో మారినది. అదేవిధముగా 'ద్వదశతి' యను శబ్దమే ప్రయోగాధిక్యతచే 'వింశతి' యని యేర్పడినది. వైదిక భాషకంటె పూర్వమున్న యొకానొక కల్పితభాషలో నీ 'బీస్' శబ్దమునకు ద్వదశతి ప్రయోగింపబడుచుండెడిదని గ్రహించవలెను.

ఇది వారభిప్రాయముకాని యీ ద్వదశతి యను శబ్దము కూడా వైదికభాషదేయని వీరు గ్రహింపలేక పోవుచున్నారు. అది వేరొకభాషదని సూచించుట మిక్కిలి యనుచితము. భూమండలమునగల యతి ప్రాచీన తమ భాష వైదికభాషయేయని ఋజువగు చున్నది. దీనికన్న పూర్వము మరొకభాషయున్న జాడకనిపించుటలేదు. కనిపించుననుటయును నసంభవమే.

**భాషోత్పత్తి :** భాష ఈశ్వరదత్తముకాదని భావించువారు మానవుల వ్యవహారములవలన నది వ్యయముగా నుత్పన్నమైనదని చెప్పుదురు. లాక్ అను నతడీవాదము నంగీకరించువారిలో నొకడు ఆడమ్స్మిత్ యను నతడు దీనిని సమర్థించినాడు. ఈ వాదమును Theory of Convention అందురు. దీనిఅభిప్రాయమిది.

౧. ప్రారంభమున మానవులు మూగవారు. శిరాద్యవయవములతో సంకేతము లొనర్చువారు. వేలి సైగలు, మూతివిరుపులు మొదలగునవి యట్టిసంకేతములలో ముఖ్యములు. పిమ్మట పరస్పరాభిప్రాయములతో గొన్ని చిహ్నములు గల్పించుకొని వానికర్థముల నిర్ణయించుకొన్నారు. ఇటుల భాషయేర్పడినది.

ఈ వాదములో గొప్పదోషమున్నది. శబ్దము అర్థములేని ప్రాచీనకాలమున, నేభాషలో నాదిమమానవులు మాట్లాడుకొనిరి? భాషయేలేనపుడు భావప్రకటన యెట్లు సాధ్యమగును ? (సంకేతముల తెలియజేయుటకు కూడా భావవినిమయము కావలెను . ఈ సంకేతమున కీభావమేయని వారెట్లు దేనితో నిర్ణయించుకొనిరి.?) ఆదిమ మానవులు మూగవారేయైన, వారేభాషను కూడా మాట్లాడజాలరు. ఈసిద్ధాంతములో నీ దోషము కలదు.

౨. మఱొకవాదమున్నది అందిట్లు కలదు : ఆదిమమానవుడు మాట్లాడనారంభించినపుడు

తన సమీపములోనున్న ప్రాణుల ధ్వనులననుకరించినాడు. తాననుకరించిన జంతువుల ధ్వనిననుసరించి వానికాధ్వనులచే పేర్లుగా బెట్టినాడు. అట్టిధ్వనులలో మాట్లాడుటవలన భాషయేర్పడినది.

పశు పక్షుల ధ్వనులు సార్థక శబ్దములు కాజాలవు. అందుచే భాషోత్పత్తి కీవాదము చెప్పుపద్ధతి సరియైనదికాదు. ఇట్టి ధ్వనిప్రాయమైన భాష ప్రపంచములో ప్రచలితమై యున్నదనుట లేదు. పశు పక్ష్యాదుల యొక్క వుంటి లోలిన భాషయున్నదనుట కెట్టి యాధారము లేదు.

3. మానసిక భావములప్రకటించునావేశముచే ముఖమునుండి హఠాత్తుగా శబ్దములు వెడలునని మరొకవాదము చెప్పుచున్నది. ఓహో, మ్యో, ఛీ, హీ, హా యను నట్టివే శబ్దములుగా నేర్పడెనని కొందఱు చెప్పుచున్నారు. కాని ఇట్టిశబ్దములు భాషలో నెన్నియున్నవి? వీనితోనే భాషయేర్పడినదనుట పరిహాసాస్పదము.

౪. భౌ వౌ వాదము వాల్గవది. ఇదియును మూడవ వాదము వంటిదే.

ఇట్టివే మరికొన్ని వాదములు భాషోత్పత్తిని నిర్ణయించుటకు కల్పించినారు. ఇవన్నియు నిరాధారములగుకల్పనలే. భాషోత్పత్తి యను క్లిష్టసమస్యను పరిష్కరించుట కీకల్పితవాదముల నాధారముగా జేసికొనుట మృగతృష్ణలో దప్పిచల్లార్చుకొనుటవంటిదే. ఈ కల్పన లన్నియు నిస్సారములైనవి. జ్ఞానము వలెనే భాషకూడా యీశ్వర దత్తమని గ్రహింపవలెను.

ఋగ్వేదములో నిది స్పష్టముగా తెలుపబడినది.

**యజ్ఞేనవాచః పదవీయమాయంతా మన్వవిందన్నృషిషు ప్రవిష్టాం।**

**తామాభృత్యావ్యదధుః పురుత్రాతాంసప్త రేభా అభిసంనవంతే॥**

ఋ.౧౦ - ౭౧-౩

(యజ్ఞేన) యజ్ఞపురుషుడగు పరమాత్మనుండి, (వాచః, పదవీయ) వాణితో పొందనగు జ్ఞానమును (ఆయన్) పొందుదురు (ఋషిషు) వేదములను గ్రహించిన ఋషులయందు (ప్రవిష్టాం- తాం) ప్రవేశించిన వేదవాణిని (అన్వవిందన్) పొందెదము అనగా ఋషులవలన నితర మానవులాభాషను పొందెదరు. (తాం) భాషను (ఆభృత్య) పొంది (పురుత్రా) అనేకులలో వారు దానిని (వ్యదధుః) వ్యాపింపచేయుదురు. (తాం) ఆ భాషను (రేభా) శబ్దమయమగు గాయత్ర్యాది సప్తఛందస్సులతో (అభిసంనవంతే) పొందుదురు.

ఈ మంత్రములోని భావము స్పష్టముగా నున్నది. వేదగ్రాహకులగు ఋషులు వేద జ్ఞానముతో పాటు భాషను కూడా పరమేశ్వరునుండియే పొందుదురు. వారినుండి యితరులు భాషను నేర్చి దేశ దేశాంతరములందును, ద్వీపద్వీపాంతరములందును దాని ప్రచారము గావింతురు.

## వేదములు నిత్యములు :

ఋగ్వేదములో నిట్లున్నది :

**తస్మై నూనమభిద్యవే వాచా విరూపనిత్యయా।**

**వృష్ణే చోదస్వ సుష్టుతిమ్॥** (ఋ. ౮-౭౫-౬)

వేదము లీశ్వరీయ వాక్యములనియు నిత్యములనియు నీమంత్రములో కలదు. వేదాంత దర్శనములో "అత ఏవచ నిత్యత్వం" (వేదాం-౧-౩-౨౯) యను సూత్రములో కూడ నీ యభిప్రాయము సమర్థింపబడియున్నది. మహాభారతములో నిదేవిషయమున్నది.

**అనాదినిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయం భువా।**

**ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః॥** (మహాభార. ౧౨-౨౩౩-౨౪)

సృష్ట్యారంభమున స్వయంభువుడగు పరమాత్మనుండి వేదవాణి బయల్వెడినది. అది దివ్యము. నాశరహితము, నిత్యము మఱియు నాద్యంతములు లేనిది. ఆ వేదవాణివలన జగత్తులో సమస్త ప్రవృత్తులేర్పడినవి.

మరొకచోట నిట్లుల కలదు : **స్వయంభు దేవభగవన్ వేదో గీతస్త్వయా పురా॥**

**శివాద్యా ఋషిపర్యంతాః స్మర్తారోఽస్యనకారకాః॥**

ఓ స్వయంభువగు భగవాన్! పురాతనకాలమున వేదము నీ నుండియే పాడబడినది. శివుడు మొదలుగాగల ఋషులెల్లరు దానిని స్మరించువారలే. వారు దాని కర్తలుకారు.

కుల్లూకభట్టు కూడ దీని నిట్లుబలపఱచినాడు :

**ప్రళయకాలేఽపి సూక్ష్మరూపేణ పరమాత్మని వేదరాశిః స్థితః॥**

ప్రళయకాలములోను వేదము సూక్ష్మరూపమున నీశ్వరుని యందుండెను.

**మేధాతిథి యిట్లు వ్రాసినాడు : నైవ వేదాః ప్రలీయంతే మహాప్రళయేఽపి॥**

మహా ప్రళయములో కూడ వేదములు నశించవు.

భగవద్గీత దీనిని సమర్థించుచున్నది.

**కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవం॥** (గీ. ౩-౧౫)

కర్మ బ్రహ్మ (వేదము) నుండి జనించినది. మఱియు వేదము బ్రహ్మ నాశరహితుడగు నీశ్వరునుండి యుత్పన్నమైనది.

**సాంఖ్య దర్శనము** - వేదము కపిల మహాముని సాంఖ్య దర్శనములో ననేక సూత్రములందు వేదముల నిత్యత్వమునుగూర్చి ప్రసంగించినాడు. **సనిత్యత్వం వేదానాం కార్యత్వశ్రుతేః** (సాం. ౫-౪౫).

వేదముల కార్యత్వము వినుచున్నాము. కావున నవి నిత్యములుకావు. **తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే** (య. ౩౧-౭) ఈ వేదమంత్రమున వేద మీశ్వరునినుండి జనించినట్లు చెప్పబడియున్నది. జనించినది నిత్యమైనదికాజాలదు. అందువలన వేదముకూడ నిత్యమైనదికాదని పూర్వపక్షము వాదన.

సాంఖ్యకారుని యభిప్రాయమీవిషయమునవెట్లుగలదో గ్రహించవలెను. వేదముయొక్క అనిత్యత్వమును ప్రతిపాదించుటకై యవి పౌరుషేయము లని స్వాభావికముగా ప్రశ్నకలుగును. ఈ ప్రశ్న తిరస్కరించుచు దర్శనకారుడిట్లు ప్రత్యుత్తర మొసగు చున్నాడు.

**న పౌరుషేయత్వం తత్కర్తుః పురుషస్యాఽభావాత్ ॥** (౫-౪౬)

ఈ వేదములకు కర్తయగు పురుషుడెవ్వడు లేనందున నవి పౌరుషేయములు కావు.

వేదముల రచించినవారిని జనులు మఱచినారను మాహచేనివి పురుషకృతములని తలంతురేమోయని సమాధాన మిట్లు నిచ్చుచున్నాడు.

**ముక్తాఽముక్తయోరయోగ్యత్వాత్ ॥** (౫-౪౭)

ముక్తాత్మలకు మరియు నముక్తులకు (బద్ధులకు) వేదములు రచించు యోగ్యత లేనందున (వేదములు పౌరుషేయములు కావు.)

ఈ సూత్రమున కపిలాచార్యుడు ముక్తాత్మలకు మఱియు బద్ధులగు సమస్తమానవులకు వేదరచనాచేయు యోగ్యతలేదని తెలిపి యవి యపౌరుషేయములని ఋజువు పరచినాడు.

మరికొన్ని సూత్రములందిట్లు, వేదముల ప్రామాణ్యమునకు వేరొక ప్రమాణ మవసరమా? యను ప్రశ్నకు సమాధానమొసగుచు నిట్లు వ్రాసియున్నాడు.

**నిజ శక్త్యభివ్యక్తేః స్వతః ప్రామాణ్యం ॥** (సాం. ౫-౫౧)

తమ నిజ(స్వాభావిక) శక్తినుండి ప్రకటమగుటచే వేదములకు స్వతః ప్రామాణ్యముకలదు.

వేదములకు స్వతః ప్రామాణ్యము నంగీకరించునవి మానవరచనలు కావని పై సూత్రములద్వారా సాంఖ్యకారుడు స్పష్ట మొనర్చినాడు. వేదము లుత్పన్నములైనవని చెప్పబడుటచే నవి యనిత్యములగునని తెలిపినాడు. ఉత్పన్నమైన సృష్టి యీ రూపములో నిత్యముగానుండజాలదు. కారణ ప్రకృతి నిత్యమైనది. ఈ సృష్టి కూడా ప్రవాహరూపములో నిత్యమైనదే. సాంఖ్యదర్శనము కేవలము ప్రకృతియొక్క విస్తారమును, కారణత్వమును మఱియు దాని నిత్యత్వమును చాటుటకే రచింపబడినది. ప్రాకృతికమగు కారణ ప్రకృతి వికృతావస్థనుగాంచి కార్యరూపమును జెందినటుల వేదోత్పత్తి జరుగదు.

పరమేశ్వరుని దివ్యజ్ఞాన మాతని ప్రేరణచే ప్రతి సృష్ట్యారంభములో, దేవ్యఋషుల హృదయమున ప్రకటింపబడుటయే వేదోత్పత్తి యనెదరు. దేవ్యఋషులు దానిని లోకమున ప్రసరింప జేయుదురు. అభావమునుండి భావము పుట్టజాలదు. కారణము వికృతమై కార్యరూపమున పరివర్తన జెందుట యుత్పత్తియనబడదు. అందువలన ౪౫ వ సూత్రములో చెప్పబడిన వేదముల కార్యత్వము వినబడుటచే వేదము అనిత్యము కాజాలదు. ఈ క్రింది హేతువులద్వారా యీ విషయమింకను పరిపుష్టమగును.

౧. **"యథా పూర్వ మకల్పయత్"** అను నియమపూర్వకముగా ననాదికాలమునుండి, ప్రతి సృష్ట్యారంభమున వేదము ప్రకటమగు చున్నది. పైన చెప్పిన విధముగా సృష్టిప్రవాహముతోపాటు నిది కూడా నిత్యమైనదే. అందుచే వేదములు నిత్యములని యంగీకరించుటవసరము.

౨. వేద మీశ్వరీయజ్ఞానము. ఈశ్వరుడు నిత్యుడు. అతని జ్ఞానము, క్రియలు మఱియు శక్తి మొదలగునవన్నియు స్వాభావికములైనవి. అందుచే వేదములనిత్యత్వము నంగీకరించుటవసరము.

3. ఈశ్వరుడు, మఱియు ప్రకృతివలెనే జీవుడు కూడ నిత్యుడు. అందువలన నాతని కళ్యాణార్థ మొసంగబడిన (వేద) జ్ఞానము కూడా తప్పక నిత్యమైనదేయగును.

పుస్తకరూపములో వేదము అనిత్యములనియే సాంఖ్య కారుని యభిప్రాయము. పుస్తకరూపములో నుండునది నిత్యమని యెవ్వరంగీకరింపజాలరు. పుస్తకములోనున్న శబ్దమయజ్ఞాన మనిత్యమని సాంఖ్యకారుని యభిప్రాయమునుకాదు. వేదముల స్వతః ప్రామాణ్యమును మఱియు అపౌరుషేయత్వము నాతడంగీకరించియే యున్నాడు.

**వేదములు నిత్యములగుచో వానిలో ఋషులనామములేందుకు?**

౧. భారతీయులు మఱియు విదేశీయులునగు విద్వాంసులువేదములలోగల జమదగ్ని, వసిష్ఠాది శబ్దములగాంచి, ఋషుల నామములతో వేదములనిత్యములని తలంచుచున్నారు. మహర్షి జైమిని ఈ క్రిందిసూత్రముద్వారా దీనికి సమాధానమొసంగినాడు.

**"ఆఖ్యా ప్రవచనాత్"** (పూ. మీమాంస ౧-౧-౩౦)

**'పరంతు శ్రుతి సామాన్యమాత్రం'** (పూ. మీ. ౧-౧-౩౧)

వేదములో జమదగ్ని మొదలగు శబ్దములు సామాన్య (యౌగిక) శబ్దములుగా ప్రయుక్తములైనవి. పిమ్మట వానిని జనులు తమ పేర్లుగా పెట్టుకొన్నారు.

**౨. శతపథ బ్రాహ్మణములో జమదగ్న్యాది శబ్దములు :**

వేదములోనున్న జమదగ్ని మొదలగు శబ్దములకు శతపథ బ్రాహ్మణములో నిట్లర్థము తెలుపబడినది.

జమదగ్ని = కన్ను
(శత ౮-౧-౨-౩)
భారద్వాజ = మనస్సు
(శత ౮-౧-౧-౯)
వసిష్ఠ = ప్రాణము
(శత ౮-౧-౧-౬)
విశ్వామిత్ర = చెవి
(శత ౮-౧-౨-౬)
విశ్వకర్మ = వాక్కు
(శత ౮-౧-౨-౯)

ఇదే విధముగా శునశ్శేప శబ్దమునకర్థము విద్వాంసుడని నిరుక్తములో గలదు (నిరు. (౩-౨)

౩. ఐతరేయారణ్యకములో ననేక నామముల కర్థము ఇట్లుల చెప్పబడినది.

గృత్సమద: గృత్సమనగా ప్రాణము. మద అనగా అపానము అందువలన ప్రాణాపానములను గృత్సమద మందురు.

విశ్వామిత్ర: సమస్తేంద్రియములు ప్రాణముల నాశ్రయించి యుండును. అందుచే ప్రాణమునకే విశ్వామిత్రయని యర్థము.

వామదేవ : ఇంద్రియము లన్నింటిలో ప్రాణము వందనీయమైనది. ఆకారణమున దానిని వామదేవమందురు.

అత్రి : ప్రాణము (నిష్క్రమమైనదగుటచే) పాపములనుండి కాపాడును. అందుచే నదియత్రి యనబడును.

భారద్వాజ : వాజ = ప్రజలను (ఇంద్రియములు) భరించి పోషించుటచే ప్రాణము భారద్వాజమనబడును.

వసిష్ఠ : ఇంద్రియములను కప్పునదగుటచే ప్రాణమే వసిష్ఠుడు.

అగాధ: ప్రాణము శరీరమందంతట ప్రగతమగును. (చేరును) అందుచే దానిని అగాధ మందురు.

పావమానీ : సమస్తేంద్రియముల శుద్ధమొనర్చునది ప్రాణము. ఆకారణమున దానిని పావమానీ యందురు.

౪. ఇట్లుల బ్రాహ్మణ, ఆరణ్యక ఉపనిషదాదిగ్రంథములలో వేదములందుగల శబ్దముల కర్థములు తెలుపబడియున్నవి. నిరుక్తము, పూర్వమీమాంస, శతపథాది గ్రంథముల ప్రగాఢముగా నధ్యయనమొనర్చి, వాని శైలి వేదముల నర్థము గావించునదనియు వేదములలో ప్రయుక్తములైన శబ్దములు యౌగికములే కాని, రూఢిపదములు కావనియు, మఱియు వేదములలో నితిహాసము లేదనియు ఋషి దయానందుడు తెలిపియున్నాడు మాక్సుమూలరుకూడ ఋషి దయానందుల యభిప్రాయానుకూలముగా మఱియు పాశ్చాత్యుల వాదమునకు విరుద్ధముగా, వేదములలోగల్గు శబ్దములు ఋషులపేర్లు గావని తెలిపియున్నాడు.

౫. సాయణాదులుగావించిన యర్థములు గ్రహించక, వైదిక ఋషులహృదయములలోనున్న యర్థముల వెదకుటయే వేదార్థముగావించు యుద్దేశ్యమని రాథ్ తన ప్రసిద్ధనిఘంటువుయొక్క ప్రథమభాగములో, ప్రారంభమున (పే. ౪-౬) తెలిపియున్నాడు.

సాయణాదులు తమకాలమునలోగల యభిప్రాయముల ప్రతిబింబములనే వేదములందుగాంచిరి. సత్యమైన వేదార్థమును చిరకాలమునుండి పండితులు మఱచిపోయినారు. తమతమ కాలములలోగల యభిప్రాయములనే, వారు వేదముల కర్థము వ్రాయునప్పుడు తెలిపియున్నారు. గోల్డ్‌స్టూకర్ అనునతడు రాథ్ ప్రకటించిన యభిప్రాయమున కసమ్మతి తెలిపెను. కాని హ్విట్నీ (on the translation of the vedas, by Whitney) లో మరియు మ్యూర్ అనునతడు, on the interpretation of the Veda by J. Muir లోను, వీబర్ అనునతడు Indian Wisdom, అను గ్రంథములోను రాథ్ యొక్క యభిప్రాయముల స్వీకరించుయున్నారు.

## వేదములు - పాశ్చాత్య విద్వాంసులు :

సామాన్యముగా పాశ్చాత్య విద్వాంసులెల్లరును, వైదిక సాహిత్యము మఱియు వేదములయెడ నన్యాయము గావించినారు. ఏకొందరో విద్వాంసులు కొన్నివిషయములందు సదభిప్రాయమొసంగినను, మొత్తముమీద వారుకూడా నన్యాయముగావించినవారిలో లెక్కయే. ఉదాహరణకు కొందరు పాశ్చాత్యుల చమత్కార బుద్ధుల దిగ్దర్శన గావింపబడుచున్నది.

౧. డ్యూసన్ : భారతదేశములో దర్శనశాస్త్ర వికాసమును గుఱించి తెలుపుచు తన గ్రంథములో నొకచోట డ్యూసన్ ఇట్లు వ్రాసినాడు. వేదములలో ప్రాకృతికశక్తుల పూజకలదు. మానుషభావములతో నాశక్తులు ప్రభావితములగునని తలంచెడివారు. దార్శనికాభిప్రాయము లంకురింప మొదలిడగానే విశ్వముయొక్క యేకత్వమును గురించిన యభిప్రాయములు బయలుదేరెను. "కస్మై దేవాయ హవిషా విధేమ" అను మంత్రములతో నీశ్వరుని నామమును

వెదకు ప్రయత్నము జరుగుచుండెను. ప్రజాపతియను నామమును కనుగొనిరి. భావవికాసముతోపాటు, ప్రజాపతి స్థానము నుపనిషత్తులలో బ్రహ్మ, ఆత్మ యనునవి గ్రహించినవి. పిమ్మట గనపడు సాహిత్యములో సమస్త జగత్తులో బ్రహ్మభావన గాంచుట కనిపించును తదుపరి సృష్టిని, దాని నియమముల నెఱుంగుకోరిక(Cosmogonism) (అనంతరం మాస్తికవాదము(Theism) అటుపై సాంఖ్యములో నాస్తికవాదము (Atheism) మొదలగునవి బయలు దేరినవని డ్యూసన్ తాను చెప్పిన దానిని సమర్థించుటకై అస్తికవాదమునకుదాహరణముగా శ్వేతాశ్వతరోపనిషత్తు లోనిదని యీ మంత్రమును చూపినాడు (outlines of Indian philosophy, bny Deussen)

ద్వా సుపర్ణాసయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్ అన్యో అభి చాకశీతి (ఋ. ౧-౬౪-౨౦)

ఈ మంత్రము ఋగ్వేదములోనిది. ముండక, శ్వేతాశ్వతరోపనిషత్తులలో ప్రమాణార్థము వ్రాయబడియున్నది. కాని డ్యూసన్ దీనిని వేదమంత్రమని తెలుపక ఉపనిషద్వాక్యముగా పేర్కొని తన వేదానభిజ్ఞతను చాటినాడు. వేదము నెఱుంగనివారు కూడా వేదమును విమర్శించుట కర్హులమని తలంచుచున్నారు.

౨. ఈశ్వరస్తుతి సంబంధమైన మఱొక ప్రసిద్ధ వేదమంత్రమిట నివ్వబడుచున్నది.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్
స దాధార పృథివీం ద్యాముతే మాం కస్మై దేవాయ హవిషా విధేమ॥

ప్రారంభమున హిరణ్యగర్భుడు (సమస్త ప్రకాశవంతములగు లోకములు గర్భమందు కలవాడు) ఉద్భవించిన జగత్తున ఏకైక ప్రభువైన వాడుండెను అతడు సర్వప్రకాశకా ప్రకాశకలోకముల కాధారుడు. అతనినే మనము భక్తితో నుపాసించవలెను.

ఈ మంత్రములో నీశ్వరుని గుఱించి యెంతో యుత్తమముగా చెప్పబడియున్నది. కాని మ్యాక్సు ముల్లర్ హిరణ్యగర్భ శబ్దమునకు గ్రుడ్డు అని అర్థము వ్రాసి మంత్రార్థమును మట్టి పాలొనర్చినాడు.

౩. మరొక యుదాహరణనొసంగి యీ ప్రకరణమును ముగింతును.

వేదములో ''అజ ఏకపాద్'' అను వాక్య మనేక స్థలములందున్నది. ఉదాహరణకు'' శన్నో అజ ఏకపాద్దేవో'' ( ఋ. ౭-౩౫-౧౩). దీనియర్థమిట్లున్నది. (ఏకపాత్) జగద్రూప పాదము గలవాడు. అనగా తనయొకేయంశమున సర్వజగత్తుగల, ఆ (అజ) అజన్ముడునగు, (దేవః) ఈశ్వరుడు, (శంనః) మాకు కళ్యాణము గూర్చుగాక .

''అజ ఏకపాద్ '' యను సమాసమునకు 'అజస్య ఏకపాదే' యని అర్థము అనగా అజన్ముడగు పరమేశ్వరుని యొకయంశమున నీ సర్వజగమున్నది. కాని గ్రిఫిత్ యను వ తడీవాక్యమున్న ప్రతిచోట "ఒంటికాలు గల మేకయని" యర్థము వ్రాసినాడు. టి. పి. ఏయర్ కూడ ననుకరించి (రిక్సు) యను గ్రంథములో పై వాక్యము వచ్చిన స్థలములలో నొంటికాలు మేక యనియే వ్రాసినాడు.

ఇటుల నీ పాశ్చాత్యు లనేక స్థలములందు నర్థమార్థముల కనర్థములు గావించినారు. అందువే పాశ్చాత్య గ్రంథములనుపఠించునపుడిట్టి యనర్థ విషయములుగలవానిని, భారతీయ విద్వాంసులతో నిర్ణయము గావించకుండ ప్రమాణముగా నంగీకరించవలదని పాఠకులకు వినమ్రతతో నివేదించుచున్నాను.

## ప్ర : వేదమంత్ర ములు ఋషికృతములా ?

వేదమంత్రములపై మంత్రద్రష్టలగు ఋషులనామములు వ్రాయబడువాచారముగా వచ్చుచున్నది. కొందరు విద్వాంసులాఋషులను మంత్రద్రష్టలనక, మంత్రకర్తలని తలంచుచున్నారు.

Original Sanskrit Text Vol. III లోని మూడవప్రకరణములో మూర్ దాదాపు ౮౦ మంత్రముల నిచ్చియున్నాడు. వానిలో 'కృ' మఱియు 'తక్ష' ధాతువుల ప్రయోగము కలదు. పంచవింశ బ్రాహ్మణము (౧౩-౩-౧౪) మఱియు ఐతరేయబ్రాహ్మణములలో (౬-౧-౧) కూడామంత్రకృత్ శబ్దప్రయోగముకలదు.

తైత్తరీయారణ్యకము (ప్రపా ౪-అను-౧౨) లో 'మంత్రకృత్ ' శబ్దమున్నది. పై విద్వాంసుడు తన యభిప్రాయమును సమర్థించుట కిట్టివే యుదాహరణలు నిచ్చినాడు సాయణాది పౌరాణిక విద్వాంసుల వ్రాతలు కూడా వీరియభిప్రాయముల సమర్థించుటలేదు. ఇచట కొన్ని యుదాహరణ లివ్వబడును.

౧. తైత్తిరీయారణ్యకము (౪-౧౨) లో నున్నవాక్యమిట్లున్నది.

నమో ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యః

దీనికి సాయణాచార్యులు భాష్యమిట్లువ్రాసినారు.

మంత్రకృద్భ్యః మంత్రం కుర్వంతీతి మంత్రకృతః యద్యప్యపౌరుషేయేవేదే కర్తారో సంతి తథాపి కల్పాదా వీశ్వరానుగ్రహేణ మంత్రాణాం లబ్ధారో మంత్రకృత ఉచ్యంతే॥

మంత్ర గ్రహణకర్తలగు అగ్ని, వాయు, అంగిరసాది ఋషులను మంత్రకర్తశబ్దమున సాయణుడు గ్రహించాడని స్పష్టమగుచున్నది. దీనిని సమర్థించుటకొక స్మృతికారుని వాక్యముకూడ నాతడొసంగినాడు.

**యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్సేతిహాసాన్మహర్షయః**
**లేభిరే తపసాపూర్వమనుజ్ఞాతాః స్వయంభువా॥**

యుగాంతరమున లుప్తమైన వేదములను, పూర్వసంచిత తపస్సుచే ఋషిగణము పొందినది. ఈ వాక్యము నుదాహరించుచు సాయణుఁడిట్లు వ్రాసినాడు.

త ఏవ మహర్షయః అగ్ని వాయ్వాదిత్యాదయః సంప్రదాయ ప్రవృత్త్యా మంత్రాణాంపాలనాత్ మంత్రపతయ ఇత్యుచ్యతే ఆ వేదములను బొందిన ఋషులనే మంత్రపతులని కూడా యందురు.

౨. సర్వ ఋషిర్మంత్రకృత్ (ఐ. బ్రా. ౬-౧-౧) సాయణాచార్యుడు దీనికిట్లు అర్థము వ్రాసినాడు

**ఋషిః అతీంద్రియార్థమంత్రకృత్ ( క్రీధాతు స్త్వత్ర దర్శనార్థః) మంత్రద్రష్టా**

ఈ వాక్యమున 'కృ' ధాతువు దర్శనార్థములో ప్రయుక్తమైనది. మరియు సర్వఋషి మంత్రకృత్ అనగా మంత్రద్రష్ట యనియే యర్థము.

౩. సాయణుని భావము, చాలా కాలమునకు పూర్వమే యాస్కాచార్యుడు కూడా తెలిపియున్నాడు.

**ఋషిః దర్శనాత్ స్తోమాన్ దదర్శేత్యౌపమన్యవః తద్ య దేనాం స్తపస్యమానాన్ బ్రహ్మ స్వయమ్భ్వభ్యానర్షత ఋషయోఽభవం స్తదృషీణా మృషిత్వమితి విజ్ఞాయతే॥**
(నిరు. ౨-౩-౨)

(పశ్యతి హ్యపి సూక్ష్మ అర్థాన్) ఋషి మంత్రములోని సూక్ష్మార్థములను చూచును. అందుచే నతనిని ఋషియనెదరు. స్తోమములు = వేదమంత్రములను, తపశ్చర్యచే లభించు జ్ఞానమును చూచు నతనిని ఋషియనెదరని, ఔపమన్యుల యభిప్రాయము.

౪. తై. అర. ౨-౯-౧ లోనిట్టివే యౌపమన్యుల వాక్యములు లభించును.

**అజాన్ హ వై పృశ్నీం స్తపస్యమానాన్ బ్రహ్మ స్వయమ్భ్వభ్యానర్షత దృష్యయోఽభవత్ తదృషీణా మృషిత్వమ్**

(స్వయంభూ) ఎవరిచే రచింపబడక స్వయముగా నీశ్వరుని ద్వారా ప్రకటమైన వేదము (బ్రహ్మ) ను, (అభ్యానర్షత) చదువకనే, తమ విశేష తపోకారణమున ఋషులు చూచిరి. ఇదియే ఋషుల ఋషిత్వము.

౫. 'ఋషిగతౌ' అను ధాతువునుండి 'ఋషి' శబ్దమేర్పడును. ఋషిదయానందుడు ఉణాదికోశములో దీనికిట్లు అర్థము వ్రాసినాడు. 'ఋషతి గచ్ఛతి, ప్రాప్నోతి జానాతి వా స ఋషిః' (ఉణాదికో. ౪-౧౨)

౬. నిరుక్తములో నిట్లున్నది.

**సాక్షాత్కృత ధర్మాణో ఋషయో బభూవుః తేఽవరేభ్యోఽసాక్షాత్కృత ధర్మేభ్యః ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః** (నిరు ౧-౨౦)

ధర్మమును సాక్షాత్కారమొనరించుకొనువారు ఋషులు. వారు ధర్మమును సాక్షాత్కారమొనరించుకొనని వారికి మంత్రముల నుపదేశించినారు.

పై యుదాహరణములు ఋషులు మంత్రకర్తలుకారని స్పష్టమొనర్చినవి. వారు మంత్రముల సాక్షాత్కారమొనరించుకొని వాని నుపదేశించి ప్రచారమొనర్చెడివారు. 'మంత్రకృత్' శబ్దములో 'కృ' ధాతువు దర్శనార్థములో నున్నది. 'అందుచే మంత్రకర్త' లను శబ్దమునకు 'మంత్రద్రష్టలు' నియే యర్థము.

## మంత్ర క్రమము మార్చవలదు :

నిరుక్తములో నిట్లున్నది.

**శ్రుతితోఽపి తర్కతో న తు పృథక్త్వేన మంత్రా నిర్వక్తవ్యాః ప్రకరణశ ఏవ తు నిర్వక్తవ్యాః** (ని. ౧౩-౧౨)

మంత్రార్థములను బ్రాహ్మణ గ్రంథాదుల ప్రమాణములతో గానిం చినను లేక యుక్తితర్కములతో జేసినను, ప్రత్యేకదశలోను ప్రకరణమునకు వేరుగా మంత్రముల కర్థము చెప్పవలదు మంత్ర క్రమమునను సరించియే, ప్రకరణానుసారముగా నర్థము చెప్పవలెనని దీని భావము. క్రమమునకు మరియు ప్రకరణమునకు భిన్నముగా నెప్పుడర్థము చెప్పకూడదు.

ప్రతి కల్పారంభమున వేదము : వేదాంత దర్శనములో "సమాననామ రూపత్వాచ్చావృత్తావప్య విరోధో దర్శనాత్స్మృతేశ్చ" (వే ౧-౩-౩౦) యను సూత్రమున బాదరాయణుఁడిట్లు తెలిపియున్నాడు. వేదమంత్రములలో వర్ణింపబడి, ఋషులద్వారా సమర్థింపబడియు, ప్రతికల్పారంభమున పూర్వమంత్రములవలె సమానముగా నుండుటచే వాని నిత్యత్వములోనే మాత్రము విరోధము లేదు. ప్రతికల్పమున వేదముల నామరూపములు సమముగానుండుననియు అట్టిరచనయే ప్రతిసారి జరుగుననియు, అందువలన నవి నిత్యములనియు సూత్రాభిప్రాయము. దర్శనములు, స్మృతులు నన్నియు కూడా వేదమంత్రముల అనుపూర్వినిత్యములని (పూర్వము వలెనే యుండుటచే నిత్యములని) యంగీకరించుచున్నవని బాదరాయణుఁడు సూత్రాంతములో ప్రకటించియున్నాడు.

### వేదములు నాలుగు :

మొదట వేదమొక్కటియేయని విష్ణుపురాణము మరియు మహాభారతము మున్నగు గ్రంథములలో వ్రాయబడియున్నది. వ్యాసుడు మరియు నతనిశిష్యుడగు వైశంపాయనుడీవేదమును నాలుగు విభాగములుగా విభజించి వానికి ఋగ్వేదాదులని పేర్లు పెట్టిరనియును పై గ్రంథములలో కలదు. కాని యీ యభిప్రాయము భ్రమమూలకమైనది. ఈ పురాణములలోనే మరొకచోట, బ్రహ్మ యొక్క ముఖమునుండి నాలుగువేదములు పుట్టినవని కలదు. మరొకచోట వేదమొకటియే యని యున్నది. ప్రతి వేదములో మిగతా మూడువేదముల పేర్లున్నపుడవి నాలుగనుటలో సందేహమేల? మహాభారతములో నొకచోట వేదమొకటేయనియు మరొకస్థలమున నాలుగనియును కలదు. వైదిక సాహిత్యములో చతుర్వేదముల గురించి చెప్పిన విషయములు ప్రసిద్ధములు. వానికి విరుద్ధముగా చెప్పుటకు వీలులేదు.

శ్రీరాముడు మరియు లక్ష్మణుడు కిష్కింధలో నొక పర్వతముపై నున్నపుడు, హనుమంతుని మాటవిని రామచంద్రుడు లక్ష్మణునితో నిటుల చెప్పినట్లు రామాయణములో నున్నది.

**నానృగ్వేద వినీతస్య నాయజుర్వేద ధారిణః**

**నాసామవేద విదుషః శక్యమేవం ప్రభాషితుం** (వా. రామా ౪-3-౨౮)

ఋగ్వేదమును, యజుర్వేదమును మరియు సామవేదమును నేర్వకుండా నిటుల నెవ్వడును మాట్లాడజాలడు.

వాల్మీకి రామాయణములోని యీ శ్లోకమువలన నాకాలమున ఋగ్వేదాదులు వేరువేరుగానున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. అటుపై వేలకొలది సంవత్సరములకాలము తరువాతగల వ్యాసుని కాలమున నవి యొకటిగానున్నవనియు, వ్యాసాదులు దానిని నాలుగుగా విభాగించిరని చెప్పుమాట లెటులంగీకరింపదగినవి? (ఇట్టి మాటలంగీకరింప దగినవికావు. ఆరంభమునుండియే వేదములు నాలుగనియు గ్రహింపవలెను)

### వేదములో భాషాభేదములేదు :

కొందరు పాశ్చాత్యవిద్వాంసులు, మరి కొందరు వారియనుయాయులగు భారతీయవిద్వాంసులు చతుర్వేదములోని భాషలో భేదముచూపి, యవి వేరువేరు కాలములందు రచింపబడినట్లు చెప్పుచున్నారు. ఒకే వేదములోని విభిన్నభాగములలో గల్పిత భాషా భేదమును చూపి, వానిని విభిన్న సమయములందు రచింపబడినట్లు చూపుచున్నారు. ఇదంతయు కల్పితము మరియు వారియూహలు మాత్రమే. ఒకరెండుదాహరణలిటనొసగి వానిని నాలోచించుట సరియగునని తలంతుము.

మాక్డొనల్ యనునతడు ఋగ్వేదములోని దశమ మండలమున్నిటికన్నా తరువాత రచింపబడినదని, దానిభాషలో విభిన్నత యున్నదని వ్రాసినాడు. (Sanskrit Literature, by Mac - Donell, P.44)

దశమ మండలమును గురించి కావింపబడిన యాక్షేపణల విమర్శింపుచు శ్రీ పండిత సత్యవ్రత సామశ్రమీ యిటుల వ్రాసినాడు.

"ఋగ్వేదములోని ఇతర మండలములలోని భాష మరియు దశమమండలములోని భాష యొకేతీరుగా నున్నది. వానిలో భిన్నత యున్నట్లు మా బుద్ధులకు కల్పించుటలేదు. బుద్ధి మరియు శ్రోత్రేంద్రియ దోషములవల్లనో లేక హఠము చేతనో, లేక మరెటుల వీ నిర్ణయముగావించిరో తెలియదు."

భాషాభేద జ్ఞానము సామశ్రమీ వంటి సంస్కృత విద్వాంసునకెంత తెలియునో యంత మ్యాక్డొనల్ కు తెలియదు. ఈ విషయమునొక సంఘటన తెలుపదలచినాను. కొంతకాలము క్రిందట నొక భారతీయ సంస్కృతాంగ్ల భాషావిద్వాంసుడు ప్రభుత్వమునుండి యుపకారవేతనముపొంది, సంస్కృతవిశేషాధ్యయనమున కింగ్లాండు వెళ్ళెను. అపుడు సంస్కృతాధ్యాపకుడుగా నీ మ్యాక్డొనల్ గారే యుండిరి. అతడు మాక్డొనల్ తో కలువగానే సంస్కృతములో మాట్లాడసాగెను. కాని మ్యాక్డొనల్ సంస్కృతములో మాట్లాడ లేకపోయెను. అపుడాగురువు కాబోయే శిష్యునితో నిటులనెను. సంస్కృతములో నీకుగల యోగ్యత నాకులేదని యంగీకరింతును. మీరిటకు సంస్కృతసాహిత్యము నధ్యయనముగావించుటకు పంపబడలేదు. పాశ్చాత్యవిద్వాంసుల యన్వేషణాప్రణాళిని నేర్చుకొనుటకే మీరిటకు వచ్చినారు.

ఈ సంఘటనవలన సామాన్యముగా పాశ్చాత్య పండితుల యొక్కయు, విశేషించి మ్యాక్డొనల్ గారియొక్క సంస్కృతభాషాజ్ఞానమెంతటిదో చక్కగా నర్థమగును. వేదభాషను గురించి పాశ్చాత్యులొసంగు యభిప్రాయములనేమాత్రము లెక్కించదగినవి కావు. మరొక విషయమిట తెలుపవలసి యున్నది. ఈ మ్యాక్డొనల్గారే యీ దశమ మండలమును గురించి ఇట్లు వ్రాసియున్నాడు. అయిన నీదశమ మండలములోని సూక్తములు చాలావరకు చేర్చినభాగములకన్న ప్రాచీనములుగా, నితర మండలములలోని వలెనే యున్నవి.

(Neverthless the supplements conllected in it appear for the most part to be older than the additon which occur in the earlier books - Sanskrit Literature, by Mac Done, P. 43-45)

ఇతరమండలములలో చేర్పులు కూర్పులున్నవా? లేదా? యను విషయమును ముందుచర్చించగలము. ఇక మ్యాక్డోనల్ తన రెండవ వ్రాతలో, మొదట తెలిపిన దానిని స్వయముగా ఖండించినాడు. దశమ మండలములోని భాష యితర మండలములోని భాషకన్న వేరుగాదనియు, ఈ రెండింటిలో భేదము లేదనియు స్పష్టమైనది. ఇటులనే మిగతా వేదములగురించి యోచించుట ఉచితము.

**వేదత్రయీ యనగా నేమి ?**

నాలుగువేదములలో మూడువిధములగు మంత్రములున్నవి. పూర్వమీమాంసలో నిదేవిషయ మిటుల చెప్పబడియున్నది.

**తేషాం ఋగ్ యత్రార్థ వశేన పాదవ్యవస్థా ।**

**గీతిషు సామాఖ్యా శేషే యజుః శబ్దః॥** (పూర్వమీమాంస ౨-౧-౩౫,౩౬)

అర్థమునమసరించి పాదవ్యవస్థగలవి 'ఋక్కు' లనబడును. పాడదగు మంత్రములను 'సామము' లందురు. మిగిలినవి 'యజుస్సు' లనబడును. ఈ మూడు విధములగు మంత్రములు చతుర్వేదములందెల్లెడ నున్నవి. సర్వానుక్రమణీ వృత్తి యొక్క భూమికలో షడ్గురు శిష్యులిట్లు చెప్పియున్నారు.

**వినియోక్తవ్య రూపశ్చ త్రివిధః సంప్రదర్శ్యతే ।**

**ఋగ్యజుః సామరూపేణ మంత్రో వేద చతుష్టయే॥**

యజ్ఞములలో త్రివిధరూపములగు మంత్రములు వినియోగింపబడును. నాలుగువేదములలో నవి ఋగ్ , యజు మఱియు సామ రూపములోనున్నవి.

త్రివిధములగు మంత్రము లుండుటవల్లను, వేదములలో జ్ఞాన, కర్మ, ఉపాసనలను త్రివిధ కర్తవ్యముల వర్ణించుట చేతను 'వేదత్రయీ' యని యని చెప్పబడుచున్నవి. వేదత్రయీ యను శబ్దములో చతుర్వేదము లిమిడియే యున్నవి. అథర్వ వేదములో నొకచోట నిట్లుచెప్పబడినది.

**విద్యాశ్చవా అవిద్యాశ్చ యచ్చాన్యదుపదేశ్యమ్**

**శరీరం బ్రహ్మ ప్రావిశదృచః సామాథో యజుః॥** (అథ ౧౧-౮-౨౩)

విద్య మఱియు నవిద్య, (జ్ఞానము + కర్మ) ఉపదేశింప దగిన నితర విషయములు, బ్రహ్మ (అథర్వవేదము), ఋక్, సామ మఱియు యజుస్సులు పరమేశ్వరుని శరీరములో ప్రవేశించినవి.

"విట్నీ" యను పండితుడుకూడా బ్రహ్మ శబ్దమున కథర్వవేదమే యని తెలిపినాడు. (Brahman perhaps is here the Charm representing in the Atharwan Hymens) Whitney)

అథర్వవేదములో నున్నటులనే ఋగ్వేదములో కూడా చతుర్వేదముల పేర్లున్నవి.

**సో అఙ్గిరోభిరంగిరస్తమో భూద్ వృషా వృషభిః సఖిభిః సఖా సన్**

**ఋగ్మిభిర్ ఋగ్మీగాతుభిర్జ్యేష్ఠో మరుత్వాన్నో భవత్విన్ద్ర ఊతీ॥** (ఋ. ౧-౧౦౦-౪)

అథర్వాంగిరః మంత్రములతో నుత్తమరీతిగానున్నవాడును సుఖవర్ష సాధనములతో సుఖమును వర్షించు వాడునునై, మిత్రులతో మిత్రుడుగా, ఋగ్వేదులతో ఋగ్వేదిగా, సామమంత్ర జ్ఞానములతో జ్యేష్ఠుడుగానున్న యా యింద్రుడు (ఈశ్వరుడు) మమ్ములరక్షించుగాక.

ఈ మంత్రమున అథర్వవేదము యొక్క పేరు స్పష్టముగా పేర్కొనబడినది. ఋగ్వేదము స్వయముగా నథర్వవేదముయొక్క వేదత్వము నంగీకరించగా, దానిని నవీనమైనదని చెప్పి, దానిని వేదములనుండి వేరుచేయుట సాహసమేయగును.

ప్ర : బ్రాహ్మణ గ్రంథములు వేదములా?

ఈ ప్రశ్నకు మహాభాష్యకారుడగు పతంజలిటుల ప్రత్యుత్తర మిచ్చియున్నాడు.

**చతుర్వేద విద్భిర్బ్రహ్మభి ర్బ్రాహ్మణైః మహర్షిభిః ।**

**ప్రోక్తాని యాని వేద వ్యాఖ్యానాని తాని బ్రాహ్మణానీతి ॥** (మా. భా ౪-౧-౪)

చతుర్వేదముల నెఱింగిన యీశ్వరభక్తులగు బ్రాహ్మణులు మఱియు మహర్షులచే వ్రాయబడిన వేదముల వ్యాఖ్యానములే బ్రాహ్మణ గ్రంథములనబడును.

బ్రాహ్మణములు వేదములుకావనియు నవి వాని వాఖ్యానములనియు స్పష్టమైనది, ఈ విషయమున నీక్రింది విషయములు గమనింపతగియున్నవి.

౧. బ్రాహ్మణ గ్రంథములలో ననేక వేదమంత్రముల వ్యాఖ్యానము గనిపించును. ఋగ్వేదము ౧-౨౪-౩ యొక్క వ్యాఖ్యానము, ఐతరేయ బ్రాహ్మణము (౧-౧౬) లో గలదు. యజుర్వేదములోని ప్రథమ మంత్ర వ్యాఖ్యానము శతపథ బ్రాహ్మణములో (౧-౭-౧) నున్నది. సామవేద ప్రథమమంత్ర వ్యాఖ్య తాండ్య బ్రాహ్మణము (౧౧-౨-౩) లో గలదు.

౨. దేశములో స్త్రీలకు, శూద్రులకు గౌరవము తగ్గిన కాలములో బ్రాహ్మణ గ్రంథములు రచింపబడినవి. ఒక బ్రాహ్మణ ములో నిట్లున్నది. ౧. స్త్రీలు, శూద్రులు, కుక్కలు మఱియు కాకులను యజ్ఞకర్త చూడకూడదు. ౨. స్త్రీతో మైత్రి జరుగజాలదు. క్రూర జంతువుల హృదయములవలె యామె హృదయము క్రూరమైనది. ౩. పారంపర్యముగా స్త్రీల ప్రవృత్తి సాంసారిక విషయములపై మఱియు వ్యర్థపదార్థములపై నధికముగా నుండును. అందువలన వారు సంగీత నృత్య వాయిద్యముల గావించువారిచే నాకర్షింపబడుదురు.

కాని వేదములలో దీనికి విరుద్ధముగా స్త్రీల కెక్కువగౌరవ మర్యాదలు చూపబడినవి.

పురుషులకువలె వారికన్ని హక్కులొసంగబడినవి. ఋగ్వేదములో నిట్లున్నది.

సమ్రాజ్ఞీ శ్వశురే భవ, సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ
ననాందరి సమ్రాజ్ఞీ భవ, సమ్రాజ్ఞీ అధిదేవృషు ॥ (ఋ. ౧౦-౮౫-౪౬)

ఈ మంత్రములో వధువునకాశీర్వాద మొసంగబడినది. ఆమె పతి గృహమునకు వచ్చి అత్తమామలకు, ఆడబిడ్డ మరిది మొదలగు వారిపై శాసనము గావించు సమ్రాజ్ఞికావలెనని మంత్రమునకలదు.

దీనితో వేదము మఱియు బ్రాహ్మణములలోగల భేదము స్పష్టముగా తెలియగవచ్చును.

౩. బ్రాహ్మణ గ్రంథములితిహాసములు. వానిలో నానేక స్త్రీ పురుషుల, రాజుల, రాణులచరిత్రకలదు. వేదములో నితిహాసము లేదు. అందు యౌగిక శబ్దములే కలవు. కావున వానిలో నితిహాసమున్నదని కల్పించుటకు వీలులేదు.

## వేదమే ఈశ్వరీయ గ్రంథము

### ఈ క్రింది లక్షణములు గల గ్రంథమే వేదము

౧. ప్రథమ మానవసృష్టి నుండియే అట్టిగ్రంథ ముండియుండవలెను.

౨. భూలోకములోని విభిన్నభాష లుత్పన్నముకాని సమయము కావలెను.

౩. అట్టి గ్రంథములో ఈశ్వరుని గుణములు, స్వభావము, సత్యము, న్యాయపరాయణత మరియు దయాగుణము యొక్క వివరణ పరస్పర విరోధరహితముగా నుండవలెను.

౪. ఈర్ష్యా, ద్వేషములు, పక్షపాతము లేశ మాత్రమైనను అందు ఉండగూడదు.

౫. మానవజన్మ లక్ష్యము, ప్రకృతి, ఆయు, కర్మ, మోక్షమును గురించిన వివరణ యథార్థముగా నుండవలెను.

౬. సృష్టియొక్క అనంత, అనాది స్వరూపము యథార్థముగా చిత్రించబడవలెను.

౭. జీవాత్మ యొక్క లక్షణము, స్థిరత్వము, కర్మ సిద్ధాంతమును తార్కికముగా హేతుబద్ధముగా వివరించబడవలెను.

౮. మిథ్యా మహాత్మ్యము, అతిశయోక్తులు ఉండకూడదు.

౯. వైజ్ఞానిక విషయములు, హేతుబద్ధముగా నుండవలెను.

౧౦. ఉత్సవములు, పర్వములు ఈశ్వరీయ నియమానుసారముగా నుండవలెను.

ఈపై లక్షణములు గలిగిన గ్రంథమే వేదము - ఈశ్వరీయజ్ఞానమనబడును.

### ౧. మానవ సృష్ట్యాదినుండి గల గ్రంథము

ఇది ఈశ్వరీయ గ్రంథ ప్రథమ లక్షణము. మానవ సృష్ట్యాది నుండి అట్టి గ్రంథము యుండనిచో సత్యాసత్య, పుణ్యపాప వివేచన మానవునకు కలిగియుండదు. అట్టి వివేచన లేని పక్షమున మానవుడు పశుతుల్యుడగును. మానవుల మధ్య భాషావికాసము కూడా ఉండదు.

బైబిలు, కురాను ననుసరించి ఆదమ్, హవ్వా జననసమయమున పరమేశ్వరుడు కర్తవ్యాకర్తవ్యములనుపదేశించెను. ఒక ప్రత్యేక వృక్ష ఫలములు తినగూడదని ఆదేశించబడెను. రెండు వేల సంవత్సరముల నుండియే బైబిలు, ౧౩౦౦ సంవత్సరముల నుండి కురాను అస్తిత్వము కనుపించుచున్నది. అట్లే జెందావస్త గ్రంథమును గూర్చి చెప్పబడును. వేదము మాత్రమే ప్రాచీనతమ గ్రంథముగా అందరు అంగీకరించిరి.

### ౨. లోకములో భిన్న భాషలు ఉత్పన్నము గాని సమయము.

ఇది రెండవ లక్షణము. అన్ని ధర్మ గ్రంథాల ననుసరించి పరమేశ్వరుడు అత్యంతామరత్త్వితో మానవుని సృష్టించెను. భాష మానవోన్నతికి గల కారణములలో నొకటి. పరమేశ్వరుడు మానవునకు విద్యావిషయకములు, జ్ఞాన సంబంధమైన విషయములు నేర్పెనా? లేక, భాష తనంతటనూనుగా ఉత్పన్నమయ్యెనా? ధర్మ గ్రంథముల ననుసరించి పరమేశ్వరుడు మానవులకు విధినిషేధములకు సంబంధించిన ఉపదేశ మొసంగెను.

అట్టి ఉపదేశ గ్రంథములు లుప్తమయ్యెనా? లేక సురక్షితముగా నున్నవా? యను ప్రశ్న ఉదయించును. బైబిలు మొదలగునవి అట్టి గ్రంథములు కాజాలవు. ఎందుచేతననగా బైబిలు ఆవిర్భవించు వరకు విభిన్నమైన భాషలు, సంప్రదాయములు వ్యాపించియుండెను. అందుచేత ఈ గ్రంథములు ఈశ్వర ప్రేరితమైనవి కాజాలవు. వేదోత్పత్తి జరుగు వరకు లోకములో భిన్నమతములు, భాషలు లేకుండెను. అందువలన వేదములే ఈశ్వరీయ గ్రంథములుగా పేర్కొనవచ్చును.

మానవ జాతిలో భిన్న భాషలు వ్యాపించిన పిమ్మట ఈశ్వరీయ గ్రంథము ఆవిర్భవించెననిచో అప్పటికే కర్తవ్యాకర్తవ్యముల నిర్ణయించుకొనిన మానవుడు తన కప్పుడు ఈశ్వరుడు ప్రసాదించిన గ్రంథములో లాభమేమిటని ప్రశ్నించుకొనును. అన్ని యేర్పాట్లు చేసికొనిన పిమ్మట యిట్టి గ్రంథము యొట్టి ప్రయోజనకారి కాగలదని మానవుడు పరమేశ్వరుని ప్రశ్నించు అవకాశము గలదు. అప్పటివరకు గల మానవులు యిట్టి విజ్ఞానమునుండి వంచితులైపోయిరి గదా? అప్పటికి గల భాషలన్నింటిలో నిట్టి గ్రంథములు వెలువడవలెను. లేనిచో ఈశ్వరుడు పక్షపాతి కాగలడు.

ఈశ్వరుని గుణ కర్మ స్వభావములు, సత్య, న్యాయదయాళుత్వములు పరస్పర వైరుధ్య భావములు లేకుండా నుండవలెను

ఇతర ధర్మగ్రంథము లన్నింటిలో పరమేశ్వరుని సాకారునిగా పేర్కొనిరి. అతని పేరిట అన్యాయ, అక్రమ, అధర్మగాథల వల్లిరి. అతని వాస్తవిక స్వరూప, స్వభావములు మనకు గానరావు. అన్ని మతములవా రతనిని మానవాకారములో సేవించుచున్నారు. అతనికి దూతలు, భార్యాపిల్లలను కల్పించిరి. అతడొక మతముపక్షము వహించి ఇతర మతములవారిని అకారణముగా హింసించుటయో లేక వధించుటయో జరిపెనని వర్ణించబడినది. కొన్ని మతములవారిపై మాత్రమే అతని కటాక్షవీక్షణములు గలవు. అతడొక నిర్దేశ స్థలములో కూర్చొని న్యాయ విచారణ జరుపునని పేర్కొనబడినది. అతడు నిదురించును, మేలుకొనును, భోగభాగ్యముల ననుభవించునట్లు గాథలు వ్రాయబడినవి. సిద్ధపురుషులకు ప్రసన్నమైనట్లు వారికి కర్తవ్యాకర్తవ్యముల బోధించునట్లు వ్రాయబడినవి. అతనిని ప్రసన్నునిగా జేసుకొనుటకు తమతమ స్వభావముల కనుగుణ్యముగా విలాస వస్తువులు పరమేశ్వరునకు అర్పించవలెను. ఇట్టి అభూతకల్పనలతో నిండిన గాథలు అనేకములు గలవు. అనంతమైన ఈసృష్టిని శాసించు ఆ దివ్యశక్తి మానవాకారములో నుండజాలదు. అందుచేతనే వేదములో

"అకాయమ్" (యజు. ౪౦-౮) శరీరరహితుడని, "న తస్య ప్రతిమా అస్తి" (యజు 3౨-3) అతడు ఆకారరహితుడు. అతనికి సదృశమైన వస్తువు వేరొకటి లేదని చెప్పబడినది. "సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ" (యజు ౧౩-౪౬) జంగమస్థావరముల అంతరాత్మ పరమేశ్వరుడని, సర్వవ్యాపకుడని వేదము ఘోషించుచున్నది.

**తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వ మనసే హూమహే వయమ్।**

(యజు ౨౫-౧౮)

ఒకవేళ పరమేశ్వరుడు శరీరధారి యైనచో శరీరము, ఆత్మయను రెండు వస్తువులతో యేర్పడి యుండవలెను. శరీరము ప్రకృతి సంబంధమైనందున అది నశించును. అందుచేత కొన్ని సమయములలో అతడు జీవించును మరికొన్ని సమయములలో మరణించి యుండియుండవలెను. స్థూల శరీరధారియగుటచే సర్వ వ్యాపకుడు కాజాలడు. ఇట్లనేక దోషములతో గూడియున్న ఈశ్వర వర్ణన సరియైనది కాజాలదు. అందుచేతనే వేదము పరమేశ్వరుని అకాయుడు, నిరాకారుడు, సర్వ వ్యాపకుడుగా పేర్కొనుచున్నది.

ఈశ్వరుడొక్కడే యను విషయములో కూడా ఇతర ధర్మ గ్రంథములు అసంబద్ధముగా పేర్కొనినవి. ఈశ్వరుడు తన కార్యములో యితరుల సహాయమపేక్షించడు. కావున అతడు సర్వశక్తిమంతుడనబడును. కాని బైబిలు, కురానులలో అతని వద్ద దూతలున్నట్లు వర్ణించబడినది. రాజు ఒక్కడేయైనను అన్ని కార్యము లాతడొక్కడే వక్కబెట్టజాలడు. అనేకమంది ఉద్యోగులు, అధికారులు, రాజ్యనిర్వహణకై నియమింపబడియుందురు. రాజ సదృశుడే ఈశ్వరుడైనచో అతడొక్కడు కాజాలడు. పురాణములలో ఏకేశ్వరోపాసన కూడా కనిపించదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు, కాళి మొదలగు అనేక దేవతలే గాక వారి పరివారము కూడ గలదు.

**వేదములో "ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః"** (యజు ౧౭/౧౯)

మొదలగు మంత్రములలో పరమేశ్వరునకు భార్యాపిల్లలు, దూతలను గూర్చి యెచ్చటను చెప్పబడలేదు. కురాను పరమేశ్వరుడు అరబ్ దేశవాసులకు, బైబిలు దేవుడు యూదుల కొరకు మాత్రమే చెప్పబడినాడు. పురాణములలో దేవుడు కేవలము బ్రాహ్మణుల కొరకే యేర్పడినాడు. ఇట్టి విషయములను పాఠకులే తర్కించుకొని నిర్ణయించుకొనగలరు.

ఆదమ్ హవ్వలను సృష్టించి ఒక తోటలో వారినుంచి ఒక చెట్టుఫలము దక్క మిగిలిన వృక్షముల ఫలములు తినవచ్చునని ఆదేశించెను. కాని వారు నిషేధించిన వృక్ష ఫలమును కూడా భుజించిరి. పర్యవసానముగా భగవంతుడు వారిని శపించి వెడలగొట్టెను. దేవునకు ముందుగనే ఈ విషయము తెలియదా? బాలురకు ఉత్తమోత్తమమైన ఫలముల నిచ్చి తినవద్దని అనినచో ఊరకుందురా? ఆదమ్ హవ్వకూడా పరమేశ్వరుని సమక్షమున శిశువులే గదా? అటువంటప్పుడు ఇది యెట్టి న్యాయము, సర్వజ్ఞత్వము?

జల ప్రళయము కూడా యిట్టిదే. ప్రతి వస్తువును నిర్మించినవాడు తన వస్తువెంతకాలము మనగలుగునో యెట్టి జాగ్రత్తలు తీసుకొనవలెనో నిర్ణయించగలడు. అట్లే గడియారమును నిర్మించిన పనివాడు తను నిర్మించిన గడియారము విషయములో తీసుకొనవలసిన జాగ్రత్తలను గూర్చి వివరించ గలడు. కాని ఈశ్వరుడు తాను నిర్మించిన వస్తువులు యింతకాలము తర్వాత నష్టపోవునని గ్రహించలేడా? మానవుడు తన ఆదేశములకు వ్యతిరేకముగా నడిచినందువలన కోపగించి జల ప్రళయము సృష్టించెను. మనుష్యుడు పాపచింతన కలిగి చెడిపోయిన ఇతర ప్రాణులు అతనికి జేసిన అపరాధమేమి? వారినెందుకు శిక్షించెను. ఇదెట్టి న్యాయము? సర్వజ్ఞత్వము?

యెహోవా ఈజిప్టు దేశములోని నదులన్నియు మూసాద్వారా రక్తమయి మొనర్చెను. దేశమంతట కప్పలను సృష్టించెను. అగ్నిని వర్షించెను. అందరి శరీరములపై బొబ్బలు కల్పించెను అందరి జ్యేష్ఠ పుత్రులను వధించెను. ఇట్టి లీలలన్నియు ఈజిప్టు దేశ వాసులను మూసా దేవ దూతగా భవిష్యద్వక్తగా విశ్వసింపజేయుటకు గావించెను ఈ విషయములన్నియు

అన్యాయము, పక్షపాతము, అసత్యమును తెలుపుచున్నవి. వేదములలో ఇట్టి ఒక్క విషయము కూడా కానరాదు.

### 3 ఈర్ష్యాద్వేష పక్షపాతరహితముగా నుండవలెను

వేదములలో యెచ్చటను ఒక ప్రత్యేకముగా పరమేశ్వరునకు అనుగ్రహముగాని ఆగ్రహముకాని కలుగునని చెప్పబడలేదు. ఫలానా వ్యక్తి భగవంతునివైపునుండి పంపబడునని అతని ఆదేశములనందరు శిరోధార్యము గావించవలెనని చెప్పబడలేదు. కూరాను అల్లాకు అరబ్ దేశస్థులు ప్రీతిపాత్రులు. యెహోవా దయ యూదలపై వర్షించును. పురాణముల దేవుడు బ్రాహ్మణుల భోజనముతోనే తృప్తిజెందును. ఇట్టి అనుచిత విషయములేమియు వేదమునందు లేవు.

వేదములలో పేర్కొనబడిన 'ఆర్య, దస్యు' శబ్దములు యే ప్రత్యేక వర్గమునకు జెందినవి గావు. దస్యు శబ్దము యేమాత్రము ధర్మచింతన లేని చోరులు, బందిపోట్లు, లంపటులు, నాస్తికులు మరియు ఘోరమైన పాపిష్ఠులకు ప్రయోగించబడినది.అందుచేతనే వారిని అవ్రతులు, అయజ్వ, బ్రహ్మద్విట్, క్రవ్యాజ దస్యు మరియు దాస శబ్దములు ప్రయోగించబడినవి. '**దస్యు ఉపక్షయార్థక 'దసధాతు' వు నుండి యేర్పడును** తన సమీప జాతిని నశింప జేయువాడు. మనుష్యుల ధన మాన ప్రాణముల హరించువారు దస్యులు. ఈధాతువు నుండి దాస శబ్దము యేర్పడుచున్నది. ఒక మంత్రములో దస్యు శబ్దమును వివరించుచు ఈశ్వరుని విశ్వసించనివాడు, దాన ధర్మము వంటిశుభ కర్మలు జేయనివారని చెప్పబడింది. తమ ముఖమునే వారుహవన కుండముగా నెంచెదరు.

**"స్వధాభిర్యే అధి శుప్తావజుహ్వత ।"** (ఋ. ౧-౫౧-౫౪)

(యే) యెవరు (స్వధాభిః) వివిధ అన్నాహారములతో (అధి+శుప్తౌ) నోటిలో (అజుహ్వత) హవనము జేయుదురోవారే నానా రూపములతో అనేక కుకర్మలు జేయువారు.

**ఉలూకయాతుం శుశులూకయాతుం జహి శ్వయాతుముత కోకయాతుమ్**
**సుపర్ణయాతుముత గృధ్రయాతుం దృషదేవ ప్రమృణ రక్ష ఇన్ద్ర ॥**
(ఋ. ౭-౧౦౪-౨౨)

(ఉలూకయాతుమ్) ఉలూక రూపము ధరించి ఆక్రమించువారు (శుశులూకయాతుమ్) చిన్న ఉలూకమువలె నడుచువారు (శ్వయాతుమ్) కుక్కవలె నటించు దుష్ట మనుష్యులను హే రాజన్! సమాజము నుండి దూరము జేయుము మొదలగునవి.

వీరినుండి రక్షణ కష్టముగా నుండుట వలన వీరిని రాక్షసులుగా పేర్కొనిరి. పచ్చిమాంసము తినుట వలన క్రవ్యాదులని పిలువబడిరి. వీరిని పిశాచులని కూడా యిదే కారణము వలన వ్యవహరించిరి. కోకట్ (కి(క్రి) క్రియాభిః) శుభ కర్మలు జేయుటవలన యేమి లాభమనువారు, ఇందుకు భిన్నముగా నుండువారు ఆర్యులనబడరు. శ్రేష్ఠగుణములు కలవారు ఆర్యులు. క్రమక్రమముగా ఆర్యుల దళ మొకటి యేర్పడెను. వేదములలో యే దేశము, నగరము, జాతి, వ్యక్తియొక్క వర్ణన గానరాదు. అందుచేత పక్షపాతమను ఆరోపణలు యెట్లు వరిపడును?

### ౪. మనుష్యుల ఆకృతి, జనన, కర్మ, మోక్షవిషయములు తెలుపు గ్రంథము

వేదములలో మనుష్యుడు నేటి మనుష్యుని పోలియేయుండెను. సభ్యతాసభ్యతల ననుసరించిమనుష్యుల ఆకృతిలో కొంత భేదము కనుపించుచున్నది. కోయవారు, భిల్లులు మొదలగువారు.

వేదములలో మనుష్యుని ఆయుర్దాయము శత వర్షములుగానే పేర్కొనబడినది. ఒకచోట మాత్రము 300 సంవత్సరముల ఆయుర్దాయము కొరకై ప్రార్థించబడినది. అదియును ఒకే మంత్రములో కన్పించును. "త్ర్యాయుషం జమదగ్నేః" ఇతర మంత్రములలో శత వర్షములు గానే పేర్కొనబడినవి.

**తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్ పశ్యేమ శరదః శతం,**
**జీవేమ శరదః శతం శృణుయామ శరదశ్శతం ॥యజు॥ ౩౬-౨౪**

**"పునః- దీర్ఘాయురస్యాయుః పరిణ్ణినాతి శరదః శతమ్ ।"** (ఋ ౧౦-౧౬౧-౩)

**"శతమిన్ను శరదో అన్తిదేవా యత్రానశ్చక్రా జరసం తనూనామ్ పుత్రాసో యత్ర పితరోభవన్తి మానోమధ్యా రీరిషతాయుర్గన్తోః"** (య. ౨౫-౨౨)

పౌత్రుడుద్భవించునంతవరకు జీవించి యుండుట వేడుకూడా గమనించదగును. ఇదే ప్రార్థనపై మంత్రములో గలదు.

**దీర్ఘతమా మామతేయో జుజుర్వాన్ దశమే యుగే**
**అపామర్థం యతీనాం బ్రహ్మాభవతి సారథిః ॥** ఋ ౧-౧౫౮-౬

ఈ మంత్రములో "దశమే యుగే" శబ్దమును జూచి ప్రాచీన కాలములో దశయుగములు జీవించిన దీర్ఘజీవులు కలరని చెప్పబడుచున్నది. కాని వేదము యొక్క తాత్పర్యమును గ్రహించుటలేదు. అనేక చోట్ల శతవర్షములు అని వేదములో చెప్పబడగా దానికి

విరుద్ధముగా నేరొకచోట యిట్లు చెప్పబడును. నాలుగు వేదములలో సత్య, త్రేత, ద్వాపర, కలియుగముల వర్ణన యెచ్చటను గానరాదు. నాలుగు యుగముల కల్పన ఆధునికమైనది. ఇచ్చట యుగమను మాసముయొక్క పేరు. కృష్ణ, శుక్ల పక్షముల కలయికతో మాసమేర్పడుచున్నది. దశమ మాసము (యుగము)లో మమతతో కూడిన జీవుడు ఉత్పన్నమగుచున్నాడు అని దీని భావన. ఇదే విషయము వేదములో -"**దశమా స్యశ్చ శయానః కుమారో అధిమాతరి నిరైతు జీవో అక్షతో జీవో జీవన్త్యా అధి॥**"

ఋ. ౫-౭౮-౯

వేదు కూడా పుష్టికరమైన బాలుడు దశమ మాసములోనే జన్మించుచున్నాడు. వేదములో దశమ మాసము నందే ఉత్పత్తిక్రమము చెప్పబడినది, దీనికి వ్యతిరేకముగా వేదమునందు గానరాదు. కాని యిందుకు విరుద్ధముగా యితర గ్రంథములలో కనిపించును. ఇతర జీవులు ఆవిర్భవించిన క్రమముగానే మానవుని ఆవిర్భావము కలిగినది. మనుష్యుని సృష్టి రీతిని గూర్చి వేదములలో ప్రత్యేకత యేమియు చూపబడలేదు. ప్రత్యేక జాతిని సృష్టించుటకు భిన్నమైన సామగ్రి యుపయోగించబడలేదు. మానవుడు మట్టితో సృష్టింపబడినటులే ఇతర ప్రాణుల సృష్టి జరిగినది. ఆత్మ మట్టితో రచింపబడినచో మరణముతో ఆత్మ కూడా అంతరించును.

ప్రకృతి, ఈశ్వర సంబంధిత పరిపూర్ణ జ్ఞానము కలుగనంత వరకు మోక్షప్రాప్తి జరుగదు. అజ్ఞానమే సర్వదుఃఖములకుమూలము.

**వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసః**
**పరస్తాత్ ॥** యజు. ౩౧-౧౮

వేదములో ఆది నుండి అంతము వరకు మనుష్యుడు చేయవలసిన కర్మలను గూర్చి వివరించబడినది. మనుష్యుడు తన బుద్ధితో సత్య విషయములను గ్రహించవలెను. అనంత సృష్టియొక్క సర్వజ్ఞత మనుష్యులకు లేదు.

## ౫. మానవుని సర్వజ్ఞత్వము

అన్ని మతములలో ఆచార్యులను సర్వజ్ఞులుగా పేర్కొనబడినది. కాని వారి గ్రంథములు పరిశీలించినచో నేటి విజ్ఞానము ముందు వారొక అజ్ఞాన బాలకునివలె కనిపించెదరు. తాము నివసించెడు లోకపుజ్ఞానమే లేనివారిని సర్వజ్ఞులనుట హాస్యాస్పదము. మనుష్యుని జిహ్వను యెవ్వరాపగలరు?

వేదములలో యే ఋషిని సర్వజ్ఞుడుగా పేర్కొనబడలేదు. అందుచేత వేదము యొక్క సత్యశోధన జరిపినపుడెల్ల ఆశ్చర్యకరమైన పరిణామములు కనుపించును.

## ౬. సృష్టి యొక్క అనాదిత్వ అనంతత్వ వాస్తవిక స్వరూపము

ఈ లక్షణము కూడా యే యితర మత గ్రంథములలో కనుపించదు. ఈశ్వరుడు గాక యే యితర పదార్థము అనాది కానిచో యీ సృష్టి రచన యెట్లు జరిగెను. ఒకవేళ ఈశ్వరుడు సర్వ శక్తిమంతుడగుట వలన తానే తన శక్తితో రచించెననినచో సృష్టి జేయుటకు పూర్వ మాతడేమి జేయుచుండెను ? అతడెచ్చట నుండెను. ఏ పదార్థమునకు యజమానిగా నుండెను? వస్తువు రచించక పూర్వ మాతనికి సృష్టి జ్ఞాన ముండెనా ? అతడంతకుపూర్వము సృష్టిని జూచియుండలేదు గదా? పరిశోధనల ఫలితముగా యే వస్తువు నశించుట లేదనియు కేవలము రూపాంతరము జెందుచున్నవని తెలియుచున్నది. అందువలన పదార్థముల అనాదిత్వము ఋజువగుచున్నది. పరమేశ్వరుడు సృష్టిని 'కమ్ము' అని ఆజ్ఞాపించగనే అయినట్లు కొందరు, మరికొందరు నీటిపైకూర్చుని బ్రహ్మ సృష్టిరచన గావించెనని కల్పిత గాథలు రచించిరి.

వేదములో ప్రకృతి జీవుని అనాదిత్వము చెప్పబడినది. ఈశ్వరుడు నిమిత్తకారకుడు. అభావమునుండి భావోత్పత్తి కాలేదు. కేవలము భావవికాసము కలిగినది. వేదములలో గల రెండు మంత్రములు సృష్టిక్రమమును తెలుపుచున్నవి.

**కిꣳస్విదాసీదధిష్ఠానమారమ్భణం కతమత్స్విత్ కథాసీత్ యతో భూమిం జనయన్ విశ్వకర్మా విద్యామౌర్ణోత్ మహినా విశ్వచక్షాః ॥** (యజు ౧౭-౧౮)

కుమ్మరి కుండ లను నిర్మించుటకుపూర్వము మట్టి మొదలగు వస్తువులను సేకరించుకొని ఒకచోట కూర్చొని కుండలను నిర్మించును. ఈలౌకిక న్యాయము వేదములలో కూడా నుండవలెను (అధిష్ఠానమ్) యీ జగత్తును నిర్మించునప్పుడు యీశ్వరుని నివాస స్థానము (కిమ్‌స్విత్ + ఆసీత్) యెచ్చట ఉండెను? మరియు (ఆరమ్భణమ్) ఆరంభించు సామగ్రి (కతమత్+స్విత్) యేదైయుండెను? (యతః) ఏ కాలములో (భూమిమ్+ద్యామ్+చ) పృథ్వి మరియు ద్యులోకమును (జనయత్+విశ్వకర్మా) ఉత్పన్నము జేయుచున్న విశ్వకర్త (విశ్వచక్షాః) మరియు సర్వద్రష్ట పరమాత్మ (మహినా) తన సామర్థ్యముతో (వి+ఔర్ణోత్) సమస్త జగత్తును కప్పివేయును?

**కిꣳస్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్ భువనాని ధారయన్ ॥**

యజు ౧౭-౨౦

(కిమ్+స్విత్+వనమ్) ఈ వన మేదియై యుండెను? (కః+ఉసః+వృక్షః+ఆస) ఆ

పెట్టుచుండి యుండెను? (యతః ద్యావా పృథివీ) పృథివిలోగల వృక్షముల నుండి ద్యులోకము వరకు (నిష్టతక్షుః) అలంకరించబడెను. (మనీషిణః) ఓ విద్వాంసులారా! (మనసా+ ఇత్+ తత్) మనస్సునుండి యిదికూడా (పృచ్ఛత) వారి నడుగవలెను (భువనాని+ ధారయన్) భువనములను ధరించును (యద్+ అధి+ అతిష్ఠత్) అతడు నిలబడుచోటు యేదియైయున్నది?

**విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో బాహురుత విశ్వతస్పాత్ ।**
**సం బాహుభ్యాం ధమతి సం పతత్రైర్ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః ॥**

(యజు ౧౭-౧౯)

(విశ్వతశ్చక్షుః) ఎవరైతే అన్నీ చూచెదరో మరియు (విశ్వతోముఖః) ఎవరి ముఖము అంతట యున్నదో (విశ్వతోబాహుః) ఎవరి బాహువులు మరియు (విశ్వతస్పాత్) కాళ్ళు సర్వత్రగలవో అతడు (ఏకః+ దేవః) ఒకదేవుడు (ద్యావాభూమీ+ జనయన్) సంపూర్ణ జగత్తును ఉత్పన్నము జేయును (బాహుభ్యామ్) తమ బాహువులతో (పతత్రైః) పరమాణువులతో (సంధమతి) చలనము కలిగించునో, అన్ని పరమాణువులలో చలనము కలిగించునో, పతత్ర యనగా నిత్యముండు పదార్థము. అది అదినుండి యుండెను. దానితోనే పరమేశ్వరుడు సృష్టి రచించెను అనునదే దీని ఆశయము. ఇదే విధముగా అనంత సూర్యులు, అనంత నక్షత్రములు మరియు అనంత పృథివి మొదలగు లోకాంతరములు గలవు. వాటి వర్ణన వేదములలో గనుపించును. ఇట్టి లక్షణములు వేదములే యీశ్వరీయ గ్రంథములని నిర్ధారించుటకు తోడ్పడును.

**౭. జీవుడు అనాది, అవినాశి, కర్మానుసారము ఫలము పొందునని తెలుపు గ్రంథమే వేదము.**

జీవుడు అనాది యని వేదములందంతట గోచరించును. "ఇన్ద్రః" శబ్దము జీవునకు వర్తించును. అచ్చట దీని కనుగుణ్యమైన ఒకే ఒక ఉదాహరణ మిచ్చెదను. కన్ను, చెవి, ముక్కు మొదలగు వానిని ఇన్ద్రియము లందురు. ఇన్ద్రుడైన జీవుని దర్శింపజేయునది. "ఇన్ద్ర" శబ్దము నుండి "ఇన్ద్రియ" శబ్దమేర్పడినది. ఇన్ద్రుడనాది చిరకాల ముండును. వేదములో దీని నిరూపణ అనేక స్థానములలో గలదు.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి**

ఋ ౧-౧౬౪-౨౦

ఈ వేదఋక్కు జీవుని అనాదిత్వమును ధ్రువపరచుచున్నది. జీవుని అనాదిగా భావించనివారి వాదనలు అనేక దోష భూయిష్ఠములైయున్నవి. పరమేశ్వరుడు అందరిని సమానముగా యేల సృష్టించలేదు? కొందరిని దుఃఖితులుగా మరికొందరిని సుఖసంతోషులుగా ఏల గావించెను? అభావము నుండి భావమెట్లేర్పడుచున్నది? నిష్పన్న, ఉత్పన్న శరీరము లేల? బుద్ధి కూడా శుభకర్మలలో లీనమగునట్లు కొందరిని, చెడు కర్మలలో ప్రవృత్తమగునట్లు కొందరను యేలజేయవలెను? కొందరకు మోక్షము మరికొందరకు బంధనమేల? పరమేశ్వరుడు తన యిష్టమొచ్చినట్లుగా గావించిన యందు దోషమెవ్వరిది? మనుష్యునిలోగల జీవునకు పశువులోగల జీవునకు భేదము ఎట్లు? కొందరు పశువులలో ఆత్మనే విశ్వసించెదరు. ఖురానులో భగవంతుడు కొందరిని నరకము కొరకు మరికొందరిని స్వర్గము కొరకు సృష్టించినాడని హేతువిరుద్ధముగా వర్ణించబడినది. కాని వేదములలో కర్మానుసారము విభాగము జేయబడినది. లోకములో కూడా కర్మానుసారముగా దొంగను దండించి శిష్టులను గౌరవించుచున్నారుగదా!

౮. మిథ్యా వర్ణనలు లేవిరి

వేదములో యెచ్చటను భగవన్నామము స్మరించినందువలన లేక విశేష సూక్తము పఠించుటవలన లేక భగవంతునిపై, ఋషిపై విశ్వాసముంచుటవలన చేసిన పాపములు పరిహారము కాగలవని చెప్పబడలేదు. దేవాలయములు, తీర్థయాత్రలు సేవించినందువలన పాపరహితుడగునని చెప్పబడలేదు. సంపూర్ణ వేదాధ్యయనము గావించినను ప్రయోజనముండబోదు. భగవంతుని ఆజ్ఞను పాలించుచు ఆచరించునంతవరకు, పరమేశ్వర వాణిని అర్థము జేసికొననంతవరకు యెట్టి ప్రయోజనముండబోదు.

**ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః**
**యస్తన్నవేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే**

(ఋ.౧-౧౬౪-౩౯)

వేదములలో పాపములనుండి విమోచనము పొందు ప్రార్థనలు కలవు. కాని ఆ ప్రార్థనతో పాపవిముక్తులైనట్లు యే ఋషి పేరుగాని లేక యితరుల పేరుగాని పేర్కొనబడలేదు. చేసిన పాపమునకు అవశ్యముగా శిక్ష అనుభవించియే తీరవలెను.

**పాపవాచక శబ్దములు**

చేసిన పాపకర్మలనుండి విమోచనము లేనట్లు తెలిపెడు కొన్ని వైదిక శబ్దములనే సమీక్షింతము. పాపమునకు పర్యాయవాచకమైన శబ్దము 'కిల్బిషమ్'. 'కిల్' యనగా కుత్సితము. ఆ విషయము చాలా భయంకరమైనది. విష సేవనము చేయువాడనుభవించు

ఫలితమునే కుత్సితుడనుభవించును. రెండవపేరు "అంహస" అనగా గట్టి ఆఘాత పరచునది. పాపము మానవుని గట్టిగా ఆఘాతపరచును. అట్టిబాధనుండి తప్పించుకొనుట దుష్కరము. మూడవపేరు "దురితము" దాని ఆగమనమే దుఃఖదాయకము. ఈ శబ్దములన్నియు పాపఫలితము అవశ్యమనుభవించి తీరవలెనని సూచించుచున్నవి. కాని ఆశ్చర్యకరమైన విషయమేమన ! కేవలం క్రీస్తుయందో లేక రామనామ జపము చేయుట వల్లనో పాపములు దూరమగునని చెప్పుట హాస్యాస్పదము. ఇట్టి వర్ణనలే అన్య గ్రంథములలో గలవు.

## ౬. లౌకిక విజ్ఞానమునకు విరుద్ధముగా నుండరాదు

ఈ లక్షణమునకు అంతట అన్ని సంప్రదాయ గ్రంథములలో భిన్నముగా నున్నది. ఏ గ్రంథము ప్రత్యక్ష జ్ఞానమునకు వ్యతిరేకముగా నున్నదో అది యీశ్వరీయమెట్లగును? ఈశ్వరీయ గ్రంథముకాదు సరిగదా విద్వాంసులు రచించిన గ్రంథమని పేర్కొనుటకు కూడా వీలుపడదు. అందువలన వేదములు తప్ప యితరము లెవ్వియు యీశ్వరీయగ్రంథము లనుటకువీలుపడదు.

సూర్యుని చుట్టు భూమి భ్రమించుట: లౌకిక జ్ఞానము, ప్రత్యక్ష ప్రమాణము భూమి ఇతర శుక్ర, బృహస్పతి, చంద్ర గ్రహములవలె సూర్యునిచుట్టు తిరుగుచున్నది. భూమిగోళముగా నున్నది. దీనికి అనుకూలముగా యే గ్రంథమునందు కనిపించదు. కేవలము వేదమే యిందుకు అనుకూలముగా చెప్పుచున్నది.

కతరా పూర్వా కతరా పరాయోః కథాజాతే కవయః కోవివేద
విశ్వంత్మనా విభృతో యద్ధనామ వివర్తేతే అహనీ చక్రియేవ ॥
(ఋ. ౧-౧౮౫-౧)

ఈ ఋక్కు ననుసరించి కేవలము భూమియేగాక సమస్త నక్షత్రరాసులు నియమబద్ధముగా భ్రమణము జేయుట సిద్ధపరచుచున్నది. పూర్వ పశ్చిమ, పైన క్రింద మొదలగునవి వ్యవహారము కొరకు కల్పితమైనవి. వాస్తవము కాదు. ఆ విషయము కూడా దీనివలన తెలియనగును.

ఈ వేద మంత్రము కూడా పృథివి సూర్యునికి నాలుగు వైపుల భ్రమణముగావించుచున్నటుల తెలుపుచున్నది.

అహస్తా యదపదీ వర్ధత క్షాః శచీభిర్వేద్యానామ్
శుష్ణం పరి ప్రదక్షిణిత్ విశ్వాయవే నిశ్నథః (ఋ ౧౦-౨౨-౧౪)

సూర్యుడు తన ఆకర్షణ శక్తిచేత పృథివిని నాలుగు వైపుల తిరుగజేయుచున్నాడని యీ వేదమంత్రము తెలుపుచున్నది.

సవితాయంత్రైః పృథివీ మరమ్ణాదస్కంభనే సవితా ద్యామదృంహత్।
అశ్వమివా ధుక్షద్ధుని మన్తరిక్షమతూర్తే బద్ధం సవితా సముద్రమ్ ॥
(ఋ.౧౦-౧౪౯-౧)

దీనివలన అనేక నక్షత్రములు సూర్యునిచుట్టు భ్రమించుచున్నటుల తెలియుచున్నది. చంద్రుని ప్రకాశము సూర్యరశ్మినుండియే కలుగుచున్నది

అత్రాహ గోర మన్వత నామ త్వష్టురపీచ్యమ్।
ఇత్థాచన్ద్రమసో గృహే ॥ (ఋ. ౧-౮౪-౧౫)

ఈ ఋక్కును యాస్కాచార్యుడు వ్యాఖ్యానించుచు ఇట్లు పేర్కొనెను. తదేవోపేక్షితవ్యమ్ - ఆదిత్యతోఽస్య దీప్తిర్భవతి పునః సోమో వధూయురభవదశ్వినాస్తా ముభావరా సూర్యా యత్పత్యే శంసన్తీం మనసా సవితాదదాత్ ॥
(ఋ. ౧౦-౮౫-౯)

సూర్యుని ద్వారానే చంద్రుడు ప్రకాశించుచున్నాడు అను విషయము సిద్ధమగుచున్నది. ఇట్టి ఋక్కులు వేదములో అనేకము కలవు.

గ్రహణ చర్చ : గ్రహణ విషయిక చర్చ కూడా వేదములలో గనుపించును. పృథివి ఛాయవలన చంద్ర గ్రహణము మరియు చంద్రుని ఛాయవలన సూర్యగ్రహణములు కలుగుచున్నవి.

యంత్వా సూర్య స్వర్భానుస్తమసా విధ్యదాసురః అక్షేత్రవిద్
యథా ముగ్ధో భువనాన్య దీధయుః (ఋ.౫-౪౦-౫)
యం వై సూర్యం స్వర్భానుస్తమసా విధ్యదాసురః
అత్రయస్త మన్వవిన్దన్నహ్యన్యే అశక్నువన్ ॥ (ఋ౫-౪౦-౯)

ఆకర్షణ శక్తి : ఆకర్షణశక్తి వివరణ కూడా వేదములలో గలదు.

ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్న మృతం మర్త్యఞ్చ
హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి భువనాని పశ్యన్ ॥ (ఋ. ౧-౩౫-౨)

వేదములలో సూర్యునకు ఒక నామము 'కృష్ణ' గలదు. పృథ్వీ మొదలగు భువనములను తనవైపు ఆకర్షించును.

కృష్ణం నియానం హరయః సుపర్ణా అపోవసానా దివ ముత్పతన్తి

**త ఆవవృత్రన్నదవా దృతప్యేదిద్ ష్పుతేన పృథివీ వ్యుద్యతే॥** (ఋ. ౧-౧౬౪-౪౨)

వేదములలో సూర్యునకు వేరొక నామము 'విచర్షణి' యని గలదు. 'కృష్' ధాతువు నుండి 'చర్షణి' శబ్దము సిద్ధమగుచున్నది. 'కృష్' ధాతువు యొక్క అర్థము 'ఆకర్షణ' యగుచున్నది దీనినుండియే ఆకర్షణ, ఆకృష్టి మరియు కృష్ణ మొదలగు అనేక శబ్దములు యేర్పడుచున్నవి. ఈ ఋక్కును చూడుడు.

**హిరణ్యపాణిః సవితా విచర్షణి రుభే ద్యావా పృథివీ అన్తరీయతే**
**అపామీవాం బాధతే వేతి సూర్యమభికృష్ణేన రజసా ద్యామృణోతి**
(ఋ.౧-౩౫-౯)

పఞ్చారే చక్రే పరివర్తమానే తస్మిన్నా తస్థుర్భువనాని విశ్వా।
**తస్య నాక్షస్తప్యతే భూరిభారః సనాదేవ న శీర్యతే సనాభిః॥**
(ఋ.౧-౧౬౪-౧౩)

పై ఋక్కు ద్వారా అనేక విషయములు సిద్ధమగుచున్నవి.

(క) "భువనాని విశ్వా" సంపూర్ణ భువనము సూర్యుని రథముపైయున్నది. దీనివలన సూర్యగోళము పృథివ్యాది లోకముల కంటే పెద్దదని తెలియుచున్నది.

(ఖ) "భూరిభారః" దీనివలన ఆకర్షణ సిద్ధమగుచున్నది.

(గ) "సనాభిః" బన్ధనార్థక 'ణహ' ధాతువునుండి నాభి యేర్పడుచున్నది. మానవ శరీరములో నాభి సంపూర్ణ శరీరమును బంధించుచున్నట్లు సూర్యుడు పృథివ్యాది లోకముల నన్నింటిని బంధించుచున్నాడు. అతడు తన ఆకర్షణ శక్తితో తనకు యెడముగా నున్న లోకములను ఆకర్షించి యథాస్థితిలో నుంచగలుగుచున్నాడు.

**వ్యస్తభ్నా రోదసీ విష్ణవేతే దాధర్థ పృథివీ మభితో మయూఖైః।**
(ఋ.౭-౯౯-౩)

'ద్యావా, పృథివీ' రెండిటిని కలిపి 'రోదసి' యందురు. అందుచేత యిది ద్వివచనము. ఆసగరిగినదానిని రోదసి యందురు. "రోదసీ" యనుటతో పృథివీ మరియు యితర లోకములను కూడా రోదసీ యందురు. ఇవి పరస్పరము ఆకర్షణతో అడ్డుకొనుచున్నవి. దీనినుసరించి భాస్కరీయగ్రంథములో ఈశ్లోకము కనుపించును.

**ఆకృష్టశక్తిశ్చ మహీ తయా యత్ స్వస్థం గురు స్వాభిముఖీ కరోతి।**
**ఆకృష్యతే తత్ పతతీవ భాతి స మే సమన్తాత్ కురియం ప్రతీతిః॥**

వస్తువు నామముతో దాని స్వభావము మరియు స్థితి బీజరూపములో వ్యక్తమగుటయే వైదిక భాషయొక్క ప్రత్యేకత.

**జగత్ మరియు సంసార్ శబ్దములు :** ఈ రెండు శబ్దములు ప్రత్యేక వస్తువు చలనము కలిగియున్నట్లు నిరూపించుచున్నవి. **"పునః గచ్ఛతీతి జగత్"**, యెది యెల్లప్పుడు చలనము కలిగి యుండునో దానిని జగత్తందురు. **"సంసరతీతి సంసారః"** చక్కగా తిరుగుచున్న దానిని సంసారమందురు. భూమిపై నుండి తిలకించిన చంద్రుడు, నక్షత్ర రాశులు గమనము జేయుచున్నట్లు కనుపించును. అటులే అన్యలోకవాసులకు భూమికూడా తిరుగుచున్నట్లు కనుపించును. ఆకాశములో నున్న పెద్ద పెద్ద నక్షత్రములే గతిగలిగి యుండగా భూమియేల గతిమతికాదు? మరియును ఎట్టి ఆధారములేని అనంత నక్షత్ర రాసులు తమ తమ స్థానములలో విరాజిల్లుచుండ భూమి మాత్రము యేల విరాజిల్లకూడదు? పృథివికి గల నామములలో నొక నామము "గౌ" అని గలదు. "గచ్ఛతీతి గౌః" ఏది నడుచునో దానిని "గౌ" అందురు. అటులే యితర శబ్దములలో విజ్ఞానము కలదు. అందుచేతనే వేదమే యీశ్వరీయమని చెప్పవచ్చును.

౧౦. **ఈశ్వరీయ కార్యముల కనుగుణ్యముగా ఉత్సవ, పర్వ, పూజాదిక విధానముండవలెను**

ప్రతి మాసములో దర్శేష్టి మరియు పూర్ణమాసేష్టి యజ్ఞ విధానము గలదు. అమావాస్య రోజు చంద్రుడు కొంచెము కూడా గనుపించడు. దానికి భిన్నముగా పౌర్ణమి తిథినాడు సంపూర్ణ చంద్రుడు కనుపించును. ఆరోజు నుండియే చంద్రబింబము తగ్గుచు పోవును. ఇవి ప్రాకృతిక విషయములు. చంద్రుడు వృద్ధిజెందుట, క్షీణించు విషయ జ్ఞానము ప్రతి మనిషి కలిగి యుండవలెను. అందుచేత వేదములతో యీ రెండు రోజులు విశేషముగా యజ్ఞము జేయవలెను. ఇదే విధముగా చాతుర్మాసేష్టి యజ్ఞ విధానము గలదు. వర్ష ఋతువు కూడా ప్రాకృతిక ఘటనయే గదా? ఇన్ని మేఘము లెచ్చట నుండి వచ్చును? ఏ విధముగా సముద్రపు నీరు మేఘములుగా పరివర్తన జెందుచున్నవి ? ఈ మాసములలో యిన్ని మేఘములెట్లు యేర్పడుచున్నవి? కొన్ని ప్రదేశములలో యెక్కువగా, మరికొన్ని ప్రదేశములలో తక్కువగా యేల వర్షించుచున్నవి? మొదలగు విషయములు ప్రతి మనిషికి తెలిసి యుండవలెను.

**జ్యోతిష్టోమయజ్ఞము, గవామయనము, అఙ్గిరసామయనము, అశ్వమేధము:** ఇత్యాది యజ్ఞములు సౌరమానము, చంద్రమానము నందు భేదమెట్లు ఏర్పడుచున్నది? వీని రెండింటిని యెట్లు యేకము జేయవచ్చునను విషయజ్ఞానము కలుగుచున్నది. ఋతు పరివర్తన మెట్లేర్పడుచున్నది ? ఋతు విభాగము యెట్లు జేయబడుచున్నది? ఏ తిథి నుండి యే తిథి వరకు ఆయా ఋతువులు క్రమబద్ధమగుచున్నవి?

సౌరమానముయొప్పటి నుండి ప్రారంభమై యెప్పుడంతమగుచున్నది? మొదలగువిషయ జ్ఞానము ప్రతివారి కవసరముగదా! అందుకొఱకై జ్యోతిష్టమయనము మొదలగు యజ్ఞములు జేయబడుచున్నవి. అగ్నిష్టోమము, దర్శాది యజ్ఞములుకూడా అందుచేతనే జేయబడుచున్నవి.

ఆర్యులు జేయునట్టి ప్రాత్యహ్నిక క్రియలవలన కూడా యివేవిషయములు గోచరించును. సంధ్యోపాసన, సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములలో జరుపబడు విధి కలదు. పరమేశ్వరోపాసన యెప్పుడైనను జేయవచ్చును. కాని సూర్యోదయ, సూర్యాస్తమయ కాలములలో విచిత్ర సంఘటన దృశ్యమానమగును. ఉదయం సాయంకాలములందు కలుగు పరివర్తన ప్రతి వారు గమనించుచునే యున్నారు. ఒకవైపు సమస్త నక్షత్రములు అస్తమయ మగుచుండ వేరొకవైపు సూర్యోదయము జరుగుచుండును. అంధకార వినాశము జ్యోతి ప్రకాశము, మనుష్య జాతికి నిద్ర నుండి మేల్కొనుట మరియు జీవన కార్యక్రమ ప్రారంభము జరుగును. ఉదయమున కొన్ని ప్రాణులు తప్ప మిగిలిన వన్నియు మేల్కొని తమ తమ పలుకులతో రాత్రి యొక్క నిశ్శబ్దత దూరము జేయుచుండుట గమనార్హము. రాత్రి సమయము ఒక ప్రళయము వలె భయముగొలుపునదిగా, దొంగలకు, దోపిడీగాండ్రకు మరియు వ్యభిచారులకు సహాయకారి నుండునదియైయుండెను. సూర్యోదయముతో అట్టి భయంకర వాతావరణము తొలగిపోయి ఆనందమయముగా సజ్జనులకు అనుకూలమైనదయ్యెను. నిశీథ సమయము భయంకరమైన నిశ్శబ్దతతో కూడి యుండి ప్రభాతమగునరికి అట్టి వన్నియు తొలగి పోవుచున్నవి. ఈ రెండు సమయములు ప్రాకృతిక ఆహ్లాదకర సమయములుగా భగవంతుని లీలలుగా గోచరించుచున్నవి. ఈ సమయములందు యీశ్వరోపాసన చేసినచో చిత్తము అతిప్రసన్నమగును.

అగ్నిహోత్రాది కర్మలు పరమేశ్వర విభూతి ప్రదర్శకములు. వైదికులు ప్రాతస్సాయంకాలములందు 'స్వాహా' కారముతో తమ సర్వస్వమును లోకోపకారార్థమై త్యజించు భావము స్ఫుటమగుచున్నది. నాలుగువైపుల సుగంధము వ్యాపించుచున్నది. ప్రజల మనస్సులు ప్రసన్నమగుచున్నవి. ఇది గాక ఉపాసకులు ప్రతి నిత్యము తమ కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది అరిషడ్వర్గములను కొంత కొంత అహుతిగా నిచ్చు భావము కలిగియుందురు. అగ్నిహోత్ర, ఉపాసనాది కర్మలు పరమేశ్వర విభూతి ప్రదర్శకములనుటలో సందేహము లేదు.

## వేదములో స్త్రీ స్థానము

ప్రపంచములో గల మతములన్నియు స్త్రీలను సహస్రాబ్దముల నుండి అణచిపెట్టి వారిని కేవలము భోగలాలస వస్తువుగా పరిగణించుట జరుగుచున్నది. కేవలము వేదధర్మము మాత్రమే స్త్రీలకు పురుషులతో సమానముగా సామాజిక, ఆర్థిక, రాజకీయ, ధార్మిక, సమానతను ప్రతిపాదించుచున్నది. అట్టి వేద ఋక్కులకు కొందరు విపరీత వ్యాఖ్యానములు గావించి **"స్త్రీ శూద్రౌనాధీయతా మితిశ్రుతేః"** యని స్త్రీలు, శూద్రులు వేదము చదువకూడదని నిషేధించిరి. అయితే యిది వేదవాక్యము కాదు. ఇది కేవలము సంస్కృతవాక్యము. అటులే, సతీసహగమనము వేదానుకూలమని వ్యాఖ్యానించి ఇతిహాసమును మరచి నగుబాట్లపాలైరి. **"అష్టవర్షాత్ భవేత్కన్యా"** యని బాల్య వివాహములను సమర్థించి బాల వితంతువులను అనేక కష్టములకు గురిచేసి తమ జాతి పతనమునకు కారకులైనారు. బాలవితంతువులు యితర మతాలలో చేరిపోయారు. ఏ మతస్థులు కూడా స్త్రీకి "బ్రహ్మ" స్థానమియ్యలేదు. కేవలము వేదధర్మము మాత్రమే బ్రహ్మస్థానమే గాక స్త్రీలను మంత్రద్రష్టలుగా ఋషికలుగా మాన్యత నొసంగినది.

మను ధర్మ శాస్త్రములో **"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః"** ఎక్కడ స్త్రీ లు ఆదరించబడుచున్నారో అక్కడ దేవతలు విహరించెదరని చెప్పబడినది. **"కలకంఠ కంటి కన్నీరొలికిన సిరి యింట నుండనొల్లదు సుమతీ"** యని సుమతి శతకకారుడు చెప్పుచున్నాడు.

### మంత్రద్రష్టలైన స్త్రీలు

**అపాల :** అత్రిమహర్షి కూతురు బ్రహ్మవాదిని అపాల. ఈమె ఋగ్వేద అష్టమమండలము యొక్క ౯౧ వ సూక్తమును వ్యాఖ్యానించెను. ఇందు సమాన గుణములు, శీలము గల వరుని కన్య వరించుట వివరించబడినది.

**కాక్షీవతి ఘోష :** ఋగ్వేద పదవ మండలములోని ౩౯ వ సూక్తమంత్రములకు ద్రష్టయైన యీమె కక్షవతుని పుత్రిక. ఈ మండలము యొక్క ౪౦ వ సూక్తమునకు కూడా ఆమెయే ద్రష్ట. ఇందు అశ్వినీదేవతలను, గృహస్థులను తమ సంతానమునకు మంచి శిక్షణ యిచ్చు విషయము ప్రార్థించబడినది. ఇందు భర్త మరణించిన స్త్రీ తన మరిదిని కేవలము సంతానం కొరకే వివాహమాడుట లేక నియోగము జరుపుట ప్రస్తావించబడినది.

**రోమశా :** ఋగ్వేద పదవ మండలము యొక్క ౧౫౯ వ సూక్తమును వ్యాఖ్యానించినది. ఇందు రాజకీయముల వర్ణన గలదు. ఆరవ మంత్రవివరణ **"యథా పీల్వా సంఖ్యాతాని**

సుఖాని స్యుః సా సర్వే సంపాదనీయా'' ఏ నీతి వలన అధిక సుఖములు ప్రాప్తించునో అట్టి నీతి అందరికి అనుసరణీయము మరియు ఆమోదయోగ్యము. ఏడవ మంత్రములో "ప్రశస్తలోమా, గంధారీ మివయంథా పృథివీ రాజ్యధర్మణా వర్త్యే అలికా'' రాజ పురుషులకు పాలకుడగునో రాణి తను స్త్రీలకు పాలకురాలగును.

**లోపాముద్ర** : అగస్త్యుని భార్య లోపాముద్ర. ఋగ్వేద దశమ మండలము యొక్క ౧౭౯ వ సూక్తమును వ్యాఖ్యానించెను. మహర్షి ననుసరించి యీ మంత్రమునకు దేవత దంపతి. మంత్రములో గల లోపాముద్ర శబ్దమునకు మహర్షి కామయుక్త కన్య యని పేర్కొనెను.

**వాగమ్భృణీ** : ఋగ్వేద దశమమండలము యొక్క ౧౨౫ వ సూక్తమునకు వివరణ యిచ్చెను. ఈ సూక్తము తేజోవంతమైన స్ఫూర్తిదాయక భావనలతో నిండి యున్నది. ఈ దేశలక్ష్మి దేశమునకు చెందిన పురుషులకు యథోచిత వీరత్వము, బ్రహ్మతేజము, సాధుత్వము మరియు మేధస్సు ప్రదానము చేయుచున్నది. "యం కామేతం తు ముగ్ర కరోమి తం బ్రహ్మాణా తమూర్షితం సుమేధామ్''(ఋ.౧౦-౧౨-౬-3) ఇదే శక్తి బ్రహ్మ ద్వేషులను నశింపచేయుటకు క్షత్రియునిచే ధనుస్సు ధరింపజేయును."అహం రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మ ద్విషే శరవే హన్తవి.''

**విశ్వవారాజాత్రేయం** : ఋగ్వేద పంచమ మండలము యొక్క ౨౮ వ సూక్త ద్రష్టి విశ్వవారజత్రేయ.

**శచిపౌలోమి** : ఋగ్వేదదశమ మండలముయొక్క ద్రష్టి శచిపౌలోమి. పులోమరాజ యొక్క కూతురు. ఇందు స్త్రీల గొప్పతనము, వారి ఓజస్సు, తేజస్సు మొదలగు విషయములు అత్యంత ప్రభావవంతముగా పేర్కొనబడినవి. "అహం కేతురహం మూర్ధాహముగ్రా వివాచన తథాగము పుత్రాః శత్రుహణోదర్థో దుహితామే విరాట్ ఉతహోస్మి సంజయా పత్యోమే శ్లోకఉత్తమః'' ఇందు క్షాత్రభావము వ్యక్తమగుచున్నది.

**శాశ్వత ఆంగీరస** : అంగీరస ఋషిపత్ని శాశ్వతి. ఋగ్వేద అష్టమ మండల ప్రథమ సూక్తము యొక్క 3౪వ మంత్రములో శాశ్వతిశబ్దము ప్రయోగించబడినది.

**పావరాక్షి** : ఋగ్వేదమండలము యొక్క ౯౧వ సూక్తము యొక ద్రష్టి పావరాక్షి. ఐతరేయబ్రాహ్మణము నందు (౫-౨౩-౧-౨౬) యీ విషయము గోచరించును. మూడు మంత్రములలో ఆకాశమునందు గల లోకములు మరియు జ్యోతిష్మండలము ఉదహరించబడినది.

**సిక్తాని వావరీ** : ఋగ్వేద నవమ మండలము యొక్క ౮౬ వ సూక్తములో ౧౧వ మంత్రము నుండి ౨౦వ మంత్రద్రష్టి సిక్తానివావరీ. నవమ మండలము పూర్తి ప్రతిపాదన పవమానసోమము.

**సూర్యాసావిత్రి** : ఋగ్వేద దశమ మండలము యొక్క ౮౫ వ సూక్త ద్రష్టి సూర్యా సావిత్రి. అందు వివాహ సంస్కార ప్రకియ పేర్కొనబడినది. ౪౭ మంత్రములలో వివాహ ప్రక్రియేగాక యితర విషయములు వర్ణించబడినవి. మొదటి అయిదు మంత్రములలో సోమరసమును గూర్చి గలదు. సోమలత యొక్క ఔషధిగుణము మరియు ఆధ్యాత్మిక సంబంధమైన ద్వివిధ విషయములు పేర్కొన్నైనది.

౧౬ నుండి ౪౭ వ మంత్రము వరకు వివాహమును గురించియే గలదు. మిగిలిన మంత్రములలో వైవాహిక జీవన సంబంధ విషయములు పేర్కొనబడినవి. "ప్రత్వా ముంచామి వరుణస్యపాశాత్"(౮౫-౨౪) "ప్రేతోముంచామి నాముతః" (౮౫-౨౫) "సుమంగలీ రియం వధూ" (౮౫-33)"గృహ్ణామి తే సౌభగత్వాయ హస్తం" (౮౫-3౬) "తుభ్య మగ్రే"(౮౫-3౮) "సోమప్రథ మోవివిదే"(౮౫-౪౦) "ఇహైవస్తం మావియౌష్టం" (౮౫-౪౨) "అఘోరచక్షుః" (౮-౪౪) "ఇమాత్వ మిన్ద్ర మీఢవ" (౮౫-౪౫) ఈ మంత్రములు వివాహ సంస్కారములోనివి. ఇందు కొన్ని విధవా వివాహ పరముగానున్నవని మహర్షి వివరించెను.

**శ్రద్ధాకామాయణీ** : కామగోత్రోత్పన్న శ్రద్ధ కూడా ఋగ్వేద పదవ మండలము యొక్క ౧౫౧వ సూక్తమును దర్శించెను. ఇది ప్రసిద్ధమైన సూక్తము. కామాయిని శ్రద్ధయొక్క వర్ణన బ్రాహ్మణ సాహిత్యమునందు లభించును.

**ఇన్ద్రాణీ** : ఋగ్వేద దశమ మండలము యొక్క రెండు సూక్తములను ఇన్ద్రాణీ దర్శించెను. ఇందు ౨౩ మంత్రములలో ప్రతి మంత్రము చివర "విశ్వస్మా దిన్ద్ర ఉత్తరః'' కలదు. ౪౫ వ సూక్తము కూడా యీ ఋషికదే. పండిత జయదేవశర్మ విద్యాలంకార్ యీ మంత్రములందు బ్రహ్మ విద్య మరియు అవిద్య యొక్క నాశనము అర్థము గావించెను.

**ఊర్వశి** : ఋగ్వేద దశమ మండలముయొక్క ౯౫ వ సూక్తములోని కొన్ని మంత్రములను యీమె దర్శించెను. పురూరవ ఊర్వశి సంవాదము కలిగిన యీ సూక్తము వైదిక విద్వాంసుల విమర్శకు గురియైనది. ఈ సూక్తము యొక్క మిలిగిన మంత్రముల దేవతకూడా ఊర్వశియే. శతపథ బ్రాహ్మణము నందు, కాత్యాయనుడు రచించిన సర్వానుక్రమణీ మరియు బృహద్దేవత గ్రంథములలో ఊర్వశి కథ కనుపించును. మహాభారత

మరియు యితర పురాణములందు ఊర్వశి అనేక విధములుగా పేర్కొనబడినది. మహర్షి ఊర్వశిని విద్యుచ్ఛక్తిగా పేర్కొనెను.

**యమీవైవస్వతీ :** ఋగ్వేద దశమ మండలముయొక్క పదవ సూక్తము యమ, యమీల సంవాదము. అర్థముల భిన్నత్వము ననుసరించి వైదిక విద్వాంసుల ఊహాపోహలకు కారణమగుచున్నది. సాయణాదిభాష్యకారులు యమ, యమీలను సోదర సోదరులుగా వర్ణించిరి. లౌకిక తత్వముల ప్రతీకగా యీ సూక్తమునకు ఆధిభౌతిక అర్థమును గావించిరి. ఈ సూక్తము యొక్క అనేక మంత్రముల ద్రష్టవైవస్వతీ. ౭ వ మంత్రము యొక్క అంతిమ ఉక్తి "అన్యమిచ్ఛస్వ సుభగేపతి" కి దయానందుడు నియోగపరముగా అర్థము చెప్పెను.

**అదితి దాక్షాయణీ :** వైదిక సాహిత్యమునందు అదితి చాలాచోట్ల కనిపించును. ఋగ్వేదము నందు గోవు అర్థములో అదితి శబ్దము ప్రయోగింపబడినది. ఋగ్వేద దశమ మండలము యొక్క ౭౨వ సూక్తము యొక్క ద్రష్ట అదితి దాక్షాయణీ. తొమ్మిది మంత్రములు గల యీ సూక్తము నందు అనేక రహస్య పూర్ణ విషయములు గలవు. సూక్తము యొక్క నాలుగు మంత్రములలో అదితి శబ్దము గలదు. నాల్గవ మంత్రమునందు"**అదితి ర్దక్ష అజాయత**" అదితి (అఖండనీయ ప్రకృతి) నుండి దక్షదర్శము చేయు అగ్ని ఆవిర్భవించినది. అయిదవ మంత్రములో అదితిని దక్షుని కూతురిగా పేర్కొనబడినది. "**అదితి హ్యజనిష్ఠ దక్షయా దుహితాతవ**' అప్పుట దక్షుని సూర్యుని పరముగా, అదితిని భూమిపరముగా చెప్పుకొనుట సమంజసము. ఎనిమిదవ మంత్రములో అదితి ౮ మంది పుత్రులు ప్రకృతి, మహత్, అహంకారము పంచతన్మాత్రులుగా వర్ణించబడినది. తొమ్మిదవ మంత్రములో అదితి యేడుగురు కొడుకుల విషయమై వర్ణించనైనది. మంత్రములో పేర్కొనిన అదితి, మంత్రద్రష్ట అదితి దాక్షాయణీ కంటె భిన్నమైనది. ఈ విషయమై పరిశోధించ దగును.

ఋగ్వేదములో అన్య భిన్న సంహితల మంత్రముల ద్రష్ట ఋషికలుగానే పేర్కొనవచ్చును. యజుర్వేద ౧౭ వ అధ్యాయము యొక్క ౧౧,౧౨,౧౩,౧౪ మంత్రముల ద్రష్ట లోపాముద్ర. అథర్వ వేద పదవ కాండము యొక్క ౪౧ వ సూక్తము యొక్క ద్రష్ట సర్పరాణీ. అథర్వవేద ౧౪ వ కాండమునందు గల అనువాకముల సూక్తముల ద్రష్ట సావిత్రీ సూర్య. ఈ రెండు సూక్తములు వివాహపరమైనవి.

ఋ. ౮-౩౩-౪ "**స్త్రీ హి బ్రహ్మాబభూవిథ**" స్త్రీ బ్రహ్మగా చతుర్వేద అధ్యయన అధ్యాపన చేయగలిగినదై యుండాలి.

"ద్వివిధాః స్త్రియో భవంతి బ్రహ్మవాదిన్యః సద్యోవధ్వశ్చ తత్ర బ్రహ్మవాదినీనా ముపనయనమ్ అగ్నీంధనం వేదాధ్యయనం స్వగృహే భిక్షాచర్యా చ" (హారీత ధర్మసూత్రము ౨౧/౨౦-౨౩) వేదాది శాస్త్రముల అధ్యయనము, అధ్యాపనము చేయువారు, వేదములను చదువకుండనే వివాహం చేసుకొనే వారుగా రెండు రకములైన స్త్రీలుంటారు. వారిలో వేదపఠనము చేయు స్త్రీలకు ఉపనయనము యజ్ఞానుష్ఠానము, మరియు తన పరివారములోనే భిక్షాటన చేసుకొనవలసిన విధానం ఉంది. శ్రౌతసూత్రాలలో "ఇమం మంత్రం పత్నీ పఠేత్" (ఆశ్వలాయన శ్రౌతసూత్రం ౧-౧౧) ఈ మంత్రాన్ని భార్య చదవాలి యని స్పష్టముగా ఆదేశింపబడినది. "పత్నీ పురోనువాక్యమను బ్రూయాత్" (తైత్తిరీయ బ్రాహ్మణం (౧/౬-౫-౬) భార్య పురోను వాక్య మంత్రములను చదవాలి.

మనుస్మృతిలో "పురాకల్పేతు నారీణాం మౌంజీ బంధన మిష్యతే అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా" పూర్వకాలములో కూడ స్త్రీలకు ఉపనయనము, మేఖలాధారణము, వేదాధ్యయనము, అధ్యాపనము, గాయత్రీ మంత్రపాఠముల విధానం ఉండేది.

"**సమంజంతు విశ్వే దేవాః సమాపో హృదయానినౌ**" యని వివాహ సంస్కారములో వధూవరులచేత తమ హృదయములు జలములవలె ప్రశాంతముగా వేర్వేరు నదుల నీరు కలిసినప్పుడు వానిని విడదీయరానట్లు తమ హృదయములు కూడా కలిసిమెలసి విడదీయరానివిగా నుండవలెనని కోరబడుచున్నది.

లాజాహోమములో భార్య "ఓం. ఇదం నార్యుపబ్రూతే లాజానా వపంతికా ఆయుష్మానస్తు మే పతిరేధన్తాం జ్ఞాతయో మమ." పేలాలు (పేల్చుచున్న నేను ప్రార్థించుచున్నాను. నా భర్త చిరంజీవి యగుగాక! నా జ్ఞాతి బంధువులు వర్థిల్లుదురు గాక యని ప్రార్థించును.

చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్‌యజ్ఞం దధే సరస్వతీ ॥

యజు. ౨౦/౮౪

స్త్రీల మధ్యలో విదుషీస్త్రీ యున్నచో ఆమె యితరులను విద్యావంతుల జేయవలెను. స్త్రీలలో విద్యాభివృద్ధికే పాటుపడవలెను.

**స్త్రీలకు యజ్ఞాధికారము :** స్త్రీలకు యజ్ఞాధికారం విషయమై వేదములలో యెట్టి వివాదము లేనప్పటికి మధ్యకాలములో మిడిమిడి జ్ఞానము గల పండితులు స్త్రీలకు

యజ్ఞాధికారము లేదని చెప్పిరి. మనుస్మృతిలో కూడా యిందు కనుకూలముగా ప్రక్షిప్తములను చేర్చిరి. కాని యాజ్ఞవల్క్యుడు పత్నీ సహితముగా యజ్ఞము చేయవలెను. లేనిచో అట్టి యజ్ఞము వ్యర్థము. "అయజ్ఞియో వై షయోఽపత్నీకః" ఋగ్.౧-౧౪౬-౩ లో రెండు ధేనువులు ఒకే లేగవైపు పరుగెత్తుచున్నట్లు వర్ణన కలదు. ఆ రెండు ధేనువులు యజమానుడు మరియు అతని భార్య. లేగ యజ్ఞవేదిక. "సమానం వత్సం అభిసంచరన్తీ విష్వగ్ ధేనూ విచరతః సుమేకే." ఋగ్ ౮-౩౧-౫-౮ "యా దంపతీ సమనసా సునుత ఆ చ ధావతః దేవాసో నిత్యయా శిరా" ౮-౩౧-౫ లో యజ్ఞప్రార్థన చేయుచు యజ్ఞములో యే దంపతులు సమానమైన మనసుతో సోమరసమును గోవుపాలతో కలుపుదురో, హవిస్సుకు అనుకూలముగా అన్నము మొదలగు వస్తువులను చేర్చెదరో, యజ్ఞములో గల దేవతలను తృప్తిపరచెదరో వారికి అన్నము, సంతానము, హిరణ్యము మొదలగు వానికి కొదువ యుండదు.

శ్రీరామచంద్రుడు అశ్వమేధయాగము చేయ పూనుకొనినపుడు తిరిగి అతనిని వివాహము చేసుకొనుమని ఆదేశించిరి. కాని అతడు అందుల కంగీకరించనందువలన బంగారపు సీత విగ్రహమును తయారు చేయించి అతని ప్రక్కన కూర్చుండబెట్టిరి. శ్రీరాముడు అరణ్యవాసమునకు వెళ్ళుటకు పూర్వము తల్లి ఆశీర్వాదమునకై వెళ్ళెను. అప్పుడు కౌసల్య దైనిక యజ్ఞము చేయుచుండెను. ఈ విధముగా స్త్రీలు వేదపఠనమున కర్హులేగాక వేదమంత్ర ద్రష్టలైరి.

## వేదాలలో ఈశ్వర ప్రార్థన

**యో భూతం చ భవ్యం చ సర్వం యశ్చాధితిష్ఠతి**
**స్వర్యస్య చ కేవలం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ౧**

అథర్వ. కాండ ౧౦ ప్రపాఠక ౨౩. అనువాక ౪. సూక్త ౮. మంత్ర ౧.

(యో భూతం) ఏ పరమేశ్వరుడు భూత భవిష్యద్వర్తమాన కాలములను అతిక్రమించి విరాజిల్లుచున్నాడో, ఆ మూడు కాలములందును జరుగు వ్యవహారములను అన్నింటిని సరిగా ఎఱుగునో, (సర్వం యః చ అధితిష్ఠతి) ఎవడు సమస్త జగత్తును తన విజ్ఞానముచే ఎఱుంగునో, పుట్టించి, పోషించి, లయమొనర్చునో, మఱియు విశ్వమునందలి పదార్థములకు అధిష్ఠాతస్వామియో (స్వః యస్య చ కేవలమ్) కేవలసుఖమే ఎవనికి స్వరూపమో, ఎవడు మోక్షమును, వ్యావహారిక సుఖమును ఇచ్చువాడో, ఎవనికి లేశమాత్రమైనను దుఃఖము కలుగదో, ఎవడు ఆనందఘనుడో (తస్మై...నమః) అందరికంటె పెద్దయు సర్వసామర్థ్య యుక్తుడును అగు ఆ పరమాత్మకు అత్యంత ప్రేమతో నమస్కారము. (భూతము-గతకాలము, భవిష్యత్తు-రానున్న కాలము, వర్తమానము-జరుగుచున్న కాలము. మంత్రమునందలి యనేక చకారములు వర్తమానకాల సూచకములు.)

**యస్య భూమిః ప్రమాఽన్తరిక్షముతోదరమ్**
**దివం యశ్చక్రే మూర్ధానం, తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ౨**

అథ ౧౦. కాం ౨౩. ప్ర. ౪ అ. ౭ సూ. ౩౨ మం.

(యస్య భూమిః ప్రమా.) ఏ పరమేశ్వరుని ఉనికిని, జ్ఞానమును తెలుపుటకు భూమ్యాది పదార్థములు యథార్థ జ్ఞానసాధనములో, ఎవడు సృష్టిలో భూమిని పాదస్థానమున నుండునట్లు రచించెనో, (అంతరిక్ష ముత ఉదరమ్) భూమికి సూర్యాది గోళములకు మధ్యనుండు ఆకాశమును ఎవడు ఉదరస్థానమున నిర్మించెనో, (దివం యః చక్రే మూర్ధానం) ఎవడు ప్రకాశమాన పదార్థములను సృష్టిలో అన్నింటికి పై మస్తకస్థానమున నుంచెనో-ఎవడు భూమి మొదలు సూర్యాది లోకములవరకు గల సమస్త జగత్తును నిర్మించి దానియందు వ్యాపకుడై, జగత్తుయొక్క సర్వావయవములందు పూర్ణుడై అన్నిటిని ధరించుచున్నాడో - (తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః) ఆ పరబ్రహ్మకు నమస్కారము.

**యస్య సూర్యశ్చక్షుః చంద్రమాశ్చ పునర్ణవః**
**అగ్నిం యశ్చక్ర ఆస్యం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః. ౩**

అథ.కాం. ౧౦ ప్ర-౨౩. అను ౪ సూ ౭ మం. ౩౩.

(యస్య సూర్యః చక్షుః, చంద్రమాః చ.) ఎవనికి సూర్య చంద్రులు నేత్రస్థానములై ఉన్నవో, ఎవడు ప్రతికల్పాదియందును సూర్యచంద్రాది పదార్థములను మాటిమాటికి క్రొత్తవిగ రచించునో, (యః అగ్నిం ఆస్యం చక్రే) ఎవడు ముఖస్థానముగా అగ్నిని రచియించెనో, (తస్మై....నమః) ఆ పరబ్రహ్మకే నా నమోవాకములు.

**యస్య వాతః ప్రాణాపానౌ చక్షురంగిరసోఽభవన్**

**దిశో యశ్చక్రే ప్రజ్ఞానీ స్తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః.** ౪

అథర్వకాండ ౧౦ ప్ర-౨౩. అను ౪ సూ ౭ మం. ౩౪.

(యస్య వాతః ప్రాణాపానౌ) ఎవడు బ్రహ్మాండగత వాయువును ప్రాణాపానములవలె ఒనర్చెనో, (చక్షుః అంగిరసః అభవన్) ప్రకాశము నిచ్చు కిరణములను ఎవడు నేత్రములవలె జేసెనో - కిరణ ప్రకాశమువలననే రూపము (రంగు) గ్రహింపబడును. (నిరుక్తమున అంగిరస్ శబ్దమునకు అంగారా శబ్దముతో పైనజూపిన అర్థము వ్రాయబడినది.) (యః దిశః ప్రజ్ఞానీః చక్రే) ఎవడు దశదిశలను సర్వ వ్యవహారములను సిద్ధముచేయు వానిగ చేసెనో, అనంతవిద్యా యుక్తుడును, సర్వమానవులకు ఇష్టదేవుడును అగు నా పరబ్రహ్మకు మా నమస్కారములు.

**య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషం యస్య దేవాః**

**యస్య ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ**

**హవిషా విధేమ.** యజు.౩౫

(య ఆత్మదా...) ఏ జగదీశ్వరుడు దయతో తన ఆత్మ విజ్ఞానమును గలిగించునో, ఎవడు సర్వవిద్యలయు, సత్యసుఖములయు ప్రాప్తిని గలిగించునో, (బలదాః) ఎవడు శరీరమునకు, ఇంద్రియములకు, మనః ప్రాణాదులకును పుష్టి, ఉత్సాహము, పరాక్రమము, దృఢత్వమును ఇచ్చునో, (యస్య విశ్వే ఉపాసతే) విద్వాంసులెల్లరును ఎవని ఉపాసింతురు వచ్చిరో, (యస్య ప్రశిషం దేవాః)ఎవని అనుశాసనము-వేదోక్త శిక్షణమును శిష్టులెల్లరు నతి గౌరవముతో స్వీకరింతురో, (యస్యచ్ఛాయా అమృతం) ఎవనిని ఆశ్రయించుట మోక్షసుఖమునకు కారణమో (యస్య మృత్యుః) ఎవని అకృపయే జన్మ మరణరూప దుఃఖములను ఒసంగునో (-ఈశ్వరుని, అతని యుపదేశములగు సత్యవిద్యలను, సత్యధర్మములను, సత్యమోక్షమును నంగీకరింపక, వేదమునకు విరోధులై తన ఇచ్చవచ్చినట్లు దున్నములగు కోరికలతో దుష్కర్మలందు వర్తించు వారిపైన ఈశ్వరునకు కృప గలుగదు. అదియే అకృప. అది దుఃఖములకు కారణమగును. అతని ఆజ్ఞాపాలనమే సర్వసుఖములకు మూలమగును). (కస్మై దేవాయ హవిషా విధేమ.) సుఖస్వరూపుడును, సర్వప్రజాపతియునగు ఆ పరమేశ్వరుని ప్రాప్తికొఱకు సత్యప్రేమ- భక్తి-రూప సామగ్రితో మనము నిత్యము భజింతుముగాక! అందువలన మనకెట్టి దుఃఖము ఎన్నడు గలుగకుండు గాక! (శతపథ బ్రాహ్మణమున 'కః' శబ్దమునకు 'ప్రజాపతి' అని అర్థము వ్రాయబడినది.)

**ద్యౌః శాంతి రంతరిక్షం శాంతిః పృథివీ శాంతి**

**రాపః శాంతి రోషధయః శాంతిర్, వనస్పతయః**

**శాంతిర్ విశ్వేదేవాః శాంతిర్ బ్రహ్మశాంతిః**

**సర్వం శాంతిః శాంతిరేవ శాంతిః సా మా శాంతిరేధి** ౬

యజు. అ. ౩౬ మం.౧౭.

(ద్యౌః శాంతిః...) ఓ సర్వశక్తిమంతుడవగు భగవంతుడ! నీయందు మాకుగల భక్తి చేతను, నీ కృపచేతను (ద్యౌః) సూర్యాదిలోకముల ప్రకాశము, విజ్ఞానమును ఎల్లప్పుడు మాకు సుఖదాయకములగు గాక! అట్లే పృథివి, ఆకాశము, జలము, ఓషధులు, వనస్పతులు-వటవృక్షాదులు, ప్రపంచమునగల విద్వాంసులెల్లరు, బ్రహ్మము-వేదము అను ఈ పదార్థములు, మఱియు వీనికంటె నితరమగు జగత్తు అన్నియు మాకు సర్వకాలములందును సుఖమును ఒడగూర్చుగాక! సర్వపదార్థములు సర్వదినములందును మాకనుకూలములగుగాక! ఓ భగవంతుడ! ఇట్టి సర్వశాంతి వలన మాకు కృపతో విద్య, బుద్ధి, విజ్ఞానము, ఆరోగ్యము సర్వోత్తమ సహాయమును ఒసంగుము. ఉత్తమ గుణములను, సుఖమును ఒసంగి మమ్ములను, సర్వజగత్తును వృద్ధినొందింపుము.

**యతో యతః సమీహసే తతో నో అభయం కురు**

**శన్నః కురు ప్రజాభ్యోఽభయం నః పశుభ్యః.**

యజు. అ. ౩౬, మం. ౨౨.

(యతో యతః) ఓ పరమేశ్వర! నీవు ఏయే దేశమున జగత్తును రచించుచున్నావో, పాలించుచున్నావో, ఆ యా దేశము నుండి మమ్ములను భయరహితులనొనర్చుము - ఏదేశమునుండియు మాకు ఏకొంచెమును భయము కలుగకుండుగాక! (శం నః కురు...) అట్లే అన్ని దేశములందుగల నీ ప్రజలనుండి, పశువులనుండి మమ్ములను భయరహితులను చేయుము. మావలన వానికిని సుఖము కలుగుగాక! భయము కలుగరాదు. నీ ప్రజలలోని మనుజులవలనను, పశువులవలనను మాకు శుభము కలుగునట్లు చేయుము

ధర్మార్థకామమోక్షరూప పురుషార్థములు నీ అనుగ్రహమున మాకు శీఘ్రముగ ప్రాప్తించుగాక! అందువలన మానవజన్మమునకు ఫలములగు ధర్మాదులు సుఖముగ సిద్ధించునుగాక!

**యస్మిన్ ఋచః సామ యజూంషి యస్మిన్ప్రతిష్ఠితా రథనాభావివారాః,**

**యస్మింశ్చిత్తం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు.౮**

యజు. అ. ౩౪. మం. ౫.

(యస్మిన్నృచః) ఓ భగవంతుడా! కృపానిధీ! (ఋచః) ఋగ్వేదము, (సామ) సామవేదము, (యజూంషి) యజుర్వేదము, ఈ మూడింటికి అంతర్భూతమగుటచే అథర్వవేదము - అను ఈ వేదము లన్నియు దేనియందు స్థిరములగునో, మఱియు దేనియందు మోక్ష విద్య - బ్రహ్మవిద్య సత్యాసత్య ప్రకాశము నేర్పడునో, (యస్మిన్ చిత్తం...) దేనియందు సర్వప్రజల చిత్తము స్మరించువృత్తితో నుండునో, ఇవి అన్నియు మాలయందలి మణులు సూత్రమున గ్రుచ్చబడినట్లు, రథచక్రపుటడ్డలో ఆకులిమిడి ఉన్నట్లు ఇమిడియుండునో, అట్టి నా మనస్సు నీ కృపవలన శుద్ధమగుగాక! అట్లే కళ్యాణము - మోక్షము, సత్యధర్మమును అనుష్ఠించుటకును, అసత్యమును పరిత్యజించుటకును అనువగు సంకల్పముతో కూడినదగుగాక! ఆ మనస్సు వలన మాకు నీచే నిర్మితములైన వేదముల సత్యార్థము సరిగా ప్రకాశించుగాక! మేము విఘ్నములనుండి ఎల్లప్పుడు వేఱుగనుండునట్లు నీవు మాపై కృప నుంచుము.

## వేదముల ఉత్పత్తి

**తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే**

**ఛందాంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మాదజాయత. ౧**

యజు. అ. ౩౧. మం. ౭.

(తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః) సత్-ఎవనికెన్నడు నాశము లేదో, చిత్-ఎవడు సదాజ్ఞానస్వరూపుడో, అజ్ఞానము అవంతయుఎవనికిఎన్నడును కలుగదో, ఆనంద-ఎవడు సదాసుఖస్వరూపుడో, ఎవనికి దుఃఖలేశమెన్నడును గలుగదో-అట్టి సచ్చిదానంద రూపలక్షణములతో గూడి, సర్వత్ర పరిపూర్ణుడై ఉండుటచే పురుషుడును, సర్వమానవులచేను ఉపాసింపబడ యోగ్యుడగు ఇష్టదేవుడగుటచే సర్వహుతుడును, సర్వసామర్థ్యయుక్తుడును నగు ఆ పరబ్రహ్మము నుండి, (ఋచః) ఋగ్వేదము, (సామాని) సామవేదము, (జజ్ఞిరే) పుట్టెను. (తస్మాత్) ఆ పరమేశ్వరునుండి (ఛందాంసి) అథర్వవేదము, (జజ్ఞిరే) పుట్టెను. (తస్మాత్) అతని నుండి, (యజుః) యజుర్వేదము. (అజాయత) జన్మించెను.

మంత్రమునందు పఠింపబడిన సర్వహుతః పదము వేదములకును విశేషణము కాగలదు. 'హు' ధాతువు- క్రియ, ఆదానము: గ్రహించుటఅను అర్థమునందును ప్రయుక్తమగును. అందువలన వేదములు సర్వ హుతములు - సర్వమానవులచే గ్రహింపబడ యోగ్యములగుచున్నవి. కావున మానవులెల్లరు వేదములను గ్రహింపవలయుననియు వేదోక్తరీతిని నడవవలయుననియు బోధపడుచున్నది.

'జజ్ఞిరే', 'అజాయత' అను నేకార్థక క్రియలను రెండింటిని ప్రయోగించుటవలన వేదము లనేకవిద్యాయుక్తములని ఎఱుగవలయును. అట్లే తస్మాత్ అను పదమును రెండుమాఱులు ప్రయోగించుటవలన వేదము లీశ్వరునుండియే యుత్పన్నములైనవి కాని, మనుష్యులవలన గాదు అని నిశ్చయముగా ఎఱుగవలయును. వేదమంత్రములు అన్నియు గాయత్రి మున్నగు ఛందస్సులతో గూడియే యున్నవి. అయినను ఛందాంసి అను పదము ప్రత్యేకముగ మంత్రమున బ్రయోగింపబడినందున నది నాలుగవదియైన అథర్వవేదోత్పత్తిని దెలుపును.

**యజ్ఞో వై విష్ణుః** — శత. కాం ౧, అ.౧. బ్రా. ౨, కం. ౧౩

**ఇదం విష్ణుర్ విచక్రమే త్రేధా నిదధే పదమ్** — యజు. అ. ౫, మం. ౧౫.

యజ్ఞ శబ్దమున కర్థము విష్ణువు అనియు, సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడే విష్ణుశబ్ద వాచ్యుడనియు శతపథాది బ్రాహ్మణములవలనను, వేద మంత్రములవలనను దెలియుచున్నది. ఇందులకు కారణము -సర్వ జగత్తును ఉత్పన్నము చేయు సామర్థ్యము పరమేశ్వరునందే ఉన్నది. ఇతరులలో లేదు.

**యస్మా దృచో అపాతక్షన్ యజు ర్యస్మాదపాకషన్**

**సామాని యస్య లోమా న్యథర్వాంగిరసో ముఖమ్**

**స్కంభం తం బ్రూహి కతమః స్విదేవ సః.**

అథ. కాం. ౧౦ ప్రపా. ౨౩. అను ౪. సూ. ౭ మం. ౨౦.

(యస్మాదృచో అపాతక్షన్) సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని నుండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, (అంగిరసః) అథర్వవేదము అను నాలుగు వేదములు

జనించినవి. అథర్వవేదము ఈశ్వరుని ముఖతుల్యము; సామవేదము లోమ సమానము; యజుర్వేదము హృదయము వంటిది; ఋగ్వేదము ప్రాణము అని పరమేశ్వరుడీ మంత్రమున వేదముల ఉత్పత్తిని రూపకాలంకారముతో తెలిపి యున్నాడు. (బ్రూహి కతమః స్విదేవ సః) నాలుగు వేదములు ఏ దేవుని నుండి ఉత్పన్నములైనవో అతనిని దెలుపుము. (స్కంభం తం) పరమేశ్వరుడు సర్వజగద్ధారకుడు. అతని నామము స్కంభుడు. అతడే వేదకర్తయని ఎఱుగుము. మానవుల కుపాసింపదగిన ఇష్టదేవుడతడుతప్ప మఱియొకడు లేడనియు తెలియగుము. వేదకర్తయు, సర్వ శక్తి మంతుడువగు పరమేశ్వరుని విడిచి అన్యునుపాసించు అభాగ్యుడవుడుండుము!

ఏవం వా అరేఽస్య మహతో భూతస్య నిఃశ్వసిత
మేతదృగ్వేదో యజుర్వేదః సామవేదోఽథర్వాంగిరసః॥

శత.కా.౧౪. అ.౫. బ్రా.౪. క.౧౦.

(ఏవం వా అరేఽస్య) మహావిద్వాంసుడైన యాజ్ఞవల్క్య మహర్షి తనకు పత్నియు, విదుషియునగు మైత్రేయి కిట్లుపదేశించు చున్నాడు - ఓ మైత్రేయీ! సర్వవ్యాపకుడగు పరమేశ్వరుడు ఆకాశాదులకంటె గొప్పవాడు. అతని నుండియే ఋగ్యజుః సామాథర్వములను నాలుగు వేదములు ఉత్పన్నములైనవి. మనుష్య శరీరమునుండి శ్వాస బయటికి వచ్చి మరల శరీరమున ప్రవేశించునట్లు, సర్గారంభమున నీశ్వరుడు వేదముల నుత్పన్న మొనర్చి ప్రపంచమున ప్రకటించును. ప్రళయకాలమున ప్రపంచమున వేదము లుండవు. కాని, పరమేశ్వరుని జ్ఞానమునందు బీజమునందంకురముండునట్లు వేదము లెల్లపుడు నుండును. ప్రథమమున బీజమునందు అంకురముండును. ఆ అంకురమే తదుపరి వృక్ష రూపమై మరల బీజమున అంకుర రూపమున ఉండును. అట్లే వేదములు ఈశ్వరుని జ్ఞానమున ఎల్లపుడు ఉండును. అవి నశింపవు. అవి ఈశ్వరుని విద్య కావున అవి నిత్యములు.

ప్రశ్న : ఈ విషయమున అనేకులు ఇట్లు ప్రశ్నింతురు- ఈశ్వరుడు నిరాకారుడు. అతని నుండి శబ్దరూపమగు వేదములు ఎట్లుత్పన్నములు కాగలవు?.

జవాబు : పరమేశ్వరుడు సర్వశక్తిమంతుడు. అతని విషయమున ఇట్లు శంకించుట బొత్తిగా పనికిరాదు. ముఖప్రాణాది సాధనములు లేకయే పరమేశ్వరునిలో ముఖప్రాణాది సాధనముల మూలమున అగు కార్యము లొనర్చుటకు అనంత సామర్థ్యము కలదు. ఈశ్వరుడు తన సామర్థ్యముతోనే ముఖప్రాణాద్యవయవములు లేకయే ముఖప్రాణాది కార్యములను బాగుగ నిర్వర్తింపగలడని భావము. ఈ దోషము జీవులలో కలుగగలదు. జీవులు ముఖాదులులేకున్న ముఖాదికార్యములను జేయజాలరు. వారల్ప సామర్థ్యము కలవారు. ఇందులకొక దృష్టాంతమును గలదు. మనస్సునందు ముఖాద్యవయవములు లేవు. అయినను దానియందు ప్రశ్నోత్తరాది శబ్దోచ్చారణ రూపమగు మానసవ్యాపారము జరుగును. అట్లే పరమేశ్వరుని యందును జరుగునని తెలియనగును. సంపూర్ణ సామర్థ్యము కలవాడు ఏపని చేయుటకైనను ఎవరిసహాయమును కోరడు. తన సామర్థ్యము చేతనే సర్వకార్యములను నిర్వర్తింపగలడు. మన మితరుల సహాయములేక కార్యముల నొనర్ప జాలము. ఈశ్వరు డట్టివాడుకాడు. ప్రళయమున జగత్తు లేకుండెను. సృష్టిసమయమున నిరాకారుడగు ఈశ్వరుడు సాకార సంపూర్ణ జగత్తును నిర్మింపగలిగినపుడు వేదములను రచించుటలో ఆటంకమేమి? జగమున నేత్రాదిపదార్థములను అత్యంత విస్మయ జనకముగ ఈశ్వరుడు నిర్మించి ఉన్నాడు. అట్లే వేదమునందును అత్యంత సూక్ష్మ విద్యలను రచించి ఉన్నాడు. నిరాకారేశ్వరుడు వేదములనుకూడ ఇట్లురచియింప జాలడా?

ప్రశ్న : ఈశ్వరునకు దక్క యేజీవునకును జగత్తును రచించు శక్తి లేదు. కాని, మనుష్యులకు వ్యాకరణాది శాస్త్రములను రచించు సామర్థ్యమున్నది. కావున వేదరచన నొనర్చు సామర్థ్యము జీవుల కుండవచ్చును గదా?

జవాబు : లేదు. ప్రథమమున ఈశ్వరుడు వేదములను రచియించెను. వానిని జదివిన తరువాతనే గ్రంథమును రచించు సామర్థ్యము మనుజులకు కలుగును. లేకున్న కలుగజాలదు. వేదములను చదువక, వినక ఏ మనుజుడును విద్వాంసుడు కాజాలడు. ఇప్పుడును కొండొక శాస్త్రమును చదివి, వేఱొకని యుపదేశమును విని, మానవుల పరస్పర వ్యవహారమును జూచినపుడే మానవులకు జ్ఞానము కలుగుచున్నది. లేకున్న కలుగదు. కొండొక బాలుని జన్మించినప్పటి నుండియు ఏకాంతమున నుంచి, అతనికి అన్నజలములను యుక్తితో నొసంగుము. అతనితో భాషణాది వ్యవహారములను లేశమాత్రమైనను జేయకుము. మరణ పర్యంతమట్లే అతనిని పెంచిన అతని కొకింతయు యథార్థజ్ఞానము కలుగదు. అట్లే ఘోరారణ్యములలో నుండుమానవుల ప్రవృత్తియు నవ్యపశులంబోలి యుండుట జూడనగును. సర్గారంభమున ఈశ్వరుడు వేదము నుపదేశింపకున్న నేటి వఱకును మానవుల ప్రవృత్తి యట్లే ఉండెడిది. ఇక గ్రంథరచనా సామర్థ్యమును గూర్చి ఏమనగలము? కావున వేదములు ఈశ్వరరచితములని అంగీకరించుటయే మేలు. లేకున్న లేదు.

ప్రశ్న : ఈశ్వరుడు మానవులకు స్వాభావిక జ్ఞానము నొసంగియున్నాడు. ఆ జ్ఞానము గ్రంథముల కన్నింటికంటె ఉత్తమము. అది లేకున్న వేదములలోని శబ్దార్థములు,

వానిసంబంధములకు సంబంధించిన జ్ఞానమెన్నడును కలుగ జాలదు. ఆ జ్ఞానము క్రమముగా వృద్ధి నొందినపుడు మానవులు గ్రంథములను రచియింతురు. అట్టియెడ వేదములు భగవంతుని నుండి యుత్పన్నములైన వని అంగీకరింపనేల?

జవాబు : ఇంతకు పూర్వము, ఏకాంతమున పెంచిన బాలకుని, వనవాసులను దృష్టాంతముగ ఇచ్చియుంటిమి. వారికి భగవంతుడు స్వాభావిక జ్ఞానము నీయలేదా? వారు తమ స్వాభావిక జ్ఞానములో విద్వాంసు లేలకారు? దీనివలన ఈశ్వరోపదేశమైన వేదము లేకున్నచో మనుజునకును యథార్థజ్ఞానము కలుగజాలదని నిశ్చితమగుచున్నది. ప్రస్తుతకాలమున మనము కూడ వేదములను చదువకున్నను, విద్వాంసుల నుండి శిక్షణను పొందకున్నను, విద్వద్రచితములయిన గ్రంథములను పఠింపకున్నను పండితులము కాజాలము. అట్లే సృష్ట్యాదియందు పరమాత్ముడు వేదములను ఉపదేశింపకున్న పక్షమున నేటివరకును మానవునకు ధర్మాది విషయముల యథార్థజ్ఞానము కలిగియుండదు. దీనివలన తెలిసిన దేమి? విద్వాంసుల శిక్షణ కాని, వేదముల పఠనముకాని లేక, కేవల స్వాభావిక జ్ఞానముతో మానవ వ్యవహారము నిర్వహింపబడదు. అన్య విద్వాంసుల నుండి మనము వేదాది శాస్త్రముల మూలమున నానావిధవిజ్ఞానములను గ్రహించి, అనంతరమున గ్రంథములను రచియింతుము. అట్లే యీశ్వర జ్ఞానాపేక్షయు నెల్లమానవుల కవశ్యమగుచున్నది. సృష్టికి ఆరంభకాలమున పఠనపాఠన వ్యవస్థ ఏమియు లేకుండెను. విద్యకు సంబంధించిన గ్రంథమేదియు లేదు. కావున అపుడు పరమేశ్వరుడు వేదములనుపదేశింపకున్న లోకమున విద్యయే ఉండదు. అట్టియెడ మానవుడు గ్రంథమును ఎట్లు రచింపగలడు? మానవజ్ఞానము నైమిత్తికము. కావున అందు మానవులకు స్వాతంత్ర్యముండనేరదు. స్వాభావిక జ్ఞానముతోనే ఎవరికిని విద్యాప్రాప్తి కలుగదు. కావుననే ఈశ్వరుడు సర్వమానవుల హితార్థము వేదములనుత్పన్నము చేసి యున్నాడు. మఱియు స్వాభావిక జ్ఞానము వేదాది సర్వజ్ఞానములకంటె ఉత్తమ మనుటయు సరికాదు. అదింకను అసాధ్యమే. అది యన్నింటి కంటె ఉత్తమమని సాధింపవలసి ఉన్నదని భావము. మనఃసంయోగము లేక నేత్రమేమియు జూడనేరదు. ఆత్మసంయోగములేని మనస్సు కూడ నేమియు చేయజాలదు. అట్లే స్వాభావిక జ్ఞానముకూడ, వేదము, విద్వాంసుల శిక్షణ గ్రహింప సాధనము మాత్రమగును. అయ్యది పశువులకువలె వ్యవహారమునకును సాధనమగును. కాని, ఆ స్వాభావిక జ్ఞానము స్వయముగ ధర్మార్థ కామమోక్షవిద్యకు సాధనమెన్నడును కాజాలదు. (మనస్సంయోగములేని చక్షువు రూపమును గ్రహింపనగుట ఎట్లు అసాధ్యవిషయమో, అట్లే స్వాభావిక జ్ఞానము వేదోపదేశము లేక గ్రంథరచనము చేయగలదనుటయు అసాధ్య విషయము.)

ప్రశ్న : వేదములను ఉత్పన్న మొనర్చుటలో ఈశ్వరునకుగల ప్రయోజనమేమి?

జవాబు : వేదములను ఉత్పన్నము సేయకుండుటలో ప్రయోజనమేమి? అని ప్రశ్నించిన, దానికి సమాధానము చెప్పజాలనందువేనియది నిజమే. వేదమీశ్వరుని నిత్యవిద్య. దానికుత్పత్త్యనుత్పత్తులు లేవు. కాని, జీవులమగు మనకొఱకు ఈశ్వరుడు వేదములను ప్రకటించినాడు. అది మనపై అతనికిగల పరమకృప. ఇక వేదోత్పత్తి ప్రయోజనము వినుడు. ఈశ్వరుని యందనంత విద్య యున్నదా? లేదా? ఉన్నదందురేని, యతని విద్యకు ప్రయోజనమేమి?

ప్రశ్న : ఈశ్వరుని విద్య అతనికి పదార్థముల నెఱుంగుటకు, వానిని రచించుటకు ఉపయోగించును. అదియే దాని ప్రయోజనము.

జవాబు : అటులయిన నీశ్వరుడు పరోపకార మొనర్చునా? లేదా?

ప్రశ్న : ఈశ్వరుడు పరోపకార మొనర్చునా? లేదా?

జవాబు : విద్య స్వార్థము కొఱకును పరార్థము కొఱకును ఉపయోగించును. అదే దాని గుణము. దానివలన స్వార్థపరార్థములు రెండును సిద్ధించును. పరమేశ్వరుడు కావున తన వేదవిద్యను జీవులమగు మన కుపదేశింపని పక్షమున విద్యవలన పరోపకారము చేయవలయు ననెడి ప్రయోజనము సిద్ధింపదు- చరితార్థము కాదు. అందువలననే పరమేశ్వరుడు తన వేదవిద్యను మనకుపదేశించి, దానిని సఫలము చేసి ఉన్నాడు. పరమేశ్వరుడు మనకు తల్లిదండ్రులవంటి వాడు. మన మందఱము అతని ప్రజ- సంతానము. అతడు తన ప్రజపై నిత్యము కృపాదృష్టినుంచును. తల్లిదండ్రులు తమ సంతానముపైనెల్లప్పుడు కరుణ కలిగి యుందురు. సంతానము సుఖపడునట్లన్నివిధముల యత్నింతురు. అట్లేఈశ్వరుడును మనుష్యాది సర్వప్రాణుల మీదను కృపాదృష్టిని ఎల్లపుడు గలిగియుండును. కావుననే మానవులమగు మనకు వేదముల నుపదేశించి ఉన్నాడు. అట్లు చేయకున్న ఎవరికిని ధర్మార్థ కామమోక్షములు సరిగ సిద్ధించెడివి కావు; పరమానందము కూడ నెవనికిని లభించెడిదికాదు. పరమకృపాలువగు పరమేశ్వరుడు జీవులను సుఖింపజేయుటకు, కందమూల ఫలాదులను, ఇతర సూక్ష్మ స్థూల పదార్థములను జగమున రచించినట్లు సమస్త సత్యవిద్యలతో కూడిన వేదోపదేశమును మాత్రము జీవుల సుఖార్థ మేలచేయడు? బ్రహ్మాండమునగల ఉత్తమ పదార్థప్రాప్తివలన గలుగు సుఖము ఉత్తమ విద్యాప్రాప్తిచే కలుగు సుఖములో సహస్రాంశముతో నైనను పోలదు. అట్టి సర్వోత్తమ విద్యాబోధక వేదమును పరమేశ్వరుడేల ఉపదేశింపడు? కావున వేదము ఈశ్వర నిర్మితములే అని నిశ్చిత సిద్ధాంతము.

ప్రశ్న : వేదమును వ్రాయుటకు ఈశ్వరుడు కలము, సిరాబుడ్డి మున్నగు సాధనము లెటనుండి తీసికొనెను? సర్గారంభమున కాగితములు మున్నగు పదార్థములు లేవుకదా?

జవాబు : వహ్వా! నీకు గొప్ప శంకయే కలిగినది. నీ బుద్ధి నేమని కొనియాడుదును? హస్తపాదాద్యవయవములు లేక, కాష్ఠలోహాది సాధన సామగ్రియు లేక యీశ్వరు డీజగము నెట్లు రచియించెనో చెప్పుము? అట్లే సాధనములు లేకయే వేదములను రచియించినాడు. అతడు సర్వశక్తిమంతుడు. కావున నిట్లు శంకించుట నీకు తగదు. కాని; వాస్తవమున సృష్ట్యాది యందీశ్వరుడు పుస్తకములుగ వ్రాసి వేదములను ప్రకటింపలేదు. మఱి యెట్లు చేసె నందువేని, జ్ఞానము నందు ప్రకాశింప జేసెను. ఎవరిజ్ఞానమున నందువేని అగ్ని వాయ్వాదులగు ఋషులయందు, అగ్ని వాయ్వాదులు జడములందువేని, అట్లుకాదు. వారు సృష్ట్యారంభమున మానవ దేహధారులై ఉండిరి. ఏలయన: జడములలో జ్ఞానకార్యమసంభవము.

పదములకు శక్యార్థము సంభవము కానియెడల లక్షణార్థము గ్రహింపబడును. ఆప్తుడైన విద్వాంసుడు "మంచెలు కేకలు పెట్టుచున్నవి" అనిన మంచెలు కేకలు వేయుట సంభవము కాదు. కావున మంచెలపై నున్న మనుష్యులు కేకలు వేయుచున్నారు అని యీ వాక్యమునకు లక్షణార్థము చెప్పబడును. అట్లే అగ్ని మొదలగు జడ పదార్థములందు జ్ఞానప్రకాశ మసంభవము. కావున లక్షణావృత్తితో అగ్నివాయ్వాది పదములు పురుష బోధకములని యెఱుంగవలయును. ఈ విషయమున శతపథబ్రాహ్మణ ప్రమాణము జూడుడు. (తేభ్య స్తప్తేభ్యః...) తపస్సులయిన జ్ఞానులందు వేదములు ప్రకాశితము లయ్యెను. అగ్నియందు ఋగ్వేదము; వాయువునందు యజుర్వేదము; సూర్యునియందు సామవేదము. (అంగిరసునందు అథర్వవేదము.) వీరి నలుగురి జ్ఞానమున ముందు వేదములను ప్రకటించి వారి నుండి బ్రహ్మాదులకు (మహర్షులకు) అందజేసెను.

సత్యమే. ఈశ్వరుడు వారికి జ్ఞానము గలిగించియుండును. ఆ జ్ఞానముతో వారు వేదములను రచించియుందురు.

ఉత్తరపక్షము : ఇట్లనుట నీకు తగదు. ఈశ్వరుడు వారికి జ్ఞానము నెట్లొసంగెనో నీ వెఱుగుదువు గదా!

పూర్వపక్షము : వారికి వేదరూప జ్ఞానము నొసంగెను.

ఉ.ప: ఆ జ్ఞానము ఈశ్వరునిదా? లేక వారిదా?

పూ.ప : ఆ జ్ఞాన మీశ్వరునిదే.

ఉ.ప : అయిన వేద మీశ్వర నిర్మితమా? లేక అగ్న్యాది ప్రణీతమా?

పూ.ప : జ్ఞానమెవనిదో యతడే వేదములను రచించెను.

ఉ.ప : మఱి అగ్న్యాదులు వేదరచయితలని యేల శంకించితివి?

పూ. ప : నిశ్చయార్థము.

ప్రశ్న : ఈశ్వరుడు న్యాయకారియా? లేక పక్షపాతియా?

జవాబు : న్యాయకారి.

ప్రశ్న : ఈశ్వరుడు న్యాయకారియగు నెడల అందరి హృదయము లందును వేదముల నెందుకు ప్రకటింపడయ్యె? నలువురి హృదయములందే ప్రకాశింప జేసినందున పక్షపాతి యగును.

జవాబు : ఇందువలన నీశ్వరునందు పక్షపాతము కొంచెమైన నున్నదనుట సరికాదు. పైపెచ్చు అతని యందుగల న్యాయమే వెల్లడి యగు చున్నది. అది యెట్లందువేని, న్యాయమన నేమి? ఎవరెట్టి కర్మచేసిన వారికట్టి ఫలము నిచ్చుటయే కదా! దీనింబట్టియే నలువురి హృదయమున వేదములు ప్రకాశింపజేయబడినవో వారందులకు తగిన పుణ్యము పూర్వ మొనరించిన వారని తెలియనగును.

ప్రశ్న : ఆ నలువురును సృష్ట్యారంభమున మనుష్యులై యున్నారు కదా? వారికి పూర్వపుణ్య మెటనుండి వచ్చినది?

జవాబు : జీవులు, (కారణ జగత్తు), స్వరూపముతో ననాదులు- ఆదిలేనివి. కర్మములు, సర్వకార్యజగత్తు, ఈ రెండును ప్రవాహమునతో ననాదులు. ఈ విషయమును ప్రమాణపూర్వకముగ ముందు వ్రాయుదుము.

ప్రశ్న : గాయత్రి మున్నగు ఛందస్సులనుగూడ నీశ్వరుడే రచియించెనా?

జవాబు : నీకీశంక యేల కలిగినది? ఛందోరచనజ్ఞాన మీశ్వరునకు లేదా ?

ప్రశ్న : ఈశ్వరుడు సమస్తవిద్యాయుక్తుడగుటవలన నతని కన్నియు దెలియును.

జవాబు : బాగు. కావున నీ శంక నిరర్థకమే కదా!

ప్రశ్న : చతుర్ముఖ బ్రహ్మ వేదములను రచించినాడని ఇతిహాసమున చదువుచున్నామే?

జవాబు : అట్లనకు. ఇతిహాసము శబ్దప్రమాణమునందే లెక్కింపబడినది.

(ఆప్తోపదేశః శబ్దః) సత్యవాదులగు విద్వాంసులు చేసిన ఉపదేశ రూపశబ్దములే శబ్దప్రమాణము. అని న్యాయదర్శనమున గోతమాచార్యుడు వ్రాసియున్నాడు.

(శబ్ద ఐతిహ్యాన్) అను నీ సూత్రమున గోతముడు ఇతిహాసమును శబ్దప్రమాణమున లెక్కించియున్నాడు.

(ఆప్తోపదేశః శబ్దః) అను సూత్రమునకు భాష్యము వ్రాయుచు వాత్స్యాయన ముని ఆప్తలక్షణ మిట్లు వర్ణించియున్నాడు:- సర్వ పదార్థవిద్యలను సాక్షాత్తుగ నెఱిగినవాడును, కపటాది దోషరహితుడును, ధర్మాత్ముడును, ఎల్లప్పుడు సత్యము జెప్పును, సత్యము నంగీకరించును, సత్యము నాచరించువాడును, పూర్ణవిద్యవలన తానెఱిగిన విషయమును మానవులకు సుఖముగలుగు నిమిత్తము కృపాదృష్టితో నుపదేశించువాడును నగు మానవుడు 'ఆప్తు' డనబడును. పృథివి మొదలు పరమేశ్వరపర్యంతముగల పదార్థముల నున్నవి యున్నట్లు స్వయముగ ప్రత్యక్ష మొనర్చుకొని, తదనుసారము వర్తించుటకు 'ఆప్తి' యని పేరు. 'ఆప్తి'తో కూడినవాడు ఆప్తుడు.

అట్టి యాప్తుని యుపదేశమే ప్రమాణ మగును. ఇతరుల వాక్యములు ప్రమాణములు కావు. సత్యవృత్తాంతమే యితిహాసమగును; కాని, అనృతవృత్తము కాదు. సత్యప్రమాణములతో గూడిన యితిహాసమే సర్వ మానవులకు గ్రహణ యోగ్యము. అందుకు విపరీతేతిహాసమును గ్రహించుట యెవరికిని దగదు. ప్రమాదయుక్త పురుషుని మిథ్యాకథనము ఇతిహాసముగ గ్రహింపబడదు. ఇట్లే వ్యాసమహర్షి నాలుగు వేదసంహితలను రచించినాడనియు, లేక వానిని సంగ్రహము చేసినాడనియు జెప్పు ఇతిహాసములన్నియు అసత్యములని యెఱుగవలయును. ఇటీవల రచియింపబడిన బ్రహ్మవైవర్తాది పురాణములు, బ్రహ్మయామళాది తంత్రగ్రంథములు, వానియందు వ్రాయబడిన ఇతిహాసములు ప్రమాణములుగ గ్రహింపరాదు. వానియందు అసంభవములు, అప్రమాణములు నగు కపోలకల్పితములయిన మిథ్యేతిహాసము లెన్నో వ్రాసియున్నారు. సత్యగ్రంథములైన శతపథబ్రాహ్మణము మున్నగు గ్రంథములలోని ఇతిహాసముల నెన్నడును విడువరాదు.

యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై ।
శ్వే. ఉప. అ. ౬, శ్లో. ౧౮.

అగ్ని వాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం ఋగ్యజుఃసామలక్షణమ్. మను. అ. ౧-౨౩.
అధ్యాపయామాస పితౄన్ శిశురాంగిరసః కవిః మను. అ. ౨. శ్లో. ౧౫౧,

ప్రశ్న : సూక్తములు, మంత్రములు, ఏ ఋషులపేర లిఖింప బడుచున్నవో వారే వేదములను రచించిరని యేల యంగీకరింపరాదు?

జవాబు : అట్లనరాదు. కారణమేమన : బ్రహ్మాది మహర్షులుకూడ వేదములను జదివినారు. శ్వేతాశ్వతరాది- ఉపనిషత్తులలో నిట్లున్నది.

బ్రహ్మను సృష్టించినవాడు బ్రహ్మాదుల సృష్టికి ముందే అగ్ని మున్నగువారికి వేదముల నుపదేశించి వారి మూలమున బ్రహ్మాదులకును ఉపదేశించెను. ఆ పరమేశ్వరుని శరణు బొందుదును. దీనింబట్టి బ్రహ్మాది మహర్షులుకూడ వేదములను జదివిరని తెలియుచున్నది. మరీచ్యాది ఋషులు, వ్యాసాది మునులు జన్మింపకముందే బ్రహ్మాదులకు వేదములు తెలియును. ఇందులకు మనువు శ్లోకములే ప్రమాణములు.

పూర్వము చెప్పబడిన అగ్ని, వాయువు, సూర్యుడు, అంగిరసుడు ననువారినుండి బ్రహ్మాదులు వేదములను పఠించిరి.

అంగిరసముని పుత్రుడు విద్వాంసుడై, తన పినతండ్రి మున్నగు పెద్దవారికిగూడ వేదములను జెప్పెను.

బ్రహ్మయే వేదములను ఇతరులనుండి చదివియున్నా డనిన నిక వ్యాసాది మహర్షులయు, మనవిషయమున వేమనవలయును?

ప్రశ్న : ఋగ్వేదాది సంహితలకు వేదము, శ్రుతి యని రెండుపేరు లేల కలిగినవి?

జవాబు : అర్థభేదము వలన నీ రెండు నామము లేర్పడినవి. సంస్కృతమున నొక 'విద' ధాతువునకు జ్ఞానమని అర్థము. రెండవ 'విద' ధాతువునకు 'సత్తా' ఉనికి అని అర్థము. మూడవ 'విద' కు లాభము, నాల్గవ 'విద' కు విచారణ - ఆలోచన, అని అర్థము. ఈ నాలుగు ధాతువుల (క్రియల) కు తరువాత 'హలశ్చ' అను పాణినీయ సూత్రమునను సరించి కరణము, అధికరణము (తృతీయా - సప్తమీ) అను కారకములందు 'ఘఞ్' అను ప్రత్యయము చేర్చినందున 'వేద' శబ్దము సిద్ధించును. అట్లే 'శ్రు' ధాతువు శ్రవణార్థకము, దానికి కరణార్థమున 'క్తిన్' ప్రత్యయము చేర్చిన 'శ్రుతి' శబ్దము సిద్ధించును. వేనిలో, వేనిని జదువుటవలన యథార్థవిద్యల విజ్ఞానము కలుగునో అవి వేదము లనబడును. వేనిని వేనియందు జదువుటవలన విద్వాంసు లగుదురో యవి వేదములు. వేని ద్వారమున, వేనియందు సర్వసుఖములు లభించునో అవి వేదములు. వేనియందు, వేనిద్వారమున మానవులు సత్యాసత్యముల సరిగా విచారింపగలుగుదురో యవి వేదములు. ఈ యర్థములందు సంహితలకు వేదనామము కలిగినదని భావము. అట్లే సృష్ట్యారంభమునుండి నేటివఱకు, బ్రహ్మమొదలు మనవఱకు నెల్లరు సంహితల ద్వారమున సత్యవిద్యలను వినుచు వచ్చినందున వేదములకు- సంహితలకు- 'శ్రుతి' యని నామమేర్పడినది.

ఎవడును దేహధారి నుండియు వేదము లుత్పన్నములగుచుండగ - రచియింపబడుచుండగ జూడలేదు.

ప్రశ్న : ఎందువలన?

జవాబు : నిరవయవేశ్వరునివలన వేదములు ప్రాదుర్భవించినవి. వానినెల్లరు నేటివరకు వినుచు, వినిపించుచునే వచ్చిరి. కొందరు వాద్యములను వాయించి శబ్దము నావిర్భవింపజేయునట్లు, కొయ్యబొమ్మలలో క్రియను గలిగించునట్లు వేదముల నావిర్భవింపజేయుట కీశ్వరుడు- అగ్ని- వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు ననువారిని- మానవులను- నిమిత్త మాత్రులను జేసియున్నాడు. అగ్ని మున్నగువారి జ్ఞానముతో వేదములుద్భవింపలేదు. వేదములందలి శబ్దములు, అర్థములు, వానికిగల సంబంధములు అన్నియు పూర్ణవిద్యాంసుడగుటచే నీశ్వరునినుండియే ప్రకటితములైనవి.

ప్రశ్న : ఇందువలన నేమి సిద్ధించినది?

జవాబు : పరమేశ్వరుడు మానవ దేహధారులయిన అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు అనువారల ద్వారమున వేదములను బ్రకాశింపజేసెనని సిద్ధమైనది.

బ్రాహ్మస్య తు క్షపాహస్య యత్ ప్రమాణం సమాసతః
ఏకైకశో యుగానాంతు, క్రమశస్తన్నిబోధత ౧ — మ. ౧-౬౮.
చత్వార్యాహుః సహస్రాణి, వర్షాణాం తు కృతం యుగం
తస్యతావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథా విధః. — ౨.మ.౧-౬౯.
ఇతరేషు ససంధ్యేషు ససంధ్యాంశేషు చ త్రిషు
ఏకాపాయేన వర్తంతే సహస్రాణి శతాని చ — చ. ౩ మ. ౧-౭౦.
యదేతత్ పరిసంఖ్యాతమాదావేవ చతుర్యుగమ్
ఏతద్ ద్వాదశసాహస్రం దేవానాం యుగ ముచ్యతే. — ౪మ.౧-౭౧.
దైవికానాం యుగానాం తు సహస్రం పరిసంఖ్యయా
బ్రాహ్మమేక మహర్ జ్ఞేయం తావతీ రాత్రిరేవచ — చ. ౫. మ. ౧-౭౨
తద్వై యుగ సహస్రాంతం బ్రాహ్మం పుణ్య మహ ర్విదుః
రాత్రిం చ తావతీమేవ, తేఽహోరాత్ర విదోజనాః — ౬మ.౧-౭౩
యత్ ప్రాగ్ ద్వాదశసాహస్ర ముదితం దైవికం యుగం
తదేకసప్తతి గుణం మన్వంతర మిహోచ్యతే. — ౭. మ. ౧-౭౯
మన్వంతరాణ్యసంఖ్యాని సృష్టిః సంహార ఏవ చ
క్రీడన్నివైతత్ కురుతే పరమేష్ఠీ పునః పునః — ౮ మ. ౧-౮౦

అత్రైవం సంఖ్యాతవ్యమ్ :-

ఏకం దశ శతం చైవ సహస్రమయుతం తథా
లక్షం చ నియుతం చైవ కోటి రర్బుద మేవ చ. — ౧
వృందః ఖర్వో నిఖర్వశ్చ శంఖః పద్మం చ సాగరః
అంత్యం మధ్యం పరార్ధ్యం చ దశవృద్ధ్యా యథాక్రమమ్. — ౨

ఇతి సూర్యసిద్ధాంతాదిషు సంఖ్యాయతే. అనయా రీత్యా వర్షాదిగణనా కార్యేతి.

సహస్రస్య ప్రమాసి సహస్రస్య ప్రతిమాసి. యజు. — అ. ౧౫-౬౫
సర్వం వై సహస్రం సర్వస్య దాతాసి.

శతపథ; కాం. ౭. అ. ౫. బ్రా. ౨, కం. ౧౩.

ప్రశ్న : వేదము లుత్పన్నములై యెన్ని వత్సరములు గతించినవి?

జవాబు : ఒక వృందము, తొంబదియారుకోట్ల, యెనిమిది లక్షల, యేబది రెండు వేల, తొమ్మిది వందల, డెబ్బదియారు (౧౯౬౦౮౫౨౯౭౬) సంవత్సరములయినవి. వేదములు, జగత్తును ఉత్పన్నములై ఇప్పుడు డెబ్బది యేడవ సంవత్సరము గడుచుచున్నది.

ప్రశ్న : ఇన్నియేండ్లే జగదుత్పత్తికిని, వేదోత్పత్తికిని తరువాత గడచినవని యెట్లు నిశ్చయము చేయునగును?

జవాబు : ఇప్పటి సృష్టిలో నేడవ (౭) వైవస్వత మన్వంతరము నడచుచున్నది. ఇంతకు పూర్వ మారు (౬) మన్వంతరములు గడచినవి. ఆయార్వురు మనువుల పేర్లివి: ౧. స్వాయంభువుడు, ౨. స్వారోచిషుడు, ౩. ఔత్తమి, ౪. తామసుడు, ౫. రైవతుడు, ౬. చాక్షుషుడు. ఇప్పుడేడవ వైవస్వత మన్వంతరము నడచుచున్నది. దీనికి తరువాత సావర్ణి మున్నగు నామములు గల యేడు మన్వంతరములు రానున్నవి. ఇట్లు (౧౪) పదునాలుగు మన్వంతరములు. ౭౧ చతుర్యుగము లొక మన్వంతరమగును. ఇట్టి ౧౪ మన్వంతరములు (సృష్టిలో) ఒక బ్రహ్మదినమున భోగింపబడును. ఇంతే సమయము బ్రహ్మరాత్రి

(ప్రలయము) కి నగును. ఆ గణన ప్రకార మీ దిగువ జూడుడు.

సత్య(కృత) యుగము ౧౭౨౮౦౦౦ సంవత్సరములు
త్రేతాయుగము ౧౨౯౬౦౦౦ సంవత్సరములు
ద్వాపరయుగము ౮౬౪౦౦౦ సంవత్సరములు
కలియుగము ౪౩౨౦౦౦ సంవత్సరములు

క్షణము, నిమేషము మొదలు- సంవత్సర పర్యంతము గల సమయమున కంతటికి నార్యులు నామముల నేర్పఱచియున్నారు. ఉపర్యుక్త చతుర్యుగముల సమయము కలిపి (౪౩౨....) నలుబది మూడు లక్షల యిరువదివేల వత్సరము లగుచున్నది. ఈ కాలము చతుర్యుగ మనబడును. ఇట్టి డెబ్బదియొక్క (౭౧) చతుర్యుగములు (౩౦,౬౭, ౨౦,౦౦౦ సం.) ఒక మన్వంతర మగును. ఇట్టి మన్వంతరము లాఱు(౬) (౧,౮౪,౦౩,౨౦,౦౦౦ సం.) ప్రస్తుత బ్రహ్మదినమున - సృష్టి యందు - గడచిపోయినవి. ఏడవ మన్వంతరముకాలము గడచుచున్నది. ఇందులో నిది ఇరువది యెనిమిదవ (౨౮) చతుర్యుగము. ఈ చతుర్యుగమునను కృతయుగము (౧౭,౨౮౦౦౦ సం.), త్రేతాయుగము (౧౨,౯౬౦౦౦ సం.) ద్వాపరయుగము (౮౬,౪౦౦౦ సం.) గడచిపోయినవి. ఇక, ప్రస్తుత కలియుగమున ౫౧౦౬ వత్సరములు గతించినవి; ౪,౨౬,౮౯౪ సంవత్సరములు అనుభవింపవలసి యున్నది. ఇట్లు నేటివఱకు నీ వైవస్వత మన్వంతరమున (౧౨౦౫౩౨౯౭౬. సం.) పంద్రెండుకోట్ల ఐదు లక్షల ముప్పది రెండు వేల తొమ్మిదివందల డెబ్బదియాఱు వర్షములు భుక్తము లయినవి. ఇంకను ( (౧౮౬౧౮౭౦౨౪ సం.) పదునెనిమిది కోట్ల, అఱువదియొక్కలక్షల, యెనుబదియేడువేల, యిరువది నాలుగు వర్షములు భోగింపవలసియున్నవి. వీనిలో నిప్పుడు డెబ్బది యేడవ (౭౭) సంవత్సరము జరుగుచున్నది. దీనిని ఆర్యులు విక్రమ (సంవత్) శకము ౨౦౩౩ అని లెక్కించుచున్నారు. పైన వర్ణించిన చతుర్యుగము లొక్కవేయి కలిపి యొక బ్రహ్మదిన మగును. అదియే సృష్టికాలము. కావున సంపూర్ణ సృష్టిసమయము (౪౩౨౦౦౦౦౦౦౦=౪,౩౨,౦౦౦౦౦౦౦.) నాలుగు అర్బుదముల, ముప్పదిరెండు కోట్ల సంవత్సరములగుచున్నది. ఇట్లే వేయి చతుర్యుగముల కాలము బ్రహ్మరాత్రి- ప్రళయకాల మగును. ఈశ్వరుడు సృష్టిని రక్షించు చుండును. ఈ కాలమునకే బ్రహ్మదినమని పేరు. తదుపరి వేయి వర్షముల సమయ మీప్రపంచమును లయము చేసి- నశింపచేసి - కారణరూపమున నుంచును. ఆ కాలమునకు బ్రహ్మరాత్రి యని పేరు. సృష్టికాలము - దినము, ప్రళయకాలము - రాత్రి యని భావము. కావున వర్తమాన సృష్టిలో (బ్రహ్మదినము) వేదములు, జగత్తు, నేర్పడి యిప్పటికి (౧౯౬౦౮౫౨౯౭౬ సం.) ఒక్క వృందము, తొంబదియాఱు కోట్ల, యెనిమిది లక్షల, యేబదిరెండువేల, తొమ్మిది వందల డెబ్బది యాఱు వత్సరములు గతించినవి. ఇక (౨౩౩౩౨౨౭౦౨౪ సం.) రెండు వృందముల, ముప్పది మూడుకోట్ల, ముప్పదిరెండు లక్షల, యిరువది యేడు వేల, యిరువది నాలుగు వర్షములు గడవవలసియున్నవి.

ఇంతవఱకు సృష్టిలో గతించిన సంవత్సరముల (౧౯౬౦౮౫౨౯౭౬) సంఖ్యలో నాఱు మన్వంతరముల యేడు సంధికాలములకు సంబంధించిన (౧౨౦౯౬౦౦౦) సంవత్సరములు కలుపుకొని లెక్కించు కొనవలయును. ఇట్లే గడవవలసియున్న కాలము (౨౩౩౩౨౨౭౦౨౪) సంవత్సరములలోగూడ నేడు మన్వంతరములలోని యెనిమిది సంధికాలములకు సంబంధించిన (౧౩౮౨౪౦౦౦) సంవత్సరములు కలిపి లెక్కింప వలయును. మూలగ్రంథమున నీ సంవత్సరములు కలిపినట్లు కనిపింపదు అట్లు కలుపకున్న సంపూర్ణ సృష్టిసమయమున కగు (౪౩౨౦౦౦౦౦౦౦) సంవత్సరములు పూర్తి కానేరవు.)

వీనిలో నిపుడంతిమముగు నిరువది నాల్గవ సంవత్సరము భోగింపబడుచున్నది. ముందు రామున్న భోగ్యవర్షములలో నొక్కొక్క సంవత్సరము తగ్గించుచు, గతించిన వత్సరములలో నొక్కొక్క యేడు పెంచుచు లెక్కించుకొనవలయును. పరమేశ్వరుడు సృష్టికాలమునకు బ్రహ్మదినమనియు, ప్రళయకాలమునకు బ్రహ్మరాత్రి యనియు నామముల నేర్పఱచెను. ఇందులకు మనువు శ్లోకములు సాక్ష్యములు, వానియర్థము లీ క్రింద జూడుడు.

మనుస్మృతి శ్లోకార్థములు :-

బ్రహ్మదినము, బ్రహ్మరాత్రి, ప్రతియుగము యొక్కయు పరిమాణమును క్రమముగ వినుము.

(ఈ శ్లోకములందు దేవవత్సరములు లెక్కింపబడినవి. ౩౬౦ మానవ వత్సరములు ఒక దేవ వర్షము.) ఇట్టి నాలుగువేల దేవ వర్షములు ఒక్క సత్యయుగ మగును. ఆ యుగసంధ్య (యుగపూర్వకాలము)నాలుగు వందల వర్షములు. సంధ్యాంశము (యుగపర కాలము) నాలుగు వందల యేండ్లు. ఇట్లు మొత్తము (౪౦౦+౪౦౦౦+౪౦౦=౪౮౦౦) సంధ్య, సంధ్యాంశములతో కలిపి సత్యయుగము నాలుగువేల యెనిమిది వందల దేవ వర్షముల పరిమాణము గలదగుచున్నది. మానవసంవత్సరములు ౪౮౦౦ X ౩౬౦ = ౧౭౨౮౦౦౦. ఇది కృతయుగ పరిమాణము.

ఇతర (త్రేతా, ద్వాపర, కలి) యుగముల వర్ష సంఖ్యలు, సత్యయుగముయొక్కయు, సంధ్యయొక్కయు, సంధ్యాంశముయొక్కయు వర్ష సంఖ్యనుండి యొక్క టొక్కటిగా తగ్గించి నిర్ణయింపనగును.

త్రేతాయుగము 300+3000+300) X 3౬0=౧౨,౯౬,000

ద్వాపరయుగము (౨00+౨000+౨00) X 3౬0=౮,౯౪,000

కలియుగము (౧00+౧000+౧00) X 3౬0=౮,3౨,000

ఇట్లే నాలుగు యుగముల కాలపరిమాణము దేవమానమున ౧౨000 సంవత్సరములగును. మానుష వర్షములు ౧౨000X3౬0=౪3,౨0,000 నలుబదిమూడు లక్షల యిరువదివేలగును.

ఈ ౧౨000 దేవవర్షముల పరిమాణముగల చతుర్యుగముల సమయమే యొక దేవయుగ మనబడును.

ఇట్టి వేయి (౧000)దేవయుగము లొక బ్రహ్మదినము (సృష్టి), అంతటి పరిమాణముగల సమయమే బ్రహ్మరాత్రియు (ప్రళయము) నగును.

౧౨000 X ౧000=౧,౨0,00,000 దేవవర్షములు

౧౨000000 X 3౬0=౪3౨0000000 మానవ వర్షములు

సృష్టిసమయ మెంతో ప్రళసమయము కూడ నంతయే.

అట్టి దేవయుగము లొక వేయి గడచిన నది పుణ్యమైన బ్రహ్మదిన మనియు, అంతే సమయము బ్రహ్మరాత్రి యనియు నహోరాత్రవిదులు చెప్పుదురు.

పూర్వము చెప్పబడిన చతుర్యుగములు (౧౨000 దేవ వర్షములు) ఒక దేవయుగ మగును. అట్టి దేవయుగములు (౭౧) డెబ్బదియొక్కటి కలిసి యొక మన్వంతరకాల మనబడును.

మన్వంతరము లసంఖ్యేయములు. సృష్టి ప్రళయములు నసంఖ్యేయములే. ప్రజాపతి, సృష్టి ప్రళయముల క్రీడవలె (అనాయాసముగ) నొనర్చును.

సృష్ట్యుత్పత్తి లయములు, వేదోత్పత్తి సమయమున మానవులు లెక్కించుటకు వీలుగ బ్రహ్మదినము, బ్రహ్మరాత్రి మున్నగు నామములు నిశ్చయింపబడినవి. మన్వంతరము మారినపుడు సృష్టినైమిత్తిక గుణములలోను కొంత మార్పు వచ్చును. అందువలననే మన్వంతర మనుపేరు పెట్టబడినది. వర్తమానసృష్టికి కల్పమనియు, ప్రళయమునకు వికల్పమనియు పేరులు. ఈ వర్షముల సంఖ్య నీ క్రింద జూపిన విధమున లెక్కింప వలయును.

| | |
|---|---|
| ఏకము | ౧ |
| దశకము | ౧0 |
| శతము | ౧00 |
| సహస్రము | ౧000 |
| దశసహస్రము | ౧0000 |
| లక్ష | ౧00000 |
| నియుతము | ౧000000 |
| కోటి | ౧0000000 |
| అర్బుదము | ౧00000000 |
| వృందము | ౧000000000 |
| ఖర్వము | ౧0000000000 |
| నిఖర్వము | ౧00000000000 |
| శంఖము | ౧000000000000 |
| పద్మము | ౧0000000000000 |
| సాగరము | ౧00000000000000 |
| అంత్యము | ౧000000000000000 |
| మధ్యము | ౧0000000000000000 |
| పరార్ధ్యము | ౧00000000000000000 |

పదిరెట్లు పెంచుచు నీ గణితముతోనే సూర్యసిద్ధాంతాది జ్యోతిష్యగ్రంథములలో లెక్కలు వేయబడినవి.

(సహస్రస్య....)అను నీ యజుర్వేద వాక్యమునుబట్టి ప్రపంచమునకు సహస్రమని నామము. పూర్వము వర్ణించిన బ్రహ్మదినమునకు, రాత్రికిని సహస్రమనియే పేరు. ఈ

మంత్రమున కర్థము సామాన్యము:- "ఓ పరమేశ్వర ! యీ సహస్ర చతుర్యుగముల దినరాత్రుల (ప్రమాణము)ను నిర్మించువాడవు నీవే!"

శతపథబ్రాహ్మణమునందును నీ సంపూర్ణజగత్తునకు సహస్రమని నామము గలదు. సంపూర్ణ జగత్తునకు దాతవు నీవే.

జ్యోతిషశాస్త్రమున సంవత్సరముల సంఖ్యను సరిగా నార్యులు లెక్కించినారు. సృష్ట్యుత్పత్తి జరిగినప్పటినుండి నేటివఱకు దినములను లెక్కించుచు, క్షణము మొదలు కల్పాంతము వఱకు గణితవిద్యను ప్రసిద్ధమొనర్చుచు వచ్చిరి - పరంపరగా వినుచు వినిపించుచు, వ్రాయుచు, వ్రాయించుచు, చదువుచు వచ్చితిమని భావము. సృష్టి యొక్కయు, వేదములయొక్కయు నుత్పత్తికల వత్సరముల సంఖ్యా వ్యవస్థపైన జూపినదే సరియని యెల్లరు నంగీకరించుట యుక్తము.

ఆర్యులు నిత్యము 'ఓమ్, తత్, సత్' అను పరమేశ్వరుని నామములను ముందుగా నుచ్చరించి కార్యముల నాచరించుచు, పరమేశ్వరునకు నెల్లపుడు ధన్యవాదముల నొనర్చుచు వచ్చుచున్నారు. నేటి వఱకును మనము, పరమేశ్వరుని సృష్టియు నానందముతో నున్నాము. పూర్వము విరామించిన బ్రహ్మదినమున రెండవ జామున మధ్యాహ్న సమీపమున జేరుకొనుచున్నట్లు 'బహీఖాతా' (లెక్కల చిట్టా) లో వలె నిత్యము వ్రాయుచు, వ్రాయించుచు, మన్వంతరమున నెన్ని వర్షములు గడచినదియు ఇంకను నెన్ని వర్షములు భోగింపవలసియున్నదియు తెలియునగును. (బ్రహ్మణో ద్వితీయ....) ఇప్పుడు వైవస్వత మన్వంతరము నడచుచున్నది. అందులో నీ కలియుగము (౨౮) ఇరువది యెనిమిదవది. ఈ యుగమునను ప్రథమ చరణమే గడచుచున్నది. అట్లే వర్షము, అయనము, ఋతువు, మాసము, పక్షము, దినము, నక్షత్రము, లగ్నము, నిమేషము మొదలగువానితో గూడిన యీ సమయమునందు మే మీ పనుల చేసితిమి; ఇవి చేయుచున్నాము; అని కార్యారంభమున సంకల్పించుచున్నాము. ఇట్లే యన్ని కార్యములు నార్యులు బాలకులు మొదలు వృద్ధుల వరకు నెల్లరుచేయుచు, నెఱుగుచు వచ్చిరి.'బహీఖాతా' లో ప్రతిదినము తిథులు వ్రాసినట్లు సంకల్పమున మాసములు, సంవత్సరములు పెంచుచు, తగ్గించుచు వచ్చుచున్నారు. ఆర్యావర్తమున నేటి వరకు నీ యితిహాస మొకే విధముగా వర్తించుచున్నది. సర్వగ్రంథములందును నీ విషయ మొకే విధముగ వ్రాయబడియుండుట జూడనగును. విరోధ మెక్కడను గనిపింపదు. కావున దీనిని కాదన నెవరికిని సామర్థ్యము లేదు.

సృష్టి యుత్పన్నమైననాటినుండి సరిగా తిథి వారములు వ్రాయుచుండని పక్షమున ఆర్యులకును సరిగా నీ లెక్క తెలియుట కఠినమయ్యెడిది. ఇక నితరులసంగతి నేమనగలము! దీనింబట్టి సృష్టి ప్రారంభము నుండి నేటివరకు ఆర్యులలోనే గొప్ప గొప్ప విద్వాంసులు, సభ్యులు ప్రసిద్ధులై యున్నారనియు సిద్ధమగుచున్నది. జైనులు, మహమ్మదీయులు మున్నగువారీ దేశపు టితిహాసము (చరిత్ర)ను, విద్యా పుస్తకములను నశింపజేయ మొదలిడినపుడు ఆర్యులు సృష్టియొక్క గణితమునకు సంబంధించిన యితిహాసమును కంఠస్థము చేసికొనిరి. జ్యోతిష శాస్త్రమున మిగిలియున్న పుస్తకముల మూలమున వార్షిక పంచాంగములను నిర్మించుచున్నారు. వానిలోను క్రమముగా తిథులు వ్రాయుచు వచ్చుచున్నారు. దీని నెవరును కాదనజాలరు. పూర్వాపరకాలముల ప్రమాణ మెల్లరకు దెలియును, సృష్టియొక్క యుత్పత్తి ప్రళయములు, వేదోత్పత్తి కాలమును గుర్తించుటలో భ్రమ కలుగదు. ఇది మిక్కిలి యుత్తమ కార్యము. దీని నెల్లరును బాగుగా నెఱుగవలయును. ఈ గణిత శాస్త్రమును మత్తము వ్యవహారమును లోకులు ధనసంపాదన కొఱకు చెడగొట్టి యున్నారు. ఇయ్యది దుఃఖకరము. కాని, ధనలోభముతోనైనను (నీ గణితసంబంధమైన) పుస్తక వ్యవహారమును రక్షించుచు నష్టము కాకుండునట్లు చేయుట హర్షింపదగిన విషయమే. నాలుగు యుగములలోగల భేదము, నానివర్ష సంఖ్యలో గల హెచ్చుతగ్గులు వాని వివరణము ముందు వ్రాయుదుము - అక్కడ చదువుదురు గాక ! ఇటవానికి ప్రసక్తి లేనందున వ్రాయనైతిమి.

ఈ ప్రకరణమునందే పూర్వముల్లేఖించిన మనుస్మృతిశ్లోకముల మూలమున దేవవర్షములను లెక్కించి క్రమముగ నాలుగు వందలముప్పది రెండు కోట్ల (౪౩౨౦౦౦౦౦౦౦) మానవ వర్షములు సంపూర్ణ సృష్టికాలమని స్పష్టపరచబడినది.

వైదిక సిద్ధాంతానుసారము సృష్టికిగల యదార్థ నిర్ణయము. శ్రీ దయానందస్వామివారును నీ సిద్ధాంతమునే యీ ప్రకరణమున నీ క్రింది వచనములతో పోషించియున్నారు. "ఏకసహస్రం (౧౦౦౦) చతుర్యుగాని బ్రహ్మదినస్య పరిమాణం భవతి". సృష్టికి ఆయువు ఒక్కవేయి చతుర్యుగములు(౪౩౨౦౦౦౦×౧౦౦౦=౪౩౨౦౦౦౦౦౦౦).కాని, పై పంక్తులలో జూపినట్లు ఈ సృష్టిలో గతించిన వర్షములు గడవనున్న వర్షములు కలిపి చూచిన (గత వ. ౧౯౬౦౮౫౩౦౭౬+౨౩౩౩౨౨౬౯౨౪, రానున్న వ. ౪౨౯౪౦౮౦౦౦౦) మాత్రమే యగుచున్నవి (౨౫౯౨౦౦౦౦) రెండుకోట్ల, యేబదితొమ్మిది లక్షల, యిరువదివేల సంవత్సరముల కాలము సృష్టిసమయమునకు తగ్గుచున్నది. కావున విక్రమసంవత్ ౧౯౩౩ వరకు నిర్దేశించిన గతకాలపు వత్సరముల సంఖ్యయు, రానున్న కాలపు వర్షముల సంఖ్యయు సరికాదని తెలియుచున్నది. ఈ

విషయమును ఇంతకు పూర్వమే సూచించి యున్నాము. ఈ ప్రకరణమున సృష్టియుత్పన్నమైవి. శ. ౧౯౩౩ వఱకు (౧౯౬౦౮౫౨౯౭౬) ఒక్క వృందము, తొంబదియాఱు కోట్ల, యెనిమిది లక్షల, యేబదిరెండు వేల, తొమ్మిది వందల డెబ్బది యాఱు సంవత్సరము లయినట్లు నిర్దేశింప బడినది. కాని, దయానందమహర్షిచే వ్రాయబడిన యితర గ్రంథముల మొదటి పేజీలమీదనే, ఒక వృందము తొంబది యేడుకోట్ల, యిరువది తొమ్మిదిలక్షల నలుబదియెనిమిది వేల తొమ్మిది వందల డెబ్బది యాఱు (౧౯౭౨౯౪౮౯౭౬) వర్షములు సృష్టికాల మని లిఖింపబడియుండుట జూచుచున్నాము. దీనింబట్టియు నీ పుస్తకమున జూపిన సంఖ్య సరికాదని తెలియుచున్నది. జ్యోతిషశాస్త్రపు సూర్యసిద్ధాంతనామక గ్రంథాధారమున నీ గణితము చేయబడినది. ఆ గ్రంథమును బాగుగ జూచినపుడు పైన జూపిన అంకెలలో భేదము గలుగుటకు కారణము బోధపడును.

యుగానాం సప్తతిః సైకా మన్వంతర మిహోచ్యతే
కృతాబ్దసంఖ్యయాఽస్యాంతే సంధిః ప్రోక్తో జలప్లవః

సూ. సి. అ. ౧. శ్లో. ౧౮.

డెబ్బదియొక్క చతుర్యుగము లొక మన్వంతరము. మన్వంతరమున కంతమున సత్యయుగ సంఖ్యకు సమానసంఖ్య (౧౭౨౮౦౦౦) గల వర్షముల కాలము ఒక సంధికాలముండును. ఆ సంధిలో జలప్లవము (వరద) కలుగును.

ససంధయస్తే మనవః కల్పే జ్ఞేయాశ్చతుర్దశ
కృతప్రమాణః కల్పాదౌ సంధిః పంచదశ స్మృతః

సూ. సి. అ. ౧. శ్లో. ౧౯.

ఇట్టి ౧౫ సంధులతో కూడిన ౧౪ మన్వంతరము లొక కల్పము (సృష్టి) లో నగును.

పైన జూపిన సృష్టి సంవత్సరములలో ౧౪ మన్వంతరముల కాలము లెక్కింపబడినది కాని, యే కారణముననో యీ మన్వంతరముల మధ్యలో నేర్పడు ౧౫ సంధికాలముల సంవత్సరములు లెక్కించినట్లు కనిపింపదు. ప్రస్తుత కల్పము (సృష్టి) లో ఆఱు మన్వంతరములు గడచిపోయినది. ఏడవ మన్వంతరమున నిరువదియేడు చతుర్యుగములు గడచినవి. ఇప్పుడు ఇరువది యెనిమిదవ చతుర్యుగము గడచుచున్నది. అందునను కృత, త్రేత, ద్వాపరయుగములు గతించినవి. కలియుగమున ప్రథమ పాదములో (౪౯౭౬) నాలుగువేల తొమ్మిది వందల డెబ్బది యాఱు సంవత్సరములు సమాప్తమైనవి. కావున,

| | |
|---|---|
| ౬ మన్వంతరములు | ౧౮౪౦౩౨౦౦౦౦ |
| ౭ సంధికాలములు | ౧౨౦౯౬౦౦౦ |
| ౭ వ. వై. మ. ౨౭ చ. యు. | ౧౧౬౬౪౦౦౦౦ |
| ౨౮ వ. యుగములో గత సం. | ౩౮౯౨౯౭౬ |
| సృష్టికాలము నేటివఱకు | ౧౯౭౨౯౪౮౯౭౬ |

విక్రమ సంవత్ ౧౯౩౩ నాటికి వేదముల యుత్పత్తి జరిగి ఒక వృందము తొంబదియేడు కోట్ల, యిరువది తొమ్మిది లక్షల, నలుబది యెనిమిది వేల తొమ్మిది వందల డెబ్బది యాఱు వర్షములు గతించినవి. ఇదియే సృష్టి యేర్పడిన కాలముకూడ. ఇందు ప్రమాణము :-

కల్పాదస్మాచ్చ మనవః షడ్వ్యతీతాః ససంధయః
వైవస్వతస్య చ మనోః యుగానాం త్రిఘనో గతః

(సూ, సి. అ. ౧. శ్లో. ౨౨.)

ప్రొఫెసర్ విల్సన్, ప్రొఫెసర్ మాక్సుముల్లర్ మున్నగు ఐరోపాఖండపు మహాశయులు వేదములు మనుష్య రచితములనియు, అవి శ్రుతులు కావనియు చెప్పినది సరికాదు. ఇంకను వారిలో కొందఱు వేదముల కాలము ౨౪౦౦ సం. లో య్యి యుండునని చెప్పియున్నారు. అదియును భ్రమమూలకము- అసత్యమని యెఱుగవలయును. వారికి ఆర్యులమగు మన దినచర్యకాని, మనము నిత్యము సృష్టికి నారంభము నుండియు చెప్పుకొనుచు నచ్చు సంకల్పమును గూర్చికాని యేమియు దెలియదు. దానిని గూర్చి వారెన్నడు నాలోచించియు నుండరు. అందువలననే వారి కీ విషయమున నిట్టి భ్రమలు కలిగి యుండును. కాబట్టి వేదములు పరమేశ్వరుని వలన నుత్పన్నము లైనవనియు, యవి యుత్పన్నములై పై నిరూపించినట్లు ౧౯౭౨౯౪౮౯౭౬ సంవత్సరములు (వి. శ. ౧౯౩౩ నాటికి) గతించినవనియు, అంతేకాలము సృష్టి యుత్పత్తి కి తరుపరి గతించినదనియు నెఱుగవలయును. ఇంతే కాక దేశభాషలలో వేదవిషయమున జేసిన విరుద్ధవ్యాఖ్యానములన్నియు మిథ్యాభాషిత (అబద్ధ) ము లనియు గుర్తింపవలయును. మఱియు నింతకు పూర్వము వర్ణించినట్లు వేయి చతుర్యుగములు గతింపనంత వఱకు ఈశ్వర ప్రదత్తములైన వేదములు, ఈజగత్తు, ప్రాణిజగత్తు పరమేశ్వరుని దయవలననెల్లపుడు నుండుననియు తెలిసికొనవలయును.

# వేదముల నిత్యత్వవిచారము

వేదము లీశ్వరీయములు - ఈశ్వరోత్పన్నములు. ఈశ్వరుని సర్వసామర్థ్యములు - శక్తులు నిత్యము లగుటంబట్టి వేదములుకూడ స్వతః నిత్యములే యగును.

పూ: ఈ విషయమున కొందరిట్లు శంకింతురు. వేదములందు ఛందస్సు, పదములు, వాక్యములు, వాని కలయికలు నున్నందున వేదములు శబ్దమయములు. కావున నవి నిత్యములు కానేరవు. ఘటము (కుండ) చేయుటవలన నేర్పడుచున్నది. అట్లే వేదములను గూడ ఋషులెవరో రచియించియున్నారు. అవి రచియించుటకు పూర్వ ముండియుండవు. ప్రళయమున నవి నశియించును. ఇట్టి ఉత్పత్తి వినాశములు గలవి కార్యములనబడును. శబ్దము లుత్పత్తి వినాశములు గలవి యగుటచే కార్యములు. అందువలన నవి యనిత్యములు. కావున శబ్దమయములగు వేదములను ననిత్యములే యనగును. (ఇందులకు ఘటాదులు ఉదాహరణము.)

ఉ. ప: అట్లు శంకింపజనదు. కారణమేమన: నిత్యములు, కార్యములు నని, శబ్దములు ద్వివిధములు. పరమేశ్వరుని జ్ఞానమునందలి శబ్దములు, అర్థములు, సంబంధములు నిత్యములే. మన (మానవ) కల్పన వలన నుత్పన్నములగునవి కార్యము- అనిత్యము లగును. ఎవని జ్ఞానము - క్రియ, నిత్యములో - స్వభావసిద్ధములో - అవారులో, అతని సమస్త సామర్థ్యములు నిత్యములే యగును. వేదములు పరమేశ్వరుని విద్యారూప సామర్థ్యములే యగుటవలన నిత్యములే యగును. ఈశ్వరుని విద్య అనిత్య మెన్నడును కానేరదు.

పూ: ఈ జగత్తంతయు విభక్తమై కారణరూపమున (ప్రళయమున) నున్నపుడు కార్యరూపమున స్థూలముగ నున్న పదార్థము లన్నియు నశించును. అప్పుడు వేదపుస్తకములు నశించును. కావున, వేదములు నిత్యము లెట్లగును?

ఉ: ఈ స్థితి పుస్తకములకు, సిరాకు, కాగితములకు, అక్షరములనిర్మాణమునకు గలుగును; అట్లే మనము చేయు క్రియకును వర్తించును. వేదములకీ స్థితి కలుగదు. వేదము పరమేశ్వరుని జ్ఞానమునందుండు శబ్దార్థ సంబంధరూపము గదా! వేదము పుస్తకము కాదు. కాగితములు, సిరాబుడ్డి అంతకంటెను కాదు. కాగితములమీద సిరాతో వ్రాయుటయనునది మానవక్రియ. అందువలన నా క్రియ యనిత్యము. వేద మీశ్వరుని జ్ఞానమున నెల్లపుడు నుండును- కావున నది నిత్యమేయగును. అందువలన పఠనపాఠనములు, పుస్తకములు ననిత్యము లయినంతమాత్రమున వేదము లనిత్యములు కావు; అవి పరమేశ్వరుని జ్ఞానమున బీజమున నంకుర ముండున ట్లెల్లప్పుడు నుండును. సృష్టికి నారంభమున వేదము లీశ్వరునివలన ప్రసిద్ధము లగును. ప్రళయమున జగత్తుండదు కావున నవి యప్రసిద్ధము లగును. కావున వేదములు స్వరూపతః నిత్యములే యగును. ఈ కల్పమున (సృష్టియందు) శబ్దములు, అక్షరములు, అర్థములు, సంబంధములు వేదమున నుండునట్లే పూర్వకల్పమునందును నుండెను. రానున్న కల్పమునందును నుండును.

కారణ మేమందురేని, ఈశ్వరుని విద్యాదులు నిత్యములు, ఏకరసములై యుండును. వానియొక్క యక్షరములకు కూడ విపరీత భావము కలుగదు. అందువలననే ఋగ్వేదమున నిట్లు వర్ణింపబడినది. "సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్". ఋ. ౧౦-౧౯౦-3. సూర్యచంద్రగ్రహణ మిట ఉపలక్షణము మాత్రమే. పూర్వకల్పమున నీశ్వరుని జ్ఞానమునందు సూర్యచంద్రులనిర్మాణ మెట్లుండెనో, యీ కల్పమునందును నట్లే యున్నది. పూర్వ కల్పమున సూర్యచంద్రులను రచించినట్లు ఈ కల్పమునను పరమేశ్వరుడు రచించినాడని భావము.

ఋగ్వేదాది నాలుగు వేదసంహితలందు నిప్పు డెట్టి శబ్దార్థ సంబంధములు, అక్షరములు నే క్రమమున నున్నవో, అట్లే యెల్ల కల్పములందు నుండును. కారణమేమన: ఈశ్వరుని జ్ఞానము నిత్యము. దానికి వృద్ధి క్షయము లుండవు. వైపరీత్యము గలుగదు. కావున వేదముల స్వరూపము నిత్యమనియే యంగీకరింపవలయును.

వేదములు నిత్యములను విషయమున సాక్ష్యము కొఱకు వ్యాకరణ శాస్త్ర ప్రమాణముల నిచ్చుచున్నాము. వ్యాకరణ శాస్త్రము సంస్కృతమునకు నితరభాషలకును చెందిన శబ్దవిద్యకు మూల (ముఖ్య) ప్రమాణము. భగవత్పాణిని, పతంజలి ముని లా శాస్త్రమును రచించిరి. వారి మతమున - శబ్దములన్నియు నిత్యములు. ఈ శబ్దములలోని అక్షరాద్యవయవము లన్నియును కూటస్థములు - వినాశరహితములు. అవి పూర్వాపరములలో చలింపవు. వాని కభావము కాని, వినాశము కాని కలుగదు. కావున వైదికశబ్దములు, వేదములనుండి లోకవ్యవహారమునందు వాడబడు లౌకిక శబ్దములు నన్నియును నిత్యములే. కారణమేమన; ఆ శబ్దములలోని వర్ణములు- అక్షరము లన్నియు నాశములేనివి, అచలములు. వానిలో వికారముకాని, ఆగమముకాని యేదియును గలుగదు. అందువలన శబ్దములు నిత్యములే.

పూ: గణపాఠము, అష్టాధ్యాయి, మహాభాష్యము నను గ్రంథములలో అక్షరములలోపము, ఆగమము, వికారము మున్నగునవి కలుగునట్లు వర్ణింపబడియున్నది. కావున శబ్దములు నిత్యము లెట్లగును?

ఉ: ఈ ప్రశ్నకు సమాధానము మహాభాష్యకర్త పతంజలిముని యిట్లు నుడివియున్నాడు- శబ్దసముదాయస్థానమున మఱియొక శబ్ద సముదాయము ప్రయోగింపబడును. ఉదా: వేదపార+గమ్+డ+సు+భూ+శప్+తిప్ అను నీ పదసముదాయ (వాక్య) స్థానమున, వేదపారగోఽభవత్ అను నీ శబ్దసముదాయాంతరము ప్రయోగింపబడును. ఈ విషయమున కొందఱు అమ్, డ్+ఉ, శ్+ప్, ఇ, ప్, అను నక్షరములు నివృత్తములగును- లోపించును అందురు. అది భ్రమ మాత్రమే కాని, సరికాదు. కారణమేమన- శబ్దసముదాయస్థానమున మఱియొక శబ్దసముదాయమే ప్రయోగింపబడును. అట్లుకాక శబ్దావయవములైన యక్షరములలో వికారము నంగీకరించిన పక్షమున శబ్దములు నిత్యములు అను దాక్షీపుత్రుడైన పాణినిముని సిద్ధాంతము స్థిరము కానేరదు. ఇట్లే అట్ ఆగమము, భూ స్థానమున భో ప్రయోగస్థలములందును సంగతి నెంచవలయును. శబ్దముల యొక దేశము (అవయవము) వికృతము కాదనియు, ఒక శబ్దస్థానమున మఱియొక శబ్దము ప్రయోగింపబడుననియు నెంచవలయునని భావము.

(శ్రోత్రోపలబ్ధిరితి...) శ్రోత్రేంద్రియము (చెవి) చే గ్రహింపబడునదియు, బుద్ధిచే తెలియబడునదియు, వాగింద్రియముచే నుచ్చరింపబడి ప్రకాశింప జేయబడునదియు, ఆకాశమున నుండునదియు - శబ్దము లనబడును. ఈ లక్షణములనుబట్టి శబ్దము నిత్యమనియే తెలియుచున్నది.

పూ: అదియెట్లు?

ఉ: ఉచ్చారణ శ్రవణాదులు మన మొనర్చు క్రియలు, ఆ క్రియలు క్షణికములు- అవి నశించును. కావున నవి యనిత్యములే. కాని, శబ్దము మాత్ర మనిత్యముకాదు. మన మొనర్చు వాగింద్రియ క్రియా శబ్దము నందలి ప్రతిష్ఠమును వేఱగును; కాని, శబ్దము మాత్ర మేకరసమై యఖండముగానే యుండును.

పూ: శబ్దముకూడ నుచ్చారణమునకు తరువాత నశించును- పూర్వము వినబడదు. కావున ఉచ్చారణ క్రియవలె శబ్దము కూడ ననిత్యము కావచ్చును. శబ్దము నిత్యమని యెట్లంగీకరింపనగును?

ఉ: శబ్దము లాకాశమువలె నంతట నేకరసములై నిండియుండును. ఉచ్చారణ క్రియ జరుగనంతవఱకు శబ్దము ప్రసిద్ధములుకాక వినబడవు. ప్రాణము, వాక్కు నను వాని క్రియలచే నుచ్చారణ చేయబడినపుడే శబ్దములు ప్రసిద్ధము లగును- వినబడును. 'గౌః' అను శబ్దము నుచ్చరించినపుడు ఉచ్చారణ క్రియ గకారమున నున్నంతవరకు ఔకారమున నుండదు. ఔకారమున నున్నపుడు గకారవిసర్జనీయములలో నుండదు. అట్లే వాక్క్రియకును ఉత్పత్తివినాశము లుండును. కాని, అఖండైకరసములగు శబ్దములకు మాత్రము వినాశోత్పత్తులుండవు. ఆకాశమున శబ్దప్రాప్తి యగుచున్నందున శబ్దము లాకాశమున నొకే విధమున నఖండముగ నంతట నిండియుండును. ప్రాణ, వాక్-ఇంద్రియ క్రియలు జరుగనంతవఱకు వాని యుచ్చారణ శ్రవణములు కలుగవు. కావున శబ్దము లాకాశమువలె నిత్యములే యని సిద్ధమగుచున్నది. వ్యాకరణశాస్త్ర సిద్ధాంతము ననుసరించి శబ్దములన్నియు నిత్యములైనపుడు, వేదశబ్దములను గూర్చి యిక చెప్పవలసిన దేముండును? వైదిక శబ్దములు సర్వవిధముల నిత్యములే యని భావము.

ఏవం జైమినిమునినాఽపి శబ్దస్య నిత్యత్వం ప్రతిపాదితమ్ - నిత్యస్తు స్యాద్దర్శనస్య పరార్థత్వాత్ — పూ. మీమాంస ౧.౧.౧౮.

ఇట్లే జైమినిముని కూడ శబ్దనిత్యత్వము నంగీకరించియున్నారు:- (నిత్యస్తు...) సూత్రమునందలి 'తు' శబ్దము శబ్దమునగల యనిత్యత్వ శంకను నిరాకరించుచున్నది. శబ్దములు నిత్యములే. వానికి నాశములేదు. అర్థజ్ఞానముకొఱకే శబ్ద ముచ్చరింపబడుచున్నది. కావున శబ్ద మనిత్యము కానేరదు. ఏ శబ్దము నుచ్చరింతుమో దాని ప్రత్యభిజ్ఞయే కలుగును. శ్రవణేంద్రియము (చెవి) ద్వారా ఆ శబ్దమే జ్ఞానమున స్థిరమగును. మరల నా శబ్దమువలననే యర్థప్రతీతి కలుగును. శబ్ద మనిత్య మగునెడల నర్థజ్ఞానము (నెవరు కలిగింతురు) నేది కలిగించును? ఆ శబ్దమే లేదుకదా? అర్థజ్ఞానమును గలిగించున దేది? అనేక ప్రదేశములలో నొకే క్షణమున ననేక పురుషులు గో శబ్దము నుచ్చరింతురు. అట్లే యా శబ్దమే మాటి మాటికి నుచ్చరింపబడును. ఈ కారణమువలనను శబ్దము నిత్యమే యగును. శబ్ద మనిత్యమగునెడల నీ వ్యవస్థ యెవ్వడును సిద్ధింపనేరడు. జైమినిముని యిట్లనేక హేతువులతో పూర్వమీమాంసాశాస్త్రమున శబ్దము నిత్యమని నిరూపించియున్నారు.

ఇట్లే వైశేషికదర్శనకర్త కణాదమునియు చెప్పియున్నాడు. (తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్ వై. ద. ౧. ౧. ౩.) వేదము లీశ్వరోక్తములు - వీనియందు సత్యవిద్య, పక్షపాతరహిత ధర్మము ప్రతిపాదింపబడియున్నవి. అందువలన నాలుగు వేదములు నిత్యములే. ఇట్లే యెల్లరు నంగీకరించుట యుక్తము. ఈశ్వరుడు నిత్యుడు - కావున నతని విద్యయు నిత్యమే.

న్యాయశాస్త్రమున గోతమమునిగూడ శబ్దము నిత్యమని చెప్పియున్నాడు.

(మంత్రాయుర్వేద ప్రామాణ్యవచ్చ తత్ప్రామాణ్యమాప్త ప్రామాణ్యాత్ న్యా. ౨.౧.౬) ఈశ్వరోక్తములయిన నిత్యవేదముల ప్రామాణ్యము నెల్లరు నంగీకరింపదగినది.

పూ: ఎందువలన?

ఉ : సృష్టికి నారంభమునుండి నేటివరకును ఆప్తులైన బ్రహ్మాది మహర్షులెల్లరు వేదములను నిత్యములనియు, ప్రామాణికములనియు నంగీకరించుచు వచ్చిరి. ధర్మాత్ములు, కపటఛలాదిదోషరహితులు, సర్వవిద్యాయుక్తులు, మహాయోగులు, సర్వమానవుల సుఖము నపేక్షించి సత్యము నుపదేశించువారు, లేశమాత్రమైనను పక్షపాతముకాని, మిథ్యాచారముకాని లేని వారును ఆప్తులనబడుదురు. వారు ప్రామాణికులు. అట్టివారే వేదములను నిత్యగుణ యుక్తములుగా ప్రమాణీకరించియున్నారు.

పూ: వేనివలె వేదములు ప్రమాణములు? ఇందులకు దృష్టాంతమేమి?

ఉ : సత్యార్థమును, సత్యవిద్యను ప్రకట మొనర్చు మంత్రములు, వైద్యశాస్త్రము నిందులకు దృష్టాంతములు. సత్యపదార్థములను దెలుపు మంత్రము (ఆలోచన) లవలె, ఆయుర్వేదమున నొక భాగమగు నౌషధమువలె వేదములు ప్రమాణములు. ఔషధము సత్యపూర్వకముగ సేవించినందున రోగనివృత్తి కలుగును. సుఖము లభించును. ఆయుర్వేదమున నొక భాగమగు నౌషధ విషయము సత్యమైనందున మిగిలిన భాగములు కూడ సత్యములైన ప్రమాణములుగ నంగీకరించుదుము. అట్లే వేదప్రామాణ్యమును నెల్లరు స్వీకరింపవలయును. వేదములలో నొక భాగమునందు చెప్పబడిన విషయము సత్యమని తెలిసినపుడు మిగిలిన వేదభాగములు - అర్థములు ప్రత్యక్షములు కానివి కూడ ప్రమాణములనియే యంగీకరింపదగును. ఆప్తపురుషుల యుపదేశము మిథ్య యెన్నడును కాదు.

(మంత్రాయుర్వేద ... ప్రామాణ్యవత్) ఈ సూత్రమునకు వ్రాసిన వ్యాఖ్యానమునందు భాష్యకారుడు వాత్స్యాయనుడు, వేదములు ప్రామాణికము లనియు, నిత్యములనియు స్పష్టముగ నిట్లు ప్రతిపాదించి యున్నాడు:- ఆప్తులు వేదార్థములను స్వయముగ జూచి యితరులకు జూపువారును-తెలుపువారునైయున్నారు. మంత్రార్థద్రష్టలు, వక్తలునైన వారే ఆయుర్వేదాది శాస్త్రకర్తలునై యున్నారు. ఆయుర్వేదమున వారు చెప్పినదెట్లు సత్యమో, అట్లే వేదములు ప్రామాణికములు, సత్యములు నను వారివ్యవహారముకూడ సత్యమనియే యంగీకరింపనగును. ఆప్తోపదేశములు ప్రమాణములైనట్లు, ఆప్తులకాప్తుడు, నెల్లరకు పరమ గురువు నగు పరమేశ్వరునిచే నుపదిష్టములయిన వేదములు నిత్యము లనుటయు ప్రమాణముగ నంగీకరింపవలయును.

అత్ర విషయే యోగశాస్త్రే పతంజలిమునే రప్యాహ-

స ఏష పూర్వేషా మపి గురుః కాలేనానవచ్ఛేదాత్. పా. యోగ. ౧-౧. ౨౬.

యోగదర్శనకర్త పతంజలిమునియు వేదములు నిత్యములనియే యంగీకరించియున్నాడు.

(స ఏష..) ప్రాచీనులయిన అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు మఱియు బ్రహ్మాది మహర్షులు సృష్టి- ప్రారంభమున జన్మించిన వారు. వారికి, వారి తరువాత నవవలె కుగల విద్వాంసులకు, ముందు రానున్న వారికి నెల్లరకును పరమేశ్వరుడు గురువు. వేదము మూలమున సత్యార్థముల నుపదేశించుటవలన పరమేశ్వరునకు 'గురు' వను నామము కలిగినది. అతడు నిత్యుడు. అతనియందు క్షణాదికాలగతి వ్యవహార ముండదు. అవిద్యాదిక్లేశములకు, పాపకర్మలకు, వానివలన గలుగు వాసనాజనిత భోగములకును నతడు దూరముగ నుండును-అవి యతని నంటవు. ఆ ప్రభువునందు అనంతవిజ్ఞాన మేకరసమై యెల్లప్పుడు ఉండును. అట్టి పరమేశ్వరునిచే రచింపబడిన వేదములందు సత్యార్థ బోధకత, నిత్యత్వము నిశ్చితముగ నుండునని యెల్లరు నెఱుగవలయును.

ఇట్లే సాంఖ్యశాస్త్రమున కపిలాచార్యుడు కూడ చెప్పుచున్నాడు.

(నిజ శక్త్యభివ్యక్తేః స్వతః ప్రామాణ్యమ్...) పురుషునితో - పరమేశ్వరునితో నుండునట్టి ముఖ్య సామర్థ్యము వలనే వేదములు ప్రకటములైనవి. ఆ సామర్థ్యమునకు జ్ఞానశక్తియనికాని, విద్యాశక్తియనికాని నామ మంకితము చేయవచ్చును. కావున వేదముల నిత్యత్వము, స్వతః ప్రామాణ్యము రెండును నెల్లరిచే నంగీకరింప బడవలసినవే.

ఇట్లే వేదాంతశాస్త్రమున వేదములు నిత్యములను విషయమున వ్యాసులిట్లు నిరూపించిరి- 'శాస్త్రయోనిత్వాత్' అని.

(శాస్త్రయోనిత్వాత్) అను సూత్రమును వివరించుచు శంకరాచార్యులు కూడ వేదములు నిత్యములని యంగీకరించి యిట్లు వ్యాఖ్యానము వ్రాసిరి.

ఋగ్వేదాది నాలుగు వేదములు నానేక విద్యాయుక్తములు. ప్రదీపమువలె సత్యములగు నర్థముల నన్నింటిని ప్రకాశింప జేయును. ఆ వేదములకు కర్త- సర్వజ్ఞత్వాదిగుణములతో కూడిన పరబ్రహ్మము. సర్వజ్ఞమగు బ్రహ్మకంటె ఇతరుడగు జీవుడెవడును సర్వజ్ఞగుణ యుక్తము లగు నీ వేదములను రచించినవాడనుట సంభవముకాదు. పాణిని ప్రభృతి మునులు వ్యాకరణాది శాస్త్రములనుగూడ వేదముల నాశ్రయించియే వ్రాయగలిగిరి. సర్వవిద్యాయుక్తములగు వేదములను పరమేశ్వరుడు దక్క యితరుడెవ్వడును రచియింపజాలడు. పరమేశ్వరుని కంటె భిన్నుడింకొకడు సర్వవిద్యాపూర్ణుడు లేడు. మఱియు పరమేశ్వరరచితములైన వేదములను జదువుట వలనను, విచారణ చేయుటవలనను పరమేశ్వరుని

యనుగ్రహము వలనను మానవులకు యథాయోగ్యముగ విద్యలు తెలియును. మఱియొక తీరున తెలియవు.

పూ: దీని యభిప్రాయము.ఏమి? దీనివలన సిద్ధించిన దేమి?

ఉ: వేదములు నిత్యములని ఆర్యులెల్లరును సాక్ష్యమిచ్చిరి. ఈశ్వరుడు నిత్యుడు సర్వజ్ఞుడు. అతనిచే నిర్మితములయిన వేదములును నిత్యములు; సర్వార్థములను దెలుపదియోగ్యములు. అవి యితర నిర్మితము లెన్నడు కాజాలవని (పై లేఖవలన) సిద్ధమయినది.

(అత ఏవ చ నిత్యత్వమ్) ఈ సూత్రమునందును వేదములు నిత్యములనియు, స్వతః ప్రమాణములనియు, సర్వసత్యవిద్యాయుక్తము లనియు వర్ణింపబడినది. సజ్జను లెల్లరు నిది యంగీకరించుట యుక్తము. వేదములు ఈశ్వరోక్తములు, నిత్యధర్మయుక్తము లగుటవలన స్వతః ప్రమాణములు. అవి యెల్లపుడు నీశ్వరుని జ్ఞానమునందుండును కావున నిత్యములు. వేదముల ప్రామాణ్యమును నిరూపించుట కన్యప్రమాణ మవశ్యము కాదు. వేదముల ప్రామాణికతను, నిత్యత్వమును నిరూపించుటలో నితరశాస్త్రములు సాక్ష్యమును మాత్ర మియ్యగలవు. వేదములు నిత్యము లనుటలో స్వయముగ వేదములే ప్రమాణములు. సూర్యుడు ప్రకాశించుచున్నాడనుటకు సూర్యుడే ప్రమాణము ఇతరముకాదు. సూర్యుడు ప్రకాశస్వరూపుడై పర్వతము మొదలు త్రసరేణుపర్యంతముల గు పదార్థముల నన్నింటిని ప్రకాశింపజేయును. అట్లే వేదములు స్వయంప్రకాశములై సర్వ సత్య విద్యలను ప్రకాశింపజేయును.

స పర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరꣳ శుద్ధ మపాప విద్ధమ్
కవిర్ మనీషీ పరిభూః స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః — య. అ. ४०. మం. ८.

ఇట్లే పరమేశ్వరుడు, తన్నుగూర్చియు, తనచే ప్రకాశింప జేయబడిన వేదముల నిత్యత్వమును గూర్చియు, వాని స్వతః ప్రామాణ్యమును గూర్చియు నుపదేశించెను. ఆ విధము నీ క్రింద వ్రాయుచున్నాము.:-

(స పర్యగాత్) ఈ మంత్రము పరమేశ్వరుని గూర్చియు నతనిచే నిర్మితములయిన వేదములను గూర్చియు జ్ఞానము కలిగించును.

మంత్రార్థము: (స పర్యగాత్) ఈశ్వరుడు సర్వవ్యాపకుడు మున్నగు విశేషణములతో కూడినవాడు. అతడు సమస్త జగత్తునందు వ్యాపించి పరిపూర్ణుడై యున్నాడు. ఒక్క పరమాణువుగూడ పరమేశ్వరుని నుండి వేఱుగ నుండదు. ఆ బ్రహ్మము (శుక్రం) సర్వజగత్తును రచించునదై యున్నది. అనంత విద్యాది బలయుక్తమునై యున్నది. (అకాయం) అది స్థూలసూక్ష్మ కారణ శరీర రహితము శరీర సంయోగము పరమేశ్వరునకెన్నడు నుండదు. అతడెన్నడు జన్మింపడు. (అవ్రణం) అతడు భేదరహితుడగుటచే నక్షతుడు. పరమాణువుకూడ నతనిలో ఛిద్రము కలిగింపజాలదు. (అస్నావిరం) అతడు నాడులచే బంధింపబడడు. (శుద్ధం) అవిద్య, అజ్ఞానము మున్నగు క్లేశరూప సర్వదోషములకు నతడు దూరుడు. (అపాపవిద్ధం) ఈశ్వరుడు పాపయుక్తుడు కాడు. పాపముల నెన్నడు జేయడు. అతడు స్వభావతః ధర్మాత్ముడు, ధర్మస్వరూపుడు. (కవిః) అతడు సర్వము నెఱుగును. (మనీషీ) అతడు సర్వాంతర్యామి. భూత భవిష్యద్ వర్తమానకాలిక వ్యవహారముల నన్నింటిని సరిగా దెలిసికొనును. (పరిభూః) అతడన్నింటికి పైన విరాజిల్లు చున్నాడు. (స్వయంభూః) అతడెన్నడు పుట్టడు. అతనికి కారణము లేదు. అతడే యన్నింటికి కారణము, అనాది; అనంతుడు. కావున నతడే యందఱికి తల్లి; తండ్రియును. తన సత్యసామర్థ్యముతోడనే యెల్లపుడు వర్తిల్లును. ఇట్టి లక్షణములతో గూడి యా పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడై యున్నాడు. (శాశ్వతీభ్యః) అతడు సృష్ట్యారంభమున స్వసామర్థ్యమున నెల్లపుడుండు తన ప్రజకు సుఖప్రాప్తి కొఱకు (అర్థాన్ వ్యదధాత్) సత్యములగు వర్ణములను నుపదేశించెను. ఇట్లే పరమేశ్వరుడు ప్రతి సృష్టి యందును నారంభమున ప్రజలహితము నుద్దేశించి సర్వవిద్యా యుక్తములగు వేదముల నుపదేశించును. ప్రతి ప్రళయమునందును వేదములు పరమేశ్వరుని జ్ఞానమున నిలిచి యుండును. అందువలన నవి నిత్యములనియే యంగీకరింపవలయును. పరమేశ్వరుని విద్య యెల్లపుడు నేకరసమై యుండును.

శాస్త్రప్రమాణములవలన వేదముల నిత్యత్వము నిరూపింపబడినట్లే, యుక్తులతోను వేదనిత్యత్వము సిద్ధమగును. అది యెట్లన:-

అసత్తు నుండి సత్తేర్పడుట- అభావమునుండి భావము కలుగుట- యెన్నడును జరుగదు. అట్లే, సత్తు - అసత్తు, భావము - అభావమును కాదు. సత్యమువలననే ముందు ప్రవృత్తి కలుగును. వస్తువు కాని దాని నుండి మఱియొక వస్తువే విధముగను కలుగజాలదు. ఈ న్యాయము ననుసరించియు వేదములు నిత్యము లనియే యంగీకరింపవలయును.

పూ: ఎందువలన?

ఉ: మూలము - మొదలు లేనిదానికి కొమ్మలు, ఆకులు, పూవులు, ఫలములు, మున్నగునవి యెటనుండి కలుగును.? కలుగనేరవు. ఎవడేని తాను వంధ్యాపుత్రుని

వివాహము జూచి నాడనిన యతనిమాట యసంభవమగును. పుత్రుడుగల స్త్రీ వంధ్య యెట్లగును? పుత్రుడే లేనపుడతనికి వివాహ మెట్లగును? ఆ వివాహము నింకొక డెట్లు చూచును? కావున నీశ్వరునియం దనంతవిద్య యుండబట్టియే, మానవుల కత డా విద్య నుపదేశించి యున్నాడు. లేకున్న నతడెట్లుపదేశించును? జగము నెట్లు రచియింపగలడు? ఈశ్వరుడు తన విద్యను మానవుల కుపదేశింపకున్న, ఏ మానవునకును విద్య - యథార్థజ్ఞానము ఎన్నడును కలిగెడిది కాదు. మూలము లేని వస్తువేర్పడుట కాని, వృద్ధి నొందుట కాని జగమున నసంభవము. కావున, పరమేశ్వరుని మూలరూప వేదవిద్య - మానవులలో వృక్షరూపమున వృద్ధినొందినట్లు గుర్తింప వలయును.

మరియు నింకొక యుక్తియు నిందు గలదు. సర్వమానవులకు నే పదార్థానుభవము - సాక్షాత్ జ్ఞానము కలుగునో, అర్థమునే వారు ప్రకటింతురు. చూడుడు: ఏ వస్తుజ్ఞానము సాక్షాత్తుగ గలుగునో యా వస్తువిషయక సంస్కారము (మనస్సున) నేర్పడును. సంస్కారము వలన స్మరణ మేర్పడును. జ్ఞానమువలనను, స్మరణమువలనను ఇష్టమగు వస్తుసంపాదనకు ప్రవృత్తియు, అనిష్టవస్తువు నుండి నివృత్తియు గలుగును. లేకున్న గలుగదు. సంస్కృతభాష నెరుగువాని మనస్సున నా భాషకు సంబంధించిన సంస్కారము గలుగును. ఇతర భాషకు చెందిన సంస్కార మేర్పడదు. ఇట్లే యీశ్వరుడు వేదోపదేశము జేయకున్న మనుజుని మనస్సునందు విద్యానుభవము కలుగదు. అనుభవము కలుగకున్న సంస్కారము గలుగదు. విద్యాసంస్కారములు లేనపుడు దాని స్మరణమును గలుగదు. స్మరణ లేకుండ మనుష్యునిలో విద్యాలేశముకూడ కలుగదు.

ఈ యుక్తివలన, ఈశ్వరుని యుపదేశమువలన వేదములను విని పఠించి, విచారించుటవలననే మానవులకు విద్యాసంబంధమగు ననుభవము, తజ్జన్య సంస్కారము గలుగుచు వచ్చుచున్నవని తెలియుచున్నది.

పూ: మనుష్యులలో స్వాభావికమగు ప్రవృత్తియున్నది. దానితో చేష్టలు గలుగును. అందువలన సుఖదుఃఖానుభవము కలుగును. దానివలన క్రమముగ వారిలో విద్యాభివృద్ధి తప్పక యేర్పడును. అప్పుడు మానవులు వేదములను రచియింతురు. కావున వేదముల నీశ్వరుడు రచించినట్లేల యంగీకరింపవలయును?

ఉ: దీనికి సమాధానము వేదోత్పత్తి ప్రకరణమున నింతకుముందే చెప్పబడినది. ప్రస్తుతకాలమున నితర విద్వాంసులనుండి విద్య నేర్చుకొనక యెవరును విద్వాంసులగుట లేదు. జ్ఞానము వృద్ధినొందదు. ఇయ్యది చూచుచున్నాము. ఇట్లే సృష్టి ప్రారంభమున నీశ్వరుడు వేదముల నుపదేశింపకున్న పక్షమున నెవరును విద్వాంసులు కాక యుండెడివారు. ఎవరికిని జ్ఞానముకూడ వృద్ధినొందెడిదికాదు అని యట చెప్పబడినది. ఇందులకు వశిక్షిత బాలకులను, వనమునుండెడి వ్యక్తులను దృష్టాంతముగ నుల్లేఖించి యున్నాము. దీనివలన పరమేశ్వరుని యుపదేశమువలన వేదవిద్య మానవులలో వ్యాపించి, వారిలో విద్యాజ్ఞానములు వృద్ధినొందుట సులభమైనదని తెలియవలయును. పరమేశ్వరుని గుణములన్నియు సత్యములే. కావున నతని విద్యయగు వేదముకూడ సత్యము - నిత్యమే - యగును. నిత్య పదార్థము యొక్క గుణకర్మములు, నామధేయమును నిత్యములే యగును. ఆధారము నిత్యమగుటయే యిందులకు కారణము. ఆధారములేక గుణకర్మములు, నామము స్థిరములు కావు. అవి యెల్లప్పుడును ద్రవ్యము నాశ్రయించి యుండునవి. అనిత్యవస్తువుల నామగుణకర్మము లనిత్యములే యగును.

ఉత్పత్తి వినాశములు లేనిది నిత్యమగును. వేఱువేఱుగనుండు ననేక ద్రవ్యముల సంయోగ విశేషమున నేర్పడుట యుత్పత్తి యనబడును. సంయుక్త ద్రవ్యముల వియోగము - కారణరూపమున పరమసూక్ష్మములై పరమాణురూపావస్థ - వినాశ మనబడును. సంయోగముచే నేర్పడి స్థూలములైన ద్రవ్యములు చక్షురాదీంద్రియములచే దెలియబడును. ఆ స్థూలద్రవ్యములలోని సంయోగము నశించి పరమాణువులు వేఱువేఱుగ నైనపుడు సూక్ష్మము లగుటవలన నా ద్రవ్యము లింద్రియ గోచరములు కావు. ఈ స్థితియే నాశమనబడును. అదర్శనమే - ఇంద్రియములచే దెలియబడకుండుటయే నాశము. సంయోగముచే నేర్పడి, వియోగముచే నశించునదియే కార్యము - అనిత్యము అనబడును. సంయోగ వియోగములకు వేఱుగ నుండుదాని కుత్పత్తి వినాశము లెన్నడు నుండవు. ఈశ్వరునియందు సంయోగవియోగము లుండవు. అతడెల్లపుడు నఖండుడు, నేకరసుడై యుండును. కావున నతడు నిత్యుడు. ఇందులకు కణాదసూత్రము ప్రమాణము.

(సదకారణవన్నిత్యమ్) కారణములవలన నుత్పన్నమైయుండు కార్యము అనిత్యము. అది యుత్పత్తికి పూర్వ మారూపమున నుండదు. మట్టితో ఘట మేర్పడి, నాశము నొందును - కారణమగు మట్టి రూపమును బొందును. ఇట్లే పరమేశ్వరుని సామర్థ్యము మూలమున తనకారణమైన ప్రకృతినుండి జగత్తేర్పడి - ఉత్పన్నమై - స్థూలరూపమును బొంది కొంతకాలముండును. మరల ప్రళయమున తన స్థూలరూపమును విడిచి సూక్ష్మకారణ రూపమున (నెల్లపుడు) నుండును. ఎల్లప్పుడునుండునదియు, కారణరహితమును, సదా కారణరూపమున నుండునదియు నగు వస్తువు నిత్యమనబడును. (ఈశ్వరు డట్టివాడే).

సంయోగముచే నేర్పడు వస్తువు కర్త నవశ్య మపేక్షించును. కర్మ కర్త నపేక్షించును. అట్లే నియమము నియంతను, కార్యము కారణమును నెల్లప్పుడపేక్షించును. ఎవడేని కర్తను గూడ మఱియొకడు చేసియుండవచ్చునని వతని నిట్లు ప్రశ్నింపవలయును. ఆకర్త నెవడు చేసెను? అని నింకొకడు చేసెనని చెప్పిన మరల నాకర్తను చేసినవాడెవడు? అని ప్రశ్నింపనగును. అందువలన నీ ప్రశ్నలు మర్యాద-హద్దు- వ్యవస్థ లేనివై అనవస్థాదోషయుక్తములగును. (కావున మూలకారణమగు కర్తకు కర్త యుండడు.) సంయోగముచే నేర్పడు వస్తువు ప్రకృతి, లేక, పరమాణువులు మున్నగు సూక్ష్మవస్తువులను సంయుక్తము చేయుటకు సమర్థము కాదు. సంయోగ జన్య వస్తువుకంటె పరమాణ్వాదులు సూక్ష్మములు, స్థూలవస్తువు సూక్ష్మవస్తువులను సంయుక్తము చేయజాలదని భావము. సూక్ష్మ వస్తువు స్థూలవస్తువునకు ఆత్మ యగును. సూక్ష్మము స్థూలమున వ్యాప్తమై యుండును. లోహపిండము (ఇనుపగుండు) న వగ్ని ప్రవేశించి దాని సర్వావయవము లందును వ్యాప్తమగును. జలము పృథివియందు జేరి దాని కణములను సంయుక్తమొనర్చి దానిని ముద్దగా జేయును. అట్లే పరమేశ్వరుడు సర్వసంయోగములకు, వియోగములకు వేఱై యన్నిటి యందు వ్యాపకుడై యున్నాడు. అతడు ప్రకృతికంటె-పరమాణువుల కంటె నత్యంత పరమాణువులను సంయుక్తము చేసి జగత్తుగ నిర్మించు చున్నాడు. ఈశ్వరుడు పరమాణ్వాది పదార్థములకంటె స్థూలుడగునెడల వానిని గ్రహించుటకును, కార్యరూపమున రచించుటకును నశక్తుడయ్యెడివాడు. స్థూల పదార్థములు సూక్ష్మపదార్థములను నియమింప సమర్థములు కావు. దేనివలన సంయోగ వియోగము లారంభించునో యది వానికంటె వేఱుగనుండును. అది సంయోగ వియోగముల కాదికారణము. అట్లే యనాదికారణము లేక, సంయోగ వియోగములు కూడ నసంభవములగును. కావున, సదా నిర్వికార స్వరూపుడు, అజుడు, అనాది, నిత్యుడు, సత్యసామర్థ్యయుక్తుడు, అనంత విద్యావంతుడునగు నీశ్వరునినుండి వేదములు ప్రకటమగుటవలనను, అతని జ్ఞానమున వేదము లెల్లపుడు నుండుటవలనను నవి సత్యార్థయుక్తములనియు, నిత్యములనియు నెల్లరు నంగీకరింపవలయును. ఇట్లు వేదములు నిత్యములని సంక్షేపముగ నిట నాలోచింప బడినది.

## వేద విషయ విచారము

వేదముల నిత్యత్వమును గూర్చి వివరించిన తరువాత, వేదము లందు చెప్పబడిన విషయములను, వాని భేదములను గూర్చి యీ ప్రకరణమున విచారింపబడును. వేదములందనేక విషయము లున్నవి. కాని ముఖ్యముగా వానిని నాల్గువిధములుగ విభజింపవచ్చును.

1. విజ్ఞానము (సర్వపదార్థజ్ఞానము) 2. కర్మము 3. ఉపాసన 4. జ్ఞానము. ఈ విభాగములను కాండలనియు వ్యవహరింతురు. 1. విజ్ఞానకాండ : కర్మోపాసనా జ్ఞానములను మూడింటిని సరిగా నుపయోగించుకొనుటయు, పరమేశ్వరుడు మొదలు తృణపర్యంతముగల పదార్థములను బాగుగ దెలిసికొని, వానివలన తగిన లాభమును పొందుటయు విజ్ఞానమనబడును.

(1) పరమేశ్వరుని సరిగా నెఱిగి యతని యాజ్ఞలను చక్కగ పాలించుచుండవలయును. (2) ఈశ్వరునిచే రచియింపబడిన పదార్థములను, వాని గుణ స్వభావములను బాగుగ విచారించి, వానిచే నగు కార్యములను సిద్ధము చేసికొనవలయును. ఈశ్వరుడే పదార్థముల నే ప్రయోజనసిద్ధికై నిర్మించెనో, వాని నందుల కుపయోగించుకొనవలయునని భావము. పై రెండు విషయములందును ఈశ్వర ప్రతిపాదనము ముఖ్యము.

పూ : కారణమేమి?

ఉ : వేదముల ముఖ్య తాత్పర్యము ఈశ్వర ప్రతిపాదనమే యైయున్నది. ఈ విషయమున నీ క్రింది ప్రమాణములను జూడుడు. (సర్వే వేదాః) ఏది పరమ పదమో, దేనిని మోక్షమందురో, దేని యందు పరబ్రహ్మను బొంది యెల్లపుడు సుఖమున నుందురో, సర్వానందయుక్తుడు, సర్వదుఃఖరహితుడు నగు నే పరమేశ్వరుని నామము 'ఓమ్' అనబడునో, అతనిని బోధించుటయే వేదములకు ముఖ్య తాత్పర్యము. ఇందులకీ యోగసూత్రము ప్రమాణము (తస్య) పరమేశ్వరుని నామము ఓ3మ్ ప్రణవము (ఓమ్) పరమేశ్వరుని వాచకము. అతడు వాచ్యుడు. (ఓ3మ్ ఖం) ఆకాశమువలె వ్యాపకుడగుటవలన 'ఓ3మ్', 'ఖమ్' అనునవి పరమేశ్వర నామములని యజుర్వేదము. ఇట్లే తైత్తిరీయారణ్యకమునందును 'ఓమ్' పరమేశ్వరుని నామమని చెప్పబడినది. కఠోపనిషత్తు ననుసరించి చూచినను, వేదములన్నియు నా బ్రహ్మప్రాప్తి నొనరించుటకే ప్రవృత్తములైనవని తెలియుచున్నది. జగద్వర్ణనాదులన్నియు నా పరమేశ్వరునే ప్రకటించును. తపస్సులనబడు సత్యధర్మానుష్ఠానములు కూడ పరమేశ్వరుని ప్రాప్తికే యగును. బ్రహ్మచర్యము గార్హస్థ్యము, వానప్రస్థము, సంన్యాసము నను నాలుగాశ్రమములలో నొనరించు సత్యాచరణరూపకర్మములుకూడ నీశ్వరుని ప్రాప్తికొఱకే చేయబడును. విద్వాంసు లెల్లరు బ్రహ్మప్రాప్తికై యత్నింతురు. బ్రహ్మమునుగూర్చి యితరులకు నుపదేశింతురు. ఓ నచికేత! తప్పక పొందదగు బ్రహ్మమును గూర్చియే నీకు నేను సంక్షేపముగ జెప్పుదును అని యముడు నచికేతునితో ననెను.

("తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో౽థర్వవేదః శిక్షాకల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి. అథ పరాయా తదక్షరమధిగమ్యతే") వేదములందు 'పరా', 'అపరా' యని పేర్లుగల రెండు విద్యలున్నవి. తృణము మొదలు ప్రకృతి పర్యంతము గల పదార్థముల గుణదోషముల నెఱిగి, వానితో సిద్ధమగు కార్యములను నిర్వహించుటను నేర్పునది- 'అపరవిద్య' యనబడును. సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని యథార్థజ్ఞానము గలిగించునది 'పరవిద్య' యనబడును. ఇయ్యది యపరవిద్యకంటె మిక్కిలి యుత్తమము. అపరవిద్యవలన నేర్పడు నుత్తమ ఫలమే పరావిద్య యగును.

ముండకోపనిషత్తునందు విట్లున్నది.

జ్ఞానేంద్రియములకా బ్రహ్మమందదు. ఎవరికి నది చిక్కవడదు. దానికి గోత్రము లేదు; బ్రాహ్మణత్వాది వర్ణము లేదు; చక్షుః శ్రోత్రాది ఇంద్రియములు దానికి లేవు; దానికి హస్తపాదములు లేవు; అది నిత్యము, వ్యాపకము; అది సర్వాంతర్యామి; సూక్ష్మము; నాశము లేనిది; దోషము లేనిది. సంపూర్ణజగత్తునకు కారణమగు నా బ్రహ్మమును ధ్యానముద్వారా సాక్షాత్కారము చేసికొనువారు దృఢవ్రతులగుదురు.

**తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః।**
**దివీవ చక్షు రాతతమ్॥** ఋగ్. ౧, ౨.౨౦.

మఱియు నీ విషయమున ఋగ్వేదప్రమాణము- (విష్ణోః..) వ్యాపకుడైన పరమేశ్వరుని, (పరమం) అత్యంతోత్తమము, నానంద స్వరూపమును, (పదం) పొందదగినదియునగు మోక్షమును, (సూరయః) విద్వాంసులు (సదా పశ్యంతి) సర్వకాలములందును చూతురు. ఈశ్వరుడన్నింటను వ్యాపించి యున్నాడు. అతనిలో దేశకాలవస్తుభేదము, (ఒకచోనున్నాడు - ఇంకొకయెడ లేడు, ఒక కాలమున నున్నాడు- ఇంకొక కాలమున లేడు, ఒక వస్తువునందున్నాడు, మఱియొక వస్తువు నందు లేడు అను భేదము) లేదు. కావున నతడెల్ల స్థలములనెల్లరికి ప్రాప్తుడై (పదవాచ్యుడై) యున్నాడు. అందులకు దృష్టాంతము (దివీవ చక్షు రాతతమ్) సూర్యకాంతి యావరణములేని యాకాశమునందు వ్యాప్తమై యుండును. ఆ కాంతియందు నేత్రదృష్టి వ్యాప్తమై యున్నది. దానికి మించిన యుత్తమ పదప్రాప్తి యింకొకటి లేదు. కావుననే నాలుగు వేదములు నా పదమును ప్రాప్తింపజేయుటకే విశేషముగ ప్రతిపాదించుచున్నవి.

ఈ విషయమున వ్యాసరచిత వేదాంత శాస్త్రప్రమాణము (తత్తు సమన్వయాత్) వేదవాక్యములందన్నింటియందును విశేషించి బ్రహ్మ ప్రతిపాదనమే యున్నది. కొన్ని యెడల సాక్షాత్తుగను, మఱికొన్ని తావులలో పరంపరగాను, బ్రహ్మమే వర్ణింపబడినది. కావున పరబ్రహ్మ పరమేశ్వరుడే వేదములకు ముఖ్య విషయము.

ఇందులకు (**"యస్మాన్న జాతః పరో అన్యో అస్తి య ఆవివేశ భువనాని విశ్వా।ప్రజాపతిః ప్రజయా సంరరాణస్త్రీణి జ్యోతీంషి సచతే సషోడశీ"**) అను యజుర్వేదమంత్రము కూడ ప్రమాణ మగుచున్నది.

(యస్మాన్నజాతః) ఆ పరబ్రహ్మముకంటె, (అన్యః) ఇంకొకడు, (పరః) ఉత్తముడు, (జాతః నాస్తి) ప్రకటమైనవాడు లేడు, (యః ఆవివేశ భువనాని విశ్వా) అతడు సర్వలోకములందును వ్యాప్తుడై ప్రవిష్టుడై యున్నాడు, (ప్రజాపతిః) అతడే జగత్పాలకుడు, అధ్యక్షుడును, (సంరరాణః) సర్వప్రాణులకును సుఖము నిచ్చువాడు అతడు, (త్రీణి జ్యోతీంషి) అగ్ని, సూర్యుడు, విద్యుత్తు నను మూడు జ్యోతిస్సులు, (ప్రజయా) మిగిలిన జగద్వస్తువులతో పాటు, (సచతే) సృష్టించి జగత్తున చేర్చి యున్నాడు. (స షోడశీ) కావున నతనికి షోడశి యని పేరు.

౧. ఈక్షణము: యథార్థవిచారణ
౨. ప్రాణము: విశ్వమును ధరించునది
౩. శ్రద్ధ: సత్యమున విశ్వాసము.
౪. ఆకాశము
౫. వాయువు
౬. అగ్ని
౭. జలము
౮. పృథివి
౯. ఇంద్రియములు
౧౦. మనస్సు- జ్ఞానము
౧౧. అన్నము
౧౨. వీర్యము- బలము- పరాక్రమము
౧౩. తపస్సు- ధర్మానుష్ఠానము- సత్యాచరణము.
౧౪. మంత్రము- వేదవిద్య.
౧౫. కర్మములు- సర్వచేష్టలు.
౧౬. నామములు- దృశ్యాదృశ్య వస్తువుల సంజ్ఞలు.

పదునాఱు (షోడశ) కళ లివియే. ఇవి యన్నియు నీశ్వరునినందే యుండును. అందువలన నీతడు 'షోడశి' అనబడును. ప్రశ్నోపనిషత్తునందు నాఱవ ప్రశ్నలో నీ పదునాఱు కళలు ప్రతిపాదింపబడియున్నవి. అందువలన వేదములకు ముఖ్యవిషయము పరమేశ్వరుడే. అతడు కాక మిగిలిన జగత్తంతయు వేదములకు గౌణవిషయమును- అప్రధాన విషయమును. మాండూక్యోపనిషత్తునందును (ఓమిత్యేదక్షర...) ఓమ్ పదవాచ్యుడు అక్షరుడు - నాశము లేనివాడు. అతడు చరాచర జగత్తునందంతట వ్యాపించి యున్నాడు. అతడే 'బ్రహ్మ' అని వర్ణింపబడినది.

వేదాది సత్యశాస్త్రముల కిదియే ముఖ్యవిషయము. ప్రధానా ప్రధానములలో ప్రధానమునే గ్రహింపవలయును అని వ్యాకరణ మహా భాష్య సిద్ధాంతము. కావున వేదముల ముఖ్యతాత్పర్యము-పరమేశ్వరుని ప్రతిపాదించి, యతనిప్రాప్తి గలిగించుటయే అని నిశ్చితము. ఆ పరమేశ్వరుని యుపదేశరూపములగు వేదములందు బోధింపబడిన, జ్ఞాన కర్మోపాసనలను మూడు కాండల యనుష్ఠానమువలన నిహపరలోక వ్యవహార ఫలసిద్ధి కలుగుననియు, పరుల కుపకార మొనర్చుటకు పురుషార్థ మొనర్పవలయుననియు, మనుష్యదేహధారణ చేసినందులకిదియే ఫలమనియు నెఱుగవలెను.

## ౨. కర్మకాండ

వేదప్రతిపాద్యవిషయములలో రెండవది కర్మకాండ. ఇందు క్రియలు ప్రధానముగ నుండును. క్రియ నాచరింపక జ్ఞానము, విద్యాభ్యాసము రెండును సిద్ధింపవు.

పూ: కారణమేమి?

ఉ: బాహ్యవ్యవహారములకు, మానసవ్యవహారములకు బాహ్యాభ్యంతరములతో సంబంధ ముండును. అది యనేక విధములైనను ముఖ్యముగ రెండు విధములు.

(౧) ఒకటి పరమార్థమార్గము. దీనివలన పరమార్థము సంపాదింపనగును. ఇందు పరమేశ్వరుని (స్తుతి) - అతని సర్వశక్తిమత్త్వాది గుణములను కీర్తించుట, ఉపదేశించుట, శ్రవణముచేయుట, (ప్రార్థన)-ఈశ్వరుని సహాయము నర్థించుట, (ఉపాసన) ఈశ్వరుని స్వరూపము నెఱింగి యందు మగ్నమగుట, (ఉపాసన వేదములందు, పాతంజల యోగ శాస్త్రమునందు చెప్పినరీతిని జేయవలయును.) (ఆజ్ఞాపాలన) సత్యభాషణాదులైన యీశ్వరోపదిష్టములగు వాజ్ఞలను పాలించుట, (ధర్మానుష్ఠాన - జ్ఞాన) ధర్మస్వరూపము నెఱింగి, న్యాయాచరణ మొనర్చుట మున్నగునని యున్నవి. పక్షపాతమును విడిచి యన్నివిధముల సత్యమును గ్రహించి, యసత్యమును త్యజించుటయే న్యాయాచరణ మనబడును. పైన వర్ణింపబడిన విషయము లన్నియు పరమార్థ మార్గమునకు చెందియున్నవి. కర్మకాండలో నిదియే ప్రధానభాగము. మనుజుడు దీనిమూలమున మోక్షప్రాప్తికి ప్రవృత్తుడగును.

(౨) రెండవ మార్గము లోకవ్యవహారసిద్ధి కుపయోగించును. దానివలన ధర్మయుక్తములగు నర్థకామములను సాధించుట కనువగు సాధనములు లభించును. (౧) మోక్షము - పరమేశ్వరప్రాప్తికొఱకు ధర్మయుక్తములగు సర్వకార్యములను బాగుగ నిర్వర్తించునెడల నది 'నిష్కామమార్గ' మనబడును. ఇందుసాంసారిక భోగముల ననుభవింపవలయుననెడి కోరికలుండవు. దీనిఫలము శ్రేష్ఠమనబడును. అది యక్షయ సుఖరూపఫలము. (౨) సాంసారిక సుఖముల ననుభవింపవలయునను కోరికతో ధర్మయుక్తకర్మము లాచరించుమార్గము -'సకామమార్గము' నబడును. ఇందువలన గలుగు ఫలములను నింద్రియముల మూలమున ననుభవించును మనుష్యుడు జన్మమరణ ములనుండి విడివడ జాలడు. అగ్నిహోత్రము మొదలు - అశ్వమేధమువఱకు గల కర్మములలో నాలుగు విధములయిన ద్రవ్యములతో హోమమొనర్పవలయును.

(౧) సుగంధయుక్తములయిన వస్తువులు- కస్తూరి, కుంకుమపువ్వు మొదలగునవి.

(౨) తియ్యని వస్తువులు- బెల్లము, తేనె మున్నగునవి.

(3) పుష్టిని గలిగించు వస్తువులు- నేయి, పాలు, అన్నము మున్నగునవి.

(౪) రోగనాశకములు- సోమలతాది ఓషధులు.

ఈ నలువిధములయిన వస్తువులను సంపాదించి, వానిలో దోషములు లేకుండ జూచి, వానిని తగిన పరిమాణములో కలిపి యగ్నిలో యుక్తిపూర్వకముగ హోమ మొనర్పవలయును. అందువలన వాయువు, వర్ష జలము శుద్ధము లగును. కాగా ఎల్లరికి సుఖము కలుగును. భోజనాచ్ఛాదనములు, విమానాది వాహనములు, కలాకుశలత, యంత్రములు, వీని ప్రాప్తికొఱకు, సామాజిక నియమపాలనకొఱకు జేయు కర్మములవలన కర్తకే యధికాంశమున సుఖము కలుగును.

ద్రవ్యసంస్కారకర్మసు పరార్థత్వాత్ఫలశ్రుతి రర్థవాదః స్యాత్

అ. ౪. పా. 3. సూ. ౧.

ద్రవ్యాణాంతు క్రియార్థానాం సంస్కారః క్రతుధర్మః స్యాత్

అ. ౪. పా. 3. సూ. ౮.

యజ్ఞోఽపి తస్యై జనతాయై కల్పతే, యత్రైవం విద్వాన్ హోతా భవతి

ఐ. బ్రా. మం. ౧. అ. ౨.

ఈ విషయమును పూర్వమీమాంస - ధర్మశాస్త్ర మిట్లు చెప్పుచున్నది.

(ద్రవ్య) ద్రవ్యము, సంస్కారము, ఉపయోగము నను నీ మూడును యజ్ఞకర్త

కవశ్యకరణీయములు. పూర్వము చెప్పబడిన సుగంధాది యుక్తములగు చతుర్విధ ద్రవ్యముల బాగుగ సంస్కరించి, అగ్నిలో హోమము చేయుటవలన జగత్తున కత్యంత ముపకారము జరుగును. గరిటెలో నేయివేసి, యందు సుగంధద్రవ్యములను-జీలకఱ్ఱ, మెంతులు మున్నగునవి వేసి, వానిని బాగుగ నగ్నిపై తప్తమొనర్చి, పప్పులోను కూరలలోను తిరుగమోత పెట్టినప్పుడు, పప్పు, కూరలు సుగంధితము లగును. వేడి యణువులు, సుగంధపదార్థములలోని యంశము లా పప్పు మున్నగు పదార్థములలో గలిసి, వానిని రుచికరములుగను, పుష్టికారకములుగను, సుగంధయుక్తములుగను జేయును. అట్లే యజ్ఞము వలన గూడ హోమము చేయబడు ద్రవ్యములు వాయువునందు జేరి వాయువును, వర్షపుజలమును నిర్దోషములుగ జేయును. సుగంధితములుగ నొనర్చును. జగత్తున కంతటికిని సుఖము నొడగూర్చును.

ఇందులకైతరేయబ్రాహ్మణము ప్రమాణము.

(యజ్ఞోపి.....) జనత - మానవ సముదాయమునకు సుఖము కలిగించు నిమిత్తము యజ్ఞము జరుగును. సంస్కరింపబడిన ద్రవ్యములను నగ్నియందు హోమమొనర్చు విద్వాంసుడైన మానవుడు స్వయముగ నానందించును.

పూ : ఎందువలన?

ఉ : యజ్ఞము పరోపకారము కొఱకే చేయబడును. మానవుడు జగత్తున కెంతగా నుపకారము చేయునో, వానికంతగా నీశ్వరుని వ్యవస్థ వలన సుఖము ప్రాప్తించును. కావున యజ్ఞమునందలి ఫలశ్రవణ మర్థవాదమగును. ఇట్లు యజ్ఞమును స్థాపించుటవలన మనుష్యుడు దానిని జేతబూనుకొనును. యజ్ఞ మనర్థదోషములను వారించి, జగదానందమును వృద్ధినొందించును.

(ద్రవ్యాణాం తు...) హోమద్రవ్యములను బాగుగా సంస్కరింపవలయును - శుద్ధిచేయవలయును. హోమము చేయుదలచు వ్యక్తి హోమవిద్యను బాగుగా నేర్వవలయును. ఇట్టి యజ్ఞములను చేయుటవలన నెల్లరకు నుత్తమఫలము లభించును. యజ్ఞకర్తకు మిక్కిలిగ లాభము చేకూరును.

**అగ్నేర్వై ధూమో జాయతే, ధూమాదభ్రమ్, అభ్రాద్ వృష్టిః, అగ్నేర్ వా ఏతా జాయన్తే, తస్మా దాహ తపోజా ఇతి.** శ.కా., ౫. అ.౩.

ఈ విషయమున శతపథబ్రాహ్మణ ప్రమాణము-(అగ్నే...) అగ్నియందు వేల్చబడు హోమద్రవ్యములనుండి ధూమము, బాష్పముత్పన్నము లగును. అగ్ని- వృక్షములు, ఓషధులు, వనస్పతులు, జలము మున్నగు పదార్థములందు ప్రవేశించి, వానిని వేఱుచేసి, వానియందలి రసమును వానినుండి వేఱుచేయును. అదియే దాని స్వభావము: ఆ రసము తేలికయై వాయువు ద్వారమున నాకాశమున జేరును. అందలి జలాంశము 'బాష్ప' మనబడును. శుష్కాంశము 'పార్థివము'. ఈ రెండింటి మేళనమే ధూమము. ఈ పరమాణువులు వాయ్వాధారమున ఆకాశమునందొండొంటితో గలిసి మేఘము లగును. వానివలన నన్నము, దానివలన వీర్యము- ధాతువు, అద్దానినుండి శరీరము, తన్మూలమున కర్మములు నేర్పడుచున్నవి.

**తస్మాద్ వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్ వాయుః వాయో రగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధిభ్యోఽన్నమ్, అన్నాద్ రేతః, రేతసః పురుషః, స వా ఏష పురుషోఽన్నరసమయః.** వ. ప్ర. అ.

(**తస్మాద్ వా.......**) పరమాత్ముని యనంతసామర్థ్యమువలన నాకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి- మున్నగు తత్త్వము లేర్పడినవి. ఆ భూమియందోషధులు, పైరులు, వానినుండి అన్నము- ధాన్యాదులు - వానివలన వీర్యము - ధాతువు - దానినుండి శరీరము గలిగినది. కావున నీ పురుషుడన్నరసమయుడనిపించుకొనుచున్నాడు. పూర్వోక్తక్రమము ననుసరించి శరీరాదుల యుత్పత్తి, స్థితి, లయములు వానియందే జరుగుచుండును.

ఈ యుపనిషత్తులోనే ముందింకను నిట్లు చెప్పబడినది. (స **తపోఽతప్యత్**.....) భృగువు బ్రహ్మవేత్తగుటకు తపస్సు జేసెను. చేసి, అన్నమే బ్రహ్మమని యెంచెను. అన్నమువలననే సర్వప్రాణులశరీరము లేర్పడుచున్నవి. అన్నముతోనే యవి జీవించుచున్నవి. అట్లే మృత్యు సమయమున ప్రాణుల శరీరములు పృథివ్యాదులందు లీనమగును.

కావున నెల్లజీవుల జీవనమునకు ముఖ్యసాధనమగుటవలన అన్నమే బ్రహ్మమందురు. హోమమువలన వాయువు, జలము, ఓషధులు శుద్ధము లగును. అందువలన సర్వజగత్తునకు సుఖ మొదవును. వాయ్వాదుల యశుద్ధివలన దుఃఖము కలుగును. కావున వాయ్వాదుల శుద్ధి యవశ్యము సేయవలయును.

రెండు విధములగు ప్రయత్నములవలన నివి సిద్ధించుచున్నవి. ఒక ప్రయత్న మీశ్వరకృతము. రెండవది జీవకృతము. ఈశ్వరకృత ప్రయత్నమువలన అగ్ని రూప సూర్యుడు, సుగంధయుక్త

పుష్పాదులు జనించినవి. సూర్యుడు- నిరంతరము జగమునందలి సర్వరసములను పూర్వము చెప్పినట్లు పైకి నాకర్షించును. పుష్పాదులందలి సుగంధము కూడ దుర్గంధమును నివారించుచుండును. కాని, లోకమున పరమాణువులు సుగంధదుర్గంధ యుక్తములగుటవలన జలవాయువులు మధ్యమ (సుగంధదుర్గంధమిశ్రిత) గుణములు గలవి యగును. అట్టి వర్షపు జలమువలన నేర్పడు వోషధులు, అన్నము, వీర్యము, శరీరాదులు మధ్యమగుణములు గలవియే యగును. వాని సంబంధమువలన బుద్ధి, బలము, పరాక్రమము, ధైర్యశౌర్యాది గుణములు నన్నియు మధ్యమములే యగును. కారణ మేమన:- కారణమును బట్టియే కార్య మేర్పడును. దుర్గంధమువలన వాయువు, వాన నీరు దోషయుక్తము లగుట నెల్లయెడల గననగును. ఈ దోషము ఈశ్వర సృష్టిది కాదు. కారణమేమి? యందురేని, మనుష్యులవలననే దుర్గంధాది వికారము లేర్పడును. అందువలన నీ దోషమును మనుష్యులే నివారించుకొనవలసి యున్నది.

ఈశ్వరుడు (వేదము ద్వారమునన) సత్యభాషణాది ధర్మమును నాచరించుటకును, మిథ్యాభాషణాద్యధర్మ వ్యవహారములను జేయకుండుటకును నాదేశించి యున్నాడు. అందులకు విపరీతముగ నడచు వాడు మిక్కిలి పాపియగును. ఈశ్వరుని న్యాయ వ్యవస్థవలన నతనికి క్లేశము గలుగును. మఱియు నీశ్వరుడు యజ్ఞము చేయుటకును మానవుల నాజ్ఞాపించి యున్నాడు. అది చేయనివాడును పాపియై దుఃఖముల ననుభవించును. కారణమేమన: ఎల్లరకు నుపకారముజేయు యజ్ఞ కర్మము నొనర్పనందున మానవులు దోషు లగుదురు. మనుష్యాది ప్రాణి సముదాయమెక్కడనెంత యెక్కువ యగునో, అక్కడ నంతగా దుర్గంధముకూడ నెక్కువగును. ఇయ్యది యీశ్వరసృష్టివలన గలిగిన దోషముకాదు. ఇందులకు హేతువేమన:

దుర్గంధాది దోషము మనుష్యాది ప్రాణుల నిమిత్తముననే కలుగును. మానవులు తమ సుఖమును గోరి హస్తి, అశ్వము మున్నగు ప్రాణివర్గము నొకచో జేర్తురు. కావున నా పశువులవలన నధికముగ నేర్పడు దుర్గంధము మానవులు తమ సుఖము కోరి తెచ్చుకొనినదే. ఇట్లు వాయువును, వృష్టిజలమును దూషితముచేయు దుర్గంధము మానవ నిమిత్తముగ నేర్పడినది; కావున దానిని వారించుటకు తగిన యత్నమును వారే చేయవలసి యుందురు. జగమున నున్న దేహధారి ప్రాణులలో మనుష్యుడుత్తముడు; అతడే యుపకారానుపకారముల నెఱుంగ గలడు. మనన మన నాలోచనము. మననము చేయగలవాడు కావుననే, మనుష్యు డని పిలువబడుచున్నాడు. ఈశ్వరుడు పరమాణ్వాదుల సంయోగవిశేషములతో విజ్ఞానోత్పత్తి కనుకూలముగ మానవదేహము నిర్మించియున్నాడు. అందువలననే మానవుడు తన జ్ఞానమును బెంచు కొనగల్గుచున్నాడు. కావుననే యతడు ధర్మము ననుష్ఠించుటకును, అధర్మమును చేయ కుండుటకును యోగ్యుడగుచున్నాడు. ఇతర ప్రాణులట్లు కాదు. కావున నితరప్రాణుల కుపకారము చేయుటకు యజ్ఞము చేయవలసినవాడు మానవుడే.

పూ: సుగంధయుక్తములై అతిమూల్యములై యుండు కస్తూరి మున్నగు వస్తువు లితరవస్తువులలో గలిపి వాని నగ్నియందు హోమము చేసిన నవి నశించును. కావున యజ్ఞమువలన నెట్టి యుపకారమును గలుగదు. అంతకంటె నా కస్తూరి ఘృతము మొదలగు మేలైన వస్తువులను మనుష్యుల భోజనమున కుపయోగించిన మిక్కిలి యుపకారము జరుగును. కావున యజ్ఞమేల చేయవలయును?

ఉ: పదార్థ మేదియు బొత్తిగా నశింపదు. కేవలము వియోగము కలుగును. స్థూలములై యింద్రియములచే తెలియబడి పిదప నవి యింద్రియములకు తెలియనంతగా సూక్ష్మములగుటయే వినాశమనబడును. బాగు; అది యటుండ నొకసంగతి చెప్పుము. నీవు దర్శనము (జ్ఞానము) నెన్నివిధములుగ నంగీకరించుచున్నావు?

పూ: ఎనిమిది విధములుగ.

ఉ: ఆ విధము లెయ్యవి?

పూ: ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావములనెడి యెనిమిదివిధములైన దర్శనము- జ్ఞానము- నంగీకరింతును.

గౌతమాచార్యులు తన న్యాయశాస్త్రమున నిట్లు వివరించియున్నారు.

**(౧) (ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞానమవ్యపదేశ్యమవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్. న్యాయ. ౧.౧.౪.)** చక్షురాదీంద్రియములకు రూపాదివిషయములతో సంబంధము గల్గుటవలన యేర్పడు సత్యజ్ఞానము ప్రత్యక్షము.

ఉదా: కొండొక వస్తువును దూరమునుండి చూచినపుడు అది మనుష్యుడా? లేక మఱి యేమైన నా అని సందేహము గలుగును; కాని సమీపమునుండి చూచినపుడా సంశయము పోయి ఇతడు మనుష్యుడే అని నిశ్చిత సత్యజ్ఞానము కలుగును.

**(౨) (అథ తత్పూర్వకం త్రివిధమనుమానం పూర్వవచ్ఛేషవత్ సామాన్యతో దృష్టం చ. న్యా. ౧.౧.౫)** కొండొకవస్తువునకు చెందిన లక్షణమును జూచినపుడు యథార్థముగ

నావస్తువే తెలియబడినచో నది యనుమానమందురు. ఇయ్యది మువ్విధముల నుండును. పూర్వవత్తు, శేషవత్తు, సామాన్యతో దృష్టము అని.

ఉదా: కొండొకని పుత్రుని మా చినపుడతనికి తల్లిదండ్రులున్నారు అని జ్ఞానము కలుగును. ఇట్లే మిగిలినవి యూహింపనగును.

(౩) ప్రసిద్ధ సాధర్మ్యాత్ సాధ్యసాధనముపమానమ్॥ న్యా. ౧.౧.౬) ఒక వస్తువునందలి సామాన్య- తుల్య- ధర్మమును జూచి తద్సామ్యలమువట్టి ధర్మముగల మఱియొక వస్తువును తెలిసికొనుట యుపమాన మనబడును.

ఉదా: దేవదత్తు డున్నట్లే యజ్ఞదత్తు డుండును. అని యొకడు మఱియొకనికి చెప్పెనని యెంచుడు; అది విన్నవ్యక్తి దేవదత్తునిలో గల గుణములవంటి గుణము యజ్ఞదత్తునిలో జూచి, అతడే యజ్ఞదత్తుడని గుర్తించును- ఇది యుపమానము.

(౪) (ఆప్తోపదేశః శబ్దః) ప్రత్యక్షాప్రత్యక్ష వస్తువుల నిశ్చయజ్ఞానము గలిగించునది శబ్దప్రమాణము.

ఉదా: జ్ఞానమువలన మోక్షము గలుగును. అను విట్టి యాప్తోప దేశములు శబ్దప్రమాణమునకు ఉదాహరణములు.

**న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్.**

న్యాయ. అ. ౨, ఆ.౨, సూ.౧.

**శబ్ద ఐతిహ్యనర్థాంతరభావాత్ అనుమానేఽర్థాపత్తి**
**సంభవాభావానర్థాంతరభావా చ్చాప్రతిషేధః** న్యా. ౨-౨-౨.

ప్రత్యక్షాదులయిన యెనిమిది విధములై ప్రమాణములను సూచించు పై రెండు సూత్రముల యర్థముకూడ నిట సంక్షేపముగ వ్రాయుచున్నాము.

(౫) (ఐతిహ్యమ్) సత్యవాదులగు విద్వాంసులు వ్రాసినట్టియు, చెప్పినట్టియు ఉపదేశములు ఇతిహాస మనబడును. ఇది యైదవ ప్రమాణము.

ఉదా: దేవాసురులు యుద్ధముజేయ తత్పరులైరి. వృత్తములు దెలుపు నిట్టి వాక్యములు, ఐతరేయము, శతపథబ్రాహ్మణము మున్నగు సత్యగ్రంథములలోని యితిహాసమే గ్రాహ్యము. ఇతరము గ్రహింపరాదు.

(౬) (అర్థాపత్తిః) ఒకడొకమాట చెప్పినప్పుడు ఆ మాటవలన మఱియొక విషయ మనాయాసముగ తెలియబడునది 'యర్థాపత్తి' యనబడును.

ఉదా: మేఘములున్న వాన వచ్చును. అని యెవడేని పలికిన, మేఘములు లేక వాన యెన్నడు రాదు అని తెలియును. ఇట్టి ప్రమాణమువలన గలుగు జ్ఞానము అర్థాపత్తి యనబడును.

(౭) (సంభవః) మాతాపితలవలన సంతానము కలుగును. అని యొకడనిన, మఱియొక డదివిని నీవు చెప్పినది సంభవమే - కావచ్చును. అని యంగీకరించును. కాని యెవడేని, రావణుని తమ్ముడైన కుంభకర్ణుని మీసములు ఆకాశమున నాలుగు క్రోసుల పర్యంతము నిక్కబొడుచుకొని యుండుననియు, అతని ముక్కుపదునాఱు క్రోసుల పొడవు గలదనియు చెప్పిన నతనిమాట యసత్యమని యెంచబడును, అతనిమాట సంభవ మెన్నడును కాదు.

(౮) (అభావః) ఒకడు మఱియొకనితో ఘటమును తెమ్ము అనిన అతడక్కడ ఘటము లేకుండుటం జూచి యది యున్న స్థలము నుండి తెచ్చును.

ఈ యెనిమిది విధములగు ప్రమాణములను నే నంగీకరింతును.

అవును ఇది సత్యమే. ప్రమాణముల నంగీకరింపనిచో సంపూర్ణలోకవ్యవహారము, పరమార్థము రెండును సిద్ధింపవు. అదర్శనము నాశమనబడును. ఒక మట్టిగడ్డను పిండియగునట్లు మర్దించి యా మట్టిముక్క కణములు వేగముగ వీచు వాయువునందు చెదజల్లిన నవి కనబడకుండపోవును. మట్టిగడ్డ యప్పు డదర్శన మగును. అప్పుడు గడ్డనశించినది యని చెప్పుదుము. 'ణశ్ అదర్శనే' అను ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయము జేర్చిన నాశ శబ్ద మేర్పడును. కావున నాశ శబ్దము బాహ్యేంద్రియములకు గనబడకుండుట యను నర్థమున వాడుదుము. వస్తువునందు కలిసియున్న పరమాణువులు దేనికది వేఱైనపుడవి కనబడవు; ఇంద్రియగోచరములు- ఇంద్రియములకు విషయములు; ఇంద్రియములచే గ్రహింపదగినవి కావు. అతీంద్రియములనియు వానిని జెప్పుదురు. ఆ పరమాణువు లొండొంటితో కలిసి స్థూలభావమును బొందినపుడవి ద్రవ్యములుగ కనిపించును. స్థూలపదార్థములే యింద్రియములకు విషయములకు విషయము లగును. ఒక వస్తువును ముక్కలు ముక్కలుగ జేయుచు బోయిన చివరకు ముక్కలు చేయలేని స్థితి కావస్తువు వచ్చును. చివరకు మిగులు నాభాగమే పరమాణువు అనబడును. ఈ పరమాణువులు వేఱువేఱుగ నున్నంతవఱకు నింద్రియములచే గ్రహింపబడవు. కాని, అవి యాకాశమున నుండును.

అట్లే సుగంధాదులతో గూడిన వస్తువులగ్నిలో వేయబడును. అంతట నావస్తువునందలి యణువులన్నియు వేఱై యాకాశమున నుండును. ఏ వస్తువుకూడ దాని యస్తిత్వమును బోగొట్టుకొనదు. అందువలన నాకాశమున వ్యాపించిన వస్తువు దుర్గంధాదిదోషములనవశ్యము నివారించును. ఇట్లు వాయువు, వృష్టిజలము శుద్ధమగుట వలన జగత్తునకెంతో యుపకారము గలుగును. సుఖము లభించును. ఈ కారణమున యజ్ఞము చేయవలసినదే యగుచున్నది.

పూ: యజ్ఞమువలన వాయువు, వృష్టిజలము శుద్ధమగుటయే ప్రయోజనమగునెడల, దీనికింత యాడంబరమేల? గృహములలో నత్తరు, పుష్పములు మొదలగు సుగంధద్రవ్యముంచిన చాలునుగదా?

ఉ: యజ్ఞమువలన లభించుఫలము అన్యప్రకారములచే లభింపదు. అత్తరు పుష్పము మున్నగు పదార్థములనుండి వెలువడు సుగంధాదులు దుర్గంధమిళిత వాయువున జేరి యట్లే యుండును; కాని, వాయువునుండి దుర్గంధమును వేఱుచేసి, దానిని బయటికి పంపజాలవు. ఇంటియందలి వాయువును పైకిబోవునట్లు చేసి వెలుపలి వాయువును శుద్ధమైన దానిని లోనికి వచ్చునట్లు చేయజాలవు. అగ్నిహోత్రము వలన నింటియందలి వాయువు వేడికితేలికయై బయటికి పోవును. వాయుకణములను విచ్ఛిన్నమొనర్చి యందలి దోషములను వేఱు చేయుగల శక్తి హోమమునందు గలదు. కాని యత్తరులో నట్టి గుణము లేదు. కావున నింటిలో నారోగ్యము కలుగజాలదు.

ఇంటిలో నగ్నియందు సుగంధితవస్తువులను హోమ మొనర్చి నపుడింటియందలి వాయువును తేలిక యగునట్లు చేసి యా యగ్ని బయటికి పంపును. అందువలన నింటియందా వాయుస్థానము ఖాళీ యగును. దానిని పూరించుటకు వెలుపలి శుద్ధవాయువు జేరును. ఈ ఫల మగ్నిహోత్రాది యజ్ఞమువలననే కలుగును కాని, అన్యవిధముల గలుగదు. హోమద్రవ్యపు కణములతో గూడిన వాయువు దుర్గంధయుక్తవాయువును బయటికి వెడలనంపుటయేకాక, యటచేరిన వాయువును శుద్ధముచేయును; రోగనాశకమై ప్రాణులకు సుఖము నిచ్చునది యగును.

సుగంధాది ద్రవ్యపరమాణువులతో గూడిన హోమకరణమున వాయువాకాశమున బైకిచేరి, వృష్టిజలమును శుద్ధము చేయును. దానివలన నెక్కుడుగ వర్షించుటయు సంభవించును. శుద్ధజలవాయువుల మూలమున అన్నాద్యోషధులు శుద్ధములగును. ప్రతిదిన మొనర్చు యజ్ఞాదులవలన వాయువునందు సుగంధాది గుణములధికమై జగమున సుఖవృద్ధి గలుగును. ఇట్టి ఫల మితర విధముల గలుగదు.

స్థలాంతరమున నొకడు సుగంధిత వస్తువులను నగ్నిలో హోమముచేసినపుడు, హోమస్థలమునకు దూరమున నున్న పురుషుడా సుగంధయుక్తవాయువు నాఘ్రాణించును. దీనినిబట్టి హోమద్రవ్య మగ్నిలోబడి తన యస్తిత్వమును గోలుపోలేదని తెలియుచున్నది. ఒకప్పుడధికదూరముననున్న వ్యక్తి, యా సుగంధమును గ్రహింపజాలక పోవచ్చును. అందువలన నతనికి భ్రమ కలుగును. అతడు ద్రవ్యము నశించిన దనవచ్చును. వాస్తవమున నా సుగంధవస్తువు ఆకాశమున వాయువులో చేరియున్నదనియే బుద్ధిమంతులు గ్రహింపవలసియుందురు. ఇట్లే హోమమువలన గలుగు ప్రయోజనము లింకను నెన్నియో యున్నవి. అవి యాలోచించి తెలిసికొనుట బుద్ధిమంతుల పని.

పూ: హోమము చేయుటవలననే ఫలము కలుగుగాక! హోమముచేయునపుడు మంత్రములు చదువుటేల?

ఉ; మంత్రపఠనమునకు ప్రయోజనము వేఱుగానే కలదు.

పూ: అది యేమి?

ఉ: హోమ మొనర్చువేళ కంటితో జూతురు, త్వక్కుతో స్పృశింతురు, చేయితో వేయుదురు. అట్లే వాక్కుతో మంత్రములను జదువుదురు. అందువలన నీశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు జరుగును. హోమమువలన గలుగు ఫలముకూడ స్మరింపబడును. అనేక పర్యాయములు పఠించుటవలన మంత్రములు కంఠస్థము లగును. తన్మూలమున వేదములు రక్షింపబడును. ఇంతేకాక యీశ్వరుడు గలడని తెలియును. కావున జనులు నాస్తికులు కారు. మఱియు, కార్యము లన్నియు నీశ్వరుని ప్రార్థనతోనే ప్రారంభింపబడవలయును. వేదమంత్రముల నుచ్చరించుటచే యజ్ఞమునం దీశ్వరుని ప్రార్థన మంతట జరుగును. కావున యజ్ఞాద్యుత్తమ కర్మములన్నియు వేదమంత్రముల పూర్వకముగ చేయవలయును- అని యుపదేశము సిద్ధించును. ప్రారంభింప వలసిన ప్రయోజనము గూడ సిద్ధించును.

త్వమేకో హ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః
అచింత్యస్యాప్రమేయస్య కార్యతత్త్వార్థవిత్ ప్రభో! ౧ మ..౧-౩

చాతుర్వర్ణ్యం త్రయోలోకాః చత్వారశ్చాశ్రమాః పృథక్
భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ ప్రసిధ్యతి. ౨ మ. ౧౨-౯౭.

**బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్**

**తస్మాదేతత్పరం మన్యే యజ్జంతో రస్య సాధనమ్. 3 మ. ౧౨-౯౯.**

పూ: యజ్ఞమున వేదమంత్రములకు బదులింకేమైన పఠించిన గలుగు దోషమేమి?

ఉ: ఇతరమును జదివిన పై ప్రయోజనము సిద్ధింపదు.

పూ: ఎందువలన?

ఉ: ఈశ్వరవాణిచే సిద్ధించు సత్యప్రయోజన మన్యవచనము వలన నెన్నడు సిద్ధింపదు. ఈశ్వరవచనము సర్వవిధముల భ్రాంతిలేక సత్యమైనట్లు ఇతరులవచన మెన్నడును గాదు. వేదోపదిష్టమార్గమున తమ్ము దా పవిత్ర మొనర్చుకొని, ఆప్తపురుషుల గ్రంథముల బోధనం వలనను, శిక్షణ వలనను వేదములు సరిగా తెలిసికొని చెప్పు పురుషుని వాక్యములు కూడ సత్యము లగును. కేవలముతన బుద్ధికి తోచినది చెప్పువాని వచనములు సరికావు. దీనింబట్టి, యెందెందు సత్యము చూడనగునో, విననగునో, అది వేదములవలననే ప్రచురిత మైనట్లు తెలియనగుచున్నది. మిథ్యా ప్రచారము వేదమువలనగాక, జీవుల మూలమున జరిగిన దనియు సిద్ధమగుచున్నది. ఈశ్వరీయగ్రంథము వలన సిద్ధించు సత్యప్రయోజన మన్యమువలన కాజాలదు. ఇందులకు మనుప్రమాణము-

(౧) త్వమేకో.....) వేదములు స్వయంభువులు - సనాతనములు, వానిలో నసత్య మొకింతయు లేదు. సమస్త సత్యవిద్యలు వందు విధింప బడియున్నవి. వాని యర్థములను కేవలము నీ వెఱుగుదువు అని ఋషులు మనువుతో ననిరి.

(౨) (చాతుర్వర్ణ్యం.....) నాలుగు వర్ణములు, నాల్గాశ్రమములు, భూతము, భవిష్యత్తు, వర్తమానము మువ్వురువానికి చెందిన విద్యలన్నియు వేదములవలననే ప్రసిద్ధము లయినవి.

(3) (బిభర్తి....) సనాతన వేదశాస్త్రములుసర్వవిద్యల నొసంగి ప్రాణుల నన్నింటిని ధరించుచున్నవి. సుఖముల నన్నింటిని చేకూర్చును. కావుననే మనము వాని నుత్తమములని యెంచు చున్నాము. సర్వజీవుల సకలసుఖములకు సాధనములగుటచే నట్లు వాని నంగీకరించుటయు మనకు తగియే యున్నది.

పూ: యజ్ఞ మొనర్చుటకు భూమిని త్రవ్వి వేది రచింపవలయునా? ఇద్లే ప్రణీత, ప్రోక్షణి, ఎమసము, (గరిటె) మువ్వురు పాత్రస్థాపన మావశ్యకమా? దర్భలు సంపాదింపవలసినదేనా? యజ్ఞశాల నిర్మింపక తప్పదా? ఋత్విజుల వరణ మావశ్యకమా?

ఉ: ఇందు యుక్తి సిద్ధము లన్నియు చేయవలసినవే. ఇతరములు చేయకున్నను దోషములేదు. యజ్ఞవేదిక సిద్ధము చేయవలసినదే. అందు హోమము చేయుటవలన, అగ్ని వెంటనే తీవ్రతను వహించి దానిలో వ్రేల్చబడిన హోమద్రవ్యములు శీఘ్రముగ విభక్తములై పరమాణువుల రూపమున వాయువుతోను, అగ్నితోను నాకాశమున వ్యాపించును. హోమద్రవ్య మగ్నిలో వేయునపుడటునిటు వ్యర్థముగ పోకుండుటకు కూడ వేదిక యుపయోగించును. వేదిక త్రికోణములు గలదిగను, చతుష్కోణములు గలదిగను, గుండ్రముగను, డేగయొక్క ఆకారముతోడను నిర్మించుటంబట్టి రేఖాగణితముకూడ తెలియనగును. త్రిభుజాది రేఖల బోధయు గలుగును. వేదిక పరిమాణము - లోతు, పొడవు, వెడల్పులు, మువ్వురు వానిబట్టి యేయే పరిమాణము-కొలతలుగల యిటుకలు ఎన్ని కావలసియుండునో తెలిసికొనవలసియుండును. అందువలన గణితవిద్యయు తెలియనగును. వెండి, బంగారము తామ్రము మువ్వురు ధాతువులతో పాత్రలు రచించుటకు కారణము వానిలో నుంచిన ఘృతాదిపదార్థములు చెడక స్థిరముగా నుండును. దర్భలు- యజ్ఞశాలను మార్జన చేయుటకును, చీమలు మువ్వురు క్రిములు అగ్నికుండమువలెం మరణింపకుండునట్లు చేయుటకును వేదికకు నలువైపుల నుంచబడును. యజ్ఞశాల నిర్మించుటవలన నెక్కుడు గాలి తగుల కుండును. పశువులు, పక్షులు యజ్ఞకుండమును నెడగొట్ట కుండుటయు జరుగును. ఋత్విజులు లేక యజ్ఞ మెట్లు జరుగును? అందువలన నీ యజ్ఞ విధానము లన్నియు జరుగవలసినవే. ఇంతేకాక హోమద్రవ్యములను చక్కగా సంస్కరించి-శుద్ధముచేసి యుంచుకొనవలయును. ఇక పాత్రల నిట్లుంచిన పుణ్యము, అట్లుంచిన పాపము కలుగును. అని చెప్పుటలో సత్యము లేదు. ఎట్లుంచిన కార్యము సులభమగునో యట్లుంచుకొనవచ్చును.

**అగ్నిర్దేవతా, వాతో దేవతా, సూర్యో దేవతా, చంద్రమా దేవతా వసవో దేవతా, రుద్రా దేవతా, ఆదిత్యా దేవతా, మరుతో దేవతా, విశ్వేదేవా దేవతా, బృహస్పతిర్ దేవతా, వరుణో దేవతా. యజు. అ. ౧౪. మం. ౨౦.**

పూ: యజ్ఞమున దేవతాశబ్దముల కర్థమేమి?

ఉ: వేదమున జెప్పబడినవియే దేవతాపదమున కర్థములు. యజుర్వేమంత్ర మిందులకు ప్రమాణము.

(అగ్నిర్ దేవతా....) అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, వసువులు- ప్రసిద్ధములగు ఎనిమిది వసువులు లేక యుత్తమ విద్వాంసులు, రుద్రులు- ప్రాణాదులయిన ఏకాదశరుద్రులు - లేక మధ్యమ శ్రేణికి చెందిన విద్వాంసులు, ఆదిత్యులు - ద్వాదశ మాసములు లేక యుత్తమ విద్వాంసులు, మరుత్తు - మననము నొనర్చు విద్వాంసుడగు ఋత్విక్కు, విశ్వేదేవులు - సద్గుణములు గల సర్వమానవులు, దివ్య పదార్థములు, బృహస్పతి - పెద్దవనమునకుగాని, బ్రహ్మాండమునకుగాని రక్షకుడు - పరమేశ్వరుడు, ఇంద్రుడు - విద్యుత్తు, లేక ఉత్తమ ధనము, వరుణుడు- జలము, లేక, శ్రేష్ఠగుణ యుక్త పదార్థము. ఇవియన్నియు, ఇంకనూ దివ్యగుణములుగల సకల పదార్థములు దేవత లనబడును.

కర్మకాండ- యజ్ఞవిషయమున - ముఖ్యముగా దేవతా శబ్దముచే వేదమంత్రము గ్రహింపబడును. గాయత్రి మున్నగు ఛందస్సులు అగ్ని ప్రభృతి దేవతానామములచే గ్రహింపబడును. ఈ వేదమంత్రముల వలననే కర్మకాండకు చెందిన విధులన్నియు తెలియనగును. అగ్నిశబ్దార్థ మేమంత్రమున ప్రతిపాదింపబడునో - తెలుపబడునో ఆ మంత్ర మగ్ని దేవతగలదిగ చెప్పబడును. వేదమంత్రములు అగ్నివాయ్వాది శబ్దార్థ ములను ప్రకటించును. ఈ మంత్రములవలన నీ యర్థమే ప్రకాశము కావలయునను అను నీశ్వరసంకేతమును గలదు. తత్ఫలితముగ నే యే మంత్రములలో వహ్న్యాది శబ్దములున్నవో, ఆ మంత్రములు, ఆ యా శబ్దముల యర్థములు, అగ్ని మున్నగు దేవతానామముచే గ్రహింపబడును.

అత్రాహ యాస్కాచార్యో నిరుక్తే:- కర్మసంపత్తిర్ మంత్రో వేదే.

**అథాతో దైవతమ్. తద్ యాని నామాని ప్రాధాన్య స్తుతీనాం దేవతానాం తద్దైవత మిత్యాచక్షతే. సైషా దేవతోపపరీక్షా- యత్ కామఋషిర్ యస్యాం దేవతాయా మార్థపత్యమిచ్ఛన్ స్తుతిం ప్రయుంక్తే. తద్ దైవతః స మంత్రో భవతి. తాస్త్రివిధా ఋచః పరోక్షకృతాః ప్రత్యక్షకృతాః, అధ్యాత్మికశ్చ.** ని. అ. ౭-౧.

దేవతాశబ్దముచే వేదమంత్రములవలన నగ్నిహోత్రము మొదలు అశ్వమేధ పర్యంతము గల యజ్ఞములు, శిల్పవిద్య, వాని సాధనములు ప్రాప్తించును. కావున వేదమంత్రములు దేవతానామము గల వగుచున్నవి. లేక, ఏ వేదమంత్రములవలన కర్మ సంపత్తి- మోక్షలాభము, పరమేశ్వరప్రాప్తియు గలుగునో, ఆ వేదమంత్రములకు, మంత్రార్థములకు 'దేవత' యని నామము.

పూ: దైవతమని దేనినందురు?

ఉ: (అతాతో...) నేనిగుణములు వర్ణింపబడునో వానిని దైవతమందురు. మంత్రములలో నేయే యర్థములకేయేసంజ్ఞలు మంత్రోక్తములున్నవో, అవి యన్నియు దేవతా లింగములగును. ఉదా:- "అగ్నిం దూతం" ఓ మానవులారా! ఎవడు (ఇహ) ఈ ప్రపంచమున, (దేవాన్) దివ్యభోగములను, (ఆసాదయాత్) ప్రాప్తింపజేయునట్టియు, (హవ్యవాహం) భోజనముచేయ వలసినగు పదార్థములను ప్రాప్తింపజేయునట్టియు, (దూతమ్) దూతవలె కార్యము సిద్ధింపజేయునట్టియు, (అగ్నిమ్) అగ్నిని, (పురః) ముందు, (దధే) ఉంచునో, అతడు మిమ్ముల నుద్దేశించి, (ఉపబ్రువే) ఉపదేశించును. మీరును ఇట్లే చేయుడు అని.

ఈ యజుర్వేదమంత్రమున 'అగ్ని' శబ్దము దేవతకు చిహ్నము.

పూ. ప: దీనింబట్టి తెలిసిన దేమి?

ఉ.ప: దీనింబట్టి యీ మంత్రమే యగ్నిదేవతయని తెలియ బడినది. ఇట్లే యేయే మంత్రములలో ద్రవ్యనామమంకితమై యుండునో, ఆ మంత్రములే దేవతలని యెంచవలయును. ఇట్లే యంతట నెఱుగవలయును. దేవతాశబ్దముచేత నే యే గుణములతో నేయే యర్థము గ్రహింపబడునో యని యన్నియు నిరుక్తము, బ్రాహ్మణాది గ్రంథములలో బాగుగా వ్రాయబడియున్నవి. కారణ మేమన; ఈశ్వరుడేయే పదార్థముల నేయే నామములతో వేదములం దుపదేశించి యున్నాడో, ఆయా పదార్థములు, వానిని ప్రకటించు మంత్రములు, రెండును దేవతా శబ్దముచే జెప్పబడును. మఱియు నాయా నామములు గల మంత్రములవలననే యాయర్థములను తెలిసికొనవలయును. ఆ మంత్రములు - ఋక్కులు దేవతలనబడును. వాని మూలముననే విద్వాంసులు సర్వవిద్యలను స్తుతియింతురు, ప్రకటింతురు. స్తుత్యర్థముగల 'ఋచ్' ధాతువుతో 'ఋక్కు' శబ్ద మేర్పడును.

ఆమంత్రములుముత్త్రివిధములు- ౧. పరోక్షములు, ౨. ప్రత్యక్షములు - ప్రసిద్ధార్థకములు, ౩. ఆధ్యాత్మికములు- జీవుడు, పరమేశ్వరుడు, అర్థముల కార్యకారణ భావములు నను విషయములను ప్రతిపాదించునవి. దీనింబట్టి భూతభవిష్యద్వర్తమాన కాలములందు నుండు పదార్థములను గూర్చియు, విద్యలను గూర్చియు తెలుపునవి మంత్రములే యని బోధపడుచున్నది. కావుననే మంత్రములకు దేవత యని నామము. కర్మ కాండమున దేవతా శబ్దమునకు గల యర్థము లివియే యెఱుంగవలయును.

**తద్యే అనాదిష్ట దేవతామంత్రాస్తేషు దేవతోపపరీక్షా - యద్దైవతః స యజ్ఞో వా యజ్ఞాంగం వా తద్దేవతా భవంతి. అథాన్యత్ర యజ్ఞాత్ ప్రాజాపత్యా ఇతి యాజ్ఞికా నారాశంసా ఇతి నైరుక్తాః. అపి వా సా కామదేవతా స్యాత్, ప్రాయోవా దేవతా వాఽస్తి హ్యాచారో బహులం లోకే - దేవదేవత్య మతిథిదేవత్యం. యాజ్ఞదైవతో మంత్ర ఇతి.**

ని. అ. ౭. ఖం.౭.

(తద్యే...) యాస్కముని యిట్లనుచున్నాడు: ఏ మంత్రములలో దేవతారూపమున కొండొక విశేషార్థము యొక్క నామము ప్రసిద్ధముగా కనిపింపదో, అట యజ్ఞాదులనే దేవతగా నెంచవలయును. 'అగ్ని మీడే' అనుమంత్రభాష్యమునందు మువ్విధములైన యజ్ఞములు వ్రాయబడినవి. ౧. అగ్నిహోత్రము మొదలు అశ్వమేధపర్యంతము గల యజ్ఞములు. ౨. ప్రకృతి మొదలు స్థూలపృథివి వఱకు గల జగద్రచనా రూపము, శిల్పవిద్యయును, ౩. సత్సంగాదులవలన గలుగు విజ్ఞానము, యోగమును, ఇవియే యా మంత్రముల దేవతలు నని యెఱుంగవగును. లేక, దేనివలన నే యజ్ఞము సిద్ధించునో యట్టి యజ్ఞాంగములు కూడ నా మంత్రములకు దేవతలగును. వానికంటె భిన్నములైన మంత్రములకు ప్రజాపతి- పరమేశ్వరుడు దేవత యగును. అని యాజ్ఞికులందురు. నిరుక్తి కారుల మతమున మనుష్యార్థ ప్రతిపాదకములగు మంత్రములకు దేవత మనుష్యులే యగుదురు. ఆ మంత్రములో మానవేచ్ఛ, కామన ప్రార్థన కనిపించుచున్నది కావున, వానికి కామనయే దేవతయని సకాములైన లౌకికజనులనుచున్నారు. ఇందు మతభేదము మిక్కిలిగా నున్నది. ఒకయెడ పూర్వోక్తదేవతలు చెప్పబడుదురు. ఇంకొక యెడ యజ్ఞాది కర్మలు, మఱియొకచో మాత, వేఱొకచోట పిత, యిట్లే విద్వాంసుడు, అతిథి, ఆచార్యుడు దేవతలుగా చెప్పబడుచున్నారు. వీరెల్లరు పూజ్యులు. ఉపకారము చేయుదురు. కావున దేవతలనబడుదురు. కాని, యజ్ఞమున మంత్రములు, పరమేశ్వరుడే దేవతలని ముఖ్యముగా నెంచబడుదురు. యజ్ఞము సిద్ధించుటకు మంత్రములు, పరమేశ్వరుడు ముఖ్యము.

**దేవతల పరిగణనము:**-గాయత్రి మున్నగు ఛందస్సులతో గూడిన మంత్రములు, వానియందు గల యీశ్వరాజ్ఞ, యజ్ఞములు, వాని యంగములు, సాధనములు, ప్రజాపతియైన పరమేశ్వరుడు, మనుష్యులు, కామము, విద్వాంసుడు. అతిథి, తల్లి, తండ్రి-మాతాపితలు, ఆచార్యుడు వీరు దివ్యగుణములు గలిగియుండుటచే దేవతలనబడుదురు. కాని యజ్ఞమునందు ముఖ్యముగ వేదమంత్రములు, ఈశ్వరుడే దేవతయగా గ్రహింపబడుదురు.

**అవ్యచ్చు - దేవో దానాద్ వా, దీపనాద్ వా, ద్యోతనాద్ వా, ద్యుస్థానో భవతీతి వా**

ని.-౧౫

**మంత్రా మననాత్ ఛందాంసి ఛాదనాత్.** ని. ౭-౧౨.

(**దేవో దానాత్**) కొండొక పదార్థము నిమ్నలిఖితార్థములలో దేవుడు- దేవత అనబడునని యాస్కముని నిరుక్తమున వ్రాయుచున్నాడు.

౧. దానము:- తన వస్తువు నితరుల ప్రయోజనమున కిచ్చుట. (వస్తువుపై తన స్వామిత్వము వదలుకొని యితరులకు దానిపై స్వామిత్వము గలిగించుట.) ప్రాణులకు జగత్తులోని పదార్థములన్నియు నిచ్చువాడు కావున పరమేశ్వరుడు ముఖ్యదాత - అతడే దేవుడు. విద్వాంసులు కూడ విద్యాదుల నితరులకు నిత్తురు. కావున, వారుకూడ దేవపదవాచ్యులే-దేవులే. ౨. దీపనము:- ప్రకాశింపజేయుట, మూర్తిమంతములగు పదార్థములను ప్రకాశింపజేయుటవలన సూర్యాదిలోకములు కూడ దేవులనబడును. ౩. ద్యోతనము;-సత్యము నుపదేశించుట. మాతాపితలు, ఆచార్యుడు, అతిథి అను వీరు పాలించుట వలనను, విద్యల నొసంగుట చేతను, సత్యము నుపదేశించుటచేతను దేవులనబడుదురు. ౪. ద్యుస్థానము: కిరణములు, ప్రాణములు. ఇక్కడ కూడ వాస్తవమున సూర్యాది లోకములకు గూడ ప్రకాశము నొసంగు పరమేశ్వరుడే సర్వమానవులకు నుపాసింపదగిన దేవుడు - ఇష్టదేవుడు. అన్యు డెవడు లేడు. ఇందులకు కఠోపనిషత్తు ప్రమాణము:

**నతత్రసూర్యోభాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః।**
**తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి॥**

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, విద్యుత్తు. అగ్ని, యివి యన్నియు పరమేశ్వరునకు కాంతి నొసంగజాలవు. వీనికి పరమేశ్వరుని వలననే ప్రకాశము లభించును. పరమేశ్వరుని ప్రకాశము వలననే సూర్యాదిలోకములు ప్రకాశించుచున్నవి. కావున నీశ్వరుడు తక్క యితర పదార్థ మేదియు స్వయంప్రకాశముకలది కాదని తెలిసికొనవలయును. పరమేశ్వరుడే ముఖ్య దేవుడు. అతనినే యుపాసింపవలయును.

(మంత్రా....) నిరుక్తమున మంత్రశబ్దనిర్వచనము నేనిమూలమున నెల్ల సత్యవిద్యలు మననము విచారణ చేయబడునో యవి మంత్రములు. మంత్రములవలన విద్యలు

తెలియబడునని భావము. ఛాదనము-పాపము, దుఃఖము మున్నగువానినుండి రక్షింపబడుటకు ఆత్మకు మంత్రము లాచ్ఛాదనములగును. కావున ఛందస్సు లనబడును. 'ఛద్' ధాతువునకు 'అసున్' ప్రత్యయము చేర్చుటచే 'ఛందస్' శబ్దము సిద్ధించును. మంత్ర ప్రసంగమువలన గాయత్రి మున్నగు రచనలు కూడ ఛందస్సు లనబడును.

(నైనద్దేవా ఆప్నువన్‌పూర్వమర్షత్) ఆ సర్వవ్యాపకుడగు పరమేశ్వరుని దేవతలు- ఇంద్రియములు పొందజాలవు అని యజుర్వేదము.

ఇట దేవపద మింద్రియవాచకము, శ్రోత్రము (చెవి), త్వక్కు, నేత్రములు, జిహ్వ, నాసిక, మనస్సు మను నీ యా ఱింద్రియములు దేవత లనబడినవి. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, సత్యాసత్యపదార్థములు నివి యన్నియు నీనిచే ప్రకాశితములగును- తెలుపబడును. దేవుడే దేవత. దేవశబ్దమునకు 'స్వార్థ'మున 'తల్' ప్రత్యయము చేర్చిన దేవత యగును. పరమేశ్వరుని మూలమునను గుణములే పదార్థమున నుంచబడినవో, వాని నట్లే వర్ణించుట, వ్రాయుట, వినిపించుట, తెలియజేయుటయు స్తుతి యనబడును. అట్లే మానవసృష్టియందలి గుణ దోషములు మున్నవి మున్నట్లు చెప్పుట, వ్రాయుటయు స్తుతియే. ఇట్టి స్తుతి యొనర్చుటచేతనే యవి ఇంద్రియములు- దేవత లనబడినవి. గుణములు దేవత్వమునకు హేతువు; దోషములు కావు. ఇంద్రియము లెవరికి నిష్టదేవుడు కాజాలవు. స్తుతికి ఉదాహరణము: ఈ ఖడ్గము ఖండించుటలో చాల మంచిది, నిర్మలమైనది, దీని ధార- వాయి- మిక్కిలి పదునైనది, ఎంతగా వంచినను ధనుస్సువలె విఱుగదు. ఇది ఖడ్గస్తుతి.

ఇట్లే యన్యస్థలములందును దేవశబ్దవ్యవహారము నెఱుగవలయును. కాని, పరమేశ్వరుడేయే నామముతో నేయే పదార్థముల గుణములను మంత్రములలో కీర్తించి యున్నాడో, ఆ వస్తువులే దేవతలబడును. ఆ మంత్రములు కూడ నా దేవతల పేరుతోనే వ్యవహరింపబడును. ఈ యర్థములలో దేవతాశబ్దము వ్యవహరింపవలయునను నియమము కర్మకాండమునందే యున్నది. అందరకు వంతట యిష్ట దేవుడు పరమేశ్వరుడే. ఉపాసనాజ్ఞానకాండలు, కర్మకాండలో నిష్కామ భాగము, వీనియందు పరమేశ్వరుడే యిష్టదేవుడు. అతని ప్రాప్తికొఱకే స్తుతిప్రార్థనోపాసనాదులు చేయుట యుక్తము.

పూ: ఎందువలన?

ఉ: ఆ తావులందు పరమేశ్వరుని ప్రార్థనయే చేయబడును. భేదము మాత్రమింతయే. కర్మకాండలో నిష్కామభాగమునందున్నా పరమాత్మ ప్రాప్తికే ప్రార్థన జరుగును. సకామభాగమున మాత్రము అభీష్టవిషయభోగము లభింపవలయునని పరమాత్ముని ప్రార్థింతురు. అట్లు పరమేశ్వరుండన్నియెడల గ్రహింపబడును అతనిని త్యజించు తావులేదు. వేదముల యభిప్రాయమిదియే. అతడే యెల్లరకు నుపాస్య దేవుడు.

అత్ర ప్రమాణమ్ :- మహాభాగ్యాద్దేవతాయా ఏక ఆత్మా బహుధా స్తూయతే. ఏకస్యాత్మనోఽన్యే దేవాః ప్రత్యంగాని భవంతి, కర్మజన్మాన, ఆత్మజన్మాన, ఆత్మై వైషాం రథో భవత్యాత్మాఽశ్వా. ఆత్మాయుధ మాత్మేషవ ఆత్మాసర్వం దేవస్య దేవస్య.

ని. అ. ౭-౪.

ఇందు నిరుక్త ప్రమాణము :-

(మహాభాగ్యాద్...) పరమేశ్వరుని నొక్కనినే యుపాసింప వలయును. వ్యవహారములందుపయోగపడు దేవతల నుపాసింపరాదు.

పూ: ఎందువలన?

ఉ: సర్వవేదములందును, నద్వితీయుడు- పరమాత్మయు మొకింతయు నంగీకరింపనివాడు- సర్వవ్యాపకుడునగు నా పరమేశ్వరుని యుపాసనయే యనేకవిధముల వర్ణింపబడినది. ఇతర దేవతలన్నియు నా పరమేశ్వరునికే ప్రత్యంగములు- పరమేశ్వరుని సామర్థ్యాంశములచే ప్రకాశితములగునవి. వానికి స్వయంప్రకాశములేదు. పరమేశ్వరుని ప్రకాశము వలననే వానికి ప్రకాశము లభించును. ఈ యితర దేవతలన్నియు కొండొక ప్రయోజన సిద్ధికొఱకు నిర్మింపబడినవి. వ్యర్థములుకావు. వీనివలన వేదో యొక కార్యము నిర్వహింపనగును. కావునే యివి కర్మజన్మలనబడినవి. ఈశ్వర సామర్థ్యమువలన జనించుటచే నవి ఆత్మజన్మలగును. పరమేశ్వరుడు వీనికి రథము- రమింప, విహరింపనీలగు స్థానము. వీనికి అశ్వము గమనమునకు హేతువు పరమేశ్వరుడే. ఈ దేవతలకు ఆయుధము విజయము చేకూర్చువాడును పరమేశ్వరుడే. ఇషవః దుఃఖమును నశింపచేయు బాణములను పరమేశ్వరుడే. అట్లే పరమేశ్వరుడే సర్వదేవతలకు సర్వస్వము నై యున్నాడు- అతడే దేవతల నుత్పన్నముచేసి, ధరించి రక్షించుచున్నాడు. అతడే మంగళకారియు. అతనికంటె నుత్కృష్టపదార్థము- గొప్ప వస్తువు ఇంకొకటి లేదు.

దేవతావిషయకములగు వచ్యప్రమాణములు:

ఋగ్వేదము (యేస్త్రింశత్...) ముప్పదిమూడు దేవతలు నా యంతఃకరణమున నుండి పరమాత్మునెఱుగు గాక! కర్మదేవతలు, జ్ఞానదేవతలు నను రెండు విధములగు దేవతలును దుర్వ్యసనములను తమచెంతకు రానీయకుండు గాక!

ఏ పరమేశ్వరుని కోశమునందు ప్రాపంచికములగు ముప్పది మూడు దేవతలు- దివ్యపదార్థములు-రక్షింపబడుచున్నవో, ఆ కోశమును వేదెఱుగు వారెవరు? అవి యథర్వవేదమున గలదు. మఱియు నందే, ఆ పరమేశ్వరునందుండు నే ముప్పది మూడు దేవతలు తమ్ముదాము వేఱు వేఱుగ విభక్తములుగ జేసికొనినవో, ఆ దివ్యపదార్థములను (దేవతలను) బ్రహ్మజ్ఞానులలో కొందఱే యెఱుగుదురు అనియు నున్నది.

బ్రాహ్మణ గ్రంథములు వేదమంత్రముల వ్యాఖ్యానములు, అందు శతపథ బ్రాహ్మణమున నిట్లున్నది. (స హోవాచ...)

యాజ్ఞవల్క్యుడు శాకల్యునితో ననుచున్నాడు:- వ్యావహారిక దేవతలు ముప్పదిమూడు (33) గలవు. ఎనిమిది (౮) వసువులు పదునొకండు (౧౧) రుద్రులు, పదిరెండు (౧౨) ఆదిత్యులు, ఇంద్రుడు (౧), ప్రజాపతి (౧).

(౮) ఎనిమిది వసువులు :- అగ్ని, పృథివి-భూమి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యౌః (దివము), చంద్రుడు, నక్షత్రములు.

ఆదిత్యుడన సూర్యలోకము. దాని ప్రకాశము ద్యులోకము(ద్యౌః) అందురు. అది సూర్యునకు సమీపమునను, పృథివ్యాదిలోకములందును నుండును. అగ్నిలోక మగ్నియే యగును.

పూ. వీనిని వసువులని యేల చెప్పుదురు?

ఉ: పదార్థము లన్నియు వీనియందే వసించును. ఈ లోకములే యన్నిటికి నివాస స్థానములు- కావున 'వసువు' లనబడును.

(౧౧) ఏకాదశ రుద్రులు:- శరీరమున గల పది ప్రాణములు - ప్రాణము, అపానము, వ్యానము, సమానము, ఉదానము, నాగము, కూర్మము, కృకలము, దేవదత్తము, ధనంజయము- అనునవి పదియు, పదునొకండవది జీవాత్మ కలిసి ఏకాదశ రుద్రులనబడును.

పూ: వీనిని రుద్రులందు రేల?

ఉ: ఇవి యన్నియు శరీరమునుండి వెడలిపోయినపుడు మృత్యువు సంభవించును. మరణించిన వ్యక్తికి సంబంధించిన వారపుడు రోదనము సేయుదురు. ఇట్లివి బంధువుల రోదనమునకు హేతువులై రుద్రులనబడును.

(౧౨) ఆదిత్యులు:- చైత్రము మొదలు ఫాల్గునము వఱకు గల పండ్రెండు మాసములు ఆదిత్యులనబడును. కారణమేమన:- అన్నింటి ఆయువును గ్రహించుచు మాసములు గతించును - కావున నాదిత్యులనబడును.

(౧) విద్యుత్తు ఇంద్రుడనబడును: అది యుత్తమమగు నైశ్వర్య విద్యకు ముఖ్య హేతువు.

(౧) ప్రజాపతి యన యజ్ఞము. ఇయ్యది వాయువును, వృష్టిజలమును శుద్ధముచేసి ప్రజలను పాలించును. పశువులు కూడ యజ్ఞనామముచే జెప్పబడును. వానివలనను ప్రజలకు జీవన మేర్పడును.

ఇట్లే ముప్పది మూడును తమ తమ దివ్యగుణములు కారణములుగ దేవత లనబడును. పూర్వము చెప్పిన దేవశబ్ద నిర్వచనమును బట్టి యీ దేవత లన్నియు వ్యావహారికములు.

మూడు లోకములు కూడ మూడు దేవత లనబడును. అవి యెయ్యవి యన:- ౧. స్థానము, ౨. నామము, ౩. జన్మము- అని నిరుక్తకారుని సమాధానము.

౧. వాక్కు పృథివీలోక మనియు, ౨. మనస్సు అంతరిక్షమనియు, ౩. ప్రాణము ద్యులోక మనియు శతపథము చెప్పుచున్నది.

౧. అన్నము, ౨. ప్రాణము, ౩. అధ్యర్ధము . ఈ మూడును దేవతలనియు నందే యున్నది. ఇందు అధ్యర్ధమువలన నెల్లరి ధారణ, వృద్ధియు గలుగును. సమస్తజగమున వ్యాపించి సూత్రాత్మగా నుండు వాయువే అధ్యర్ధ దేవత యనబడును.

పూ: ఈ దేవతలన్నియు మానవులుపాసింప దగినవియేనా?

ఉ: పైన వర్ణింపబడిన దేవతలలో నొక్కటియు మానవుడుపాసింపదగినది లేదు. కాని, లోక వ్యవహారములు సిద్ధించుట కివి యుపయుక్తములగును. మనుష్యులెల్లరు నుపాసింపదగినది యొక్క పరబ్రహ్మము - పరమేశ్వరుడు మాత్రమే. ఇందులకు ప్రమాణము:-

('స బ్రహ్మా త్యదిత్యాచక్షతే' ,శత...) సర్వజగత్కర్త, సర్వ శక్తిమంతుడు, ఎల్లరకు నిష్టుడు, ఎల్లరిచే నుపాసింపదగినవాడు, సర్వధారణకర్త, సర్వవ్యాపకుడు, సర్వకారణుడు ఆద్యంతములు లేనివాడు, సచ్చిదానంద స్వరూపుడు, అజన్ముడు, న్యాయకర్త- మున్నగు విశేషణములతో వేదాదిశాస్త్రములందు వర్ణింపబడిన పరమేశ్వరుడే ముప్పది మూడవ దేవ. అతడే యెల్లరికి నిష్టదేవుడు. అతనికంటె భిన్నవ్యక్తిగాని, భిన్నపదార్థముగాని యిష్టదేవుడుగా నంగీకరించు వాడనార్యుడు- అనాడి- యనదగును.

శతపథబ్రాహ్మణ మార్యుల యితిహాసమును దెలుపును. అందిట్లున్నది. (ఆత్మేత్యేవ...) ఎల్లరకు నాత్మయగు పరమేశ్వరు నెల్లమానవులు నుపాసింపవలయును.

(స యో ...) ఎవడేని పరమేశ్వరుని విడిచి యన్య నీశ్వరుడని యెంచి వాని యందు భక్తియుంచవలయు నని చెప్పిన నతనితో నీ వెల్లప్పుడు దుఃఖములతో నేడ్చుచుందువు. ఈశ్వరు నుపాసించువాడే యానందమున నుండును అని యనవలయును.

(యో౽న్యా....) పరమేశ్వరునికంటె భిన్నమగు పదార్థము నీశ్వరబుద్ధితో నుపాసించువాడేమియు నెఱుగడు. కావున నతడు విద్వాంసులమధ్య పశువు- గార్దభములతో సమానుడుగా నుండును.

ఈ ప్రమాణములంబట్టి యార్యులెల్లపుడు నొక్క యీశ్వరునే యుపాసించుచు వచ్చిరని తెలియుచున్నది.

'దివు' ధాతువునకు గల పది యర్థములు వ్యవహారమునందును, పరమార్థమునందును సరిగా వర్తించును. వేదములందీ రెండు విధములగు వర్ణములు బాగుగా వివరింపబడినవి. వానిలో నొకింత భేదమున్నది. పూర్వము వర్ణింపబడిన వహ్న్యాదిదేవతలు పరమేశ్వరుని ప్రకాశముచే ప్రకాశింపజేయబడుచున్నారు. పరమేశ్వరుడు- దేవుడు- మాత్రము తన ప్రకాశముతో నే యెల్లపుడు ప్రకాశితుడగును. కావున నతడొక్కడే యెల్లరకు పూజ్యుడు. దివు ధాతువునకు గల పది యర్థములు:- ౧. క్రీడ- ఆట. ౨. శత్రువుల జయించు కోరిక- విజిగీష, 3. వ్యవహారము, ఆదిరెండు విధములు- బాహ్యము, ఆభ్యంతరము. ౪. నిద్ర, ౫. మదము. ఈ యైదర్థములు ముఖ్యముగా వ్యవహారమునందే వర్తించును. అగ్నిమున్నగు పదార్థములు లోకవ్యవహారసిద్ధికి హేతువులు. కాని పరమాత్మ- దేవునకీ యర్థములతో నేమియు సంబంధ ముండదని యెంచరాదు. అగ్న్యాది దేవతలన్నియు పరమేశ్వరుని వ్యాపకతవలనను, అతనిచే రచియింపబడుటవలనను దివ్యగుణములు కలవి యైనవి. ౧. ద్యుతి = ప్రకాశించుట, ౨. స్తుతి= గుణములను కీర్తించుట, 3. మోదము= ప్రసన్నత, ౪. కాంతి=శోభ, ౫. గతి= జ్ఞానము, గమనము, ప్రాప్తి. ఈ యైదర్థములు, పరమేశ్వరునియందు ముఖ్యముగా వర్తించును. పరమేశ్వరునికంటె భిన్నములగు పదార్థములలో గౌణముగ - అప్రధానముగ వర్తించును. వానిలోనుండు గుణములుబట్టి వాని దేవత్వము నిర్ణయింపబడును. పరమేశ్వరునందు సర్వశక్తి మత్త్వాది సర్వగుణములు ననంతములై యున్నవి. కావున నతడే పూజ్య దేవుడు. కావున గౌణముఖ్య భేదముతో వ్యవహారము, పరమార్థమును రెండు స్థలములందును దేవతాపదము వ్యవహరింపబడును.

వేదములందు జడములను, చేతనములను రెండింటిని పూజింపవలయునని యున్నందున వేదము లొక్క యీశ్వరునే యుపాసింపనుపదేశించిన భ్రేమ యెంచవలయును? అని కొందఱాక్షేపింతురు.

ఇట్లు భ్రమపడవద్దు. ఈశ్వరుడు సర్వపదార్థములందును స్వతంత్రగుణముల నుంచి యున్నాడు. చూచుటకు నయు సామర్థ్యమును నేత్రమునందుంచినాడు. అందువలన దానితో వస్తువు కనిపించును. నేత్రముతో చూచుట లోకవ్యవహారము. సూర్యుడు, నేత్రములు లేకున్నను వస్తువులు కనబడునట్లు ఈశ్వరుడేలచేయలేదు అని యెవడేని ప్రశ్నించిన, నతని ప్రశ్నమర్థము లేనిదగును. అట్లే పూజా విషయమునను నెఱుంగవలయును. ఇతరులను సత్కరించుట, ప్రియము నొనర్చుట- ఇతరులకనుకూలముగ వర్తించుట - పూజ యనబడును. అనుకూలాచరణమనెడి పూజనేత్రమునకు గూడ చేయనగును. అట్లు చేయుట మనుష్యుల కెల్లరకు నుచితము కూడ. (నేత్రమున కనుకూలాచరణమన దానితో సరిగ వ్యవహరించుట, చూచుటకు దానిని చక్కగా నుపయోగించుట యని భావము). ఇట్లే అగ్ని, జలము మున్నగు పదార్థముల మూలమున వస్తువుల ప్రకాశింపజేయనచ్చును; దివ్యములగు గుణక్రియలను సిద్ధపఱచు కొనవచ్చును. మఱియు నితరోపకారములను బొందవచ్చును. వస్తువులను ప్రకాశింపజేసి, ఇతర క్రియా నిర్వహణలో నుపయుక్తములై యగ్ని మున్నగు వస్తువులు దేవతలనబడినందున గలుగు హాని యేమి యున్నది? కాని, వేదములలో నెట నుపాసనము విధింపబడి యున్నదో యట్టి యెడ నద్వితీయుడగు నా పరమేశ్వరుడే గ్రహింప దగినవాడు.

ఈ దేవతలుద్వివిధములుగ నున్నవి. ౧. మూర్తిమంతములు, ౨. అమూర్తిమంతములు, మాత, పిత, ఆచార్యుడు, అతిథియను నీ నలువురు మూర్తిమంతము కాదు. బ్రహ్మమున

కేవిధమగు మూర్తియు నుండదు. ఈ యైదు దేవతల పూజలో గల యీ భేదమును గుర్తింపవలయును. తైత్తిరీయోపనిషత్తునందీయైదు దేవతలు వర్ణింపబడి యున్నవి.

ఇట్లే పూర్వము వర్ణింపబడిన ఎనిమిది వసువులందు అగ్ని, పృథివి, ఆదిత్యుడు, చంద్రుడు, నక్షత్రములు నను నీ దేవతలు మూర్తిమంతములు. ఏకాదశరుద్రులు, ద్వాదశ ఆదిత్యులు, మనస్సు నైదింద్రియములు, అంతరిక్షము, వాయువు, ద్యులోకము, మంత్రములు ననునివి యన్నియు మూర్తిమంతములు కాని దేవతలు. అట్లే విద్యుత్తు, విధియజ్ఞము ననునివి మూర్తిమంతములు, అమూర్తిమంతములును. ఇట్లు సాకారనిరాకార భేదముతో దేవతలలో రెండు విధములైన వ్యవస్థ యున్నట్లు గుర్తింపవలయును. పృథివ్యాదులందు వ్యవహారోపయోగిత్వము దేవత్వమున్నది. తల్లి, తండ్రి, ఆచార్యుడు, అతిథి వీరియందు వ్యవహారోపయోగిత్వము, పరమార్థ ప్రకాశకత్వము నను దేవత్వమున్నది. అట్లే మనస్సు, ఇంద్రియములునను వీని యుపయోగము వ్యవహారమునందును, పరమార్థమునందును గలదు. కాని మానవుల కెల్లరకు నుపాసింపదగినవాడు పరమేశ్వరుడొక్కడే. అతడు తక్క, మఱి యే దేవతయు వేదములందు ఉపాస్యుడని కాని, పూజ్యుడని కాని చెప్పబడలేదు.

వేదములలో పృథివ్యాది భూతములపూజ వర్ణింపబడినదని యొందఱో నేటి యార్యవిద్వాంసులు, ఐరోపాదేశవాసులైన ఇంగ్లీషు మున్నగు భాషలందు మాట్లాడువారును చెప్పుదురు.

వారు చెప్పునది యసత్యము. వారింకను నిట్లందురు. ఆర్యులు మొదట అగ్న్యాది పంచభూతములనే పూజించెడివారు; బహుకాలము తరువాత వారు పరమేశ్వరుని బూజించుట తెలిసికొనిరి అని. ఇదియు నిజము కాదు. ఆర్యులు సృష్ట్యారంభమునుండి నేటి వఱకు నింద్రుడు, వరుణుడు, అగ్ని మున్నగు నామములతో వేదోక్త ప్రమాణముల మూలముననే యీశ్వరునే యుపాసించుచు వచ్చిరి. ఇందులకనేక ప్రమాణములున్నవి. వానిలో కొన్నింటి నిట నుదాహరించుచున్నాము.

వేదాది సత్యశాస్త్రములందు ఏకేశ్వర పూజావిషయక ప్రమాణము లెన్నో యున్నవి. ఉపరిలిఖితమంత్రములలో కొన్నింటి యర్థము పూర్వము వ్రాయబడినది. మిగిలిన వాని యర్థము ముందు వ్రాయబడును. అందువలన వాని యర్థమిట వ్రాయలేదు. వేదములందలి ఈశానుడు మున్నగు విశేషణములతోను, ఉపనిషత్తులలోని అణువు కంటె నణువు మున్నగు విశేషణములతోను, ఏ యీశ్వరుడు ప్రతిపాదింపబడెనో యాతనినే ఆర్యులు సృష్ట్యారంభమునుండి నేటివఱకు నుపాసించుచున్నారు. ప్రాచీనార్యులు పలుదేవతలను, (అగ్ని మున్నగు) భూతములను పూజించెడి వారని కొందరు ఆర్యులు, ఐరోపాఖండమునందెడి మోక్షముల్లర్ మున్నగు విద్వాంసులు చెప్పుదురు. కాని వారి కథనము వ్యర్థమైనదియే. సత్యముకాదు. వేదములందును, వాని ప్రాచీన వ్యాఖ్యానము (బ్రాహ్మణము) లందును అగ్ని మున్నగు నామములతో పరమేశ్వరునే యుపాసనకు గ్రహించినట్లు గలదు. ఆర్యులు పరమేశ్వరునే యుపాసించుచుండిరి. ఈ విషయమున సంశయము తగదు.

ఈ విషయమును గుఱించియే డా. మోక్షమూలర్‌మహోదయుడు, తనచే వ్రాయబడిన సంస్కృత సాహిత్య నామకగ్రంథమునందిట్లు వ్రాసియున్నాడు:- ఆర్యులకు క్రమముగా చాల కాలమునకు తరువాత యీశ్వరుని జ్ఞానము గలిగినది. వేదములు ప్రాచీనములగుటకు తగిన ప్రమాణ మొక్కటియును లేదు. పై పెచ్చు, అవి నవీనము లగుటకు బహు ప్రమాణములుండించుచున్నవి. అని వ్రాసి, ఛందోభాగమునకంటె మంత్రభాగము రెండు వందల వత్సరములు వెనుక రచింపబడినదియు, అందులకు హిరణ్యగర్భ శబ్దము ప్రమాణమనియు వ్రాసియున్నాడు. మఱియు నతడిట్లు నుడివియున్నాడు. వేదమున రెండుభాగములున్నవి. ఒకటి ఛందస్సు; రెండవది మంత్రము. అందు ఛందోభాగము సామాన్యార్థముతో కూడియున్నది. ఇతరుని బుద్ధి ప్రేరణవలన ప్రకాశితమైనట్లు కనిపించుచున్నది. అది కర్తృబుద్ధిప్రేరణతో నుత్పన్నమను కాజాలదు. అందలి ఉక్తి-కథనప్రకారము- అజ్ఞాని ముఖమునుండి యకస్మాత్తుగ వెలువడిన వచనములవలె నున్నది. అది యుత్పన్నమై యొక్కువలో నెక్కువ (3100) ముప్పదియొక్క వందల సంవత్సరములు గడచియుండును. మంత్రభాగ ముత్పన్నమై (2900) యిరువది తొమ్మిదివందల యేండ్లు గతించియుండును. ఈ విషయమును రుజువుచేయుటకు 'అగ్నిః పూర్వేభిః' అను మంత్రమును ప్రమాణముగ నిచ్చియున్నాడు. కాని, యిదియంతయు సరికాదు.

పూ: ఎందువలన?

వారికి (హిరణ్యగర్భః), (అగ్నిఃపూర్వేభిః) అను రెండు మంత్రముల యర్థము సరిగా తెలియదు. హిరణ్యగర్భశబ్దము వారికి నవీనముగా కనబడినట్లున్నది. వారు హిరణ్యమును బంగారముగా నెంచి అదియు మానవసృష్టి యేర్పడిన తరువాత మానవులలో నాగరికత బాగుగా కలిగి, రాజప్రజా సంబంధము లేర్పడిన బహుకాలమునకు భూమినుండి త్రవ్వి తీయబడినదని

భావించియున్నారు. కాని యిది యంతయు వారి భ్రమ. శతపథబ్రాహ్మణాదుల ప్రమాణములబట్టి హిరణ్యశబ్దమునకీ క్రింది యర్థము లున్నట్లు తెలియనగును.

౧. హిరణ్యం= జ్యోతిః- విజ్ఞానము. అది స్వరూపముగలవాడు= హిరణ్యగర్భుడు.

౨. హిరణ్యం= జ్యోతిః- అమృతము- మోక్షము. అది సామర్థ్యమున గలవాడు హిరణ్యగర్భుడు. (శతపథము)

౩. హిరణ్యమ్ జ్యోతిః= ప్రకాశస్వరూప సూర్యాదిలోకములు గర్భమునందు గలవాడు= హిరణ్యగర్భుడు. (నిరుక్తము)

౪. హిరణ్యం= యశస్సు, అది యెవని స్వరూపముగ నుండునో వాడు హిరణ్యగర్భుడు. (ఐతరేయము)

౫. హిరణ్యం= జ్యోతి: జీవాత్మ, గర్భమునందు సామర్థ్యమున కలవాడు హిరణ్యగర్భుడు. (శతపథము)

౬. హిరణ్యం= జ్యోతిః, ఇంద్రుడు, సూర్యుడు, అగ్ని ఇవి యన్నియు నెవని సామర్థ్యమున నుండునో యతడు హిరణ్యగర్భుడు. (శతపథము)

ఈ యర్థములన్నియు పరమేశ్వరునకు తక్క యితరులకు వర్తింపవు. కావున హిరణ్యగర్భుడు పరమేశ్వరుడగును; కాని, బంగారము కాదు. హిరణ్యగర్భపదప్రయోగమును బట్టి వేదములు సనాతనము లనియు, నుత్తమములు ననియు బోధపడును; కాని యాధునికములని తెలియుట కవకాశములేదు. కావున మోక్షమూలర్ మహాశయుడు నుడివినది సత్యముకాదు ఇట్లే (అగ్నిః పూర్వేభిః....) అను మంత్రమును కూడ వేదములు నవీనము లనుటకు ప్రమాణముగా నిచ్చియున్నాడు. అదియు భ్రమమూలకమే.

కారణ మేమందురేని, ఋషి శబ్దము మనుష్యుడు, మంత్రము, ప్రాణము, తర్కము నను వానికి నామము.

ఈ త్రికాలములందుండు ఋషుల (మంత్రముల) ద్వారమున నాస్తుతి చేయబడినది, చేయబడుచున్నది, చేయబడగలదు- అని యీశ్వరుడు చెప్పుచున్నాడు. అతడు త్రికాల దర్శి అని మంత్రార్థమగును. మఱియు నీ మంత్రమున, వేదములను జదివి పూర్వము విద్వాంసులయినవారును, ఇప్పుడు జదువువారును, ఇకముందు భవిష్యత్తున జదువు వారును నెల్లరు- ప్రాచీనార్వాచీన ఋషులు (మనుష్యులు) నా స్తుతి జేయుదురు గాక! అని త్రికాలదర్శియైన యీశ్వరుడు- వేదకర్త భూతభవిష్యద్వర్తమాన వ్యవహారములను బాగుగా నెఱిగి చెప్పియున్నాడు. కావున దీనింబట్టియు వేదముల సనాతనత్వము, ఉత్తమతమమును సిద్ధమగునే కాని, నవీనత్వము సిద్ధింపదు. అందువలన మోక్షమూలరు ని కథనము సరికాదు.

**తత్ప్రకృతీతదర్థ్యమసామాన్యాదిత్యయం మంత్రార్థచింతాభ్యూహోఽభ్యూఢోఽపి శ్రుతితోఽపి తర్కతో, న తు పృథక్త్వేన మంత్రా నిర్వక్తవ్యాః, ప్రకరణశ ఏవతు నిర్వక్తవ్యాః, న హ్యేషు ప్రత్యక్ష మస్త్యనృషేరతపసో వా. పారోవర్యవిత్సుతు ఖలు వేదితృషు భూయోవిద్యః ప్రశస్యో భవతీ త్యుక్తం. పురస్తా న్మనుష్యా వా ఋషి ఘూత్క్రామత్సు దేవా నబ్రువన్ కో న ఋషిర్ భవిష్యతీతి? తేభ్య ఏతం తర్క మృషిం ప్రాయచ్ఛన్ మంత్రార్థచింతాభ్యూహ మభ్యూఢమ్ తస్మాద్ యదేవ కించానూచానోఽభ్యూహ త్యార్షం తద్ భవతి.** ని. ౧౩-౧౨

వేదమునకు విరుద్ధముకాని తర్కముకూడ నొక ఋషియే. ఆ తర్కము మూలమున వేదార్థమెట్లు చేయవలయునో యాస్కముని చెప్పుచున్నాడు.

(తత్ ప్రకృతీత...) మంత్రములం దెల్లయెడల సామాన్యముగ పదములు, శబ్దములు, అక్షర సముదాయము పరస్పరము విశేష్యవిశేషణ భావమును గల్గియున్నవి. కావున మంత్రార్థముల నెఱుగవలయునను కోరిక గలుగును. అట్టియెడ మంత్రార్థముల విశేషజ్ఞానముకొఱకు, ఈ మంత్రమున కర్థమేమగును? అను నిట్టి యూహాపోహలు ప్రతి మానవునకును కలుగవలయును. కేవల శ్రవణమువలనగాని, శుష్కతర్కమువలనగాని మంత్రములను వాని ప్రకరణమునుండి వేఱుచేసి వానికర్థము చెప్పజాలము. ఆ మంత్రములకున్న పూర్వాపర సంబంధముల నెఱిగి ప్రకరణానుకూలముగ నర్థము చెప్పవలయును. ఋషులు కానివారు, తపస్వులు కానివారు- అంతఃకరణము శుద్ధముకాని యవిద్వాంసులు మంత్రార్థములను ప్రత్యక్షము చేసికొనజాలరు. వేదార్థముల నెఱిగిన మనుష్యులలో గూడ నధికవిద్వాంసుడైనవాడే ప్రశస్యుడగును. అతడే వేదమునకు విరుద్ధముకాని సుతర్కములో మంత్రమునకుపయుక్తమగు నర్థము చెప్పగలడు. ఈ విషయమును స్పష్టము చేయుటకే యాస్కముని యొక గాథను కల్పించి యున్నాడు:- పూర్వకాలమున నొకప్పుడు మంత్రార్థద్రష్టలు మహర్షులు గతించిపోగా, మానవులు విద్వాంసుల చెంతజేరి మాలో నిప్పుడు మంత్రార్థద్రష్ట- ఋషి యెవరు? అని ప్రశ్నించిరి. అంతట నా విద్వాంసులు సత్యాసత్యజ్ఞానము

ద్వారమున వేదార్థము నెఱుంగుటకు తర్క మనెడి ఋషిని మానవులకు నొసంగి ఈ తర్కమే మీలో ఋషి కాగలడు అని నుడివిరి.

ప్ర : ఆ తర్క మెట్టిది?

ఉ : దానిమూలమున మంత్రార్థము తెలియగలదు.

ప్ర: ఇందువలన సిద్ధించిన దేమి?

ఉ: దీనివలన పూర్ణవిద్వాంసుడైన పురుషుడెవడేని వేదార్థమును జెప్పిన, అది ఋషిప్రోక్తమగు నర్థముగా భావింపవలయునని సిద్ధించుచున్నది. ఇంతేకాక, అల్పబుద్ధిగలవాడు చెప్పిన మంత్రార్థము అర్థము కాదని యెంచి దాని నాదరింపరాదనియు తెలియును.

ప్ర : ఎందువలన?

ఉ: అల్పబుద్ధిచెప్పు మంత్రార్థమనర్థయుక్తమై యుండును. దాని నాదరించు మానవులకును ననర్థము వాటిల్లును.

అందువలన ( పూర్వేభిః, నూతనై రుత) భూతభవిష్యద్వర్తమాన కాలములందుత్పన్నమగు తర్కరూప ఋషులచే నాయగ్ని- ప్రకాశ స్వరూపుడగు పరమేశ్వరుడే - స్తుతింపబడ నర్హుడై యున్నాడు. ఇతర పదార్థ మేదియు మానవులచే స్తుతింపబడ నర్హము కాదు అని తెలియనగును. కావున ( అగ్నిః పూర్వేభిర్ ఋషిభి రీడ్యో నూతనైరుత...) అను మంత్రమున కిట్లు అర్థము చెప్పుకొనిన, వేదములు నవీనములని చెప్పుట కవకాశము చిక్కదు. అవి సనాతనము లనియే సిద్ధమగును. మఱియు నైతరేయమున ప్రాణములే ఋషులని చెప్పబడినది. జగత్తున కుపాదానకారణ మగు ప్రకృతిలోనుండు ప్రాణములు ప్రాచీన ఋషులు, ప్రకృతినుండి యేర్పడిన కార్యములగు మహత్తత్త్వాహంకారాదులలో నుండు ప్రాణములు నూతన ఋషులు నని చెప్పుదురు. కావున విద్వాంసులెల్లరు నా ప్రాణము లను ఋషులతో యోగాభ్యాసము నొనర్చి యగ్నినామక పరమేశ్వరుని స్తుతి ప్రార్థనో పాసనాదులు సేయదగుదురు. దీనింబట్టి మోక్షమూలర్ ప్రభృతులగు పాశ్చాత్యవిద్వాంసులు ( అగ్నిః పూర్వే) అను మంత్రమునకు జేసిన యర్థము తప్పుడర్థమని సులభముగా దెలిసికొననగును.

ఛందస్సులు వేఱు; మంత్రములు వేఱు నని మోక్షమూలర్ చెప్పునదియు సరికాదు.

ఎందువలన? ఛందస్సు, నిగమము, వేదము, మంత్రము, శ్రుతియను నివి యన్నియుపర్యాయపదములే. ఛందస్సు పదమున కనేకార్థములు నున్నవి. వైదికములయిన గాయత్రి మున్నగు వృత్తములకును. లౌకికములయిన ఆర్యా మున్నగు వృత్తలకును ఛందస్సులని పేరు గలదు. ఒక్కొక్కయెడ ఛందస్ పదము, స్వాతంత్ర్యమును గూడ తెలుపును.

"మననము వలన మంత్రములు, ఆచ్ఛాదనము వలన ఛందస్సులు ననబడుచున్న" వని యాస్కముని మంత్రఛందశ్శబ్దములను నిర్వచించియున్నాడు.

అవిద్యాది దుఃఖములను నివారించి, సుఖములతో నాచ్ఛాదించుట- కప్పుట వలన వేదములు ఛందస్సులనబడును. 'లహ్లాదనము', 'దీప్తి' యను రెండర్థములు గలది ధాతువునకు పరమున 'అసున్' ప్రత్యయము చేర్చి, చ కారస్థానమున ఛ కారము ఆదేశించినందున ఛందస్ శబ్దము సిద్ధించును. వేదాధ్యయనము వలన మానవుడెల్ల విద్యల నేర్చి యాహ్లాదము- ప్రసన్నతను బొందుచు ఆనందించును. సర్వార్థముల నెఱుగజాలును. కావున ఛందస్సన వేదమని యర్థము. గుప్తపరిభాషణ మర్థముగాగల 'మత్రి' ధాతువునకు పరమున 'హలశ్చ' అను పాణినీయ సూత్రము ననుసరించి 'ఘఞ్' ప్రత్యయము చేర్చిన మంత్ర శబ్ద మేర్పడును. కావున గూఢపదార్థముల జ్ఞానము దేనివలన గలుగునో యట్టి వేదము 'మంత్ర' మనబడును. వేదావయవములగు, 'అగ్ని మీడే' మున్నగునవి యుపర్యుక్త యర్థము నందును, క్రింది యర్థము లందును మంత్రము లనబడును. ఇట్లే, జ్ఞానార్థకమగు 'మన' ధాతువునకు పరమున 'సర్వధాతుభ్యః ష్ట్రన్' అను ఉణాది సూత్రము ననుసరించి 'ష్ట్రన్' ప్రత్యయము జేర్చినను మంత్ర శబ్దము సిద్ధమగును. దేనివలన, లేక దేనియందు మనుష్యులు సత్యపదార్థముల నెఱుగుదురో యా వేదమునకు 'మంత్ర' మని నామము.

శతపథమునందు గాయత్ర్యాది ఛందస్సులు, ఆ ఛందస్సులతో గూడిన మంత్రములు 'దేవత' లనబడును. అవి సర్వార్థములను ప్రకాశింపజేయును అని చెప్పబడినది.

ఈ ఛందస్సులే దేవతలు. ఛందోరూపములగు వేదములు, వేదమంత్రములు ననువానితో పరమేశ్వరుడు సంపూర్ణవిశ్వమును, కర్మములను బంధించియుంచును. ఈ ఛందోరూపవేదములు, వేదమంత్రములే సర్వసత్యవిద్యలతో పరిపూర్ణములయియున్నవి.

మనుస్మృతి 'శ్రుతి' శబ్దము వేదవాచక మనుచున్నది. నిరుక్త మా 'వేదమునకే నిగమము' వాచక మనుచున్నది. వేదములను విని, చదివి, యభ్యసించుటవలన మానవులు సర్వసత్యవిద్యల నెఱుగజాలుదురు. అందువలన నవి శ్రుతులనబడును. వేదములందు సర్వవిద్యల యథార్థజ్ఞానము కలుగును కావున నవి నిగమము లనబడును. కావున ఛందస్సు, మంత్రము,

శ్రుతి, నిగమము అను నాలుగు పదముల యర్థమొక్కటియే యని యెఱుంగవలయును. అన్నియు వేదవాచకములే.

**మంత్రే ఘసహ్వరణశవృదహాద్ వృచ్ కృగమిజనిభ్యో లేః ౧**

అష్టాధ్యాయ్యామ్, పాణి, ౨-౪-౮౦.

**ఛందసి లుఙ్ లఙ్ లిటః** ౨.పా. ౩-౪-౬.

**వా ష పూర్వస్య నిగమే.** ౩.పా. ౬-౪౯.

వ్యాకరణశాస్త్రగ్రంథ మయిన అష్టాధ్యాయిలో వర్ణింపబడిన పై సూత్రములను బట్టియు ఛందస్సు, మంత్రము, నిగమము అను ఈ మూడు పదములు వేదవాచకములనియే స్పష్టమగుచున్నది. కావున ఛందో మంత్రములలో పరస్పర భేదమును జెప్పువారి వచనములు ప్రమాణములు కావు.

## వేదసంజ్ఞావిచారము

పూ: వేదమనివేనికి నామము?

ఉ: మంత్ర సంహితలకు.

పూ: మంత్రబ్రాహ్మణ గ్రంథములకు వేదమను నామమున్నట్లు కాత్యాయనుడు చెప్పగా మీరు బ్రాహ్మణములను గూడ వేదముగా నేల యంగీకరింపరు?

ఉ: బ్రాహ్మణ గ్రంథములు వేదములు కావు. కారణ మేమన: వానికే ఇతిహాసములు, పురాణములు, కల్పములు, గాథలు, నారాశంసములు నని పేర్లు గలవు. అవి వేదములకు వ్యాఖ్యానములు, ఋషులచే వ్రాయబడినవి. ఈశ్వరోక్తములు కావు. కాత్యాయనుడు తక్క యితర ఋషులెవ్వరును, వానిని వేదములని యంగీకరింపరు. మానవ బుద్ధిరచితములు. ఈ కారణములవలన బ్రాహ్మణ గ్రంథములకు వేద నామము లేదు. మంత్ర సంహితలు ఈశ్వరరచితములు; సర్వవిద్యలకు మూలములు. కావున నవి వేదములనబడును. మఱియు బ్రాహ్మణ గ్రంథములలో నున్నట్లు మానవనామపూర్వకములగు లౌకిక-ఇతిహాసములు వేదములందు లేవు. కావున మంత్రభాగములే వేదములు.

**త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్**

**యద్దేవేషు త్ర్యాయుషంతన్నోఽస్తు త్ర్యాయుషమ్.** యజు ౩.౬౨

పూ: ఐతరేయాదిబ్రాహ్మణ గ్రంథములలో యాజ్ఞవల్క్యుడు, మైత్రేయి, జనకుడు మున్నగువారి యితివృత్తములు వ్రాయబడియున్నట్లు (త్ర్యాయుషం....) అను నిట్టి వేదమంత్రములలో గూడ కశ్యపుడు మున్నగు మహర్షుల నామము లంకితములై యున్నందున నితిహాస విషయమున మంత్రబ్రాహ్మణములు రెండును సమానములే యగుచున్నవి. కావున బ్రాహ్మణము లేల వేదములుకావు?

ఉ: ఇట్లు భ్రమపడరాదు. జమదగ్ని, కశ్యపుడు మున్నగు మంత్రస్థ పదములు దేహధారులైన మనుజుల నామములు కావు. ఇందులకు శతపథ బ్రాహ్మణమే ప్రమాణము.

చక్షువు పేరు జమదగ్ని. దీనితో జూడవగును తెలియనగును: ఇట్లే ప్రాణముకశ్యపుడు, కూర్మము ననబడును. ప్రాణము కూర్మము వంటి యాకృతి కలిగి నాభియందుండును.

(శతపథము)

కావున నిట ప్రాణపదముచే నంతఃకరణము, చక్షువుచే నింద్రియములు గ్రహింపదగును. ప్రాణులు వీని సహాయముచే బాహ్యాంతరములలో జూచును.

(త్ర్యాయుషం) ఈ మంత్రమున నీశ్వరుని ప్రార్థన చేయబడినది. ఓ జగదీశ్వర! నీ యనుగ్రహమున మాకశ్యపనామక ప్రాణము మున్నగు నంతఃకరణములు, జమదగ్ని నామక నేత్రాది సర్వేంద్రియములు మూడువందల (300) సంవత్సరములవఱకు జీవించుచుండునుగాక (యజుర్వేదము)

శతపథమున దేవశబ్దము విద్వద్వాచకమని చెప్పబడినది. కావున విద్వాంసులు విద్యాప్రభావము వలన మూడువందల సంవత్సరముల కాలము జీవించునట్లు ఇంద్రియములతోను, మనస్సుతోను మేమును త్రిగుణమగు నాయువును సుఖముగ ననుభవింతుము గాక! అట్లే (త్ర్యాయుషం) ఇట్టి మంత్రోక్తార్థములను బట్టి, మానవుడు బ్రహ్మచర్యాదినియమములను పాలించి త్రిగుణము, చతుర్గుణమునగు నాయువు ననుభవింపవచ్చునని తెలియుచున్నది. నాల్గువందల (400) యేండ్లు మనుష్యుడు నియమములను పాలించి బ్రతుకవచ్చునని యభిప్రాయము.

వేదములందు సత్యములగు నర్థములను దెలుపు జమదగ్న్యాది పదముల మూలమున సత్యవిద్యలు ప్రకటితము లగును; కాని, లౌకికములగు నితిహాసములు తెలుపబడవు.

సాయణుండు మున్నగు నాచార్యులు వేదములకు వ్రాసిన వ్యాఖ్యానములందు వర్ణింపబడిన యితిహాసములు కల్పితములని ఉపన్యస్తలేఖము బట్టి తెలియనగును.

ఈ కారణమువలన బ్రాహ్మణ గ్రంథములకే ఇతిహాసాది నామము లని యెఱుగవలయును. శ్రీమద్ భాగవతాదులకు కాదు.

పూ: బ్రహ్మ యజ్ఞమునువిధించు స్థలములలో బ్రాహ్మణ సూత్రగ్రంథములలో బ్రాహ్మణము, ఇతిహాసము, పురాణము, కల్పము, గాథ, నారాశంసము మున్నగు పదములు గననగును. వానికి మూలము అథర్వ వేదమునందలి 'స బృహతీం దిశ మనువ్యచలత్' అను నిట్టి మంత్రములలో లభించుచున్నది. ఆ మంత్రములలో బ్రాహ్మణాది శబ్దములు ప్రయోగింపబడియున్నవి. కాబట్టి పురాణాది శబ్దములచే బ్రాహ్మణాది గ్రంథములకంటె భిన్నములయిన బ్రహ్మవైవర్త భాగవత మహాభారతాది గ్రంథము లేల గ్రహింపరాదు?

ఉ: ఈ ప్రమాణముల వలన బ్రాహ్మణాదులే గ్రహింపనగును. భాగవతాదులు కావు.

పూ: ఎందువలన?

ఉ: బ్రాహ్మణ గ్రంథములలో నితిహాసాదుల కంతర్భావమగును. భాగవతాది గ్రంథములు చెప్పు మతములు - అభిప్రాయములలో పరస్పర విరోధము లున్నవి. ఎన్నియో యసంభవములగు కథలు వానిలో కల్పితములు వ్రాసియున్నారు. కావున, వానిని ఇతిహాసములనియు, పురాణములనియు నెంచుట యెవరికిని తగదు.

శతపథాది బ్రాహ్మణ గ్రంథములందు 'దేవాసురాః సంయత్తా ఆసన్' 'విద్వాంసులు, మూర్ఖులు పరస్పరము యుద్ధము జేయ సన్నద్ధులైరి' అను నిట్టి వాక్యములు ఇతిహాస మనబడును.

సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయమ్. ఛాందోగ్య. ప్ర. పా. ౬

ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్ కించన మిషత్ ॥

ఐతరేయారణ్యకోపనిషత్ ౧.౧

ఆపో హ వా ఇదమగ్రే సలిలమేవాస ॥ శత ౧౧.౧

ఇదం వా అగ్రే నైవ కించిదాసీత్ మున్నగు ఛాందోగ్య, ఐతరేయ, శతపథాది గ్రంథ వాక్యములందు జగదుత్పత్తి మున్నగు విషయములు వర్ణింపబడియున్నవి. అట్టి బ్రాహ్మణ భాగములు పురాణములనబడును.

(ఇషేత్వోర్జేత్వేతి....) ఇట్టి వేదమంత్రార్థములను దెలుపు భాగములలో పదార్థసామర్థ్యము చెప్పబడుట వలన నవి కల్పము లనబడును.

ఇట్లే శతపథ బ్రాహ్మణమున, జనకుడు, యాజ్ఞవల్క్యుడు, గార్గి, మైత్రేయి మున్నగువారి కథలు చెప్పు భాగములు గాథలనబడును.

'నారాశంసి' శబ్దమునకు 'యజ్ఞము' అర్థమని యాజ్ఞవల్క్యుడంగీకరించినట్లు నిరుక్తమున మున్నది. యజ్ఞమున నుపస్థితులయిన నరులు- మనుష్యులు, స్తుతి (శంసి) పాఠము చేయుదురు కావున 'నారాశంసి' యన యజ్ఞమని యతని అభిప్రాయము. కాని, శాకపూర్ణి ఆచార్యుడు నారాశంసి యన అగ్ని యని చెప్పుచున్నాడు. యజ్ఞాగ్ని మనుజులచే ప్రశంసింపబడును కావున, అగ్నియే నారాశంసి యని యతని మతము. ధర్మము ఈశ్వరుడు మున్నగు పదార్థవిద్యలును, మనుష్యులును నెందు ప్రశంసింపబడుదురో యవి నారాశంసములని యభిప్రాయము.

(బ్రాహ్మణానీతిహాసాన్...) ఈ వాక్యమునందు బ్రాహ్మణ పదము సంజ్ఞి- సంజ్ఞ గలది. ఇతిహాసము సంజ్ఞ. బ్రాహ్మణ గ్రంథములకు ఇతిహాసములు, పురాణములు, గాథలు నారాశంసములు నని నామములని భావము. కావున, బ్రాహ్మణములలోను, నిరుక్తాది గ్రంథములందును నేయే కథ లిట్లట్లు వ్రాయబడినవో, వానినే యితి హాసాది పదములచే గ్రహింపవలయును. ఇతరముల గ్రహింపరాదు.

బ్రాహ్మణ గ్రంథముల కితిహాస మను నామమున్న దనుటకు న్యాదర్శనము కూడ ప్రమాణము

"లోకమున మువ్విధములగు వచనములున్నట్లు బ్రాహ్మణ గ్రంథములందును గలవు. బ్రాహ్మణ గ్రంథములలోని శబ్దములు లౌకికములే కాని, వైదికములు" కావు.

౧. ఆ మువ్విధములగు వాక్యములలో నొక రకమునకు విధి వాక్యమని పేరు. లోకమునందు "సుఖము కొఱకు దేవదత్తుడు గ్రామమునకు వెళ్ళవలయును". అనునది విధి వాక్యము. అట్లే బ్రాహ్మణమున, (అగ్నిహోత్రం జుహుయాత్) "స్వర్గమును కాంక్షించువాడు సుఖము కొఱకు అగ్నిహోత్రమాచరింపవలయును". అను నీ వాక్యము విధి వాక్యముగ నెంచబడును.

౨. రెండవది అర్థవాదము. అది నాలుగు విధములుగ నుండును. ౧. స్తుతి, ౨. నింద, ౩. పరకృతి, ౪. పురాకల్పము.

౧. స్తుతి:- ఫలమును జెప్పిపదార్థముల గుణములను వర్ణించుట. అందువలన మానవులకు ఉత్తమకర్మముల నొనర్చుట యందును, మంచి గుణములను గ్రహించుటలోను శ్రద్ధకలుగును.

౨. నింద :- చెడు ఫలములను వర్ణించి చెడు కర్మములను జేయుటలో గల దోషముల చెప్పుటవలన వానిని చేయకుందురు.

౩. పరకృతి:- ఇతరుడు చేసిన పనిని చెప్పుట. కొండొకచోరుడు చెడుపని చేసినందున నతనికి దండన లభించినది. ఒక షావుకారు మంచి పని చేసినందున నతనికి ప్రతిష్ఠ కలిగినది.

౪. పురాకల్పము:- పూర్వము జరిగిన వృత్తము. జనకుని సభలో యాజ్ఞవల్క్యుడు, గార్గి, శాకల్యుడు మున్నగువారు చేరి పరస్పర ప్రశ్నోత్తర రూపమున సంవాదమొనర్చిరి. ఇట్టి యితిహాసములు పురాకల్ప మనబడును.

పూ: పరకృతిని, పురాకల్పమును అర్థవాదమని యేల చెప్పుదురు?

ఉ: వీనిలో గూడ స్తుతి, నిందలకు సంబంధించిన వాక్యము లుండును. కొండొక మంచి విషయమున ప్రవృత్తినొనర్చుటకు విధానముండును.

3. బ్రాహ్మణ వాక్యములందలి మూడవ విధము- అనువాదము:- పూర్వము విధించినదానిని స్మరించుటయు, మరల చెప్పుటయు అనువాద మనబడును. ఈ యనువాదము రెండు రకములు. ఒకటి శబ్దమునకు సంబంధించినది. - రెండవది యర్థమునకు సంబంధించినది. అతడు విద్య నేర్వవలయును ఇది శబ్దానువాదము. ఇందు విధి వాక్యములోని శబ్దములే మరల చెప్పబడెను. విద్య నేర్చినందున జ్ఞానము కలుగును. దీని నర్థాను వాదమందురు. ఇందు శబ్దములను మరల చెప్పక వాక్యములోని యర్థము మఱి కొన్ని శబ్దములలో చెప్పబడినది.

ఒక విషయమును ప్రతిజ్ఞచేసి, అది నిరూపించుటకు - హేతువు, ఉదాహరణము, ఉపనయనము, నిగమనము చెప్పి వివరించుటయు అనువాదమగును. ప్రతిజ్ఞ:- పరమేశ్వరుడు- నిత్యుడు. హేతువు- వినాశ రహితుడగుటవలన. ఉదాహరణము:- ఆకాశమువలె. ఉపనయనము - ఎట్లు ఆకాశము నిత్యత్వధర్మమును సాధించు వినాశరహితత్వ మనెడి ధర్మముతో కూడి యున్నదో యట్లే పరమేశ్వరుడు కూడ. పై నాలుగింటిని (ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయములు) క్రమముగా నుచ్చరించి పక్షము (సాధ్యాధికరణము) నందు వానిని బాగుగ సమన్వయ పఱచి చెప్పుట నిగమన మందురు. అందువలన పరమేశ్వరుడు కూడ వినాశ రహితుడై నందున - ఆకాశము వలె నిత్యుడు. ఇదియే నిగమనము ఈ ప్రయోగమునందేయే శబ్దములు, అర్థములు రెండవ పర్యాయ ముచ్చరింపబడినవో, ఆలోచింపబడినవో వానిని అనువాద మందురు. ఇయ్యది బ్రాహ్మణ గ్రంథములలో బాగుగ వ్రాయబడినది. అందువలనను బ్రాహ్మణ గ్రంథములు ఇతిహాసాది నామములతో చెప్పబడునని గ్రహింపనగును. వీనిలో ఇతిహాసము, పురాణము, కల్పము, గాథ, నారాశంసము నను నీ యైదు విధములగు కథలన్నియు సరిగా వ్రాయబడియున్నవి. భాగవతాదులలోనసత్యపు కథలు మిక్కిలిగ నున్నవి. సత్యకథలు లేవు. కావున వాని నితిహాసము లనరాదు. వాత్స్యాయనముని, ఇతిహాసమున కిట్లు లక్షణము కూడ చెప్పి యున్నాడు:-

ఏ విషయములు పరంపరగా వినుచున్నామో, వేనిని చెప్పిన వ్యక్తులు ఫలానా అని నిశ్చితముగ జెప్పజాలమో, కాని, యేవి సత్యములో యవియే యితిహాస మనబడును.

అందువలననే యితిహాసము శబ్దప్రమాణాంతర్గత మైయున్నది. శబ్దప్రమాణము, ఇతిహాసము రెండును సత్యములే. కావున భాగవతాది గ్రంథములలో నట్టి సత్యము లేనందున నవి యితిహాసములు కావు.

బ్రాహ్మణ గ్రంథములు వేదవ్యాఖ్యానములే కాని వేద (నామక) ములు కావు. కారణ మేమన: (ఇషేత్వోర్జేత్వేతి) 'ఇషేత్వా' 'ఊర్జేత్వా' అని వేదమంత్రములలోని పదములు గ్రహించి వానికి వ్యాఖ్యానము చేసి యున్నందున నవి వ్యాఖ్యాన గ్రంథములే యగును; మూల వేదములు కావు. మంత్రభాగమున నెక్కడను బ్రాహ్మణ గ్రంథవాక్యములలోని పదములు ప్రతీకగా గ్రహించి, వాని కర్థము చెప్పుట జూడ నేరము. దీనింబట్టి ఈశ్వరోక్తములు- మంత్రభాగములే యనియు - అవియే సంహితలు, వేదములు ననబడుననియు స్పష్టమగు చున్నది. బ్రాహ్మణములు వేదములు కావు.

వ్యాకరణ మహాభాష్యప్రమాణమును బట్టియు బ్రాహ్మణములు వేదములు కావని తెలియుచున్నది. మహాభాష్యమునందు వేదములకు సంబంధించిన భిన్న భిన్న ఉదాహరణములు చూపబడినవి. 'గౌః అశ్వః' అను పదములు లౌకికములనియు, 'శన్నో దేవీ రభిష్టయ' అను మంత్రములు వైదికములనియు నుదాహరింపబడినవి. వైదిక శబ్దముల కుదాహరణములుగా నిచ్చిన వాక్యములలో బ్రాహ్మణ గ్రంథపు వాక్య మొక్కటియు లేదు. లౌకిక పదముల నుదాహరణముగా నిచ్చి 'గౌః అశ్వః' అనునవి బ్రాహ్మణ గ్రంథములలోనివే. కారణ మేమన? వానిలో నట్లే యున్నది. అందువలన బ్రాహ్మణములకు వేదనామము లేదు.

'ఛందస్సు', 'బ్రాహ్మణము' అను వానికి రెంటికి వేదసంజ్ఞ యున్నదను పక్షమున, పాణినిమునిచే వ్రాయబడిన 'చతుర్థ్యర్థే బహులం ఛందసి' అను సూత్రమునందు 'ఛందసి' అను పదము చేర్ప నక్కరలేదు. కారణ మడుగుదురేని, వినుడు - ఆ సూత్రమునకు పూర్వపు సూత్రమునందు 'ద్వితీయా బ్రాహ్మణే' అని బ్రాహ్మణశబ్దమున్నది. ఆ శబ్దము 'చతుర్థ్యర్థే బహులమ్' అను సూత్రమునందనువర్తించును. 'ఛందసి' అను పదము బ్రాహ్మణ పదమునకు పర్యాయము కాబట్టి, మరల ఛందసి అని సూత్రమున చేర్పవలసిన పని యేమున్నది? చేర్పబడినది కావున బ్రాహ్మణము, ఛందస్సు, అను రెండు పదములు పర్యాయములు కావని స్పష్టమగుచున్నది. కావున బ్రాహ్మణములు- వేదములు, ఛందస్సులు కావని సిద్ధమగుచున్నది.

'పురాణప్రోక్తేషు' అను నిట్టి పాణినిముని ప్రయోగముల ననుసరించి పురాణ - ప్రాచీన బ్రహ్మాది ఋషులచే చెప్పబడిన (ప్రోక్తములు) బ్రాహ్మణ కల్పాది గ్రంథములు వేదవ్యాఖ్యానము లనియే తెలియుచున్నది. కావున నీ బ్రాహ్మణ గ్రంథములకే పురాణములు, ఇతిహాసములు అను నామము వర్తించును.

పూ: దీనివలన నేమి సిద్ధించును?

ఉ: 'బ్రహ్మ' యని బ్రాహ్మణునకు నామము. కావున బ్రహ్మాది వేదవిదులయిన మహర్షులచే వ్రాయబడిన ఐతరేయ శతపథాది బ్రాహ్మణములు వేదవ్యాఖ్యానములని దీనివలన సిద్ధమగుచున్నది.

శతపథమున 'బ్రహ్మ' శబ్దమునకు బ్రాహ్మణుడనియు, 'క్షత్ర' శబ్దమునకు రాజన్యుడనియు వ్రాయబడినది. ఇట్లే వ్యాకరణ మహాభాష్యమునందును 'వృషన్, వృష' శబ్దములు: బ్రహ్మ, బ్రాహ్మణశబ్దములు సమానార్థకములనియు వ్రాయబడియున్నది.

సహచారోపాధిలక్షణ ననుసరించి వేదములకు బ్రాహ్మణములు సహచరితములై నందున కాత్యాయనుడు మంత్ర, బ్రాహ్మణములు రెండును వేదములే యని చెప్పినాడనుటయు తగదు. (సహచారోపాధి లక్షణకు ఉదాహరణము:- ఒకడు మఱియొకనితో ఆ దండమునకు భోజనము పెట్టుము' అనిన అదివినిన వ్యక్తి దండము- కఱ్ఱ- భోజనము చేయలేదు. కావున దండము పట్టుకొనిన వ్యక్తికి భోజనము పెట్టుము అని చెప్పినట్లు గ్రహించి యట్లు చేయును.) బ్రాహ్మణములు వేదసంజ్ఞకలవిగా జెప్పుటకీ లక్షణ' యుపయోగింపదని యభిప్రాయము.

పూ: ఎందువలన?

ఉ: సహచారోపాధిలక్షణతో బ్రాహ్మణములకు వేదసంజ్ఞ గలిగినదని కాత్యాయనుడు కూడ చెప్పలేదు. ఇతర ఋషులలో నొక్కరు కూడ బ్రాహ్మణములకు వేదనామ మున్నట్లు చెప్పియుండను లేదు. కాబట్టి బ్రాహ్మణములు వేదములు కావు. ఇట్లనేక ప్రమాణముల మూలమున మంత్రభాగములే వేదములనియు, బ్రాహ్మణములు వేదములు కావనియు నిశ్చిత మగుచున్నది.

పూ: వేదములవలె బ్రాహ్మణములు కూడ తుల్య ప్రమాణములేనా?

ఉ: బ్రాహ్మణములు వేదములకు తుల్యప్రమాణములుకావు. కారణమేమి? అన; అవి ఈశ్వరోక్తములు కావు. కావున వేదానుకూలముగ నున్నంతవఱకు నవి ప్రమాణములని యెంచవలెను. (బ్రాహ్మణములు వేదమునకు విరుద్ధముగా జెప్పు లావున, వేదములే ప్రమాణములగును. బ్రాహ్మణములు కావు).

## వేదాలలో బ్రహ్మవిద్య

**త మీశానం జగత స్తస్థుషస్పతిం ధియం జిన్వ మవసే హూమహే వయం**
**పూషా నో యథా వేదసామస ద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే॥**
**ఋ. ౧.౮౯-౫**

**తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షు రాతతమ్.॥**
**ఋ.౧.౨౨-౨౦.**

పూ: వేదములందు సర్వవిద్యలు మున్నవా లేవా?

ఉ: మూలరూపమున నన్నియు నున్నవి. ప్రపంచమున గల సత్యవిద్యలన్నియు వేదములనుండియే వెలువడినవి. వానిలో మొదట బ్రహ్మవిద్యను గూర్చి సంక్షేపముగ నిట వ్రాయుచున్నాము.

తమీశాన మంత్రార్థము:- (తమీశానం) సర్వజగత్కర్తయు, (జగతస్తస్థుషః పతిం) చరాచరాత్మక జగత్తును పాలించు, (ధియం జిన్వమ్) మానవబుద్ధి నానందముచే నింపువాడును నగు పరమేశ్వరుని, (అవసే హూమహే) రక్షణకొఱకు మన మాహ్వానించుచున్నాము. ప్రార్థించుచున్నాము. (పూషానః) అతడు మన పోషణకర్త, (యథావేదసామసద్ వృధే) ఓ పరమేశ్వరా! నీవు కృపతో మా సర్వవిద్యలను, సువర్ణాదిధనములను నెట్లు వర్ధిల్లజేయుదువో

యట్లే, (రక్షితా) ఎల్లరకు రక్షకుడవుగమ్ము, (పాయురదబ్ధః స్వస్తయే) నీ వెట్లు మమ్ములను రక్షించుచున్నావో, అట్లే యనలసుడవై సర్వసుఖములను ప్రసాదింపుము.

(తద్విష్ణోః...) అను నీ మంత్రమున కర్థము వేదవిషయ ప్రకరణమున బాగుగ వివరింపబడినది. అక్కడ జూడవచ్చును.

**పరీత్య భూతాని, పరీత్య లోకాన్, పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ.**

**ఉపస్థాయ ప్రథమజామృతస్యాత్మనాత్మానమభిసంవివేశ. ౩**

యజు. ౩౨-౧౧

(పరీత్య....) ఆకాశాది పంచభూతములందును, సూర్యాది లోకములలోను, పూర్వాది దిక్కులందును, ఆగ్నేయాది దిక్కోణములందును పరమేశ్వరుడు నిరంతరము వ్యాపించి యున్నాడు. ప్రత్యణువు నతనితో నిండియున్నది. అతడు సర్వము నెఱుగును. (ఋతస్య...) ఎవడు తన సామర్థ్యమునకు దానే యాత్మయో, (ప్రథమజాం) ఎవడు కల్పారంభమున సృష్టి నొనరించునో, ఆ ఆనందస్వరూపుడగు పరమేశ్వరుని తన మనస్సు-సామర్థ్యములతో సరిగా నెఱుగు జీవుడే యతనిని బొందును. (అభిసంవివేశ) ఎల్లపుడు మోక్షసుఖము ననుభవించును.

**మహద్యక్షం భువనస్య మధ్యే తపసి క్రాంతం సలిలస్య పృష్ఠే.**

**తస్మిఞ్ఛ్రయంతే య ఉ కే చ దేవా వృక్షస్య స్కంధః పరిత ఇవశాఖాః ౪.**

అథర్వ. ౧౦. ౭-౩౮

(మహద్యక్షం) బ్రహ్మము అన్నింటికంటెను పెద్దది. అది మానవులందరికి పూజ్యము. (భువనస్య...) లోకములకన్నింటికి మధ్యమందే యుపాసింప దగియున్నది. (తపసి క్రాంతం) విజ్ఞానాది గుణములలో నన్నింటికంటె పెద్దది. (సలిలస్య పృష్ఠే) అంతరిక్ష - ఆకాశమునకు గూడ నాధారమై, అందే వ్యాపకమై, తరువాత జగత్తు ప్రళయమైన తరువరి కూడ నిత్యమై, నిర్వికారమై యుండును (తస్మిన్ శ్రయంతే.....) అతని యాశ్రయముననే పూర్వము చెప్పబడిన వస్వాది ముప్పదిమూడు దేవతలు నున్నవి. (వృక్షస్య స్కంధః పరితః శాఖాః) మొదట భూమినుండి యంకురముద్భవించి, అదియే స్థూలమై స్కంధమనబడి, క్రమముగా శాఖల కాధారమగును. ఇట్లే సమస్త బ్రహ్మాండమున కాధారము పరమేశ్వరుడగును.

**న ద్వితీయో న తృతీయశ్చతుర్థో నాప్యుచ్యతే. ౫**

**న పంచమో న షష్ఠః సప్తమో నాప్యుచ్యతే ౬**

**నాష్టమో న నవమో దశమో నాప్యుచ్యతే ౭**

**తమిదం నిగతం సహః స ఏష ఏక ఏకవృదేక ఏవ. ౮**

**సర్వే అస్మిన్ దేవా ఏకవృతో భవంతి. ౯**

అథర్వ. ౧౩-౪-౧౬, ౧౭, ౧౮, ౨౦, ౨౧

(న ద్వితీయో న...) ఈ మంత్రము లన్నింటి మూలమును, పరమేశ్వరుడొక్కడే. అతనికి భిన్నముగా రెండవవాడు, మూడవవాడు, నాల్గవవాడు ననదగు పరమేశ్వరుడెవడును లేడు అని నిశ్చితమగుచున్నది.

(న పంచమో న....) ఐదవవాడుగాని ఆఱవవాడుగాని, ఏడవవాడుకాని ఈశ్వరుడనబడువాడు లేడు.

(నాష్టమో న...) ఎనిమిదవ, తొమ్మిదవ, పదవవాడు ఈశ్వరుడనదగినవాడింకొకడు లేడు.

ఈ మంత్రములలో, రెండు మొదలు పదివఱకు గల సంఖ్యను లెక్కించి ఒక్కనికి మించి మరియొక యీశ్వరుడు లేడని నిషేధింప బడినది. సర్వసంఖ్యలకు మూలము - ఒకటి (౧) యను సంఖ్యయే యని దీని యభిప్రాయము. ఆ యొకటితోనే రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది (౧,౨,౩,౪,౫,౬,౭,౮,౯) సంఖ్యలేర్పడుచున్నవి ఒకటికి తరువాత సున్న పెట్టిన (౧౦) పది యగును. ఈ సంఖ్యలతో నీశ్వరుడొక్కడే యనియు, వేదములందింకొక యీశ్వరుడు వర్ణింపబడ లేదనియు నిర్ణయింపబడినది. భగవంతుని యేకత్వమునందును భేదము లేదు. అతడు శూన్యుడును కాడు. అందువలన నతనిని విడిచి యన్యు నుపాసింపరాదనియు నిషేధింపబడినది. అతడు సచ్చిదానందాది లక్షణయుక్తుడు; ఏకరసుడు. అతడే యెల్లపుడు సమస్తజగత్తునందును పరిపూర్ణుడై యున్నాడు. జడ-చేతనాత్మకమగు నీ జగత్తు నీక్షించును. అతనిని జూచు ద్రష్ట లేడు. అతడు స్వయముగ నెవరికిని దృశ్యుడును గాడు. ౮

సంపూర్ణ విశ్వమునందు వ్యాపకుడైయున్న పరమేశ్వరుని కీ జగత్తంతయు (నిగతం) నిశ్చితము ప్రాప్తమై యున్నది. వ్యాపకముతో వ్యాప్యమునకు సంయోగ సంబంధ ముండును. (సహః) పరమేశ్వరుడు సర్వము సహించును; కావున నతడు 'సహుడు' అనబడును. అతడొక్కడే. అతనికి తుల్యుడు కాని, అతనికంటె నధికుడుకాని మరియొకడులేడు. ఈ మంత్రమున 'ఏకః ఒక్కడు'. ఒక్కడు అను పదము మూడుపర్యాయములు ప్రయోగింపబడినది. కావున పరమేశ్వరుడొక్కడే యని తెలియుచున్నది. ౧. అతనిలో సజాతీయ భేదమును లేదు. అతని కంటె నెక్కుడు సామర్థ్యము గల పరమేశ్వరుడుకాని, అతనికంటె తక్కువ సామర్థ్యముగల పరమేశ్వరుడుకాని లేడు. ౩. అతనిలో స్వగత భేదముకూడ లేదు. అతనిని ఖండించి విభజించుటకు వీలు లేదు - అతడేకరసుడు.

పూ: ఎందువలన?

ఉ: మంత్రమున 'ఏకవృదేక ఏవ' అని యున్నది. అది యొక చేతనము మాత్రమే. ఆ పరమేశ్వరుడు పృథివ్యాది సమస్త లోకములను సృష్టించి, తన సామర్థ్యముతో ధరించి యున్నాడు. అతడు తన సృష్టి రచనాదికార్యమున నితర సహాయ మపేక్షింపడు. అతడు సర్వశక్తిమంతుడు.

(సర్వే అస్మిన్) ఆ పరమాత్ముని సామర్థ్యమునందే వస్వాది సర్వదేవతలు- పృథివ్యాది సర్వలోకములు- నిలిచియున్నవి. ప్రళయమున నందును నతని సామర్థ్యము నందే సూక్ష్మరూపమున నుండును.

## వేదోక్త ధర్మవిషయము

**సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్**
**దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే. ౧.** ఋ.౧౦-౧౯౧-౨

(సం గచ్ఛధ్వం) పరమేశ్వరుడు మానవుల నుద్దేశించి యీ మంత్రమున ధర్మము నుపదేశించుచున్నాడు - ఓ మానవులారా! పక్షపాతరహితమును, న్యాయసత్యాచరణములతో గూడినదియునగు ధర్మమునే గ్రహింపుడు. దానికి విపరీతముగ నెన్నడు నడవకుడు. దాని పొందుటకే విరోధము విడిచి పరస్పర సాంగత్యము చేయుడు. అందువలన మీ కెల్లప్పుడు నుత్తమ సుఖము వర్ధిల్లును; దుఃఖము కలుగదు. (సం వదధ్వమ్) జల్పము, వితండ, మున్నగు విరుద్ధవాదములను విడచి పారస్పరిక ప్రేమతో చదివి, చదివించి ప్రశ్నోత్తరపూర్వక సంవాద మొనర్పుడు. అందువలన మీలో సత్యవిద్యాది- ఉత్తమ గుణములు పెంపగును. (సం వో మనాంసి జానతామ్) మీరు మీ యథార్థ జ్ఞానమును నిత్యము పెంచుకొనుడు. మీ మనస్సందువలన ప్రకాశయుక్తమగును. ఇట్లే యెల్లపుడు పురుషార్థ మొనర్పుడు. జ్ఞానులయి యున విత్యానందమున నుండగలరు. మీరు ధర్మమునే సేవింపుడు. అధర్మమునుకారు. ఇందులకు దృష్టాంతము- (దేవాభాగం....) పక్షపాతరహితులు, సమ్యగ్ జ్ఞానయుక్తులు ధర్మాత్ములు నగు విద్వాంసులు- ఈశ్వర ప్రియులు, ధర్మోపదేశ ప్రియులు నైనట్లు మీరు కూడ నాధర్మమునుపాసింపదగుదురు. అందువలన వేదప్రతిపాద్య ధర్మము మీకు నిస్సందిగ్ధముగా దెలియును. మీకు పూర్వులు - గతించిన వారుకాని జీవించియున్నవారుకాని విద్యలను జదివి, భజనీయుడును, సర్వశక్తి మత్వాది లక్షణ యుక్తుడు నగు నీశ్వరునెట్లు సేవించిరో, నాచే నుపదిష్ట ధర్మము నెట్లాచరించిరో, అట్లే మీరు నాచరింపుడని భావము. ధర్మజ్ఞానము ముప్పిధముల కలుగును. ౧. ధర్మాత్ములైన విద్వాంసుల శిక్షణ వలనను, ౨. ఆత్మశుద్ధివలనను, సత్యము నెఱుంగు కోరికవలనను, ౩. పరమేశ్వర ప్రసాదితమగు వేదవిద్య నభ్యసించుటవలనను మానవులు సత్యాసత్యములను యథార్థముగ నెఱుగగల్గుదురు.

**సమానో మంత్రః సమితిః సమానీ. సమానం మనః సహచిత్త మేషామ్**
**సమానం మంత్ర మభిమంత్రయే వః సమానేన వో హవిషా జుహోమి.**
౨.ఋ. ౮-౪౯-౩.

(సమానో మంత్రః) ఈశ్వరుడు మొదలు భూమివఱకు గల పదార్థములలో గుప్తములు, ప్రసిద్ధములు నగు సామర్థ్యము, గుణములు దేనిమూలమున దెలియబడునో, లేక దేనియందుపదేశింపబడునో యది మంత్రము- విచారము- అనబడును. సత్యాసత్యములను వేరుచేసి తెలుపగలవాడు కావుననే రాజమంత్రియు మంత్రి యనిపించుకొనును. ఓ మానవులారా! సత్యాసత్యములకు సంబంధించిన మీ విచారణ (మంత్రము) జ్ఞానము, ఫలము సత్యములగు గాక! అయ్యది సర్వోపకారకమై, సమానమై, విరోధరహితమై యుండుగాక! మీరెల్లరు కలసి యాలోచింపుడు. ఆలోచనలు చేయునపుడు ఎల్లరి మాటలు విని, వాని సారమును గ్రహించి, అందరి ధర్మయుక్తములు, సర్వహిత కారకములునగు వానిని వేరు చేయుడు. అట్లు చేసి, వానినే ప్రచారము చేయుడు- అట్లే యాచరింపుడు. అందువలన నెల్లరి సుఖములు క్రమముగా వర్ధిల్లును. (సమితిః సమానీ) మీ సామాజిక నియమవ్యవస్థ

సమానముగా గౌరవమును బొందవలెను. ఎల్లరకు జ్ఞానము విద్యాభ్యాసము లభించునట్లు ఏర్పాట్లు చేయునగును. బ్రహ్మచర్యా ద్యాశ్రమవ్యవస్థ చెడకుండునట్లు చూడవలెను. శుభకర్మములు జరుగుటకు తగిన యేర్పాట్లుండవలెను. రాజ్య వ్యవస్థయు నుత్తమ మానవులసభ మూలమున జరుగునట్లు చూడ వలెను. అందువలన బుద్ధి, శరీరము, బలము, పరాక్రమము మున్నగు గుణ ములు వర్ధిల్లును. పరమార్థము, వ్యవహారము శుద్ధములై యుండు నుత్తమ మర్యాదయు నెల్లరికి నొకటిగ నుండవలెను. అందువలన మీ శ్రేష్ఠకార్యములన్నియు సఫలములగును. (సమానం మనః సహచిత్తం) మీ సంకల్పవికల్పాత్మకమగు మనస్సులో కూడ విరోధముండరాదు.

శుభగుణ ములను బొందవలెనను కోరిక - సంకల్పమనబడును. దుష్టగుణ ములను త్యజింపవలెనను కోరిక- వికల్పము. మీ చిత్తము కూడ నొకటిగ నుండవలెను. ఎల్ల యర్థములను స్మరించునట్టిదియు, పూర్వాపర కర్మములను సరిగా విచారించునదియు, ధర్మమును, ఈశ్వరుని గూర్చి యాలోచించు నదియు చిత్తమనబడును. సర్వప్రాణుల దుఃఖముల నశింపజేయుటకును, సుఖమును జేకూర్చుటకును మీ చిత్తము సమానముగ పురుషార్థ మొనర్చునదిగ నుండవలెను. (సహ) మీరు పరస్పరము నొకరి సుఖముకొఱకింకొకరు పాటుపడవలెను. పరోపకారము చేయునుద్యుక్తులై యుండవలెను. (ఏషాం) ఇట్లు పరులకెల్లరకు నుపకారము చేయుచు సుఖము నొడగూర్చువారిపై నే నెల్లప్పుడు కృపగలిగి యుందును. (సమానం మంత్ర మభిమంత్రయే వః) నా యీ యాజ్ఞకనుకూలముగ నడచు కొనువారి నాశీర్వదింతును; ఆజ్ఞాపింతును. అందువలన వారి సత్యధర్మము వర్ధిల్లును- అసత్యము నశించును. (సమానేన వో హవిషా జుహోమి) ఓ మానవులారా! మీరొక వస్తువును మరియొకని కిచ్చునపుడును మరియొకనినుండి మీరు గ్రహించునపుడును నది ధర్మయుక్తముగ నుండునట్లు చూడుడు. అందులకు విరుద్ధముగా నెన్నడు వ్యవహరింపకుడు. సత్యముతో మిమ్ములను, మీతో సత్యమును జోడింతునని మీరు నిశ్చయముగ నెఱుగుడు. కావున మీరు మానవులు దీనినే ధర్మమని యెఱింగి యెల్లపుడు నాచరింపుడు. ఇందుకు భిన్నమైనది యధర్మమనియు నెఱుగుడు.

**సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః**

**సమాన మస్తు వో మనో యథా వః సుసహాసతి.** ఋ. ౧౦, ౧౯౧-౪.

**కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా**

**ధృతి రధృతిర్ హ్రీర్ ధీర్ భీరిత్యేత త్సర్వం**

**మన ఏవ తస్మా దపి పృష్ఠత** శత. ౧౪-౪.

**మనసా విజానాతి...** **ఉపస్పృశ్య రమనష్ఠతవ్యమ్.**

(సమానీవ ఆకూతిః) (ఈశ్వరుడీమంత్రమున మానవుల నుద్దేశించి యుపదేశించుచున్నాడు.) ఓ మానవులారా! మీ సామర్థ్యము నంతటిని ధర్మముతో జోడించి సర్వసుఖముల నెల్లపుడు పెంపుజేసి కొనుడు. నిశ్చయము, ఉత్సాహము, ధర్మాత్ముల యాచరణము 'ఆకూతి' యనబడును. అట్టి మీ యాకూతి 'మానవులార' ! పరస్పరోపకారము కొఱకును, సర్వజీవుల సుఖము కొఱకును నగు గాక! అందువలన నా యుపదిష్టధర్మము త్యజింపబడకుండును. అట్లు సతతము ప్రయత్నించుచుండురేని, (సమానా హృదయాని వః) మీ హృదయములు - మానసిక వ్యవహారములన్నియు నెల్లపుడు విరోధము లేనివై ప్రేమసహితములై యుండును. (సమాన మస్తు వో మనః) ఈ మంత్రమున మనః శబ్ద మనేక పర్యాయములు గ్రహింపబడుటవలన మనశ్శబ్దమున కనేకార్థము లున్నవని తెలిసికొనవలెను. ఇందులకు శతపథము ప్రమాణము. (కామః సంకల్పో......) ప్రథమమున చక్కగ నాలోచించియే యెల్ల ఉత్తమ వ్యవహారము లాచరింపవలెను.

౧. కామః :- శుభగుణేచ్ఛ- మంచిగుణ ములను గోరుట.

౨. సంకల్పః :- సుఖము, విద్య మున్నగు శుభగుణములను బొందుటకు ప్రయత్నపూర్వకముగ పురుషార్థ మొనర్చుటకై కోరుట సంకల్ప మగును.

౩. విచికిత్సా :- చేయుదలచిన పనిలో ముందు శంకించి సరియైన నిశ్చయముకొఱకు జేయు సందేహము విచికిత్స యనబడును.

౪. శ్రద్ధా:- ఈశ్వరునియందు, సత్యధర్మము మున్నగు శుభగుణముల యందును నిశ్చయపూర్వక విశ్వాసమును స్థిరముగ నుంచుట- శ్రద్ధ.

౫. అశ్రద్ధా :- అవిద్య, కుతర్కము, దుష్కర్మాచరణము, ఈశ్వరు నంగీకరింపకుండుట, అన్యాయాది దుర్గుణములనుండి దూరముగ నుండుట- అశ్రద్ధ యగును.

౬. ధృతిః :- సుఖదుఃఖములు, హానిలాభములు కలిగినపుడు కూడ నీశ్వరునిపై, ధర్మముపై నిశ్చయము కలిగియుండి ధైర్యమును విడువకుండుట.

౭. అధృతిః :- చెడు కర్మలలో దృఢత లేకుండుట.

౮. హ్రీః :- అసత్యాచరణము చేయుటలోను, సత్యాచరణమును జేయకుండుటలోను సిగ్గు పడుట.

౯. ధీః :- శ్రేష్ఠగుణములను శీఘ్రముగ ధారణ చేయువృత్తి.

౧౦. భీః :- ఈశ్వరాజ్ఞ - సత్యము నాచరించుట, ధర్మము నాచరించుట, వీనికి విరుద్ధములైన పాపాచరణము నెప్పుడు భయపడుట - ఈశ్వరుడు మన కర్మములన్నింటిని జూచును - అని యెంచి యతనికి భయపడుట - పాపముచేసిన ఈశ్వరుడు తనపై నప్రసన్నుడగునని యెంచుట - మున్నగు గుణములు భీః భయమనబడును.

ఇట్టి మీ మనస్సు సమానముగ నుండునుగాక! ఎల్లరకు సుఖము నొడగూర్చుగాక! (యథా వః సుసహాసతి) ఓ మానవులారా! పూర్వోక్త ధర్మాచరణమువలన మీకు ఉత్తమ సుఖప్రాప్తి గలుగును. పరస్పరము శ్రేష్ఠసహాయము చేసికొనుచు సుఖములను బెంచుకొనుడు. ఇతరుల దుఃఖమును జూచి మనస్సున సుఖ పడకుడు. ఎల్లరు సుఖులై యుండునట్లు సతతము యత్నింపుడు.

**దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యానృతే ప్రజాపతిః**

**అశ్రద్ధా మనృతేऽదధా చ్ఛ్రద్ధాం సత్యే ప్రజాపతిః** యజు. ౧౯-౭౭.

(దృష్ట్వా) సర్వజగత్తునకు స్వామియగు పరమేశ్వరుడు మానవులనుద్దేశించి, మీరు సర్వవిధముల, సర్వకాలములందును, సత్యమునందే ప్రీతి కలిగియుండుడు; అసత్యమునందెన్నడు ప్రీతినుంచకుడు అని యుపదేశించుచున్నాడు.

(ప్రజాపతిః) పరమేశ్వరుడు, (సత్యానృతే) ప్రకటములు, గుప్తములు నగు లక్షణములు గల ధర్మాధర్మములను, (దృష్ట్వా వ్యాకరోత్) తన సర్వజ్ఞత్వరూపమగు విద్యతో వెలుంగిచేయుచేసెను. ఎట్లన:- (అశ్రద్ధాం) మానవులారా! అధర్మము న్యాయమును జేయుటలో శ్రద్ధను జూపకుడు. అశ్రద్ధను జూపుడు. (శ్రద్ధాం) వేదశాస్త్ర విహితమై, ప్రత్యక్షాది ప్రమాణములచే బరీక్షింపబడి, పక్షపాతరహితమైన న్యాయధర్మము నాచరించుటలో నెల్లపుడు ప్రీతినుంచుడు. పరమేశ్వరుని ఆజ్ఞలను పాలించు టలో నెల్లపుడు ఆత్మమనఃప్రాణములనుపయోగించి పురుషార్థ మొనర్చుడు. ఎల్లవేళల సత్యధర్మమునందే ప్రవృత్తులై యుండుడు.

**దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షంతామ్.**

**మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే.**

**మిత్రస్య చక్షుషా సమీక్షామహే** ౫. యజు. ౩౬-౧౮.

మనుష్యులు పరస్పరప్రేమతో నెల్లపుడు వర్తింపవలెనని యీ మంత్రాభిప్రాయము. వేదములం దీశ్వరునిచే విధింపబడిన ధర్మములనే మానవులాచరింపదగుదురు. మానవులకు ధర్మమున ప్రవృత్తి కలుగుటకు వేదోక్తరీతితోనే పరమేశ్వరు నుపాసింపదగును. ఎట్లన: (దృతే) ఓ దుఃఖనాశక! పరమేశ్వరా! మేము పరస్పరము వైరభావమును విడిచి ప్రేమించునట్లు అనుగ్రహింపుము. (మిత్రస్య మా) సర్వ ప్రాణులు నన్ను తమ మిత్రునిగ భావించి బంధువువలె నాతో వర్తించుదురుగాక! ఇట్టి కోరికతో నుండు మమ్ములను (దృంహ) సత్యసుఖముతోను, శుభగుణములతోను వర్ధిల్లజేయుము. (మిత్రస్యాహం) ఇట్లే నేను కూడ మనుష్యాది సర్వప్రాణులను నాకు మిత్రములుగ నెంచి, హాని లాభములలోను, సుఖ దుఃఖములలోను, వానిని నాతో సమానముగ నెంచెదను గాక! (మిత్రస్య చ) మేమెల్లరము పరస్పరము కలిసి మిత్రభావముతో నుందుము గాక! సత్యధర్మము నాచరించి సత్యసుఖములను నిత్యము బొందుదుముగాక! ఇట్లీశ్వరునిచే బోధింపబడిన ధర్మమే మానవులకెల్లరకు స్వీకరింపబడదగి యున్నది.

**అగ్నే! వ్రతపతే వ్రతం చరిష్యామి తచ్ఛకేయమ్**

**తన్మేరాధ్యతామ్, ఇదమహ మనృతా త్సత్య ముపైమి.** యజు. ౧-౫.

మంత్రాభిప్రాయము:- (అగ్నే వ్రత...) మనుష్యులీశ్వరుని సహాయము నపేక్షింపవలెను అతని సహాయములేక ధర్మము పూర్ణముగ తెలియదు. దాని యనుష్ఠానమును పూర్తికాదు. కావున ఓ సత్యపతీ! పరమేశ్వరా! (వ్రతం) నేను సత్యధర్మము ననుష్ఠింపదలచితిని, నీ కృపవలననే యది సిద్ధించును.

సత్యాచరణ రూపవ్రతము నాచరించువారు దేవతలనియు, అసత్యాచరణము నొనర్చువారు మనుష్యులనియు శతపథమున (సత్యమేవ దేవా అనృతం మనుష్యాః, ఏతద్ధై దేవా వ్రతం చరంతి, యత్సత్యమ్ .శ.కాం. ౧.౧) వర్ణింపబడినది.

కావున నేనును సత్యవ్రతము నాచరింపదలచుచున్నాను. (తచ్ఛకేయమ్) సత్యధర్మానుష్ఠానమును పూర్ణ మొనర్చుశక్తి నొసంగి యనుగ్రహింపుము. (తన్మేరాధ్యతాం)

ఆ యనుష్ఠానమును సిద్ధింపజేయుము. ఆ వ్రత మేమన:- (ఇదమహ మనృతాత్ సత్యముపైమి) అసత్యకార్యములనుండి విడివడి యెల్లపుడు సత్యము నాచరించుటలో దృఢముగా నుందును. ఈశ్వరుడు మనుష్యునిలో నెట్టి సామర్థ్యము నుంచెనో, అట్టి పురుషార్థము ధర్మానుష్ఠాన మొనర్చుటలో పరమేశ్వర ప్రార్థనా పూర్వకముగ జూపవలెను. పురుషార్థ మొనర్చి యనంతరము పరమేశ్వరుని సహాయ మపేక్షింపవలెను. మనుష్యుడు తన పురుషార్థముతో సత్యాచరణ మొనర్చుటకే యీశ్వరుడతనిలో సామర్థ్యము నుంచియున్నాడు. పురుషార్థమొనర్చని వాని నీశ్వరుడు కరుణింపడు. కన్నులున్నవానికే వస్తువులను జూపగలముకాని, అంధునకు జూపలేము. అట్లే సత్యభావముతో పురుషార్థ మొనర్చి ధర్మము నాచరించువానినే, ఈశ్వరుడు కృపతో జూచును; కాని యితరులను జూడడు. కారణమేమన: ఈశ్వరుడు మానవునకు ధర్మానుష్ఠాన మొనర్చుటకును, బుద్ధిని పెంచుకొనుటకును దగిన సాధనముల నిచ్చి యున్నాడు. జీవుడాసాధనముల నుపయోగించి ప్రయత్నించినపుడే పరమేశ్వరుడు తన సర్వ సామర్థ్యముతో నతని ననుగ్రహించును. జీవులు కర్మచేయుటలో స్వాధీనులు, ఫలము ననుభవించుటలో పరాధీనులునై యున్నారు

**వ్రతేన దీక్షా మాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్**

**దక్షిణా శ్రద్ధా మాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే.** య. అ. ౧౯-30

పై మంత్రాభిప్రాయము:- మనుజుడు ధర్మము నెఱుంగ గోరినపుడు, సత్యము నాచరింపదలచినపుడే యీ సత్యము నతడెఱుగును. సత్యమునందే శ్రద్ధ యుంచవలెను. కాని, అసత్యమునందు కాదు. (వ్రతేన) మనుజుడు దృఢతతో సత్యము నాచరించినపుడే దీక్ష- ఉత్తమాధికారమును బొందును. (దీక్షయాప్నోతి) దీక్షితుడై యుత్తమ గుణములతో నుత్తమాధికారియైనపుడతని నెల్లరు సత్కరింతురు. ఆ సత్కారమే యతనికి దక్షిణ యగును. ధర్మాది శుభగుణములతో మనుజుడా దక్షిణను బొందును- లేకున్న నతని కది లభింపదు. (దక్షిణా శ్రద్ధా మాప్నోతి) బ్రహ్మచర్యాది సత్యవ్రతములమూలమున తనకును, నితరులకును సత్కారము లభించినపుడే దానియందు విశ్వాసము గలుగును.

అది యెట్లన? సత్యధర్మాచరణమువలననే మనుజులకు సత్కారము లభించును. (శ్రద్ధయా) సత్యధర్మాచరణమున శ్రద్ధ- విశ్వాసమెక్కువైనకొలది మనుష్యుడు పరమేశ్వరుని, మోక్షధర్మాదులను పొంది, పరమార్థసుఖమును బొందును. అధర్మాచరణమున నట్లు పొందజాలడు.

దీనివలన సిద్ధించిన దేమి? అన; సత్యప్రాప్తికొఱకు సత్యము శ్రద్ధ, ఉత్సాహము, పురుషార్థము నను వానిని మనుజులు సంపాదించు కొనవలెను. వారే సత్యధర్మము లభింపగలరు.

**శ్రమేణ తపసా సృష్టా బ్రహ్మణా విత్తఋతే శ్రితా.** అథర్వ. ౧౨-౫-౧.

'శ్రమేణ' మున్నగు మంత్రములలో ధర్మలక్షణములు చెప్పబడినవి. కావున నీ మంత్రములవలన నియ్యది సిద్ధించును. కావున మనుష్యులెల్లరు శ్రమేణ మున్నగు మంత్రములవలన ధర్మలక్షణములను గ్రహింపవలయును. (శ్రమేణ) పరమప్రయత్నము, (తపసా) ధర్మాచరణము అను ఈ రెండు ధర్మలక్షణములతో కూడియుండునట్లు మానవులను పరమేశ్వరుడు సృష్టించియున్నాడు. కావున (బ్రహ్మణా) వేదవిద్యతోను, పరమేశ్వరుని జ్ఞానముతోను గూడి మానవులు తమ జ్ఞానమును బెంచుకొనవలెను. (ఋతే శ్రితా) బ్రహ్మము, పురుషార్థము, సత్యవిద్య, ధర్మాచరణము నను నిట్టి శుభగుణములను మానవులెల్లరు సేవింపవలెను.

**సత్యేనావృతా శ్రియా ప్రావృతా యశసా పరీవృతాః** అథర్వ. ౧౨-౫-౨.

(సత్యేనావృతాః) మనుష్యులెల్లరు వేదశాస్త్రముల మూలమునను, ప్రత్యక్షాది ప్రమాణములవలనను సత్యమును బరీక్షించి సత్యాచరణ యుక్తులు కావలెను. (శ్రియా ప్రావృతాః) మానవులార! మీరు శుభగుణములతో ప్రకాశితులరయి, చక్రవర్తి రాజ్యాద్యైశ్వర్యములను బొంది, శ్రేష్ఠమగు లక్ష్మితోగూడి, కాంతితో శోభిల్లుడు. (యశసా పరివృతాః) ఉత్తమ గుణములను గ్రహించి, సత్యాచరణముతోను, కీర్తితోను గూడియుండుట మానవులకెల్లరకు దగును.

**స్వధయా పరిహితా శ్రద్ధయా పర్యూఢా**

**దీక్షయా గుప్తా యజ్ఞే ప్రతిష్ఠితా లోకో నిధనమ్.** అథర్వ. ౧౨-౫-3.

(స్వధయా పరిహితా) మనుజులెల్లవిధముల తమ పదార్థములతోను, శుభగుణములతోను గూడినవారై సంతుష్టులగుట నెల్లరకు హితమొనర్పదగును. ఇట్టి యన్నాదియావ్యవహారముపై నెల్లరకు గాఢవిశ్వాస ముండవలెను. సత్యమే విశ్వాసమునకు మూలము; సత్యాచరణమే యా విశ్వాసమునకు ఫలము, స్వరూపమును; అసత్యమెన్నడును గాదు. (దీక్షయా గుప్తాః) విద్వాంసుల సత్యశిక్షణవలన రక్షణ బొందవలెను. మనుష్యాదిప్రాణులను రక్షించుటకు బరమపురుషార్థ మొనర్పవలెను. (యజ్ఞే ప్రతిష్ఠితాః) యజ్ఞము-౧. సర్వము నందు వ్యాపకుడగు

పరమేశ్వరుడు; ౨. సమస్త ప్రపంచమున కుపకార మొనర్చు అశ్వమేధాది యజ్ఞములు, ౩. శిల్పవిద్యాదులలో కుశలత సంపాదించుట- ఈ ముప్పిధములగు యజ్ఞము లందును మనుష్యులెల్లరు సరియైన ప్రవృత్తిగలవారై ప్రతిష్ఠను బొందుదురు. (లోకో విధనమ్) జీవించినంతకాలము పరోపకారకములగు సత్య కర్మములను సాధించుటకు పురుషార్థ మొనరింపుడు - ఇందలసత కూడదు. అను నీ యీశ్వరోపదేశము మానవులెల్లరు పాటింపదగును.

**"ఓజశ్చ తేజశ్చ సహశ్చ బలం చ వాక్ చేంద్రియం చ శ్రీశ్చ ధర్మశ్చ".**
అథర్వ. ౧౨-౫-౭.

(ఓజః చ) ధర్మపాలనయుక్తపరాక్రమము. (తేజః చ) ప్రగల్భత- సత్యవ్యవహారమున భయపడనివాడై దీనతను దరిజేరనీయకుండుట, (సహః చ) సుఖదుఃఖములు, హానిలాభములు మున్నగునవి యొదవినపుడు హర్ష శోకములను విడిచి సత్యధర్మమున దృఢముగా నుండుట, దుఃఖములను నివారించుటయు, సహించుటయును,(బలం చ) బ్రహ్మచర్యాది సునియమముల మూలమున ఆధివ్యాధులను దూరమొనర్చి, తన యంగములను దృఢముగా నుంచుట; బుద్ధిని స్థిరముగ నుంచుట; గొప్పకార్యములను సాధించుటకు వలయు శక్తియుక్త బలమును సంపాదించుట. (వాక్ చ ) తన వాణిని సత్యవిద్యాశిక్షణతో గూడినదిగను, సత్యము, మధురము, కోమలము, ప్రియభాషణము మున్నగు శుభగుణములతో గూడినదిగను జేయుట, (ఇంద్రియం చ) మనస్సును, పంచ జ్ఞానేంద్రియములను, పాప కర్మములనుండి తొలగించి యెల్లపుడు సత్యపురుషార్థములందు వర్తిల్లునట్లు చేయుట. (శ్రీః చ) చక్రవర్తి రాజ్యమునకు వలయు సామగ్రిని చేకూర్చుట. (ధర్మః చ ) వేదోక్తము, న్యాయయుక్తమునై, పక్షపాతములేని సత్యమును సతత మాచరించుచు నసత్యమును త్యజించుట, ఎల్లరకు నుపకారమొనర్చునదై, ఇహ పరజన్మములందానందము ఫలముగాగలది ధర్మమగును; దీనికి విపరీతమైనది యధర్మమగును.(సంగచ్ఛధ్వం) అను మంత్రము మొదలు (యతోఽభ్యుదయ) అను సూత్రము వఱకునెన్ని ధర్మలక్షణములు చెప్పబడినవో యా ధర్మలక్షణములకు చెందినదిగా నీ వ్యాఖ్యానము గ్రహింపనగును. ఇట్టి లక్షణములనే మానవులెల్లరు గ్రహింపవలెను.

బ్రహ్మ చ క్షత్రం చ రాష్ట్రం చ విశశ్చ త్విషిశ్చ
యశశ్చ వర్చశ్చ ద్రవిణం చ. ౧౨ అథర్వ. ౧౨-౫-౮

'బ్రహ్మ' చ మున్నగు మంత్రప్రమాణము మూలమున వేదములందీశ్వరుడే మానవులకెల్లరకు ధర్మమునుపదేశించియున్నాడు. (బ్రహ్మ చ) ఉత్తమ విద్యను సంపాదించి, శ్రేష్ఠకర్మముల నాచరించు వారికే బ్రాహ్మణవర్ణాధికార మియ్యవలెను. వారిచే విద్యాప్రచారము చేయింపవలెను. వారును స్వయముగ విద్యా ప్రచారమున తత్పరులై యుండవలెను. (క్షత్రం చ) కార్యములలో చతురత, వీరత, శూరత, ధీరత గలవారై వీరపురుషులతో యుక్తమగు సేన గలిగియుండి, దుష్టులను దండించుచు, శిష్టులను పాలించుచుండువారికి క్షత్రియ వర్ణాధికారము నొసంగవలెను. (రాష్ట్రం చ) శ్రేష్ఠపురుషులసభచే నిర్ణయింపబడిన మంచి నియమములతో రాజ్యమును సర్వసుఖములతో గూడినదిగ జేయవలెను. ఉత్తమగుణసహాయులై సర్వకార్యములనెల్లపుడు నిర్వర్తించుచుండవలెను. (విశశ్చ) వైశ్యాది వర్ణములవారు వ్యాపారాది వ్యవహారముల కొఱకు భూగోళమున సర్వదేశవిదేశములకు వెళ్ళుటకు, వచ్చుటకు తగిన వ్యవస్థలు చేయవలెను. వారిని బాగుగ రక్షింపవలెను. అందువలన ప్రపంచమున ధనాదులవృద్ధి కలుగును. (త్విషిశ్చ) మానవులలో నెల్లరిలోను నెల్లపుడు సత్యగుణములనే ప్రకాశింప జేయవలెను. (యశశ్చ) ఉత్తమకార్యము లొనర్చి భూమండలమున శ్రేష్ఠకీర్తిని సంపాదించుట యుచితము. (వర్చః చ) సత్య విద్యలను ప్రచారమొనర్చుటకు వలయు పాఠశాలలను నిర్మించి, అందు బాలబాలికలను బాగుగ జదివింపదగు ప్రచారమెల్లపుడు వృద్ధిజేయవలెను. (ద్రవిణం చ) అప్రాప్త పదార్థములను న్యాయపూర్వకముగ పొందగోరవలెను. లభించిన పదార్థములను జక్కగ రక్షింపవలెను. రక్షిత పదార్థములను వృద్ధిజేయవలెను. పెంపు చేసి ధనాదులను ధర్మ ప్రచారాది కార్యములందు వ్యయింపవలెను. ఇట్టి చతుర్విధ పురుషార్థములతో ధనధాన్యాదులను వృద్ధిజేసి, సుఖము నెల్లపుడు నధికము సేయవలెను.

ఆయుశ్చ రూపం చ, నామ చ కీర్తిశ్చ ప్రాణశ్చాపానశ్చ చక్షుశ్చ శ్రోత్రం చ. ౧౩
అథర్వ. ౧౨-౫-౯

(ఆయుశ్చ) వీర్యాది ధాతువులను శుద్ధముగా నుంచుకొని, వానిని రక్షించుట, యుక్తిపూర్వకముగ భోజనాచ్ఛాదనాదుల నొనర్చుట, బ్రహ్మచర్యమును బాగుగ పాలించుట మున్నగు మంచి నియమములతో నెల్లపుడు నాయువును పెంచుకొనవలెను. (రూపం చ) విషయముల నధికముగ సేవింపక, శుద్ధవస్త్రాదులను ధరించుచు శరీర స్వరూపమును కాపాడుకొనవలెను. (నామ చ) ఉత్తమ కర్మముల నొనర్చి, కీర్తి గడింపవలెను. అందువలన నితరులకు గూడ శ్రేష్ఠకార్యముల నొనర్చుటలో నుత్సాహము కలుగును. (కీర్తిశ్చ) శ్రేష్ఠగుణములను గ్రహించునిమిత్తము పరమేశ్వర గుణశ్రవణము చేయవలెను. వాని నితరులకు

నుపదేశింపవలెను. అందువలన యశస్సు పెంపగును. (ప్రాణశ్చాపానశ్చ) శరీరమునుండి వెలుపలకు బోవు వాయువు ప్రాణమనబడును. వెలుపలనుండి శరీరమునందు ప్రవేశించు వాయువు అపానమనబడును యోగాభ్యాసము శుద్ధప్రదేశ నివాసమునందొనర్పవలెను. శ్వాసకోశములనుండి బలపూర్వకముగ వాయువు బయటికి నిశ్వసించి (నాసికాపుటముల ద్వారము వెడల(గక్కి) కొంచెము తడవు వెలుపలి వాయువును శ్వాసకోశములందు నింపక, వానిని శూన్యము (కాళీ) గ నుంచుటవలన శారీరకరోగములు పోగొట్టుకొని బుద్ధినివర్ధిల్ల సేయుము. (చక్షుశ్శ్రోత్రంచ) ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము నను ఎనిమిది ప్రమాణముల జ్ఞానము మూలమున సత్యమును నిత్యము పరిశోధించి గ్రహించుచుండదగును.

పయశ్చ రసశ్చాన్నం చాన్నాద్యం చ ఋతం చ

సత్యం చేష్టం చ పూర్తం చ ప్రజా చ పశవశ్చ.

౧౪ అథర్వ. ౧౨-౫-౧౦

(పయశ్చ రసశ్చ) జలాదులు, క్షీరము, చక్కెర, ఓషధులు, ఘృతము మున్నగువని వైద్యశాస్త్రమున జెప్పినట్లు శుద్ధిచేసి భుజింపవలెను. (అన్నం చాన్నాద్యం చ) బియ్యము మున్నగు భోజ్యవస్తువులను వైద్యక శాస్త్రమునందు జూపినట్లు శుద్ధమొనర్చి భుజింపవలెను. (ఋతం చ సత్యం చ) ఋతం = బ్రహ్మమునే యుపాసింపవలెను. ప్రత్యక్షాది ప్రమాణముల మూలమున హృదయమున నెట్టి జ్ఞానము కలుగునో యట్లే భాషింపవలెను- సత్యము నంగీకరింపవలెను. (ఇష్టం చ పూర్తం చ) ఇష్టం= బ్రహ్మము, దానినే యుపాసింపవలెను. పూర్వనిర్దిష్టయజ్ఞము సమస్త ప్రపంచమునకు నుపకారమొనర్చుచు నదియు నిష్టమనబడును. (పూర్తం చ) అయిష్టసిద్ధి నొనర్చుటకు త్రికరణములతో వలయు నుత్తమపదార్థములను సంపాదించి, పూర్ణమనుష్ఠాన మొనర్పవలెను. ((ప్రజా చ పశవశ్చ)) మనుష్యులెల్లరు తమ సంతానమునకు, రాజ్యమునకును నుత్తమ శిక్షణ నొసంగవలెను. మంత్రమున నేక చకారములను గ్రహించుటవలన నితర శుభగుణములను కూడ గ్రహింపవలెనని తెలియుచున్నది. పై మంత్రములవలన నితర ప్రయోజనములుకూడ ననేకములు సిద్ధించుననియు నూహింపవలెను.

ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ, సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ, తపశ్చ స్వా....దమశ్చ స్వా.... అగ్నయశ్చ స్వా.... అగ్నిహోత్రం చ స్వా..... అతిథయశ్చ స్వా.... మానుషం చ స్వా..... ప్రజా చ స్వా..., ప్రజనశ్చ స్వా... ప్రజాపతిశ్చ స్వా.... సత్యమితి సత్యవచా రాథీతరః. తప ఇతి తపో నిత్యః పౌరుశిష్టిః, స్వాధ్యాయ ప్రవచన ఏవేతి నాకో మౌద్గల్యః తద్ధి తపః తద్ధి తపః.౧.

తైత్తిరీయారణ్యకే ప్ర. పా. ౭, అను

వేద మనూచ్యాచార్యోఽంతేవాసిన మనుశాస్తి, సత్యం వద, ధర్మం చర, స్వాధ్యాయా న్మాప్రమదః, ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవ చ్ఛేత్సీః, సత్యా న్నప్రమదితవ్యమ్, ధర్మాన్నప్ర.... కుశలాన్న ప్రమ.... భూత్యైన ప్ర.....స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్ర....దేవపితృకార్యాభ్యాం న ప్ర.... మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ. అతిథిదేవో భవ. యా న్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి, యాన్యస్మాకః సుచరితాని, తాని త్వయోపాస్యాని, నో ఇతరాణి.

ఏకే చాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణాః, తేషాం త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యమ్. శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయా దేయమ్. శ్రియా దేయమ్. హ్రియా దేయమ్, భియా దేయమ్, సంవిదా దేయమ్, అథయది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణాః సమదర్శినః యుక్తా ఆయుక్తాః. అలూక్షా ధర్మకామాః స్యుః, యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః ఏషఆదేశః, ఏష ఉపదేశః ఏషా వేదోపనిషత్.ఏతదనుశాసనమ్, ఏవ ముపాసితవ్యమ్, ఏవ ముచైత దుపాస్యమ్. ౨ తై. ఆ. ౭-౧౧.

(ఋతం చ ....) మానవులు తమ జ్ఞానమును విద్యను బెంచును పరమేశ్వరునే యుపాసించుట తగును. దానితో బాటు వేదశాస్త్రములను జదువుచు, జదివించుచు నుండవలెను.

(సత్యం చ) ప్రత్యక్షాది ప్రమాణముల ద్వారమున విషయములను జక్కగ బరీక్షించి నీవు తెలిసికొనినట్లు ఇతరులకు జెప్పుము. దానినే యంగీకరించుము. దానితోబాటు చదువుటయు జదివించుటయు నెన్నడు మానకుము( తపశ్చ ......) విద్యలను గ్రహించుటకు బ్రహ్మ చర్యాశ్రమమును బూర్ణముగ పాలించి ధర్మనిరతుడవు కమ్ము( దమశ్చ)...నేత్రాదీంద్రియముల నధర్మమునుండి, ఆలస్యమునుండియు తప్పించి యెల్లపుడు ధర్మమునునుంచుము, (శమశ్చ....) నీయాత్మను, మనస్సును ఎల్లప్పుడు ధర్మమును సేవించుటలో స్థిరముగ నుంచుము. ( అగ్నయశ్చ....) వేదములు, అగ్ని మున్నగు

పదార్థములు ననువాని మూలమున ధర్మార్థకామమోక్షముల సాధింపుము. అట్లేనానావిధములగు శిల్పవిద్యల నభివృద్ధి నొందింపుము.

(అగ్నిహోత్రం చ...) అగ్నిహోత్రము మూలమున వాయువును, వృష్టిజలమును శుద్ధ మొనర్చి, లోకమునకు మేలుచేయుము. అశ్వమేధాద్యుత్తమ యజ్ఞముల ద్వారమున సృష్టికంతటికి నుపకారమొనర్పుము, (అతిథయశ్చ) జగత్తునకంతటికి నుపకృతి యొనర్చుటకు సత్యమును జెప్పుచు, సత్యమే యాచరించుచు పూర్ణ విద్వాంసులై యెల్లరకు సుఖము నాకాంక్షించు సత్పురుషులను సేవించి, సత్యము శోధన మొనర్చి, సంశయములను దొలగొట్టుకొని కర్తవ్యకర్మములను నిరంతరము చేయుచుండుము. (మానుషంచ...) మానవ మర్యాదలకు, రాజ్య ప్రజావ్యవస్థలకు భంగము కలుగని విధమున ధనాదులను సంపాదించి వృద్ధినొనర్పుము. వానిని రక్షించి సత్కార్యములందు వినియోగింపుము. తన్మూలమున ధర్మార్థ కామమోక్షములను చతుర్విధపురుషార్థములను సాధించి జన్మము తరింపజేయుము. (ప్రజా చ...) స్వసంతానమును దగినట్లు పాలింపుము. వారికి మంచి విద్యాబుద్ధులను నేర్పి విద్వాంసుల నొనర్చి యెల్లపుడు వారు ధర్మాత్ములు, పురుషార్థపరులు నగునట్లు చూడుము.

(ప్రజనశ్చ ...) బాలబాలికలను, జన్మసమయమునను, తరువాతను బాగుగ కాపాడి, వారిశరీరమును, బుద్ధిని పెంపుచేయుము.

(సత్యమితి) 'మనుష్యుడు సత్యమునెల్లపుడు చెప్పవలెను' అని రాథీతరాచార్యుని మతము, (తప ఇతి) 'పూర్వోక్త ఋతాదులను సేవించుచు, సత్యవిద్యాభ్యాసమును, సత్యధర్మానుష్ఠానము నెల్లపుడు జేయవలెను' అని పౌరుశిష్టి ఆచార్యుని మతము. కాని, 'స్వాధ్యాయము - వేదాధ్యయనము - అధ్యాపనము' అను నీ రెండు కర్మములే మిక్కిలి శ్రేష్ఠములు. ఇదియే మనుజులుచేయు పరమతపస్సు. ఇంతకుమించిన ధర్మలక్షణ మొండును లేదు? అని మౌద్గల్యుని మతము. ఋతము మొదలు ప్రజాపతివరకు జెప్పబడిన పండ్రెండు ధర్మలక్షణములతో బాటు స్వాధ్యాయ ప్రవచనములు - వేదము చదువుట, చదివించుటయును జోడింపబడినవి. దీనింబట్టి మనుష్యులు సత్యవిద్యలను జదువుటవలనను, జదివించుటవలనను పూర్వస్థితధర్మలక్షణములను సాధింపగలరు. లేకున్న ధర్మానుష్ఠానముపూర్తికాదు అని మౌద్గల్యుని యభిప్రాయము. సర్వగుణములలోను విద్యయే యుత్తమగుణము. కావున స్వాధ్యాయ ప్రవచనములను జరుపుచునే యుండవలెను. దానివలన నెల్లరు నెల్లప్పుడు సుఖమును బొందుదురు.

(వేదమనూచ్య....) ఆచార్యుడు - విద్యాశిక్షణల నొసంగువాడు, తన పుత్రులకు, శిష్యులకును విద్యాధ్యయనము చేయించు సమయమున, అధ్యయనము పూర్తికావచ్చినపుడు కు నిట్లుపదేశింపవలెను:- ఓపుత్రులార ! మీరు సత్యమునే చెప్పుడు. సత్యభాషణాదులు లక్షణములు గాగల ధర్మముల నాచరించి, పరమేశ్వరుని భక్తితోసేవింపుడు. ఇం దాలస్య ప్రమాదముల నొనర్పకుడు. ఆచార్యున కనేకములగు నుత్తమ పదార్థముల నొసంగి ప్రసన్నుని జేయుడు. యువావస్థ వచ్చిన తరువాతనే వివాహమాడి సంతానవంతు లగుదురు గాక ! సత్యధర్మమును విడువకుడు. చతురతతో నుత్తమైశ్వర్యమును సంపాదించి, పెంపుజేయుడు అధ్యయనాధ్యాపనములలో ఆలస్యప్రమాదములను జేయకుడు.

(దేవపితృ...) విద్వాంసులయు, జ్ఞానులయు సాంగత్యము, సేవచేసి, విద్యలను గ్రహించుటలో నాలస్య ప్రమాదము లొనర్పరాదు. తల్లి, తండ్రి, ఆచార్యుడు - విద్యాదాత, అతిథి - సత్యోపదేష్ట యగువిద్వాంసుడు- వీరిని సేవించుటలో నలసత జూపకుడు. సత్యభాషణాది శుభగుణములను, కర్మములను నెల్లపుడు సేవింపుడు. మిథ్యాభాషణాద్యశుభగుణముల గ్రహింపకుడు. శిష్యులార ! మా సుచరితముల- సత్కార్యములను మాత్రము గ్రహింపుడు; కాని దుష్కార్యముల ననుకరింపకుడు. మాలో విద్వాంసులు, బ్రహ్మజ్ఞులు, ధర్మాత్ములు నైనవారినిజేరి, వారి మాటలను విశ్వసింపుడు. వారికి ప్రీతితోగాని, అప్రీతితోగాని, శ్రద్ధతోగాని, లజ్జతోకాని, భయముతోగాని, ప్రతిజ్ఞతోగాని యెల్లపుడు దాన మొనర్పుడు. విద్యాదానము నిరంతరము చేయుచుండుడు. తీసికొనుటకంటె దాన మొనర్చుట శ్రేష్ఠము. మీకేదేని విషయమునందు సంశయము కలిగినపు డావిషయమును గూర్చిపూర్ణ విద్వాంసులు, పక్షపాతరహితులు, ధర్మాత్ములు నగువారి నాలోచించి వారు చెప్పినట్లు చేయుడు. సంశయమును పోగొట్టుకొనుడు. వారాయా ధర్మకార్యములం దెట్లు నడచుకొనిరో యట్లే మీరును వర్తింపుడు. ఇదియే ఆదేశము. అవిద్యను దొలగించి దాని స్థానమున విద్యను, అధర్మమును దొలగించి దానిస్థానమున ధర్మమును స్థాపింపుడు. ఇదియే శిక్షణ, ఉపదేశము ననబడును. ఇట్లే శుభలక్షణములను గ్రహించి యెల్లపుడు పరమేశ్వరుని నుపాసింపుడు.

తపోలక్షణము-

ఋతం తపః సత్యం తపః శ్రుతంతపః, శాంతంతపోదమస్తపః శమస్తపో.

దానం తపో, యజ్ఞస్తపో భూర్భువస్స్వర్ బ్రహ్మైతదుపాస్యైతత్తపః.

(ఋతం తపః) తపస్సు ఋతము - యథార్థతత్త్వము నంగీకరించుట తపస్సనబడును. (సత్య) సత్యమును జెప్పుటయు, నాచరించుటయు తపస్సగును. (శ్రుత) సర్వవిద్యలనుగూర్చి వినుటయు, వినిపించుటయు తపస్సగును. (శాంతం) ఉత్తమ కర్మముల నాచరించుట; (శమ) మనస్సును అధర్మమునుండి తొలగించి ధర్మమునందుంచుట, (దాన) సత్యవిద్యాదుల వితరణ కొసంగుట, పూర్వోక్తమగు యజ్ఞము ననుష్ఠించుట, ఇవి యన్నియు తపస్సనబడును. (భూర్..) ఓ మానవ! త్రిభువనములందును వ్యాపకుడైయుండు పరమేశ్వరుని నుపాసింపుము. అదియే తపస్సని యెంచుము. దీనికి విపరీతము తపస్సు కాదు.

**సత్యం పరం పరꣳ సత్యꣳ సత్యేన న సువర్గాల్లోకాచ్చ్యవంతే కదాచన. సతాంహి సత్యం, తస్మాత్ సత్యే రమంతే. తప ఇతి తపో నానశనాత్ పరం, యద్ధి పరం తపస్తద్దుర్ధర్షం, తద్దురాధర్షం; తస్మాత్తపసి రమన్తే. దమ ఇతి నియతం బ్రహ్మచారిణ స్తస్మాద్దమే రమన్తే. శమ ఇత్యరణ్యే మునయస్తస్మాచ్ఛమే రమన్తే, దానమితి సర్వాణి భూతాని ప్రశꣳసంతి దానాన్నాతి దుష్కరం తస్మాద్దానే రమన్తే. ధర్మ ఇతి ధర్మేణ సర్వమిదం పరిగృహీతం, ధర్మాన్నాతిదుశ్చరం తస్మాద్ధర్మే రమన్తే. ప్రజన ఇతి భూయాꣳస స్తస్మాద్ భూయిష్ఠాః ప్రజాయంతే, తస్మాద్ భూయిష్ఠాః ప్రజననే రమన్తే. అగ్నయ ఇత్యాహ, తస్మాదగ్నయ ఆధాతవ్యాః. అగ్నిహోత్రమిత్యాహ. తస్మాదగ్నిహోత్రే రమన్తే. యజ్ఞ ఇతి యజ్ఞేన హి దేవా దివంగతా స్తస్మాద్యజ్ఞే రమన్తే. మానసమితి విద్వాꣳస, స్తస్మాద్ విద్వాꣳస ఏవ మానసే రమన్తే. న్యాస ఇతి బ్రహ్మా, బ్రహ్మా హి పరః, పరో హి బ్రహ్మా, తాని వా ఏతాన్యవరాణి తపాꣳసి, న్యాస ఏవాత్యరేచయత్. య ఏవం వేదేత్యుపనిషత్. ౪** తై. ఆ. ౧౦-౬-౨

(సత్యం పరం) సత్యభాషణము, సత్యాచరణముకంటె నుత్తమ లక్షణము ధర్మమున కొండులేదు.

పూ: కారణమేమి?

**ఉ:** సత్యమువలననే మనుజుల వ్యవహారము నిర్వర్తింపబడును; ఉత్తమ ముక్తి-సుఖము లభించును. దానివలన నా యుత్తమ సుఖము నుండి విడివడి దుఃఖము ననుభవింపరు. సత్పురుషులలో గల సత్పురుషత్వముకూడ సత్యమే. కావున నెల్లరు సత్యమునందే రమింపవలెను.

(తప ఇతి) అన్యాయముతో నన్యుని పదార్థమును గ్రహింపకుండుట తపస్సనబడును. ఋత సత్యాదులు కూడ తపస్సులక్షణములని పూర్వము చెప్పబడినది. తపస్సు మిక్కిలి ఉత్తమము. ఆచరణలో కఠినమైనను బుద్ధిమంతులకు దాని నాచరించుట సుగమమే యగును. కావున తపస్సునందే నిత్యము నిశ్చితముగా నుండుటయే మంచిది

(దమ ఇతి) ఇంద్రియములను వశపఱచుకొని, సదా విద్యాభ్యాసము, ధర్మాచరణము నొనర్చుట దమ మనబడును. మానవులిందు నిత్యము వర్తింపవలెను.

(శమ ఇతి) క్రోధాది దోషముల నంతఃకరణమునుండి తొలగించి, మునివృత్తితో నెల్లరు నేకాంతవాసము చేయవలెను. (దానమితి) దానము నెల్లరు స్తుతిచేయుదురు. దానముకంటె మించిన కఠినకర్మ ఇంకొకటిలేదు. దానివలన శత్రువులు కూడ మిత్రులగుదురు. కావున నెల్లరు దానముసేయు స్వభావము సంపాదించుకొనవలెను. (ధర్మ ఇతి) ధర్మమునకు లక్షణ మింతకు పూర్వమే వ్రాసియుంటిమి. ఇకముందు చెప్పు లక్షణములు నీ ధర్మమునకు జెందినవే. న్యాయము-పక్షపాతము విడిచి సత్యాచరణ మొనర్చుట, అసత్యమును త్యజించుట ధర్మమనబడును. అట్టి ధర్మము వలననే యీ ప్రపంచము నడచుచున్నది. ఈ ధర్మమన్నింటికంటెను కఠినము, నుత్తమమునై ఉన్నది. (ప్రజన ఇతి) ప్రజననమువలన మనుష్యుల వృద్ధికలుగును. దీనిలో మనుజులురమింతురు. కావున జన్మము ప్రజననము. (అగ్నయ ఇతి) వేదములు, అగ్ని మున్నగు పదార్థములు. వీనివలన సర్వశిల్పవిద్యలు సిద్ధముచేసి కొనవలయును. (అగ్నిహోత్రం చ) అగ్నిహోత్రము మొదలశ్వమేధము వఱకు గల హోమాదుల నొనర్చి సర్వజగత్తున కుపకార మొనర్చుటకు యత్నింపవలెను. ఈ యజ్ఞవిద్య వలననే విద్వాంసులు సుఖించిరి.

(మానసమితి) ఆలోచింపువారు విద్వాంసులగుదురు. విద్వాంసులందువలననే ఆలోచన-విచారణలో నెల్లప్పుడు రమింతురు. మనస్సునకు విజ్ఞానాది గుణములతో సంబంధమున్నది. ఆ విజ్ఞానాది గుణముల నిమిత్తమే యీశ్వరుడు సృష్టినిజేయును. జీవుడును ప్రపంచములో వ్యవహారోపయోగి పదార్థములను కొన్నింటిని నిర్మించును. కావున మనస్సును బలపఱచుటయు, దానిని శుద్ధ మొనర్చుటయు నుత్తమధర్మమగును.

(న్యాసఇతి) బ్రహ్మ-నాలుగు వేదముల నెఱింగి, సాంసారిక వ్యవహారములను విడిచి, సంన్యాసియై-మానవుల కెల్లరకు సత్యధర్మము, సత్యవిద్య, వీని మూలమున లాభము చేకూర్చుచుండవలెను. విద్వాంసులైనవారు ధర్మలక్షణ మెఱిగి యిదియు జేయవలయును.

(సత్యేన వా) సత్యముత్తమము. అది బ్రహ్మము. దానివలన నెల్లలోకములకు ప్రకాశము, వాయ్వాది పదార్థముల రక్షణమును లభించును. సత్యమువలన నెల్లవ్యవహారములు నడచుచున్నవి. పరబ్రహ్మమును బొంది, యుత్తమ సుఖము కూడ బొందగలుగుదుము. సత్పురుషులలో గల సత్ పురుషత్వము సత్యాచరణమే.

(తపసా దేవా) పూర్వోక్త తపస్సువలననే విద్వాంసులు దేవదేవుడగు పరమేశ్వరుని బొందుదురు. కామక్రోధాది శత్రువులను జయింతురు. పాపములను విడిచి, ధర్మమున స్థిరులగుదురు. కావున తపస్సు శ్రేష్ఠము.

(దమేన...) దమమువలన మానవుడు పాపములను వదిలి, బ్రహ్మ చర్యాశ్రమమును నిర్వహించి విద్యనభ్యసించును. కావున దమముకూడ ధర్మమునకొక యుత్తమలక్షణము.

(శమేన....) శమముగల మనుష్యులు శుభము నాచరింతురు. కావున శమముకూడ ధర్మలక్షణములలో నొకటి.

(దానేన...) దానమువలననే యజ్ఞము సంపన్నమగును. దాతల నాశ్రయించి ప్రాణుల జీవనము నడచును. దానమువలన శత్రువులను జయించి మిత్రులుగా జేసికొందురు. కావున నిదియు ధర్మలక్షణమే యగును.

(ధర్మో వి....) సర్వజగత్తుకు ప్రతిష్ఠ ధర్మమే. ధర్మాత్ముని లోకులు విశ్వసింతురు. ధర్మమువలననే మానవులు పాపములు విడుతురు. ఉత్తమ కార్యములన్నియు ధర్మమనియే యెంచబడును. కావున నన్నింటికంటె ధర్మ ముత్తమమని యెంచవలెను.

(ప్రజననం....) ప్రజననమువలన మానవులసంఖ్య పెరుగును. పరంపరను నిలిపి జ్ఞానులసేవ జేయుటవలన ఋణము తీరును. కావున ప్రజననము కూడ ధర్మలక్షణమే. మనుష్యులు పుట్టకున్న ధర్మాచరణ మొనర్చు వారెవరు? కావునను ధర్మము ప్రధానముగ నెఱుగవలెను.

(అగ్నయో వై....) సాంగోపాంగ వేదములను జదువుము. విద్వాంసుల జ్ఞానమార్గమును బొంది, పృథివి, ఆకాశము, స్వర్గము నను ముల్లోకములకు సంబంధించిన విద్యలను నేర్వవగును. కావున అగ్నులు- వేదములు శ్రేష్ఠము లందురు.

(అగ్నిహోత్రం....) అగ్నిహోత్రము చూలనును సాయం ప్రాతఃకాలములలో వాయువును, వృష్టి జలమును దుర్గంధమునుండి విడిపించి వేరుచేసి, సుగంధితములుగ నొనర్చుటవలన నెల్లరకు సుఖ- స్వర్గప్రాప్తి కలుగును. కావున నగ్ని హోత్రము కూడ ధర్మలక్షణమే.

(యజ్ఞ ఇతి) యజ్ఞ విద్యవలననే విద్వాంసులు స్వర్గము - సుఖమును బొందుదురు. శత్రువులను జయించి తమకు మిత్రములుగ జేసి కొందురు. కావున యజ్ఞము కూడ ధర్మమునకు లక్షణమే.

(మానసం వై....) మనస్సు శుద్ధమగుటవలననే విద్వాంసులు ప్రజాపతి- పరమేశ్వరుని నెఱింగి నిత్యసుఖమును బొందుదురు. పవిత్రమగు మనస్సువలననే సత్యజ్ఞానముగలుగును. ఆ మనస్సున విజ్ఞానాదులగు నే (ఋషి) గుణములున్నవో వానిమూలమున నీశ్వరుడు, జీవులును తమ తమ ప్రజలనుత్పన్నము చేయుదురు. (మానసఋషి- జ్ఞానము- ప్రాణము మున్నగు వానిమూలమున ప్రజ - సంతానము కలుగును.) కావున మనస్సును పవిత్రము; విద్యాయుక్తము జేయుటయు ధర్మమే యగును. ధర్మసాధనమే యగును. మనస్సు పవిత్రమగుటవలననే ధర్మ కార్యము లన్నియు సిద్ధించును. ఇవి యన్నియు ధర్మలక్షణములే. ధర్మమునకు గల లక్షణములలో కొన్ని పూర్వము చెప్పబడినవి. ఇంకను కొన్ని ముందు చెప్పబడును.

**సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా, సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్,**
**అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యంతి యతయః క్షీణదోషాః.౧**

ము. ఉ. ౩-౧-౫.

**సత్యమేవ జయతే నానృతం. సత్యేన పంథా వితతో దేవ యానః.**

**యేనా క్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్ సత్యస్య పరమం నిధానమ్ ఇతి.**

ము॥ ౩-౧-౬

(సత్యేన లభ్యః) సత్యాచరణమనెడి ధర్మానుష్ఠానము, యథార్థజ్ఞానము బ్రహ్మచర్యము మున్నగు శుభగుణములవలన నెల్లరకు నాత్మయగు పరమేశ్వరుడు తెలియబడును. దోషరహితులు - ధర్మాత్ములు, జ్ఞానులునైన సంన్యాసులు మాను- సాక్షాత్కారము జేసికొను పరమేశ్వరుడు శుద్ధుడు; ప్రకాశస్వరూపుడు; ఎల్లరి యాత్మలకు నాత్మ. అతని యాజ్ఞనే యెల్లరు పరిపాలింపవలెను.

(సత్యమేవ...) సత్యము నాచరించువాడే యెల్లపుడు విజయమును, సుఖమును బొందును. మిథ్యాచారి - అసత్యకర్మముల నాచరించువాడు, సతతము పరాజయమును, దుఃఖమును బొందును. విద్వాంసుల కానందము నొసంగు మోక్షమార్గము కూడ సత్యాచరణము వలననే ప్రకటమగును. ఆ మార్గముననే నడచి యాప్తకాములైన ఋషులు, ధర్మాత్ములైన విద్వాంసులు సత్యసుఖము ననుభవింతురు. నిత్యము ప్రకాశించు బ్రహ్మముయొక్క సత్యస్వరూపమగు సుఖమును కూడ సత్యాచరణమువలననే వారు పొందుదురు. అసత్యమువలన నెన్నడును బొందజాలరు. కావున నెల్లరు సత్యధర్మము నాచరించి యసత్యమును త్యజింపవలెను.

**అన్యచ్చ, చోదనాలక్షణోఽర్థో ధర్మః. ౧ పూ.మీ. ౧-౧-౨**

**యతోఽభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః. ౨ వై. ద. ౧-౧-౨**

రెండు సూత్రములకు నర్థము:-

(చోదనా) వేదములం దీశ్వరుడు మానవుల కేదిచేయుట కాజ్ఞాపించియున్నాడో, ప్రేరణచేసియున్నాడో యదియే ధర్మము; ఏది చేయరానిదని నిషేధించియున్నాడో యది యధర్మము. కాని, యా ధర్మము అర్థయుక్తము - అధర్మాచరణమనెడి యనర్థము లేనిదిగ నుండును. ఈశ్వరుడు దేని నిషేధించియున్నాడో యది యనర్థరూపమగుటచే నధర్మమనబడును. ఇట్లు తెలిసికొని మానవులెల్లరు నధర్మమును విడిచి, ధర్మము నాచరింపవలెను. అదియే మానవత.

(యతోఽభ్యు) దేని నాచరించుటవలన లోకమునందుత్తమ సుఖము, నిఃశ్రేయసము- మోక్షసుఖము లభించునో, యదియే ధర్మము. ఇదియును వేదవ్యాఖ్యానమే.

ఇట్టి యనేక వేదమంత్ర ప్రమాణములను, ఋషులయు, మునులయు సాక్ష్యములను జూచినపుడు, ఈశ్వరుడు మనుష్యులకు హితమొనర్చుటకై వేదములందు ధర్మము నుపదేశించి నట్లు తెలియుచున్నది. కావున మానవులెల్లరు నీధర్మముననే యాచరింపవలెను. దీనింబట్టి మానవులకెల్లరకు ధర్మమొక్కటియే యనియు, దీనికి భిన్నమైనది మరియొండు లేదనియు విదితమగుచున్నది. దీనికి భిన్నముగా నెంచువాడు మిథ్యావాదియు, నజ్ఞానియు నగుచున్నాడు. ఇట్లే యధర్మమును గూర్చియు నెఱుగనగును.

వేదోక్త ధర్మవిషయము సంక్షేపముగ తెలుపబడినది.

## వేదాలలో సృష్టివిద్య

నాసదాసీన్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమాఽపరో యత్
కిమావరీవః కుహకస్య శర్మన్నంభః కిమాసీద్ గహనం గభీరమ్. ౧

న మృత్యు రాసీదమృతం నతర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః
ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్య న్నపరః కించనాస ౨

తమ ఆసీత్తమసా గూళ్హమగ్రేఽ ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్
తుచ్ఛ్యేనాభ్వపిహితం యదాసీత్తపసస్తన్మహినా జాయతైకమ్. ౩

కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్.
సతో బంధు మసతి నిరవిందన్ హృది ప్రతీష్యా కవయో మనీషా ౪

తిరశ్చీనో వితతో రశ్మిరేషా మధఃస్వి దాసీ3దుపరి స్విదాసీ3త్.
రేతోధా ఆసన్ మహిమాన ఆసన్ త్స్వధా అవస్తాత్, ప్రయతిఃపరస్తాత్ ౫

కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః
అర్వాగ్ దేవా అస్య విసర్జనే నాథా కో వేద యత ఆబభూవ. ౬

ఇయం విసృష్టిర్యత ఆబభూవ యది వా దధే యది వా న,
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్త్సో అఙ్గ వేద యది వా న వేద. ౭

ఋగ్. ౧౦-౧౨౯ ౧, ౨, ౩, ౪, ౫, ౬, ౭.

పరమేశ్వరుడే యీ సంపూర్ణ విశ్వమును సృష్టించును; రక్షించును; ప్రళయకాలమున నాశమొనర్చును. ఈ సృష్టిస్థితిలయ చక్రము ఎల్లపుడు నడచుచునే యుండును.

(నా సదాసీత్) ఈ కార్యసృష్టి యేర్పడుటకు ముందు సర్వశక్తి మంతుడగు పరమేశ్వరుడు, జీవాత్మలు, జగత్కారణము - జగత్తును నిర్మించుటకు నలయు సామగ్రియు నుండెను. అప్పుడు (అసత్) శూన్యము- ఆకాశము- కంటికి కనబడనిది కూడ లేకుండెను.

పూ: ఎందువలన?

ఉ: ఆ సమయమున దాని వ్యవహారమే లేకుండెను. (నో సదాసీత్తదానీమ్) ఆ సమయమున, (సత్) సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము నను పేరుగల ప్రకృతికి సంబంధించిన వ్యవహారము కూడ లేదు. (జగత్తున కుపాదాన కారణము ప్రకృతి యనబడును. ప్రకృతి యున్నదను వ్యవహారము కార్యజగత్తేర్పడినపుడే యుండును. దేనినుండి మరియొక తత్త్వ ముత్పన్నమగునో యది ప్రకృతి యని దార్శనికులు వ్యవహరింతురు. పుత్రుడు గలుగనంతవరకు తండ్రి తండ్రి యని వ్యవహరింపబడడు. పుత్రుడు కలిగిన తదుపరి తండ్రి పిత యని పిలువబడును. ఇట్లేయెటువైన ప్రకృతి యుత్పన్నమైనదను ప్రయోగము లభించిన నట కార్యోత్పత్తికి తరువాతనే ప్రకృతి శబ్దప్రయోగము చేయబడినట్లు తెలియవగును.

(నాసీద్రజః) ఆ సమయమున పరమాణువుల వ్యవహారమును లేదు [పరమాణువద వ్యవహారము అణు వ్యవహారమునకు తరువాతనే యేర్పడును (60) అరువది పరమాణువులు కలిసి యొక అణు వగును. అణు వేర్పడక ముందు దాని యరువదియవ అంశమగు పరమాణు వ్యవహార మెట నుండగలదు? 60 పరమాణువు లొక యణువగునని సత్యార్థప్రకాశపు టెనిమిదవ సముల్లాసమున దయానంద స్వాములు వ్రాసియుండిరి]. కావున 'పరమాణవోఽపి నాసన్' అను వాక్యమునకు పై అనువాదము చేయబడినది. అణువులలో నరువది యవ భాగము పరమాణువు. దీనిని దెలుపు ప్రసిద్ధశ్లోక మొకటియున్నది.

**జాలాంతరగతే భానౌ సూక్ష్మం యద్ దృశ్యతే రజః**

**తస్య షష్టితమో భాగః పరమాణుః స ఉచ్యతే.**

కిటికీనుండి లోపల ప్రవేశించు సూర్యకాంతిలో గనబడు నలకలలో నరువదియవ యంశము పరమాణువని చెప్పబడును. అట్లే (నో వ్యో) విరాట్టు - సమస్త స్థూలజగత్తుకు నివాసస్థానము - ఆధారము కూడ నప్పుడు లేదు.

(ఇట విరాట్టు పదమునకు సర్వశరీరములకు చెందిన సమష్టి దేహమని యర్థము గ్రహింపవలెను. ఇదియే సంపూర్ణ సృష్టికి ఆధారము. సర్వబ్రహ్మాండము దీనికి శరీరమని భావము. సూర్యచంద్రులు నేత్రములు, వాయువు ప్రాణము, భూమి పాదములు. విరాట్ పదమునకు దయానందస్వామి 'తతో విరాడజాయత' అను మంత్రవ్యాఖ్యానమున నీ యర్థమే వివరించిరి).

ఆ సమయమున స్థూలజగత్తునకు సూక్ష్మోపాదాన కారణము - పరమేశ్వరుని సామర్థ్యము సంపత్తి - పరమేశ్వరుని కంటె భిన్నముగ నింకొకటి యుండెను.

[సృష్టి యేర్పడుటకు పూర్వము జగత్తునకు ఉపాదాన కారణము ప్రకృతియని కాని, పరమాణువులని కాని వ్యవహరింపననువు గానిచో, ఏనామము వ్యవహరింపదగియుండెనను ప్రశ్న యుదయించును. దానికి సమాధానముగ మహర్షి దయానందులు బ్రహ్మ సామర్థ్య మని చెప్పవచ్చునని యీ మంత్రవ్యాఖ్యానమున సూచించి యున్నారు. సంస్కృత సాహిత్యమున రాజసేనను రాజబల మని వ్యవహరింతురు. దానితోనే రాజు విజయమును సంపాదించును. అట్లే స్థూలజగత్తునకు, సృష్టికి, ఉపాదాన కారణమగు ప్రకృతి పరమేశ్వరుని కంటె భిన్నమే. అయినను, నది పరమేశ్వరుని సామర్థ్యము- సంపత్తి యనదగును. దానినుండియే యీ కార్యజగత్తును పరమేశ్వరుడు సృష్టించును. కావున సృష్టికి పూర్వము - ప్రళయ కాలమున పరమేశ్వరుడు కాక ప్రకృతి- అతని సామర్థ్యము, ఒకటి పరమేశ్వరునకు భిన్నముగా నున్నదను వ్యాఖ్యానము సముచితమే.]

(కిమావరీః) ఈ వర్తమాన జగత్తుకూడ ననంతము, శుద్ధమునగు బ్రహ్మమును గప్పజాలదు. అంతకంటె నధికముగాని, అగాధముగాని కాజాలదు- మంచు భూమిని కప్పు జాలనట్లు, నదిలో ప్రవాహమును గల్పింప జాలనట్లు ఈ ప్రపంచము కూడ పరమేశ్వరునికంటె నధికమై యతని కావరణము కలిగింపజాలదని తెలియుచున్నది.

పూ: ఎందువలన?

ఉ: పరమేశ్వరుడు అనంతుడు. అతనిచే నిర్మింపబడిన యీ జగత్తు నతనితో బోల్చిన నత్యల్పమగును.

(న మృత్యు....) జగత్తు లేనపుడు మృత్యువును లేకుండెను. జగత్తు సంయోగముచే నేర్పడియున్నపుడు శరీరాదుల వియోగమేర్పడునవకాశముండును. ఈ వియోగమునకే మృత్యువని పేరు. కావున స్థూలజగత్తేర్పడుటకు ముందు మృత్యువునకు స్థానమెక్కడినుండి వచ్చును? మృత్యువు లేనపుడమరత్వము కూడ నుండదు. (రాత్ర్యా అహ్నః) రాత్రిందివముల విభాగమునకు సంబంధించిన (ప్రకేత) జ్ఞానముకూడ లేదు. అపుడు ఒక యాత్మతత్త్వము (స్వధయా) తన శక్తితో - స్వధా- మూలకారణముతో ప్రాణవాయువులేని చేతనము మాత్రముండెను. దానికి భిన్నముగ కొండొక శ్రేష్ఠవస్తువు లేదని నిశ్చయముగ నెఱుంగుము.

(తమ ఆసీదితి) ఈ జగత్తంతయు సృష్టికి పూర్వమున నంధకారముతో నావృతమై, రాత్రిరూపమున తెలియుట కష్టమైయుండెను. ఈ జగత్తంతయు నాకాశరూపమున నుండెను. పరమేశ్వరునం.దేకదేశమున తుచ్ఛమై- అల్పమై, ఆచ్ఛాదితమై యుండెను. తదుపరి పరమేశ్వరుడు తన సామర్థ్యముచే కారణరూపమున నున్న జగత్తును - ప్రకృతిని కార్యరూపమున- స్థూలజగద్రూపమున నొనర్చెను.

(కామస్తదగ్రే) ఈ ప్రథమ సమయమున మనశ్శక్తి యొకటి యుండెను. దానిలో సంకల్ప ముదయించెను. దానితో సమస్తజగత్తు నేర్పడెను. సత్, అసత్-చేతనము, జడము, ఆత్మ, అనాత్మ అను వీనిలో పరస్పర బంధుత్వము - సంబంధము కలదని జ్ఞానులు తెలిసికొనిరి. జ్ఞానులు దూరదృష్టితోను, సూక్ష్మబుద్ధితోను తమ హృదయములందే యాథార్థ్యము తెలియగుదురు. కావుననే చేతనముగు నాత్మ సంకల్పము జడమగు మనస్సుతో గలిసి కార్య మొనర్పగలదు.

(తిరశ్చీనో) పరమాత్మ, జీవాత్మ, జగత్తునకు మూలకారణమగు ప్రకృతి - అను వీ మూడింటి తేజఃకిరణ మొకటి యన్నివైపుల వ్యాపించెను. అయ్యది పైన, క్రింద, నాలుగు వైపుల నాశ్చర్య కారకమయ్యెను. బలమును ధరించి, పోషించు జీవులనేకులుగలరు. ఆత్మలో మొదటినుండియు విజధారణశక్తియు, నంతమువరకు నడచు ప్రయత్నమును నున్నవి.

(కో అద్ధా....) మనుష్యులకు జగత్తును రచించుటకు వలయు ప్రక్రియ సాక్షాత్తుగ తెలియదు. సృష్ట్యుత్పత్తి విషయమున ప్రత్యక్ష జ్ఞానము కలుగుట యసంభవము. సూర్యచంద్రాది కాంతిమంతములగు పదార్థము లేర్పడుటకు పూర్వమే సృష్టి ప్రారంభమై యుండెను. అది యెప్పుడు ప్రారంభమైనదో, యెక్కడినుండి ప్రారంభమైనదో మనుష్యుడెవ డెఱుగగలడు?

(యం విసృష్టిః) ఈ నానావిధములగు జగత్తును రచియించిన పరమేశ్వరుడే దీనిని ధరించును; నాశనముజేయును, అతడే దీనికి స్వామి. మిత్రములారా! పరమేశ్వరుని బుద్ధితో తెలిసికొనినవారే యతనిని బొందుదురు. ఎఱుగనివాడు దుఃఖమున బడియుండును. పరమేశ్వరుడాకాశములె వ్యాపకుడు. అతనియందే సమస్తజగత్తు నివసించు చున్నది. ప్రళయమునను కారణరూపమునీశ్వరుని సామర్థ్యమునందే యుండును. మరల నతనివలననే యుత్పన్నమగును.

హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్,

స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ.

౧ ఋ. అ. ౮, ౭-౩-౧

(హిరణ్య....) పరమేశ్వరుడొక్కడే సృష్టికి పూర్వముండెను. అతడే సమస్త జగమునకు స్వామి. అతడే భూమి మొదలు సూర్యుని వఱకు గల సర్వజగత్తును రచియించి ధరించుచున్నాడు. కావున నా సుఖస్వరూపుడగు దేవునే మనమెల్లరము నుపాసింపవలెను. ఇతరు నుపాసింపరాదు.

సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్

స భూమిగ్ం సర్వతః స్పృత్వాఽత్యతిష్ఠ ద్దశాంగులమ్. ౯ యజు. ౩౧. ౧

(సహస్రశీ) ఈ మంత్రమున పురుష శబ్దము విశేష్యము. ఇతర సహస్రశీర్షా మున్నగు పదములన్నియు దానికి విశేషణములు. నిరుక్తమున జెప్పిన వ్యుత్పత్తిననుసరించి యీ సమస్తజగత్తున పూర్ణుడై యుండువాడు పురుషుడనబడును. తన వ్యాపకత్వముతో జగత్తును నింపువాడు-పూరించువాడు పురుషుడని భావము. పురమునకు బ్రహ్మాండ మనికాని, శరీరమనికాని యర్థము. వానియందు సర్వత్రవ్యాప్తుడై జీవులలోను వ్యాపకుడై యుండువాడు పురుషుడు. అంతర్యామి యనబడును. ఈ యంతర్యామి యనునర్థమును నిరూపించుటకు యాస్కముని యుల్లేఖించిన ప్రమాణములకర్థ మీ క్రింది పంక్తులలో జదువుడు.

(యస్మాత్ పరం) పూర్ణుడగు నాపరమేశ్వరునికంటె నుత్కృష్టుడు-గొప్పవాడు-కాని, పూర్వుడు కాని మరియొకడు లేడు. (నా పర మస్తి) అతనికి సమానమైన వస్తువుకాని, యుత్తమమగు వస్తువుకాని, యతనికి తరువాత మిగిలియుండు వస్తువుకాని యింకొకటిలేదు. అతని కంటె సూక్ష్మమగు వస్తువుగాని, గొప్పవస్తువుకాని లేదు; ఉండబోదు; ఉండియుండదు. ఆ పరమేశ్వరుడను పదార్థము స్థిరమైనది. వృక్షము పత్రపుష్ప ఫలములను, కొమ్మలను ధరించి స్థిరముగా నుండునట్లు. పరమేశ్వరుడు పృథివ్యాది సూర్యపర్యంత సమస్త బ్రహ్మాండమును ధరించి యందు వ్యాపకుడై, స్థిరుడై యున్నాడు. అతడద్వితీయుడు అతనికి సజాతీయుడుకాని, విజాతీయుడుకాని యీశ్వరుడింకొకడు లేడు. అతడే సంపూర్ణ జగత్తునందు పూర్ణుడై వ్యాప్తుడై యున్నాడు; కావున పురుషుడనబడును. . శతపథమున సంపూర్ణ జగత్తునకు, అసంఖ్యతకు నామము సహస్ర మని చెప్పబడినది.

(సహస్రశీ) ఎవనిలో సంపూర్ణ విశ్వమునందలి ప్రాణుల యసంఖ్య శిరస్సులు, నేత్రములు,

పాదములు నున్నవో యతడు- ఆ పరమేశ్వరుడు సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు ననబడును. అతడనంతుడు. ఆకాశమున సర్వపదార్థములు నుండును. కాని, యాకాశము వాని నంటకయుండును- దేనిచేతను నది బంధింపబడదు. అట్లే పరమేశ్వరునియందు సర్వము నుండును. కాని, యతడు దేనికిని బద్ధుడు కాడని యెఱుంగవగును.

(స భూమిꣳ సర్వతః స్పృత్వా) ఆ పురుషుడు సమస్త జగత్తునంతటను స్పృశించుచు పూర్ణుడై పృథివ్యాది సర్వలోకములను ధరించుచున్నాడు. (అత్యతిష్ఠద్) దశాంగులపదము బ్రహ్మాండమునకును, హృదయమునకును వాచకము - నామము. అంగులపద మవయవ (అంగ) బోధకము. కావున నీ పదముచేనిట పరిమిత ప్రపంచము గ్రహింపనగును. పంచస్థూల భూతములు, పంచసూక్ష్మభూతములు, కలిసి పది- దశ - జగత్తున కవయవములు. పంచప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, జీవుడు నను నీపదియు నవయవములుగ గ్రహింపనగును. శరీరమున హృదయము కూడ దశాంగుళ పరిమాణము గలదిగ నెంచబడును. ఇట్లు దశాంగుళపదముచే జగత్తు, ప్రాణాదులు, హృదయము నను మూడును గ్రహింపవచ్చును. పరమేశ్వరు డీ మూడింటియందును పూర్ణుడై యున్నాడు. కావున పురుషుడనబడును. దశాంగుల పదవాచ్యములయిన జగదాదుల నుల్లంఘించి - యతిక్రమించి స్థిరుడై యున్నాడు; కావున నతడే యీ జగత్తును రచించువాడునై యున్నాడు.

**పురుష ఏవేదꣳ సర్వం యద్భూతం యచ్చ భావ్యం**

**ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతిరోహతి. ౧౦ యజు. ౩౧-౨**

(పురుష ఏవేదం) పూర్వమంత్రమున వర్ణింపబడిన పురుషుడే- పరమేశ్వరుడే పూర్వముత్పన్నమైన నట్టియు, ఇప్పుడుత్పన్నమగు చున్నట్టియు, ఇకముందుత్పన్నము కానున్నట్టియు జగత్తును రచించువాడై యున్నాడు. అతడుతక్క, మరియొకడెవడును నీ జగత్తును రచించువాడు లేడు. అతడు (ఈశానః) సర్వశక్తిమంతుడు. (అమృతత్వస్య) మోక్షము నొసంగువాడును నతడే. (అన్నేన) అతడే జగత్తుతో బాటు వ్యాపకుడై యుండుటయే గాక, జగత్తునకు వేరుగ దీనిని మించియు నున్నాడు. అతనికి జన్మాదులు లేవు. అతడే తన యాదినిమిత్తభూత సామర్థ్యము నుండి సమస్త జగత్తు నుత్పన్నము చేయును. స్వయముగ నెన్నడు జన్మింపడు. అతని కాదికారణమెయుండును లేదు. అతడే సమస్తసృష్టికి నాదినిమిత్తకారణము. ౧౦

**ఏతావానస్య మహిమాఽతో జ్యాయాꣳశ్చ పూరుషః**

**పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి ౧౧ యజు. ౩౧-౩**

(ఏతావానస్య) భూతభవిష్యద్వర్తమాన కాలములందెల్లప్పుడు నుండు నీ ప్రపంచమంతయు నా పరమేశ్వరుని మహిమయే.

పూ: పరమేశ్వరుని మహిమ ప్రపంచమంత యని చెప్పిన దానికి కొంత యేర్పడుచున్నది. అందువలన దానికంతము అవధి యున్నదన వచ్చునా?

ఉ: (అతో జ్యాయాꣳశ్చ పూరుషః) ఆ పరమేశ్వరుని మహిమ కంతములేదు. (పాదోఽస్య విశ్వా భూతాని) ఈ ప్రకటమగు విశ్వమంతయు నా పరమేశ్వరుని యందెక్కడనో యొక యంశమున మాత్రమే యున్నది. (త్రిపాదస్యామృతం దివి) ఈ జగత్తును ప్రకాశింపజేయు పరమేశ్వరుడు జగత్తునకంటె మూడింతలగును. ప్రకాశ్యమాన జగత్తొక యంశమైన ప్రకాశకజగత్తు - పరమేశ్వరుడు - మూడంశములెక్కువ. ద్యోతనాత్మకమగు పరమేశ్వరుని స్వరూపమునందే మోక్షసుఖమున్నది. పరమేశ్వరుడు స్వయం మోక్షస్వరూపుడు. సర్వమునకు నత డధిష్ఠాత. ఎల్లరకు నుపాస్యుడు నానందప్రదుడునై యున్నాడు. ౧౧

**త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహాభవత్పునః**

**తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనానశనే అభి౧౨ యజు. అ. ౩౧, మం. ౪**

(త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః) పురుషుడు- పరమేశ్వరుడు- ప్రకాశకుడునగు నా త్రిపాదుడు, జగత్తునకు పైన వేరుగనుండియు జగత్తునందు వ్యాపకుడై యున్నాడు. అతడు ప్రకాశస్వరూపుడు, సర్వవ్యాపకుడు, అన్నింటికంటెను భిన్నుడు. ఒకపాదమని వర్ణింపబడిన నీ జగత్తునకును నతడు భిన్నుడే. (పాదోఽస్యేహాభవత్పునః) పరమేశ్వరుని బట్టి చూచిన నీ జగత్తంతయు నతనిలో కొంచెము స్థలములో నున్నది. ఈ స్థూల జగత్తునకు జన్మము, వినాశము నెల్లపుడు జరుగుచుండును. పురుషునకు జన్మవినాశాది ధర్మములుండవు. అతడు సదా ప్రకాశమానుడై యున్నాడు. (సాశనానశనే) ఈ జగత్తు ద్వివిధము. ఒకటి చేతనాత్మకము; భోజనాదులకొఱకది చేష్టించును. జీవసంయుక్తమై యుండును. రెండు- అనశనము జడము. భోజనాదుల కది చేష్టింపదు. స్వయమది భోజనమగుటకేర్పడినది. దానిలో జ్ఞానమే యుండదు. స్వయముగ చేష్టనొనర్పజాలదు. ఇట్లు ద్వివిధములగు నీ జగత్తంతయు నా పురుషుని సామర్థ్యమునుండియే యుత్పన్నమగును. ఆ పురుషుడు దీనిని నిర్మించును. అతడే

విశ్వమునందంతటను వ్యాపకుడై దీనిని ధరించి చూచుచున్నాడు. అతడే యీ సమస్తజగత్తు నన్నివిధముల నాకర్షించుచున్నాడు.

**తతో విరాడజాయత విరాజో అధిపూరుషః**

**స జాతో అత్యరిచ్యత పశ్చాద్ భూమి మథో పురః**

౧౩యజు. అ. ౩౧, మం.౫

(తతో విరా డజాయత) ఆ పురుషునినుండి విరాట్టు జన్మించెను. సంపూర్ణ బ్రహ్మాండ మీ విరాట్టునకు శరీరము, సూర్యచంద్రులు నేత్రములు, వాయువు ప్రాణము, భూమి పాదములు, సమస్తప్రాణుల శరీరముల కా విరాట్టు సమష్టిదేహ మనవచ్చును. వివిధములగు పదార్థములవలన నది ప్రకాశించుచున్నది కావున విరాట్టనబడును. (విరాజో ఽధిపూరుషః) ఆ విరాట్టు- సమష్టిదేహమునకు తదుపరి బ్రహ్మాండమున కవయవములనదగిన పృథివ్యాదిభూతములవలన ప్రాణుల శరీరములు వేరువేరుగ నుత్పన్నము లయ్యెను. (స జాతో అ.....) ఆ ప్రాణుల శరీరములు పృథివ్యాదుల కవయవము లనదగిన యోషధులవలన వృద్ధి నొందును. కొంత కాలమునుండి, మరల నాశము నొంది, యా శరీరములు తమకు సమష్టి దేహమయిన పృథివ్యాదులలో లీనమగును. కాని, పరమేశ్వరుడు మాత్ర మీ ప్రపంచరూప దేహమునకు భిన్నముగనే యుండును- అది యతనిని లిప్తుని జేయదు. (పశ్చాద్ భూమి మథో పురః) ప్రథమమున పరమేశ్వరుడు భూమి నుత్పన్నముచేసి దానిని ధరించెను. అనంతరము పరమాత్ముని సామర్థ్యమువలననే జీవాత్మయు దేహధారి యయ్యెను. పరమేశ్వరుడా జీవునికంటెను భిన్నుడై వేరుగనే యుండును.

**తస్మాద్ యజ్ఞాత్ సర్వహుతః సంభృతం పృషదాజ్యమ్,**

**పశూంస్తాంశ్చక్రే వాయవ్యా నారణ్యా గ్రామ్యాశ్చయే.** ౧౪.యజు. ౩౧-౬

(తస్మాత్ యజ్ఞాత్) ఈ మంత్రమున కర్థము వేదోత్పత్తి ప్రకరణమున నొక కొంత వ్రాయబడినది. పూర్వోక్త పురుషునివలననే (సంభృతం పృషదాజ్యం) సర్వవిధములగు భోజన పదార్థములు, అన్న వస్త్రములు, జలము, ఘృతము, మధువు, దుగ్ధము మున్నగు వస్తువులు మానవులకు లభించినవి. అతని సామర్థ్యమువలననే లోకమున నీ వస్తువు లేర్పడుచున్నవి. అతని వలననే ప్రాణులకు జీవనము లభించుచున్నది. కావున నెల్లరు నతనినే యుపాసింపవలెను, ఇతరుల నుపాసింప జనదు. (పశూన్ తాన్ చక్రే) గ్రామ్యములు, వన్యములు నగు జంతువుల నన్నింటిని పరమేశ్వరుడే యుత్పన్నము చేసియున్నాడు. ఇట్లే పక్షులు, సూక్ష్మములగు క్రిములు కీటకములు నన్నియు నతని మూలముననే జనించినవి. సర్వజీవుల దేహముల నతడే నిర్మించెను.

**తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే.**

**ఛందాꣳసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మా దజాయత.** ౧౫.యజు. ౩౧-౭.

ఈ మంత్రార్థము వేదోత్పత్తి ప్రకరణమున జూడవచ్చును.

**తస్మా దశ్వా అజాయంత యే కే చో భయాదతః**

**గావో హ జజ్ఞిరే తస్మా త్తస్మాజ్జాతా అజావయః** ౧౬. యజు. ౩౧-౮.

(తస్మాదశ్వా) ఆ పురుషుని సామర్థ్యము వలననే అశ్వములు-గుఱ్ఱములు- విద్యుత్తు మున్నగు పదార్థములుత్పన్నములయ్యెను. (యే కే చోభయాదతః) నోటిలో పై భాగమునను క్రింది భాగమునను దంతములు గల జంతువులు 'ఉభయాదతః' అనబడును. అట్టి యొంటెలు, గాడిదలు మున్నగు పశువులు నతని వలననే జనించినవి. (గావో హ) అతని వలననే, గోవులు, పృథివి, కిరణములు, ఇంద్రియములు నుత్పన్నము లయ్యెను. (తస్మాజ్జాతా అజా) ఇట్లే యతని వలన గొఱ్ఱెలు, మేకలుగూడ జనించెను. గ్రామములలో నుండు జంతువులు, అరణ్యములలో నుండు జంతువులు పుట్టినవని యని పూర్వమంత్రమున వర్ణింపబడినది. అశ్వాది పశువులు కూడ వానిలో చేరినవే యైనను మరల నీ మంత్రమున నశ్వాదులు గ్రహింపబడినందున నవి పశువులలో శ్రేష్ఠములని తెలియనగును.౧౬

**తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాత మగ్రతః**

**తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చ యే.** ౧౭. యజు. అ. ౩౧-౯

(తం యజ్ఞం) అందరికంటె ప్రథముడును, సర్వజగత్కర్తయు, సమస్త జగత్తునందు పరిపూర్ణుడై యుండువాడును, పూజ్యుడు నగు పరమేశ్వరుని ఏ మనుజుడు హృదయాకాశమున ప్రేమ, భక్తి, సత్యాచరణము మున్నగు వానితో బాగుగ బూజించునో, అతడే యుత్తమ పురుషుడు- మనుజుడు. ఇది యీశ్వరుడెల్లరకు నొసంగిన యుపదేశము. (తేన దేవా అయజంత) వేదోక్తములగు పరమేశ్వరుని యుపదేశముల వలననే విద్వాంసులు, జ్ఞానులు, వేదమంత్రార్థముల నెఱుంగు ఋషులు, నితర మనుష్యులును పరమేశ్వరుని సుఖులగుదురు.

శ్రేష్ఠ కార్యముల నొనర్చుటకు ముందే పరమేశ్వరుని ప్రార్థన, స్మరణోపాసనాదుల నొనర్పవలెను. దుష్టకార్యముల నెవరును జేయరాదు.

**యత్ పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్**

**ముఖం కి మస్యాసీత్ కిం బాహూ కిమూరూ పాదా ఉచ్యేతే.**

౧౮. యజు. ౩౧-౧౦.

(యత్ పురుషం) సర్వశక్తిమంతుడగు ఈశ్వరుడు పురుషుడనబడును. (కతిధా వ్యకల్పయన్) అతని సామర్థ్యము నేక విధముల ప్రతిపాదింతురు. అతనిలో చిత్ర విచిత్రమును, నానావిధములుగలదియునగు సామర్థ్యముకలదు. అనేకవిధకల్పనలతో దానిని వర్ణింతురు; వర్ణింపగలరు; వర్ణించి యుండిరి. (ముఖం కిమస్యాసీత్) ఈ పురుషుని ముఖము- ముఖ్య గుణములవలన, యీ ప్రపంచమున నేమి యుత్పన్నమైనది? (కిం బాహూ) బలము, వీర్యము, శూరత, యుద్ధాదివిద్యా గుణములవలన నీ ప్రపంచమున నేపదార్థ ముత్పన్నమయ్యెను? (కిమూరూ) వ్యాపారాది మధ్యమ గుణములవలన దేనియుత్పత్తి జరిగినది? (పాదాఉచ్యేతే) మూర్ఖత్వాది నీచగుణములవలన నేమి జనించినది?

**బ్రాహ్మణోఽస్య ముఖ మాసీద్ బాహూ రాజన్యః కృతః**

**ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత,**

౧౯. యజు. అ. ౩౧. మం. ౧౧.

పూర్వమంత్రమున వర్ణింపబడిన నాలుగు ప్రశ్నలకు నీ మంత్రమున నీ క్రింది సమాధానములు చెప్పబడినవి.

(బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్) పరమేశ్వరుని యాజ్ఞానుసారము విద్యాద్యుత్తమగుణములవలనను, సత్యభాషణము, సత్యోపదేశము మున్నగు నుత్తమ కర్మములవలనను బ్రాహ్మణవర్ణ ముత్పన్న మయ్యెను. ఇట్టి ముఖ్య గుణములు, కర్మములు గలిగియుండుటవలన బ్రాహ్మణ వర్ణస్థుడు మనుష్యులలో నుత్తముడగును. (బాహూరాజన్యః కృతః) ఈశ్వరుడు బలపరాక్రమములు మున్నగు అవయవములతో యుక్త మగు క్షత్రియవర్ణము నుత్పన్నము చేసెను. (ఊరూ తదస్య యద్వైశ్యః) పరమపురుషుని యుపదేశము ననుసరించి, కృషి, వ్యాపారము, సర్వదేశ భాషలు నేర్చుట, పశుపాలనము మున్నగు మధ్యమ గుణములతో వైశ్యవర్ణము సిద్ధించెను. (పద్భ్యాం శూద్రో...) పాదములు శరీరమున క్రింది యవయవములు. అట్లే మూర్ఖత్వాది నీచగుణముల వలన శూద్రవర్ణ మేర్పడెను.

ఈ విషయమునకు చెందిన ప్రమాణములు వర్ణాశ్రమప్రకరణ వ్యాఖ్యలో ముందు వ్రాయుదుము. ("ఛందసి లుఙ్, లఙ్, లిటః", అష్టా. ౩.౪-౬) ఈసూత్రము ననుసరించి వేదములందు సామాన్యకాలమును తెలుపుటకు ఛందసి లుఙ్, లఙ్, లిట్, లకారములు మూడును ప్రయోగింపబడును.

**చంద్రమా మనసో జాత శ్చక్షోః సూర్యో అజాయత,**

**శ్రోత్రాద్ వాయుశ్చ ప్రాణ శ్చ ముఖాదగ్ని రజాయత** ౨౦. యజు. ౩౧-౧౨

(చంద్రమా) ఆ పురుషుని మనము - జ్ఞానస్వరూపసామర్థ్యమువలన చంద్రుడును, తేజస్స్వరూపమువలన సూర్యుడును నుత్పన్నమయ్యెను. (శ్రోత్రా ద్వాయుశ్చ) ఆకాశరూప వాయువును నుద్భవించెను. అట్లే సర్వేంద్రియములును తమ తమ కారణములనుండి యుద్భవించినవి. మఱియు, ముఖ్యమగు జ్యోతిస్స్వరూప సామర్థ్యము వలన నగ్ని జనించినది. ౨౦

**నాభ్యా ఆసీదంతరిక్ష ం శీర్ష్ణోర్ ద్యౌః సమవర్తత,**

**పద్భ్యాం భూమిర్ దిశః శ్రోత్రా త్తథా లోకాన్ అకల్పయన్.**

౨౧. యజు. ౩౧-౧౩

(నాభ్యా ఆసీత్) ఆ పురుషుని యత్యంత సూక్ష్మమగు నవకాశరూప సామర్థ్యము వలన అంతరిక్షము - భూమికి సూర్యాది లోకములకు మధ్యనున్న ఖాళీచోటు - వియత మొనర్పబడినది. (శీర్ష్ణోర్ ద్యౌః) అతని సర్వోత్తమ సామర్థ్యమువలన సర్వలోకములను ప్రకాశింపజేయు సూర్యాది లోకములు జనించెను. (పద్భ్యాం భూమిః) పార్థివ పరమాణుకారణరూప సామర్థ్యమువలన పరమేశ్వరుడు భూమిని జనింపజేసెను. అట్లే జలమును కూడ దాని కారణమునుండి యుత్పన్న మొనర్చెను. (దిశఃశ్రోత్రా) అతడు శ్రోత్రరూప - శబ్దాకాశకారణ రూపసామర్థ్యమువలన దిక్కులను గలిగించెను. (తథా లోకాన్ అకల్పయన్) అట్లే కారణరూప సామర్థ్యము వలన పరమేశ్వరుడు సర్వలోకములను, వానిలోని పదార్థములను సృజియించెను. ౨౧

**యత్ పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత,**

**వసంతో౽ స్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః** ౨౨. యజు. ౩౧-౧౪

(యత్ పురుషేణ) దేవ-విద్వాంసులను కూడ వారి వారి కర్మములననుసరించి పరమేశ్వరుడు సృష్టించియున్నాడు. వారు నీశ్వర దత్త పదార్థములను గ్రహించి, పూర్వోక్తములగు నగ్నిహోత్రాది అశ్వమేధ పర్యంతములగు యజ్ఞములను శిల్పవిద్యామయ యజ్ఞమును విస్తార పూర్వకముగ ననుష్ఠించుచున్నారు, అనుష్ఠించగలరు. ఇక జగదుత్పత్తిలో నవయవరూపముగు కావలసిన సామగ్రిని వర్ణించు చున్నాడు. (వసంతో) ఈ పూర్వోక్త యజ్ఞమునందు కాని, లేక పరమేశ్వరునిచే రచియింపబడిన బ్రహ్మాండరూపముగు యజ్ఞమునందు కాని, వసంతర్తువు-చైత్రవైశాఖములు- ఘృతమునకు సమానములు (గ్రీష్మ ఇధ్మః) గ్రీష్మర్తువు- జ్యేష్ఠాషాఢములు ఇంధనములు. శ్రావణ భాద్రపదములు వర్షర్తువు, ఆశ్వీజ కార్తీకములు శరదృతువు, మార్గశిర పుష్యమాసములు హేమంతము, మాఘఫాల్గునములు శిశిర ఋతువు. ఇవియన్నియు నీ యజ్ఞమున హవిస్సులు. ఇట రూపకాలంకారముతో బ్రహ్మాండమును వర్ణించినట్లెంచవలెను.

**సప్తాస్యాసన్ పరిధయస్త్రిః సప్త సమిధః కృతాః**

**దేవా యద్ యజ్ఞం తన్వానా అబధ్నన్ పురుషం పశుమ్.** ౨౩. యజు. ౩౧-౧౫

(సప్తాస్యా...) పరమేశ్వరుడొక్కొక్క లోకమున కన్నివైపుల-చుట్టు-నేడేడు పరిధులు నిర్మించియున్నాడు. గుండ్రని వస్తువును దారముతో చుట్టుకొలత చేసినపుడు నద్ది కొలతకు పరిధి యందురు. బ్రహ్మాండమునగల లోకములకన్నింటికి చుట్టు నేడేడు పరిధుల నీశ్వరుడేర్పఱచి యున్నాడు. ౧. మొదటిది సముద్రము, ౨. రెండవది త్రసరేణువులు, ౩. మూడవది మేఘమండల వాయువు, ౪. నాల్గవది వృష్టిజలము, ౫. ఐదవది వృష్టి జలమునకు పైనుండు వాయువిశేషము౬. ఆఱవది యత్యంత సూక్ష్మవాయువు - ధనంజయ వాయువు. ౭. ఏడవది సూత్రాత్మవాయువు. ఇది ధనంజయ వాయువుకంటెను సూక్ష్మము. ఈ యేడును పరిధులనబడును.

(త్రిః సప్త సమిధః) ఈ బ్రహ్మాండపు సామగ్రి యిరువది యొక్క విధములుగ నుండును:-

౧. వది ప్రకృతి, బుద్ధి, జీవులు; ఈ మూడును కలిసియుండును. ఇవి సూక్ష్మములు. ౨. వది శ్రోత్రము. ౩. వది త్వక్కు. ౪. వది నేత్రము. ౫. వది జిహ్వ. ౬. వది నాసిక-ముక్కు. ౭. వది వాక్కు. ౮. వది పాదములు. ౯. వది హస్తములు. ౧౦. యవది గుదము. ౧౧. వది ఉపస్థము. ౧౨. వది శబ్దము. ౧౩. వది స్పర్శ. ౧౪. వది రూపము- రంగు. ౧౫- వది రసము- రుచి. ౧౬. వది గంధము. ౧౭- వది పృథివీ- భూమి. ౧౮. వది జలము ౧౯. వది అగ్ని. ౨౦. వది వాయువు. ౨౧- వది ఆకాశము. ఈ యిరువదియొక్క పదార్థములు సమిధలు. (దేవా యద్) విద్వాంసులు సర్వజగద్రచయితయు, సర్వజగద్ ద్రష్టయు, పూజ్యుడు నగు పరమేశ్వరుని గూర్చియే విందురు. అతని యుపదేశముల మూలమున నతని గుణ కర్మములను కీర్తింతురు, ప్రకటింతురు; ధ్యానింతురు. అతనిని దక్క యితరుని నీశ్వరుడని యెవడును నంగీకరింపడు. అతని ధ్యానమునందే తమ యాత్మలను దృఢముగా నిలుపుటవలనే- బంధించుటవలననే కళ్యాణము - శుభము కలుగునని యెఱుగు చున్నారు.

**యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్,**

**తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః**

౨౪. యజు. ౩౧-౧౬

**యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవాః అగ్నినాగ్ని మయజంత దేవాః**

**అగ్నిః పశురాసీత్తమాలభంత తేనాయజంతేతి చ బ్రాహ్మణమ్. తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ తే హ నాకం మహిమానః సముసేవంత యత్ర పూర్వే సాధ్యాః సంతి దేవాః సాధనాః. ద్యుస్థానో దేవగణ ఇతి నైరుక్తాః** నిరుక్తం ౧౨-౪౦

(యజ్ఞేన యజ్ఞం) విద్వాంసులను దేవతలందురు. వారు స్తుతి, ప్రార్థన, ఉపాసన, యనెడి రీతితో, పూజనము మూలమున (యజ్ఞం) ఆ పూజనీయుడగు పరమేశ్వరుని పూజించుచుందురు. పూజింపగలరు. (తాన్యేవ) ఆ ధర్మములే శుభకర్మము లన్నింటికిని ముందు చేయవలెను. స్తుతి ప్రార్థనోపాసనలను ముందొనర్పక యెవడును నే శుభ కార్యము నొనరింపరాదు. (తేహ నాకం) ఈశ్వరు నుపాసించువారు దుఃఖరహితమగు మోక్షమును- సుఖస్వరూపుడగు పరమేశ్వరుని బొందుదురు. అట్టివారు మనుష్యులలో పూజ్యుల[illegible]దురు. యోగసాధనములననుష్ఠించు విద్వాంసులు, పరమపురుషార్థములో నే పదమును బొంది నిత్యానందమున నుందురో, అది మోక్షమనబడును. 'మోక్ష' సుఖానుభవకాలము నూఱు బ్రహ్మవర్షములు. ముక్తాత్మలింతకాలము మోక్షసుఖము ననుభవించి, తదుపరి ముక్తినుండి తిరిగివత్తురు.

నిరుక్తరచయిత యగు యాస్కుని అభిప్రాయము:-

యజ్ఞము: అగ్ని, జీవుడు: అంతఃకరణము. విద్వాంసులు, అగ్ని ముఖమున గాని, అంతఃకరణము ద్వారమునగాని, అగ్ని-పరమాత్ముని బూజింతురు. లేక, యెల్లరకు నుపకారమొనర్చు భౌతికాగ్ని మూలమున విద్వాంసులు యజ్ఞమాచరింతురు. పరమేశ్వరుని బూజించియే విద్వాంసులు ముక్తిసుఖమును బడయుదురు. ఈ అభిప్రాయముతోనే దేవతలు ద్యుస్థానులుగ జెప్పబడిరి. ద్యు: ప్రకాశమయ-జ్ఞానమయ పరమేశ్వరుడు స్థానముగ గలవారని యభిప్రాయము. విజ్ఞానము, కిరణములు నిట దేవతలని చెప్పబడినవి. దేవ-విజ్ఞానమునకు స్థానము (ద్యు) ప్రాణము. దేవ-కిరణములకు స్థానము (ద్యు) సూర్యుడు. ౨౪

అద్భ్యః సంభృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే,

తస్య త్వష్టా విదధద్ రూపమేతి తన్మర్త్యస్య దేవత్వమాజానమగ్రే. ౨౫.
యజు. ౩౧-౧౭

(అద్భ్యః సంభృతః) భూమి నుత్పన్న మొనర్చుటకు పరమేశ్వరుడు జలసారాంశమును గ్రహించి, భూజల పరమాణువులను గలిపి భూమిని రచియించెను. ఇట్లే యగ్ని సారాంశము నొకటం జేర్చి, అగ్ని పరమాణువులతో జల పరమాణువులను జేర్చి జలము నుద్భవింప జేసెను. వాయు సారాంశము నొకట జేర్చి, వాయు పరమాణువులతో నగ్ని పరమాణువులను జేర్చి అగ్నిని బుట్టించెను. ఆకాశమునకు తరువాత వాయు పరమాణువుల వలన వాయువును, జగత్తున కాదికారణ (ఉపాదానకారణ) మగు ప్రకృతి నుండి యాకాశమును రచియించెను. ఆకాశము సర్వతత్త్వము లుండుటకు స్థానము జగత్తునకు మూలకారణ మగు ప్రకృతే ప్రకృతి యను వ్యవహారము కూడ పరమాత్ముని సామర్థ్యము వలననే కలిగినది. అతడే సమస్త ప్రపంచము నుత్పన్నము చేసియున్నాడు సర్వపదార్థములను-విశ్వమును-రచించినందున పరమేశ్వరునకు విశ్వకర్మ యను నామమేర్పడినది. జగత్తు పుట్టకముందది యీశ్వరుని సామర్థ్యము (వశము) న కారణ రూపమున నుండెను. (తస్య) ఈశ్వరుడు తన సామర్థ్యము (ప్రకృతి) నుండి యీ కార్య జగత్తును రచించినపుడది రూపగుణములు కలదై, స్థూలమై చూడనగును. (తన్మర్త్యస్య దేవత్వం) పరమేశ్వరుడు మానవశరీరాదులను నిర్మించియున్నాడు. కాని, మనుష్యుడు దివ్యకర్మముల నొనర్చి దేవతయనబడును. ఈశ్వరోపాసనవలన విద్య, విజ్ఞానము మున్నగు సత్యోత్తమ గుణములను బొంది, మనుష్యులుత్తమ దేవతలనబడుదురు. సకామ కర్మముకంటె నుపాసన, జ్ఞానము, నుత్తమములు. ఉత్తమ సకామ కర్మముల నొనరించు మనుజుడు ప్రపంచమున ఉత్తమ సుఖములను బొందునని యీశ్వరాజ్ఞ. పరమేశ్వరప్రాప్తి రూప మోక్షము నభిలషించి, ఉత్తమ నిష్కామ కర్మముల నొనర్చుచు ఉపాసనయందును, జ్ఞానసంపాదనలోను పురుషార్థ మొనర్చు మనుజు డుత్తమ దేవతగా నెంచబడును. ౨౬

వేదాహ మేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్

తమేవ విదిత్వాతిమృత్యుమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ.
౨౭. యజు. ౩౧-౧౮

పూ: ఏ పదార్థము నెఱింగి మనుష్యుడు జ్ఞాని యగును?

ఉ: (వేదాహ....) పూర్వము వర్ణింపబడిన లక్షణములుగల పరమేశ్వరునే సరిగా నెఱిగి మనుష్యుడు జ్ఞాని యగును లేకున్న కాజాలడు. అందఱికంటె పెద్దవాడును, నెల్లరను ప్రకాశింపజేయువాడును, అవిద్యాజ్ఞానాదిదోషములు లేని వాడునగు నా పురుషుని నేనొక్క దేవునిగ నెఱుగుదును. అతని నెఱుగని మనుజు డెవడును సరియైన జ్ఞాని కాజాలడు. కారణమేమన?

(తమేవ విదిత్వా) ఆ పరమేశ్వరు నెఱిగి-ప్రాప్తించి జన్మమరణాది క్లేశములకు జెందిన సముద్రమువంటి దుఃఖములనుండి తరించి, పరమానంద స్వరూపమోక్షమును బొందును. మరియొక విధమున మోక్షసుఖము లభింపదు. దీనింబట్టి పరమేశ్వరునే యెల్లరు నుపాసింప వలెననియు, నితరుని నుపాసించుట యే మానవునకును దగదనియు సిద్ధించుచున్నది.

పూ: ఇతరోపాసన సేయరాదని యెట్లు తెలిసినది?

ఉ: మోక్షము నొసంగువాడు పరమేశ్వరుడొక్కడే. ఇతరుడు కాడు. ఇందులకు ప్రమాణము (నాన్యః పంథా.....) వ్యావహారిక, పారమార్థిక సుఖముల నొసంగు మార్గము-పరమేశ్వరుని యుపాసన, అతని జ్ఞానము తక్క మరియొండు లేదు. పరమేశ్వరుని యుపాసన, అతని జ్ఞానమును మానవునకు సుఖము నొసంగును. అన్య పదార్థము నీశ్వరుడని యెంచి యుపాసించిన మనుజునకు దుఃఖములే లభించును. కావున నెల్లరు పరమేశ్వరునే యుపాసింపవలెను. ఇతరము నుపాసింపరాదు. ౨౭

ప్రజాపతి శ్చరతి గర్భే అంత రజాయమానో బహుధా విజాయతే,

తస్య యోనిం పరిపశ్యంతి ధీరాస్తస్మిన్ హ తస్థుర్ భువనాని విశ్వా.
౨౮. యజు. ౩౧-౧౯

(ప్రజాపతిః) అతడే ప్రజాపతి- సర్వజగత్తునకు స్వామి. అతడే యీ జడచేతనములకు లోపల వెలుపల నంతటను వ్యాపించియున్నాడు. అతడు సమస్త ప్రపంచము నుత్పన్నమొనర్చి స్వయము మజన్ముడై యుండును. (తస్య యోనిం) ఆ పరబ్రహ్మప్రాప్తికి కారణములైన సత్యాచరణమును, సత్యవిద్యను ధ్యానముతో విద్వాంసులెఱింగి పరమేశ్వరుని బొందుదురు. (తస్మిన్ హ తస్థుర్ భు...:...) అతనిలోనే సర్వలోకములు నున్నవి. ఆ పరమేశ్వరునందే జ్ఞానులు సత్యనిశ్చయముతో మోక్షసుఖమునుబొంది, జన్మమరణ రూపములగు నాగమనాగమ్యములనుండి విడిపడి ఆనందమగ్నులగుదురు. ౧౯

**యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః**

**పూర్వో యో దేవేభ్యో జాతో నమో రుచాయ బ్రాహ్మయే.**

౨౦ యజు. ౩౧-౨౦

(యో దేవేభ్యః) ఏ పరమేశ్వరుడు విద్వాంసులకు ప్రకాశ స్వరూపుడో- విద్వాంసుల యాత్మలను ప్రకాశమున నుంచునో - ఎవడు విద్వాంసులకు పురోహితుడో - మిక్కిలి సుఖముల నిచ్చి పోషించునో, (పూర్వో.....జాతః) ఎవడు సర్వవిద్వాంసులకు నాది విద్వాంసుడో, విద్వాంసుల జ్ఞానమువలననే యెవడు ప్రసిద్ధుడో, విద్వాంసులకే యెవడు ప్రత్యక్షమగునో (నమో రుచాయ) యత్యంతము నానందస్వరూపుడై, సత్యమునందు రుచి గలిగించు నాబ్రహ్మకు మా నమస్కారములు. ఇట్లే విద్వాంసులనుండి వేదవిద్యాదులను బాగుగ జదివి, బ్రహ్మమును పితృతుల్యముగా నెంచి సత్యభావముతో ప్రేమించి సేవించు విద్వాంసులకును మేము నమస్కరించుచున్నాము.

**రుచం బ్రాహ్మం జనయంతో దేవా అగ్రే తదబ్రువన్,**

**యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్ వశే. ౨౧. యజు. ౩౧-౨౧**

(రుచం బ్రాహ్మం) బ్రహ్మజ్ఞాన మానందదాయకము. అది మనుజునకు బ్రహ్మమున రుచిని బెంచును. అట్టి బ్రహ్మజ్ఞానమును, దానిసాధనములను, విద్వాంసు లన్యమానవుల యెదుట నుపదేశించి వారి నానందింప జేయుదురు. (యస్త్వైవం బ్రాహ్మణో) ఏ మనుష్యుడిట్లు బ్రహ్మము నెఱుంగునో, యట్టి విద్వాంసునకే మనస్సు మున్నగు నింద్రియములన్నియు వశమున నుండును. ఇతరున కుండవు.

**శ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యా వహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూప మశ్వినౌ వ్యాత్తమ్.**

**ఇష్ణన్నిషాణాముం మ ఇషాణ సర్వలోకం మ ఇషాణ. ౨౨.**

యజు. ౩౧-౨౨.

అత్ర ప్రమాణాని:- శ్రీర్హి పశవః — శత ౧-౮

శ్రీర్వై సోమః — శత.౪-౧

శ్రీర్వై రాష్ట్రం, శ్రీర్వై రాష్ట్రస్య భారః — శత. ౧౩-౧

**లక్ష్మీర్ లాభాద్ వా, లక్షణాద్ వా, లప్స్యమానాద్ వా, లాంఛనాద్ వా, లషతేర్ వా స్యాత్ ప్రేప్సాకర్మణో, లజ్జతేర్ వా స్యా దశ్లాఘా కర్మణః, శిప్రే ఇత్యుపరిష్టాద్ వ్యాఖ్యాస్యామః. నిరు.౪-౧౦**

(శ్రీశ్చ తే) ఓ పరమేశ్వర! నీ యనంతశోభారూపమగు శ్రీయును, అనంత శుభలక్షణయుక్తమగు లక్ష్మియును పత్నులవలె నున్నవి. పత్ని పతిని సేవించును. అట్లే నీ సేవ నీకే ప్రాప్తించును. నీవే యీ సమస్త జగత్తునకును శోభను, శుభలక్షణములను ప్రసాదించియున్నావు. లోకమునగల శోభ, సత్యభాషణాది ధర్మలక్షణముల వలన లభించులాభము, రెండును నిన్ను సేవించుటకే. జగత్తునగల పదార్థము లన్నియు పరమేశ్వరుని యధీనముననే యుండును; కావున శోభాదులు, ఇట రూపకాలంకారముతో పత్నులుగా వర్ణింపబడినవని యెంచవలెను. అట్లే రాత్రింబవళ్లు పార్శ్వములు అని చెప్పబడినవి. సూర్యచంద్రులు కూడ పరమేశ్వరునకు పార్శ్వములుగాను లేక నేత్రస్థాను లనబడినవి. నక్షత్రములన్నియు నీ రూపస్థానములు. పృథివికి, సూర్య లోకమునకు మధ్యభాగము - అంతరిక్షము తెఱచియుంచిన పరమేశ్వరుని నోటికి సమానము. క్రింద భూలోకము, పైన సూర్యాదులోకము రెండు పెదవులకు సమానముగ నున్నవి. ఇట్లే యెల్ల పదార్థములలో గల సౌందర్యమంతయు పరమేశ్వరుని సామర్థ్యమువలన నేర్పడినదియే.

సమస్తజగత్తున కాధారభూతుడగు నో దేవ! (ఇష్ణన్) నీవు నీ దయతో ఇచ్ఛాపూర్వకముగ (అముం) పరలోకమును -మోక్షసుఖమును మా కొసంగుము. కృపాదృష్టితో నే నీ ప్రపంచమునగల గుణములతో గూడిన వాడనై సర్వలోకసుఖముల కధికారినగునట్లు అనుగ్రహింపుము. నా కొఱకు స్వారాజ్యమును సిద్ధింపజేయుము. ఈ జగత్తున నన్ను ఉత్తమ శోభలోను, లక్ష్మిలోను గూడియుండునట్లు చేయుదువు గాక! సర్వశక్తిమంతుడవగు నో పూర్ణ పురుష! నీవు కృపతో నాయందలి దుర్గుణములను దూరమొనర్పుము. సమస్తశుభగుణములను నాయందాధానము చేయుము. మేము ప్రార్థించున దిదియే. దయతో మా యీ ప్రార్థనను సఫలము జేయుము.

శతపథ బ్రాహ్మణమున (శ్రీ) శబ్దమునకు పశువు, సోమము, రాష్ట్రము, రాష్ట్ర భారము నను నర్థములు చూడనగును. నిరుక్తమున లక్ష్మీపదమునకీ క్రింది యర్థములు చెప్పబడినవి-

(౧) లక్ష్మివలన అనేక పదార్థములు లభించును. (౨) పురుషుడు లక్షితుడగును. లక్ష్మిగల మనుష్యుడితరులలో విశిష్టుడుగా జూడబడును. (౩) లక్ష్మినెల్లరుగోరుదురు. (౪) లజ్యతేర్వా స్యాదా శ్లేషకర్మణః- లక్ష్మి నెల్లరు నాలింగనము చేయగోరుదురు. (౫) లజ్ఞాపూర్వక లస్జ ధాతువుతోను లక్ష్మి శబ్దము సిద్ధించును. కావున పై మంత్రమున (శ్రీ), లక్ష్మి పదములకు చెప్పిన యర్థము సంగతమనియే యెంచవలెను. ౩౦

**యత్ పరమమవమం యచ్చ మధ్యమం ప్రజాపతిః ససృజే విశ్వరూపమ్,**

**కియతా స్కంభః ప్రవివేశ తత్ర యన్న ప్రావిశత్ కియత్తద్ బభూవ॥౧.**

అథర్వ. ౧౦, ౭-౮.

(యత్ పరమ....) ౧. పరమము - సర్వోత్కృష్ట ప్రకృత్యాది జగత్తు; ౨. అవమము- నికృష్టము, తృణము, మట్టి, చిన్న చిన్న క్రిములు కీటకములు మున్నగు జగత్తు; ౩. మధ్యమము-మనుష్యాదుల శరీరములు మొదలు ఆకాశపర్యంతమగు జగత్తు. ఈ మువ్విధములయిన ఉత్తమ, మధ్యమ, నికృష్ట జగత్తంతయు పరమేశ్వరునిచే రచియింపబడినది. (జగత్తును సృష్టించి యా త్రివిధమగు జగత్తునందు పరమేశ్వరుడెంతభాగముతో సంబద్ధుడై యున్నాడు? ఆ పరమేశ్వరుండే భాగమున త్రివిధ జగత్తునకు సంబంధము లేదో యా భాగ మెంత?) అతడీ విశ్వమున నానా విధములగు రచన నొనర్చుచున్నాడు. ఆ రచనలన్నింటిని వాడే యెఱుగును. విద్వాంసులును పరమేశ్వరుని రచనలలో కొన్నింటినే యెఱుగ గలరు. పరమేశ్వరుడన్నింటిని రచించును. కాని, యతడా రచనలో నెన్నడు చిక్కుపడడు. ఈ సంపూర్ణవిశ్వ మతని కంటె నెంతో చిన్నది. ౩౧

**దేవాః పితరో మనుష్యా గంధర్వాప్సరసశ్చయే**

**ఉచ్ఛిష్టాజ్జజ్ఞిరే సర్వే దివి దేవా దివి శ్రితాః.** ౩౨ అథర్వ. ౧౧. ౭-౨౭

(దేవాః) విద్వాంసులు, సూర్యాదిలోకములు, (పితరః) యథార్థవిద్యలనెఱుగు జ్ఞానులు, (మనుష్యాః) విచారశీలురు. (గంధర్వాః) గానవిద్యావిశారదులు, సూర్యాదిలోకములు, (అప్సరసః) పైన వర్ణింపబడిన వారు స్త్రీలు నెల్లరు నా యీశ్వరుని సామర్థ్యమువలననే జనించిరి. (దివి దేవాః) ప్రకాశించువారు. ప్రకాశస్వరూపము గల సూర్యాదిలోకములు, (దివి శ్రితాః) చంద్రుడు, పృథివి మున్నగు ప్రకాశరహితములగు నాకాశస్థితలోకములు నన్నియు నతని సామర్థ్యమువలననే జనించినవి.

వేదమునందు నిట్టి సృష్టి విద్యా విషయమునకు సంబంధించిన మంత్రములు బహుసంఖ్యలో నున్నవి. గ్రంథవిస్తరభీతితో నిట సృష్టి విషయము సంక్షేపముగ వ్రాయబడినది.

## పృథివ్యాదిలోక భ్రమణ విషయము

సృష్టివిద్యావిషయ వర్ణనానంతరము పృథివ్యాదిలోకములు తిరుగుచున్నవా? లేదా? యను విషయమును గూర్చి యిట వ్రాయబడును.

వేదశాస్త్రములప్రమాణమువలనను, యుక్తివలనను, భూమి, సూర్యాదిలోకములు తిరుగుచున్నవి. యనియే సిద్ధాంతము. ఇందుకు ప్రమాణము:

**ఆయం గౌః పృశ్నిరక్రమీదసదన్మాతరం పురః.**

**పితరం చ ప్రయన్త్స్వః** యజు. ౩-౬

**గౌః, గ్మా, జ్మేత్యాద్యేక వింశతిషు పృథివీ నామసు,**
**గౌరితి పఠితం యాస్కకృతే నిఘంటౌ** అ. ౧-౧

**తథా చ- స్వః పృశ్నిః, నాక ఇతి షట్సు సాధారణనామసు.**

నిఘంటు అ. ౧-౪

**పృశ్నిరిత్యంతరిక్షస్య నామోక్తమ్.** నిరుక్తే ౨-౪-౧౪

**గౌరితి పృథివ్యా నామధేయం యద్ దూరం గతా భవతి.**

**యచ్చాస్యాం భూతాని గచ్ఛంతి.** ని. ౨-౫

**గౌరాదిత్యో భవతి. గమయతి రసాన్, గచ్ఛత్యంతరిక్షే అథద్యౌర్యత్**

**పృథివ్యా అధిదూరం గతా భవతి, యచ్చాస్యాం జ్యోతీంషి గచ్ఛంతి.**

ని. ౨-౧౪

**సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వ ఇత్యపి నిగమో భవతి, సోఽపి గౌరుచ్యతే**
నిరు. అ. ౨-౬

**స్వరాదిత్యో భవతి.** నిరు. ౨-౧౪

**గచ్ఛతి ప్రతిక్షణం భ్రమతి యా సా గౌః పృథివీ.**

**'అద్భ్యః పృథివీ' తి తైత్తిరీయోపనిషది.** ఆనంద. ౧.

(అయంగౌః) భూమి, సూర్యుడు, చంద్రుడు మున్నగు లోకములకు'గౌః' అని నామము. ఇవి యన్నియు నంతరిక్షమున తమ పరిధులలో నెల్లపుడు తిరుగుచుండును. జలము భూమికి మాతవంటిది. జలపరమాణువులతో భూపరమాణువులు సంయుక్తము లగుటవలన భూమి యేర్పడును. అట్లే యీ పృథివి మేఘమండలగత జలగర్భము మధ్యలో నెల్లపుడు నుండును. సూర్యుడు పృథివికి తండ్రివంటివాడు, పృథివి సూర్యుని జుట్టి తిరుగును. ఇట్లే సూర్యునకు తండ్రి వాయువు; తల్లి యాకాశము. చంద్రున కగ్ని తండ్రి; జలము తల్లి. ఇట్లే లోకములన్నియు వాని వాని కక్షలలో తిరుగుచుండును. ఈ మంత్రార్థవిషయమున నీ క్రింది ప్రమాణములు గ్రహింపదగినవి:-

'గౌః' పదమున కర్థము పృథివియని నిరుక్తమున వ్రాయబడినది: నిఘంటువున పృథివీ పర్యాయములలో'గౌః' అను పదము పఠింపబడినది.

౧. సూర్యునకు దూర దూరమున నిది గతి గలిగియుండును.

౨. దీనిలో ప్రాణులు గతి కలిగియుండును.

నిరుక్తమున సూర్యుడు కూడ 'గౌః' అని చెప్పబడినాడు. అతడు (౧) రసము నాకర్షించును. (౨) స్వయముగ నంతరిక్షమున చలించుచుండును.

'గౌః' అను పదమునకు ద్యులోకమనియు నిరుక్తమున నున్నది. (౧) ద్యులోకము పృథివికి చాల దూరమున నున్నది. (౨) ఇందు సూర్యాది జ్యోతిర్మయ లోకములు తిరుగుచుండును.

నిరుక్తమున, నాదిత్యునకు, 'స్వః' అనియు నామము చూడనగును. (౧) అంధకారమును బూర్ణముగ దూరమొనర్చును. (౨) రసములను బ్రతిగ్రహించుట కాదిత్యుడు దూరము పోయియున్నాడు. (౩) చంద్రుడు,పృథివి మున్నగు లోకములను బ్రకాశింపజేయును. (౪) దీప్తియుక్తమై యున్నది.

'పృశ్ని' అనగా నంతరిక్షమని నిరుక్తము. అందు సూర్యాది జ్యోతిర్మయలోకములున్నవి.

పృథివి జలమునుండి యుత్పన్నమైనట్లు తైత్తిరీయోపనిషత్తునందును వర్ణింపబడినది.

ఇట్లే సూత్రాత్మ యగు వాయువుయొక్క యాధారమునకు, ఆకర్షణమువలనను సర్వలోకములు ధరింపబడుచున్నవి- తిరుగాడుచున్నవి. అట్లే పరమేశ్వరుడు తన సామర్థ్యముతో పృథివ్యాది లోకముల ధారణ, భ్రమణ పోషణములను జరుపుచున్నాడు.౧

**"యా గౌర్ వర్తనిం పర్యేతి నిష్కృతం పయో దుహానా వ్రతనీరవారతః"**

**సా ప్రబ్రువాణా వరుణాయ దాశుషే దేవేభ్యో దాశద్ధవిషా వివస్వతే.**
ఋ. ౧౦-౬౫-౬

(యా గౌర్...) పూర్వమంత్రార్థమున నేయే లోకములు గౌర్ నామముతో చెప్పబడినవో యవియన్నియు తమ తమ కక్షలలో తిరుగును. భూమి తన కక్షలో సూర్యుని జుట్టి తిరుగుచున్నది. పరమేశ్వరు డేయే లోకమున కేయే మార్గము తిరుగుటకు నిశ్చయించెనో యాయా మార్గములందు లోకములన్నియు తిరుగుచున్నవి. (పయో రసములు, పుష్పములు, తృణములు, అన్నము- మున్నగు పదార్థములతో నిరంతరము ప్రాణులను పూర్ణమొనర్చును. అట్లే సర్వ లోకములు తమ తమ మార్గములలో నియమబద్ధములై తిరుగుచుండును. (సా ప్రబ్రువాణా) విద్యాద్యుత్తమ గుణముల నిచ్చు పరమేశ్వరు నెఱుగుటకే సంపూర్ణ జగత్తొక దృష్టాంత మనదగియున్నది: విద్వాంసులకీ లోక ముత్తమ పదార్థముల మూలమున ననేక విధములగు సుఖముల నొడగూర్చుచున్నది. పృథివి, సూర్యుడు, చంద్రుడు, వాయువు మున్నగు గోపద వాచ్యలోకములే సర్వప్రాణుల వాణికి నిమిత్తములు.

**త్వం సోమ పితృభిః సంవిదానోఽను ద్యావాపృథివీ ఆ తతంథ.**

**తస్మై త ఇంద్రో హవిషా విధేమ వయం స్యామ పతయో రయీణామ్.**
ఋ. ౮-౪౮-౧౩

(త్వం సోమ....) ఈ మంత్రమున తండ్రివలె పోషకగుణములతో గూడిన చంద్రలోకము పృథివిని చుట్టితిరుగుచున్నట్లు వర్ణింపబడినది. అప్పుడప్పు డీ చంద్రుడు సూర్యునకును భూమికిని మధ్య వచ్చుచుండును. (ద్యావా పృథివీ) ప్రకాశయుక్త సూర్యాది లోకములు, ప్రకాశరహితములగు భూమి, చంద్రుడు మున్నగు లోకములు నన్నియు తమ తమ కక్షలలో నెల్లపుడుతిరుగుచుండును కావున లోకములన్నియు భ్రమణ మొనర్చుచుండుననియే సిద్ధమగుచున్నది.

## ఆకర్షణానుకర్షణ విషయము

**యదా తే హర్యతా హరీ వావృధాతే దివే దివే.**

**ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే.** ౧. ఋ. ౮-౧౨-౨౮

(యదా తే......) సర్వలోకములతో సూర్యునకును, సూర్యాది లోకములతో నీశ్వరునకును నాకర్షణ మున్నదని యీ మంత్రాభిప్రాయము; ౧. (యదా తే) ఓ ఇంద్ర! పరమేశ్వర! నీయనంత బలపరాక్రమాది గుణముల మూలమున బ్రహ్మాండధారణము, (హరణ) ఆకర్షణము, పాలనము (ప్రకాశనము)లు జరుగుచున్నవి. నీ గుణములే సూర్యాదిలోకములను ధరించుచున్నవి. కావున నెల్లలోకములు తమ కక్షలు విడిచి యిటు నటు చలింపజాలవు. ౨. ఇంద్రుడు=వాయు=సూర్యుడు. సూర్యునిలో నీశ్వరునిచే రచియింపబడిన ఆకర్షణము, బలము, ప్రకాశము మున్నగు గొప్ప గుణములున్నవి. ఆ గుణముల వలన ప్రతి దినము, ప్రతి క్షణము సర్వలోకముల యొక్క ధారణాకర్షణ ప్రకాశాదులు నిర్వర్తింపబడుచున్నవి. అందువలన లోకములన్నియు వాని వాని కక్షలలో తిరుగుచు నిటునటు విచలితములుకావు.

**యదా తే మారుతీర్ విశస్తుభ్య మింద్ర నియేమిరే.**

**ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే. ౨** ఋ.౮-౧౨-౨౯

ఈ మంత్రమునందును నాకర్షణ విద్యావిషయమున్నది. (యదా తే మారుతీః) ఓ పరమేశ్వర! ఉత్పత్తి, స్థితి, లయములు గల నీ ప్రజలో- సృష్టిలో-వాయువు ప్రధానము-ముఖ్యమైనది. అయ్యది నీ యాకర్షణాది నియమముల వలనను, సూర్యలోకాకర్షణము వలనను స్థిరముగా నున్నది. నీ గుణము లీ ప్రజను నియమములందుంచుట వలననే లోకములన్నియు వాని వాని కక్షలలో తిరుగు చున్నవి; వాని వాని స్థానములలో నిలిచియున్నవి.

**యదా సూర్యమముం దివి శుక్రం జ్యోతి రధారయః**

**ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే.** ఋ. ౮-౧౨-30

ఈ మంత్రముకూడ నాకర్షణ విషయకమే. (యదా సూర్య) ఓ పరమేశ్వర! యీ సూర్యాదిలోకములను నీవే రచించితివి. నీ ప్రకాశముచేతనే యివి ప్రకాశితము లగుచున్నవి. నీవు నీ యనంతసామర్థ్యముతో వీని ధరించుచున్నావు. అందువలననే సూర్యుడు, పృథివి మున్నగు లోకములు కూడ తమ స్వరూపమును నిలుపుకొనుచున్నవి. ఇతర సర్వలోకములతో బాటు ఆకర్షణ వలననే యీ సూర్యాది లోకములయు ధారణ జరుగుచున్నది. సూర్యుని యాకర్షణ వలన పృథివ్యాదిలోకములు స్థితములై యున్నట్లు పరమేశ్వరుని యాకర్షణ వలననే సూర్యాది సర్వలోకములు నియమబద్ధములై యున్నవి. దీనింబట్టి పరమేశ్వరుడు సర్వలోకముల నాకర్షించుచున్నాడు; ధరించుచున్నాడని సిద్ధమగుచున్నది.

**వ్యస్తభ్నాద్ రోదసీ మిత్రో అద్భుతోంతర్వావదకృణో జ్యోతిషాతమః**

**విచర్మణీవ ధిషణే అవర్తయద్ వైశ్వానరో విశ్వ మధత్త వృష్ణ్యమ్.**

౪. ఋ. ౬-౮-౩

ఈ మంత్రమునందు నాకర్షణ విషయమే వర్ణింప బడినది. పరమేశ్వరుడు సూర్యలోకము రెండును నాకర్షణ ప్రకాశముల మూలమున సర్వలోకములను ధరించుచున్నవి. ఓ పరమేశ్వర! నీ ప్రకాశమువలననే వైశ్వానర, సూర్యాదిలోకములధారణ ప్రకాశములు గలుగుచున్నవి. కావుననే సూర్యాది లోకములు కూడ తమ యాకర్షణ వలన తమ యొక్కయు, పృథివ్యాదిలోకములయు ధారణ నొనర్చుటలో సమర్థము లగుచున్నవి. కాబట్టి నీ సర్వలోకములకు పరమ మిత్రుడవు; స్థాపకకర్తవును. నీ సామర్థ్య మత్యంతాశ్చర్యకరము నీ యద్భుత స్వరూపము కారణముగ సూర్యాది లోకములు తమ ప్రకాశముతో నంధకారమును దొలగించుచున్నవి. అట్లే ప్రకాశరూపులు, నప్రకాశరూపులు నగు ఉభయలోకసముదాయము ధారణాకర్షణ వ్యవహారమున వర్తించుచున్నది. అందువలననే యీ లోకముల వలన నానావిధ వ్యవహారములు సిద్ధించుచున్నవి. చర్మముల రోమముల యాకర్షణ యున్నట్లు సూర్యాదిలోకముల యాకర్షణతో బాటు సర్వలోకముల యాకర్షణ జరుగుచున్నది. ఇదియే యాకర్షణ రీతి. దీనింబట్టి వీర్యమువలె సూర్యాదిలోకములు సమస్త విశ్వమును ధరించుచున్నవనియు, పరమేశ్వరుడు కూడ నీ సూర్యాదిలోకముల నాకర్షించి ధరించుచున్నాడనియు తేలుచున్నది.

**ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యం చ,**

**హిరణ్యయేన సవితా రథేన దేవో యాతి భువనాని పశ్యన్.** ౫.యజు. 33-43

**రజో లోకానాం నామాస్తి, అత్రాహుర్ నిరుక్త కారా యాస్కాచార్యాః**

**లోకా రజాం స్యుచ్యంతే.** ని. ౪-౧౯

**రథో రంహతే ర్గతి కర్మణః, స్థిరతేర్ వా స్యా ద్విపరీతస్య.**

**రమ మాణోఽస్మింస్తిష్ఠతీతి వా, రపతేర్ వా, రసతేర్ వా.** నిరు. ౯-౧౧

**విశ్వానరస్యాదిత్యస్య** నిరు౧౨-౨౧

**అతో రథ శబ్దేన రమణానందకరం జ్ఞానం తేజో గృహ్యతే.** ౧౩

ఈ మంత్రమునందును నాకర్షణను గూర్చియే వర్ణింపబడినది. (ఆకృష్ణేన) సవితా- పరమేశ్వరుడు, సూర్యుడు సర్వలోకములతో బాటు ఆకర్షణ, ధారణగుణములతో గూడియున్నాడు. పరమాత్ముడు, సూర్యుడు నిరువురును (హిరణ్య) జ్యోతిర్మయులు. (రథేన) అట్లే క్రమముగ వారిరువురు నానందాది వస్తుసాధకములగు జ్ఞానము, తేజస్సులతో గూడియున్నారు. పరమేశ్వరుడు మర్త్యం- మనుష్యుల హృదయములలో నమృతము- సత్యవిజ్ఞానమును ప్రకాశింప జేయును. సూర్యుడును రసాదిపదార్థములను మనుష్యలోకమున ప్రవేశింప జేయును. పరమేశ్వరుడు, సూర్యుడు నిరువురును సర్వలోకములను వాని వాని స్థానములలో నుండునట్లు చేయుచున్నారు. పరమేశ్వరుడు ధర్మాత్ములు, జ్ఞానులునగు వారికి నమృతరూపమోక్షము నొసంగును. సూర్యలోకము నట్లే రసయుక్తములగు నోషధులను, వృష్టిజలరూపమగు నమృతమును పృథివికి నొసంగును. పరమేశ్వరుడు సత్యాసత్యముల ప్రకాశమును, సర్వలోక ప్రకాశమును జేసి యెల్లరకు తెలియచేయును. అట్లే సూర్యలోకముగూడ రూపాదివిభాగజ్ఞానము గలిగించును. ఇట్లిరువురు సర్వలోకధారకు లగుచున్నారు ఈ మంత్రమున దీనికి పూర్వపు మంత్రమునుండి 'ద్యుభిః' 'అక్తుభిః' అను పదముల నన్వయించిన (ద్యు=దినము, అక్తు=రాత్రి), రేయింబవళ్ళు-ఎల్లపుడు సర్వలోకములను సూర్యుడాకర్షించుచున్నట్లును, నా సూర్యాదిలోకములను పరమేశ్వరుడాకర్షించుచున్నట్లును దెలియును. ఇట్లు ఈశ్వర రచనవలననే సర్వలోకములందును నాయా లోకముల యాకర్షణ జరుగుచున్నది. పరమేశ్వరుని యాకర్షణ శక్తి మాత్ర మనంతము.

రజస్సన లోకములని యాస్కముని. అతడు రథ శబ్దమున కనేకార్థములు చెప్పియున్నాడు. (౧) గమనార్థకమగు రంహ ధాతువుతో రథ శబ్దమేర్పడును. మనుష్యుడు రథ సహాయమున నిటునటు వెళ్ళును. (౨) స్థిర శబ్దమున గల యక్షరములను విపరీతము చేసిన రస్థి, రస్థ, రథము అని క్రమముగా నేర్పడుచున్నది. మానవుడు రథము మీద స్థిరముగా కూర్చుండగలడని భావము. (౩) రస + స్థా + డః రథము. దీనిమీద మనుష్యుడు ఆనందముగ లేక విశ్రాంతిగ గూర్చుండనగును. (౪) శబ్దార్థకమగు 'రప' ధాతువు వలనగాని, 'రస' ధాతువు వలనకాని రథశబ్దము సిద్ధించును. నడచునపుడు ధ్వని యగును కావున రథ మనబడునని భావము.

కావున దేనివలన రమణము- ఆనందము- ప్రాప్తించునో యది రథమని చెప్పబడును. ఈ కారణమువలననే రథమున కర్థము ఆనందదాయక జ్ఞానము, తేజస్సు నని చెప్పబడినది.

నిరుక్తమున ఆదిత్యుడను నర్థమున విశ్వానర పదము చూడనగును. విశ్వానర శబ్దమునకీ క్రింది యర్థము లున్నవి.

(౧) (విశ్వాన్ నరాన్ నయతి) సూర్యుడు పృథివ్యాది లోకముల నన్నింటిని నాకర్షణము మూలమున దనతో తీసికొనిపోవును. (౨) (విశ్వ ఏనం) మనుష్యులెల్లరు నీ సూర్యుని తేజస్సును పొందుదురు. (౩) (విశ్వాన్ పదార్థాన్ అరః గతః) సర్వపదార్థములందును నితడు ప్రాప్తించియున్నాడు. లేక సర్వ పదార్థముల నితడు వ్యాపించియున్నాడు. సూర్యుడు కూడ లోకముల నాకర్షించి, ధరించునని భావము.

వేదములందు ధారణాకర్షణాదులను తెలుపు మంత్రములు పెక్కు కలవు.

## ప్రకాశ్యప్రకాశక విషయము

**సత్యేనోత్తభితా భూమిః సూర్యేణోత్తభితా ద్యౌః,**

**ఋతేనాదిత్యా స్తిష్ఠంతి దివి సోమో అధిశ్రితః.౧** అథర్వ. ౧౪-౧-౧

**సోమేనాదిత్యాబలినః సోమేన పృథివీ మహీ,**

**అథో నక్షత్రాణా మేషా ముపస్థే సోమ ఆహితః. ౨** అథర్వ. ౧౪-౧-౨

**కః స్విదేకాకీ చరతి క ఉ స్విజ్జాయతే పునః,**

**కిం స్విద్ధిమస్య భేషజం కిం వా వపనం మహత్.౩** యజు. ౨౩-౯

**సూర్య ఏకాకీ చరతి చంద్రమా జాయతే పునః,**

**అగ్నిర్ హిమస్య భేషజం భూమి రావపనం మహత్.** ౪ యజు. ౩-౧౦

లోకములు రెండు విధములు. స్వయంప్రకాశించు లోకము లొకరకము. పరప్రకాశితములగు లోకములు రెండవరకము. పై మంత్రములలో నిట్టి లోకముల విషయమే వర్ణింపబడినది.

(సత్యేనోత్తభితా భూమిః) సత్యస్వరూపుడగు పరమేశ్వరుడు తన సామర్థ్యముతో సూర్యాదిలోకముల ధరించియున్నాడు. అతని సామర్థ్యము వలననే సత్యము- సూర్యలోకము కూడ నన్యలోకముల నాకాశమున ధరించి ప్రకాశింపజేయుచున్నది. (ఋతేన) కాలము, సూర్యుడు, వాయువు వీని యాధారమున క్రమముగ పండ్రెండు మాసములు, కిరణములు, త్రసరేణువులు స్థిరములై యున్నవి. (అట్లే ఋతము- కాలము, మహి, సూర్యుడు, కిరణములు, వాయువు నన్నియు వాని వానికి తగినట్లు సూక్ష్మములు, స్థూలములు నగు త్రసరేణ్వాది పదార్థములను ధరించియున్నవి. అను నీ పాఠము హస్తలిఖిత పుస్తకములో నధికముగ నున్నట్లు మూలగ్రంథ సంపాదకుడు.) (దివి సోమో....) ఇట్లే సూర్యుని ప్రకాశసహాయముతో చంద్రుడు ప్రకాశితుడగుచున్నాడు. చంద్రునివంటి లోకములందు స్వయముగ ప్రకాశించు శక్తి లేదు. చంద్ర, పృథివ్యాదిలోకములన్నియు సూర్యుని ప్రకాశమువలననే ప్రకాశించుచున్నవి. ఈశ్వరుని ప్రకాశమెల్లయెడల నుండును. ౧

(సోమేనాదిత్యా) సూర్యకిరణములు చంద్రలోకమును జేరి యటనుండి ప్రతిఫలితములై భూమిని ప్రాపించి బలము నొసంగును. బలము నొసంగుట వానికి స్వభావము. అవి శీతలములు కూడ. ఆకాశమున నేయేప్రదేశములలో భూమి సూర్యకిరణముల నడ్డగించునో యా దేశములందు శీత మెక్కువగును. ఏ ప్రదేశములలో సూర్యకిరణములు వంకరగా ప్రసరించునో యట వేడిమి తక్కువగా నుండును. వేడితగ్గి శీత మెక్కువయైన తావులలో మూర్తిమంతములగు పదార్థములలోని పరమాణువులు ఘనీభవించును. అందువలన పుష్టి యేర్పడును. సూర్యుని తేజోరూప కిరణములు పదార్థములపై బడినపుడు వానినుండి బాష్పము బయలు వెడలును. వానియోగముచే కిరణములు బలపడును. జలమునందు సూర్యుని ప్రతిబింబ మెక్కువగా ప్రకాశించును. చంద్రుని ప్రకాశమువలన సోమలతాద్యోషధులు పుష్టి గలవి యగును. వానివలన పృథివి పుష్టమగును. కావుననే యీశ్వరుడు నక్షత్రలోకములకు సమీపమున చంద్రుని నిలిపినాడు. ౨

(కః స్వి.....) ఈ మంత్రమున నాలుగు ప్రశ్నలున్నవి. ౧. ఈ బ్రహ్మాండమున నెవ డేకాకియై చరించుచున్నాడు? తన ప్రకాశముచే నెవడు ప్రకాశించుచున్నాడు? ౨. ఇతరుని ప్రకాశముచే ప్రకాశించు వాడెవడు? ౩. చలికి ఔషధ మేమి? ౪. బీజములను నాటుటకు పెద్దక్షేత్రము వంటిది- స్థూలపదార్థముల నుంచుటకు స్థాన మెయ్యది? ౩

పై నాలుగు ప్రశ్నలకు క్రమముగా నీ మంత్రమున సమాధానములు చెప్పబడినవి.

(సూర్య ఏకాకీ) ౧. ఈ బ్రహ్మాండమున సూర్యు డేకాకియై తిరుగుచున్నాడు. అతడు తన యక్షమునైననే చలించును; తాను స్వయం ప్రకాశస్వరూపుడై యెల్లలోకములను బ్రకాశింపజేయువాడై యున్నాడు. ౨. ఆ సూర్యుని ప్రకాశముచేతనే చంద్రుడు ప్రకాశించు చున్నాడు. ౩. చలికి ఔషధ మగ్ని. ౪. పృథివి సాకారవస్తువుల నుంచుటకు స్థానమై యున్నది; విత్తనముల నన్నింటిని నాటుటకు సమసమంత పెద్ద క్షేత్రము.

## వేదాలలో గణిత విద్య

ఏకా చ మే, తిస్రశ్చ మే తిస్రశ్చ మే, పంచ చ మే పంచ చ మే, సప్త చ మే సప్త చ మే, నవ చ మే నవ చ మే, , ఏకాదశ చ మ ఏకాదశ చ మే, త్రయోదశ చ మే త్రయోదశ చ మే, పంచదశ చ మే పంచదశ చ మే, సప్తదశ చ మే సప్తదశ చ మే, నవదశ చ మే నవదశ చ మ, ఏకవింశతిశ్చ మ ఏకవింశతిశ్చ మే, త్రయోవింశతిశ్చ మే త్రయోవింశతిశ్చ మ ఏకవింశతిశ్చ మే, త్రయోవింశతిశ్చ మే త్రయోవింశతిశ్చ మే, పంచవింశతిశ్చ మే పంచవింశతిశ్చ మే, సప్తవింశతిశ్చ మే సప్తవింశతిశ్చ మే, నవవింశతిశ్చ మే నవవింశతిశ్చ మ, ఏకత్రింశచ్చ మ ఏకత్రింశచ్చ మే, త్రయస్త్రింశచ్చ మే యజ్ఞేన కల్పంతామ్. ౧

యజు. ౧౮-౨౪

చతస్రశ్చమేఽష్టౌ చ మేఽష్టౌ చ మే, ద్వాదశ చ మే ద్వాదశ చ మే, షోడశ చ మే షోడశ చ మే, వింశతిశ్చ మే వింశతిశ్చ మే, చతుర్వింశతిశ్చ మే చతుర్వింశతిశ్చ మేఽష్టావింశతిశ్చ మేఽష్టావింశతిశ్చ మే, ద్వాత్రింశచ్చ మే ద్వాత్రింశచ్చ మే షట్త్రింశచ్చ మే, చత్వారింశచ్చ మే చత్వారింశచ్చ మే చతుశ్చత్వారింశచ్చ మేఽష్టాచత్వారింశచ్చ మే యజ్ఞేన కల్పంతామ్.౨

యు. అ, ౧౮-౨౫

ఈ మంత్రములలో బరమేశ్వరుడు అంకగణితము, బీజగణితము, రేఖాగణితమునకు సంబంధించిన విద్యను ప్రకటించి యున్నాడు.

(ఏకా) అందు ప్రథమాంకము ౧. అది రెండుమారులు లెక్కించిన రెంటికి వాచకమగును. ౧+౧=౨. అట్లే ఒకటికి తరువాత నొకటిం ఒకటికి తరువాత రెండు, లేక రెంటికి తరువాత నొకటి, మున్నగు సంఖ్యలు జోడించినపుడును తెలిసికొనవలెను. ఇట్లే ఒకటిలో మూడు

కలిపిన నాలుగు ౪; మూటితో మూడు కలిపిన ఆఱు ౬. మూటిని మూటితో గుణించిన 3X3=౯ తొమ్మిది అగును. ౧

ఇట్లే నాలుగుతో నాలుగు, నైదుతో నైదు, ఆఱుతో నాఱు, ఎనిమిదితో నెనిమిది మున్నగునవి కలిపినను, లేక గుణించినను కలుగు పరిణామము తెలిసికొననగును. అట్లే యెల్ల మంత్రముల యాశయము విస్తరింపజేసినచో సంపూర్ణ గణిత విద్య తెలియనగును ఐదు సంఖ్యకు ప్రక్కన నైదు, ఆఱుకు ప్రక్కన నాఱు, ఏడుకు ప్రక్కన నేడు వ్రాసి నందున గలుగు సంఖ్యలు, (౫౫, ౬౬, ౭౭) తెలియనగును. ఇట్లే యీ మంత్రముల యర్థము లను యోచించినచో నంకెలతో ననేక విధములగు గణితవిద్య సిద్ధించును. ఈ మంత్రముల యర్థముల మూలమునను, ప్రయోగములవలనను ననేక విధములగు గణితవిద్యలను మనుష్యులెఱుంగవలెను. ౨

ఇట్టిమంత్రాభిప్రాయముల సహాయముతోనే జ్యోతిష శాస్త్రమునందు గణిత విద్య సిద్ధము చేయబడినది. అంకెల మూలమున నేర్పడు గణితవిద్య నిశ్చితములు, సంఖ్యాతములునగు పదార్థములలో నుండును.

ఏ పదార్థముల సంఖ్య తెలియదో దానిసని తెలికొనుటకు నుపయోగించు బీజగణితము కూడ (ఏకా చ మే) అను ఏ మంత్రముల వలన సిద్ధమగును. ($అ^2$+$క^2$) ($అ^2$-$క^2$) ($క^2$ $అ^2$) ఇట్టి సంకేతములవలన నజ్ఞాత వస్తుసంఖ్య తెలియనగును. ఈ బీజగణితము కూడ ఋషులు, మునులు వేదమంత్రములనుండియే కనిపెట్టిరి.

౨౩ ౧౨ ౩౧౨ ౩౨౩ ౧౨ ౧ ౨ర ౩౧౨
అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాతయే, నిహోతా సత్సి బర్హిషి౩

సామ. వ,౨ ప్ర. ౩-౧ ఖ,-౧. మం.౧

'అగ్న ఆ' ఈమంత్రమున స్వరమును సూచించు అంకెలమూలమున బీజగణితము తెలియనగును.

**ఏవం గణితవిద్యాయా రేఖాగణితం తృతీయో భాగః సోఽప్యత్రోచ్యతే. ఇయం వేదిః పరో అంతః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః, అయꣳ సోమో వృష్ణో అశ్వస్య రేతో బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ.** ౪ య. ౨౩-౬౨

**కాసీత్ ప్రమా ప్రతిమా కిం నిదాన మాజ్యం కిమాసీత్ పరిధిః క ఆసీత్, ఛందః కిమాసీత్ ప్రఉగం కిముక్థం యద్దేవా దేవ మయజంత విశ్వే.**

౫ ఋ. ౧౦-౧౩౦-౩

గణితవిద్యలో మూడవభాగమగు రేఖాగణితము కూడ నిట్లు వేదమువలన సిద్ధమగును.

(ఇయం వేదిః) అభిప్రాయము - ఈ మంత్రములలో రేఖాగణితము ప్రకటింపబడినది. యజ్ఞవేదికను రచించు విధానమున రేఖాగణితముకూడ నుపదేశింపబడినది.

త్రికోణము, చతుష్కోణము, శ్యేనపక్షి యగాకారము, గోళాకారముమున నానావిధాకారములలో వేదిక సిద్ధము చేయబడును. ఈ యాకారములు రేఖాగణితమునకు దృష్టాంతములుగ నార్యులు గ్రహించియున్నారు. (పరో అన్తః పృ....) పృథివియొక్క చుట్టుకొలత పరిధి యనబడును. (యజ్ఞో) పైనుండి క్రిందవఱకు కలుపు పృథివియొక్క రేఖ వ్యాస మనబడును. ఇదియే సమస్త ప్రపంచమునకు నాభి. (అయꣳ సోమ) చంద్రాదిలోకములు కూడ నిట్లే పరిధి, వ్యాసము కలిగియున్నవి. (వృష్ణో అశ్వ) వర్షము నొసంగు సూర్యుడు, అగ్ని, వేగమునకు హేతువగు వాయువు మున్నగు వానికి కూడ పరిధి, వ్యాసము మున్నవి. (రేతః) శక్తినుత్పన్నము చేయుటకు నోషధిరూపమున నుండు నీని వీర్యము కూడ నెల్లయెడల వ్యాప్తమైయున్నది (బ్రహ్మాయం వా) బ్రహ్మము (పరమం వ్యోమ) వాణియొక్క పరిధిరూపమున లోపల వెలుపల నంతటను మున్నది. ఇట్లే యీ మంత్రమువలన నాడిమధ్యాంతాదిరేఖలను నైతమెఱుంగవలెను. తిర్యగ్రేఖలు, విషువత్ రేఖలు కూడ నిట్లే తెలియనగును.

(కాసీత్ప్ర.....) ౧. యథార్థజ్ఞానమెయ్యది? )(ప్రతిమా) ౨. పదార్థములను తూచున దేది? (నిదానమ్) ౩. దేనివలన కార్యముత్పన్నమగునో యాకారణ మెయ్యది? (ఆజ్యం) ౪. జగత్తున దెలియదగు ఘృతమువలె సారభూత వస్తువెయ్యది? లేక సర్వదుఃఖ నివారకమగు నానందముతో స్నిగ్ధమైన సారభూత వస్తువెయ్యది? (పరిధి) ౫. పరిధియని దేనినందురు? (ఛందః) ౬. స్వతంత్ర వస్తువెయ్యది? (ప్ర ఉ) ౭. ప్రయోగించుటకు యోగ్యము, స్తుతించుటకు యోగ్యము నెయ్యది? ఈ యేడు ప్రశ్నలకును సమాధానము:- (యద్దేవాదేవ) విద్వాంసులెల్లరు దేనిని పూజింతురో యా పరమేశ్వరుడే 'ప్రమ' మున్నగు నామములతో జెప్పబడును. (ప్రమా) యథార్థజ్ఞానము గలవాడు. (ప్రతిమా) పరిమాణమును కొలుచువాడు. ఇట్లే ముందు రాబోవు శబ్దముల కర్థము చెప్పుకొనవలెను.

ఈ మంత్రములందును పరమేశ్వరుడు ప్రమ, పరిధి మున్నగు శబ్దములతో రేఖాగణితమును సిద్ధమొనర్చుట కుపదేశించియున్నాడు. కావున త్రివిధములగు నీ గణిత విద్యను ఆర్యులు వేదములనుండియే కనిపెట్టిరి. ఈ విద్య యార్యావర్తమునుండియే యితర దేశములందన్నింటిలోను వ్యాపించినది. ఈ విద్య జ్యోతిష శాస్త్రమున విపులముగ జూడ నగును. ఈ విషయమును బ్రతిపాదించు మంత్రములు వేదములందు పెక్కు కలవు.

## వేదాలలో ఈశ్వరస్తుతిప్రార్థనాయాచనాసమర్పణోపాసనావిద్య

గణితవిద్యావిషయమొకింత వివరించి, తదుపరి 'తేజో౽సి' మున్నగు మంత్రముల మూలమున ముఖ్యముగ ప్రార్థన, యాచన, సమర్పణము, ఉపాసనములను గూర్చి వ్రాయుచున్నాము. 'యో భూతం చ' మున్నగు మంత్రములందు గల యర్థములను వివరించుచు నుపాసనను గూర్చి యింతకు పూర్వమే కొంత వ్రాసియున్నాము. ఇంకను ముందు వ్రాయనున్నాము. ఇట ముందు ప్రార్థనా విషయము వ్రాయుచున్నాము.

**తేజో౽సి తేజో మయి ధేహి; వీర్యమసి వీర్యం మయి ధేహి;**

**బలమసి బలం మయి ధేహి; ఓజో౽స్యోజో మయి ధేహి;**

**మన్యురసి మన్యుంమయి ధేహి; సహో౽సి సహో మయి ధేహి.** ౧

య. ౧౯-౯

**మయీదమింద్ర ఇంద్రియం దధాత్వస్మాన్ రాయో మఘవానః సచంతామ్,**

**అస్మాకꣳ సంత్వాశిషః సత్యా నః సంత్వాశిషః ౨** య. ౨-౧౦

**యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే.**

**తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా. ౩** య. ౩౨-౧౪.

(తేజో౽సి) ఓ పరమేశ్వర! నీవు అనంతవిద్యాదిగుణములచే ప్రకాశ స్వరూపుడవు; కృపతో నా హృదయమునందు విజ్ఞానరూపప్రకాశమును కలిగింపుము. (వీర్యమసి) ఓ జగదీశ్వర! నీ పరాక్రమమునకు అంతము లేదు; నా శరీరమునందును, బుద్ధియందును శౌర్యము, స్ఫూర్తి మున్నగు గుణరూప పరాక్రమము కలుగజేయుము. (బలమసి) ఓ అనంతబల యుక్త మహేశ్వర! దయయుంచి నా శరీరమునందును ఆత్మయందును పూర్ణబలమును చేకూర్చుము. (ఓజో౽సి) సర్వశక్తిమంతుడ! సమస్త సామర్థ్యమునకు నీవు నిలయుడవు. కరుణించి నాయందును ఉచిత సామర్థ్యమును గలిగింపుము - నాకు సత్యవిద్యాబలమును ఒసంగుము. (మన్యురసి) ఓ దుష్టులపై క్రోధముజూపు దేవ! దుష్టకార్యములను, దుష్టులను కోపించు స్వభావము నాకును గలిగింపుము. (సహో౽సి) ఎల్లరను సహించు స్వభావము గల యీశ్వర! నీవు పృథివ్యాదిలోకములను ధరించువాడవు - నాస్తికుల దుష్టవ్యవహారములను కూడ సహింతువు. అట్లే సుఖదుఃఖములు, హాని లాభములు, శీతోష్ణములు, క్షుత్పిపాసలు, యుద్ధము మున్నగు వాని నన్నింటిని సహించువానినిగ నన్ను చేయుము- సర్వశుభగుణములను నా కొసంగి, దుర్గుణములను అన్నింటిని దూరమొనర్తువు గాక!౧

(మయీదమింద్ర) ఓ ఉత్తమైశ్వర్యయుక్త పరమేశ్వర! కరుణించి యుత్తమములగు శ్రోత్రాదీంద్రియములను, శ్రేష్ఠస్వభావయుక్తమగు మనస్సును నాకు ప్రసాదింపుము- ఉత్తమ గుణములను, పదార్థములను మా కెల్లపుడు జేకూర్చుము (అస్మాన్ రాయో) ఓ పరమైశ్వర్యయుక్త దేవ! ఉత్తమరాజ్యాదిధనము గలవారమగునట్లు మమ్ములను అనుగ్రహింపుము. (సచంతామ్) మేమెల్లప్పుడు ఉత్తమగుణములను గ్రహించువారమై, ఉత్తమ కర్మములను ఒనర్చువారమగు నట్లనుగ్రహింపుము.

(అస్మాకꣳ స) ఓ పరమేశ్వర! నీ కృపవలన మా కోరికలు ఎల్లపుడు సత్యము లగుగాక! సత్యకర్మమును ఒనర్చుటకే మాకు కోరిక ఉదయించును గాక! చక్రవర్తి రాజ్యస్థాపనాది గొప్పకార్యము లొనర్పగల యోగ్యత మాకు ప్రసాదింపుము.౨

(యాం మేధాం) ఓ పరమాత్మ! అత్యంతోత్తమములగు సత్య విద్యాది గుణములను ధారణసేయగల బుద్ధిని మాకు దయతో నొసంగుము. విద్వాంసులు, జ్ఞానులు నే మేధాబుద్ధిని ఉపాసించిరో ఆ మేధాబుద్ధిని మాకు నొసంగుము. దానితో మేము సదా నిన్నుపాసింతుము.

స్వాహా శబ్దము నీ క్రిందజూపిన విధమున నిరుక్తమున యాస్కముని పలువిధముల నిర్వచించియున్నాడు. చూడుడు:-

(సు ఆహేతి వా) మధురము, శుభంకరమును అగు ప్రియవచనమునే యెల్లపుడు నెల్లరు పలుకవలెను. (స్వా వాగాహేతి వా) మానవులు తమ జ్ఞానమున ఉన్నట్లే జిహ్వతో గూడ చెప్పవలెనని గుర్తింప వలెను. (స్వం ప్రాహేతి వా) ఎల్లరు తమ పదార్థమునే తమదిగా చెప్పవలెను. ఇతరులని తమదిగా చెప్పరాదు - ధర్మముతో ప్రయత్నించి సంపాదించిన దానితో తృప్తినొందవలెను. (స్వాహుతం వా) సుగంధయుక్తపదార్థములను బాగుగ సంస్కరించి వానితో జగత్తుకు ఉపకరించు హోమము చేయవలెను.

**స్థిరా వః సంత్వాయుధా పరాణుదే వీలూ ఉత ప్రతిష్కభే,**

**యుష్మాక మస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య మాయినః ౨**

ఋ. ౧-౩-౧౮-౨

(స్థిరా వః) ఈ మంత్రమునందు ఈశ్వరుడు మానవులను ఆశీర్వదించుచున్నాడు. ఓ మానవులారా! మీరు నిరంతరము ఉత్తమబలము కలిగియుండుడు. (ఆయుధాః మీఆ గ్నేయాద్యస్త్రములు, శతఘ్నులు, భుశుండులు, తుపాకులు, ధనుర్బాణములు మున్నగు శస్త్రములు నన్నియు స్థిరములగుగాక! (పరాణుదే) అట్లే నా కృపవలన మీ యస్త్రశస్త్రము లన్నియు శత్రువులను జయింపదగినవిగ ఉండును గాక! (వీలూ) మీ అస్త్రములు దృఢములు, ప్రశంసనీయములు నగుగాక! (ఉత ప్రతిష్కభే) మీ యస్త్రశస్త్రములు దుష్ట శత్రువుల సేనల వేగము నడ్డగింప సమర్థము లగుగాక! (యుష్మాకమస్తు తవిషీ) మీ సేనయు ప్రశంసాపాత్ర మగుగాక! అందువలన మీ బల మఖండితమై, చక్రవర్తి రాజ్యము స్థిరముగా నుండుగాక! మీ దుష్టశత్రువులు సదా పరాజయమును పొందుదురు గాక! కాని, నాఈ ఆశీర్వాదము ధర్మాత్ములు, న్యాయకారులగు శ్రేష్ఠమానవులకు మాత్రమే వర్తించును. (మా మర్త్యస్య) మాయావులు, కపటులు, అన్యాయకారులు, దుష్టులు నగు మనుష్యులకు గాదు. వారు సదా పరాజయమునే పొందుదురు. కావున మీ రెల్లపుడు ధార్మికులుగా ఉందురు గాక! ౪

**ఇషే పిన్వస్వోర్జే పిన్వస్వ, బ్రహ్మణే పిన్వస్వ, క్షత్రాయపిన్వస్వ,**

**ద్యావా పృథివీభ్యాం పిన్వస్వ, ధర్మాసి సుధర్మా మేన్యస్మే నృమ్ణాని ధారయ;**

**బ్రహ్మ ధారయ, క్షత్రం ధారయ, విశం ధారయ.౫** యజు. ౩౮-౧౪

(ఇషే పిన్వస్వ) హే భగవన్! మాకు శుభకర్మము లొనర్చుటకే కోరికలు కలుగుగాక! మా శరీరములను ఉత్తమ భోజ్య పదార్థముల ద్వారమున పుష్టములగునట్లు చేయుము. (ఊర్జే) నీదయ వలన మే ముత్తమ పరాక్రమయుక్తులమై, దృఢప్రయత్నముల నొనర్చు వారలమగునట్లనుగ్రహింపుము. (బ్రహ్మణే) సత్యశాస్త్రములను-వేద విద్యలను చదివి, చదివించి, వానినుండి తగిన యుపకారమును పొందుటకు సామర్థ్యము నొసంగుము. అందువలన మే ముత్తమ విద్యాదిగుణ కర్మములు గలవారమై బ్రాహ్మణ వర్ణమునకు యోగ్యుల మగుదుము. (క్షత్రాయ) ఓ పరమేశ్వర! నీ కృపవలన మేము చక్రవర్తి రాజ్యము కలవారమై శూరులము, వీరులము నగుదుము గాక! ఉత్తమ సేనగల వార మగుదుము గాక! ఇట్లు క్షత్రియ వర్ణమున కధికారుల మగునట్లు చేయుము. (ద్యావా పృథివీ) భూమి, జలము, సూర్యుడు, వాయువు, మున్నగు పదార్థముల వలన సమస్తజగత్తునకు ప్రకాశము, ఉపకారము కలుగునట్లు కళాకుశలులమై విమానాది యానములను నడపుటకు మమ్ముల నుత్తమ సుఖయుక్తుల నొనర్పుము. అందువలన మేమును సృష్టిగతప్రాణుల కుపకార మొనర్పగలము గాక! (ధర్మాసి) ఓ సుధర్మా! న్యాయకారివగు నో ప్రభూ! మమ్ములను న్యాయయుక్తుల నొనర్పుము. (అమే) ఓ స్వామీ! నీవు నిర్వైరివి. వైరభావము విడిచి వర్తించునట్లు మమ్ములను అనుగ్రహింపుము. (అస్మే) ఓ పరమ కారుణిక! మాకు (నృమ్ణాని) ఉత్తమ రాజ్యమును, ఉత్తమ ధనమును, శుభగుణములను ప్రసాదింపుము. (బ్రహ్మ) ఓ పరమేశ్వర! మాలో బ్రాహ్మణుల ఉత్తమ విద్యాయుక్తుల నొనర్పుము. (క్షత్రమ్) మిక్కిలి చతురులము, శూరవీరులము, క్షత్రియ వర్ణముకు అధికారులము అగునట్లు మమ్మనుగ్రహింపుము. (విశమ్) వైశ్యవర్ణమును, మా ప్రజను సదా రక్షింపుము. మేము శుభగుణ యుక్తులమై పురుషార్థపరుల మగునట్లనుగ్రహింపుము.

**యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి,**

**దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు.**

౬. య. అ.౩౪-౧

**వాజశ్చమే, ప్రసవశ్చమే, ప్రయతిశ్చ మే,**

**ప్రసితిశ్చ మే ధీతిశ్చ మే, క్రతుశ్చమే.**

(యజ్జాగ్రతో) హే సర్వవ్యాపక పరమేశ్వర! నా మనస్సు జాగ్రదవస్థలో దూరము వెళ్ళుచుండును. సమస్తేంద్రియములకు నది స్వామి. (దైవమ్) జ్ఞానాదిగుణ యుక్తము. అది ప్రకాశస్వరూపమై ఉన్నది. (తదు సు....) అట్లే నిద్రావస్థయందును అది శుద్ధము ఆనందయుక్తమునైయుండు గాక! (దూరం గమమ్) దూరము వెళ్ళు స్వభావము గలది. (జ్యోతిషాం) ఇంద్రియములయు, సూర్యుడు మున్నగు జ్యోతిస్సులయు ప్రకాశమునకు ప్రకాశకము అది ఒక్కటే. (తన్మే) ఓ పరమేశ్వర! అట్టి నా మనస్సు నీ కృపచేత, (శివసంకల్పమస్తు) శుభ మొనర్చునదియు, శుద్ధస్వభావయుక్తము నగుగాక! అధర్మకార్యములం దెన్నడు ప్రవృత్తము గాకుండు గాక!

ఇట్లే (వాజశ్ స) మున్నగు శుక్ల యజుర్వేదపు పదునెనిమిదవ అధ్యాయములోని మంత్రములు సర్వస్వము ఈశ్వరునకు సమర్పింపుడని విధించును. అన్నింటికంటె నుత్తమమగు మోక్షసుఖము మొదలు సమస్త పదార్థములకొఱకు ఈశ్వరునే యాచింపవలెను; కాని అన్యుని ప్రార్థింపరాదు.

**ఆయుర్ యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతాం చక్షుర్ యజ్ఞేన కల్పతాగ్ం శ్రోత్రం యజ్ఞేన కల్పతాం, వాగ్ యజ్ఞేన కల్పతాం, మనో యజ్ఞేన కల్పతా, మాత్మా యజ్ఞేన కల్పతాం బ్రహ్మా యజ్ఞేన కల్పతాం జ్యోతిర్ యజ్ఞేన కల్పతాగ్ం స్వర్ యజ్ఞేన కల్పతాం పృష్ఠం యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన కల్పతామ్, స్తోమశ్చ, యజుశ్చ ఋక్ చ సామ చ, బృహచ్చ, రథంతరం చ, స్వర్ దేవా అగన్ మామృతా అభూమ, ప్రజాపతేః ప్రజా అభూమవేట్ స్వాహా. ౭ య. ౧౮-౨౯**

(యజ్ఞో వై విష్ణుః) విష్ణువునకు యజ్ఞమని నామము. శతపథ బ్రాహ్మణమున అట్లు చెప్పబడినది.

(ఆయుర్ యజ్ఞేన) ఆ ఈశ్వరుడు సమస్తజగత్తునను వ్యాపకుడై ఉన్నాడు. అతడే విష్ణువనబడును. అతనికే సమస్తపదార్థములు సమర్పింపవలెను. ఈ మంత్రమున ఈ విషయమే వర్ణింపబడినది. మనుష్యులెల్ల తమ ఆయువునంతటిని ఈశ్వరుని సేవించుటకు, అతని ఆజ్ఞలను పాలించుటకు అర్పింపవలెను. (ప్రాణో) ప్రాణమును కూడ నీశ్వరున కర్పింపవలెను. (చక్షుః) ప్రత్యక్షప్రమాణము, నేత్రము, (శ్రోత్రం) శ్రవణవిద్య, శబ్దప్రమాణాది, (వాక్) వాణి, (మనో) మనస్సు, విజ్ఞానము, (ఆత్మా) జీవుడు, (బ్రహ్మా) నాలుగు వేదములను చదివి పురుషార్థమును సాధించువాడు. (జ్యోతిః) సూర్యాదుల ప్రకాశము, (స్వః) సుఖము, (పృష్ఠం) ఉత్తమకర్మముల ఫలము. స్థానము, (యజ్ఞో) వేద విషయ విచారమున వర్ణింపబడిన త్రివిధములగు యజ్ఞములు, (స్తోమశ్చ) స్తుతిసమూహము, (యజుశ్చ) సర్వక్రియలకు సంబంధించిన విద్య, (ఋక్ చ) ఋగ్వేదము - స్తుతి-స్తోత్రము, (సామ చ) గాన విద్య, (చ) అథర్వవేదము, (బృహచ్చ) గొప్పగొప్ప వస్తువులు, (రథంతరం చ) తన అధీనమున నున్న శిల్పవిద్యాఫలములు అన్నియు పరమేశ్వరున కర్పింపవలెను. వస్తువులన్నియు ఈశ్వర నిర్మితములే. ఇట్లు సర్వము పరమేశ్వరున కర్పించిన మనుజావ కా పరమేశ్వరుడు సర్వసుఖములను చేకూర్చును (స్వర్దేవా) పరమేశ్వరుని కృపవలన పరమప్రకాశరూప విజ్ఞానమును పొంది శుద్ధులమై, ప్రపంచమున కీర్తిమంతులమై, మనము పరమానందరూప మోక్షమును, (అగన్మ) ఎల్లపుడు పొందుదుము గాక!

(ప్రజాపతేః) సర్వజ్ఞుడు, న్యాయకారి, ఎల్లరకు తండ్రియు నగు పరమేశ్వరునే ఉపాసింపవలెను; కాని, ఏ మానవునికూడ మానవులు తమకు రాజుగా మహాస్వామిగా నెంచరాదు. పరమేశ్వరుడే ఎల్లరకు ఉత్తమ సత్యన్యాయము నొనర్చును - ఇతరు లివ్వరు నట్లు చేయజాలరు. (వేట్ స్వాహా) సర్వజ్ఞుడు, సత్యస్వరూపుడు, సత్యన్యాయకర్తయు నగు పరమేశ్వరుని ప్రజలమై మన మెల్లపుడును సత్యమునే యంగీకరింపవలెను. సత్యమునే చెప్పవలెను. సత్యమే యాచరింపవలెను. పరమేశ్వరుని ఆజ్ఞాపాలనమున నెల్లపుడు విరోధింపకుందుముగాక! ఎల్లప్పుడు నీ సేవయందే పుత్రులవలె ప్రేమతో వర్తింతుము గాక! అని పరమేశ్వరుని మానవులెల్లరు ధ్యానమొనర్పవలెను.

## ఉపాసనా విషయము

వేదములందు వర్ణింపబడిన ఈశ్వరోపాసన విషయము మిక్కిలి సంక్షేపముగ వ్రాయబడును. ,

**యుంజతే మన ఉత యుంజతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః,**

**విహోత్రా దధే వయునా విదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః.**

౧ ఋ ౪-౪-౨౪-౧; యజు ౧౧-౪౬

(యుంజతే మన) జీవునకు నిత్య మీశ్వరోపాసన చేయుట ఉచితము. ఉపాసన సమయమున మనస్సు నీశ్వరునందు స్థిరపఱుపవలెను. (విప్రాః) ఈశ్వరోపాసకులైన బుద్ధిమంతులు, (హోత్రాః) ఉపాసనా యోగమును గ్రహించువారును, (విప్రస్య) ఎల్లర నెఱుగు నట్టియు, (బృహతః) ఎల్లరికంటె గొప్పవాడును అగు (విపశ్చితః) సర్వవిద్యా యుక్తుడు నగు పరమేశ్వరుని యందు (మనః యుంజతే) తమ మనస్సును బాగుగ యుక్తము చేయుదురు. (ఉత ధియః) అట్లే తమ బుద్ధివృత్తులను, జ్ఞానమును, (యుంజతే) ఎల్లప్పుడు పరమేశ్వరుని యందే స్థిరముచేయుదురు. ఏ పరమేశ్వరుడీ సర్వజగత్తును (విదధే) ధరించిచేయుచున్నాడో, (వయునా విదేక ఇత్) ఎవడు సర్వజీవుల జ్ఞానములకు, ప్రజకును సాక్షియో, అతనిని మించిన ఉత్తమ పదార్థ మొండును లేదు. (దేవస్య) సర్వజగత్తును ప్రకాశింపజేయువాడును (సవితుః) సర్వము నుత్పన్నము చేయువాడును నగు నా దేవుని (పరిష్టుతిః) సర్వవిధముల స్తుతియింతుము గాక! (మహీ) ఆ స్తుతి యన్నింటికంటెను గొప్పది - పరమేశ్వరుని స్తుతికి సమానమగు స్తుతి మరియొండులేదు. ఇట్లు స్తుతి చేసినందువలననే జీవుడు పరమేశ్వరుని పొందగలడు౧

**యుంజానః ప్రథమం మనస్తత్త్వాయ సవితా ధియమ్**

**అగ్నేర్ జ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత్.౧** యజు. ౧౧-౧

(యుంజానః) యోగి, (తత్త్వాయ) బ్రహ్మజ్ఞానముకొఱకు, (ప్రథమం మనః) తన మనస్సును మొదట పరమేశ్వరునందు లగ్న మొనర్చునపుడు (సవితా) పరమేశ్వరుడు (ధియం) వానిబుద్ధిని కృపతో తనయందు లగ్నము చేసికొనును. (అగ్నేర్ జ్యోతిః) ఆ యోగి పరమేశ్వరుని ప్రకాశమును, పరమేశ్వరునిదిగా నిశ్చయించి (అధ్యాభరత్) తనలో పరమేశ్వరుని ధరించును. (పృథివ్యా) పృథివిలో యోగిలక్షణ మిదియే.

**యుక్తేన మనసా వయం దేవస్య సవితుః సవే, స్వర్గ్యాయ శక్త్యా.౨**

యజు. అ.౧౧ మ. ౨.

(వయం) మనమెల్లరము, (స్వర్గ్యాయ) మోక్షసుఖము కొఱకు, (శక్త్యా) తన యోగబలోన్నతితో, (దేవస్య) పరమేశ్వరుని సృష్టిలో ఉపాసనా యోగమొనర్చి తన ఆత్మనుశుద్ధి చేసుకొనవలెను. (యుక్తేన మనసా) శుద్ధమనస్సులో పరమేశ్వర ప్రకాశమనెడి ఆనందమును పొందవలెను. మానవులెల్లరు ఇట్టి కోరిక కలిగియుండవలెనని మంత్రాభిప్రాయము. ౩

**యుక్త్వాయ సవితా, దేవాన్ త్స్వర్యతో ధియా దివమ్,**

**బృహజ్జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్ ౪** యజు. ౧౧-౩

ఇట్లు యోగాభ్యాస మొనర్చుటవలన, (స్వర్యతః దేవాన్) శుద్ధభావముతో, ప్రేమతో ఉపాసన మొనర్చు యోగులపై (సవితా) అంతర్యామి యగు ఈశ్వరుడు కృపతో (యుక్త్వా) వారి ఆత్మలయందు ప్రకాశము గలుగజేయుట మూలమున యుక్తుడై, (ధియా) తన కృపాబుద్ధితో (దివం బృహజ్జ్యోతిః) తన దివ్యస్వరూపమగు ననంతప్రకాశమును (ప్రసువాతి) ప్రకటమొనర్చును (కరిష్యతః) అట్లే సత్యమైన ప్రేమతో ఉపాసకులగు యోగులకు, (సవితా) ;పరమదయాళువు, అంతర్యామియునగు ఈశ్వరుడు మోక్షము నొసంగి ఎల్లప్పుడు ఆనందములో ఉంచును.

**యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిర్ విశ్లోక ఏతు పథ్యేవ సూరేః,**

**శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా ఆయే ధామాని దివ్యాని తస్థుః ౫**

యజు. ౧౧-౫

ఉపాసన నుపదేశించువాని గూర్చియు, గ్రహించువానిని గూర్చియు పరమేశ్వరుని యుపదేశము, (పూర్వ్యమ్) నీవు, సనాతన బ్రహ్మమును, (నమోభిః) సత్యమగు ప్రేమభావనతో నీ యాత్మను స్థిరమొనర్చుకొని నమస్కారాది రీతులతో నుపాసించినపుడు, నేను నిన్నాశీర్వదింతును. (శ్లోకః) సత్యకీర్తి, (వాం) మిమ్ముల నిరువురను, (ఏతు) పొందునుగాక. (పథ్యేవ సూరేః) విద్వాంసునకు ధర్మమార్గము ప్రాప్తించునట్లు మీకును సత్యమును సేవించుటవలన సత్యకీర్తి లభించును. (యే) ఇట్లే ఉపాసకులు, (అమృతస్య) మోక్షరూపుడగు నిత్యపరమేశ్వరునకు, (పుత్రాః) ఆజ్ఞాపాలకులు, సేవకులు నగుదురో, (దివ్యాని) ప్రకాశస్వరూపమగు విద్యతోను, ఉపాసనతోను యుక్తము లగు కర్మములందు (ధామాని) దివ్యస్థానములందును (ఆతస్థుః) బాగుగా స్థిరులగుదురు. (విశ్వే) ఆ అమృతపుత్రులందఱు, (వాం) ఉపాసననుపదేశించువాడు, ఆ ఉపదేశమును గ్రహించువాడు నను నీ యిరువురను, (శృణ్వంతు) ప్రసిద్ధులుగా వెలుగుదురు గాక! ఇట్లుపాసన నొనరించు మీ యిరువురితో, (యుజే) ఈశ్వరుడ నగు నేను యుక్తుడనగుదును.

**సీరా యుంజంతి కవయో యుగా వితన్వతే పృథక్**

**ధీరా దేవేషు సుమ్నయా. ౬** యజు. ౧౨-౬౭

(కవయః) విద్వాంసులును యోగులును, (ధీరాః) ధ్యానులు నగువారు (పృథక్ సీరా యుంజంతి) భిన్న భిన్న నాడులను ఉపాసనా యోగముకొఱకు యుక్తము చేయుదురు - పరమాత్మ సాక్షాత్కారముకొఱకు నుపాసనాయోగము నభ్యసింతురు. (యుగా) యోగయుక్త కర్మములను, (వితన్వతే) నిరంతరము విస్తరింపజేయుదురు - యోగాభ్యాసమున తత్పరులగుదురు. (దేవేషు సుమ్నయా) విద్వాంసులలో ప్రశంసితులై పరమానందము ననుభవింతురు.

**యునక్త సీరా వి యుగా తనుధ్వం కృతే యోనౌ వపతేహ బీజమ్,**

**గిరా చ శ్రుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్సృణ్యః పక్వమేయాత్. ౭**

యు. ౧౨-౬౮

అత్ర ప్రమాణమ్:- శ్రుష్టిరితి క్షిప్రనామసు అష్టితి. నిరు. ౬-౧౩

ద్వివిధా సృణిర్ భవతి; భర్తా చ హంతా చ నిరు ౧౩-౫

ఓ ఉపాసకులారా! మీరు యోగాభ్యాసము వలనను, పరమాత్ముని యోగము వలనను నాడులలో ధ్యాన మొనర్చి పరమానందముతో (యునక్త) యుక్తులు కండు. ఇట్లే మోక్షసుఖమును (వితనుధ్వమ్) విస్తరింపజేయుడు. మరియు, (కృతే యోనౌ) అంతఃకరణమును శుద్ధ మొనర్చినమీదట పరమానందమునకు కారణభూతమగు తన యాత్మయందు ఉపాసనా విధానముతో ఉపాసనా యోగ సంబంధమగు విజ్ఞానరూప (బీజం) బీజమును (వపత) బాగుగ నాటుడు.

(గిరా చ) వేదవాణీ ద్వారమున, పరమాత్మునియందు, (యునక్త) యుక్తులై అతని స్తుతి ప్రార్థనోపాసనలయందు ప్రవృత్తులుగండు. (శ్రుష్టిః) ఉపాసనాయోగఫలము మిక్కిలి శీఘ్రముగ లభించుగాక! ఆ ఫలము, (పక్వం) పరిపక్వమై, శుద్ధము, పరమమునగు నానందముతో నిండియుండి, మోక్షసుఖము చేకూర్చును. (ఇత్ సృణ్యః) ఉపాసనా యోగవృత్తులన్నియుక్లేశములను నాశమొనర్చునవియై, (సభరాః) శాంత్యాది సర్వగుణములతో నిండియుండును. ఆ ఉపాసనా యోగవృత్తులతో పరమాత్మసంబంధమును మీ మీ యాత్మలలో ప్రకాశితము చేసికొనుడు. ౭

యాస్క నిరుక్తమున శ్రుష్టి, సృణీ, శబ్దములకు నీ క్రింది వ్యుత్పత్త్యర్థము చెప్పబడినది: (శ్రుష్టీతి) శ్రుష్టిః శీఘ్రము. అశూఙ్ వ్యాప్తౌ, క్తిన్, ఉప్, శడ (అశు) అష్టిః శ్రుష్టి.

(ద్వివిధా) సృణీ = కొడవలివలె పరమాత్మక్లేశములను హరించును; ఖండించును.

**అష్టావింశాని శివాని శగ్మాని సహ యోగం భజంతు మే.**

**యోగం ప్రపద్యే క్షేమం చ, క్షేమం ప్రపద్యేయోగం**

**చ నమోఽహో రాత్రాభ్యామస్తు.** ౮ అథ. ౧౯, ౧-౮-౨

(అష్టావింశాని శివని) ఓ పరమైశ్వర్యయుక్త మంగళమయ దేవ ! నీకృపవలన నుపాసనాయోగము నాకు లభించును గాక! దాని వలన నాకు సుఖము కలుగు గాక! ఇట్లే దశేంద్రియములు, దశప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, విద్య, స్వభావము, శరీరము, బలము నను నీ యిరువది యెనిమిదియు సర్వశుభములందును ప్రవృత్తమైన యుపాసనాయోగమును, (అహోరాత్రాభ్యాం) అహర్నిశలు సేవించును గాక! అట్లే మేమును, నీ కృపవలన, (యోగం) యోగము మూలమున, (క్షేమం) రక్షణను, రక్షణవలన యోగమును పొందగోరుచున్నాము. ఈ కార్యమున మాకు నీవు తోడ్పడుదువుగాక! కావున మేము రాత్రిందివములు నీకు నమస్కరించుచున్నాము ౮

**భూయానరాత్యాః శచ్యాః పతిస్త్వమింద్రాసి**

**విభూః ప్రభూరితి త్వోపాస్మహే వయమ్.** ౯ అథ ౧౯-౧౩౪-౪౭

**అత్ర ప్రమాణమ్ :**

**వాచో నామసు శచీతి పఠితమ్.** ని. ౧-౧౧

**తథా కర్మణాం నామసు శచీతి పఠితమ్.** ని. ౨-౧

**తథా ప్రజ్ఞా నామసు శచీతి పఠితమ్.** ని. ౩-౯

(భూయానరాత్యాః) ఓ జగదీశ్వర! నీవు (శచ్యాః) సర్వ ప్రజ్ఞకు, వాణికి, కర్మములకు (పతిః) స్వామివి. అట్లే, (భూయాన్) సర్వశక్తి మత్త్వాది గుణయుక్తుడవు. (అరాత్యాః) నీవు-దుష్టప్రజ్ఞను, మిథ్యావాణిని, పాపకర్మములను నశింపజేయుటలో నతి సమర్థుడవు. (విభూః) నీవు వ్యాపకుడవు. (ప్రభూః) సర్వసామర్థ్య యుక్తుడవు, కావున మేము నిన్నుపాసింతుము. ౯

యాస్కముని నిర్మిత నిరుక్తమున శచీ శబ్దమునకు వాణి, కర్మము, ప్రజ్ఞ అను మూడర్థములు గలవని చెప్పబడినది.

**నమస్తే అస్తు పశ్యత పశ్య మా పశ్యత ౧౦** అథ. ౧౯-౧౩౪-౪౮

(నమస్తే అస్తు) పరమేశ్వరుడు మానవుల నుద్దేశించి యీ మంత్రమున నిట్లుపదేశించుచున్నాడు. ఓ యుపాసకులారా! మీరు (మా) నన్ను ప్రేమభావముతో నుపాసనా యోగమువలన నిజాత్మలలో (పశ్యత) ఎల్లపుడు చూడుడు. నాయాజ్ఞల నెఱుగుడు. వేదవిద్య నభ్యసించి అందు విధించిన విధమున నాచరింపుడు. ఓ పరమేశ్వరా! నీవు కృపాదృష్టితో (పశ్య మా) మమ్ములను నిరంతరము చూడుము. (నమస్తే అస్తు) మేము నీకెల్లపుడు నమస్కరింతుము అని ఉపాసకులు కూడ ప్రార్థించవలెను. ౧౦

**అన్నాద్యేన యశసా తేజసా బ్రాహ్మణ వర్చసేన. ౧౧** అథ, ౧౯-౧౩౪-౪౯

ఓ పరమేశ్వరా! (అన్నాదేన) అన్నాద్యైశ్వర్యముతోను, (యశసా) సర్వోత్తమకీర్తితోను (తేజసా) తేజస్సుతోను-దీనత్వము, భయము లేకుండుటతోను, (బ్రాహ్మణ వర్చసేన) సంపూర్ణ విద్యతోను మమ్ములను యుక్తులంజేసి యనుగ్రహింపుము. ఇందులకే మేమెల్లపుడు నిన్నుపాసింతుము. ౧౧

**అంభో అమో మహః సహ ఇతిత్వోపాస్మహే వయమ్.౧౨ అథ. ౧౩-౪-౨౦**

**అంభో అరుణం రజతం రజః సహ ఇతి త్వోపాస్మహే వయమ్ ౧౩**

**అథ. ౧౩-౪-౨౧**

((అంభః) ఈ పదమునకు పూర్వమంత్రమున నర్థము చెప్పబడినది. గౌరవార్థము రెండవసారి యీ మంత్రమున నీ పదము గ్రహింపబడినది.)

(అరుణమ్) ఓ పరమేశ్వర! నీవు ప్రకాశస్వరూపుడవు. సర్వ దుఃఖములను నాశ మొనరింతువు. (రజతమ్) ప్రీతికి పరమహేతువగు నానందస్వరూపుడవు. (రజః) సర్వలోకరూపమగు నైశ్వర్యవంతుడవు. (సహః) సహనశీలుడవు. (ఈ పదముకూడ రెండవసారి ప్రయోగింపబడినది.) (ఇతి.....మహే......) అని మేముపాసింతుము.

**ఉరుః పృథుః సుభూర్భువ ఇతి త్వోపాస్మహే వయమ్. ౧౪**

**అథ. ౧౩-౪-౨౨**

ఓ ఈశ్వర! (ఉరుః) నీవు సర్వశక్తిమంతుడవు. (పృథుః) ఆద్యంతరహితుడవు, వ్యాపకుడవు. (సుభూః) సర్వపదార్థములందుండు వాడవు. (భువః) అవకాశస్వరూపుడవగుటచే నంతయు నీ యందున్నది. అని యెఱింగి నిన్నెల్లపుడు నుపాసింతుము. నిన్నే యాశ్రయించి యున్నాము.

యాస్క నిఘంటువునందు ఉరు శబ్దమునకు బహు - అనేకము అని యర్థమున్నది.౧౪

**ప్రథో వరో వ్యచో లోక ఇతి త్వోపాస్మహే వయమ్. ౧౫ అథ. ౧౩-౪-౨౩**

(ప్రథో వరో) ఓ పరమేశ్వర! నీవు సర్వజగత్తును విస్తరింపజేయువాడవు. ఉత్తముడవు. (వ్యచః) సర్వజ్ఞుడవు; ధారణ, పాలన, వినాశము లనెడి ముప్పిధక్రియలకు కర్తవు. (లోకః) విద్వాంసులకెల్లరకు తెలిసికొనదగినవాడవు. ఎల్లరను చూచువాడవు- నెఱుంగువాడవు నీవే. అన్యుడెవడును కాడు. ఇట్టి సర్వజ్ఞ స్వరూపుడవగు నిన్నుమేము సతత ముపాసింతుము.౧౫

**యుంజంతి బ్రధ్నమరుషం చరంతం పరితస్థుషః,**

**రోచంతే రోచనాదివి. ౧౬ ఋ. ౧, ౧-౧౧-౧**

౧. మొదటి యర్థము-(యుంజంతి) ముక్తికి నుత్తమసాధన ముపాసన. అందువలన విద్వాంసులు, (పరితస్థుషః) సర్వజగత్తునందును, సర్వప్రాణుల హృదయములందును, వ్యాపకుడైయున్న సర్వజ్ఞుడగు నీశ్వరుని యుపాసనవలన తమ ఆత్మలతో యుక్తము చేసికొందురు. ఆ ఈశ్వరుడు (చరంతం) సర్వజ్ఞుడు, (అరుషం) హింసాదిదోషరహితుడు, కృపాసముద్రుడు, (బ్రధ్నం) విద్యవలనను, యోగాభ్యాసము వలనను జనించు నాధ్రేమతో సర్వానందములను పెంచువాడు, సర్వవిధముల పెద్దవాడు, (రోచనాః) కావున నుపాసకుల యాత్మలు అవిద్యాది సర్వదోషము లనెడి యంధకారమునుండి విడివడి(దివి) ఆత్మలను ప్రకాశింపజేయు పరమేశ్వరునియందు (రోచంతే) ప్రకాశితము లగును.

౨. రెండవ యర్థము:- (పరితస్థుషః) సూర్యలోకము, తన కిరణములతో మూర్తిమంతములగు సర్వద్రవ్యములను ప్రకాశింప జేయుటలోను, ఆకర్షించుటలోను, (బ్రధ్నం) అన్నింటికంటె పెద్దదియు, (అరుషం) రక్తగుణ యుక్తము, అగ్నిమయమునునై యున్నది. సర్వలోకములు దాని యాకర్షణముతో యుక్తములై యున్నవి.'(దివి రోచనాః) అట్లే సర్వపదార్థములు నా సూర్యుని ప్రకాశమువలననే ప్రకాశితములగుచున్నవి. విద్వాంసు లాయాదిత్యునే సర్వలోకముల నాకర్షించువాడని యెఱుగుదురు.

౩. మూడవ యర్థము:- (యుంజంతి) ఉపాసకులు సర్వావయవ వృద్ధికి ముఖ్యహేతువగు ప్రాణమును ప్రాణాయామముతో ప్రీతి పూర్వకముగ పరమేశ్వరునియందు లగ్నము చేయుదురు. అందువలననే వారు మోక్షమును బొంది సదానందమున నుందురుగదా.

మంత్రములలోని పదములకు మూడర్థములు చెప్పుటకు తగిన ప్రమాణములు:-

యాస్కనిఘంటువున, 'తస్థుషః' శబ్దము మానవార్థమున గ్రహింపబడినది. అట్లే శతపథబ్రాహ్మణమున 'బ్రధ్న,' 'అరుష' శబ్దములు ఆదిత్యుడను నర్థము దెలుపుచున్నవి. ఈ బ్రధ్న శబ్దమున కర్థము యాస్కనిఘంటువున మహత్ అని యున్నది. ప్రశ్నోపనిషత్తునందు ఆదిత్యుడు ప్రాణ శబ్దముచే జెప్పబడెను. కావున బ్రధ్న, అరుష శబ్దములచే ప్రాణము గ్రహింపనగును.

పరమేశ్వరుని మించిన గొప్ప పదార్థ మింకొకటిలేదు. కావున పైన జూపిన యాస్క నిఘంటు ప్రమాణము మంత్రము యొక్క ప్రథమార్థమున నుపయుక్తమగును. శతపథప్రమాణము ద్వితీయార్థమునందును, ప్రశ్నోపనిషత్ ప్రమాణము తృతీయార్థమునందు నుపయుక్తములగునని గ్రహింపవలెను.

యాస్కనిఘంటువునందు బభ్రు, అరుష శబ్దములు అశ్వ నామములందును పఠింపబడినవి. కాని, ఆయర్థ మీ మంత్రమున గ్రహింపదగదు. శతపథాదిగ్రంథవ్యాఖ్యానముల కది విరుద్ధమగును. మూలార్థము సంగతమును కాదు. ఒక శబ్దమున కనేకార్థము లుండవచ్చును. కాని, అర్థములన్నియు నొకే స్థలమున నుపయుక్తములు కావు. కావున భట్టమోక్షముల్లర్ ఆంగ్లేయభాషలో నీ మంత్రమున కర్థము వ్రాయుచు పై పదమునకు 'అశ్వ' మని వ్రాసి యున్నాడు. అది సరికాదు. సాయణాచార్యు డీ మంత్రవ్యాఖ్యానమునందు ఆదిత్యుని గ్రహించియున్నాడు. ఒక అంశమున నీ వ్యాఖ్య సరియనియే చెప్పవచ్చును. కాని భట్టమోక్షమూల రీ యర్థము నెటనుండి గ్రహించెనో తెలియకున్నది. అతని కల్పనామాత్రమనియే చెప్పనగును. కావున ప్రామాణికము కాదు.

ఉపాసన చేయవలసిన రీతి నిపుడిట వ్రాయుచున్నాము. ముముక్షులీశ్వరునుపాసింపదలతురేని, తమ కోరిక కనుకూలమగు నేకాంతస్థలమున ఆసీనులై మనస్సును శుద్ధ మొనర్చుకొని; స్థిరపరచు కొనవలెను. సర్వేంద్రియములను, మనస్సును సచ్చిదానందాది లక్షణ యుక్తుడును, అంతర్యామి - సర్వవ్యాపకుడు - న్యాయకారియు నగు పరమేశ్వరుని వంకకు బాగుగ మరల్చి, లెస్సగ నాలోచింపవలెను. పరమేశ్వరునియందు తమ ఆత్మలను నియోగింపవలెను. మరియు స్తుతి, ప్రార్థనోపాసనలను బలుమారు చేసి తమ ఆత్మల నతని యందు లగ్నము చేయవలెను. పతంజలి మునికృత భాష్యప్రమాణముల ననుసరించి, యుపాసించురీతి నిట వ్రాయుచున్నాము.

(యోగశ్చిత్త వృత్తి నిరోధః) ఉపాసించు సమయమున పరమేశ్వరునికంటె భిన్నములగు విషయములనుండియు, వ్యవహారసమయమున అధార్మికములగు సర్వవ్యవహారములనుండియు తన మనోవృత్తి నెల్లపుడు నిరోధింపవలెను - అడ్డగింపవలెను. ఇట్లు చేయుటయే యోగము. ఇట్లే పరమేశ్వరునుండి దూరమగుటయు, నతని యాజ్ఞలకు విరుద్ధముగ చెడుగులందు చిక్కుపడుటయు వియోగమనబడును.

పూ. ప: వెలుపలి వ్యవహారములనుండి వేరుచేసి వృత్తి స్థిర మొనర్చినపుడది యెక్కడ స్థిరమగును?

ఉ. ప: (తదా ద్రష్టుఃస్వరూపే ఽ వస్థానమ్ .) జలప్రవాహము నొకవైపున దృఢమగు నానకట్టతో నడ్డగించి నపుడది నిమ్న స్థలముంజేరి యట స్థిర మగును. అట్లే మనోవృత్తి బాహ్యమునుండి యడ్డగించిన నపుడది సర్వజ్ఞుడైన పరమేశ్వరుని యందు స్థిరమగును.

పూ. ప: ఉపాసకుడగు యోగి యుపాసనను విడిచి సాంసారిక వ్యవహారములందు ప్రవృత్తుడైనపుడతని ప్రవృత్తి సాంసారిక పురుషుల ప్రవృత్తివలె నుండునా? దానికి విలక్షణముగ నుండునా?

ఉ. ప: (వృత్తి సారూప్య మితరత్ర) ఉపాసకుడైన యోగి సాంసారిక వ్యవహారములందు ప్రవర్తించినపుడతని వృత్తి హర్ష శోకములు లేనిదై శాంతము, ధర్మారూఢము, విద్యావిజ్ఞాన ప్రకాశము, సత్యతత్త్వనిష్ఠయు కలదై, మిక్కిలి తీవ్రమై, సాధారణ మనుష్య విలక్షణమై, అపూర్వమై యుండును. సాంసారిక మనుజుని వృత్తి అట్లుగాక హర్షశోకములతో గూడి దుఃఖసాగరమున మునకలు వేయుచుండును. (ఉపాసకునివృత్తి జ్ఞానరూప ప్రకాశమున వర్తిల్లును. సాంసారికుని వృత్తి సతత మంధకారమున చిక్కుపడుచుండును.) ౩

పూ. ప: వృత్తు లెన్ని? వాని నడ్డగించు టెట్లు?

ఉ. ప: (వృత్తయః పంచతయ్యః **క్లిష్టాక్లిష్టాః**) సర్వజీవుల మనస్సులందును నైదువిధములగు వృత్తులుత్పన్నములగును. అవియును క్లిష్టములు, అక్లిష్టములు నని రెండు విధములు. క్లిష్టములన క్లేశము-కష్టములతో గూడినవి. అక్లిష్టములు = క్లేశరహితములు-శాంతములు. ఎవని వృత్తులు విషయాసక్తము పరమేశ్వరోపాసనకు విముఖములో యవి యవిద్యాది క్లేశములతో గూడి యుండును. ఉపాసకుని వృత్తులు క్లేశరహితములై శాంతములై యుండును. ౪

పంచవృత్తులు:- ౧. ప్రమాణము, ౨. విపర్యయము, ౩. వికల్పము, ౪. నిద్ర, ౫. స్మృతి.

**వాని విభాగములు - లక్షణములు -**

౧. (తత్ర ప్రత్యక్షం) ప్రత్యక్షాది ప్రమాణవ్యాఖ్యానము వేద విషయమునకు సంబంధించిన హోమప్రకరణమున నీ గ్రంథమునందే చూడుడు.

౨. (విపర్యయః) రెండవది విపర్యయ వృత్తి. దానివలన మిథ్యా జ్ఞానము కలుగును. ఉన్నది ఉన్నట్లు తెలిసికొనక విపరీతముగ తెలిసికొనుట. ఒక వస్తువు నింకొకటి యనుకొనుట విపర్యయము. ఉదాహరణమునకు- ముత్యపు చిప్పను వెండిచిప్ప యనుకొనుట విపర్యయము.
౩. (శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యోవికల్పః) మూడవది వికల్పవృత్తి. శబ్దమువలన జ్ఞానము కలిగి వస్తువు లేకుండుట వికల్పమనబడును. వివేకము గలవాడుకూడ కొండొక జ్ఞానము

వస్తుశూన్యమని యెఱిగియు వ్యవహరించుచుండును. వేడినీటివలన నాచేయి కాలినది. అను వ్యవహారమెల్లరు చేయుదురు. వాస్తవమున నీరు చేతిని కాల్పదు. నీటియందున్న అగ్ని చేతిని కాల్చును. (ఈ వికల్పవృత్తి ప్రమాణము కాదు. ఈ జ్ఞానమునకు విషయము ఉండదు. నీరు చేతిని కాల్పదు గదా! కాల్చునది అగ్ని కావి, వ్యవహారమున వేడినీరు చేతిని కాల్చును అను ప్రయోగమున్నది. విపర్యయ వృత్తి- మిథ్యాజ్ఞానము యథార్థజ్ఞానము కలిగిన మీదట నుండదు. వికల్పమట్లుకాక యీ వృత్తి యెల్లపుడు నుండును. బుద్ధిమంతుడు కూడ నీరు దహింపజాలదని తెలిసియు వేడినీరు కాల్చును అని వ్యవహరించును. కావున విపర్యయము, వికల్పము రెండును భిన్నవృత్తులని గ్రహింపవలెను.)

(౪) (**అభావప్రత్యయాలంబనా వృత్తిర్నిద్రా**) నాల్గవది నిద్రావృత్తి. జాగ్రత్, స్వప్న, వృత్తులు, లేకుండుటకు కారణమగు నజ్ఞానమున కాశ్రయమిచ్చు వృత్తి నిద్ర యనబడును. ఈ నిద్రయు నొకవిధమగు వృత్తి - జ్ఞానమగును. అందువలననే నిద్రించి లేచిన మనుజుడు నేను సుఖముగ నిద్రించితిని, నేను సుఖముగ నిద్రింప లేదు అని స్మరించుచున్నాడు. నిద్రావృత్తితో ననుభవింపని వాడు నిద్రనుండి లేచినవానికి స్మృతి కలుగజాలదు.

౫. (అనుభూత విషయా సంప్రమోషః స్మృతిః) ఐదవవృత్తి స్మృతి. ఒక వస్తువునో లేక వ్యవహారమునో ప్రత్యక్షముగ జూచినపుడు చిత్తమున దాని సంస్కార మేర్పడును. ఆ సంస్కారమువలననే యా విషయము నతడు మఱువడు. మఱువకుండుటకే అసంప్రమోషము అని పేరు. ఇదియే స్మృతి వృత్తి. ౧౦

ఈ యైదు వృత్తులను దుష్టకార్యములనుండియు, ననీశ్వర పదార్థ ధ్యానమునుండియు దొలగించుట కుపాయములు.

(**అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః**) ఈ యుపాసనా ప్రకరణమున ముందు వ్రాయునట్లుఅభ్యాస మొర్పవలెను. చెడుకర్మములనుండియు, దోషముల నుండియు వేరుగ నుండవలెను- ఇదియే వైరాగ్యము. ఈఅభ్యాస వైరాగ్యము లనెడి రెండుపాయముల మూలమున పైన వర్ణించిన యైదు వృత్తులను నిరోధించి, వాని నుపాసనా యోగమున వర్తించునట్లు చేయవలెను. ౧౧

పూ. ప: ఆ యుపాసన సిద్ధించుటకు పరమసాధన మేద్ది?

ఉ. ప: (**ఈశ్వర ప్రణిధానాద్ వా**) ఈశ్వరునియందు విశేష భక్తి కలిగిన మీదట నతని కృపవలన మనస్సేకాగ్రమగును. మనుష్యుడు సమాధియోగము శీఘ్రముగ ప్రాప్తించును. ౧౨

క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుష విశేష ఈశ్వరః ౧౩ యో. పా. ౧-౨౪

యోగదర్శన ప్రమాణముతో జీవప్రకృతులకు భిన్నుడైన పరమేశ్వరుని లక్షణము చెప్పబడుచున్నది.

(క్లేశకర్మ...) ఈ ప్రకరణమున నింతకు పూర్వము వర్ణించిన యవిద్యాది క్లేశములతోను, శుభాశుభకర్మములతోను, నట్టి కర్మఫలములతోను, నా కర్మఫలానుకూలములగు వాసనలతోను నెన్నడు నెట్టి సంబంధములేని పురుషవిశేష మీశ్వరుడనబడును. ఈ క్లేశకర్మాదులతో జీవున కొకవిధమగు సంబంధముండును. క్లేశకర్మాదులు చిత్తమునందుండును. కాని వీనివలన గలుగు ఫలములను జీవుడే అనుభవించును. కావున వీనితో జీవునకే సంబంధమున్నట్లు వ్యవహరింపబడును. లోకమున జయముకాని, పరాజయముకాని వాస్తవమున యోధులకు సంబంధించినది. కాని, జయ పరాజయములు రాజునకు జెందినవిగా నెంచబడును. అతడే జయపరాజయ ఫలము ననుభవించును.

ముక్తులును. ప్రకృతిబద్ధులు నగు జీవులతో నాయవస్థలందున్నంతకాలము క్లేశాదులకు సంబంధముండని విషయము వాస్తవమే. కాని, పరమాత్మలో క్లేశాదులకెన్నడు - భూతభవిష్యద్వర్తమానములను త్రికాలములందును సంబంధ ముండదు. ఇయ్యదియే జీవాత్మల కంటె పరమేశ్వరునియందుగల విశేషము - అతడెల్లపుడు నీశ్వరుడే. ఎల్లపుడు ముక్తుడే. అనాది కాలమునుండియు నీశ్వరుని జ్ఞానరూపమగు వేదములు నాపరమేశ్వరు నైశ్వర్యమును వర్ణించుచు వచ్చుచున్నవి. పరమేశ్వరుని ఐశ్వర్యమునకు మించిన యైశ్వర్యమింకొకటి లేదు. అతనికి సమానుడును లేడు. పరమేశ్వరుని ఐశ్వర్యమునకు మించి యైశ్వర్యవంతుడింకొక డుండునేని యతడే యీశ్వరుడు. ఈశ్వరుని ఐశ్వర్యమునకు సమానమగు నైశ్వర్యముగలవాడింకొక డుండు పక్షమున నీశ్వరు లిరువురగుదురు. అట్లుసమానైశ్వర్యములు గల యీశ్వరులిరువురైనపుడా యిరువురిలో నొకరొక వస్తువీక్షణమునందే నశింపవలెనని ఇంకొక రీక్షణమున నా వస్తువు నశింపరాదనియు కోరుదురు కొనుడు. అప్పుడా యిరువురి కోరికలలో నెవరి కోరిక నెఱవేరును? ఎవరి కోరికయు నెఱవేఱదు. అట్టి యెడ నా యిరువురును నీశ్వరులు కాజాలరు. ఇరువురి కోరికలొకే క్షణమున నెఱవేఱ వీలులేదు. ఆ కోరికలు పరస్పర విరుద్ధములు. కావుననెవని యైశ్వర్యమునకు మించి యైశ్వర్యము కాని, సమానమగు, నైశ్వర్యము కాని మరియొకటి లేదో యట్టివాడే ఈశ్వరుడని యంగీకరింపవలెను. వాడే పురుషవిశేషుడు- విశిష్టపురుషుడు. ౧౩

(తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజమ్) భూత భవిష్యద్వర్తమాన కాలమునకు జెందిన యతీంద్రియపదార్థముల జ్ఞాన మేకొంచెమున్నను నది సర్వజ్ఞతకు కారణమవ నగును. ఆ సర్వజ్ఞత యెవనియందు పరాకాష్ఠనందుచున్నదో యతడే పరమేశ్వరుడు. మనుష్యున కింద్రియ గోచర పదార్థముల జ్ఞానముతో బాటు అతీంద్రియ పదార్థముల జ్ఞానము కూడ కలుగుచున్నది. ఈ యతీంద్రియ పదార్థజ్ఞాన మొకనిలో నొకింతయు, నింకొకనిలో నింకొకింతయు నుండును. మానవులలో నుండు నీ జ్ఞానము సమానము కాదు. ఒకనిలో నెక్కువ, యింకొకనిలో తక్కువ యుండుట లోక విదితము. ఇట్టి జ్ఞానము సాతిశయము - హెచ్చుతగ్గులు కలది యని వ్యవహరింతురు. ఎవనిలోను నీ యతీంద్రియజ్ఞానము పూర్ణతను పొందలేదని భావము; కాని, యిది యెట పూర్ణతనొందునో యా పదార్థమే పరమేశ్వరుడు. అందువలననే పరమేశ్వరుడు సర్వజ్ఞుడనబడుచున్నాడు. అతనిలో నున్న యతీంద్రియజ్ఞానము నిరతిశయము. పూర్ణము లోకమున చిన్న, పెద్ద వస్తువు లనేకములున్నవి. వానిలో నుండు పరిమాణము సాతిశయము-హెచ్చుతగ్గులు కలిగియుండును. ఆ పరిమాణము ఆకాశాది విభుపదార్థములలో నిరతిశయసర్వజ్ఞత్వాది గుణములు గల పదార్థమొండు కలదనియే యూహింపనగును; కాని, యట్టి పదార్థమునకు పరమేశ్వరుడు, ఈశ్వరుడు, బ్రహ్మము మున్నగు నామములు వేదాది శాస్త్రములవలన సిద్ధించుచున్నవి. ఈ ప్రపంచము నుత్పన్న మొనర్చుటలో పరమేశ్వరునకు ప్రయోజనమేమియు లేదు. కల్పమునందు ప్రళయమునందు మహాప్రళయమునందును జ్ఞానము, ధర్మము నుపదేశించి ప్రాణుల నుద్ధరించుటయే యీ సృష్టికి ప్రయోజనము. ఆదివిద్వాంసుడు, పరమదయాళువు నగు పరమేశ్వరుడు జీవులకు వేదశాస్త్రముల నుపదేశించియు నెంతో యనుగ్రహించి యున్నాడు. ౨౫

(స ఏష పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్ - యోగ ౧-౨౬) పూర్వపు గురువుల కాలమును నిర్ణయింప వీలగును. వారెంతకాలము క్రిందట పుట్టిరో, యెన్ని వర్షములు జీవించిరో, యెన్నడు పరమపదము నందిరో తెలియనగును. కాని, పరమేశ్వరుడు కాలమునకు కట్టు పడడు. అతడింతకాలము నాటివాడు; ఇంతకాలమునకు తరువాత నతడుండడు అని నిర్ణయింప నెరికిని తరముకాదు. కవున నతడు పూర్వగురువులకును గురువు; ఆది గురువు. పరమేశ్వరుడీ సృష్టికి పూర్వమున నెట్లుండెనో యట్లే పూర్వపు సృష్టులకును బూర్వమున నున్నాడని యెఱుంగవలెను. కావున నాది గురువులకును నతడాదిగురువు. ౨౬

(తస్య వాచకః ప్రణవః) 'ఓ౩మ్' కార మీశ్వరునకు వాచకము - ఈశ్వరుని నిజనామము. దీపమునకు ప్రకాశముతో నిత్యసంబంధముండునట్లు పరమేశ్వరునకు తననామమైన 'ఓమ్' తో నట్లే నిత్యసంబంధమున్నది. సర్గాంతరములలో గూడ నీ నామమే పరమేశ్వరునకుండును. ఈ నామమున కిది యర్థము, ఈ యర్థము- వస్తువున కిది నామము అను సంకేతము పద పదార్థములకు గల సంబంధమును మాత్రమే తెలుపును. పితా పుత్రులకు గల సంబంధము-స్థిరము- నియతము. కాని, ఇతడు పిత, ఇతడు పుత్రుడు అను సంకేతము పితాపుత్రులకున్న సంబంధమును మాత్రమే తెలుపును. మహాప్రళయమున, శబ్దము కూడ తన వాచక శక్తితో బాటు ప్రధానము- మూలప్రకృతియందు లీనమైనను సృష్టిసమయమున మరల తన వాచకశక్తితో బాటు నుదయించును. సంకేతము ద్వారమున దాని యర్థము మాత్రము ప్రకాశితమగును. ఈ దృష్టితోనే సదృశ వ్యవహారము నిత్యమగుటవలన శాస్త్రజ్ఞులు విద్వాంసులు శబ్దార్థ సంబంధమును గూడ నిత్యమని యెంచుచున్నారు. ౨౭

(తజ్జపస్తదర్థభావనమ్. యో. ౧-౨౮) ఓ౩మ్ పదము, దాని యర్థము తెలిసిన యోగి, ఓంకారమును జపించుచు - మాటిమాటికి మనస్సున పదము నుచ్చరించుచు, దానికి అర్థము-వాచ్యము నగు పరమేశ్వరుని సతతము చింతన- ధ్యానము చేయవలెను. అందువలన నతని చిత్త మేకాగ్రమగును. స్వాధ్యాయానంతరమున యోగ మొనర్పవలెను -యోగానంతరము స్వాధ్యాయము నభ్యసింపవలెను. స్వాధ్యాయ, యోగసిద్ధులవలన పరమేశ్వరుడు సాక్షాత్కరించును అనియు చెప్పబడినది. ౨౮

**ఈశ్వరోపాసనకు ఫలము.**

**(తతః ప్రత్యక్ చేతనాధిగమో ఽ ప్యంతరాయాభావశ్చ.యో. ౧-౨౯)** ఈశ్వరోపాసనవలన నతని యనుగ్రహము ప్రాప్తమగును. అందువలన వ్యాధి మున్నగు విఘ్నములు యోగమున సంభవింపవు. ఆ విఘ్నములు ముందు వర్ణింపబడును. బుద్ధివృత్తుల ననుసరించి యనుభవించు జీవాత్మునకు నుపాసనవలన శుద్ధమైన, ప్రసన్నమైన, శరీరాదులతో సంబంధములేని వాస్తవికమగు తన స్వరూపము సాక్షాత్కరించును. ఈ నిజస్వరూప దర్శనమే పరమాత్మ దర్శనమునకును హేతువగును. ౨౯

చిత్తవిక్షేపమునకు కారణములగు విఘ్నముల విశేషత, వాని సంఖ్యయు నిట వర్ణించుచున్నాడు.

(వ్యాధిస్త్యాన.......) యోగి చిత్తమునకు విక్షేపమును గలిగించు విఘ్నములు

తొమ్మిది; ఇయ్యవి చిత్తవృత్తులతో గూడియుండును. చిత్తమున విక్షేపము గలిగించు నియ్యవి లేనినాడు చిత్తవృత్తులును నుండవు. ౧. (వ్యాధిః) జ్వరాది రోగములు, ధాతువులు, రసములు, ఇంద్రియములు నను వానిలో వైషమ్యమేర్పడుటచే గలుగును. ౨. (స్త్యానమ్) అకర్మణ్యత - కార్యమునర్పు యోగ్యత లేకుండుట. ౩. (సంశయః) ఇట్లు కాగలుగునా? లేదా? అను ద్వివిధత. ౪. (ప్రమాదః) సమాధిసాధనముల ననుష్ఠించుటకు ప్రయత్నముకాని, ఆలోచనకాని చేయకుండుట. ౫. (ఆలస్యం) శరీరాంతఃకరణముల గురుత్వమువలన విశ్రాంతిదీసికొను నిచ్ఛతో పురుషార్థము జేయకుండుట. ౬. (అవిరతిః) చిత్తమున విషయతృష్ణ కలిగియుండుట. ౭. (భ్రాంతిదర్శనం) విపరీత జ్ఞానము - జడమును చేతనమనియు, చేతనమును జడమనియు నెంచుట. ఈశ్వరుడు కానిదాని నీశ్వరుడని భావించి పూజించుట. ౮. (అలబ్ధ భూమికత్వం) సమాధి లభింపకుండుట. ౯. (అనవస్థితత్వం) సమాధి లభించినను చిత్తము స్థిరము కాకుండుట - ధ్యేయప్రాప్తి కాకముందే సమాధిభంగమగుట. కావున సమాధి ప్రాప్తించినను ధ్యేయప్రాప్తి కలుగువఱకు నది భంగము కాకుండునట్లు యత్నింపవలెను. ఈ చిత్త విక్షేపములు యోగ మలములనియు, యోగశత్రువులనియు నెంచబడును. ఉపాసనా యోగమునకు విఘ్నములని భావము ౧౯

(దుఃఖదౌర్మనస్యం) ౧. (దుఃఖం) ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, అధిదైవికమునని దుఃఖములు ముప్విధములు. (౧. ఆధ్యాత్మిక దుఃఖములు - రోగాదులవలన శరీరమున గలుగు పీడలు; కామాదుల మూలమున మనస్సున నేర్పడు దుఃఖములు. ౨. ఆధిభౌతికములు:- వ్యాఘ్రాది ప్రాణులవలన నేర్పడు దుఃఖములు. ౩. అధి దైవికములు:- అతివృష్టి, అనావృష్టి, భూకంపము మున్నగు వానిచే గలుగు దుఃఖములు.) ఈ ముప్విధములగు దుఃఖములచే బీడింపబడువాడు వాని వినాశమునకు యత్నించును. ౨. (దౌర్మనస్యం) కోరికనెఱవేఱనపుడు మనస్సులో గలుగు క్షోభ. ౩. (అంగమేజయత్వమ్) శరీరావయవములు కంపించుట. ౫. (శ్వాసః) బాహ్యవాయువును కోరికలేకున్నను లోపలివాయువును బయటికి పంపుప్రాణము. ఇవియన్నియు విక్షేపములతో బాటు కలుగుచుండును. - పూర్వము వ్రాసిన విక్షేపములు కలిగినపుడే యవస్థ లేర్పడును. సమాహితచిత్తుడైన పురుషున కీయవస్థ లుండవని భావము.

సమాధికి శత్రువులైన యీ శత్రువులను అభ్యాసవైరాగ్యముల మూలమున నడ్డగింపవలెను. కావున నభ్యాసమునేమా వర్ణించుచున్నాము

**(తత్ ప్రతిషేధార్థమేకతత్త్వాభ్యాసః)** ఈ విక్షేపములు కలుగకుండుటకై ఏకతత్త్వమగు నీశ్వరునియందు చిత్తమును లగ్న మొనర్చుట కభ్యాసము చేయవలెను. ఆ విఘ్నములను నశింపజేయుట కిదియే వజ్రరూపశస్త్రము. కావున మానవులెల్లరు ప్రేమభావముతో బాగుగ పరమేశ్వరు నుపాసించుటకు సతతము ప్రయత్నింపవలెను. దానివలన సర్వవిఘ్నములు దూరములగును.

(క) చిత్తము క్షణికమని యెంచువారి పక్షమున నీ దోషము జూపనగును. ఈ సిద్ధాంతము నంగీకరింతుమేని సమాధివిక్షిప్తావస్థలలో భేదముండదు. అనేక విషయములనుండి వేరుచేసి చిత్తము నొక విషయమునందు స్థిరపఱచుట 'యేకాగ్రత' యనబడును. కాని, క్షణికచిత్త వాదమున ప్రతివిషయజ్ఞానమున కొక చిత్తము చొప్పున నెన్ని విషయముల జ్ఞానములు కలుగునో యన్ని చిత్తములు వేరువేరుగ నుండును. కావున ప్రతిచిత్తము తన తన విషయమున నేకాగ్రమై యుండును. చిత్తము క్షణికము - క్షణకాలముండునది - కావున నది యన్యవిషయమును గ్రహింపనేరదు - ఏ చిత్తమే విషయమును గ్రహించునో యందది ఏకాగ్రమే యగును - కావున వారికి క్షణికచిత్తవాదుల యేకాగ్రత యననగును. అయ్యది యోగుల కభీష్టముకాదు. పైన చెప్పబడిన యేకాగ్రతా లక్షణ మంగీకరింతుమేని క్షణికచిత్తవాదుల చిత్తము క్షణికము అను వాదము ఖండితమగును.

పూ. ప: కొంతసమయము వఱకు నిరంతరముగనుండు సమాన జ్ఞానముల ప్రవాహమే 'చిత్తైకాగ్రత' యని యెంచవచ్చును. ఉదా:- ఒక మనుజుని కాలిలో ముల్లు గ్రుచ్చుకొన్నదనుకొనుడు. అతనికి కొంతకాలమువఱకు బాధ యెడతెగకుండ కలుగును. ఆ బాధను తెలుపు జ్ఞానమొక్కటికాదు. నానా జ్ఞానములు - ఒకే విధమగు బాధను దెలుపు జ్ఞానము లనేకములని భావము. ఎంతతడవు బాధ తెలియునో యంతతడవు అనేక చిత్తములుద యించునని అభిప్రాయము - చిత్తము లనేకములైనను వానిలో సాదృశ్యముండును - సదృశజ్ఞానప్రవాహము నడచుచున్నదని యర్థము. కావున మేమిట్టియెడ చిత్తైకాగ్రతను తెలుపుట కిది చక్కని దృష్టాంతమని చెప్పుదుము. పరమాత్మయందును చిత్తమును లగ్నము చేయుటలో నీయవస్థ తెలియనగును.

ఉ. ప: ఇల నేకాగ్రత యేవి ధర్మము? అని మా ప్రశ్న. ఆ యేకాగ్రత, ఏ యేకచిత్తమున సమానజ్ఞానప్రవాహ మేర్పడుచున్నదో దానిధర్మమా? అట్లంగీకరింతువేని యపుడది మా పక్షమే యగును. నీ పక్షమున నట్టి నిత్య చిత్తము లేదుగదా! చిత్తము క్షణికమై మరుక్షణమున నది లేనపుడు అనేక సదృశ జ్ఞానము లందెట్లు కలుగును?

పూ. ప: మా సిద్ధాంతమునునుసరించి సదృశ జ్ఞానప్రవాహము నడచు సమయమున గల యేకాగ్రత యా ప్రవాహమునవచ్చు ప్రతి జ్ఞానము యొక్కయు ధర్మమగును.

ఉ. ప: ఈ సిద్ధాంతముకూడ సరికాదు. నీవు చెప్పినదంగీకరింతుమేని, ఆ జ్ఞానములు సమానములైనను, లేక సమానములు కాకున్నను రెండవస్థలందును ప్రతిజ్ఞానము క్షణికము. కావున తన తన విషయమున నియతమగును. భేదమేమియు నుండదు. ఇట్లిప్పుడునేకాగ్రతయే సిద్ధించును. విక్షిప్తావస్థ కసలు తావే యుండదు. కావున చిత్తమొక్కటియై యనేక విషయములు గలవని యంగీకరించినపుడే యేకాగ్రత సిద్ధించును. ఒక్క చిత్తము నానా విషయములందు చిక్కుకొనక వానిని విడిచి కొండొక విషయమున స్థిరమై యుండుటయే యేకాగ్రత యగును.

(ఖ) చిత్తము క్షణికమగువెడం పూర్వమొఱిగిన వస్తువు మరల స్మరింపనువుకాదు. ఏ వస్తువు నే చిత్త మనుభవించెనో - ఎఱిగెనో యాచిత్తమప్పుడే నశించినది కదా! దానితో బాటు దాని యనుభవము కూడ నశించును. ఇప్పుడా వస్తువును స్మరియించు చిత్తము క్రొత్తది మరి యొకటి- అది పూర్వచిత్త మనుభవించిన దాని నెట్లు స్మరియింప గలదు? ఒకని యనుభవమును మరియొకడు స్మరియించుట నియమ విరుద్ధమగును- కావున స్మరింపలేడు.

(గ) ఇట్లే యొక చిత్తము ద్వారమున చేసిన కర్మముల ఫలములను మరియొక చిత్తముతో ననుభవించుటయు బొసగదు. చిత్తము క్షణికమని యంగీకరించినచో కర్మఫలవ్యవస్థయు నేర్పడదు- నశించును. కావున క్షణిక చిత్తవాది తన సిద్ధాంతము నే యుక్తితోను బోషించుకొనజాలడు. ఒక పురుషునకు గలుగు జ్ఞానములలో ప్రతిజ్ఞానమునకు వేరు వేరు చిత్తములు లేవనియు, నొకే చిత్తముతో ననేక జ్ఞానములు కలుగుచున్నవనియు చెప్పుటలో ప్రతి పురుషుడు తన యనుభవమును సాక్షిగా చెప్పును; దేనిని నేను చూచితినో దానినే నేను స్పృశించు చున్నాను. దేనిని నేను స్పృశించితినో దానినే నేను చూచుచున్నాను. ఈ యనుభవములలో నేను అనుదాని కాశ్రయమొక్కటియే. ఈ యనుభవ మెల్లరకును ప్రత్యక్షమే. ఈ ప్రత్యక్షము నే యితర ప్రమాణముకూడ బాధింప - కాదన- జాలదు. ప్రత్యక్ష ప్రమాణ సహాయముతోనే యితర ప్రమాణములు ప్రమాణములగును. కావున పై వివరణము ననుసరించి, పదార్థము లనేకములైనను చిత్తమొక్కటియే యని యంగీకరింపక తప్పదు. అప్పుడే యేకాగ్రత యననేమో తెలియ వీలగును. ఆ చిత్తమునే పరమాత్మయం దేకాగ్రము చేయవలెను.

ఇక వనూయాది చిత్తమలములను దూరమొనర్చునుపాయములు చెప్పుదుము.

మైత్రీకరుణాముదితోపేక్షాణాంసుఖదుఃఖపుణ్యాపుణ్యవిషయాణాం, భావనాతశ్చిత్త ప్రసాదనమ్. ౨౨ యో. ౧-౩౩

(మైత్రి) ఈ ప్రపంచమున సుఖముతో నున్న మనుష్యాది ప్రాణులలో నన్నింటితోను మైత్రి కలిగియుండుట. దుఃఖితులైయున్న ప్రాణులమీద కృపాదృష్టి నుంచవలెను. పుణ్యాత్ములయెడ ప్రసన్నతయు, పాపులయెడ నుపేక్షయుగలిగియుండవలెను. ఒకనియెడ ప్రీతి కాని, వైరముకాని లేకుండుట యుపేక్ష యనబడును. ఇట్లు మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షలను గలిగియున్నందున నుపాసకుని యాత్మలో సాత్త్వికము ప్రకటితమగును. అతని మనస్సు స్థిరపడును.

(ప్రచ్ఛర్దన విధారణాభ్యాం వా ప్రాణస్య. యోగ. ౧.౩.౪) భోజనానంతరమున వాంతియైనట్లు లోపలి వాయువును బలపూర్వకముగ బయటికి నిశ్వాసము ద్వారమున గ్రక్కి తీసి, యెంతతడవు సుఖముగ దానిని వెలుపలనే యుంచగలుగుదువో యంతతడవు ఉంచుము. తరువరి నెమ్మది, నెమ్మదిగ వాయువును లోపలికి తీసికొనుము. ఇట్లే పలుమాఱు చేయుటవలన ప్రాణ ముపాసకుని వశమగును. అందువలన మనస్సు, ఆత్మయు స్థిరములగును. ఈ మూడును స్థిరములగు సమయమున నాత్మయందున్న, ఆనంద స్వరూపుడు, నంతర్యామియు నగు పరమేశ్వరుని స్వరూపమున మగ్నుడు కావలెను. మనుజుడు జలమున మునిగి తేలునట్లు తన యాత్మను మాటిమాటికి పరమాత్ముని యందు మగ్నము చేయవలెను. ౨౩

(యోగాంగానుష్ఠానాదశుద్ధిక్షయే జ్ఞానదీప్తిరావివేకఖ్యాతేః. యో. ౧.౭.౮) ముందు వ్రాయబోవు ఉపాసనాయోగమునకు జెందిన యెనిమిదంగముల యనుష్ఠానమువలన నవిద్యాదిక్లేశములు క్షీణించును. జ్ఞానప్రకాశము వర్ధిల్లును, అంతవఱకు జీవుడు సరిగా మోక్షము నందజాలడు.

(యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ధ్యానసమాధయః ౧. యమములు, ౨. నియమములు, ౩. ఆసనములు, ౪. ప్రాణాయామము, ౫. ప్రత్యాహారము, ౬. ధారణ. ౭. ధ్యానము, ౮. సమాధి. ఈ యెనిమిదియు నుపాసనాయోగమున కంగములు. ఈ యెనిమిదంగముల సిద్ధాంతరూపఫలమే యోగము. ౨౫

(తత్రాహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః) ఈ యెనిమిదింటను మొదటి యంగము యమములు. ఇయ్యవి యైదు. ౧. (అహింస) సర్వవిధముల, సర్వకాలములందును, సర్వప్రాణులయెడ వైరభావమును విడిచి ప్రేమతో వర్తించుట. ఈయహింస మిగిలిన యమనియమములకు మూలము. ఈ యహింసను తెలుపుటకే

మిగిలినవి చెప్పబడినవి. మిగిలిన సత్యభాషణాది యమనియమములను పాలించుటవలన నహింసాస్వరూపము శుద్ధమగును. ఇదియే శాస్త్రసిద్ధాంతము.

౨. (సత్యమ్) తనకు తెలిసినదాని నట్లే చెప్పవలెను; చేయవలెను; అంగీకరింపవలెను. అదియే సత్యము. తన మనస్సులో నున్న దానినే యితరులకు తెలియచేయుటయే వాక్కును బ్రయోగించుటకు గల ప్రయోజనము. కావున వాక్కును సార్థక మొనర్చుకొనుటకు మూడు విషయములు ధ్యానమున నుంచుకొనవలెను. క. (సా యది న వంచితా) ఇతరులకు మోసము కలుగకుండునట్లు వాణిని బ్రయోగింపవలెను; అశ్వత్థామ చంపబడెను. అను నీ యుధిష్ఠిరుని వాక్యము వలన ద్రోణాచార్యునకు తన పుత్రుడు చచ్చినట్లు జ్ఞానము కలిగినది- మోసము కలిగినది- కావున నియ్యది యసత్యము ఖ. (న భ్రాంతా) భ్రమతో గూడిన వాక్యము చెప్పరాదు. తాను చెప్పువిషయములో తనకే భ్రమ యున్నప్పు డితరుల కావిషయము స్పష్టపడ జాలదు. కావున భ్రాంతితో గూడిన వాక్యము కూడ నసత్యమే. గ. (న ప్రతిపత్తి వంధ్యా) ఇతరులకు తెలియనిభాషలో తన యాలోచనను తెలుపరాదు. అట్టి వాక్యము నిష్ప్రయోజనమగును. దానివలన తన జ్ఞాన మితరులకు సంక్రమింపదు. కావున నట్టి వాక్యము కూడ నసత్యముననే చేరును. సర్వభూతములకు హితమును, నుపకారమును గలిగించునట్లు సత్యమును జెప్పవలెను. ఎల్లరకు నుపకారము గలిగించుటకు బదులు అపకారము గలిగించు సత్యము పైకి పుణ్యముగా కనిపించినను వాస్తవమున నది పాపమగును. దాని ఫలము దుఃఖము. కావున బాగుగ పరీక్షించి సర్వభూతములకు హితము గలిగించు సత్యమును జెప్పవలెను.

౩. (అస్తేయమ్) ఎవని పదార్థమో వాని యాజ్ఞ పొందకయు, శాస్త్రీయ నియమమునకు విరుద్ధముగా నొకని పదార్థము వాంఛించుటయు 'స్తేయము' దొంగతనమగును. అట్లు కోరకుండుట చౌర్యమును విడుట యగును. అస్తేయ మిదియే.

౪. (బ్రహ్మచర్యమ్) విద్యనభ్యసించుటకు బాల్యమునుండియు నెల్లవిధముల జితేంద్రియుడు కావలెను. ఇరువదియైదేండ్లు మొదలు నలుబదియెనిమిదేండ్ల ప్రాయమువఱకు వివాహము చేసికొనుట; పరస్త్రీని, వేశ్యాదుల త్యజించుట, ఎల్లప్పుడు ఋతుగామియగుట, విద్యను బాగుగ నభ్యసించి, సతత మితరులకు చెప్పుచుండుట, ఇతరసర్వేంద్రియములను వశపరచుకొనుచు నుపస్థేంద్రియము నెల్లపుడు సంయమమున నుంచుట బ్రహ్మచర్య మనబడును.

(అపరిగ్రహః) విషయములం దభిమానాదిదోషములు లేకుండుట. విషయముల నుపార్జించుట, వానిని రక్షించుట, వాని వినాశము, వానియందాసక్తి, మున్నగువానివలన నితరులకు హింస బాధ కలుగును. కావున వివిధములగు దోషములు వాటిల్లును. కావున నిట్టి దోషములు గలుగని విధమున నెంతటి పదార్థములతో జీవన నిర్వాహము జరుగునో యంతటితోనే తృప్తి చెందవలెను. ఈ యైదు విధములగు యమముల నాచరించినందున నుపాసనా యోగబీజము నాటబడును.

శౌచ సంతోష తపః స్వాధ్యాయ- ఈశ్వర ప్రణిధానాని నియమాః ౨౭

యో. పా. ౨-౩౨

అహింసా ప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః .౨౮ యో. పా. ౨-౩౫

సత్యప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్. ౨౯ యో. పా. ౨-౩౬

అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్. ౩౦ యో. పా. ౨-౩౭

బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః. ౩౧ యో. పా. ౨-౩౮

అపరిగ్రహ స్థైర్యే జన్మకథంతా సంబోధః. ౩౨ యో. పా. ౨-౩౯

శౌచాత్ స్వాంగజుగుప్సాపరైరసంసర్గః.౩౩ యో. పా. ౨-౪౦

(కించ) సత్వశుద్ధి సౌమనస్యైకాగ్ర్యేంద్రియజయాత్మదర్శనయోగ్యత్వాని చ౩౪
యో. పా. ౨-౪౧

సంతోషా దనుత్తమసుఖలాభః.౩౫ యో. పా. ౨-౪౨

కాయేంద్రియసిద్ధి రశుద్ధిక్షయా త్తపసః.౩౬ యో. పా. ౨-౪౩

స్వాధ్యాయా దిష్టదేవతాసంప్రయోగః.౩౭ యో. పా. ౨-౪౪

సమాధిసిద్ధి రీశ్వర ప్రణిధానాత్.౩౮ యో. పా. ౨-౪౫

(శౌచ సంతోష...) ఉపాసనకు రెండవయంగము నియమములు - అవియును నైదు. ౧. శౌచము-పవిత్రత. అది రెండు విధములు. ఆభ్యంతరము, బాహ్యము, ధర్మాచరణము, సత్యభాషణము, విద్యాభ్యాసము, సత్సంగము మున్నగు శుభగుణాచరణమువలన నాభ్యంతరశుద్ధి కలుగును. జలాదులవలన గలుగు- శరీరము, స్థానము మార్గము, వస్త్రములు అన్నపానాదులు మున్నగువాని పవిత్రత బాహ్యపవిత్రత యగును.

౨. సంతోషము - సతతము ధర్మానుష్ఠాన మొనర్చుచు నత్యంత పురుషార్థ మొనర్చి ప్రసన్నుడై యుండవలెను. దుఃఖ సమయమునను శోకాతురుడు కారాదు. ఆలస్యము - సోమరితనము సంతోషము కాదు. 3. **తపస్సు**-సువర్ణము నగ్నియందు తపింపజేసి నిర్మల మొనర్చునట్లు ధర్మాచరణము, శుభగుణాధానము నవెడి తపస్సుతో నాత్మను, మనస్సును నిర్మలము చేసికొనుట తపస్సనబడును. ౪. స్వాధ్యాయము-మోక్షవిద్యలను విధించు వేదశాస్త్రములను జదువుట, జదివించుటయు, ఓంకార విచారణతో నీశ్వరుని నిశ్చయించుటయు స్వాధ్యాయ మనబడును. **౫. ఈశ్వర ప్రణిధానము** సర్వసామర్థ్యమును, సర్వగుణములను, ప్రాణములను, ఆత్మను, మనస్సు మున్నగువాని నన్నింటిని ప్రేమభావముతో నీశ్వరున కర్పించుట · ఈ యైదు నియమములును నుపాసనకు రెండవయంగము. ౨౭

ఇక యమనియమములను బాగుగ ననుష్ఠించినందున గలుగు ఫలములను జెప్పుచున్నాము.

**౧. అహింసా ఫలము:-**

(అహింసాప్ర......) అహింసాధర్మమున దృఢమైనస్థితిని సంపాదించిన మనుజుని మనస్సున వైరభావ ముండదు. అంతేకాక, యతని యెదుటను, నతని సంగతివలనను నితరులుకూడ వైరభావమును విడిచి పెట్టుదురు. ౨౮

**౨. సత్యాచరణమునకు ఫలము:-**

(సత్యప్ర.......) నిశ్చయపూర్వకముగ కేవలసత్యము నంగీకరించుచు, చెప్పుచు, చేయుచునుండు మనుజ డే యోగ్యకార్యమును చేయునో, చేయదలచునో యది తప్పక సఫలమగును. ౨౯

**3. దొంగతనము మానినందువలన గలుగు ఫలము:-**

(అస్తేయ.......) శుద్ధమైన మనస్సుతో చౌర్యమును విడుచుటకు ప్రతిజ్ఞచేసి, దానిని పాలించు మనుజునకు నుత్తమోత్తమ పదార్థము లన్నియు యథాయోగ్యముగ లభించును. 30

**౪. బ్రహ్మచర్యానుష్ఠాన ఫలము:-**

(బ్రహ్మచర్య......) బాల్యావస్థలో వివాహము చేసికొనక, ఉపస్థేంద్రియమును సంయమములో నుంచి, వేదాది శాస్త్రములను జదువుచు, చదివించుచు నుండి వివాహానంతరమునగూడ స్వస్త్రీయందు ఋతుగామి యగుచు, పరస్త్రీ గమనాదులాచరింపక వ్యభిచారమును మనోవాక్కాయములతో వర్జించువానికి శరీరబలము, బుద్ధిబలము వర్ధిల్లును- ఇట్లు బలము పెరిగినందున మనుజుడానందమున నుండును.3౧

**౫. అపరిగ్రహఫలము:-**

(అపరిగ్రహ......) మనుష్యుడు విషయాసక్తినుండియు, శారీరక మమత్వమునుండియు విడివడి జితేంద్రియుడై యుండునప్పుడు తానెవడో, యెటనుండి వచ్చెనో, తనకు చేయవలసినదేమో ఏమిచేసిన తనకు కళ్యాణము చేకూరునో మున్నగు శుభగుణ విచారణ యతని మనస్సున స్థిరమగును. 3౨

ఈ యైదు యమములకు ఫలములు: ఉపాసకులు వీనిని తప్పక సంపాదింపవలెను. కాని, నియమములు యమములకు సహకారి కారణములు. ఉపాసనకవి రెండవయంగము. వానిని పాలించుటవలన నుపాసకులకు మిక్కిలి సహాయములభించును. ఆ నియమములకును నీ క్రింది ఫలములు తెలియవలెను.

**౧. శౌచమునకు ఫలము:-**

**(క) బాహ్యశుచికి ఫలము:-** (శౌచాత్ స్వాంగ......) శౌచము వలన యోగి తన శరీరమును, దాని యవయవములను నన్నింటిని లోపల వెలుపల మలినములుగా జూచును. అందువలన నతనికి నితరుల శరీరములుకూడ నిట్లే మలసహితములని బోధపడును. అందువలన నతడితరుల సంగము - సంసర్గము నేవగించుకొనును - సదా వారినుండి దూరముగ నుండును.33

**(ఖ) ఆంతరిక శుచిఫలము:-** (కించ.....) ఆభ్యంతర శౌచము వలన, ౧. అంతఃకరణశుద్ధి, ౨. మనఃప్రసన్నత, 3. ఏకాగ్రత, ౪. ఇంద్రియజయము, ౫. ఆత్మసాక్షాత్కారయోగ్యత అను నివి యన్నియును గలుగును.

**౨. సంతోష ఫలము :-**

(సంతోషాత్) పూర్వము వర్ణించిన సంతోషమువలన నేర్పడు సుఖము సర్వోత్తమమగును. 3౫

**3. తపస్సునకు ఫలము:-**

(కాయేంద్రియ) పూర్వోక్తమగు తపస్సువలన యోగి శరీరము, ఇంద్రియములు నన్నియు నశుద్ధిక్షయమువలన దృఢములై యెల్లపుడు రోగరహితములై యుండును.

౪. స్వాధ్యాయఫలము:-

(స్వాధ్యాయ......) పూర్వోక్తస్వాధ్యాయమువలన నిష్టదేవత పరమేశ్వరునితో సంప్రయోగము-సంబంధము స్థాపితమగును. పిదప పరమేశ్వరానుగ్రహసహాయము, ఆత్మశుద్ధి, సత్యాచరణము, పురుషార్థము, ప్రేమ వీని ప్రయోగమువలన జీవుడు శీఘ్రముగ ముక్తిని బొందును. ౩౮

౫. ఈశ్వరప్రణిధానమునకు ఫలము :-

(సమాధిః) ఈశ్వరప్రణిధానమువలన యోగి సులభముగ సమాధిస్థితిని బొందును.

తత్ర స్థిరసుఖమాసనమ్ ౩౯ యో. ౨-౪౬

ఉపాసనకు మూడవ యంగ మాసనము (తత్ర స్థిర.....) దేని మూలమున శరీరము, ఆత్మయు స్థిరములగునో, అట్లే సుఖము విశ్రాంతి లభించునో యది యాసనము.

(క) ఉపాసించు సమయమున దర్భలు, మృగచర్మమును పఱచుకొందురు. అదియు నాసన మనబడును. ఎక్కువ సమయము స్థిరముగ, సుఖముగ కూర్చుండుట కనువగు నట్టియాసన మేర్పఱచుకొనవలెను.

(ఖ) కూర్చుండు స్థితిని గూడ నాసనమందురు. స్థిరముగ నెక్కువ సమయము కూర్చుండు విధమున గూర్చుండవలెను. పద్మాసనము, సిద్ధాసనము నను నామములతో ననేకాసనములు గలవు. ఉపాసనాసమయమున పద్మాసనాది పద్ధతులతో గూర్చుండవలెను. ఇచ్ఛానుకూలమగు నాసనమున గూర్చుండి యుపాసింపవగును. ౩౯

**ఆసనఫలము:** (తతో ద్వంద్వా నభిఘాతః) ఆసనమున దృఢత యేర్పడినచో నుపాసనమున సహాయము లభించును. శీతోష్ణాదులవలన బాధయు గలుగదు. ౪౦

ఉపాసనకు నాల్గవ యంగము ప్రాణాయామము, (తస్మిన్ సతి) వెలుపలి నుండి శరీరములోనికి గ్రహింపబడు వాయువు - శ్వాసము శరీరమునుండి బయటికిపోవు వాయువు-ప్రశ్వాసము. ఆసనము సిద్ధించిన మీదట నీ శ్వాసప్రశ్వాసముల గమనాగమనములను అభ్యాసము మూలమున మెల్లమెల్లగ వశగించవలెను చేతివ్రేళ్లతో నాసికను పట్టుకొనరాదు. కాని జ్ఞాన పూర్వకముగనే శ్వాస ప్రశ్వాసములగతిని నిరోధించుట - ప్రాణాయామ మనబడును. ౪౧

ఈ ప్రాణాయామము నాలుగువిధములు (స తు బాహ్య-) ౧. బాహ్యవిషయము, ౨. ఆభ్యంతర విషయము, ౩. స్తంభవృత్తి. ౪. (బాహ్యాభ్యంతర) లోపల వెలుపల వాయువును నిలుపుటవలన గలుగునది. ౪౩

అంగుష్ఠముతోను నితరాంగుళులతోను నాసికా ఛిద్రములను మూసి ప్రాణాయామము చేయునా రల్పజ్ఞులు. బుద్ధిమంతుడట్లు చేయరాదు. పైనచూపిన నాలుగు ప్రాణాయామము లీ క్రిందివిధమున జేయవలెను.

(౧) లోపలినుండి వెలుపలికివచ్చి వాయువును మరల లోపలికి బోకుండునట్లు వెలుపలనే దాని నిలుపుట మొదటి ప్రాణాయామము.

(౨) వెలుపలి వాయువు లోపలికి తీసికొని దాని నెంతసేపు లోపల నిలుపగలుగుదురో యంత తడవు నిలుపుట రెండవరకపు ప్రాణాయామము. (౩) మూడవది స్తంభవృత్తి, ప్రాణమును వెలుపలికిగాని వెలుపలి వాయువును లోపలికిగాని పోనీయక యెక్కడి వాయువు నక్కడే నిలుపుట స్తంభవృత్తి ప్రాణాయామ మనబడును. (౪) నాలుగవరకపు ప్రాణాయామమున, లోపలి వాయువు వెలుపలికి రా యత్నించు నపుడు వెలుపలినుండి యడ్డగించుచు దానిని లోపలనే యుండునట్లు ప్రయత్నించవలెను. అట్లే వెలుపలివాయువు లోపలికి బోవనున్నపుడు దానిని లోపలికి రానీయకుండ లోపలినుండియే యడ్డగించు చుండవలెను. వెలుపలి వాయువును వెలుపలికి నెట్ట బ్రయత్నింపవలెను.

మూడవరకపు (స్తంభవృత్తి) ప్రాణాయామమునకు నాలుగవరకపు ప్రాణాయామమునకు గల భేదమేమియన :-

మూడవ ప్రాణాయామము బాహ్యాభ్యంతర ప్రాణయామాభ్యాసము నపేక్షింపదు. నాల్గవరకపు ప్రాణాయామ మాభ్యంతర బాహ్యవిషయక ప్రాణాయామాభ్యాసము నపేక్షించును. ఇట్లే నాల్గు విధములైనను ప్రాణాయామముల ననుష్ఠించుటవలన చిత్తము నిర్మలమై యుపాసనలో స్థిరత యేర్పడును.

**ప్రాణాయామఫలము:**

**తతః క్షీయతే ప్రకాశావరణమ్. ౪౪** యో. పా. ౨-౫౨

ఇట్లు ప్రాణాయామ పూర్వకముగ నుపాసించినందున నాత్మజ్ఞానమును గప్పియుండు నజ్ఞానము ప్రతిదినము నశింప నారంభించును. జ్ఞాన ప్రకాశము క్రమముగా వర్ధిల్లును. ౪౪

ఆ యభ్యాసమున కిదియు ఫలమే యగును. (ధారణా-) ప్రాణాయామము ననుష్ఠించినందున ఉపాసకుల మనస్సునందు బ్రహ్మము ధ్యానమొనర్పగల శక్తి- యోగ్యత కలుగును ౪౭

ఉపాసనకు నైదవయంగము ప్రత్యాహారము (స్వవిషయా-) మనుష్యుడు తన మనస్సును జయించినపుడు- పరమేశ్వరుని స్మరణమును విడిచి మనస్సు ఇతర విషయములవంకకు వెళ్ళునపుడు - ఇంద్రియము స్వయముగనే జయింపబడును. మనస్సె యింద్రియములను నడుపునది. అట్టి స్థితి ప్రత్యాహార మనబడును. ౪౮

(తతఃపర. ..) అప్పుడు మనుజుడు జితేంద్రియుడై తన మనస్సునెట నిలుపదలచిన నట నిలుపగలడు. ఎటకు బంపదలచిన నటకు బంపగలడు. ఈశ్వరోపాసనయందు ప్రవృత్తుడైనపుడతడు తనచిత్తమును, నింద్రియములను వశమున నుంచుకొనగలుగును.

**ఉపాసన కాఱవయంగము ధారణ :-**

(దేశబంధః.....) పూర్వము వర్ణించిన యోగాంగము లైదు సిద్ధించిన మీదట నాఱవ యంగమగు ధారణ క్రమముగా ప్రాప్తించును. మనస్సును చాంచల్యమునుండి తొలగించి, నాభి, హృదయము, నాసిక, జిహ్వాగ్రభాగము, నున్నగు స్థలములలో స్థిరమొనర్చి, ఓంకారజప మొనర్చుచు దానియర్థమగు పరమేశ్వరుని గూర్చి యాలోచించుట ధారణ యనబడును. ౪౯

ఉపాసనా యోగమున కేడవయంగము ధ్యానము. (తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్) ధారణానంతరమున నాప్రదేశమునందే చిత్తము నిలిపిన స్థలమున నాభిచక్రాదులలో- ధ్యానము చేయవలెను. ఆశ్రయింపదగిన యంతర్యామియు, వ్యాపకుడునగు పరమేశ్వరుని ప్రకాశమునందును, ఆనందమును నత్యంతాలోచనముతోను, ప్రేమ భక్తితోను సముద్రమున నది ప్రవేశించునట్లు ప్రవేశింపవలెను ఆ సమయమున నీశ్వరుని విడిచి యన్యవస్తువును స్మరింపరాదు. ఆ యంతర్యామి స్వరూపమునందును జ్ఞానమునందును మగ్నుడు కావలయును అతని నామమునే ధ్యానింపవలెను. ౪౮

పైన వర్ణించిన యేడంగములకు ఫలము సమాధి. ఆ సమాధి యుపాసన కెనిమిదవ యంగము. దానివర్ణన :-

(తదేవార్థ......) అగ్ని లో బాగుగ తపింపబడిన లోహ ఖండమగ్నిరూపమగునట్లు, యోగి - ఉపాసకుడు - పరమేశ్వరుని జ్ఞానమున ప్రకాశమయుడై తన శరీరమును గూడ మఱచిన వానివలెనై తన యాత్మను పరమేశ్వరుని ప్రకాశ స్వరూపమగు నానందముతోను జ్ఞానముతోను పరిపూర్ణ మొనర్చుకొనుట సమాధియనబడును.

ధ్యానసమాధులలో నొకింత భేదమున్నది. ధ్యానమునందు, ధ్యానము చేయువాడు (ధ్యాత) మనస్సు (ధ్యానసాధనము) ధ్యానింపబడు వస్తువు (ధ్యేయము) నను నీ మూడింటి జ్ఞానము వేరు వేరుగ తెలియబడుచుండును. కాని, సమాధియందు కేవల పరమేశ్వరుని యానంద స్వరూపమునను, జ్ఞానమునందు యాత్మమగ్నమయిపోవును. ధ్యాత, ధ్యానము, ధ్యేయము మూడు నందు వేరువేరుగ తెలియబడవు. అన్నియు నొక్కటిగా నున్నట్లు బోధపడును. మనుష్యుడు నీటియందు మునిగి కొంతతడ వటనుండి పైకివచ్చునట్లు జీవాత్మ పరమేశ్వరునియందు మగ్నమై మరల వేరగును. ౫౦

(త్రయమేకత్ర సంయమః) నాభి మున్నగు ప్రదేశములలోనెందు ధారణ చేయబడునో యందే ధ్యానము, సమాధి - ధ్యేయవస్తు వగు పరమేశ్వరునందు మగ్నమగుట - సంయమ మనబడును. ఒకే సమయమున ధారణ, ధ్యాన సమాధు లేకమైనపుడు- ధారణసంయుక్తము ధ్యానము, ధ్యానసంయుక్తము సమాధియు నైనపుడు నా మూడింటిలో కాలభేద మతిసూక్ష్మముగ నుండును. కాని సమాధి యేర్పడినప్పుడు ఆనందమధ్యమున నీ మూటింటి ఫలమొక్కటియే యగును. ధారణ, ధ్యానము, సమాధియును నీ మూడింటికి కలిపి శాస్త్రీయ పరిభాష సంయమము.

**నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః**

**నాశాంతమానసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్ ౧.**

కఠో-1-౧-వ-౨-మం-౨౪

**తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే శాంతా విద్వాంసో భైక్ష్య చర్యాం చరంతః సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా ౨.**

ముండ. ౧-ఖం,౨మం.౧౧

**అథ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మదహరోఽస్మిన్నంతరాకాశ స్తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమితి. 3.**

ఛాందో. ప్ర. ౮ ఖం, ౧ మం. ౧

**తం చేద్ బ్రూయుర్ యదిద మస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ**

దహరో౽స్మిన్నంతరాకాశః కిం తదత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజిజ్ఞాసితవ్యమితి. ౪.
ఛాందో. ప్ర. ౮ఖం. ౧ మం. ౨

స బ్రూయాద్ యావాన్ వా అయమాకాశః తావానేషో౽న్తర్ హృదయ ఆకాశః ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అంతరేవ సమాహితే, ఉభావగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచంద్రమసా వుభౌ విద్యున్నక్షత్రాణి, యచ్చాస్యేహాస్తి యచ్చ నాస్తి సర్వం తదస్మిన్ సమాహిత మితి ౫.
ఛాందో, ప్ర. ౮ ఖం. ౧ మం.౩

తంచేద్బ్రూయు రస్మిం శ్చేదిదం బ్రహ్మపురే సర్వసమాహితం సర్వాణి చ భూతాని సర్వేచ కామా యదైన జ్జరా వాప్నోతి ప్రధ్వంసతే వా కిం తతో౽తిశిష్యత ఇతి. ౬.
ఛాందో. ప్ర. ౮ ఖం . ౧ మం . ౪

స బ్రూయాన్నాస్య జరయైతజ్జీర్యతి, న వధేనాస్య హన్యత ఏతత్ సత్యం బ్రహ్మపుర మస్మిన్ కామాః సమాహితా ఏష ఆత్మా౽పహతపాప్మా విజరో విమృత్యుర్ విశోకో విజిఘత్సో౽ పిపాసః సత్య కామః సత్యసంకల్పః యథా హ్యేవేహ ప్రజా అన్వావిశంతి యథాను శాసనం యం యమంత మభికామా భవంతి యం జనపదం యం క్షేత్రభాగం తం తమేవోపజీవంతి ౭.    ఛాందో. ప్ర.౮ ఖం. ౧ మంత్ర ౫

ఉపాసన విషయమున నుపనిషత్ ప్రమాణములు. ఈయుపాసనా యోగము దుష్టమానవులకు సిద్ధింపదు. (నావిరతో) మానవుడు దుష్టకార్యములను విడిచి తన మనస్సును శాంతపరచుకొన నంతవఱకు, ఆత్మను పురుషార్థిగా చేయనంతవరకు, అభ్యంతర వ్యవహారములను శుద్ధ మొనర్పనంతవఱకు వతడెంత చదివినవాడైనను, వినికిడి యెంత గలవాడైనను వానికి బ్రహ్మ-పరమేశ్వర - ప్రాప్తిగలుగదు. ౧

(తపః శ్రద్ధే) ఎవరు ధర్మాచరణము ద్వారమున పరమేశ్వరుని యాజ్ఞల నత్యంత ప్రేమతో బాలింపను వరణ్యము - శుద్ధహృదయమనెడి మనమునో లేక యేకాంత స్థానమునో స్థిరముగ నివసింతురో వారేపరమేశ్వరుని సమీపమున నివసింతురు. ఎవరు ధర్మము నాచరించుటలోను, నధర్మమును విడుచుటలోను, దృఢముగా నుందురో, అట్లే వేదాది సత్యవిద్యలలో విద్వాంసులగుదురో, ఎవరు భిక్షాచరణాది కర్మముల నొనర్చి-ప్రాణధారణకొఱకే యన్నాదులను గ్రహించి-సంన్యాసాది ఆశ్రమములం దుందురో, అట్టి గుణవంతులు (సూర్య ద్వారేణ) ప్రాణముద్వారమున పరమేశ్వరుని సత్యరాజ్యమున ప్రవేశింతురు. అట పూర్ణపురుషుడు - అన్నింటిలో నిండి నిబిడీకృతుడై, యన్నింటికంటె సూక్ష్ముడై, యవినాశియైన పరమేశ్వరుడుండును. అట హానిలాభము లుండవు అట్టి పరమేశ్వరుని బొంది సదానందమున నుందురు. ౨

ఎవరిసర్వసాధనముల మూలమున పరమేశ్వరునుపాసించి వానిని బొందగోరుదురో వారివిషయముల నెఱుగవలెను (అథ యదిదం) కంఠమునకు క్రిందుగా, రెండు స్తనములకు మధ్యలో నుదరమునకు పైన హృదయదేశమున్నది. అదియే బ్రహ్మపురము - పరమేశ్వరుని నగరము. దానికి మధ్యనొక (గర్త) గుంట యున్నది. దానిలో కమలాకారమున నొక వేశ్మ-ఆకాశరూపస్థానము - ఉన్నది. దానిలో సర్వశక్తి మంతుడగు పరమేశ్వరుడు బాహ్యాభ్యంతరముల నేకరసుడై నిండియున్నాడు. ఆ యానంద స్వరూపుడగు పరమేశ్వరుడా ప్రకాశిత స్థానమునందే యన్వేషించిన దొరకును. అతడు లభించుటకు మరియొక యుత్తమ స్థానముకాని మార్గము కాని లేదు    ౩

(తం చేద్ బ్రూయుః) ఆ హృదయాకాశమున నున్నదేమిటి వెదకుటకు? అని యెవడేని యెప్పుడైన ప్రశ్నించినచో-    ౪

ఆ ప్రశ్నమున కిది సమాధానము. (స బ్రూయాద్ ) ఈ భౌతికాకాశ మెంతయున్నదో యంతయే యీ హృదయాంతరముననుండు నాకాశనామకాంతర్యామి పరమేశ్వరుడున్నై యున్నాడు. ఆ యాకాశనామక పరమేశ్వరునందే యగ్ని వాయువులు, సూర్యచంద్రులు, విద్యున్నక్షత్రములు నన్నియు నున్నవి. కనబడు పదార్థములు, కనబడని పదార్థములు నన్నియు నా పరబ్రహ్మమునందే యున్నవి. ౫

(తం చేద్ బ్రూయుర్) ఈ బ్రహ్మపురమున- పరమేశ్వరునందు సర్వభూతములు, కామనలు నన్నియు నున్నపక్షమున, ఈ శరీరము వృద్ధావస్థను బొంది పిదప నశించునుగదా! అప్పుడు దానియందు మిగులునదేమి? దేనిని నీవు వెదకుమని చెప్పుచున్నావు? అని యెవరేని ప్రశ్నించిన- ౬

ఆ ప్రశ్నకు సమాధానమిది (స బ్రూయాత్) అన్నా! వినుము ఈ శరీరము ముసలిదైనను, నశించినను, నా పరమేశ్వరునకు వృద్ధాప్యము కాని, వినాశముకాని కలుగనేరదు. అతని పేరే సత్యబ్రహ్మపురము. అతనియందే సర్వకామములు సమాహితములై యున్నవి. అతడు (అపహతపాప్మా) సర్వపాపరహితుడు: శుద్ధస్వభావుడు. (విజరః) ముసలితనము లేనివాడు. (విశోకః) దుఃఖరహితుడు (విజిఘత్సో౽పిపా) తినవలెను, త్రాగవలెను నను గోరికలు లేనివాడు - ఆకలి దప్పులు లేనివాడు. (సత్యకామః) అతని కామన లన్నియు

సత్యములే. ఈ లోకమున ప్రజలు రాజాజ్ఞ కనుకూలముగా వర్తించి తమ యభీష్టస్థానములను రాజకృపవలన బొందునట్లు, ఉపాసకులు పూర్వము వర్ణించి నట్లుపాసించి తమ యిచ్ఛవచ్చిన కామములను, స్థానములను పరమేశ్వరుని కృపవలన బొందుదురు. ౮

ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా,

సర్వాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ ౧

శ్వేతాశ్వతర.౬-౧౧

ఉపాసన రెండువిధములు. ౧. సగుణోపాసనము. ౨. నిర్గుణోపాసనము. వానిలో (స పర్యగాత్) నీ మంత్రార్థము ననుసరించి శుక్రుడు- జగత్తును రచియించుటకు శక్తిగలవాడు, శుద్ధుడు, కవి, మనీషి, పరిభువు, స్వయంభువు మున్నగు పదములచే వర్ణించుటనుబట్టి పరమేశ్వరుడు వీర్యము, శుద్ధి మున్నగు గుణములు గలవాడగుటవలన సగుణుండనియు, అకాయ, అవ్రణ, అస్నావిరాది పదములచే వర్ణింపబడుటచే కాయ సహితత్వాది గుణములు లేనందున నిర్గుణుండనియు జెప్పబడు చున్నాడు.

అట్లే (ఏకో దేవః) మున్నగు మంత్రములందు నిర్దేశింపబడిన గుణములతో గూడియుండుటచే పరమేశ్వరుడు సగుణుండనియు, (నిర్గుణశ్చ) నిర్గుణుండు కూడ నని వర్ణింపబడుటచే నిర్గుణుండనియు నెంచబడుచున్నాడు. ఈశ్వరుని సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము, శుద్ధత, సమానత, న్యాయకారిత, దయాలుత్వము, సర్వవ్యాపకత్వము, సర్వాధారత, మంగలమయత్వము, సర్వము నుత్పన్నము చేయుట- సర్వకర్తృత్వము- సర్వస్వామిత్వము మున్నగు గుణముల నెఱింగుచు నుపాసించుట సగుణోపాసన మనబడును. అట్లే యా పరమేశ్వరుడెన్నడు జన్మించడు; అతడు నిరాకారుడు - అతడెన్నడు నాకారముగలవాడు కాడు, శరీరధారణ జేయడు, వ్రణరహితుడు, శబ్ద, స్పర్శ, రూప, రసగంధాదిగుణములు లేనివాడు, ద్విత్వాదిసంఖ్య లతనిలో వర్తింపవు, పొడవు, వెడల్పు మున్నగు శబ్దములచే జెప్పబడు పరిమాణము లేనివాడు, అని స్మరించుట నిర్గుణోపాసన మనబడును. కావున నీశ్వరుడు దేహధారణ జేసినపుడు సగుణుండగుననియు, దేహమును త్యజించునపుడు నిర్గుణుండగుననియు, మూర్ఖులు కల్పింతురు. వారి కల్పన వేద శాస్త్రములకు, విద్వాంసుల యనుభవమునకును విరుద్ధము. అందువలన నా కల్పనను సజ్జనులెన్నడు నంగీకరింపరాదు. ఎల్లరు పూర్వోక్త పద్ధతితో పరమేశ్వరునుపాసింపవలెను.

## వేదాలలో ముక్తి (విద్య) యొక్క పరిభాష

పరమేశ్వరు నిట్లు పాసించినందువలన అవిద్యాది క్లేశములను అధర్మాచరణాది దుష్టగుణములను నివారించుకొని, శుద్ధవిజ్ఞానము, ధర్మాది శుభగుణముల యాచరణమువలన నాత్మోన్నతి నొనర్చుకొని జీవుడు ముక్తి బొందును.

ఇక మోక్ష విషయమునకు జెందిన యోగశాస్త్రప్రమాణముల నిట ముందు వ్రాయుచున్నాము.

అవిద్యాఽస్మితారాగద్వేషాఽభినివేశాః పంచక్లేశాః.౧ యో. పా. ౨-౩

అవిద్యా క్షేత్ర ముత్తరేషాం ప్రసుప్త తను విచ్ఛిన్నోదారాణామ్ .౨

యో. పా. ౨-౪

అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా. 3

యో. పా. ౨-౫

దృగ్ దర్శన శక్త్యో రేకాత్మతేవాస్మితా.౪ యో. పా. ౨-౬

సుఖానుశయీ రాగః. ౫ యో. పా. ౨-౭

దుఃఖానుశయీ ద్వేషః. ౬ యో. పా. ౨-౮

స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః.౭ యో. పా. ౨-౯

తదభావాత్ సంయోగాభావో హానం తద్దృశేః కైవల్యమ్.౮ యో. పా. ౨-౨౫

తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్.౯ యో. పా. ౩-౫౦

సత్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమితి. ౧౦ యో.పా.౩-౫౫

తదా వివేక నిమ్నం కైవల్య ప్రాగ్భారం చిత్తమ్. ౧౧ యో. పా. ౪-౨౬

పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూపప్రతిష్ఠా వా చితి శక్తిరితి౧౨ యో. పా. ౪-౩౪

పూర్వ ముపాసనా ప్రకరణమున వర్ణించిన చిత్తవృత్తుల నైదింటిని విధిపూర్వకముగ

నద్ధగించుటవలనను, మోక్షసాధనములందు సతతము ప్రవృత్తుడై యుండుటవలనను పైక్రింద వర్ణించిన క్లేశము లైదును నశించును.

ఆ క్లేశము లివి ౧. అవిద్య, ౨. అస్మిత, ౩. రాగము, ౪. ద్వేషము, ౫. అభినివేశము.[౧]

(అవిద్యాక్షేత్ర.....) అస్మిత మున్నగు నాలుగు విధములగు క్లేశముల యుత్పత్తిస్థానము - జనని - అవిద్య; అవిద్యలేని స్థానమున నస్మితాదులు జనింపవేరవని భావము. మణులలోని మాత్రమువలె నవిద్య అస్మితాదులలో నన్నింటను నుండును. ఈ క్లేశములకు నాల్గు విధములైన అవస్థలున్నవి. ౧. ప్రసుప్తావస్థ, ౨. తనుఅవస్థ, ౩. విచ్ఛిన్నావస్థ. ౪. ఉదారావస్థ. [౨]

[౧. ప్రసుప్తావస్థ: చిత్తమున నవిద్యాదిక్లేశములుండును; కాని ఉద్బోధకములు లేనపుడవి వానికార్యముల నారంభింపవు. కావున నవి సుప్తములు - నిద్రావస్థలో నుండును. ఉదా: బాలకుని చిత్తమున నవిద్యాదులుండును. కాని వానిని ప్రబోధించునవి యుండనందున నిద్రావస్థలో నున్నట్లుండును.

౨. తను అవస్థ: క్షీణస్థితి. ప్రతిక్లేశమునకు విరోధిభావన యుత్పన్నమైనపుడు క్లేశము క్షీణించును- తను స్థితిబొందును. తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము ననుమూడును క్లేశములకు విరోధి భావనలు. వీని యనుష్ఠానమున నస్మితాది క్లేశములు క్షీణించును; లేక, సమ్యక్ జ్ఞాన మవిద్యకు, భేదజ్ఞాన మస్మితకు, మధ్యస్థత రాగద్వేషములకు, మృత్యువునకు భయపడకుండుట యభినివేశమునకును ప్రతిపక్షులు- విరోధులు. యోగము నభ్యసించువారి క్లేశములు క్షీణావస్థను బొందును.

౩. ఈ క్లేశములు తనకంటె బలవంతమగు క్లేశముచే నణచబడినపుడు విచ్ఛిన్నావస్థలో నుండును.

ఉదా: రాగ ముద్బుద్ధమైనపుడు ద్వేషము విచ్ఛిన్న మగును. ద్వేషము ప్రబల మయినపుడు రాగము విచ్ఛిన్న మగును. పరస్పర విరుద్ధములగు రెండు క్లేశము లొకే సమయమున నొకేవ్యక్తి యందు తమతమ కార్యముల నొనర్పజాలవు.

౪. క్లేశము లుద్బుద్ధములై కార్య మొనర్చునపుడు ఉదారా వస్థలో నున్నట్లెంచవలెను

ఉదా: క్రోధియైన పురుషుడు క్రోధావేశమునకు లోబడి నపుడు అతని క్రోధము ఉదారావస్థలో నున్నట్లెంచవలెను.]

౧. అవిద్యా లక్షణము :-

(అనిత్యాశుచి....) క. (అనిత్య) కార్య పదార్థములను- ఉత్పన్నములగు శరీరాది స్థూలపదార్థములను, లోకలోకాంతరములను- నిత్యములని యెంచుటయు, నిత్యములయిన ఈశ్వరుడు, జీవులు, జగత్కారణమగు ప్రకృతి అను నీ మూడింటిని ననిత్యములని యెంచుటయు నవిద్యలో మొదటి భాగము. క్రియకు, క్రియావంతమగు వస్తువునకు గల సంబంధము, గుణమునకు గుణికిగల సంబంధము, ధర్మమునకు ధర్మికి గల సంబంధముకూడ నిత్యము. వీని ననిత్యములనుటయు నవిద్యయే.

ఖ: (అశుచి) మలమూత్రాదులతో గూడి, దుర్గంధయుక్తమగు శరీరమును పవిత్రమని యెంచుట, చెఱువులు, నదులు, బావులు, కొలనులు మున్నగువానిని తీర్థములు, పాపనివారకములు- అని యెంచుట, వానియందలి జలమును చరణామృతమని త్రాగుటయు, ఏకాదశీ వ్రతము మున్నగు మిథ్యావ్రతముల నాచరించుచు నాకలిదప్పికలతో బాధపడుట, స్పర్శేంద్రియ భోగముల నెక్కుడుగ ప్రేమించుట మున్నగు నశుద్ధ వస్తువులను శుద్ధములని యెంచుటయు, సత్యవిద్య సత్యభాషణము, ధర్మము, సత్సంగము, పరమేశ్వరోపాసన, జితేంద్రియత, ఎల్లరకు నుపకారము చేయుట, ఎల్లరితో ప్రేమపూర్వక వ్యవహార మొనర్చుట మున్నగు శుద్ధ వ్యవహారములను, పదార్థములను నపవిత్రములని యెంచుటయు నవిద్యకు రెండవ భాగము.

గ: దుఃఖమును సుఖమనుకొనుట : విషయ తృష్ణ, కామము, క్రోధము, లోభము, మోహము, శోకము, ఈర్ష్య, ద్వేషము మున్నగు దుఃఖరూప వ్యవహారములలో సుఖము లభించునని యాశపడుటయు, జితేంద్రియత, నిష్కామత, శమము, సంతోషము, వివేకము, ప్రసన్నత, ప్రేమ, మైత్రి, మున్నగు సుఖరూప వ్యవహారములలో దుఃఖము కలుగునని యెంచుటయు నవిద్యలో మూడవభాగము.

ఘ: (అనాత్మసు) ఆత్మకానిదాని నాత్మయని యెంచుట - జడమగు శరీరమును చేతన మనుకొనుట-చేతనమును జడమని యెంచుట, అవిద్యలో నాల్గవ భాగము :- ఈ యవిద్య ప్రపంచమునందలి యజ్ఞానులగు జీవుల బంధమునకు హేతువై, వారి నెల్లపుడు వాడించుచుండును. ఇట్లే పూర్వము చెప్పబడిన అనిత్యాశుచి దుఃఖానాత్మలను అనిత్యాశుచి దుఃఖానాత్మలని యెంచుటయు, నిత్యశుచి సుఖాత్మలను నిత్యశుచి సుఖాత్మలుగా నెంచుటయు విద్య యనబడును. విద్యవలన నవిద్య తొలగినపుడు బంధనమునుండి విడివడి జీవుడు ముక్తుడగును.[౩]

౨. అవిద్యాకార్యమైన యస్మితకు లక్షణము :-

(అస్మితా) రెండవక్లేశము అస్మిత. వాస్తవమున జీవుడు వేరు, బుద్ధి వేరు, భిన్నములైన జీవబుద్ధుల నేకమని యెంచుట యస్మిత యగును. దీనివలన నభిమానము- అహంకారము కలుగును. అందువలన వ్యక్తి తన నందఱికంటె గొప్పగా నెంచసాగును. సమ్యక్ జ్ఞానము వలన నభిమానము నశించి, అస్మిత దూరమగును. అప్పుడే మంచి గుణములను గ్రహింప రుచిగలుగును. ౪

౩. రాగ లక్షణము :-

(సుఖానుశయీ రాగః) లోకమున సుఖము ననుభవించినపుడు వానివలన గలుగు సంస్కారములవలన మరల నా సుఖములు స్మరణకు వచ్చును. అప్పుడా సుఖములయందును, ఆ సుఖములు గలిగించు సాధనములందును తృష్ణ - ఆశ - లోభము కలుగును. అదియే రాగము. మనుజుడు సంయోగము వియోగాంతమనియు, వియోగము సంయోగాంతమనియు తెలిసినవాడు, అట్లే వృద్ధి కంతయు క్షయమనియు, క్షయమున కంతయు వృద్ధి యనియు గుర్తించినవాడును రాగము నివృత్తమగును. ౫

**ద్వేషలక్షణము:-** (దుఃఖాను) పూర్వమనుభవించిన దుఃఖముల గూర్చియు, వాని సాధనములగూర్చియు క్రోధబుద్ధి గలిగి యుండుట ద్వేషమనబడును. రాగనివృత్తిగలిగిన ద్వేషనివృత్తి గలుగును. ౬

**౫. అభినివేశలక్షణము :-** (స్వరసవా) ప్రాణులన్నియు నెల్లపుడు శరీరముతో నుండవలయుననియు, చావకూడదనియు ఆశించుచుండును. పూర్వజన్మముననెల్లరు మృత్యుభయము ననుభవించి యుండుట వలననే అభినివేశము కలుగును. దాని స్మరణవలన నెప్పుడెవ్వడును చావగోరడు. దీనివలన పూర్వజన్మ మున్నట్లు సిద్ధించుచున్నది. క్రిమికీటకాదుల కన్నిటికి మరణభయము కలుగును. కావున నీక్లేశము నభినివేశమందురు. జీవుడు, పరమేశ్వరుడు, ప్రకృతి నిత్యములనియు కార్యద్రవ్య సంయోగ వియోగము లనిత్యములని గ్రహించినవాడు ఈ క్లేశము నివృత్తమగును. క్లేశములు నివృత్తము లైనపుడు జీవులకు మోక్షప్రాప్తి కలుగును. ౭

(తదభావాత్.....) అవిద్యాది క్లేశములు తొలంగి, విద్యాది శుభ గుణములు లభించినపుడు జీవుడు తనకు బుద్ధితో గల సంయోగాది సర్వబంధనముల నుండియు, దుఃఖముల నుండియు విడివడి ముక్తిని బొందును. ౮

(తద్వైరాగ్యా......) శోకరహితములగు విశోకాది సిద్ధుల వలనను విరక్తుడై, సర్వక్లేశములకు, దోషములకు మూల- బీజమగు నవిద్యను నశింపజేయుటకు దగిన యత్నమొనర్పవలెను. అవిద్య నశింపక మోక్షమెన్నడు లభింపనేరదు. ౯

(సత్త్వపురుష.....) బుద్ధి, పురుషుడు ననునీ రెండింటి శుద్ధి కలుగక మోక్షము లభింపదు. ౧౦

(బుద్ధియందుగల కర్తృత్వాభిమానము పోయి యది తనకు కారణమగు ప్రకృతియందు లీనమగుటయే బుద్ధి శుద్ధియనబడును. బుద్ధిద్వారమున తనకు లభించు సుఖదుఃఖముల ననుభవింపకుండుటయే జీవుని శుద్ధి.)

(తదావివేక...) సర్వదోషములనుండి వేరై, జ్ఞానమువంక జీవుడు మరలినపుడు; కైవల్య-మోక్ష- ధర్మమునకు సంబంధించిన సంస్కారములతో నతనిచిత్తము పరిపూర్ణమగును. అప్పుడే జీవునకు మోక్షము లభించును. బంధన హేతువులగు కర్మములలో జీవుడు చిక్కియున్నంత వఱకు నతనికి ముక్తి లభించుట యసంభవము. ౧౧

**కైవల్య-మోక్ష- లక్షణము:-**

(పురుషార్థ....) కారణ- ప్రకృతికి- సంబంధించిన సత్త్వరజస్తమో గుణములు, వాని సర్వకార్యములు పురుషార్థ శూన్యము లయినవాడు పురుషున కవి చేకూర్పవలసిన భోగాపవర్గములను చేకూర్చి చరితార్థము లయినవాడు, ఆ గుణములు వాని కార్యములును, తమకు కారణమగు ప్రకృతి- ప్రధానములో లీనములగును. అప్పుడు జీవునియందు విజ్ఞానము, శుద్ధియు నేర్పడి జీవునకు స్వరూప ప్రతిష్ఠకలుగును.- జీవుడు తన స్వాభావికశక్తితోను, గుణములతోను యుక్తుడయియుండును. శుద్ధస్వరూపుడగు పరమేశ్వరుని స్వరూపమగు విజ్ఞానము- ప్రకాశము- నిత్యానందమున నుండును. ఆ స్థితినే కైవల్యము- మోక్షము- అందురు. ౧౨

**ముక్తి విషయమున గౌతమ విరచిత న్యాయదర్శన ప్రమాణములు :-**

దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానా

ముత్తరోత్తరాపాయే తదనంతరాపాయా దపవర్గః। న్యాయద. ౧-౧-౨.

బాధనాలక్షణం దుఃఖమితి ౨ న్యాయద ౧-౧-౨౧

తదత్యంత విమోక్షోఽపవర్గః ౩ — న్యాయద ౧-౧-౨౨

(దుఃఖజన్మ.....) యథార్థజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము-అవిద్య-నశించును. అప్పుడు జీవుని యందుగల రాగద్వేషములనెడి దోషములు నష్టమగును. అటుపైన ప్రవృత్తి-అధర్మము, అన్యాయము, విషయాసక్తి మున్నగు ... దూరమగును. ప్రవృత్తి లేనపుడు, దానివలనగలిగెడి జన్మముగూడ తొలగిపోవును. ... లేనందున సర్వదుఃఖములు తొత్తిగా లేకుండ పోవును. ఇట్లు దుఃఖాభావముగలిగి జీవుడు పరమానంద ప్రదమగు మోక్షదశలో పరమాత్మతో గూడి యానందము ననుభవించును. ఇదియే మోక్షము.౧

(బాధనా...)సర్వవిధములుగ బాధ-ఇచ్ఛావిఘాతము - పరతంత్రత -దుఃఖమనబడును. ౨

(తదత్యంత....) అట్టి దుఃఖాత్యంతా భావమువలనను,పరమాత్మ సంబంధమువలనను పరమానందము ప్రాప్తించును. ఆ పరమ సుఖప్రాప్తియే మోక్షమనబడును.౩

వ్యాసరచిత (బ్రహ్మసూత్రములు) వేదాంతదర్శనములోను ఉపనిషత్తులలోను వ్రాయబడిన ముక్తి స్వరూప లక్షణముల నిట వ్రాయుచున్నాము.

అభావం బాదరి రాహ హ్యేవమ్. ౧ — బ్రహ్మసూ. ౪-౪-౧౦

భావం జైమినిర్ వికల్పామననాత్ ౨ — బ్రహ్మసూ. ౪-౪-౧౧

ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః ౩ — బ్రహ్మసూ. ౪-౪-౧౨

యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ

బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్౧ — కఠో. ౬ ౧౦

తాం యోగమితి మన్యతే, స్థిరామింద్రియధారణమ్,

అప్రమత్తస్తదా భవతి, యోగో హి ప్రభవాప్యయౌ. ౨ — కఠ. ౬-౧౧

యదా సర్వే ప్రముచ్యంతే కామా యేఽస్య హృది శ్రితాః.

అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే. ౩ — కఠ. వ. ౬-౧౪

యదా సర్వే ప్రభిద్యంతే హృదయస్యేహ గ్రంథయః,

అథ మర్త్యోఽమృతో భవత్యేతావ దనుశాసనమ్.౪ — కఠ. వ.౬-౧౫

దైవేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే.౫

ఛాందో. ప్రపా. ౮ ఖ. ౧౨-౫

య ఏతే బ్రహ్మలోకే, తం వా ఏతం దేవా ఆత్మాన ముపాసతే తస్మాత్తేసర్వే చ లోకా ఆత్తాః సర్వే చ కామాః స సర్వాంశ్చ లోకానాప్నోతి. సర్వాంశ్చ కామాన్, యస్త మాత్మాన మనువిద్య (వి)జానాతీతి హ ప్రజాపతి రువాచ, ప్రజాపతి రువాచ. ౬

ఛాం-౧౨-౬

యదంతరాపస్తద్ బ్రహ్మ తదమృతం స ఆత్మా, ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే. యశోఽహం భవామి, బ్రాహ్మణానాం యశో రాజ్ఞాం యశో విశామ్, యశోఽహమనుప్రాపత్సి. సహాహం యశసాం యశః ౭ — ఛాం౮-౧౪-౧

(అభావం....) వ్యాసుని తండ్రి బాదరి. ఆచార్యుడు. ముక్తి విషయమున నతని యభిప్రాయము- జీవుడు ముక్తదశను పొందినపుడు శుద్ధమనస్సు (శుద్ధసంకల్పమనుశక్తి) తో పరమేశ్వరునితో బాటు పరమానందమగు మోక్షమున నుండును. ఈ రెండింటికి (జీవాత్మ- శుద్ధసంకల్పశక్తి) భిన్నమైన శరీరముకాని, ఇంద్రియాది ప్రాకృతిక పదార్థములు కాని యట నుండవు౧

(భావం జైమినిః.....) ఈ విషయమునందే వ్యాసునకు ముఖ్య శిష్యుడైన జైమిని ముని యభిప్రాయము. మోక్షమున శుద్ధమనస్సు (శుద్ధమానసికశక్తి) ఉండును. అట్లే శుద్ధసంకల్పమయ శరీరము, అట్లే ప్రాణాదులు, ఇంద్రియముల శుద్ధశక్తియు నుండును. కారణమేమన:- ఉపనిషత్తునందున ఏకధా భవతి, ద్విధా భవతి త్రిధా భవతి( ఛాం౭ -౨౬-౨) అతడొకటిగాను, రెండుగాను, మూడుగాను అగును.) అని వికల్పములు - అనేక భావములను ప్రతిపాదించు వచనము లీవిషయమున ప్రమాణములుగా నున్నవి. ముక్తజీవుడు సంకల్పమాత్రమున నానావిధములగు నప్రాకృతికములు, దివ్యములునగు సాంకల్పిక శరీరములను రచించుకొనును, కోరినంత నావిని వెంటనే విడువనుగలడు. అతనికి శుద్ధజ్ఞాన ప్రకాశమటనుండును. ౨

[ఇట దివ్య శరీరమన, వాస్తవమున నటవేరొ యొక శరీరముండునని యభిప్రాయము కాదు. మనవంటి సాధారణ పురుషుల శరీరము కంటె ముక్త పురుషుని శరీరము మిక్కిలి

సుందరమై, శోభనాంగములు కలదై, అధికశక్తిమంతమై యుండుననియు దివ్యశరీరము నభిప్రాయము కాదు. ముక్తావస్థయందు జీవునకు ప్రకృతితో నెట్టిసంబంధముండదు. కావున ఆ సమయములో ప్రాకృతికములగు దివ్యమైన లేక అదివ్యమైన శరీరముల యునికికి సంబంధమగు సంభావనయే యుండదు. మనస్సు విషయములోను నిట్లే యెంచవలెను. మనస్సుకూడ ప్రాకృతికమే. జీవుడు బంధావస్థలో నున్నపు డేశక్తులమూలమున మనస్సు, ఇంద్రియములు మున్నగువాని వలన సాంసారికసుఖముల ననుభవించునో యాశక్తులు ముక్తావస్థయందు జీవుడు స్వస్వరూపమున నున్నపుడు బాగుగ వికసించును. సంసారావస్థలో జీవునియందీశక్తులున్నను నవి యవిద్యాదులవలన నణగియుండును. కార్యకరణశక్తి యుడిగియుండును. అందువలన సాంసారిక సుఖముల ననుభవించుటకు జీవునకు ప్రాకృతికములయిన మనస్సు మున్నగు ఇంద్రియము లావశ్యకములగును. ముక్తావస్థయందవిద్య యుండదు. కావున స్వాభావిక శక్తులు ప్రకటములై జీవునకానందము ననుభవింపజేయ సమర్థములగును. అప్పుడు ప్రాకృతికములైన మనస్సు మున్నగు సాధనము లావశ్యకములుకావు. ఈ భావమునే మహర్షి దయానందుడు, సత్యార్థ ప్రకాశమున నవమసముల్లాసమునందు **శృణ్వన్ శ్రోత్రం భవతి** అను శతపథ బ్రాహ్మణ వాక్య ప్రమాణములతో స్పష్టము చేసియున్నాడు. ఈ శుద్ధశక్తుల సముదాయమే యాముక్త దశలో నాత్మకు శరీరమగును. ఇవియే యింద్రియములు, మనస్సుకూడ. ఇదియే దివ్యశరీరము. దీనితోనే పరమాత్మలో నటునిటు చరించును. కావున ముక్తదశలో మనస్సు మున్నగు నామములతో జెప్పబడు శుద్ధశక్తుల భావము, ప్రాకృతికములయిన మనస్సు మున్నగువాని యభావము రెండును నుండును:- అప్పుడు సద్గుణముల భావము, అసద్గుణముల యభావము నుండును ఈ భావాభావముల యునికిని వ్యాసమహర్షి తదుపరి సూత్రమున బ్రకటించియున్నాడు. దీనిని మహర్షి దయానందుడు నంగీకరించియున్నాడు.]

(ద్వాదశాహ....) ఈ ముక్తి విషయమున బాదరాయణుని-వ్యాస మహర్షి యభిప్రాయము:- ముక్తియందు భావము అభావము రెండును నుండును. ప్రాకృతికములగు మనస్సు, ఇంద్రియములు, శరీరము మున్నగు సాధనములు లేనందున నవిద్యాదిక్లేశములు, అజ్ఞానము, అశుద్ధి మున్నగుదోషముల యభావమేర్పడును. శుద్ధసామర్థ్యము (శక్తి) తో గూడిన జీవుడు ముక్తి యందుండుటవలన పరమానందము, జ్ఞానము, శుద్ధత మున్నగు సత్యసత్యగుణముల భావముండును. ఇందులకు దృష్టాంతము. వానప్రస్థాశ్రమమున పండ్రెండుదినములు ప్రాజాపత్యవ్రత మొనరింపవలసి యున్నది. అప్పుడు కొలదిగా భుజించుటవలన కొలదిగా నాకలియుండును:- క్షుత్తు (ఆకలి) నకు కొంతభాగము, కొంతయభావముండును. ఇట్లే మోక్షమునందును పూర్వము చెప్పినట్లు భావాభావము లుండునని యెంచవలెను. 3

[ద్వాదశాహవత్ అను సూత్రమున ద్వాదశాహమను సత్రము ఉదాహరణముగ గ్రహింపబడినది. దాని వ్యాఖ్యానము క్షుత్తు-ఆకలి-యొక్క భావాభావములని అజమీర్‌లో అచ్చైనభాష్యభూమికలో నున్నట్లు వ్రాయబడినది. ఇయ్యది పండితుల కాలోచనీయాంశము. పండితమండలిలో నీ ద్వాదశాహ పదము యాగవాచకముగ బ్రసిద్ధమైయున్నది. ద్వాదశాహ యాగమునకు సత్రమనియు, అహీనమనియు రెండునామములున్నవి. ఇందులకు ప్రమాణవాక్యములున్నవి. ఇట్లే ముక్తావస్థయందును భావాభావములను దెలుపు వాక్యములును గలవు. కావున ముక్తియందు భావాభావము లున్నవనుట నిక్కువము. ద్వాదశాహమునకు సత్రమనుటకు కారణము:- సత్ర లక్షణము ననుసరించి (క) ఈ యాగమున యజమానులనేకులుందురు. (ఖ) **య ఏవం విద్వాంసః సత్రముపయంతి** అను నీ వాక్యమున ద్వాదశాధికారమున **ఉపయంతి** శబ్దప్రయోగమున్నది. (గ) **అష్టోస్తదశావరా శ్చతుర్వింశతిపరమాః సత్రమాసీరన్** ఈ వాక్యమున 'ఆసీరన్' అను పదమున్నది. ఈ మూడును సత్రమునకు లక్షణములు. ఈ యాగమును 'అహీన' మనియు నందురు. ఇందు (క) యజమానుడు నియతుడగును. (ఖ) **ద్వాదశాహేన ప్రజాకామం యాజయేత్** ఈ వాక్యమున యాజయేత్ అని ప్రేరణ చేయబడినది.]

ఇట్లు వేదాంతశాస్త్రమున ముక్తి విషయము నిరూపింపబడినది. ఇక నుపనిషత్కారుల మతము వ్రాయుచున్నాము.

(యదా పంచావ.....) మనస్సుతో బాటు జ్ఞానేంద్రియములైదును పరమేశ్వరునియందు స్థిరములై, యెప్పుడు నతనియందే రమించు నపుడు బుద్ధియంతయు నందులకు విరుద్ధముగా ప్రవర్తింపకున్న పరమగతి-మోక్షమనబడును.

[ఇది జీవన్ముక్తావస్థ- దీనికి పిమ్మట విదేహముక్తి యనాయాసముగ సిద్ధించును.]

(తాం యోగం.....) ఇంద్రియ శుద్ధిని స్థిరతను విద్వాంసులు యోగమందురు. మనుష్యుడుపాసనాయోగమువలన పరమేశ్వరుని బొంది, ప్రమాద రహితుడైనపుడు, వాడు మోక్షమును బొందివర్తించవలెను. ఆ యుపాసనా యోగము (ప్రభవః) శుద్ధిని, సత్యగుణములను బ్రకాశింపజేయునదియు, (అప్యయః) సమస్తాశుద్ధిని, దోషములను, అసత్య గుణములను నశింప జేయునదియు నగును. కావున నుపాసనా యోగమే ముక్తికి సాధనము.2

(యదా సర్వే...) మనుష్యుని హృదయము చెడు కర్మముల నుండి వేరై శుద్ధమైన నాడతడు మోక్షమును బొంది బ్రహ్మానంద యుక్తుడగును. ౩

పూ. ప: ఈ మోక్షపద మేదేని స్థానాంతరమా? లేక బ్రహ్మ కంటె భిన్నమైన పదార్థవిశేషమా? అదియొక స్థలమున నుండునా? అంతట నుండునా?

ఉ.ప: అది స్థానాంతరము కాదు. అంతట వ్యాపకముగ నుండు బ్రహ్మపదమే మోక్షపద మనబడును. ముక్తపురుషు డా మోక్షపదమునే పొందును. (యదా సర్వే.) జీవుని యవిద్యాది బంధన గ్రంథులన్నియు విడివడినపు డతనికి ముక్తి లభించును. ఇదియే శాస్త్రశిక్షణ. ౪

పూ.ప: ముక్తియందు శరీరము, ఇంద్రియాదులు నుండవు కావున జీవాత్మ వ్యవహారమునెట్లు జరుగును? ఎట్లు చూడగలుగును?

ఉ.ప. (శైవేన....) ఆజీవుడు ఇంద్రియాదులకు చెందిన శుద్ధ శక్తి మనస్సు యొక్క శుద్ధ శక్తిలో ఆనందరూపమగు కార్యము నెఱుగ గలుగును. భోగించుచు నెల్లపుడు బ్రహ్మమునందు రమించును. ౫

పూ.ప. ముక్తజీవుడు సృష్టిలో నంతట తిరుగునా? లేక యొకచోట నిలకడగా నుండునా?

ఉ.ప: (య ఏతే బ్రహ్మలోకే....) ముక్తజీవులు పరమేశ్వరుని బొంది సర్వాత్మయగు నతని నుపాసించుచు, నతని యాశ్రయముననే యుందురు. కావున నా జీవులు లోక లోకాంతరములలో నంతట వచ్చుచు బోవుచు నుందురు. ఎక్కడను నాజీవుల కాటంక ముండదు. వారి కామనలన్నియు పూర్ణము లగును; ఏదియు నపూర్ణము కాదు. కావున నేమనుజుడు పూర్వోక్తరీతితో పరమేశ్వరుని సర్వాత్మగా నెఱింగి, యుపాసించునో, అతడు తన కామనల నన్నింటిని పూర్ణముగ బొందును. ప్రజాపతియగు పరమేశ్వరుడీ విషయమును వేదములందుజీవుల కెల్లరకు జెప్పియున్నాడు.

మోక్షము నెల్లజీవులు కోరవలెననియభిప్రాయము. (యదంతరా) ఆత్మలకు నంతర్యామియగు వానిని బ్రహ్మమందురు. అతడే యమృతము-మోక్షస్వరూపుడు. అతడన్నింటికి నంతర్యామియే కాని, యతనికి నంతర్యామి యొుండును లేదు. అట్టి ప్రజానాథుడగు పరమేశ్వరుని వ్యాప్తరూపమును నేను శరణుజొత్తును. లోకములగల పూర్ణ విద్వాంసులైన బ్రాహ్మణులలో నేను (యశః) కీర్తిని బొందుదును గాక! (రాజ్ఞాం) క్షత్రియులయు,, (విశాం) వైశ్యులయు, మధ్య నేను యశస్వి నగుదును గాక! ఓ పరమేశ్వర! నేను యశస్వులలో యశస్వినిగా నెంచుచున్నాను. నీవును కృపతో నన్ను నీ సమీపమున జేర్చుకొనుము. నేను జన్మబంధనమున బడకుందునుగాక ౬

శతపథ బ్రాహ్మణము ననుసరించి ముక్తి మార్గ స్వరూప వర్ణనము.

**అణుః పంథా వితరః పురాణో మాం స్పృష్టో విత్తో మయైవ,**

**తేన ధీరా అపి యంతి బ్రహ్మవిద ఉత్క్రమ్య స్వర్గం లోకమితో విముక్తాః ౧**

శ. కాం. ౧౪-౬-౨-౧౧.

**తస్మిఞ్ఛుక్లముత నీలమాహుః పింగలం హరితం లోహితం చ,**

**ఏష పంథా బ్రహ్మణా హానువిత్త స్తేనైతి బ్రహ్మవిత్తైజసః పుణ్యకృచ్చ.౨**

శ.కా. ౧౪-౬ బ్రా. ౨ కాండ. ౧౨

**ప్రాణస్య ప్రాణ ముత చక్షుషశ్చక్షు రుత శ్రోత్రస్య శ్రోత మన్నస్యాన్నం మనసో యే మనో విదుః తే నిచిక్యుర్ బ్రహ్మ పురాణ మగ్ర్యం మనసైవాప్తవ్యం నేహ నానాస్తి కించన ౩** శ.కా. ౧౪-౬ బ్రా. ౨ కాండ. ౨౧

**మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి.**

**మనసైవానుద్రష్టవ్య మేతదప్రమేయం ధ్రువమ్. ౪**

శ.కా. ౧౪-౬ బ్రా. ౨ కాండ. ౨౨

**విరజః పర ఆకాశాత్ అజ ఆత్మా మహా ధ్రువః**

**తమేవ ధీరో విజ్ఞాయ, ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః ౫**

శ.కా. ౧౪-౬ బ్రా. ౨ కాండ. ౨౩

**స హోవాచ, ఏతద్ వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి అ స్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘమలోహిత మస్నేహ మచ్ఛాయ మత మోఽవాయ్వనాకాశ మసంగ మస్పర్శ మగంధ మరస మచక్షుష్క మశ్రోత్ర మవా గమనోఽతేజస్క మప్రాణ మముఖమనామాగోత్ర మజర మమర మభయ మమృత మరజోఽశబ్ద మవివృత మసంవృత మపూర్వ మనపర మనంతర మబాహ్యం న తదశ్నోతి కశ్చన న తదశ్నోతి కశ్చన** ౬ శత.కాం. ౧౪ అ. ౬ బ్రా ౮ కాండ. ౮

(అణుః పంథా ....) ముక్తిమార్గ మత్యంత సూక్ష్మము (వితతః) ఆ మార్గమున, సుదృఢమగు నౌకతో సముద్రమును తరించినట్లు సర్వ దుఃఖములను సుగమముగ దరింపనగును. (పురాణః) ఈ మార్గము ప్రాచీనము. (స్పృష్టః) ఈశ్వరుని కృపచే నాకది లభించినది. ఆ మార్గము మూలముననే సర్వదోషములనుండియు, దుఃఖములనుండియు ముక్తులైన (ధీరాః) విచారశీలురు, బ్రహ్మవిదులు, వేదవిదులునైన జీవులు (ఉత్ క్రమ్య) సత్యమగు తమ పురుషార్థముతో సర్వదుఃఖముల నుల్లంఘించి, (స్వర్గం లోకం) సుఖస్వరూపమగు బ్రహ్మలోకము బొందుదురు. ౧

(తస్మిన్ శుక్ర......) ఆ మోక్షపదమగు బ్రహ్మమునందు, (శుక్ల) శ్వేతము, (నీలము), శుద్ధఘనశ్యామము, (పింగల) పీతశ్వేతము, (హరిత) ఆకుపచ్చ (లోహిత) ఎఱుపు మున్నగు గుణములు గల లోక లోకాంతరము లిమిడియున్నవి: లేక ప్రకాశితములగుచున్నవి. ఈ మోక్ష మార్గము పరమేశ్వరుని ప్రేమించువారికే లభించును ఆ మార్గముతోనే బ్రహ్మమునెఱుగువాడు, (తైజసః) శుద్ధస్వరూపుడు, పుణ్యాచరణుడునగు మనుష్యుడు మోక్షసుఖమును బొందును. మరియొక విధమున బొందడు. ౨

(ప్రాణస్యప్రాణ.....) ప్రాణమునకు ప్రాణము, నేత్రమునకు నేత్రము, శ్రోత్రమునకు శ్రోత్రము, అన్నమునకన్నము, మనస్సునకు మనస్సును నగు పరమేశ్వరు నెఱుంగు విద్వాంసుడు - పురాతనము, సర్వశ్రేష్ఠము, మనస్సుతో ప్రాపింప యోగ్యమునగు బ్రహ్మమును బొందును. ఇట్లు మోక్షసుఖమును బొంది యానందమున నుండును. (నేహ నానా) ఆ మోక్షపద బ్రహ్మమొక్కటియే. ఆ యద్వైత (ఏక) బ్రహ్మమును బొందుటకే ప్రతివాడును యత్నింపవలెను. ౩

(మృత్యోః స మృత్యు.......) బ్రహ్మము నొక్కటిగా నెంచక, రెండు మూడు పది యిరువది బ్రహ్మములున్నవని, అనేక పదార్థముల కలయికచే బ్రహ్మమయినదని కాని యెంచువాడు మాటిమాటికి మృత్యుపాతంబడును. జన్మమరణములను బొందును. సచ్చిదానంద స్వరూపము బ్రహ్మమొక్కటియే. అయ్యది వ్యాపకమై యన్నింటియందును స్థిరమై యున్నది. దానిని మనస్సుతోనే యెఱుంగగలము. ఇతర సాధనములతో నెఱుగజాలము. అది యన్నింటికంటె సూక్ష్మము. ౪

(విరజఃపర ఆ.) ఆ బ్రహ్మము విక్షేపరహితము; రాగరహితము. ఆకాశముకంటెను పరమసూక్ష్మము, (అజః) జన్మరహితము, (మహద్ధ్రువ) మిక్కిలి నిశ్చలము. జ్ఞానులైనవా రా బ్రహ్మమునే యెఱింగి, తమ బుద్ధి విశాలమొనర్చు కొనవలెను. అప్పుడే వారు బ్రాహ్మణులనబడుదురు. ౫

(స హోవాచ ఏ..) యాజ్ఞవల్క్యుడనుచున్నాడు. ఓగార్గి! విద్వాంసులిట్లు చెప్పుచున్నారు. ఆ బ్రహ్మము స్థూలము కాదు. సూక్ష్మముకాదు. లఘువుకాదు. దానిలో ఎఱుపు, స్నేహము, ఛాయ, అంధకారము, వేదియు లేదు అది వాయువుకాదు ఆకాశముకాదు. దానియందు, సంగము, శబ్ద స్పర్శ గంధరసములు, నేత్ర కర్ణ వాఙ్మనస్సులు, తేజస్సు, ప్రాణము, ముఖ్యనామ గోత్రములు, వృద్ధనష్ట, మరణము, భయము, రాగము, సంకోచ వికాసములు, పూర్వాపరములు, బాహ్యాభ్యంతరములు మున్నగు గుణదోషము లేమియు లేవు. అది మోక్ష స్వరూపము. సాకారపదార్థము లభించినట్లు అది యెవరికిని లభింపదు. ఎవడును నా బ్రహ్మమును మూర్తద్రవ్యమువలె పొందింపడు. అది యన్నింటియందు పరిపూర్ణమైయుండి యన్నింటి వంటకయుండు నద్భుత స్వరూపముకలది. మూర్తద్రవ్యమువలె చక్షురాదీంద్రియములతో జూడబడదు. అది బాహ్యేంద్రియములకు గనిపింపదు. ౬

మనుజుడిట్లు మోక్షబ్రహ్మమును బొంది సుఖించును.

**యే యజ్ఞేన దక్షిణయా సమక్తా ఇంద్రస్య సఖ్య మమృతత్వ మానశ,**

**తేభ్యో భద్రమంగిరసో వో అస్తు. ప్రతిగృభ్ణీత మానవం సుమేధసః.౧**

ఋ. ౧౦-౬౨-౧

**స నో బంధుర్ జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా,**

**యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామ న్నధ్యైరయంత ౨**

య. అ. ౩౨-౧౦

(యే యజ్ఞేన-) పూర్వోక్తమగు జ్ఞానరూపమగు యజ్ఞము, ఆత్మాది ద్రవ్యములను పరమేశ్వరునకు దక్షిణగా నర్పించు ముక్త జీవులు మోక్షమున ప్రసన్నులుగ నుందురు. (ఇంద్రస్య) పరమేశ్వరుని మైత్రితో మోక్షభావమును బొందిన వారికే భద్రమను పేరుగం సర్వ సుఖములు నియుతము చేయబడినవి. (అంగిరసః) వారి ప్రాణములు (సుమేధసః) వారిజ్ఞానమును మిక్కిలిగ బెంచును. అని మోక్షప్రాప్తమగు మనుష్యుని తమ సమీపమున నానందమున నుంచును. ముక్త పురుషులు తమ జ్ఞానముతో పరస్పర మొకరి నొకరు చూతురు. కలిసికొందురు. ౧

(సనో బంధుః-) మానవులెల్లరు నా పరమేశ్వరుడు తమకు బంధువు- దుఃఖములను నాశమొనర్చువాడు, (జనితా) అతడే సర్వసుఖములను, సమస్త జగత్తును నుత్పన్నము చేయువాడు, (విధాతా) పాలించువాడునై యున్నాడు. అతడే సర్వకామములను బూర్ణమొనర్చువాడు; సర్వలోకములను నెఱుగువాడు. ఆ పరమేశ్వరునందే విద్వాంసులు మోక్షమును బొంది సదానందమున నుందురు. తృతీయధామము శుద్ధ సత్వ సహితమగు సర్వోత్తమ సుఖమునందు సదా స్వచ్ఛందులై రమింతురు. అని యెఱుంగవలెను.౨

ఇట్లు ముక్తి విషయము సంక్షేపముగ కొంత వర్ణింపబడినది. ముందుకూడ నక్కడక్కడ వర్ణింతుము. (వేదాహమేతం) అనుమంత్రమునగూడ కొంత ముక్తి విషయము పూర్వము చెప్పబడినది.

## వేదాలలో నౌకావిమానాది విద్యలు

"తుగ్రో హ భుజ్యుమశ్వినో దమేఘే రయిం న కశ్చిన్ మమృవాఁ అవాహాః తమూహథుర్ నౌభిరాత్మన్వతీభి రంతరిక్షప్రుద్భి రపోదకాభిః" ౧

ఋ. ౧-౧౧౬-3

"తిస్రః క్షపస్త్రిరహాతి వ్రజద్భిర్ నాసత్యా భుజ్యు మూహథుః పతంగైః సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షడశ్వైః"౨

ఋ. ౧-౧౧౬-౪

అనారంభణే తదవీరయేథా మనాస్థానే అగ్రభణే సముద్రే,

యదశ్వినా ఊహథుర్ భుజ్యుమస్తం శతారిత్రాం నావ మాతస్థివాంసమ్.3

ఋ. ౧-౧౧౬-౫

ముక్తివిషయక వర్ణనానంతరము సముద్రము, భూమి, అంతరిక్షము వీనిలో శీఘ్రగమనమునకు దగిన యానములకు సంబంధించిన విద్యను గూర్చియు, శిల్పవిద్యను గూర్చియు వేదములందుసైన వ్రాసిన విధమును వ్రాయుదుము. పూర్వనిర్దిష్ట వేదమంత్రముల అభిప్రాయము:-

(తుగ్రోహ) 'తుజి'ధాతువునకు పరమున ఔణాదిక 'రక్' ప్రత్యయము చేర్చిన 'తుగ్ర' శబ్దము సిద్ధించును. ఈ 'తుజి' ధాతువు కు హింస, బలము, గ్రహించుట, స్థానమునని నాలుగర్థములు, కావున నీ వైదిక తుగ్ర పదమునకు శత్రువులను హింసించువాడు, విజయుడు, బలశాలి, ధనాది పదార్థములను గ్రహించువాడు, తనయానముల మూలమున సుఖముగ నుత్తమోత్తమ స్థానములకేగువాడు స్వామియు నని యర్థములు. (రయిం) ఉత్తమ విద్యను, సువర్ణాద్యుత్తమ పదార్థములను కామించు ధనకామి, (భుజ్యుం) పాలనకు, భోగమునకు నుపయోగించు ధనాది పదార్థముల ప్రాప్తిని, భోగమును విజయేచ్ఛను ముందువ్రాయబోవు పదార్థ విద్యా పద్ధతుల వలన పూర్వము చేసికొనవలెను (అశ్వినా) సువర్ణము, రజతము, రాగి, ఇత్తడి, ఇనుము, కాష్ఠము మున్నగు పదార్థములతో నేక విధములగు యాంత్రిక రచనలతో గూడిననౌకలను సిద్ధము చేసికొని, వానియందు అగ్ని, వాయువు, జలము మున్నగువాని నుచితరీతి నుపయోగించి, వ్యాపారమునకు దగిన వస్తువులను వానిలోనింపి, వ్యాపారముకొఱకు, (ఉదమేఘే) సముద్రము, నదములు మున్నగు వానిలో ( అవాహాః) వచ్చుచు పోవుచు నుండునో- ప్రయాణ మొనర్చునో - అతనికి ద్రవ్యాది వస్తువులకు జెందిన వ్యాపారి కొన్నతి గలుగును. ఇట్లు పురుషార్థమొనర్చువాడు,(న కశ్చిన్ మమృవాన్) పదార్థములను సంపాదించి, వానిని రక్షించి దుఃఖముతో నెన్నడు మరణింపడు. అతడలసతను వీడి పురుషార్థపరుడగును. ఆ నౌకాదుల నిర్మాణక్రియ (అశ్వినా) ద్యు, పృథివి- ప్రకాశాత్మకమగు నగ్నిని ప్రయోగించుటవలనను, పార్థివములగు, రాగి, వెండి, మున్నగు ధాతువుల మూలముననుం, కాష్ఠాదుల వలనను సిద్ధించును - వీని మూలమున యానములందు వేగము జనించునని భావము. వేదోక్తమగు యుక్తితో సిద్ధము చేయబడిన నౌక, విమానము, భూమియందు నడచు రథము- బండి-పైన జెప్పిన ఆశ్వి ఆగ్నేయములు, పార్థివములునయిన సాధనముల మూలమున, (ఊహథుః) దేశ దేశాంతరములలో రాకపోకలు సుఖముగ జరుగును. ఈ మంత్రమున ఊహతుః అను నీ ప్రథమ పురుష క్రియను ప్రయోగించుటకు బదులు ఊహథుః అని మధ్యమ పురుష క్రియ ప్రయోగింపబడినది. ఉక్త పదార్థములతో (నౌభిః) సముద్రమున సుఖముగ రాకపోకల కనువగు నౌకలు మంచివి సిద్ధమగును. (ఆత్మన్వతీభిః) ఆ నౌకలను యజమానులో, లేక నౌకరులో నడపవీలగును వ్యాపారులు, రాజ్యకార్యనిర్వాహకులు నీ యానములందు సముద్రములలో ప్రయాణమొనర్పవలెను. (అంతరిక్షప్రుద్భిః) విమానశబ్ద వాచ్యము లగు యానములతో నాకాశగమనము సిద్ధించును (అపోదకాభిః) సముద్రనౌకలు జలమునందు తడిసి చివుకకుండునట్లును, శీఘ్రముగ విరుగక, పగులక యుండునట్లును, శుద్ధముగాను, నునుపుగాను నుండవలెను. ఇట్లు భూయానములతో

భూమిమీదను, ఆకాశ యానములగు విమానములతో నాకాశమునందును, జలయానములతో జలమునందును రాకపోకలు జరుగవలెను. ఆ త్రివిధములగు యానములను పూర్వము జెప్పినట్లు నికముందు జెప్పబోవునట్లును బాగుగ సిద్ధము చేసికొనవలెను. (అశ్వినౌ) అను శబ్దార్థ విషయ నిరుక్తప్రమాణము.

(అథాతో ద్యుస్థానాదే.) ద్యుస్థానమునగల దేవతలను వర్ణించు చున్నాము. వానిలో అశ్విని దేవతలు ప్రథమములు. వాయువు, అగ్నిఅను నీ రెంటి నామము అశ్వి పదార్థములలో నన్నింటిలో ధనంజయ రూపమున వాయువు, విద్యుద్రూపమున నగ్నియు వ్యాపించి యున్నవి. జలము, అగ్నియు అశ్వి యనబడును. అగ్ని జ్యోతితో యుక్తమై, జలము రస యుక్తమై వ్యాప్తములై యున్నవి. (అశ్వైః) ఔర్ణవాభ నిరుక్త కారుని మతమున వేగాది గుణములతో గూడి యున్నందునను నగ్ని మున్నగునవి అశ్వ యనబడును. విమానాదులను సిద్ధము చేయగోరువారు వాయుజలాగ్నులతో వానిని సిద్ధముచేయ వలెనని ఔర్ణవాభాచార్యుని మతము. ఋషులలో ననేకుల మతము. ౧. (ద్యావాపృథివ్యౌ) అగ్ని లేక సూర్యుడు,పృథివి, అశ్వులని కూడ అనబడును. అగ్ని తన ప్రకాశములోను, పృథివియున్నరసములోను నన్నింటిలో వ్యాప్తమై యున్నవి. రెండును వేగవంతములు కూడ. పృథివికి సంబంధించిన కొయ్య, ఇనుము మున్నగు వస్తువులతో నిర్మింపబడిన యంత్రములను నడుపుటవలన నానావిధములగు వేగాది గుణములు వాహనములందును, ఇతర కృత్రిమపదార్థములందును ఉత్పన్నము చేయవచ్చును. విద్వాంసులలో అనేకుల యభిప్రాయ మిట్లున్నది-౨ (అహోరాత్రౌ) రాత్రింబవళ్ళు అశ్వి యనబడును. పగలు తన ప్రకాశములోను, రాత్రి తన మంచులోను అన్నింటను వ్యాప్తములైఉన్నవి. ఇవి రెండును వేగవంతములు కూడ. వీని వలను పదార్థములలో సంయోగ వియోగములేర్పడి వేగాదిగుణములకు కారణములగును. అందువలననే శరీరము ఓషధులు మున్నగు వాని యందు వృద్ధిక్షయములు కలుగుచున్నవి. ఇట్లే శిల్ప విద్యలలో నిపుణులైన విద్వాంసుల అభిప్రాయములో, 3 ( సూర్యాచంద్రమసౌ) సూర్యచంద్రులు అశ్వి యనబడుచున్నవి. సూర్యుడు తనకాంతితోను, చంద్రుడు తన యాహ్లాద రసములోను అన్నింటను వ్యాపులగు చున్నారు. వారిరువురు వేగముగలవారుకూడ. సూర్య చంద్రుల ఆకర్షణాది గుణముల వలన విశ్వమునందలి పృథివ్యాది పదార్థములలో సంయోగ వియోగములు, వృద్ధిక్షయములు మున్నగు శ్రేష్ఠగుణములుత్పన్నములగుచున్నవి.

(తథాశ్వ..) జర్ భరీ, తుర్ఫరీతు, అనునవికూడా అశ్వి అన బడును. (జర్భరీ) విమానాది యానములను ధరించునది. (తుర్ఫరీ) యంత్రము మూలమున విమానములందు గతి కల్పించునది. ఇట్లు వాయువు, అగ్ని, జలము, పృథివి మున్నగు వస్తువులను యుక్తితో వాడుకొనుటవలన విమానాదుల ధారణ పోషణలు జరుగును. వానిలో వేగాదిగుణములుత్పన్నములగును. గుఱ్ఱములు, ఎద్దులు కొరడాతో కొట్టిన వేగముగ నడచునట్లు యంత్రనైపుణ్యము వలన ధారణయు, వాయ్వాదులను యంత్రము మూలమున ప్రేరించుటవలన సర్వవిధములగు శిల్పవిద్యలు సిద్ధించును. (ఉదన్యజే) నిరుక్తమున నీ యశ్వి ఉదన్యజ ననియు చెప్పబడినది. ఉదన్యజమన సముద్రములోని రత్నము. ఈ అగ్ని మున్నగునవి. అశ్వి సముద్రరత్నములు. అగ్ని, వాయువు, జలము మున్నగు వానిని సరిగా ప్రయోగించుట వలన సముద్రమున సుఖపూర్వకముగ పయనింపవచ్చునని అభిప్రాయము. పైన చూపిన ప్రమాణములన్నింటిని బట్టి వాయువు, అగ్ని, జలము, పృథివియను నీనివలన ఏర్పడిన సాధనములతో మూడువిధములగు యంత్రములను యానములను చేయవలెనని సిద్ధమగుచున్నది.౧

(వాసత్యా) ద్యు, పృథివి అనువాని వికారములయిన జలము, అగ్ని, వాయువు మున్నగునవి అన్నియు (భుజ్యమూహథుః) ఉత్తమ సుఖాది భోగములను ధరించునవియై ఉన్నవి. వాని మూలముననే భూయానములు, జలయానములు, అంతరిక్షయానములు నానాస్థానములందు నిర్మింపబడి సంచరించును. ఈ యానముల ద్వారముననే (తిస్రః క్షపస్త్రిరహా) మూడురాత్రులు పవళ్ళు (అర్ద్రస్య) జలపూర్ణ సముద్రమున (ధన్వనః) భూమిని, అంతరిక్షమును దాటి (అతివ్రజద్భిః) శీఘ్రముగ వెళ్ళనగును. ఆయానములు (పతంగైః) తమ ప్రతిగమనమునందును వేగవంతములై ఉండును (త్రిభీరథైః) భూజలాంతరిక్ష యానములరూపమున నెక్కిపోవుటకవి సుందరమైన మువ్విధములగు సాధనములు (శతపద్భిః) నందలాదికాళ్ళుగల వానివలె అవి మిక్కిలి వేగముగ నడచును. (షడశ్వైః) వానిలో తీవ్రగతి గలిగించుటకు నాఱు యంత్రములుండును. లేక వానిలో అగ్ని మున్నగు ఆరు స్థానము లుండును. ఈ యంత్రమునందును ఊహతుః అను ప్రథమపురుషక్రియకు బదులు ఊహథుః అను మధ్యమ పురుషక్రియ ప్రయోగింపబడినది. కారణమేమనా ఇది ప్రత్యక్షవిషయము.

వేదమునందు ఇట్లు పురుషవ్యత్యయము జరుగుననుటకు పాణిని కృతాష్టాధ్యాయి, పతంజలి మునికృత మహాభాష్యము ప్రమాణములు,

**వ్యత్యయో బహులమ్** అష్టా. 3-౧-౮౫

ఈ సూత్రమునననుసరించి విశేషావస్థయందు, శప్, శ్యన్, శ్ను మున్నగు వికరణములలో వ్యత్యయము - పారస్పరిక పరివర్తనము జరుగును.

(**ఉదా॥ ఆండా శుష్ణస్య భేదతి.** ఋ. ౮-౪౦-౧౧

అను ఈ ఋక్కునందు, రుధాదిగణమునకు చెందిన భిద్ ధాతువు యొక్క భినత్తి రూపము ప్రయోగింప వలసియుండ దానిస్థానమున భేదతి అని శప్ వికరణముతో కూడిన రూపము ప్రయోగింపబడినది.

మహాభాష్యకారుని సిద్ధాంతమును బట్టి పాణినిముని ఈక్రింద చూపిన స్థలములలో విశేషావస్థలో వ్యత్యయమును అంగీకరించును.

(౧) సుప్ వ్యత్యయము-ఉదా: ధురి **దక్షిణాయాః** (ఋక్. ౧. ౧౬౪-౯.) ఈ ఋక్కునందు దక్షిణాయాం స్థానమున దక్షిణాయాఃఅని ప్రయోగింపబడినది.

(౨) తిఙ్ వ్యత్యయము- ఉదా: **చషాలం యే అశ్వయూపాయ తక్షతి** (ఋగ్-౧-౧౬౨-౬) ఈ ఋక్కునందు **తక్షంతి** స్థానమున **తక్షతి** అని ప్రయోగింపబడినది.

(3) ఉపగ్రహము-పరస్మైపదము, ఆత్మనే పదములలో వ్యత్యయము ఉదా: **బ్రహ్మచారిణ మిచ్ఛతే** ఈ వాక్యమున ఇచ్ఛతి స్థానమున **ఇచ్ఛతే** అని ప్రయోగింపబడినది.

(౪) లింగవ్యత్యయము - ఉదా: **మధోస్తృప్తా ఇవాసతే** ఇందు మధునః అని నపుంసకలింగ స్థానమున **మధోః** అని పుంలింగ ప్రయోగము చేయబడినది.

(౫) పురుష వ్యత్యయము - ఉదా: **అధా స వీరైర్ దశభిర్ వియూయాః** ఇక్కడ **వియూయాత్** అని ప్రథమ పురుషక్రియ ప్రయోగింపవలసినచోట వియూయాః అని మధ్యమపురుష ప్రయోగము చేయబడినది.

(౬) కాలమును దెలుపు ప్రత్యయములో మార్పులు.

ఉదా॥ **శ్వోఽగ్నీనాధాస్యమానేన** ఇందు **లుట్** స్థానమున **లృట్** ప్రయోగింపబడినది.

**శ్వోఽగ్నీనాధాతా** అని యుండవలసినది.

(౭) హల్-వ్యంజనములలో వ్యత్యయము - ఉదా : 'తమసో గాఆదుక్షత' ఇందులో వ్యాకరణము ననుసరించి అధుక్షత అని ఉండవలసినది. కాని,'అదుక్షత' అని 'ద' కారముతోనే ఉంచబడినది.

(౮) అచ్చులలో వ్యత్యయము - ఉదా: 'మిత్రవయం చ సూరయః' ఇక్కడ మిత్రావయం అని ఉండవలసినది. 'మిత్రవయం' అనియే ఉంచబడినది.

(౯) ఉదాత్తాది స్వరవ్యత్యయము- ఉదా: 'గనామివశ్రియసే' అను ఈవాక్యమున 'తుమ' ర్థమున 'కసేన్' చేర్చిన మీదట 'ఞ్నిత్యాదిర్ నిత్యమ్' (పాణి. ౬-౧-౧౯) సూత్రము ననుసరించి ఆద్యుదాత్తము ప్రాప్తింపగా వ్యత్యయమువలన మధ్యోదాత్తమైనది.

(౧౦) కర్త, మున్నగు కారకములలో వ్యత్యయము సంస్కృతమున చూపిన మహాభాష్యకారుని కారిక 'సుప్తిఙ్.......... లో కర్త అనగా కారకములని అభిప్రాయము - ఇందు 'కృత్', 'తద్ధిత' ప్రత్యయములలో వ్యత్యయము జరుగును; కావున కృత్తద్ధితప్రత్యయ వ్యత్యయ మనవలెను.

ఉదా: అన్నాదాయ ఇందు వేదము అణ్ ప్రత్యయస్థానమున అచ్ ప్రత్యయము చేయబడినది. ఈ రెండుప్రత్యయములందును రూపము అన్నాదాయ అనియే యేర్పడును. కాని, సంధివిడదీయునపుడు అన్న + అద్ + అణ్= అన్న + ఆద = అన్నాదః అనియు, అన్న + అద్+ అచ్ = అన్న + అదః అన్నాదః ఇట్లు భేదము కలుగును. కావున అణ్ ప్రత్యయము వచ్చినపుడు అన్న + ఆదాయ = అన్నాదాయ అనియు, అచ్ వచ్చినపుడు అన్న + అదాయః అన్నాదాయ అనియు సంధివిభేదము కలుగును.

(౧౧) యఙ్ వ్యత్యయము: పైన జూపిన సంస్కృత కారికలోని యఙ్ ఒక ప్రత్యాహారము. యఙ్ లోని య కారము మొదలు పాణినీయ: 3-౧-౨౨. సూత్రము వలన జేయబడు అఙ్ ప్రత్యయము లోని ఙ్ చేర్చిన ప్రత్యాహారమగును. అందువలన ఈ ప్రత్యాహారములో ఈక్రింది ప్రత్యయములు గ్రహింపబడును. అని వేదమున విశేషావస్థలలో వ్యత్యయమును పొందును.

(క) యఙ్, (ఖ) ణిచ్, (గ) యక్ కండ్వాయాది గణము. (ఘ) ఆయః, (ఙ) ఈయఙ(చ) ణిఙ్, (ఛ) స్య, తాసి, (జ) సిప్, (ఝ) ఆమ్, (ఞ) చ్లి, సిచ్, క్స, చఙ్ అఙ ్, చిణ్, (ట) యక్ కర్మ వాచ్యము, (ఠ) వికరణము శప్, శ్యన్, శ్ను, శ, శ్నమ్, ఉ, శ్నా, ఆశీర్లింగ్ యొక్క అఙఉదా: భేదతి, మరతే, వేషతు మున్నగునవి.

ఆ అశ్వులు ఊనర్వయానములను ధరించును. ఈ సామాన్యకాల ప్రయోగమునందే ఇట ఊహాథుః అను రూపములో లిట్ లకారము విధింపబడినది. ఆ అశ్వియేఊయానముల కన్నింటికి ముఖ్యసాధనములు. ఇట్టియానములనుపయోగించినపుడే ఉత్తమసుఖము ప్రాప్తించును, లేకున్న లభింపదు. ౨

(అనారంభణే) ఓ మానవులా! పూర్వము చెప్పినట్లు మీరు అనారంభణ ఆలంబన రహితమగు సముద్రమునందు, ఆకాశమునందు కార్యనిర్వాహకములగు యానములను రచింపుడు. (తదవీరయేథామ్) ఆయానములు పూర్వోక్తములగుఅశ్వి తోనే రాకపోకలకు వీలుగ సిద్ధించును. (అనాస్థానే) ఆలంబనములేక దేని యందెవడు నిలువజాలడో, (అగ్రభణే) దేనియందు చేతితో బట్టుకొనుటకును ఆధారమొండును లభింపదో, (సముద్రే) అట్టి పృథివి మీదను జలపూర్ణ సముద్రము మీదను, ఆకాశము నందును మీరు మీ ప్రయత్నముతో సాధించిన యానములతో రాకపోకలు జరుపుడు. (యదశ్వినా ఊహాథుర్ భు.....) వాయ్వాది అశ్వి తో నిర్మింపబడిన యానము శ్రేష్ఠభోగమును కలుగచేయును. (అస్తం) అశ్వులవలన నడపబడుయానము భూమి, జలాంతరిక్షములలో నన్నికార్యములు సిద్ధింపజేయును. (శతారిత్రామ్) నౌకలు మున్నగు యానములలో నందలకొలది అరిత్ర జలములోతును దెలిసికొనుటకు, ఆయానముల నాపుటకు, వాయ్వాదులవలన ఏర్పడు విఘ్నములనుండి వానిని రక్షించుటకు ఇనుపలంగరులు మున్నగునవి యుంచుకొనవలెను. ఇట్టి యానములవలన (తస్థివాంసమ్) స్థిరభోగమును మానవులు పొందుదురు.

యమశ్వినా దదథుః శ్వేతమశ్వమఘాశ్వాయ శశ్వదిత్ స్వస్తి.

తద్వాం దాత్రం మహి కీర్తేన్యం భూత్పైద్వో వాజీ సదమిద్ధవ్యో అర్యః. ౪

ఋ. ౧-౧౧౬-౬

(యమశ్వినా) అశ్వి, అగ్ని, జలముల సంయోగమువలన (శ్వేతమశ్వం) బాష్పరూపముగు తెల్లని గుఱ్ఱము అత్యంత వేగముకలది ఉత్పన్నమగును. దానితో శిల్పులు యానములను (అఘాశ్వాయ) శీఘ్రగమనము కొఱకు వేగయుక్తములం జేయుదురు. ఆ వేగమున కు ఎన్నడు హానిగలుగదు. ఎంత పెంప దలచిన నంతగ పెరుగును. బాష్పముతోనే పూర్వోక్త యానములను సిద్ధము చేయవలెను. (శశ్వదిత్ స్వస్తి) ఆయానములందు ఆరూఢులై సముద్రమునందును, అంతరిక్షమునందును రాకపోకలు చేయుటవలన సుఖము వర్ధిల్లును. (అశ్వినా దదథుః) వాయువు, అగ్ని, జలము మున్నగు వానిచే ఉత్పన్నమగు వేగగుణమును బాగుగాలోచించి గ్రహింపవలెను (వామ్) ఈ సామర్థ్యము పూర్వోక్తములగు అశ్వులలోనే ఉన్నది. (తత్) ఆ సామర్థ్యము, (దాత్రమ్) దానము చేయదగినదియు, సుఖకారకము ను అగుటచే పోషకము, (మహి) గొప్పగొప్ప శుభగుణములతో యుక్తము, (కీర్తేన్యమ్) మిక్కిలి ప్రసంసీయము. సర్వమానవులకు ఉపకారకము (భూత్)నై ఉన్నది. (వాజీ) ఆబాష్పాశ్వము వేగవంతము. (పైద్వః) మార్గమున అది యానమును వేగముగ నడుపును. (సదమిత్) ఇట్టత్యంత వేగయుక్తమగు బాష్పాశ్వము (హవ్యః) ఆదానప్రదానయోగ్యమై ఉండును. (అర్యః) వైశ్యుడు, శిల్పవిద్యాస్వామియు దీనిని తప్పక గ్రహింపవగును. ఇట్టి యానములు లేకున్న ద్వీపాంతరములకు రాకపోకలు జరుగజాలవు.

వామ్ ప్రథమ పురుషస్థానమున మధ్యమపురుష ప్రయోగము.కృత్యార్థే తవైకేన కేన్యత్వనః అను పాణినీయసూత్రము ను అనుసరించికీర్తేన్యమను పదమునందు కేన్య ప్రత్యయము చేయబడినది.

భూత్= అభూత్ ఊలుఙ్లకార ప్రయోగము లట్ లకారార్థమున జేయబడినది.

యాస్కనిఘంటువు ప్రమాణమునమసరించి పైద్వః శబ్దము నకు అశ్వను అర్థము. ౪

త్రయః పవయో మధువాహనే రథే సోమస్య వేనామను విశ్వ ఇద్విదుః

త్రయః స్కంభాసః స్కభితాస ఆరభే త్రిర్నక్తం యాథస్త్రిర్ వశ్వినా దివా॥

౧-౩౪-౨

(మధువాహనే రథే) మధురగతిగల రథమునందు (త్రయః పవయః) పృథివీజలాదులపై నడపలిగునట్లు మూడుచక్రముల సముదాయము లుండవలెను. వాని అంగములన్నియు వజ్రతుల్యముగ దృఢముగ ఉండవలెను. దృఢములగు మరలుగూడ నందుండవలెను. వానివలన రథమునందు శీఘ్రగమన ముత్పన్నము చేయగలిగి యుండవలెను. (త్రయః స్కంభాసః) ఆరథమునందు మూడు మూడు స్తంభములుండవలెను. వాని యాధారమున (స్కభితాసః) కలాయంత్రములు స్థాపితములై ఉండవలెను. (విశ్వే) శిల్పవిద్వాంసులెల్లరు, (సోమస్య వేనామ్) సుందరము, శాంతమునగు సుఖోత్పాసిద్ధి నెఱిగియే ఉన్నారు. శిల్పులు అగ్నివాయ్వాదులను ప్రయోగించి యానములను సుఖకారకములుగ జేయ నెఱుగుదురని భావము. (అశ్వినా ఆరభే) కావున వారు పూర్వోక్తములగు అశ్వులతోనే యానము నారంభింప గోరవలెను

(యాథః) కారణమేమన, ఆ అశ్వులే యా యానమును సిద్ధము చేయును. ఆ యానము (త్రిర్నక్తం త్రిర్దివా) మూడు రాత్రింబవళ్ళు దూరమునుండు ద్వీపద్వీపాంతరములకు యాత్ర చేయుచుండును.౫

**త్రిర్ నో అశ్వినా యజతా దివే దివే పరిత్రిధాతు పృథివీ మశాయతమ్.**

**తిస్రో నా సత్యా రథ్యా పరావత ఆత్మేవ వాతః స్వసరాణి గచ్ఛతమ్.౬**

ఋ. ౧-౩౪-౭

భూజలాంతరిక్షములలో మనరాకపోకలు ప్రతి దినము సుఖముగా జరుగునట్లు యానములు నిర్మింపవలెను (పరిత్రిధాతు) అవి ఇనుము, రాగి, వెండి మున్నగు త్రిధాతువులతో చేయబడును. (రథ్యాపరావతః) నగరవీథులలోను, గ్రామములందుగల గొందులలోను సులభముగ రాకపోకలు జరుగును. (నాసత్యా) ఇట్లే యెల్లరును విద్యానిమిత్తము, పూర్వము వర్ణింపబడిన అశ్వి సహాయమున కఠిన మార్గములందును అనాయాసముగ రాకపోకలు జరుగవలెను.

(ఆత్మేవ వాతః) ఆత్మ, మనస్సులవలె యానముల మూలమున ఎల్ల దేశములకు శీఘ్రముగ రాకపోకలు జరుపవలెను. యంత్రప్రేరితములగు అగ్నిజలాదులు ఆ యానములను వేగముగ నడుపును.౬

**అరిత్రం వాం దివస్పృథు తీర్థే సింధూనాం రథః, ధియా యుయుజ్ర ఇందవః౭** ఋ. ౧-౪౬-౮

(అరిత్రం వాం) యానము ఆపుటకమగు పూర్వోక్తసాధనములతో కూడినదిగ చేయబడును. (తీర్థేసింధూనాం రథః) ఆ రథము పెద్ద పెద్ద సముద్రములను దాటుటకును శ్రేష్ఠమగును. (దివస్పృథు) అది అతి విస్తృతమును ఆకాశమునందు, సముద్రము నందు ప్రయాణము చేయ ననువుగను నుండును. (ధియా యుయుజ్రఇందవః) ఆ ముచ్విధములగు యానములందును. బాష్ప వేగము కొఱకొక జలాశయమేర్పఱచి, అందు జలము నింపియుంచవలెను. అందువలన వాయాన మతి వేగముగ నడచునది యగును. ఇందు పదము జలవాచకమని యాస్కనిఘంటువు ఉందేరిచ్చాదేః అను ఉణాది సూత్రముతో ఇందు శబ్దము సిద్ధించును. ఉందీ-క్లేదనే ధాతువు. ౭

**వి యే భ్రాజంతే సుమఖాస ఋష్టిభిః ప్రచ్యావయంతో అచ్యుతా చిదోజసా,**

**మనోజువో యన్మరుతో రథేష్వా వృషవ్రాతాసః పృషతీ రయుగ్ధ్వమ్. ౮**

ఋ ౧-౮౫-౪

(వి యే భ్రాజంతే) ఓ మానవులారా! (మనోజువః) మనోవేగముగల యానములను సిద్ధముచేయుడు. (యన్మరుతో రథేషు) ఆ రథములలో వాయ్వగ్నులను మనోవేగముతో సమానముగ నడపుడు. (అవృషవ్రాతాసః) వాని యోగమున జలమునుగూడ నుంచుడు. (పృషతీరయుగ్ధ్వం) బాష్పము తిరుగునట్టి చక్రములు మున్నగు యంత్రసాధనములను వేగవంతములుగ చేయును. కావున ప్రతి యానమునందును నట్టి యేర్పాటు చేయుడు. ఇట్లు యాన నిర్మాణమొనర్చువారు, (విభ్రాజంతే) వివిధములగు భోగములతో ప్రకాశింతురు. (సుమఖాసః) ఇట్టి శిల్పవిద్యారూప శ్రేష్ఠ యజ్ఞముల నొనర్చువారు సర్వసుఖయుక్తులగుదురు. (అచ్యుతా చిదోజసా) ఎన్నడును దుఃఖితులై నశింపరు. ఎల్లపుడు పరాక్రమముతో వృద్ధినొందుదురు. కారణమేమన: వారు కలాకౌశలయుక్తులై వాయ్వగ్ని ప్రభృతి పదార్థములతో నిర్మిత (ఋష్టిభి.) యంత్రముల ద్వారమున (ప్రచ్యా) పూర్వ స్థానమును విడిచి మనోవేగముగల యంత్రయుక్తయానములతో రాకపోకలను నిర్వర్తింతురు. వానివలనే మానవులలో సుఖము వర్ధిల్లును. కావున మత్తమ యానములను నిర్మింపవలెను.౮

**ఆ నో నావా మతీనాం యాతం పారాయ గంతవే; యుంజాథా మశ్వినా రథమ్. ౯** ఋ. ౧-౪౬-౭

(నో నావా మతీనామ్) బుద్ధిమంతులచే నిర్మితములైన నౌకలు మున్నగు యానములతో (పారాయ గంతవే) సముద్రమును దాటుట సుగమము; కావున వెల్లరు నా యానములతో దాటునట్లు మా నౌకలుకూడ నుత్తమములు, సముద్రమును దాటించుటకు సమర్థములు నగుకాక! (ఆ యుంజాథాను) బుద్ధిమంతులు అగ్ని జల రూపమగుఅశ్వి ని యానములందు ప్రయోగించునట్లు మేముకూడ అశ్వి ని ప్రయోగింతుము కాక! ఓ మానవులారా! రండు, పరస్పరము కలిసి సర్వదేశదేశాంతరములలో రాకపోకలు జరుపనునువగు యానములను రచియింతము.

యాస్కనిఘంటువునందు మేధావి నామములందు మతయః పదము పఠింపబడినది.౯

**కృష్ణం ని యానం హరయః సుపర్ణా అపో వసానా దివముత్పతంతి,**

**త ఆవవృత్రన్ త్సదనా-దృతస్యాదిద్ ఘృతేన పృథివీ వ్యుద్యతే. ౧౦**

ఋ.౧-౪౬-౭

(కృష్ణం) కాష్ఠలోహాది పార్థివ పదార్థములతో నిర్మింపబడి, యారక్షణ యుక్తమగు, (నియానం) విమానమును, (హరయః) వేగాది గుణ యుక్తములగు (సుపర్ణాః) బాగుగ గమనము చేయింపగల పూర్వోక్తములయిన అగ్ని జలాద్యశ్వములు (అపోవసానాః) జలసేచనయుక్త బాష్పమును పొంది యాంత్రికగతితో (దివముత్పతంతి) ప్రకాశయుక్తమగు నాకాశమందు పైకెగసిపోవునట్లు చేయును. (త ఆవవృ) అవి చతుర్దిశలనుండి సదనము- జలము- వలన వేగయుక్తము లయినపుడు (ఋతస్య) యథార్థసుఖము నొసంగునవి అగును. (పృథివీమ్) జలయంత్రములతో భూమి జలయుక్తము చేయబడినపుడు దానివలన నుత్తమోత్తమ భోగములు ప్రాప్తించును. ౧౦

**ద్వాదశ ప్రధయ శ్చక్రమేకం త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత.**

**తస్మిన్ త్సాకం త్రిశతా న శంకవోఽర్పితాః షష్టిర్ న చలాచలాసః. ౧౧**

ఋ.౧-౧౬౪-౪౮

(ద్వాదశప్రధయః) ఆ యానములతో సర్వకలాయుక్తములగు నరలు ధరించుటకు పండ్రెండు ప్రధలుండవలెను. (చక్రమేకం) వానిమధ్య సర్వయంత్రములను త్రిప్పుటకొక చక్రము నిర్మింపవలెను. (త్రీణి నభ్యాని) మధ్యలో మధ్యావయవములను పట్టియుంచుటకు మూడు యంత్రములు నిర్మింపవలెను. (సాకం త్రిశతా) వానితో మూడు వందలు (శంకవోఽర్పితాః) యంత్రపుమరలు చేసి కూర్చవలెను. అవి (చలాచలాసః) యానమును నడుపుటకు, నాపుటకు వీలుగనుండవలెను. (షష్టిః) అఱువది యంత్రపుమరలు కలాయంత్రములు కూడ దానియందేర్పఱచవలెను. ఆ యానమున నివియన్నియు చేయవలెను. (క ఉ తచ్చికేత) ఈ కార్యము నంతటిని నెవరెఱుగుదురు? (న) అందఱు నెఱుగరు. ఈ విద్యలో నిపుణులైనవారే యెఱుగగలరు. ౧౧

వేదములం దీవిషయమునకు సంబంధించిన మంత్రములెన్నో ఉన్నవి. ప్రసంగవశమున కొన్నింటి నిట వ్రాసితిమి. అన్నియు వ్రాయలేదు.

## వేదాలలో నక్షత్ర విద్య

**యువం పేదవే పురువారమశ్వినా స్పృధాం శ్వేతం తరుతారం దువస్యథః,**

**శర్యై రభిద్యుం పృతనాసు దుష్టరం చర్కృత్య మింద్రమివ చర్షణీ సహమ్. ౧**

ఋ. ౧-౧౧౯-౧౦

(యువం పేదవే) ఈ మంత్రమున తంత్రీవార్త (టెలిగ్రాం) కు సంబంధించిన విషయము బోధింపబడినది. భూమినుండి పుట్టిన ధాతువులు, కాష్ఠాది యంత్రములు, విద్యుత్తు వీని ప్రయోగములవలన తంత్రీవార్తలకు చెందిన విద్య సిద్ధమగును. (ద్యావా పృథివ్యావిత్యేకే) నిరుక్త. ౧౨.౧. అను నిరుక్త ప్రమాణమువలన పార్థివ పదార్థములు, విద్యుత్తు రెండునుఅశ్వి అనబడును. (పురువారమ్) ఈ తంత్రీ వార్తలకు చెందిన విద్యను పలువురు విద్వాంసులంగీకరింతురు. ఇందు ఉత్తమ గుణములు నున్నవి. (స్పృధామ్) శత్రువుల పరాజయమునకు, తమ వీరుల రక్షణకు నీ విద్య యుద్ధమునందు రాజపురుషుల కత్యంత హితకారి యగును. (శ్వేతం) ఆ తంత్రీవార్తలను గ్రహించు యంత్రము అతి శుద్ధమైన ధాతువులతో నిర్మింపబడవలెను. (అభిద్యుమ్) దానిని విద్యుత్తుతో జోడింపవలెను. (పృతనాసు దుష్టరమ్) సర్వ సేనలకు మధ్య దాని ప్రకాశము దుఃసహమగును. దాని నుల్లంఘింపవలనుకాదు. (చర్కృత్యమ్) అది సర్వక్రియలను నడుపుటకు పలుమాఱు తగియుండును. (శర్యైః) నానావిధములగు యంత్రములను నడుపుటవలన నుత్తమ వ్యవహారము లనేకములు సిద్ధించుటకు గాను విద్యుత్తు నుత్పన్నముజేసి దాని నుపయోగింపవలెను. (తరుతారమ్) తంత్రీ యంత్రమును నిర్మించి దానినుపయోగించుకొనవలెను. (పేదవే) పరమోత్తమ వ్యవహారముల సిద్ధికొఱకును, (స్పృధాం) దుష్టశత్రువుల పరాజయముకొఱకు, శ్రేష్ఠపురుషుల విజయముకొఱకును తంత్రీవిద్య సిద్ధపరచుకొనవలెను. (చర్షణీ సహమ్) ఈ తంత్రీయంత్రము యుద్ధాది కార్యములందు సైనికుల కత్యంతముపకారకమగును. (ఇంద్రమివ) సమీపమునను దూరమున నుండు పదార్థములను సూర్యుడు ప్రకాశింపచేయునట్లు తంత్రీయంత్రము కూడ సమీపమునను దూరమునందును జరుగు వ్యవహారముల ప్రకటింపగలదు. (యువం దువస్యథః) ఈ యంత్రము పూర్వము వర్ణించిన అశ్విగుణములవలననే సిద్ధించును. ప్రయత్నపూర్వకముగ దీనిని విశిష్టముపయోగించు కొనవలెను. (దువస్యథః) ఈ మంత్రమునందును క్రియాప్రయోగమున ప్రథమ పురుష స్థానమున మధ్యమపురుష ప్రయోగము చేయబడినది.

## వేదాలలో పునర్జన్మ

**అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహ నో ధేహి భోగమ్,**

**జ్యోక్ పశ్యేమ సూర్యముచ్చరంత మనుమతే మృళయా నః స్వస్తి ౧**

ఋ. ౧౦-౫౯-౬

**పునర్ నో అసుం పృథివీ దదాతు పునర్ ద్యౌర్ దేవీ పునరంత రిక్షమ్,**

**పునర్ నః సోమస్తన్వం దదాతు పునః పూషా పథ్యాం యా స్వస్తిః ౨**

ఋ. ౧౦-౫౯-౭

**పునర్మనః పునరాయుర్ మ ఆగన్ పునః ప్రాణః పునరాత్మా మ ఆగన్ పునశ్చక్షుః పునః శ్రోత్రం మ ఆగన్. వైశ్వానరో అదబ్ధస్త నూపా అగ్నిర్ నః పాతు దురితాదవద్యాత్. 3**

య. అ. ౪-౧౫

ఈ మంత్రములలో పూర్వోత్తర జన్మల విషయము వర్ణింపబడినది.

(అసునీతే) ఓ ప్రాణదాయక పరమేశ్వర! మేము మరణించి మరియొక శరీరమును ధరించినపుడు కూడ మమ్ములను సతతము సుఖముగల వారలనుగ జేయుము. (పునరస్మాసు చక్షుః) పునర్ జన్మలో కృపతో మాకుత్తమనేత్రాదీంద్రియముల నొసంగుము. (పునః ప్రాణం) ప్రాణవాయువు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, బలము పరాక్రమము మున్నగు వానితో మా శరీరములు యుక్తములగునట్లు పునర్జన్మయందును ననుగ్రహింపుము. (ఇహ నో ధేహి భోగం) ఓ జగదీశ్వర! ఈ జన్మమునందును పరజన్మమునందును మే ముత్తమ భోగములను పొందుదుముగాక! (జ్యోక్ పశ్యేమ సూర్యముచ్చరంతమ్) ఓ భగవంతుడ! నీ కృపవలన మేము సూర్యలోకమును శ్వాసప్రశ్వాసాత్మకమగు ప్రాణమును విజ్ఞానముతోను, ప్రేమతోను నెల్లపుడు చూతుముగాక! (అనుమతే మృడయానః స్వస్తి) ఓ అనుమతీ! ఎల్లరకు మానము నొసంగుదేవ! సర్వజన్మములందును మాకు (మృడయ) సుఖములను జేర్చుము. అందువలన మాకు శుభము చేకూరుగాక! ఇదియే మా ప్రార్థన. ౧

(పునర్ నో అసుం పృథివీ దదాతు) ఓ సర్వశక్తిమంతుడ! నీ యనుగ్రహమువలన పృథివి మాటిమాటికి మాకు ప్రాణమును, అన్నమువలననేర్పడు బలమును, ప్రకాశాత్మకమగు నా సూర్యుని జ్యోతిస్సు జీవనమును, అంతరిక్షముకూడ పునర్జన్మమునందు జీవనము నెల్లప్పుడిచ్చుగాక! (పునర్ నః సోమస్తన్వం దదాతు) పునర్జన్మలో సోమము- ఓషధిరసము మాకు నుత్తమ శరీరములనొసంగుటకు తోడ్పడునుగాక! (పూషా) పుష్టినొసంగు పరమేశ్వరుడు, పునర్జన్మమున మాకు (పథ్యాం) ధర్మమార్గము ప్రసాదించుగాక! అట్లే సర్వజన్మము లందును మాకు సర్వసుఖములనిచ్చి దుఃఖములను నివారించుటకు యోగ్యమగు స్వస్తి నొసంగుము. ౨

(పునర్మనః పునరాత్మా) ఓ సర్వజ్ఞుడవగు నీశ్వర! మేము జన్మము లెన్నిసారులెత్తినను మాకు శుద్ధమనస్సు, పూర్ణాయుస్సు, ఆరోగ్యము, ప్రాణము, ఆత్మ- శుద్ధమగు నాలోచన, శ్రేష్ఠనేత్రములు, మంచిచెవులు లభించుగాక! (వైశ్వానరో ఽదబ్ధః) విశ్వమునందంతట విరాజిల్లు వాడును, దంభాది దోషరహితుడును, (తనూపాః) మా శరీరములను రక్షించువాడును, (అగ్నిః) సచ్చిదానంద స్వరూపుడునగు పరమేశ్వరుడు (నః పాతు దురితాదవద్యాత్) మమ్ములను దుష్కర్మములనుండియు, సర్వదుఃఖములనుండియు జన్మజన్మాంతరములందు వేరుగనుంచి కాపాడుగాక! అందువలన మేము పాపరహితులమై యెల్ల జన్మములందును సుఖములనుభవించు వారమగుదుము. 3

**పునర్ మైత్వింద్రియం పునరాత్మా ద్రవిణం బ్రాహ్మణం చ,**

**పునరగ్నయో ధిష్ణ్యా యథాస్థామ కల్పయంతా మిహైవ ౪**

అథర్వ. ౭-౬౭-౧

(పునర్ మైత్వింద్రియమ్) ఓ జగదీశ్వర! నీ కృపవలన పునర్జన్మమునందు మనస్సు మున్నగు నేకాదశేంద్రియములు నాకు మరల లభించుగాక! సతతము మనుష్యదేహము ప్రాప్తించునుగాక! అని యభిప్రాయము. (పునరాత్మా) ప్రాణధారణ నొనర్చు సామర్థ్యము నాకు ప్రాప్తమగునుకాక! అందువలన నీ రెండవ జన్మమునందును నూఱుగాని అంతకంటె నెక్కువ వత్సరములు కాని శుభాచరణ మొనర్చుచు జీవింపగలుగుదును. (ద్రవిణం) సత్యవిద్యాది శ్రేష్ఠధనము కూడ పునర్జన్మమున ప్రాప్తించునుగాక! (బ్రాహ్మణం చ) ఎల్లపుడు వేద వ్యాఖ్యాన సహితవిజ్ఞానము, పరమేశ్వరనిష్ఠయు మాకు లభించుగాక! (పునర్గయః) అట్లే జగదుపకారార్థ మగ్నిహోత్రాది శుభకర్మముల నాచరింతుముగాక! (ధిష్ణ్యా యథా స్థామ) ఓ జగదీశ్వర! మేము పూర్వజన్మమున నెట్లు శుభగుణములు గల బుద్ధియు, నుత్తమ శరీరేంద్రియాదులుగలవారముగ నుంటిమో యట్లే యీ లోక పునర్జన్మము నందును బుద్ధితో మనుష్యదేహమును జెందిన కృత్యముల నొనర్చుటలో సమర్థుల మగుదుముగాక! ఇవి యన్నియు శుద్ధబుద్ధితో బాటు (మైతు) నాకు ప్రాప్తమగుకాక! (ఇహైవ) వానితో మేమీలోకమున మనుష్య జన్మను బొంది ధర్మార్థ కామమోక్షములను సాధింతుము గాక! ఈ సాధనగాక, ఆ భక్తివలన మాకే జన్మమునందును దుఃఖము కలుగకుండుగాక! ౪

**ఆ యో ధర్మాణి ప్రథమః ససాద తతో వపూంషి కృణుషే పురూణి,**

**ధాస్యుర్ యోనిం ప్రథమ ఆవివేశా యో వాచమనుదితాం చికేత ౫**

అథర్వ కా-౫ అ-౧ సూ-౧ మం-౨

(ఆయో ధర్మాణి) పూర్వజన్మమున ధర్మాచరణ మొనర్చిన మనుజుడు (తతో వపూంషి కృణు పురూణి) ధర్మాచరణకు ఫలముగా ననేకోత్తమ శరీరములను ధరించును. అధర్మాచరణుడైన మనుష్యుడు నీచములగు పశ్వాది శరీరములను బొందును; దుఃఖము ననుభవించును. ఈ మంత్రమున పర్వభాగమువం దీవిషయమునే యీశ్వరుడు తెలిపెను. (ధాస్యుర్ యోనిం) పూర్వజన్మమున నొనర్చిన పాపపుణ్యముల ఫలము ననుభవించుచు జీవుడు పూర్వశరీరమును విడిచి, వాయువుతో నుండును. తదుపరి జలము, ఓషధి, ప్రాణము మున్నగువానియందు ప్రవేశించి వీర్యమున జేరును. తరువాత యోని-గర్భాశయమున స్థిరుడై మరల జన్మించును. (యో వాచ మనుదితాం) ఆవికేత వేదమునందీశ్వరుడాజ్ఞాపించినట్లు, ఎవడు సత్యభాషణాదులను సరిగా నొనర్చువాడై ధర్మమునందే (పసాద) దృఢముగానుండునో, అతడు పూర్వము వలెనే మనుష్యయోనియందుత్తమ శరీరమును ధరించి యనేక సుఖముల ననుభవించును. దానికి విపరీతముగ నధర్మము నాచరించువాడు నీచ శరీరముల ననేకములను కీటపతంగాదులకు జెందిన వానిని, పశ్వాది శరీరములను బొంది యనేక దుఃఖముల ననుభవించును.

**ద్వే సృతీ అశృణవం పితౄణామహం దేవానా ముత మర్త్యానామ్,**

**తా భ్యామిదం విశ్వమేజత్ సమేతి, యదంతరా పితరం మాతరం చ ౬**

యజు. ౧౯-౪౭

(ద్వే సృతీ) పాపపుణ్య ఫలముల ననుభవించుటకీ ప్రపంచమున రెండుమార్గములున్నవి.

౧. (క) పితృ- జ్ఞానుల మార్గము (నిష్కామబుద్ధితో కేవలము కర్తవ్యమనియెంచి కర్మముల నాచరించు పురుషుల మార్గము) (ఖ) దేవ- విద్వాంసుల మార్గము (బ్రహ్మజ్ఞాన మార్గము)

౨. (మర్త్యానాం) పైన జెప్పిన రెండురకముల మనుష్యులకంటె భిన్నులై విద్యా విజ్ఞానములు లేని మానవుల మార్గము (సకామ కర్మముల నొనర్చు సామాన్యమానవుల మార్గము.) పై రెండు మార్గములలో మొదటిది దేవయానము-రెండవది పితృయానము. మాతాపితల వలన శరీరమును బొంది నాటినాటికి పాపపుణ్యఫలములయిన దుఃఖసుఖములననుభవించు మార్గము పితృయాన మనబడును. ఒకదాని తదుపరి మరియొకటిచొప్పున పూర్వాపరజన్మము లనేకములు జీవునకు గలుగును. జన్మమరణరూప సంసారమునుండి విడివడి మోక్షపదమును పొందుమార్గము దేవయానమనబడును. పితృయానమునందు జీవుడు సంచితపుణ్యపాప ఫలముల ననుభవించుచు నిరంతరము జన్మమరణ రూపబంధనమున పడియుండును. దేవయానమునందు జీవునకు జన్మమరణ రూప నిరంతర బంధనము విడిపోవును. (పరాంతకాల పరిమాణ సమయమున నా జీవుడు పరమానందము ననుభవించును.) ఇట్లు రెండు విధములగు మార్గములను నేను (అశృణవమ్) వినియున్నాను. (తాభ్యామిదం విశ్వం) పూర్వోక్తములగు రెండుమార్గములతో నీ సంపూర్ణ విశ్వము (ఏజత్ సమేతి) నియమిత రూపమున చలించుచున్నవి (యదంతరా పితరం మాతరం చ) జీవుడు పూర్వశరీరమును విడిచి, వాయుజలౌషధ్యాదుల ద్వారమున పితృశరీరమునగాని మాతృశరీరమునగాని ప్రవేశించి పునర్ జన్మమును బొందును. అప్పుడు జీవుడు శరీరధారణము చేయునని యెఱుంగనగును. ౬

**మృతశ్చాహం పునర్జాతో జాతశ్చాహం పునర్ మృతః**

**నానాయోని సహస్రాణి మయోషితాని యాని వై . ౧**

**ఆహారా వివిధా భుక్తాః పీతా నానావిధాః స్తనాః**

**మాతరో వివిధా దృష్టాః పితరః సుహృదస్తథా ౨**

**అవాఙ్ముఖః పీడ్యమానో జంతుశ్చైవ సమన్వితః ౩**

నిరు. అ. ౧౪ ఖం-౬

వేదములందు పూర్వాపరజన్మములు జీవులకు గలవని వర్ణించినట్లు నిరుక్తకారుడును పునర్జన్మమును ప్రతిపాదించి యున్నాడు. జ్ఞాని యైన మనుజుడు (మృతశ్చాహం) నేను పలుమారులు జన్మమరణము లనుబొంది, నానావిధములగు యోనులందు నివసించియుంటిని అని యెఱుగును. ౧

(ఆహారా) ఆ యోనులందు బహువిధములగు నాహారములను భుజించితిని. పలువురు తల్లుల స్తన్యమును ద్రావితిని. తల్లులను, తండ్రులను, సుహృత్తులను, ననేకులనుజూచితిని. ౨

(అవాఙ్ముఖః) నేను గర్భమున తలక్రిందుగా నుండి నానా విధ బాధలతో గూడిన జన్మల ననేకముల ధరించితిని. కాని, యిప్పుడిక పరమేశ్వరునందు పూర్ణభక్తి కలిగి

వానియాజ్ఞలను పాలించినప్పుడే యీ మహాదుఃఖములనుండి ముక్తడనగుదును. లేకున్న నీ జన్మ-మరణ రూప దుఃఖసాగరమునుండి యెన్నడును ముక్తుడగాజాలను. ౩

స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః

పాతం. పా-౨ సూ-౯

(స్వరస) యోగదర్శనమును రచియించిన పతంజలిమునియు, దానికి భాష్యకర్తయైన వేదవ్యాసుడు పునర్జన్మమున్నదని ప్రతిపాదించిరి. ప్రాణులకన్నింటికి జన్మించినప్పటినుండియు మరణ భయముండును. ఆ మరణభీతి జీవునకు పూర్వాపరజన్మములున్నవని సిద్ధము చేయుచున్నది. కారణమేమి? యనః

ఇప్పుడిప్పుడే పుట్టిన కీటకమునకు, బాగుగ జదివిన విద్వాంసునకు నెల్లరకు మరణ భయమెన్నటో కలిగియుండును. ఆ యనుభవము నిప్పుడు స్మరించి ప్రతిప్రాణియు మృత్యువునకు భయపడుట జూచుచున్నాము. కావున జీవుడనేక శరీరములను ధరించుననకతప్పదు. పూర్వజన్మమున మృత్యుభయము ననుభవింపకున్నచో దానికి సంబంధించిన సంస్కారము ప్రాణియంతఃకరణమున నేర్పడదు. సంస్కారము లేనివాడు స్మరణము కలుగదు. అప్పుడు భయము కలుగుటకు వీలేమియు నుండదు.

పూ.ప: దీనివలన పూర్వజన్మమెట్లు సిద్ధించినది?

ఉ.ప: ప్రతిప్రాణియు మృత్యువునకు భయపడుచున్నది. కావున నట్టి భయము పూర్వజన్మమం దనుభవింపకున్న నిప్పుడు కలుగవీలు లేదు. అందువలన జీవునకు పూర్వాపరజన్మములున్న వనకతప్పదు.

పునరుత్పత్తిః ప్రేత్యభావః      న్యా. ౧-౧-౧౯

(పునరు) ఇట్లే న్యాయదర్శనమునందును మహావిద్వాంసుడగు గోతమమహర్షియు, న్యాయసూత్రములకు భాష్యము వ్రాసిన వాత్స్యాయనమునియు, నిరువురును పునర్జన్మము నంగీకరించియున్నారు పూర్వశరీరము విడిచి మరియొక శరీరము ధరించుటకే ప్రేత్యభావమని పేరు (ప్రేత్య= మృత్యువును పొంది- చచ్చి), భావ- మరల శరీరమును ధరించుట ఈ వుడు శరీరముగలవాడగును. ౧

ఏకజన్మవాదులిట్లు ప్రశ్నింతురు.

పూ. ప: పూర్వజన్మమున్నదందురేని యీ జన్మమున దాని స్మరణమేల కలుగదు?

ఉ.ప: ఈ జన్మమునందే బాల్యావస్థలో నైదేండ్ల ప్రాయమున బొందిన సుఖదుఃఖములనే స్మరియింపజాలము. ఇంతేకాదు, నిత్యము మనుజులు తాము చదివే చదువులలోను, ఇతర వ్యవహారములందును ననేక విషయముల నప్పటికప్పుడే స్మరియింపజాలరు; మఱచిపోవుదురు. అట్టియెడ పూర్వజన్మవార్తలెట్లు గుర్తుండును. జాగ్రదవస్థలో నొనరించిన వ్యవహారములు నిద్రావస్థలో విస్మరింతుము. కావున పూర్వజన్మవృత్తమెట్లు ఈ జన్మమున స్మరింపగలము?

పూ. ప: పూర్వజన్మమునజేసిన పాపపుణ్యముల జ్ఞానము మనకిప్పుడుండదు. ఈశ్వరుడాపాపపుణ్యములకు ఫలముగా సుఖదుఃఖములను గలిగించును. అట్టియెడల నీశ్వరుడు న్యాయకారి యనుటగాని, జీవులు తమ తప్పులు దిద్దుకొని సంస్కరింపబడుదురనుటగాని యెట్లు చెల్లును?

ఉ.ప: జ్ఞానము రెండువిధముల గలుగును. ఒకటి ప్రత్యక్షము రెండవది యానుమానికము. ఇద్దఱుమనుష్యులున్నారనుకొనుడు. ఒకడు వైద్యుడు, రెండవవాడు వైద్యము తెలియనివాడును. వారిరువురికి జ్వరము వచ్చిన దనుకొనుడు. అప్పుడు వైద్యుడు కార్యకారణ జ్ఞానము గలవాడగుటచే జ్వరము వచ్చుటకుగల కారణము ననుమానము ఊహతో దెలిసికొనును. రెండవవాడట్లు తన జ్వరమునకు నిదానకారణమేమో గుర్తింపజాలడు. జ్వరము మాత్ర మిరువురకును ప్రత్యక్షమే. దానికి పూర్వము వారు చేసి కుపథ్యము వైద్యునకుతెలియును. అవైద్యునకు దెలియదు. కారణములేక కార్యము కలుగదు కావున కుపథ్యమువలన జ్వరము వచ్చినదని యూహించి, వైద్యుడు సరిగా తెలిసికొనగలడు. అవైద్యునకీ విషయము సరిగా తెలియకున్నను జ్వరము వచ్చుటకేదో కారణమున్నట్లు తెలిసికొనును. ఈశ్వరుడు న్యాయకారి, కావున నతడు నిష్కారణముగ నెవనికిని సుఖముకాని, దుఃఖముకాని కలిగింపడు. పుణ్యపాపములకు ఫలము- కార్యము- సుఖదుఃఖములను మనకు తెలిసినమీదట, సుఖదుఃఖములు ప్రత్యక్షముగా తెలియుచున్నందున వానికి కారణముల నూహించి - అనుమానించి తెలిసికొనవచ్చును. ఇట్లే పూర్వజన్మమున జేసిన పాపపుణ్యములు కారణములుగ జీవులకు నుత్తమ మధ్యమాధమ శరీరములు లభించిన వని నిశ్చయమగుచున్నది. అందువలన నీశ్వరుడు న్యాకారి యనియు జీవులు తమకు గలుగు సుఖదుఃఖముల మూలమున పూర్వపు కర్మముల నూహించి తెలిసికొని, మానవజన్మమున తమ్ముదాము సంస్కరించుకొనగల యవకాశ మున్నదనియు స్పష్టమగుచునే యున్నది. ఇట్లే యేకజన్మవాదులడుగు ప్రశ్నములకు సమాధానము లూహింపనగును. బుద్ధిమంతుల కంతయు వ్రాయ నావశ్యక ముండదు.

కొలదిగ నిర్దేశించిన చాలును. మిగిలినది యూహింపగలరు. గ్రంథ విస్తరభీతిచే నిట నీ విషయము నెక్కుడుగ వ్రాయదలపమైతిమి.

## వేదాలలో వివాహ విషయము

గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్ యథాసః ,

భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్ గార్హ పత్యాయ దేవాః ౧

ఋ. ౧౦-౮౫-౩౬

ఇహైవస్తం మా వియౌష్టం విశ్వమాయుర్ వ్యశ్నుతమ్,

క్రీడంతౌ పుత్రైర్ నప్తృభిర్ మోదమానౌ స్వే గృహే ౨ ఋ. ౧౦-౮౫-౪౨

ఈ మంత్రములలో వివాహము విధింపబడియున్నది. (గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం) ఓ కుమారీ! యువతీ! కన్యా! నేను సౌభాగ్యము-గృహాశ్రమమున సంతానోత్పత్తి మున్నగు ప్రయోజనములు చేకూరుటకు నీ హస్తమును గ్రహించుచున్నాను- నేను నిన్ను వివాహమాడుచున్నాను. నీవును నన్ను నట్లే గ్రహించుచున్నావు. ఓ స్త్రీ! (యథా మయా పత్యా జరదష్టిః అసః) ఎట్లు పతినైన నాతో నీవు వృద్ధావస్థను బొందుదువో, నేను నట్లే నీతో వృద్ధుడనగుదును. మనమిరువురము సదాచారవంతులమై, పెద్దల నొనర్చక, వృద్ధుల మగువ ఆకు నానందదాయకముగ వ్యవహరించుదుము. మన యీ ప్రతిజ్ఞల నెల్లరు సత్యమని యెఱుంగవలెను. దీనికి వ్యతిరేకముగ నెన్నడు వర్తింపము. (భగః) ఐశ్వర్యవంతుడు (అర్యమా) న్యాయకారి-సర్వజీవులకు పాపపుణ్యముల ఫలములను తూచి యిచ్చువాడును, (సవితా) సర్వజగత్తును పుట్టించి సమస్తైశ్వర్యముల నొసంగువాడును, (పురంధిః) సర్వప్రపంచమును ధరించువాడునగు పరమేశ్వరుడు మన యిరువురకు సాక్షి. (మహ్యం త్వా) పరమేశ్వరుడును, విద్వాంసులును నాకు నిన్నును, నీకు నన్నును ఇచ్చినారు. మనము పరస్పర ప్రీతితో గృహ కార్యములను నిర్వర్తించుదుము. అసత్యభాషణాదులను విడిచి, సతతము ధర్మమునందే వర్తించుదము. జగత్తున కుపకారమొనరించుటకు సత్య విద్యలను ప్రచారము చేయుదము. ధర్మపూర్వకముగ సంతానముం బడసి సుశిక్షితము చేయుదము. ఇట్టి ప్రతిజ్ఞల నీశ్వరుని సాక్షిగ నెంచి చేయుచున్నాము. ఈ నియమములను చక్కగ పాలించుదము. మన మొండొరులను విడిచి యన్యులనెన్నడు మనస్సునను వాంఛింపకుందుముగాక! (దేవాః) ఓ విద్వాంసులారా! మీరుకూడ మాకు సాక్షులుగ నుండుడు. మేమిరువురము గృహాశ్రమ ధర్మముల నిర్వర్తింప వివాహ మాడుచున్నాము. వివాహసమయమున స్త్రీపురుషులిరువురు నేనీ స్త్రీని విడిచి యన్య స్త్రీని మనోవాక్కాయములతో నెన్నడు గోరను, నేనీ పురుషుని విడిచి యన్యపురుషుని మనోవాక్కాయములతో నెన్నడు కోరను అని ప్రతిజ్ఞలు చేయవలెను. ఈ ప్రతిజ్ఞలకు విరుద్ధముగా నడచుకొనినపుడు వారు పరమేశ్వరుని దండనకు, విద్వాంసుల దండనకు పాత్రులగుదురు.౧

(ఇహైవస్తం) మీరిరువురు వివాహితులై గృహాశ్రమమున శుభవ్యవహారము లొనర్పుడు. ( మా వియౌష్టం) విరోధించి వేరుగాకుందురుగాక! వ్యభిచారాదులకు పూనుకొనకుడు. ధర్మకార్యము లొనర్చుచు, పరమేశ్వరునియందు భక్తి గలిగి యుండుడు. (విశ్వమాయుర్ వ్యశ్నుతమ్) సంపూర్ణమగు నాయువును సుఖముగ ననుభవింపుడు. (క్రీడంతౌ) మీ మీ గృహములందు పుత్రపౌత్రులతో ధర్మకార్యము లొనర్చుచు నానందము ననుభవింపుడు. దీనికి విపరీతముగ నెన్నడు వర్తింపకుడు. అని యీ మంత్రమున పరమేశ్వరుడు వివాహిత దంపతులనుగూర్చి యాశీర్వదించుచున్నాడు; ఉపదేశించుచున్నాడు.౨

ఈ మంత్రార్థమునుబట్టి యొక స్త్రీకి ఒక్కడే పతికావలెననియు, ఒక పురుషున కొక స్త్రీయే పత్ని కావలెననియు, స్పష్టమగుచున్నది. ఒక పురుషుడనేక స్త్రీలనుగాని, ఒక స్త్రీ యనేక పురుషులనుగాని వివాహము చేసికొనుట వేదవిరుద్ధము కావున తగదు. వివాహ ప్రతి పాదక మంత్రములలో నెల్లయెడల నేక వచన ప్రయోగమే కనబడుచున్నది. వివాహవిషయమునకు చెందిన మంత్రములిట్టివి పెక్కుగలవు.

## వేదాలలో రాజప్రజాధర్మము

త్రీణి రాజానా విదథే పురూణి పరి విశ్వాని భూషథః సదాంసి,

అపశ్యమత్ర మనసా జగన్వాన్ వ్రతే గంధర్వాఁ అపి వాయుకేశాన్ ౧

ఋ. ౩-౩౮-౬

క్షత్రస్య యోనిరసి క్షత్రస్య నాభిరసి,

మా త్వా హింసీన్మా మా హింసీః ౨ యజు. ౨౦-౧

యత్ర బ్రహ్మ చ క్షత్రం చ సమ్యంచౌ చరతః సహ

తం లోకం పుణ్యం ప్ర జ్ఞేషం యత్ర దేవాః సహాగ్నినా ౩ యజు. ౨౦. ౨౫

ఈ మంత్రములలో రాజధర్మము విధింపబడినది. సూర్యచంద్రులు సర్వమూర్త ద్రవ్యములను ప్రకాశింపజేయునట్లు, సూర్యచంద్రు లవంటి గుణస్వభావములుగలిగినట్టియు ప్రకాశము, న్యాయముగలిగినట్టియు ద్వివిధ వ్యవహారములు మూడు సభలను (భూషథః) సుశోభితము చేయును. (విధతే) ఆ సభలతోన యుద్ధమునందు, (పురూణి) విజయము నున్నగు బహుసుఖములను మనుష్యులు బొందుదురు. ఇట్లే వారు (విశ్వాని) రాజధర్మారులతో గూడిన సభలతో నెల్లయెండల నెల్లపదార్థములను బొంది, ప్రాణి సమూహమునకు సుఖము చేకూర్చుదురు. ముప్విధములగు సభలు:౧. రాజార్యసభ. ఇందు విశేషించి రాజకార్యములే జరుగును.౨. ఆర్య విద్యాసభ. ఇందు ముఖ్యముగ విద్యాప్రచారము, దానియున్నతికి సంబంధించిన కార్యములుండును. ౩. ఆర్యధర్మసభ. ఇందు మిక్కిలిగ నుపదేశము మూలమున ధర్మమునకున్నతి, అధర్మమునకు నాశము కలుగునట్లు వ్యవహరింపబడును. కాని, యీ మూడు సభలును సామాన్య కార్యములలో కలిసియే ప్రజలలో సర్వోత్తమ వ్యవహారములను ప్రచారమొనర్పవలెను.

ఏ దేశమునందలి యీ సభలలో, ధర్మాత్ములైన విద్వాంసులు సారాసారములను విచారించి కర్తవ్య ప్రచారమును, అకర్తవ్య నిరోధమును చేయుదురో; ఆ దేశమునందలి ప్రజలు సతతము సుఖములను పొందుదురు. (అపశ్యమత్ర) సభలమూలమున రాజ ప్రబంధము జరుగు చోట ప్రజలకు హితము కలుగునని నే నెఱుగుదును అని యీశ్వరోక్తి, (వ్రతే) ఏ మానవుడు సత్యాచరణమున (మనసా) విజ్ఞానముతో సత్య న్యాయమును (జగన్వాన్) ఎఱిగియున్నాడో యతడే రాజ్యసభకు యోగ్యుడగును. ఇతరుడుకాడు. (గంధర్వాన్) పూర్వోక్తసభలలో పృథివీ రాజపాలనాది వ్యవహారములలో దక్షులును, (అపి వాయుకేశాన్) వాయువువలె దూతల మూలమున సర్వవ్యవహారముల నెఱిగినవారును నగు వ్యక్తులను సభాసదులుగ జేయవలెను. సూర్యకిరణములవలె సత్యమును, న్యాయమును ప్రకటించువారిని, నెల్లరికి హితము నపేక్షించు ధర్మాత్ములను సభాసదులుగ చేయవలయును. కాని ఇతరులను చేయ రాదని యీశ్వరాజ్ఞ. దీని నెల్లరు పాలింపవలెను. (క్షత్రస్య యోనిరసి) రాజ్యప్రదాతవగు నో పరమేశ్వర! రాజ్య సుఖమునకు, రాజవ్యవహారమునకు నీవే పరమకారణము. (క్షత్రస్య నాభిరసి) నీవే రాజధర్మమునకు ప్రబంధకర్తవు; జీవనహేతువు; మమ్ములనట్లే చేయుము. (మాం త్వాం హింసీన్మా మా హింసీః) ఓ జగదీశ్వరా! ప్రజలెల్లరు నిన్ను విడిచి యితరుని తమకు రాజుగా నెన్నడు నంగీకరింపకుందురుగాక! నిన్ను తిరస్కరించి నాస్తికులు కాకుందురుగాక! నీవును మేమును పరస్పరానుకూలముగ వర్తింతుముగాక! నీ సృష్టియందు మేము రాజ్యాధికారుల మగుదుముగాక!

(యత్ర బ్రహ్మ చ క్షత్రం చ) ఏ దేశమున పరమేశ్వరుని వేదముల నుపాసించును నుత్తమ విద్వాంసులగు బ్రాహ్మణులు, శూర వీరులునగు క్షత్రియులు కలిసి రాజకార్యములను నెఱవేర్తురో యా దేశమే ధర్మముతోను, శుభకర్మములతోను గూడి సుఖమును బొందును.

(యత్ర దేవాః సహాగ్నినా) ఏ దేశమున నీశ్వరాజ్ఞా పాలనము, అగ్నిహోత్రాది సత్క్రియలు చేయు విద్వాంసులుందురో యాదేశము ఉపద్రవములు లేక యఖండరాజ్యమును నిత్యము ననుభవించును. ౩

దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్ బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్.

అశ్వినోర్ భైషజ్యేన తేజసే బ్రహ్మవర్చసాయాభిషించామి.

ఇంద్రస్యేంద్రియేణ బలాయ శ్రియై యశసేఽభిషించామి ॥యజు. ౨౦-౪

(దేవస్య త్వా సవితుః) సభాధ్యక్షుడు కాదగిన వ్యక్తి నభిషేకించి, యతనితో నిట్లనవలెను. ఓ సభాధ్యక్ష! నీవు స్వయం ప్రకాశవంతుడు, సర్వజగత్తు నుత్పన్నము చేయువాడువగు పరమేశ్వరుని, (ప్రసవే) సృష్టిలో ప్రజాపాలన కొఱకు, (అశ్వినోర్ బాహుభ్యాం) సూర్యచంద్రుల బలవీర్యములతో (పూష్ణో హస్తాభ్యామ్) పుష్టినిచ్చు ప్రాణమును గ్రహించుటకును, దానము చేయుటకును సమర్థములగు హస్తములతో నిన్ను సభాధ్యక్షునిగ స్వీకరించుచున్నాము.

పరమేశ్వరుని ఉక్తి: పృథివి యందున్నట్టియు, అంతరిక్షమున నున్నట్టియు శుద్ధవాయ్వాద్యోషధులతో రాత్రింబవళ్లు సర్వరోగముల నుండియు నిన్ను ముక్తుని చేసి, (తేజసే) సత్యన్యాయ ప్రకాశార్థము, (బ్రహ్మవర్చసాయ) బ్రహ్మజ్ఞానముకొఱకు విద్యాభివృద్ధికొఱకు (సరస్వత్యై) బాగుగ శిక్షితమగు వాణికొఱకు (వీర్యాయ) పరాక్రమము కొఱకు, (అన్నాద్యాయ) తినదగిన అన్నాదులప్రాప్తికొఱకును (అభిషించామి) అభిషేకము చేయుచున్నాను. మఱియు (ఇంద్రస్యేంద్రియేణ) పరమేశ్వరుని పరమైశ్వర్య విజ్ఞానముతోను, ఆజ్ఞా విజ్ఞానముతోను, (బలాయ) ఉత్తమ సేనకొఱకు, (శ్రియై) సర్వోత్తమ లక్ష్మీకొఱకు, (యశసే) సర్వోత్తమకీర్తి ప్రాప్తికొఱకును, నేను (ఈశ్వరుడు) సభను నిర్మించుటకు మిమ్ముల నాజ్ఞాపించుచున్నాను. ఈ యాజ్ఞ రాజుయొక్కయు, ప్రజలయొక్కయు వ్యవస్థకు సంబంధించినది. మానవులెల్లరు నీ విషయమును బాగుగ ప్రచారమొనర్పవలెను. ౪

కోఽసి కతమోఽసి కస్మై త్వా కాయ త్వా,

సుశ్లోక సుమంగల సత్యరాజన్ ॥ యజు. ౨౦-౪

ఓ మహారాజేశ్వర! నీవు (కోఽసి కతమోఽసి) సుఖ స్వరూపుడవు, అత్యంతానందకారకుడవు. సురాజ్యము ద్వారమున మమ్ములను కూడ సర్వానంద యుక్తుల నొనర్చుము. (సుశ్లోక!) ఓ సత్య యశస్వీ! సర్వోత్తమకీర్తిప్రదాతా! (సుమంగల) శోభనమంగలరూపా! ఆనందదాతవగు నో జగదీశ్వర! (సత్యరాజన్) సత్యస్వరూపా! సత్య ప్రకాశకా! మాకు రాజావు నీవే, సర్వసుఖముల నొసంగువాడవు నీవే. (కస్మై త్వా కాయ త్వా) మిక్కిలి సుఖముకొఱకు, శ్రేష్ఠమగు నానందముకొఱకు, మేము నీ శరణు జొచ్చితిమి. మాకు పూర్ణరాజ్యము, సుఖము నిస్సందేహముగ నీ వలననే లభింపగలదు. ౫

**శిరో మే శ్రీర్ యశో ముఖం త్విషిః కేశాశ్చ శ్మశ్రూణి,**

**రాజా మే ప్రాణో అమృతꣳ సమ్రాట్ చక్షుర్ విరాట్ శ్రోత్రమ్ ౬**

యజు. ౨౦-౫

సభాధ్యక్షుడు, సభాసదులు, ప్రజలు ఈ క్రిందివి నిశ్చయము చేసికొనవలెను. (శిరో మే శ్రీః) రాజ్యలక్ష్మి నాకు శిరస్సువంటిది. (యశో ముఖం) ఉత్తమకీర్తి ముఖమువంటిది. (త్విషిః కేశాః శ్మశ్రూణి) సత్యగుణములయు, న్యాయముయొక్కయు దీప్తి నాకు కేశములు, గడ్డములు మీసములు నను వీనికి సమానము. (రాజా మే ప్రాణః) అట్లే సర్వాధారుడగు నీశ్వరుడు, జీవన హేతువగు శరీరమున నుండు వాయువు నాకు ప్రాణ ప్రియుడగు రాజావంటివి. (అమృతం సమ్రాట్) అమృతరూపమగు బ్రహ్మము, మోక్షసుఖము, వేదము, అన్నియు చక్రవర్తిరాజ వంటివి. (చక్షుర్ విరాట్ శ్రోత్రమ్) బహు సత్య విద్యల ప్రకాశముతో గూడిన నా శ్రోత్రమే నాకు కన్ను. ఇవి యన్నియు సభాసదులకు, సభాధ్యక్షులకు నంగములని యెల్ల రెఱుగవలెను. ౬

**బాహూ మే బలమింద్రియꣳ హస్తౌ మే కర్మవీర్యమ్,**

**ఆత్మా క్షత్ర ముదో మమ ౭** యజు. ౨౦-౭

**పృష్టీర్ మే రాష్ట్రముదర మꣳసౌ గ్రీవాశ్చ శ్రోణీ.**

**ఊరూ అరత్నీ జానునీ విశో మేఽంగాని సర్వతః ౮** యజు. ౨౦-౮

(బాహూ మే బలం) పూర్ణబలము నాకు భుజములు, (ఇంద్రియꣳ హస్తౌ మే) శుద్ధ విద్యతో గూడిన యింద్రియములు, మనస్సు ఇవియన్నియు గ్రహణ సాధనములైన హస్తములవంటివి. (కర్మ వీర్యం) ఉత్తమపరాక్రమధారణమే నాకు కర్మము (ఆత్మా క్షత్ర ముదో మమ) నాహృదయము, ఆత్మయు క్షత్రములు గాయము నుండి రక్షించునవి.

(పృష్టీర్ మే రాష్ట్రం) ఉత్తమరాజ్యము నాకు వెన్ను వంటిది. (ఉదరమꣳసౌ) రాజ్యసేన, కోశము బాహుమూలము, ఉదరముల వంటివి. (గ్రీవాశ్చ శ్రోణీ) ప్రజలను సుఖయుక్తులను, పురుషార్థ పరులనుగ జేయుట కంఠము, పిరుదులకు సమానము. (ఊరూ అరత్నీ) ప్రజలను వ్యాపారమునందును, విద్యలలోను నిపుణులంజేయుట ఆయొ (బాహుమధ్యమము) ఊరువులకును సమానము. (జానునీ) ప్రజకు, రాజసభతో మైత్రికలిగి యుండునట్లు చేయుట మోకాళ్లవంటిది (విశో మేఽంగాని సర్వతః) ఇట్లు ప్రజాపాలనమున ముత్తమకర్మముల నొనర్చు వారందఱు నా యంగములకు సమానులు. మనుష్యునకు తన యంగములను కాపాడుటలో ప్రీతియు, శ్రద్ధయుమండునట్లు ప్రజాపాలనమునను ధ్యానముంచవలెను. ౮

**ప్రతిక్షత్రే ప్రతి తిష్ఠామి రాష్ట్రే ప్రత్యశ్వేషు ప్రతి తిష్ఠామి గోషు, ప్రత్యంగేషు ప్రతి తిష్ఠామ్యాత్మన్ ప్రతిప్రాణేషు ప్రతి తిష్ఠామి పుష్టే ప్రతి ద్యావాపృథివ్యోః ప్రతి తిష్ఠామి యజ్ఞే ౧౦** యజు. ౨౦-౧౦

(ప్రతిక్షత్రే ప్రతి తిష్ఠామి రాష్ట్రే) ఉత్తమపురుషులచే నేర్పడిన సభతో రాజ్యమును న్యాయపూర్వకముగ పాలించు మానవులనుద్దేశించి పరమేశ్వరుడనుచున్నాడు. ఓ మానవులారా! ధర్మాత్ములై మీరు న్యాయముతో రాజ్యమొనర్పుడు. ధర్మాత్ములయిన పురుషుల క్షాత్రధర్మమునందును, రాజ్యమునందు నేను (ఈశ్వరుడు) ప్రకాశితుడనగుదును. వారు నాకెల్లపుడు సమీపమున నుందురు. (ప్రత్యశ్వేషు ప్రతి తిష్ఠామి గోషు) వారిసేనలోనియశ్వములు, గోవులు మున్నగు పశువులలో నేను స్వసత్తతో ప్రతిష్ఠితుడనగుదును. (ప్రత్యంగేషు ప్రతి తిష్ఠామ్యాత్మన్) సమస్త సేనలోను, రాజాంగములందును, వారి యాత్మలందును నెల్లపుడు ప్రతిష్ఠితుడనై యుందును. (ప్రతిప్రాణేషు ప్రతి తిష్ఠామి పుష్టే) వారి ప్రాణములందును. పుష్ట పదార్థములందును వ్యాపకుడనై యుందును. (ప్రతి ద్యావాపృథివ్యోః ప్రతి తిష్ఠామి యజ్ఞే) సూర్యాదులు ప్రకాశించు తావులందును అప్రకాశిత భూములందును, అశ్వమేధాది యజ్ఞములందును. వ్యాపకుడనగుటచే సమస్త జగత్తునందును ప్రతిష్ఠితుడనై యుందును. ఇష్టదేవుడనగు నన్నాశ్రయించి రాజధర్మమును పాలించువారికి సతత విజయాభ్యుదయములు - శుభము ప్రాప్తించును. రాజపురుషులు విద్యే న్యాయమును, విజ్ఞానమును ప్రకటింపవలెను. అందువలన నన్యాయము, నవిద్యయు నశించును. ౧౦

త్రాతారమింద్ర మవితారమింద్రꣳ హవే హవే సుహవꣳ శూర మింద్రమ్,

హ్వయామి శక్రం పురుహూత మింద్రꣳ స్వస్తి నో మఘవా ధాత్వింద్రః॥౧॥

యజు. ౨౦-౫౦

(త్రాతారమింద్ర) సంపూర్ణ విశ్వరక్షకుడు, సర్వశక్తి మంతుడు, (సుహవం శూరమింద్రం) శోభన యుద్ధకర్త, అత్యంతశూరుడు, జగత్తునకు రాజు, అనంతబలయుక్తుడు, (శక్రం) శక్తియుక్తుడు, శక్తి ప్రదుడు, (పురుహూతం) బహుశూరులచే సుసేవితుడు, (ఇంద్రం)న్యాయముతో రాజ్యమును పాలించువాడును, (ఇంద్రం హవే హవే) పరమేశ్వరుని నేను ప్రతి యుద్ధమునందును విజయము కొఱకు (హ్వయామి) ఆహ్వానింతును- ఆశ్రయింతును. (స్వస్తి మఘవా ధాత్వింద్రః) పరమైశ్వర్య దాతయు, సర్వశక్తిమంతుడునగు నీశ్వరుడు సర్వరాజ్యకార్యములందును మాకు (స్వస్తిదాతు) నిరంతర విజయసుఖము నిచ్చుగాక! ॥౧॥

ఇమం దేవా అసపత్నꣳ సువధ్వం మహతే క్షత్రాయ మహతే జ్యైష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేంద్రస్యేంద్రియాయ, ఇమ మముష్య పుత్ర మముష్యై పుత్రమస్యై విశ ఏష వో౽మీ రాజా సోమో౽స్మాకం బ్రాహ్మణానాꣳ రాజా.॥౧॥

యజు. ౯-౪౦

(ఇమం దేవా అసపత్నం) ఈశ్వరుడు మానవుల నెల్లర నుద్దేశించి రాజ్యవ్యవస్థ విషయమున నిట్లు ఆజ్ఞాపించుచున్నాడు. ఓ విద్వాంసులార! మీరీరాజధర్మమును సరిగా నెఱిగి మీ రాజ్యముపై శత్రువులెత్తి రాకుండునట్లు రాజ్యవ్యవస్థ నేర్పఱచుకొనుడు. (మహతే క్షత్రాయ) ఓ శూరులార! వీరులార! మీ క్షత్రియ ధర్మముకొఱకును, చక్రవర్తి రాజ్యముకొఱకును, శ్రేష్ఠమగు కీర్తి కొఱకును, సర్వోత్తమ రాజ్యప్రబంధముకొఱకును (మహతే జాన రాజ్యాయ) ప్రజలను విద్యాయుక్తులంజేసి రాజ్యవ్యవస్థను నడుపుటకును. (ఇంద్రస్యేంద్రియాయ) సూర్యప్రకాశమునకు సమానముగ నైశ్వర్యము, సత్యము న్యాయముతో గూడిన వ్యవహారమును ప్రకటించుటకును, అన్యాయాంధకారమును తొలగించుటకును, (సువధ్వం) మంచి రాజ్య వ్యవస్థ నేర్పఱచుకొనుడు. అందువలననెల్లరకు నుత్తమసుఖము నభివృద్ధిల్లును. (సోమో౽స్మాకం బ్రాహ్మణానాం రాజా) వేదవిదులైన సభాసదులలో సోమ్యగుణ సంపన్నుడై సర్వవిద్యాయుక్తుడైన వానిని సభాధ్యక్షుడుగా మీరెల్లరంగీకరించుడు. అతడే రాజు. ఓ సభాసదులార! ఈ సభాసదుడు మా మీ రాజవ్యవహారములందు రాజుగా నుండును. అని ప్రజలకు వినిపింపుడు. కావున మనము (ఇమమముష్య పుత్రమముష్యైపుత్రం) ప్రసిద్ధనామముగల స్త్రీ పురుష సంతానమగు నితనిని రాజ్యమున నభిషిక్తుంజేసి రాజుగ - అధ్యక్షుడుగ- స్వీకరించుచున్నాము. ॥౧॥

ఇంద్రో జయాతి ఈడ్యో వ పరా జయాతా అధిరాజో రాజసు రాజయాతై,
చర్కృత్య వంద్యశ్చోపసద్యో నమస్యో భవేహ ॥౨॥ అథ. ౬-౧౦-౯౮-౧

(ఇంద్రో జయాతి) ఓ బంధువులార! ఆ పరమాత్ముడు కాని, సభాప్రబంధముకాని యెల్లపుడును విజయము బొందుగాక ! (న పరా జయాతా) ఎన్నడును పరాజయము నందకుండుగాక! (అధిరాజః) ఆ మహారాజాధిరాజగు సర్వేశ్వరుడు, (రాజసు రాజయాతై) చక్రవర్తులలోను, మాండలిక రాజులలోను తన సత్య ప్రకాశముతోను, న్యాయముతోను మనలోకూడ నెల్లపుడు ప్రసిద్ధుడగుగాక! (చర్ కృత్యః) ఆనందస్వరూపుడగు పరమేశ్వరుడు మనుష్యులచే నెల్లపుడు నుపాసింప యోగ్యుడై యున్నాడు. (ఈడ్యో వంద్యశ్చ) ఆ పరమేశ్వరుడొక్కడే స్తుతియించుటకును, నమస్కరించుటకును యోగ్యుడు. (ఉపసద్యో నమస్యః) అతడే మనకు శరణ్యుడు; నమస్కరింప యోగ్యుడును. (భవేహ) ఆ జగదీశ్వరుడు మనకు విజయము చేకూర్చువాడు; రక్షకుడు; న్యాయాధీశుడు; రాజు కావున మనమిట్లు ప్రార్థింతుము. ఓ పరమేశ్వర! నీవు కృపతో మాయందఱకు రాజవగుము. మాచే సత్కరింపబడుము. మేము కూడ నీ సత్కారముతో బాటు రాజ్యాధికారులమై నీ రాజ్యమును సత్యన్యాయముతో సుశోభితము చేయుచు మేమును సత్కృతుల మగుదుముగాక!॥౨॥

త్వమింద్రాధి రాజః శ్రవస్యుస్త్వం భూర భిభూతిర్ జనానామ్

త్వం దైవీర్ విశ ఇమా విరాజా యుష్మత్ క్షత్రమజరం తే అస్తు॥౩

అథ. కాం. ౬-౧౦-౯౮-౨

(త్వమింద్రాధిరాజః శ్రవస్యుః) ఓ పరమేశ్వరా! నీవు సమస్త విశ్వమునకధిరాజవు; అప్తులవలె సత్యన్యాయము నుపదేశించు వాడవు. అట్లే నన్నును జేయుము. (త్వం భూరభిభూతిర్ జనానామ్) ఓ భగవంతుడ! నీవు సత్యస్వరూపుడవు. సజ్జనులకు రాజ్యైశ్వర్యాదుల నొసంగువాడవు. అట్లే నన్నునుం జేయుము. (త్వం దైవీర్ విశ ఇమా విరాజా) ఓ జగదీశ! నీవే యీ వివిధ ప్రజలను సత్యన్యాయముతో పాలింతువు; దివ్యగుణయుక్తులం జేయుదువు. కృపతో నన్ను నట్లే జేయుము. (యుష్మత్ క్షత్రమజరం తే అస్తు) ఓ పరమేశ్వర!

విశ్వరూపమగు నీ రాజ్యమెల్లపుడు తరుణావస్థలో నుండునుగాక ! అందువలన నెల్లరకు వివిధసుఖములు ప్రాప్తించుగాక! ఇట్లు సత్యమగు ప్రేమతోను, పురుషార్థముతోను నీశ్వరుని భజించుము, అతని యాజ్ఞను పాలించు వారి నీశ్వరుడు వాచే రచియింపబడిన యీ భూగోళ రాజ్యము మీ యధీనమగుగాక! అని యాశీర్వదించును. ౧౩

స్థిరా వః సంత్వాయుధా పరాణుదే వీలూ ఉత ప్రతిష్కభే

యుష్మాకమస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య మాయినః ౧౪

ఋ. ౧-౩౯-౨

ఈ మంత్రార్థము ప్రార్థనా విషయమున వ్రాయబడినది. అందు చూడవచ్చును.

తం సభా చ సమితిశ్చ సేనా చ ౧౫ అథ. ౧౫-౨-౯-౨

(తం సభా చ) ప్రజలు, రాజ సభయు పూర్వము చెప్పబడిన రాజుల కందఱకు రాజగు పరమేశ్వరు నెఱింగి సర్వసభలయందును సభాధ్యక్షుని కల్పించ మొనర్చవలెను. (సమితిశ్చ) పరమేశ్వరుని, సర్వోపకారకమగు ధర్మమును నాశ్రయించి, యుద్ధ మొనర్చుట మనుష్యులకును తగును. (సేనా చ) అట్లే వీరపురుషులచే నేర్పడిన సేనయు, పరమేశ్వరుని సేనాపతి, సభాధ్యక్షునితో గూడిన సభను, నాశ్రయించి ప్రజాపాలనము, యుద్ధము నాలోచించి చేయవలెను. ౧౫

ఇమం వీర మనుహర్షధ్వ ముగ్రమింద్రం సఖాయో అను సంరభధ్వమ్,

గ్రామజితం గోజితం వజ్రబాహుం జయంతమజ్మ ప్రమృణంత మోజసా౧౬

ఈశ్వరు డెల్లమానవులకుపదేశించు చున్నాడు. (సఖాయః) ఓ బంధువులారా! (ఇమం వీరం) అనంతబలవంతుడగు పరమేశ్వరునిష్టదేవునిగా నెంచి (అనుహర్షధ్వం) శూరులను, వీరులనుసదానందమున నుంచుడు. (ఉగ్రమింద్రం) అత్యంతోగ్రుడగు పరమేశ్వరుని సహాయముతో నైకమత్యము కలవారై (అనుసంరభధ్వం) దుష్టులను యుద్ధమున జయించుటకు నుపాయములను వెదకుడు. (గ్రామజితం) సమస్త భూగోళమును జయించినట్టియు (గోజితం) ఎల్లరి మనసులను, ఇంద్రియములను జయించినవాడును, (వజ్రబాహుం) ప్రాణము బాహువులుగా గలవాడును, (జయంతం) సర్వమును జయించువాడుననగు (అజ్మ) వాని నిష్టునిగా నెఱింగి, మనమతనిని రాజుగా నంగీకరింపవలెను. (ప్రమృణంత మోజసా) మరియు అనంత పరాక్రమముతో దుష్టులను పరాజితులంజేసి మనకు సుఖమునిచ్చువాని నాశ్రయించి విజయమును బొందవలెను. ౧౬

సభ్య సభాం మే పాహి యే చ సభ్యాః సభాసదః ।

త్వయేద్గాః పురుహూత విశ్వమాయుర్ వ్యశ్నవమ్ ౧౭

అథ, కాం ౧౯ అను-౭ సూ-౫౫ మ-౬

(సభ్యసభాం మే పాహి) ఓ సభకు యోగ్యుడవగు పరమేశ్వరా! నీవు మా రాజసభను రక్షింపుము. (యే చ సభ్యాః సభాసదః) సభాకార్యములలో చతురులగు సభాసదులు నీ కృపవలన సభ్యతాయుక్తులై పూర్వము వర్ణింపబడిన త్రివిధములగు సభలను సత్యన్యాయముతో రక్షింతురుగాక! (త్వయేద్గాః పురుహూత) ఎల్లరకు నుపాసింపదగు ఓ దేవా! నీతో బాటు సభాధ్యక్షులు, సభాసదులు రాజధర్మజ్ఞానమును బొంది, వారు సుఖమును బొందుదురు. (విశ్వమాయుర్ వ్యశ్నవమ్) ఇట్లు సభామూలమున రక్షింపబడిన మేము నీ సహాయముతోనే నీ యాజ్ఞను పాలింతుముగాక! అందువలన మా జనవత్సరముల సంపూర్ణాయువు సుఖముగ ననుభవింతుముగాక! ౧౭

జనిష్ఠ ఉగ్రః సహసే తురాయేతి సూక్తముగ్రవత్ సహస్వత్తత్ క్షత్రస్య రూపమ్, మత్స్ర ఓ ఉస్మఇత్యోజస్వత్తత్ క్షత్రస్య రూపమ్. ౧

బృహత్ పృష్ఠం భవతి, క్షత్రం వై బృహత్ క్షత్రేణైవ తత్క్షత్రం సమర్ధయత్యథో క్షత్రం వై బృహదాత్మా యజమానస్య నైష్కేవల్యం తద్ యత్ బృహత్ పృష్ఠం భవతి ౨

బ్రహ్మ వై రథంతరం క్షత్రం బృహద్ బ్రహ్మణి ఖలు వై క్షత్రం ప్రతిష్ఠితం క్షత్రే బ్రహ్మ. ౩

ఓజో వా ఇంద్రియం వీర్యం పంచదశ, ఓజః క్షత్రం వీర్యం రాజన్యస్త దేనమోజసా క్షత్రేణ సమర్ధయతి. తద్భారద్వాజం భవతి భారద్వాజం వై బృహత్

ఐ. పం-౮ అ-౧ కం ౨-౩

వేదమునందు జెప్పబడిన విధిననుసరించి రాజధర్మమిట సంక్షేపముగ వ్రాయబడినది, ఇకముందు ఐతరేయ శతపథ బ్రాహ్మణముల ననుసరించి సంక్షేపముగ వ్రాయుచున్నాము.

(జనిష్ఠ ఉగ్రః) రాజసభయందు విద్వాంసులు, ధర్మాత్ములునైన పురుషులుండవలెను. వారు శ్రేష్ఠ స్వభావముగల మనుజులకు సుఖము గలిగించువారై యుండవలెను. దుష్టుల

విషయములో వారు కఠిన చర్యలు తీసికొనవలెను. రాజకర్మము రెండువిధములుగ నుండును. ౧. సహనవృత్తి-దేశకాల వస్తువులననుసరించి, అక్కడక్కడ సహనము చూపుట ౨. ఉగ్రవృత్తి - కొన్ని యెడల సహనమునకు విరుద్ధముగా దుష్టులకు, కఠోరదండన విధించుట. ఇట్లే (మంత్ర ఓజిష్ఠః) రాజధర్మము మంచిపనులు చేయువారికి నానందప్రదమును, దుష్టులకు దుఃఖప్రదమును కావలెను. ఉత్తమ వీరపురుషులు, సేన, మున్నగు పదార్థసహితమై యుండవలెను. ఇదియే క్షత్రధర్మ స్వరూపము. ౧

(బృహత్ పృష్ఠం) క్షత్రధర్మము సర్వధర్మములకంటె నుత్తమము. నిర్భయులకది పృష్ఠము - రక్షకము ఉత్తమ సుఖములను నూటిమాటికి కలిగించునదియు నగును. ఉపర్యుక్తమగు క్షాత్రరాజధర్మము ద్వారమున మనుష్యుడు రాజకర్మమును వృద్ధిచేయును అట్లు చేయకున్న క్షాత్రధర్మము వృద్ధినొందదు. కావున క్షత్రధర్మమన్ని కర్మములకంటె గొప్పది. యజమానునకు, ప్రజలలోనుండు ప్రతిమానవునకు, రాజ పురుషునకును నిది యాత్మనలె నానంద ప్రదమగును. ఇట్లే యీ క్షాత్రధర్మము సంపూర్ణ ప్రపంచమునకు నిరంతరము కేవలసుఖము నియ్యగలదు; కావున నిది యన్నింటికంటె గొప్పది. ౨

(బ్రహ్మ వై రథంతరం) ఇట బ్రహ్మ శబ్దముచే సంపూర్ణ విద్యాయుక్త బ్రాహ్మణ వర్ణము గ్రహింపబడును. దానియందే క్షాత్ర ధర్మము ప్రతిష్ఠితమై యున్నది. సత్యవిద్యలేనినాడు క్షాత్రధర్మము వర్ధిల్లదు. రక్షణయు జరుగనేరదు. ఇట్లే (క్షత్రే బ్రహ్మ) క్షాత్ర ధర్మమున సత్య విద్య ప్రతిష్ఠితమగును. క్షాత్రధర్మము లేక విద్యా వృద్ధికాని, విద్యకు రక్షణ కాని జరుగదు. కావున విద్యయు, రాజధర్మము రెండును కలిసి రాష్ట్రమునసుఖమును పెంప సమర్థములగును. 3

(ఓజో వా ఇంద్రియం) రాజపురుషులు తన యింద్రియములను సదా బలపరాక్రమ యుక్తములుగనుంచుకొనవలెను- జితేంద్రియులై యుండవలెను. ఓజస్సే క్షత్రము. వీర్యమే రాజన్యము. కావున మనుష్యుడు ఓజస్సు - క్షాత్రముతోను, వీర్యము రాజన్యముతోను రాజధర్మమును పెంపుచేయును. రాజ్యము సర్వసుఖములతోను వర్ధిల్లచేయును. కావున, నిది భారద్వాజము- భరణీయ ధర్మము, అన్నింటి కంటె నుత్తమము. ౪

తావహ మనురాజ్యాయ సామ్రాజ్యాయ, భౌజ్యాయ స్వారాజ్యాయ,

వై రాజ్యాయ పారమేష్ఠ్యాయ రాజ్యాయ మహారాజ్యాయాధిపత్యాయ స్వావశ్యాయాతిష్ఠాయాం రోహామీతి. ౫

నమో బ్రహ్మణే నమో బ్రహ్మణే నమో బ్రహ్మణ ఇతి త్రిష్కృత్వో బ్రహ్మణే నమస్కరోతి. బ్రహ్మణ ఏవ తత్ క్షత్రం వశమేతి తద్యత్ర వై బ్రహ్మణః క్షత్రం వశమేతి తద్రాష్ట్రం సమృద్ధం తద్ వీర వదాహాస్మిన్ వీరో జాయతే ౬

ఐ. పం౮-౮ అ-౨ కం-౬-౯

(తానహమనుర్ద్యాయ) మనుష్యులెల్లరు నిట్లుకోరి పురుషార్థ మొనరింపవలెను. పరమేశ్వరుని కృపవలననేను సభాధ్యక్షతను బొందుటకును. మాండలికరాజుల మీద రాజసత్తా ప్రాప్తికొఱకును, (సామ్రాజ్యాయ) సార్వభౌమ రాజ్యమొనర్చుటకును (భౌజ్యాయ) ధర్మన్యాయముతో రాజ్యపాలనకును నుత్తమ భోగము కొఱకును, (స్వారాజ్యాయ) తనకు రాజ్యము ప్రాప్తించుటకును, (వైరాజ్యాయ) నానావిధ రాజులమధ్య మిక్కిలి ప్రసిద్ధి బొందుటకును (పారమేష్ఠ్యాయ) పరమ రాజ్యప్రాప్తి కొఱకును, (మహారాజ్యాయ) గొప్పరాజ్యమున సుఖము ననుభవించుటకును, (ఆధిపత్యాయ) ఆధిపత్యము బొందుటకును (స్వావశ్యాయ) ప్రజలను తనవశము చేసికొనుటకును, (అతిష్ఠాయాం) విద్వాంసులతో గూడిన సభలో నేను సర్వగుణములతోను, సుఖములతోను వృద్ధి బొందుదును గాక!

(నమో బ్రహ్మణే) పరమేశ్వరునకు పలుపర్యాయములు నమస్కరించి, రాజకర్మము నారంభింపవలెను. ఎట క్షత్రధర్మము పరమేశ్వరుని యధీనమున నుండునో యట రాష్ట్రమంతయు సమృద్ధితోను, వీరపురుషులతోను కూడియుండును. ఆ రాష్ట్రమునందే వీరపురుషులుద్భవింతురని పరమేశ్వరోక్తి. ౬

స ప్రజాపతికా. అయం వై దేవానా మోజిష్ఠో బలిష్ఠః సహిష్ఠః సత్తమః పారయిష్ణుతమ ఇమమేవాభిషించామహా ఇతి తథేతి తద్వై తదింద్రమేవ ౭

సమ్రాజం సామ్రాజ్యం భోజం భోజపితరం స్వరాజం స్వారాజ్యం విరాజం వైరాజ్యం రాజానం రాజపితరం పరమేష్ఠినం పారమేష్ఠ్యం క్షత్రమజని క్షత్రియోఽజని విశ్వస్య భూతస్యాధిపతి రజని విశామత్తాఽజని పురాం భేత్తాఽజన్యసురాణాం హంతాఽజని బ్రహ్మణో గోప్తాఽజని ధర్మస్య గోప్తాఽజనీతి.౮

ఐ-పం-౮ కం-౧౨

ఏ రాజ్యము పరమేశ్వరాధీనమున నుండునో, విద్వాంసుల ప్రబంధమున నడచునో యారాజ్యము సర్వసుఖకారక పదార్థములతోను, వీరపురుషులతోను నత్యంతము ప్రకాశించును. (సప్రజాపతికా) సర్వసభాసదులు, ప్రజలును స్వామియు, నిష్టుడు,

పూజ్యతముడునగు పరమేశ్వరునితో నుండవలెను. పరమేశ్వరుని లక్ష్యమున నుంచుకొనవలెనను భావము. ఎల్లరును కలిసి తమకుచిన్నపోవియు, పరాజయము కలుగకుండునట్లు ఆలోచింపవలెను.

ఆ విద్వాంసులు అద్వితీయుడగు పరమేశ్వరునే యుపాసింతురు. ఆ యద్వితీయపరమేశ్వరుడే దేవుడు విద్వాంసులలో (ఓజిష్ఠః) అనంత విద్యాయుక్తుడనియు, (బలిష్ఠః) అపార బలవంతుడనియు, (సహిష్ఠః) అత్యంత సహన స్వభావముగలవాడనియు (సత్తమః) సర్వోత్తముడనియు, వర్ణింపబడియున్నాడు. అతడే (పారయిష్ణుతమః) యుద్ధాది దుఃఖముల నుండియు మనలను దాటింపజేసి, జయాది సర్వసుఖములను ప్రసాదించును. అతనినే మనము మనరాజ్యమునందును, సభయందును విశేషించి న్యాయకర్తయైన రాజుగ నంగీకరింతుము. అతడే యింద్రుడు పరమైశ్వర్యయుక్తుడు. ౮

అతడే మనకు సమ్రాట్టు - చక్రవర్తి - రాజు. అతడే మనకు చక్రవర్తి రాజ్యము నొసంగువాడు. తండ్రివలె సర్వవిధముల నతడే మనలను పాలించువాడు. (స్వరాజం) రాజకర్మములందు ప్రకాశించు వాడును, సద్విద్యాది గుణములచే హృదయమున దీపించువాడును, (స్వారాజ్యం) స్వరాజ్యపాలన మొనర్చువాడును, (విరాజం) వివిధరాజులను ప్రకాశింపజేయువాడును, (వైరాజ్యం) వివిధరాజ్యముల నిచ్చువాడు. అతనినే మనము రాజుగను, రాజులకందఱకు తండ్రిగను నంగీకరింతుము. అతడే పరమేష్ఠి. సర్వోత్తమ రాజ్యదాతయు (పారమేష్ఠ్యం) పరమేశ్వర నిర్మితశ్రేష్ఠ పురుషుని రాజ్యమున నభిషిక్తుం జేయుదుము. అట్టిపురుషుని క్షాత్రధర్మము సుఖయుక్తమగును. అతని కృపవలననే నేను క్షత్రియుడను రాజ్యము ప్రసిద్ధ మొనర్చితిని. సర్వప్రాణులకు నధిపతినైతిని. అట్లే దుష్ట ప్రజల సంహారము, దుష్టుల నగరభేదనము, బందిపోటు దొంగల తాడనము, వేద విద్యాపాలనము, ధర్మరక్షణము చేయగలిగితిని. అజని- ప్రాదుర్భూతుడనైతిని.

స పరమేష్ఠీ ప్రాజాపత్యోఽభవత్ ౯ ఐ పం-౮౩-౧౪

(స పరమేష్ఠీ ప్రాజా) సర్వసాధారణ మనుజులు, సభాధ్యక్షాదులును పరమేశ్వరునే తమ కిష్టునిగా నెంచవలెను. అతనినే పూజింపవలెను. ఇదియే రాజధర్మము. ౯

(ఇట్టి గుణములతోను, సత్య కర్మములతోను విశిష్టుడై యుక్తుడైన క్షత్రియుడు సర్వయుద్ధములందును జయము బొందును. సర్వోత్తమ సుఖములకు, లోకములకు నధికారియై రాజులలో నుత్తమత్వము బొందును. అందువలన నీ లోకమున చక్రవర్తి రాజ్యమును బాలించి, లక్ష్మి ననుభవించి మరణానంతరమున స్వరాట్టు - అమృతుడై పరమేశ్వరునియందు సర్వసుఖముల ననుభవించును. మహదైశ్వర్య యుక్తమగు నభిషేకమువలన క్షత్రియునకు ప్రతిజ్ఞాపూర్వక రాజ్యాధికారము లభించును. - కావున నేదేశమున నిట్టి రాజ్య ప్రబంధము చేయబడునో యా దేశమత్యంత సుఖమును బొందును. ౧౦

## వైదిక సమాజ విధానము

### సమాజోన్నతికి మార్గము

**అసంబాధం బధ్యతో మానవానాం యస్యా ఉద్వతః ప్రవతః సమం బహు। నానా వీర్యా ఓషధీర్యా బిభర్తి నః ప్రథతాం రాధ్యతాం నః ॥అథర్వ-౧౨. ౧. ౨॥**

(యస్యాః) ఏ భూమి యందలి (మానవానాంబధ్యతః) మానవులయందు (అసంబాధం) అద్వేషమునా జగడములు పరస్పర కలహములు వైమనస్యములు యుండవో, ఇంక నట్లే మా దేశములో (ఉద్వతః) ఆధ్యాత్మికోన్నతిని గోరువారును (ప్రవతః) ఐహికోన్నతిని గోరువారునగు వందరియందు (బహు సమ) మిగుల సమభావము కలదో, ఇకనట్లే మా భూమి నానావిధగుణధర్మములుగల ఓషధులను ధరించి యున్నదో ఆ భూమి (నః ప్రథతామ్) మా అందరి ఖ్యాతిని (రాధ్యతామ్) సిద్ధింప జేయుగాక.

ఉన్నతి కొఱకందరి జనులలో "అసంబాధం" ద్వేషముండగూడదు. అనగా నే విధమైన జగడ ముండరాదు. పరస్పర విచార వైషమ్యము వలననే జగడములు కలుగుచున్నవి జన్మతః ఒకడు ఉత్కృష్టుడు, మరొకడు నికృష్టుడు అనువైషమ్యము యొక్క క్షుద్ర భావము లెక్కడ యుండునో అక్కడ తప్పక జగడములు కలుగును. అట్లే సమత్వము వలన జగడములు దూరమగును. వైషమ్యమువలననే జగడములుకలుగునను టగ్రాహ్యము.

వైదిక సాహిత్యము, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు, వేదాంగములు అను వీని నధ్యయనము చేయుటవలన భారతీయ సంస్కృతి యొక్క మూలతత్త్వములును, సార్వభౌమ స్వరూపమును మనకు చక్కగా బోధపడు చున్నది. ఇంక వైదిక జీవనమునకు సంబంధించిన మంతవ్యములు. వేదకాల సామాజిక తథా ఆధ్యాత్మిక విషయములు కడు స్పష్టముగ విదిత మగుచున్నవి ఈ మంతవ్యములు ఇహపర దృష్టితో గొప్ప మహత్త్వము కలిగియున్నవి. భారతీయ సంస్కృతి యందు వైదిక జీవనమునకు సంబంధించిన మంతవ్యములు తొమ్మిది గలవు గమనింపుడు.

౧. వైదిక త్రైతవాదము ౨. వైదిక ఆర్ష గ్రంథములు ౩. బంధ మోక్షములు ౪ ఆవాగమనము (పునర్జన్మము) ౫. వర్ణాశ్రమ ధర్మములు ౬. వైదిక సంస్కారములు ౭. యజ్ఞ విధానము ౮. కర్మ యొక్క వ్యుత్పత్తి ౯. భక్ష్యాభక్ష్య నిర్ణయము.

౧. వైదిక త్రైతవాదము : ఈశ్వర- జీవ- ప్రకృతిలో గలదని యెరుగవలెను. వేదమందు ఇవి నిత్యములని, ఇవియే జగత్తునకు కారణములని చెప్పబడినది. ఋగ్వేదమందలి ౧. ౧౬౪.౨౦ వ సూక్తమున ఈ మూటిని వేర్వేరుగ వర్ణించుచు వృక్షరూప ప్రకృతి భోగ్యమని, జీవుడు భోక్తయని, ఈశ్వరుడు సాక్షి ఫలదాతయని చెప్పబడినది. ఇవ్విధముగ సృష్ట్యుత్పత్తి వివేచనము వైజ్ఞానికముగ ఋగ్వేదమందు ఉపలబ్ధమగుచున్నది. కాన నది ఆర్యుల వివేక పూర్ణబుద్ధిని నిరూపించుచున్నదనక తప్పదు.

౨. వైదిక ఆర్ష గ్రంథములు : ఈశ్వరదత్త "అపౌరుషేయ" వేదములు వైదిక ధర్మమున కాధార భూతములు . ఇంక నవి జ్ఞానమున కారంభిక పుస్తకములనుట తథ్యమేగాక నిర్వివాదము, వేదములు సార్వభౌమ, సార్వజనికములు. అందు మతమతాంతరముల వర్ణనములేదు. వేదభిన్న ఉపవేదములు, వేదాంగములు, ఉపాంగములు, బ్రాహ్మణ గ్రంథములు, ఆరణ్యకములు, ప్రాతిశాఖ్యలు, ఉపనిషత్తులు మున్నగునవి గూడ ఆర్ష గ్రంథము లనబడుచున్నవి. అవి ఋషిప్రణీతములగుట వలన మాన్యములన నొప్పును. ధార్మిక పక్షమందు వేదోక్త లౌకిక జీవనమునకు నీ గ్రంథముల మహత్వము విశేషముగా గలదనక తప్పదు. వైదిక ధర్మమంతయు నీ గ్రంథముల నాశ్రయించియే యున్నదననగును. ఈ గ్రంథములందు మనకు రెండు విధముల శిక్షలు లభించుచున్నవి. మొదటిది ఆత్మోన్నతి జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు ఏ విధముగ వర్ధిల్లదగును? అట్లే అంతమందు మనుష్యుడెట్లు ముక్తుడగును? అను నిత్యాది నిర్దేశము మనకీ గ్రంథము లందు లభించుచున్నది. యజుర్వేదమందలి ౪౦ వ అధ్యాయమునందు దీనివర్ణనము కడువక్కాగ గలదు.

**అన్ధన్తమః ప్రవిశన్తి యేఽవిద్యాముపాసతే ।**

**తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః ॥** య.౪౦. ౯

అనగా ఎవరు జ్ఞానము నపేక్షించుచు కర్మోపాసననే చేయుచుందురో వారు గాఢాంధకారమునందు బడుదురు. అట్లే కర్మ నపేక్షించుచు కేవలము జ్ఞానమందే మగ్నులై యుందురో వారంతకంటె నధిక గాఢాంధకారమున బడుదురు.

వేదోక్త లౌకిక జీవనమందలి ముఖ్యమైన రెండవ శిక్ష ప్రేమమయ సామూహిక జీవనము అనగా ప్రతి మనుష్యుడు అందరి ఉన్నతి యందే తనయున్నతి కలదని యెరుగవలెను. ఋగ్వేద దశమ మండలము అట్లే అథర్వ వేద తృతీయ కాండము ఇవ్విధమైన శిక్షలతో నిండి యున్నవి. ఉదాహరణార్థము కఠోప నిషత్తు నందలి మొదటి మంత్రము విలక్షణమైన ప్రేమను సూచింపజేయుచున్నది.

**ఓమ్ సహనా వవతు సహ నౌ భునక్తు సహవీర్యం కరవావహై**
**తేజస్వినా వధీతమస్తు మా విద్విషావహై॥**

౩ బంధ మోక్షములు : ఉపర్యుక్త రెండు మంతవ్యములకు బిమ్మట బంధమోక్షముల సమస్య ఉపస్థిత మగును. దుఃఖ గ్రస్తపర తంత్రతను బంధమని, త్రివిధ దుఃఖముల నుండి ముక్తుడగుట మోక్షమని చెప్పబడినది. వేదోక్త లోకజీవనము యొక్క లక్ష్యము మోక్ష ప్రాప్తియే యననగును. ఈశ్వరోపాసనము, యోగాభ్యాసము, ధర్మానుష్ఠానము విద్యాప్రాప్తి, బ్రహ్మచర్య పాలనము, సత్సంగము మొదలుగాగల విముక్తికి సాధనములని చెప్ప బడినది. ఇవ్విధముగ నీ మూడవ మంతవ్యమునందు జీవనము యొక్క లక్ష్యము దర్శింపబడినది. దానివల్ల వైదిక జీవనముగల సదాచార ప్రవర్తనము తనంతట దానే ప్రకటమగుచున్నది.

౪. ఆవాగమనము (పునర్జన్మము): ఇతర ధర్మములవలె వేదకాల జీవనమందును ఆవాగమనమును పునర్జన్మమును గూర్చి అత్యధికముగ నాలోచింపబడినది భారత భిన్నదేశపు ధర్మములందు ఆవాగమన విషయక జ్ఞానమే లేకుండె ననవచ్చును కాని వైదిక జీవన మందు దీని స్థానము విశేషమహత్వము గలదిగా నున్నది. ఒక శరీరమును త్యజించి మరొక శరీరమున జన్మించుటయే ఆవాగమనమని యర్థము. ప్రపంచము నందొకడు సుఖయుక్తుడును, మరొకడు దుఃఖితుడుగ నెందుకు గలడను ప్రశ్న ఉత్పన్నమగుచున్నది. గ్రుడ్డి, కుంటి అట్లే భిన్నభిన్న స్థితులు గల మనుష్యులు ప్రపంచమున నిష్కారణముగనే మాడబడుచున్నారా ? లేదా ఈశ్వరుడే తన ఇష్టానుసారము వారినట్లు చేసియున్నాడా ? వేదకాల గ్రంథములు మాత్రము పై పరిస్థితు లన్ని సకారణములని బోధించుచున్నవి. జీవుల భిన్న భిన్న స్థితులన్ని వారివారి కర్మఫలములని ఆవాగమనము ద్వారా పూర్వజన్మ ఫలములను ప్రచలిత స్థితులందు బొందుచున్నారనియు అట్లే తమ కర్మల ద్వారా భావిజీవనమునకు క్రియలొనర్చు చున్నారనియు తెలుపుచున్నవి.

౫. వర్ణాశ్రమ ధర్మములు వైదిక లోక జీవనమందలి ఐదవది వర్ణాశ్రమముల విశిష్టత లోకజీవనము పూర్ణముగా సఫలమగుటకుగాను వర్ణాశ్రమముల విభజన మొనర్చబడినది. ఆరవ మంతవ్యమున కంతర్గతముగ సంస్కారములు ఉల్లేఖింపబడగల్గును వైదిక లోక

జీవనమందు మనుష్యుని జీవితమంత ౧౬ సంస్కారము లందు విభజింపబడినది. శరీరాత్మ మనస్సులను ఉత్కృష్ట మొనర్చుటయే వీని ఉద్దేశ్యము. వైదిక జీవనము నందు యజ్ఞముల మహత్వము అత్యధికముగా గలదు. నిత్యములు నైమిత్తికములని యజ్ఞములు ద్వివిధములు. బ్రహ్మయజ్ఞము "సంధ్యా" దేవయజ్ఞము "అగ్నిహోత్రము". పితృయజ్ఞము, బలి వైశ్వదేవము, అతిథి యజ్ఞము అనునవి ఐదు నిత్యములు. వైదిక సామాజిక జీవనమందు ప్రతి స్త్రీయు, పురుషుడును ఈ యజ్ఞము లొనర్పవలెను విధానము కలదు. అట్లే నైమిత్తిక షోడశ సంస్కారము లా యా సమయము లందొనర్ప బడుటయేగాక జలవాయువుల శుద్ధికొరకు ఋతుపరివర్తనము నందును, అన్యముఖ్యావసరము లందును యజ్ఞము లొనర్పబడుచుండెను. వైదిక జీవనమంత కర్మపై ఆధారపడి యున్నది. తదనంతరము భగవద్గీతయందును కర్మయే జీవనమునకు ముఖ్య అంగమని నిర్దేశింప బడినది. గీతయందలి "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన" అను విషయము వైదిక జీవనమందు అంతకుముందే విధింపబడి యున్నది. ఆర్షగ్రంథములన్ని కర్మయొనర్చుటకే ఆదేశించుచున్నవి. కర్మఫలము నపేక్షింపక శుభకర్మలొనర్చుటయే జీవనము యొక్క లక్ష్యమై యుండదగును. అంతమందు భక్ష్యాభక్ష్యముల నిర్ణయము అవసరమైయున్నది. తమోగుణమునకు దూరమును, రజోగుణమునకు మితముగను యుండి సదా సత్వగుణాభివృద్ధికై పాటుపడుటయే వైదికజీవనము నందుగల ఆదర్శము. తమోగుణమును వృద్ధి జేయు పదార్థములన్ని అభక్ష్యములని జెప్పబడినది.

ఇవ్విధముగ వేదకాల జీవన మత్యంత వ్యవస్థితముగను, సుందరముగను యుండెనని మనకు దెలియుచున్నది. జీవనము యొక్క లక్ష్యమే సామూహికాభివృద్ధియై యుండెను. మేము స్వవిషయమందును, అన్యుల విషయమునందును ఏమి చేయవలసి యున్నదను నీ త్రివిధ కర్తవ్యములే సమస్త జీవనమునందు విధింపబడి యున్నవి. మనుష్యుడొకవేళ నీ త్రివిధ కర్తవ్యములను పాలించినచో నే విధమైన వివాదమున కవకాశ ముండ నేరదు. దీనివలననే వైదిక జీవనము యొక్క అస్తిత్వము శాంతిమయమై యుండును. అయ్యది నేటి వస్తువాదమున కత్యంత దూరమై యున్నదననగును.

వైదికజీవనమున కాధారములైన, సిద్ధాంతములను సంక్షిప్తముగ నవలోకించిన పిమ్మట సంస్కారముల యొక్కయు వర్ణాశ్రమముల యొక్కయు విశేషజ్ఞాన మత్యంతావశ్యకమై యున్నది. ఏలనన వైదిక జీవనమునకు నివియే ఆధారభూతములనుట స్పష్టము. సామాజిక జీవనమంత వీనిపైననే స్థిరపడి యున్నది.

౬. వైదిక సంస్కారములు : మానవ జీవన వికాసార్థము, మానసిక సంకల్పములును, విచారములును గొప్ప మహత్వము కలిగి యున్నవి. మనవిచారములు విశేషముగ మన పరిస్థితులపై నాధారపడి యుండును. మన విచారముల ప్రభావము మన కార్యములపై బడుచుండును కావుననే వైదిక జీవనమందు సంస్కారములకుగొప్ప మహత్వ మివ్వబడినది. గర్భాధానమునుండి మృత్యువు వరకు సంస్కారములద్వారా మనుష్యుని అభివృద్ధి కొరకు శుభకోరికలు వ్యక్తపరుపబడుచుండును. అట్లేయతనికుల మర్యాదను పరిస్థితిని, రాష్ట్రమునకును, సమాజమునకును దగిన కర్తవ్యములను ఆ వ్యక్తికి బోధింపబడుచుండును. ఆ కారణమువలననే సంస్కారములు గొప్ప ఉత్సవములుగ జరుపబడుచుండును.

## వేదాలలో షోడశ సంస్కారముల విశిష్టత

### గర్భాధానము (౧)

శ్రేష్ఠమైనసంతాన ముత్పన్నమగుటకుగాను ఈ సంస్కారము విధింపబడి యున్నది, బిడ్డల జీవనము గర్భమునుండి ఆరంభమగుచున్నది కాన బిడ్డల జీవనము యొక్క వికాసము వారి తల్లిదండ్రులపై నిర్భరమై యుండును. బ్రహ్మచర్యకాలము గడపిన పిదప నా బ్రహ్మచారి గృహస్థాశ్రమమున ప్రవేశించును. సంతానము గలుగ వలెనను కోరికతో బరమాత్ముని ప్రార్థించుచు దంపతులు సంస్కారమొనరించి గురుజనుల ఆశీర్వాదము బొందుచుండిరి. పొందుచుందురు. ఈసంస్కారము వలన బాహ్యరూపేణ తల్లిదండ్రులు శుద్ధియగుదురు గర్భమున రాగల శిశు శరీరము మనస్సు విశేషముగ వికసితమగును. ఆర్ష గ్రంథములందు గర్భాధానకాలముగూడ నిర్దేశింపబడి యున్నది. వేద మంత్రముల ద్వారా దంపతులు మంచి గుణములు సౌందర్యములుగల సంతానము కలుగవలెనని గోరుచుందురు. వేదకాలమందు అన్నాది పదార్థముల కొదువ లేనపుడు సంతానేచ్ఛ అనునదొక ధార్మిక కృత్యముగ భావింపబడుచుండెను. సంతానోత్పత్తి క్రియగూడ నొకధార్మిక కృత్యముగ వైదిక జీవనమందొక అంగమై యుండును.

### పుంసవనము (౨)

పుత్రేచ్ఛ గల దంపతులకే ఈ సంస్కార మభీష్టమై యుండెనని కొందరు అభిప్రాయ పడుచున్నారు. కాని అది యథార్థముకాదని గోచరమగుచున్నది. గర్భాధానము జరిగిన మూడునెలలకు పిమ్మట గర్భాశయమున శిశు శరీర రచన ఆరంభమగును. కాన దాని రక్షణార్థమే ఈ సంస్కారము విధింపబడియున్నదనుట మాత్రము తథ్యము. ఈ సందర్భమున అధ్వరణ

వేదమందు వర్ణింపబడిన పుత్రేష్టి మంత్రముల ద్వారా యజ్ఞము చేయబడుచున్నది. ఇప్పుడు పతి తన పత్నిని ఫలపుష్పాదుల చేతను, ఇతర విధముల చేతను ప్రసన్నింపజేయును. ఫలముల నొసంగుట వలన పత్నియొక్క మనోరథము సఫల మగుటకని భావము. వైదిక దృక్పథమున నీ సంస్కారము గొప్ప మహత్వముగల దగుటకు కారణమేమన నీ సమయమందు దంపతులు నేటినుండి గర్భపాతమగునట్టి ఏ కార్యమును మేము జేయమని ప్రతిజ్ఞ చేయుదురనుట గ్రాహ్యము.

## సీమంతోన్నయనము (3)

ఈ సంస్కారము గర్భము స్థిరపడిన నాల్గవ మాసమందు జేయబడును. ఈ సంస్కారమందును స్త్రీని సంతోషింపజేయుటకు ప్రయత్నము గావింపబడును. ఇక పత్ని తన ముఖమును స్వచ్ఛమైన జలమందో, ఘృతమునందో చూచునపుడు, నీవేమి చూచుచున్నావని పతి అడుగవలెను? అప్పుడు పత్ని ప్రజలను జూచుచున్నానని యుత్తరమివ్వవలెను. దీని వలన గర్భస్థ శిశువృద్ధి నొందుటకు ప్రోత్సాహ మబ్బును. ఇది యొక సామూహిక సంస్కారము. ఇందుపతి స్వయముగ తన చేతులతో పత్ని నలంకరించును. సంగీతాది వాద్యముల ద్వారా స్త్రీనిప్రసన్నింపజేయుదురు. వయోవృద్ధులు, స్త్రీలు పురుషులు, గురుజనములు వీర ప్రసవరా లగుటకు నామె నాశీర్వదింతురు. శిశు జననమునకు బూర్వ మా శిశువు ఓజస్విగంధియు, ప్రతిభాశాలియు నగుటచేకే ఈ మూడు సంస్కారములు విధింపబడినవని దెలియుచున్నది. కాన సుగుణ సంపత్తి రూప లావణ్యాదులను గోరెడు ఆర్యులు ఆరోగ్యవంతులుగను, సంపన్నులుగను, ప్రసన్నచిత్తులుగను అవశ్యముగనుండి రనుట కెంత మాత్రము సందేహములేదు.

## జాతకర్మ (౪)

ఈ సంస్కారము సంతాన ముత్పన్నమైనప్పు డొనర్పింపబడును. మనుష్య జీవనముతో సంపర్కముకలుగజేయు నదియే మొదటి సంస్కారమన నొప్పును. తండ్రి శిశువును వడిలోనుంచుకొని, హోమముజేయుచు నా యీ శిశువు నశింపకుండుగాక! అట్లె నా పశ్వాదులు వృద్ధిబొందు చుండుగాక యని ప్రార్థించుచుండును. తదనంతరము జనకుడు శిశు చెవిలో "వేదోఽసి" అని చెప్పుచు నీవు మేధావంతుడవును, వేదజ్ఞుడవును అగుదువుగాక యని అభిలషించును. అనంతరము ఘృతమున తేనెను గలిపి బంగారు శలాక నందుముంచి శిశువునాలుకపై "ఓమ్" శబ్దమును వ్రాయును. వైద్యశాస్త్రమనుసారముగ ఘృతము, తేనె అనునవి కఫపిత్త వికారములను నశింపజేయును. అట్లే బంగారము మేధస్సును ఉత్తేజింప జేయును. ఈ పద్ధతి సంతానముపై ఆర్యుల ప్రేమను ప్రదర్శింప జేయుచున్నది. ఆశ్చర్యమేమన, రుగ్ణావస్థనుగాని అకాల మృత్యువునుగాని వారెప్పుడును తలంచక "జీవేమ శరదః శతమ్" అని భగవంతుని ప్రార్థించుచు నభిలషింతురనుట గ్రాహ్యము.

## నామకరణము (౫)

సంస్కారము శిశువుజన్మించిన పదునొకండవ దినమందో ౧౦౧వ దినమందో చేయందగునను విధానముకలదు. ఒకగుప్త నామము కూడ పెట్టుకొనునది ఆచారమందుండెననియు, అది జాతకర్మ సంస్కార సమయమందే తల్లిదండ్రులద్వారా పెట్టబడుచుండెననియు విదితమగుచున్నది. కాని సంస్కార సమయమున సంబోధనార్థముగ నొక నామము పెట్టబడుచుండును. నామము వినుటకు ప్రియముగను, సార్థకముగనుండ వలెను. ఆదర్శమైన జీవనముగడపదగునను తలంపుతో తల్లిదండ్రులు ఋషిదేవతాది పూర్వజుల నామానుసారముగ తమ శిశువునకు నామకరణ మొనరింతురు. ఉపనిషత్కాలమందు ప్రాముఖ్యముగ తల్లిదండ్రుల పేరుతో బిడ్డలపేర్లు పెట్టబడుచుండెను. నామమొకటే యుండవలెనని మాత్రము విదితమగుచున్నది. కాని గుణములనుబట్టి యితర నామములును పెట్టబడుచున్నట్లు గోచరమగుచున్నది. పర్యాయ పదముల నాధారముగా గొనియు ఉపనామములును పెట్టబడుచుండినట్లు తెలియుచున్నది. ఈ సంస్కారము సామూహికముగ నొనర్పబడును. యజ్ఞము చేయ బడిన పిమ్మట తల్లిదండ్రుల కిష్టమైన నామము శిశువునకు బెట్టబడును. ఋత్విజాది విద్వాంసులు బంధు మిత్రులందరు శిశువు నాశీర్వదింతురు.

## నిష్క్రమణము (౬)

శిశువు నాల్గునెలల వాడగునపుడు, జన్మించిన తిథినాడు ఉద్యానమునకు గొనిపోయి శిశువునకు వాయు సేవనమును జేయించి సృష్టిసౌందర్యమును జూపుటయే ఈ సంస్కారము యొక్క ప్రయోజనము. అప్పటి వరకు వెలుపలి ఎండవాయువుల ప్రఖరతను సహించుటకు అసమర్థుడువై యుండును. అంతవరకు గృహమందలి శుద్ధమైన వాయువును ప్రకాశమును బొందుచు-డెను. ఈ సంస్కారముద్వారా సూర్యావలోకనమును ముఖ్యముగ జేయించి సృష్టివైచిత్ర్యమును జూపబడును. అనంతరము యజ్ఞశాలయందు అగ్నిహోత్రముచేసి బంధు మిత్రులు శిశువును శతవర్షముల వరకు జీవించునట్లు ఆశీర్వదింతురు.

## అన్నప్రాశనము (౭)

జన్మించిన ఆరవ మాసమందో, లేక ఎనిమిదవ మాసమందో బాలుడు అన్నమును జీర్ణించుకొనగల్గినపుడు ఈ సంస్కారమొనర్చబడును. అప్పుడు బాలకునికి దంతములుగూడ వచ్చియుండును. భారతదేశము కృషి ప్రధాన దేశమనుట ప్రసిద్ధము. కాన నీ సంస్కారము ద్వారా వేదకాలపు ఆర్యులు తమ బాలబాలికలను అన్నదేవతకు సమర్పింతురు. ఈ సందర్భమున శిశువులకు క్షీరాన్నము తినిపించవలెనను విధానము కలదు. యజ్ఞానంతరము తినిపించి "అన్నపతి రన్నాదో వర్ధమానో భవాయనః" అని ఆశీర్వదింతురు. అనగా బంధు మిత్రాదులు నీవు అన్నపతివి గమ్ము. అన్నమును గ్రహించు యోగ్యతగల వాడవై వర్ధిల్లుము అ భావము. ఈ సంస్కారమునకు పిమ్మట ప్రతిదినము అన్నము కొంచెము కొంచెము బెంచుచుండవలెను. భోజన మందు ఘృతము లేక, పెరుగు విశేషముగ నుండదగుననుట గ్రాహ్యము.

## చూడాకర్మ (౮)

శిశువు జన్మించిన సంవత్సరాంతమందో లేక మూడవ సంవత్సరారంభమందో వెంట్రుకలు దీయుటకు మున్ముందుగ నీ సంస్కారమొనర్చబడును. అప్పటివరకు శిశువు తల మిగుల మృదువుగ నుండుట వలన జన్మ జాతకేశములే దాని రక్షించుచుండును. కాని ఈ సంస్కారము ద్వారా మొదటి కేశఖండనము సంస్కార రూపేణ జరుగును. యజ్ఞానంతరము శిశువు వెంట్రుకలను దీయవలెను. అనంతరము శిశువునకు స్నానముజేయించి, నూతన వస్త్రములచే నలంకరించి యజ్ఞశాలకు తేగా బంధు మిత్రాదులందరూ శిశువును ఆశీర్వదింతురు.

## కర్ణవేధ (౯)

శిశువు జన్మించిన మూడవ సంవత్సరాంతమందో లేక ఐదవ సంవత్సరారంభమందో చెవులు కుట్టుటకు ఈ సంస్కారమొనరింపబడును. ఈ సంస్కారమునుండి అనేక రోగములు నివారణమగును. వైద్యక శాస్త్రానుసారముగ నీ సంస్కారమునకు గొప్ప మహాత్మ్యము కలదు.

## ఉపనయనము (౧౦)

ఈ సంస్కారము బాలకునకు ఎనిమిదవ సంవత్సరమున నొనర్చబడును. ఉపనయన శబ్దమున కర్థము గురువు దగ్గరకు జేర్చుట యనబడును. ఈ సంస్కారము ద్వారా బాలకుని యోగ్యతను గమనించి యజ్ఞోపవీత మొసర్చి ఇంటి వాతావరణమునుండి తొలగించి గురు సమీపమున అనగా ఆశ్రమమున ప్రవేశింపనగును. అంతకుముందు తల్లిదండ్రులే బాలకునికి ముఖాముఖిగ గొంత సాధారణ శిక్ష నొసంగుదురు. అధ్యయన కాలము తరచుగ బ్రాహ్మణ బాలకునికి ఎనిమిదవ, క్షత్రియ బాలునికి పదునొకండవ అట్లే వైశ్య బాలునికి ౧౨వ సంవత్సరమున ఆరంభింపబడును. యోగ్యతగల బాలకుల అధ్యయనారంభమింతకు బూర్వమును జేయవచ్చును. అనగా ఎనిమిదవ ఏట అందఱను ఆశ్రమమున జేర్పవచ్చును. మనుస్మృతిలో :-

బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే ।
రాజ్ఞో బలార్థిన ః షష్ఠే వైశ్య స్యేహార్థినో ఽష్టమే ॥

అనగా మంచి తేజస్సును బొందుటకు బ్రాహ్మణ బాలునికి ౫ వ, క్షత్రియ బాలకునికి ౬ వ, వైశ్యబాలునకు ౮వ సంవత్సరమున యజ్ఞోపవీత మొనరింపదగునని వ్రాయబడియున్నది. ఇదిగాక వసంత ఋతువున బ్రాహ్మణ బాలకునికి, గ్రీష్మ ఋతువున క్షత్రియ బాలకునకు, శరదృతువున వైశ్యబాలునకు ఉపనయన సంస్కారము చేయవలెనను కాల నిర్ణయము కలదు, కాని ఇయ్యది పాటింపబడుటలేదు. తల్లిదండ్రులు యోగ్యుడైన గురువుదగ్గర ఆశ్రమమున బాలుని జేర్చుదురు. ఆచార్యుడు దేవఋణము, పితృ ఋణము, ఋషి ఋణమునుండి విముక్తుడగుటకు యజ్ఞోపవీతము ధరింపజేసి అన్ని విధముల విద్యా శిక్షలుగలుగ జేయుటకు ప్రయత్నించును. ఈ సందర్భమున విద్యార్థి కొన్ని నియమముల పాలించుటకు ప్రతిజ్ఞచేయును. అనగా నేను రాత్రియందే శయనింతును. నిత్యము వేదాధ్యయనము చేయుదును సమిధలుతెచ్చి ప్రతిదినము హవనము చేయుదును. భిక్షదెచ్చి జీవనము గడపుదును ఇత్యాదులు.

## వేదారంభము (౧౧)

ఈ సంస్కారము ఉపనయన దినముననో లేదా దానికి పిమ్మట సంవత్సరము లోపలనో గురుకులాశ్రమమున వేదాధ్యయన మారంభింపబడును. అప్పుడు విద్యార్థి సాంగో పాంగముగ వేదము జదువుటకు వ్రతము స్వీకరించును. ఆచార్యుడు గాయత్రిమంత్రమునుండి వేదాధ్యయనము నారంభించును. దాని అర్థమును, మహిమను బోధించును. విద్యార్థి గాయత్రీ మంత్రోపదేశముబొంది అనంత జ్ఞాన విజ్ఞానముల కల్పన జేయును. ఈ యనంత విశ్వముతో దనకు సంబంధముకలదని గ్రహించును. అట్లే విశ్వమును రచియించిన పరమేశ్వరుడే ఆరాధ్యుడని, అతని ఈయద్భుతశక్తిని గమనించి నతమస్తకుడగును, జీవిత కాలమంత నజ్ఞాన విజ్ఞానముల వర్ధిల్లజేయును నతనిని దెలిసి కొనుటకు బ్రయత్నించు చుండును.

## సమావర్తనము (౧౨)

బ్రహ్మచర్య పూర్వకముగ వేదాదిశాస్త్రముల నభ్యసించి గురుకులమును విడచి గృహస్థాశ్రమమున ప్రవేశించుటకుగాను ఈ సంస్కారమొనర్పబడును. ౨౫ సంవత్సరముల ప్రాయమువరకు కనిష్ఠ బ్రహ్మచర్యమును పాలించి గురువు ఆజ్ఞనుబొంది ఇంటికేతెంచునపుడు ఆచార్యుడు స్నాతకునకు సద్గృహస్థుడగుటకు దగిన ఉపదేశముచేయును ఆకాలమందు అనగా వేదకాలమందు స్నాతకులధిక గౌరవమును బొందుచుండిరి, వారిని గృహస్థులుగూడ మధుపర్కాదులతో సత్కరించుచుండిరి. ఇకనట్లే దేశ దేశాంతరములకు వెళ్లి అచ్చటి వాతావరణమును, ఆచార వ్యవహారములను, భౌతిక పదార్థములను దెలిసికొని లాభము బొందుటకు, వివాహమునకు గొంతపూర్వమే రాజాది పురుషులు స్నాతకులకు మార్గవ్యయము లిచ్చుచున్నట్లు విదితమగుచున్నది. అధ్యయన కాలమునందతికఠోరముగ నుండుటయేగాక వతిని తల వెంట్రుకలు, నఖములు మున్నగునవి పెరిగి యుండును. సమావర్తన సమయమందు యజ్ఞానంతరము విధిపూర్వకముగ క్షౌరమును సుగంధిత శుద్ధజలముతో స్నానమునుచేయించి అత్తరుపెట్టి వస్త్రాలంకారముచేసి పుష్పమాలికాదులను ధరింపజేసి స్నాతకోపాధిచే వతని విభూషిత మొనర్చుదురు. ఇప్పుడు విశ్వవిద్యాలయములందును "కన్వొకేషన్" అను సమావర్తనము వలెనే యొక విధముగ జరుపబడు చున్నది. కాని అంతటి ఆదర్శప్రాయ మెంతమాత్రము కాదు.

## వివాహము (౧౩)

ఉత్తమ, మధ్యమ, కనిష్ఠములని బ్రహ్మచర్య కాలములు నిర్ధారితములై యున్నవి. కనిష్ఠపక్షమందు ౨౫ ఏండ్ల ప్రాయముగల పురుషున కుమారి ౧౬ ఏండ్ల ప్రాయముగల స్త్రీకిని వివాహము జరుగును. జీవన మందన్ని సంస్కారములకంటె దీనికి విశేష మహత్త్వముకలదు. ఎందుకనగా నిది అన్ని సంస్కారములకంటే గొప్ప సమారోహముతో నొనరింపబడును, తరుచుగ నిది కన్యాదాత గృహమందే సంపన్నమగును.

వరుడు విద్వాంసుల జనకాది బంధుమిత్రుల యుక్తముగ గొప్ప సమారోహముతో కన్యాదాత గృహమునకు విచ్చేయునపుడు కన్య తండ్రి అర్ఘ్యపాద ఆచమనాది మధుపర్క విధి గావించి వరుని సత్కరించును కన్యాదానముచేయును. పిమ్మట యజ్ఞమండపమున వధూవరులను గూర్చుండబెట్టి విధ్యుక్తముగ యజ్ఞ మొనర్పబడును, మన్వాది ధర్మశాస్త్రములందు అష్టవిధ వివాహములు క్లేశింపబడినవి. బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, గాంధర్వ ఆసుర, రాక్షస, పైశాచికములని ప్రసిద్ధములు, మొదటి నాల్గు మాన్యములును, ప్రచలిత ములునై యున్నవి.

గాంధర్వ వివాహమును విశేషముగ వాడుకకు రాగల్గినది. బ్రాహ్మ వివాహ మత్యంత ఆదర్శప్రాయమన నొప్పును. కన్య తండ్రి స్వయంవర రూపేణ కన్యను యోగ్యుడైన వరున కర్పించును. యజ్ఞముచేయు విద్వాంసునకు కన్యనిచ్చుట దైవమనబడును. గోదానపూర్వకముగ వనవాసులగు ఋషులకు కన్యనిచ్చుట ఆర్షమనబడును. ప్రాజాపత్యమనునది సంతానోత్పత్తి నుద్దేశించి సాధారణముగను సామాన్య పురుషులందు విశేషముగను ప్రచలితమైయున్నది. ఇందు వధూవరులకు గృహస్థాశ్రమ శిక్ష యొసంగబడును. గాంధర్వమనునది యొక విధముగ స్వయంవర వివాహమనగును. ఎందుకనగా నిందు వధూవరుల పరస్పర ప్రసన్నతాది ఇష్టమే ప్రధానమై యుండును. శకుంతల యొక్క వివాహము దుష్యంతునితో నిట్లే జరిగినది. అసురము కన్యతండ్రికి శక్త్యనుసారము ధనమునిచ్చి కన్యను గ్రహించుటయని యెరుగవలెను. క్షత్రియాది యువకులు కన్యలను అపహరించి వారిని వివాహమాడిన నది రాక్షస వివాహ మనగును. బలాత్కారముగ మైమరచియున్న కన్యతో సంపర్క మొనర్చుట నీచాతి నీచమైన పైశాచిక వివాహ మనబడును.

వైదిక జీవనమందు వివాహబంధన మొక దైవవిధానమనబడును. అయ్యది నేటి పశ్చిమదేశములందును ప్రచలితమై యున్నది. లేదా నేటి సభ్యత ననుసరించి జీవన మందొకతోటి సహాయిగ భావింపబడు చున్నది. కాని వైదిక దృష్ట్యా కేవలము భోగవిలాసముకొఱకు వివాహము కాదని యెరుగవలెను. వివాహమొక సర్వశ్రేష్ఠమైన సంస్కారము. ఎందుకన జీవన మందలి సమస్త సంస్కారములిందే కేంద్రీకరింపబడియున్న వన నొప్పును.

## వానప్రస్థము (౧౪)

గృహస్థుడు ఏబదేండ్ల ప్రాయము గల వాడగునపుడు గాని లేదా తన పుత్రునకు బుత్రుడు పుట్టిన పిమ్మటగాని ఈ సంస్కార మొనర్పబడును. తదనంతర మతడు భార్యయుక్తముగనో, ఏకాకిగానో వనమునకు వెళ్లి తన విద్యను, అనుభవమును ఇతర బ్రహ్మచారులకు బోధించుచు, స్వాధ్యాయమును యోగాభ్యాసాదులను జేయుచు కాలము గడపదగును.

## సంన్యాసము (౧౫)

ఇంచుమించుగ ౨౫ ఏండ్లు వానప్రస్థాశ్రమ కాలము గడపి, ఇంద్రియములను వశపరచుకొని, శోక మోహాదులను తొలగించి, శిఖా సూత్రముల త్యజించి యజ్ఞాది క్రియలొనర్చి సంన్యాసి కాదగును. ఇకనతడు పరోపకారార్థము వేదజ్ఞాన ప్రచారమును, సత్యోపదేశమును జేయుచు ఈశ్వర చింతనమున మగ్నుడై ముక్తిని బడయుటకు ప్రయత్నించుచుండవలెను.

## అన్త్యేష్టి (౧౬)

మరణించినపుడు ఈ యంతిమ సంస్కారమొనర్పబడును. స్నానము జేయించి శవమును శ్మశానమునకు గొనిపోయి చందనాది సమిధలలో బెట్టి వేద మంత్రముల ద్వారా ఘృతాహుతు లొనర్చుచు భస్మము చేయవలెను.

జీవితాంతము వరకు నీ సంస్కారముల మహత్వమెంతేని కలదనవొప్పును.

### ఆశ్రమములు

వేదకాలమున భారత వాసులు దీర్ఘకాల జీవనము గడపగల్గుచుండిరి. వేదోక్తముగ మానవ జీవితమును చతురాశ్రమములందు విభజింపబడి యున్నది. ఆశ్రమమున క్రమ పూర్వకముగ నా యా ఆశ్రమ నియమముల పాలించుట యునగును. వీని వ్యాఖ్య వైదిక సాహిత్యమున విశేషముగ వ్రాయఁబడియున్నది. ఉపనయనానంతరము ఆచార్యకులమున బ్రహ్మచారి ప్రవిష్టుడగును. కనిష్ఠ పక్షమందు ౨౫ ఏండ్ల వరకే బ్రహ్మచర్యా శ్రమమున జీవనము గడపవలసియుండును. ఆచార్యుడు బ్రహ్మచారికి వేదాది శాస్త్రముల నభ్యసింపజేయుచు ఇహపర సంబంధ ధర్మ నియమములను బోధించును. ఋణ త్రయము నుండి అనగా దేవ ఋణము, పితృ ఋణము, ఋషి ఋణముల నుండి విముక్తుడగుటకే నీ కీ మూడు పోగులు గల యజ్ఞోపవీతము ధరింపబడినదనియు హెచ్చరించును. కన్యకలు గూడ బ్రహ్మచర్యాశ్రమ నియమములను పాలించుచు కనిష్ఠ పక్షమున ౧౬ ఏండ్ల వరకు విద్యాశిక్షల బొందుచుండిరి. వారి గురుకులములు గూడ వేర్వేరుగ నేర్పరుపబడి యుండెడివి. వారికి విద్యాశిక్షలతో బాటుగ సంగీతము, నృత్యము, గణితము, హస్తక్రియాది లలిత కళలు నేర్పబడుచుండినట్లు విదితమగుచున్నది. ఈ గురుకులములు నగరమునకు గొంత దూరమున నుండెడివి. భరద్వాజాశ్రమము, తక్షశిల, మున్నగునవి విద్యా కేంద్రములుగ ప్రసిద్ధములై యుండెడివి. ఇదిగాక శౌనకాశ్రమము, వసిష్ఠాశ్రమము, కాశీ మున్నగునవియు విద్యాపీఠములుండెను. కురుక్షేత్ర సమీపమున కన్యలకు ఉన్నత విద్యాశిక్షల బోధించుటకు కన్యా గురుకులముండినట్లు కూడ తెలియుచున్నది. వేదములతో బాటుగ బ్రహ్మచారులయు, బ్రహ్మచారిణులయు అభిరుచిని జూచి వ్యాకరణ నిరుక్త ఛందస్సులు జ్యోతిషము, న్యాయ, వైశేషిక, యోగ సాంఖ్య వేదాన్తాదులు గూడ నేర్పబడుచుండెను. మానవుని జీవితమున నత్యావశ్యకములైన విషయముల జ్ఞానము కలుగజేయుచుండిరి. ఈ బ్రహ్మచర్యాశ్రమము నందరును తపస్వీ జీవనము గడుపుచు నిరభిమానులై యుండెడి వారనక తప్పదు. ఇందు బాలబాలికలు బ్రహ్మ యజ్ఞము, దేవ యజ్ఞము అను నీ రెంటిని నిత్యము చేయుచుండెడి వారని యెరుగవలెను.

### గృహస్థాశ్రమము

బ్రహ్మచర్య కాలము గడపి సమావర్తన సంస్కారానంతరము స్త్రీ పురుషులు పరస్పర మొకరినొకరు ఇష్టపడి విధ్యుక్తముగ ఆవసథ్యా ధానము అగ్నిని స్థాపించి యజ్ఞము చేసి ఆజన్మము గృహస్థ ధర్మమును పాలింతుమని విద్వాంసులు మొదలుగా గల సభను లందరి యెదుట ప్రతిజ్ఞ జేసి గృహస్థులగుదురు. గృహస్థులై ప్రతి దినము పంచ మహా యజ్ఞములను అనగా బ్రహ్మ యజ్ఞము, దేవ యజ్ఞము, బలివైశ్వదేవము, పితృ యజ్ఞము, అతిథి యజ్ఞములను చేయవలసియుండును. అందులకే మనుస్మృతి యందు-

> యస్మాత్త్రయో ఽప్యాశ్రమిణో జ్ఞానే నాన్నేన చాన్వహమ్
> గృహస్థే నైవ ధార్యన్తే తస్మా జ్జ్యేష్ఠాశ్రమో గృహీ

అనగా గృహస్థుడు ప్రతి దినము జ్ఞానము చేతను, అన్నాదుల చేతను బ్రహ్మచారులను, వానప్రస్థులను, సంన్యాసులను అను నీ మూడాశ్రమ వాసులను పోషించును, గాన గృహస్థాశ్రమము జ్యేష్ఠాశ్రమమని చెప్పబడినది.

ఈ పంచ యజ్ఞములందలి వైశ్వదేవాది యజ్ఞములకు బిమ్మట మిగిలిన అన్నము అమృతమని జెప్పబడినది. దీని వలన వైదిక జీవనమెంత మహత్వము గలదనుట సహజముగ బోధపడగలదు.

### వానప్రస్థాశ్రమము

సాధారణముగ గృహస్థుని పుత్రునకు పుత్రుడు కలిగినప్పుడు కుటుంబ భారమంత తన పుత్రుని స్వాధీనము చేసి, వానప్రస్థుడు కాదగును. వానప్రస్థుడు ప్రతి దినము పంచ మహా యజ్ఞములను, స్వాధ్యాయమును, యోగాభ్యాసమును జేయుచు సామాన్యమైన తపస్వీ జీవనము గడుపవలసియుండును. తపస్విని మండగోరినచో తన భార్య గూడ తనతో బాటుగ నుండగల్గును. విశేషముగ వానప్రస్థి కంద మూల ఫలములను సేవించుచుండుట శ్రేయస్కరమని భావించును, పక్వమైన అన్నమునంతగ సేవించకుండనుండును. తనకు గలిగిన జ్ఞానమును, అనుభవమును బ్రహ్మచారులను బోధించవలసియుండును. ప్రాకృతిక పదార్థముల నుండియే రోగాదులను తొలగించుకొననగును. గంభీరమై గూఢమైయున్న విషయములను ఋషుల నుండి తెలిసికొనుచు, వాని ఫలమును బొందుటకు యోగాభ్యాసము చేయుచుండవలెనని తెలియుచున్నది.

## సంన్యాసాశ్రమము

వైదిక జీవనమందలి అంతిమ ధ్యేయము మోక్షమై యున్నది. దీని బొందుటకే చతురాశ్రమములు మెట్లుగా నున్నవి. సంన్యాసి నిరాటంకముగ వేద ధర్మ ప్రచారము జేయుచు సంచరించుచుండును. వానప్రస్థాశ్రమమునకు పిమ్మట సంన్యాసి కాదగునని విధానము కలదు. కాని ఎందరో బ్రహ్మచర్యము నుండియే సంన్యాసులైనట్లు తెలియుచున్నది. సంన్యాసమును గ్రహించుటకు పూర్వము తాను కలిగి యున్న సంపదాది సర్వస్వమును దానము చేయును. కాన పూర్ణ వైరాగ్యమును బొంది కేవల దండకమండలములను, కటివస్త్రమును గుడ్డను మాత్రము ధరించును. దినమందొక పర్యాయము గృహస్థుల ఇండ్లకు భోజనార్థము వచ్చును. కాని అతడుగడు గృహస్థులే అతనిగొనిపోయి అన్నాదుల సమర్పింతురు. సంన్యాసి గృహస్థులకు సత్యమైన వేద ధర్మమును బోధించుచుండును. బ్రహ్మచర్యాశ్రమమున ధర్మమును, గృహస్థాశ్రమమున ధర్మానుకూల అర్థమును, వానప్రస్థాశ్రమమున ధర్మార్థ కామములను, ఈ సంన్యాసాశ్రమమున మోక్షమును సాధించగల్గును. కావ ధర్మార్థ కామ మోక్షముల సంబంధమీ చతురాశ్రమములతో సూటిగా గలదని యెరుగవలెను. వేదమున-

"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః" చెప్పబడినట్లునూ, మానవుడు శుభకర్మ లొనర్చుచు శత వర్షముల వరకు జీవించునట్లు ఇచ్ఛగింపవలెనని చెప్పబడినది. అయ్యది ఈ చతురాశ్రమముల పాలించుట చేతనే శత వర్షముల వరకు జీవించుచు, ముక్తిని గూడ బొందగలుగుననుట గ్రాహ్యము. మనుష్య జీవనమప్పుడే సార్థకమగును.

## వర్ణ వ్యవస్థ

కేవలము గృహస్థుల యందే ఈ వైదిక వర్ణ వ్యవస్థ నాలుగు విధములుగా విభజింపబడినది. సమాజ కార్యములన్ని సుచారు రూపమున నెరవేరుటకే యీ విభాగము ఏర్పడియున్నదన నొప్పును. ఏ దేశమందైనను కార్యరూపమున నీ విభాగముండియే యున్నది. నామాంతరము మాత్రము కలదు. కాలాంతరమందు జాతులని, ఉప జాతులని అవైదిక సాహిత్యమందు ఉల్లేఖింపబడి యుండుట గోచరమగుచున్నది. వైదిక సాహిత్యమున ఆచారాది భేదము నుండి ఆర్యులని దస్యులని మాత్రము వ్రాయబడియున్నది. ఆ వేదకాలపు ఆర్యులలో నాలుగు వర్ణముల విభాగము జన్మతః గాక గుణ కర్మ స్వభావములతో గలదిగా వర్ణింపబడియున్నది. కావ నెవని కే కర్మక్షేత్ర మభీష్టమై యుండునో తదనుకూలముగ వర్తించుటకు ప్రతి వానికి స్వాతంత్ర్యము కలిగి యుండెడిది. ఎట్లనగా వేదముల జదివి చదివించుటకును, యజ్ఞముల జేసి జేయించుటకును, దానమిచ్చుటకును, పుచ్చుకొనుటకును యోగ్యుడగు నతడు జ్ఞాన కర్మాది ప్రాధాన్యతను బట్టి బ్రాహ్మణుడుగను, వేదాధ్యయనము, యజ్ఞము, దానము, యుద్ధము, శరణాగతుని రక్షణము మున్నగు కర్మలొనర్పగల యోగ్యుడు శక్తి ప్రాధాన్యతను బట్టి క్షత్రియుడగను, వేదాధ్యయనము, యజ్ఞము, వ్యాపారము, కృషి, వడ్డీ పుచ్చుకొనుట, గవాది పశువుల రక్షణము, దానము జేయుట మున్నగు కర్మలొనర్పగల యోగ్యుడు దాన ప్రాధాన్యతను బట్టి వైశ్యుడుగను, అట్లే ఉపర్యుక్త వర్ణస్థుల కార్యములు చక్కగ నెరవేరుటకు సహాయము చేయునతడు సేవా ప్రాధాన్యతను బట్టి శూద్రుడుగను గణింపబడు చుండిరని విశదమగుచున్నది. ఇందు పెద్ద చిన్న భేదము లేకుండనెట్లు శరీరమందు ముఖము, బాహువులు, కాళ్లు, పాదములు గలవో అట్లే వైదిక మానవ సమాజమందు ముఖము వంటి వారు బ్రాహ్మణులు, బాహువుల వంటి వారు క్షత్రియులు, తొడల వంటి వారు వైశ్యులు, పాదముల వంటి వారు శూద్రులు అని యెరుగవలెను.

ఈ వైదిక వర్ణ వ్యవస్థ యందు గమనింపదగిన విశేషములు రెండు.

౧. వైదిక సామ్యవాదమనబడు సమత్వ భావమును నొకటి.

౨. వర్ణముల వర్గీకరణము జన్మము నుండిగాక గుణ కర్మాదుల నుండి యనునది రెండవది.

ఎందుకనగా వేదములందనేక స్థానములందు అజ్యేష్ఠ - అకనిష్ఠ అని ఉపదేశింపబడినది. అనగానొకడు జన్మ నుండి పెద్ద అనిగాని, చిన్న అనిగాని కాదనుట గ్రాహ్యము. ఇదియే సంఘీ భావమును సుస్థిరముగ నుంచగల్గును. ఎప్పటి నుండి వేద విముఖులై వ్యర్థముగ చిన్న పెద్ద అను భేదమును కలుగజేసిరో అప్పటి నుండియే సంఘీ భావ మంతరించిన దనక తప్పదు. ఏ వర్ణస్థుడైనను చిన్న పెద్ద అనక తమ తమ కర్తవ్యముల పాలించుచుండునో సమత్వము సహజముగ స్థిరపడగల్గుననుట కొంత మాత్రము సందేహము లేదు. కావ పశ్చిమాది దేశములందు ప్రచలితములైన భౌతిక వాదము, సామ్యవాదము సంపత్తివాదము మొదలుగా గల సమస్త వాదములు వైదిక వర్ణాశ్రమములందు అభిన్నముగ సమావేశము కాగలవు. చదువరులు వీని ఉపయోగమును దెలిసికొని వాని సమాజమున ప్రచలింపజేసిన నెంతయో మేలు చేకూరుటయే గాక ధర్మార్థ కామ మోక్షములు చేకూరగలవని హెచ్చరించుచు విరమించుచున్నాను. శమిత్యోమ్-

# వైదిక వాఙ్మయం

చరిత్రకందని కాలంలో దివ్యజ్ఞానసంపన్నులు, దయాళువులైన మహర్షులు మనకందించిన వాఙ్మయం వేదవాఙ్మయం. మహా మహిమాన్వితులైన ఆ మహర్షుల ద్వారా భగవంతుడు విష్కరించిన నిత్యసత్యాలే వేదాలు. వేదమనే పునాదిపైనే కాలం గడిచేకొద్దీ ఎన్నో ధర్మశాస్త్రాలు వెలిసినాయి. కనుకనే సమస్త సాహిత్యానికీ, ధర్మానికీ, సంస్కృతికీ వేదం మూలాధారమని భారతీయుల విశ్వాసం.

**వేదసంహితలు :** ఋక్సంహిత, శుక్లయజుస్సంహిత, సామసంహిత, అథర్వసంహిత అని మనకు నాలుగు వేదసంహితలున్నాయి. ఈ సంహితలనే మంత్రభాగమంటారు. కొందరు బ్రాహ్మణములను కూడా సంహితలనే చెబుతుంటారు. కాని సంహితా భాగం మాత్రమే వేదం. ప్రతిసంహితలోనూ కొన్ని శాఖలున్నాయి.

**బ్రాహ్మణాలు :** పై సంహితలకు గల ప్రతి శాఖకు బ్రాహ్మణ గ్రంథాలుండేవి. నశించి పోయిన శాఖలు నశించిపోగా మనకిప్పుడు కొన్ని బ్రాహ్మణాలు మాత్రమే దొరుకుతున్నాయి. మంత్రభాగవ్యాఖ్యాన రూపాలే బ్రాహ్మణాలు. ఇవి ఆయా యాగాలను విధిస్తూ వీటి స్వరూపాన్ని చక్కగా వివరిస్తున్నాయి. ఐతరేయబ్రాహ్మణం, తైత్తిరీయబ్రాహ్మణం శతపథబ్రాహ్మణం, షడ్వింశ బ్రాహ్మణం, గోపథ బ్రాహ్మణం మొ॥ బ్రాహ్మణాలు పై సంహితలకు సంబంధించినవి.

**అరణ్యకాలు :** బ్రాహ్మణ గ్రంథాల లాగానే గద్యపద్యమయమైనవి అరణ్యకాలు. ఇవి బ్రాహ్మణాలకు పరిశిష్టాలు. వానప్రస్థాశ్రమం స్వీకరించినవారు అరణ్యాలలో అధ్యయనం చేయడం వల్ల వీటికి అరణ్యకాలని పేరేర్పడింది. వీటిలో కర్మకాండయొక్క చరమదశ, బ్రహ్మకాండ ప్రారంభావస్థ మనకు కనబడుతుంది. బ్రహ్మకాండ అంటే వేదాంతం. అరణ్యకాలలో యజ్ఞయాగాలకు, ధర్మాచారాలకు సంబంధించిన ఎన్నో విశేషాలు వివరింపబడుతున్నాయి. ఐతరేయారణ్యకం, తైత్తిరీయారణ్యకం మొ॥ అరణ్యకాలు ప్రసిద్ధాలు.

**ఉపనిషత్తులు :** ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలు. ఇవి విద్యా వివేకాలచేత సంపాదించదగినవి. విద్యలు "పర" అని "అపర" అని రెండు విధాలు. నాలుగువేదాలు అపరవిద్య అని పిలువబడతాయి. వీటితో మొదటి మూడు పురుషార్థాలను సాధించుకోవచ్చు. కాని పరమపురుషార్థమైన మోక్షాన్ని అపరవిద్య సాధించలేదు. ఉపనిషత్తులలో చెప్పబడిన పరవిద్యద్వారానే అది సాధ్యం. ఉపనిషత్తులకే వేదాంతాలని పేరు. వీటి సంఖ్యను గురించి ఎన్నో వాదాలున్నాయి. నూట ఎనిమిది ప్రసిద్ధోపనిషత్తులలోను త్రిమతాచార్యులు ప్రమాణంగా స్వీకరించినవి ఈశాది ఉపనిషత్తులు పది మాత్రమే.

**వేదభాష్యాలు :** వేదార్థాన్ని తెలుసుకోకుండా కేవలం వల్లెవేయడం వల్ల పరిపూర్ణమైన ఫలం కలుగదు. మరి వేదార్థాన్ని ఎలా తెలుసుకోవాలి? యాస్కుడు వేదార్థపరిశీలనం చేస్తూ నిరుక్తాన్ని వ్రాశాడు. తరువాత స్కందస్వామి, వేంకటమాధవుడు, ఉద్గీథుడు మొదలైన వారు భాష్యాలు వ్రాశారు. సాయణాచార్యులు వేదసంహితల కన్నింటికీ ఇంకా కొన్ని బ్రాహ్మణాలకు ఆరణ్యకాలకు కూడ భాష్యాలను వ్రాసి వేదభాష్యకారపదాన్ని సార్థకం చేశారు. ఉవటుడు మహీధరుడు శుక్ల యజుస్సంహితకు భాష్యాలను వ్రాశారు. ౧౯ వ శతాబ్దంలో మహర్షి దయానందుడు ఋగ్వేదయజుర్వేదములకు భాష్యం వ్రాశాడు. దయానంద భాష్యార్థమే సరియైనది, ప్రామాణికమైనదని నేటి వైదిక విద్వాంసులు అంగీకరిస్తున్నారు.

**వేదాంగాలు :** వేదార్థాన్ని క్రమబద్ధంగా తెలుసుకోవడానికి ఆచరణలో పెట్టడానికి ఉపయోగించేవి వేదాంగాలు. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అని ఇవి ఆరు. వీటిలో కొన్ని వేదార్థాన్ని తెలుసుకోవడానికి ఉపయోగిస్తే, మిగతావి వేదం చేత ప్రతిపాదింపబడిన ధర్మాన్ని అనుష్ఠించడానికి సహాయ్యం చేస్తాయి.

**వేదాలలో ఏమున్నది?** వేదాలు విజ్ఞాననిధులు. ఆధ్యాత్మికంగా మహోన్నతస్థాయిని సాధించిన మహర్షులు ఆధిదైవిక - ఆధిభౌతిక విషయాలలో స్వయంసమృద్ధిని సాధించడంలో ఆశ్చర్యమేముంటుంది? భౌతిక విషయాలలో ఇప్పుడు కోట్లకొలది ధనవ్యయంతో ఎందరో వ్యక్తులు, ఎన్నో సంవత్సరాలు పరిశోధించి ఎలాగో అతికష్టంమీద కనుగొనగల్గిన విశేషాన్ని వారు యోగాభ్యాసంతో మానసిక ప్రణిధానంతో తేలికగా కనుక్కోగలిగారు. ఆత్మశక్తి తగ్గిపోయి బాహ్యప్రకృతి మీద ఆధారపడి మనం ఎన్నో ప్రయోగాలు చేసి విసిగి వేసారి చిట్టచివరకు ఎలాగో ప్రకృతి తత్త్వాన్ని కొంత తెలుసుకోగలుగుతున్నాం. కాని యోగాభ్యాసంతో, తపశ్శక్తితో ఆత్మశక్తిని బాగా పెంచుకున్నమహర్షులు ప్రకృతిమీద ఆధారపడకుండా భౌతికాభౌతికసత్యాలను అరచేతిలోని రేగుపండులాగా చూడగలిగారు. ఆ సత్యాలనే లోకానికి ఆవిష్కరించారు.

వేదాలలో కొన్ని సందర్భాలలో కనపడే అంశాలను బట్టి వారి విజ్ఞానాన్ని మనం చక్కగా తెలుసుకోవచ్చు. ఉదాహరణకు కొన్నింటిని మాత్రం ఇక్కడ పరిశీలిద్దాం. ఇలాంటివి

వేదసంహితలలో అడుగడుగునా ఎన్నో ఉన్నాయి. వాటిని ఉత్సాహవంతులు చదివి అర్థంచేసుకొని మన వెనుకటి తరాలవారి సంస్కృతిని విజ్ఞానాన్ని లోకకళ్యాణానికి ఉపయోగించాలి.

**ఆకాశయానం :** ఈనాడు విమానాలు సర్వసాధారణాలైనాయి. కాని ఆనాటి వారికి విమానయానం తెలియనిదికాదు. ఋగ్వేదంలో ప్రథమ మండలంలో ౧౧౬వ సూక్తంలో 3వ మంత్రంలో ఈ ప్రస్తావం కనబడుతుంది. ఆ విమానాన్ని అశ్వినీ దేవతలు నడిపారు. యంత్రాలతో అది నడిచింది. నీటిపైన నడిచే జలనౌక మాత్రం కాదది. అంతరిక్షమంతా తిరగగల సామర్థ్యం కలది. అంటే వారి విమానాలు జలంలోను భూపరిధిలోను అంతరిక్షంలోను స్వైరవిహారం చేసేశక్తిగలవని తెలుస్తున్నది. మనమింకా మూడుచోట్లా నడిచే శక్తిగల విమానాలను తయారుచేసుకోలేదు. యజుర్వేదంలోను (౧౯-౫౪, ౧౯-౪3) అథర్వవేదంలోను (౭-౬3-3) ఈ విమాన ప్రస్తావం ఉంది. ఈ విమానాలకు మూడు చక్రాలున్నట్లు ఋక్సంహిత చెబుతున్నది. (౧-౩౪-3).

**విద్యుద్విజ్ఞానం :** విద్యుత్తును ఉత్పత్తి చేయడం, దానిద్వారా ఎన్నో కార్యాలను సాధించడం మనమిప్పుడు చూస్తున్నాం. యజుర్వేదకాలం నాటికే విద్యుత్తును గురించిన స్పష్టమైన లక్షణాలను గుర్తించినట్లు తెలుస్తున్నది. యజుర్వేదంలో (౪. ౧౫-౧౯) సుమారు ఐదు మంత్రాలలో విద్యుత్ అగ్ని స్వరూపమని, దానికి రెండు తలలని, నాటితో అది వస్తూ పోతూ ఉంటుందని, రవ్వలరూపంలో ఆవిర్భవిస్తుందని చెప్పబడింది. ఋణ-ధనాత్మకమైన రెండు విద్యున్మార్గాలు రెండు తలలుగా చెప్పబడ్డాయి. ఇలాగే విద్యుత్తు స్వరూపానికి సంబంధించిన లక్షణాలు స్పష్టంగా ఈ వేదంలో వర్ణింపబడ్డాయి.

**ఓషధివిజ్ఞానం :** ఓషధులకుగల గుణగణాలను పరిశీలించి వాటిని తమ ఆరోగ్యాలను పొగొట్టుకోవడానికి ఉపయోగించడం ఆనాటి మహర్షులకు బాగా తెలుసు. ఈ ఓషధిలక్షణాలను యజుర్వేదం చక్కగా వివరిస్తున్నది. (౧౨-౧౦, ౧౨-౧౯; ౧౨-౯). అథర్వవేదంలోను మూలికలు వాటి ప్రయోగాలు మొదలినవిషయాలు చాలా విపులంగా చెప్పబడ్డాయి.

**ఆయుర్వేదం :** ఋగ్వేదానికి ఉపవేదం ఆయుర్వేదం. ఈ సంహితలో ఓషధి విజ్ఞానం వివరింపబడింది. అథర్వసంహితలో నాలుగోవంతు ఆయుర్విజ్ఞానాన్ని వివరించే మంత్రభాగమే కనబడుతుంది. ఈ సూక్తాలలో మానవుని శరీరంలోని ప్రతిచిన్న అవయవానికి సంబంధించిన విశేషాలు వేరువేరుగ చెప్పబడ్డాయి. శరీరానికి, మనస్సుకు ఏర్పడే అనారోగ్యాలు, ఇంకెన్నో భయంకరమైన వ్యాధులు, వాటి నివారణోపాయాలు వీటిలో వివరించబడ్డాయి. దీనిని బట్టి సూక్ష్మ దృష్టి, ప్రాపంచిక విషయాలపై ఉండవలసినంత శ్రద్ధ వారికి పుష్కలంగా ఉన్నదని తెలుస్తున్నది.

**గృహసూక్తం :** అథర్వవేదంలోని గృహసూక్తాన్ని పరిశీలిస్తే ఆనాటివారి జీవనాన్ని గురించి, వారి భావనలను గురించి మనకు, స్పష్టమౌతుంది. ఇవి వారి భావనలు. మా ఇండ్లు సత్య మధుర సంభాషణలుగలవై యుండాలి. మంచి సౌభాగ్యాలతో హాస ప్రమోదాలతో నిండి, ఆకలిదప్పులు లేకుండా, నిర్భయమైనవిగా ఉండాలి. పుష్కలమైన ధన ధాన్యాలతో, మిత్రులతో బంధువులతో, సంతోషాన్ని పెంచుతూ కళకళలాడుతూ ఉండాలి. మాకుటుంబసభ్యులందరూ ఆరోగ్యంగా ఉండాలి. మా ఇండ్లలో ఆహారపదార్థాలు, పాలు నెయ్యిలా కొరత లేకుండా ఉండాలి. ఇలా లక్ష్మీతాండవంచేసే గృహసంపదగల సమాజాన్ని లోక కళ్యాణాన్ని వారాశించారు. అందుకోసం ధర్మబద్ధంగా ప్రయత్నం చేశారు. తమను తీర్చిదిద్దుకున్నారు. మన సమాజం కూడా అలా ఉంటే ఎంత బాగుంటుంది ?

**స్త్రీ పురుషసమానాధికారం :** స్త్రీ పురుషులలో ఒకరు హెచ్చు ఒకరు తక్కువ అనే భావం వారిలో లేదు. స్త్రీ సహకారం లేని పురుషుని జీవితం ఏ ప్రయోజనాన్నీ సాధించలేదు. పురుషసాహచర్యం లేని స్త్రీ జీవితం గౌరవాస్పదం కాదు. కనుక ఇద్దరూ కలసి, మంచి సంతానాన్ని కని సత్య ధర్మప్రేమలను తమ సంతానాని కందించాలి. అప్పుడే ఈ సమాజంలో శాంతి వెల్లివిరుస్తుంది. వేదాలన్నింటిలోను వివాహానికి సంబంధించిన మంత్రభాగాలలో ఈ విషయం స్పష్టం చేయబడింది. ప్రతికుటుంబంలోనూ స్త్రీ మకుటంలేని మహారాణి. ఆ వంశప్రతిష్ఠ ఆమె మీదనే ఆధారపడి ఉంది. మరి ఆమెకు 'పతి' ప్రత్యక్షదైవం. వారిద్దరి గృహస్థజీవితం ఈ సమాజానికొక ఆదర్శం. ఇలాంటి భావనలే మనకు వేదాలలో కనబడతాయి.

**సమసమాజభావన :** వేదాలన్నింటిలోనూ ఈ విశ్వమంతా ఒకే ఒక కుటుంబమనే భావన స్పష్టంగా కనబడుతోంది. ఇప్పుడు మనం చూసే జాతి వర్ణ విభేదాలు లేని సమాజం అది. తోటి సభ్యుల్ని ప్రేమించడం, సహృదయంతో అతణ్ణి అర్థంచేసుకోవడం వారికి సహజలక్షణం. తండ్రిమాట వినే కొడుకు, పిల్లల మంచి గురించి ఆలోచించే తల్లి, ప్రియంగా, హితంగా, శాంతంగా భర్తతో మాట్లాడే భార్య, పరస్పరం ప్రేమతో ఉండే తోబుట్టువులు ఉండాలనే వారి భావనలో సమాజాన్ని వారెంత చక్కగా తీర్చి దిద్దుకున్నారనే విషయం తెలుస్తుంది.

సమాజంలో ఎన్ని తేడాలున్నా హెచ్చు తగ్గులు మాత్రం ఉండకూడదు. అందఱం సోదరులమై కలిసిమెలిసి ఉండాలి. సామూహిక క్షేమాన్ని అభిలషించి కలిసిమెలిసి ఏపనినైనా చేయాలి. ఒకరి హృదయం ఒకరు బాగా అర్థంచేసుకోవాలి. ఈ సమాజం పరమేశ్వరస్వరూపం. అందఱం ఆయన అవయవాలమే. ఇందులో ఎవరూ పెద్దవారూ కారు, చిన్నవారూ కారు. అంతా సమానమే అనే భావన వారిలో దృఢంగా ఉండేది.

• **జాతీయ భావన :** చుట్టూ ఒకగిరిగీసుకుని ఇది నాది, అది నీది, ఈజిల్లా నాది, ఈరాష్ట్రం నీది, నాది ఈదేశం, నీది ఆ దేశం, నాది ఈ మతం, నీది ఆ మతం అనుకోవడం నేటి మానవుడికి పుట్టుకతోనే వస్తుంది. కానీ ఆ నాడు మానవజాతి అంతా ఒక కుటుంబం, ఈ భూమి నాతల్లి, మేమంతా ఆమె పిల్లలం అనే విశ్వకుటుంబభావన ఉండేది. సంకుచిత ఈర్ష్యాలను బాగా గర్హించిన కాలమది. ప్రేమతో అందరిని తన వారుగా చేసుకొన్న సమాజమది. వారేంచేసినా మానవజాతి కంతటికి క్షేమంకలగాలనే చేశారు. అంతేకాని హద్దులు పెట్టుకొని, పక్షపాతంతో దేశాన్ని, సమాజాన్ని ముక్కలు చేసుకొనే ఆలోచనలు వారిలో లేవు. ఇలా వేదాలలోను, వైదికసంస్కృతిలోను జాతీయ భావన పదే పదే కనిపిస్తుంది.

**వేదములో మానవుని పూర్ణాయుష్యం ఎంత?** వేదాలలో మానవుడు పరిపూర్ణాయుష్యాన్ని పొందడాన్ని గురించి చెప్పబడింది. నూరు సంవత్సరాలు మానవునికి పూర్ణాయుష్షని చెబుతారు. అది సర్వసాధారణం కాని మానవుడు అంతకంటె ఎక్కువకాలం బ్రతకవచ్చునని, అది అతని జీవన విధానంపై ఆధారపడి ఉంటుందని పూర్ణాయుష్యగరిష్ఠపరిమితి వెయ్యిసంవత్సరాలని వేదం చెబుతున్నది. (య 3-62)

జఠరాగ్నిని జాగ్రత్తగా కాపాడుకున్నవాడు 300 సం॥ జీవించవచ్చు. జ్ఞానేంద్రియనిగ్రహాన్ని సంపాదించి ధ్యానంతో మంచిదృష్టిని పొందినవాడు ఇంకొక మూడువందల సంవత్సరాలు జీవించవచ్చు. యోగాభ్యాసంతో యమ - నియమాదులను బాగా అభ్యసించి ఆచరించేవాడు ఇంకో మూడు వందల సంవత్సరాలు జీవించవచ్చు. మొత్తం తొమ్మిది వందల సంవత్సరాలు. సామాన్యమైన ఆయుష్యం నూరు సంవత్సరాలు కలిస్తే మొత్తం వెయ్యిసంవత్సరాలు అవుతుంది. బ్రహ్మచర్యాన్ని బాగా కాపాడుకొన్న ఊర్ధ్వ రేతస్కునికి ఇది సులభం. కనుకనే భవిష్యజ్జీవితానికి ఆధారభూతమైన బ్రహ్మచర్యాశ్రమంలో విద్యావివేకాలు పొందినవాడు మిగతా జీవితాన్ని చక్కగా నడుపుకోగలడని వారు ప్రథమాశ్రమంగా బ్రహ్మచర్యాన్ని ఏర్పాటుచేశారు. ఆ వ్యవస్థను పోగొట్టుకొని ఈనాడు అల్పాయుష్కుడై పోయినాడు మానవుడు. కొంతలో కొంతైనా ఆయుష్యాన్ని పొందగోరేవాడు వేదోపదేశాన్ని తప్పక అనుసరించాలి.

**జ్ఞానోపదేశానికి ప్రతివాడు అర్హుడేనా?** సమాజంలో ప్రతివాడికి విద్య, రాష్ట్రం, సంస్కృతి అనే మూడు శక్తులు కావాలి. వాటిని పటిష్ఠం చేసుకోకపోతే మనుగడే సాగదు. కనుక ప్రతివాడు ఈ మూడింటిని బాగా పెంచుకోవాలని వేదం ఉపదేశిస్తున్నది (య 20-43). కనుక జ్ఞానాన్ని సంపాదించడానికి ప్రతివాడికీ అర్హత ఉంది. అలాగే కళ్యాణ ప్రదమైన ఈ వాక్కును సమాజంలో అందరికీ చెబుతున్నా నని వేదమే ప్రతిపాదిస్తున్నది. (య 26-2). కాబట్టి వీరు వారు అనే తేడాలు లేకుండా వేదవిజ్ఞానాన్ని సంపాదించడానికి ప్రతివానికి అర్హత ఉన్నది.

**ధర్మానికి మూలం వేదమే !** లోకంలో ప్రతివాడు ఇష్టాన్ని పొందాలని, అయిష్టాన్ని పొందకుండా ఉండాలని ప్రయత్నిస్తూఉంటాడు. పురుషునిచేత కోరబడేది పురుషార్థం. ధర్మం, అర్థం, కామం, మోక్షమనే నాలుగు పురుషార్థాల్లో మొదటి మూడింటికి వేదం సాక్షాత్కారణమౌతూ, మోక్షమనే నాల్గవ పురుషార్థానికి కర్మానుష్ఠానంవల్ల గలిగిన చిత్తనైర్మల్య - ప్రసాద-వైరాగ్యాలద్వారా పరంపరగా కారణమౌతున్నది. యజ్ఞయాగాదులే ధర్మాలు. వాటి అనుష్ఠానంవల్ల అర్థ కామాలు సిద్ధిస్తాయి. ధర్మానికి మూలభూతమై, ధర్మప్రతిపాదకంకావడం వల్లనే వేదం గొప్ప ధర్మంగా పేర్కొనబడింది(**వేద ఏవ పరో ధర్మః**).

సమాజం ఎందుకు ఇన్నిరకాల బాధలకు గురౌతున్నది? మనశ్శాంతి మానవునకు ఎందుకు కరువౌతున్నది? లోకానికి మంచికలిగే పనులు ఎవరూ చేయకపోవడంవల్ల. అధార్మిక మార్గాలకు లొంగిపోవడంవల్ల. ధర్మబద్ధమైన ఆలోచనలకు కూడా కరువు రావడంవల్ల. పరార్థభావన అంతరించి స్వార్థభావన విలయతాండవం చేయడంవల్ల. మరి ఈ వ్యామోహం నుంచి బయటపడి మంచి మార్గంలో ప్రవేశించడానికి ఏమిటి మార్గం? మళ్ళా యజ్ఞభావన సమాజంలో పునరుజ్జీవించాలి. యజ్ఞమంటే ఏదో కాదు; త్యాగం. దాన్ని సమాజంలో కలిగించగలిగింది వేదం ఒక్కటే. అందుకనే ధర్మానికి మూలం వేదమే అవడం ఎంతో సముచితం. భారతీయ సంస్కృతి, తత్త్వం అన్నీ వేదం మీదనే ఆధారపడి ఉన్నాయి.

**భారతీయసంస్కృతిలో వేదాలస్థానం :** ఇతరదేశాల్లో సాంస్కృతిక చైతన్యం మొగ్గతొడగడానికి ఎంతో కాలం ముందే భారతీయులు సాంస్కృతికంగా మహోన్నత ప్రమాణాలందుకున్నారు. ఇంతటి సముజ్జ్వలమైన సంస్కృతి, ప్రశంసాయోగ్యమైన సభ్యత వీరికెలా సంక్రమించాయి? వీరి జీవనవిధానం త్రికరణశుద్ధి కలిగిందిగావడంవల్ల. తమ జీవితాన్ని ఒక యజ్ఞంగా వీరు భావించడంవల్ల. ధర్మానికి విరుద్ధంగాని అర్థ కామాలను వీరు సేవించడంవల్ల. జాతకర్మ - నామకరణాలనుంచి అంత్యేష్టివరకు భారతీయులకు వేదాలే పరమప్రమాణాలు.

వేదోపదేశమనే ధర్మక్షేత్రంనుంచి ఏర్పడిన మీగడలాంటిది భారతీయ సంస్కృతి. కనుకనే వేదవాఙ్మయం లేకపోతే భారతీయసంస్కృతి నిరాశ్రయమనే భావం ప్రపంచమంతట వ్యాపించి ఉంది.

భారతీయ జీవనంలో సంస్కృతిలో వేదాలకు అత్యున్నతమైన స్థానం ఉంది. అదొక దివ్యవాణి అని, నిత్యమైన శబ్దరాశి అని, భూతభవిష్యద్వర్తమానకాలాలకు నమాడింటికి సంబంధించిందని భారతీయుల దృఢతరవిశ్వాసం.

**ఎన్ని వేదశాఖలు నశించాయి ?** ప్రతివేదంలోనూ మనకు దొరుకుతున్న శాఖలు చాలా తక్కువ. నశించిపోయిన శాఖల సంఖ్య చాలా ఎక్కువ. ౨౧ ప్రధాన శాఖలున్నట్లు ప్రసిద్ధిగాంచిన ఋగ్వేదానికి ఇప్పుడు దొరుకుతున్న శాఖలు కేవలం రెండు మాత్రమే. అంటే ౧౯ ప్రధానశాఖలు కాలగర్భంలో కలిసిపోయాయి. అలాగే ౨౦ ఉపశాఖల పేర్లు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఇది ఋగ్వేదానికి ప్రస్తుతమున్న స్థితి.

ఇక కృష్ణయజుర్వేదానికి ౮౬ శాఖలున్నట్లు ప్రసిద్ధి. అందులో ఇప్పటికి ౮౨ శాఖలు నశించిపోయాయి. కొన్నింటికి పేర్లుమాత్రం మిగిలాయి. మిగతావాటికి అవికూడా లేవు. ఇప్పుడు దొరుకుతున్న శాఖలు నాలుగు మాత్రమే.

శుక్ల యజుర్వేదానికి ౧౭ ప్రధానశాఖలుండేవి. కాని ఇప్పుడు రెండు శాఖలు మాత్రమే దొరుకుతున్నాయి. ౨౬ ఉపశాఖలు నిరాశ్రయాలై నశించిపోయాయి. మొత్తం ౪౧ శాఖలు నశించి పోయినాయన్నమాట.

సామవేదానికి ౧౦౦౦ శాఖలుండేవి, కాని ప్రస్తుతం దొరుకుతున్న శాఖలు కేవలం మూడు మాత్రమే. గౌతమశాఖ మనదేశంలోనే ఉండేదని, శార్దూలశాఖ నశించి 300 సం॥గడిచాయని చెబుతారు. మొత్తంమీద ఈ వేదంలో ౯౯౭ శాఖలు నశించాయి.

అథర్వవేదానికి ౯ ప్రధానశాఖలుండేవి. అందులో ౭ శాఖలు నశించిపోగా ఇప్పుడు రెండు శాఖలు మాత్రమే దొరుకుతున్నాయి.

ఇంత విజ్ఞానం బూడిదలో పోసిన పన్నీరులాగా అయిపోయినా ఈ సమాజానికి ఏమీ పట్టలేదు. మనమెంత పోగొట్టుకున్నామనే విషయం కూడ తెలియని విభ్రాంతస్థితిలో ఉన్నాం.

మనకు దొరుకుతున్న ఈ కొద్ది శాఖలద్వారానే వేదాలలోని సంస్కృతిని, విజ్ఞానాన్ని చూసి మనం ఇంత ఆశ్చర్యపడుతున్నామే! నశించిన గ్రంథాలలో ఇంకెంత విజ్ఞానం భూగర్భంలోకి చేరి పోయిందో! ఎన్ని విద్యాసూత్రాలు పేర్లుకూడా తెలియని స్థితిలో అడుగంటి పోయాయో! మన దౌర్భాగ్యానికి ఎంతో బాధపడాలి.

**వేదాలపై నిరాదరణ :** ఒకప్పుడు ప్రపంచంలోని మానవులందరికు సంస్కృతిని, సభ్యతను, ఆచార్యస్థానంలో ఉండి నేర్పింది భారతదేశం. అంతర్జాతీయ పుస్తకభాండాగారంలో మొట్టమొదటి గ్రంథం ఋగ్వేదమని విదేశీయులే మన విజ్ఞానాన్ని ప్రశంసించారు. ఈనాటి ప్రపంచంలోని మేధావులందరూ ఏకగ్రీవంగా వేదాలు విశ్వవిజ్ఞాన నిధులని ప్రశంసించారు. సుమారు ౯౦ శాతం గ్రంథాలు నశించిపోగా మిగిలినవి కొన్ని పాశ్చాత్యపరిశోధకుల ప్రయత్నాలవల్ల చాలా వరకు వెలుగుచూశాయి.

సామాజిక - ఆర్థిక పరిస్థితుల ప్రభావాలకు లొంగిపోయి కుంగిపోయిన సాంప్రదాయకులైన వేదజ్ఞులసంఖ్య ఆశ్రయం, ఆదరం లభించక నానాటికి తగ్గిపోయింది. ప్రోత్సాహరహితమైన, సమాజాదరణానికి పాత్రంకాలేని విద్యను చదువడానికి ఎంతపెద్ద ఘనపాఠి సంతానమైనా ఇష్టపడుతుందా? తమవరకు ఎన్నో తరాలనుంచి సంరక్షింపబడుతూ, సంక్రమిస్తూ వచ్చిన ఈ విజ్ఞానధనానికి ఒకవైపు వారసులు లేకపోవడం, ఇంకొకవైపు తమలాగానే తమసంతతి నిరాశ్రయమై బ్రతుకుతెరువు లేకుండా పోవడం, ఎంతటివాడికైనా బాధను కలిగించక తీరదు. కానీ, ఫలితం? వేదవిద్య మెల్లమెల్లగా కనుమరుగై పోతూ వచ్చింది.

దీన్నిలా వదిలేయడమేనా? పోయినదానితో పాటు మిగిలింది కూడా నశించిపోతుంది. మరి ఈ విషయంలో ఏమిటి మనకర్తవ్యం? ఈ తరంలో ఉన్న మనకు ఏ బాధ్యత లేదనుకుందామా? రామున్న తరాలవారు మన ఉదాసీనవైఖరిని ఎంతగా ద్వేషిస్తారో! కనుక మన శక్తివంచన లేకుండా ఏదో ఒక ప్రయత్నం చేయాలి. కనీసం ఇప్పుడు లభిస్తున్న వేదసంచయాన్ని మన ముందుతరాలవారికి అందిచగలిగితే; నిజంగా అది వారికి మనంచేసే మహోపకారం.

ఏదో ఒక కులానికి, ఏదో ఒక మతానికి, ఏదో ఒక దేశానికి మాత్రమే సంబంధించక విశ్వమానవజాతికంతటికీ మంచికలగాలని, మానవులందరూ ఒక విశాల విశ్వకుటుంబసభ్యులనే భావనను కలిగించేది వేదవిజ్ఞానం. అలాంటి మహోజ్జ్వల విజ్ఞానరాశియైన మనం లేనిపోని సంకుచితభావాలను ఆపాదించి, దాన్ని సంరక్షించడం ఎవరినో సంరక్షించడమని, మత రహిత జీవనవిధానంకల ఈ దేశంలో వేదాలనెలా ప్రోత్సహిస్తామని నిట్టూరుస్తూ వాటిని నిరాదరించడం, అపరాధి తనవారులంతో నిరపరాధికి శిక్షవేయించడం లాంటిదే అవుతుంది. జాతి- మత- కుల- వర్గ - ప్రాంత భేదభావాలకతీతమైన, అద్వితీయమైన ఈ వేదవిజ్ఞానం మనలో కరుడుకట్టుకుపోయిన అశ్రద్ధకు, సంకుచితభావనలకు బలిఅయిపోవడాన్ని భావితరాల వారు ఎలా క్షమిస్తారు? నీవు, నేను, వాడు, అనే భేదం లేక **(సర్వేజనాః సుఖినో భవన్తు)** లోకంలోని జనులంతా సుఖంగా ఉండాలని యుగయుగాలుగా

వాటిచెప్పే వేదసంస్కృతికి అసూయతో ద్వేషంతో మానసిక బలహీనతతో రంగులు పూసి నిరాదరించిన మన సాహసం క్షమార్హమౌతుందా?

భారతీయ ప్రాచీన వాఙ్మయ విజ్ఞానాలలోని గొప్పదనాన్ని మనవారు చెబితే మనం అలక్ష్యం చేస్తాం. అదే ఒక పాశ్చాత్యుడు మీ పూర్వులింతగొప్పవాళ్ళు, మీ ప్రాచీనవిజ్ఞానం ఇంత గొప్పది అంటే అబ్బ! అని ఆశ్చర్యపడటం మనకలవాటు. ఈ పట్టీపట్టని పరిస్థితి ఎప్పుడు మారుతుంది? ఈ గడ్డపై పుట్టిన ప్రతి భారతీయుడు వేదవిజ్ఞానం నాకు పరంపరగా వచ్చిన ఆస్తి. దాన్ని సంరక్షించి లోకక్షేమానికి ఉపయోగించే బాధ్యత నాపైన ఉంది. ఇది నాకు జన్మతః సిద్ధించిన కర్తవ్యం ఈ నిధికి ధర్మకర్తను నేను అని ఎప్పుడు స్పందిస్తాడు? ఆ మహనీయమైన క్షణం ఎంత దూరంలో ఉంది? వెలుగును విరజిమ్మే ఆ మధురసుప్రభాతం ఎంతసేపటికి వస్తుంది ? మనకు పట్టిన నిద్ర ఎప్పుడు పోతుంది? ఆ పవిత్రసమయం కోసం ఎదురుచూద్దాం.

**వేదం అంటే ఏమిటి ?** సామాన్యంగా సమాజంలో వేదం అంటే వివాహాది శుభకార్యాల్లో చదివే మంత్రాల సమూహం అనే అభిప్రాయం ఉంది. కొన్ని వేదమంత్రాలు అలా ఉపయోగింపబడుతున్నాయి కనుక అది కొంతవరకు నిజమే; వేదం అసలు స్వరూపం అదికాదు. భారతీయులమైన మన భాగ్యవశాన భగవంతుడు మంత్రద్రష్టలైన మహర్షుల ద్వారా ఆవిష్కరించిన సత్యవాక్సమూహమే వేదం. పరమపురుషుని నిశ్వాసమే (అస్య మహతో భూతస్య నిశ్వసితం యదృగ్వేదః ౨-౪-౧౦) వేదమని బృదారణ్యకోపనిషత్తు చెబుతున్నది.

**వేదాలకు ఎన్ని పేర్లున్నాయి ?** వేదాలకు ౧. శ్రుతి ౨. అనుశ్రవం ౩. త్రయి ౪. ఆమ్నాయం ౫. సమామ్నాయం ౬. ఛన్దం ౭. స్వాధ్యాయం ౮. ఆగమం ౯. నిగమం మొ॥ తొమ్మిది పేర్లున్నాయి.

గురువు ఉచ్చరించినదాన్ని సరిగా విని తిరిగి అలాగే ఉచ్చరిస్తూ శిష్యుడు దీన్ని నేర్చుకుంటాడు. కాబట్టి 'శ్రుతి' అని, 'అనుశ్రవ' అని దీని పేర్లు ("శ్రుతిస్తు వేదో విజ్ఞేయః" మను ౨-౧౦) ఋగ్యజుస్సామలు మూడింటికీ 'త్రయి' అని పేరు. 'మ్నా' అనే ధాతువుకు అభ్యాసమని అర్థం. ఎప్పుడూ అభ్యసింపబడుతుంది కనుక 'ఆమ్నాయము' 'సమామ్నాయము' అని దీనికి పేరు. జైమిని (మీ. ద. ౧-౨-౧; ౧-౪-౧) యాస్కుడు (ని. ౭-౬-౪; ౭-౭-౧) మొ॥ వారు ఆమ్నాయ -సమామ్నాయశబ్దాలతో వేదాన్ని పేర్కొన్నారు. 'ఛన్ద' శబ్దానికి వేదపరంగాను, ప్రత్యేకించి సామవేదపరంగాను ప్రయోగాలున్నాయి. వేదం వంశపరంపరగా అధ్యయనం చేయబడేది కాబట్టి 'స్వాధ్యాయ' మనబడుతోందని తైత్తిరీయారణ్యకం వివరిస్తున్నది (౨-౧౫-౭). భగవంతుని నిశ్వాసరూపంగా బయల్పడేది కాబట్టి దీనికి 'ఆగమము' అని వ్యవహారం.

**వేదాధ్యయనం అంటే ఏమిటి ?** "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" (తై. ఆ. ౨-౨-౫) అని తమ తమ శాఖాధ్యయనం చేయాలని వేదమే విధిస్తున్నది. దాని ననుసరించి ఉపనీతుడైన శిష్యుడు పారంపర్యంగా వచ్చిన తన వేదశాఖను గురుకులంలో గురూచ్చారణను విని దాన్నే తిరిగి తిరిగి చెబుతూ సుస్వరంగా వేదాన్ని వల్లెవేసే పద్ధతిని ఈనాడు 'వేదాధ్యయనం' అంటున్నారు. అలా చేయబడిన అధ్యయనం క్రమంగా ఆ శబ్దరాశిని స్వరం తప్పకుండా గుర్తుపెట్టుకొని పారాయణం చేసుకోవడానికి ఉపయోగిస్తుంది.

అధ్యయనవిధితో పాటు అర్థజ్ఞానాన్ని కూడా నిత్యకర్మగా విధిస్తున్నది వేదం. బ్రాహ్మణుడు నిష్కారణంగా ("బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ మహా.౧.౧.) (అంటే ఇది కామ్యం కాదు తప్పనిసరి అని అర్థం) ధర్మాన్ని, ఆరు అంగాలుగల వేదాన్ని అధ్యయనం చేయాలి, అర్థం చేసుకోవాలి అని. కనుకనే సాయణుడు తన వేదభాష్యభూమికలో అధ్యయనంలాగానే అర్థజ్ఞానం విధించబడిందని, అధ్యయనవిధి వేదాన్ని వల్లెవేయడాన్నే చెప్తూ, అర్థాన్ని తెలుసుకోవాలని ఇంకొకవిధి చెబుతున్నదని, అర్థజ్ఞానం లేకుండా వేదంవల్ల చెప్పబడే అలౌకిక పురుషార్థోపాయాన్ని తెలుసుకోవడం కుదరదు. కాబట్టి, కేవలం వల్లెవేయబడిన వేదానికి ముఖ్యవేదంక్షణమే సిద్ధించదని, అగ్ని లేనిచోటపడవేసిన కట్టె మండనట్లు అర్థజ్ఞానం లేని వేదపాఠం స్వార్థాన్ని ప్రకాశింపజేయజాలదని, కనుక అర్థం తెలుసుకోవడం తప్పనిసరి అని పదే పదే చెబుతున్నారు.

వేదాన్ని అధ్యయనం చేసి అర్థజ్ఞానం సంపాదించనివాడు అందులో ఏముందో తెలియకుండా ఏదో బరువును మోసేవాడు మాత్రమే. వాడు పూలను పండ్లను ఇవ్వలేని ఎండిపోయిన మొద్దులాంటివాడని, అర్థం తెలిసినవాడు జ్ఞానంచేత అన్ని పాపాలు పోగొట్టుకొని శుభాన్ని పొందుతాడని యాస్కుడు చెబుతున్నాడు.

వేదాన్ని మూలంమాత్రం వల్లెవేసేవాడు పూలు పండ్లు లేని వాక్కును సేవిస్తున్నాడు. వేదవాక్కు అనే ఆవు, వాడికి ధర్మ బ్రహ్మ జిజ్ఞాసారూపమైన పాలనివ్వదు. కనుక అర్థం తెలియని వచనం ఇంద్రజాలికుడు కల్పించిన మాయగోవులాంటిదే కాని ఆవు ఎంతమాత్రమూకాదు అని ఋగ్వేదమే చెబుతున్నది.

అందువల్ల వేదాధ్యయనంతో పాటు అర్థజ్ఞానాన్ని సంపాదించడానికి, దాని ప్రయోజనాన్ని తాము పొంది లోకకళ్యాణము కలిగించడానికి వేదాధ్యేతలందరు కృషిచేయాలి. సమాజం,

సంస్థలు అర్థజ్ఞానపరంపరను అంధకారంలో పడనీయకుండా జ్ఞాననిధులైన వేదాలను, వాటినర్థవయం చేసిన పవిత్రాత్ముల్ని పరిరక్షించాలి. అజ్ఞానంతో వారినవహేళనచేయడమో అసూయతో చిన్నచూపుచూపి తక్కువగా అంచనా వేయడమో చేస్తే అది అలాంటివారికి వ్యక్తిగతంగానే కాక, సమాజానికి సంబంధించిన సమష్టిసంక్షేమానికి కూడ గొడ్డలిపెట్టు అవుతుంది. ప్రకాంతికిరణాలను ప్రసరింపజేసే విజ్ఞానం నశించిపోయిన తరువాత మనచుట్టూ చైతన్యరహితమైన శరీరాలు, సంస్కారరహితమైన హృదయాలు అసూయాద్వేషాగ్నులతో తగలబడుతూ చిందులు త్రొక్కుతూ ఉంటాయేగాని, శాంతితో త్యాగంతో ముముడసాగించే మహనీయ స్వభావులు ఉదాహరణకు కూడా దొరకరు.

**మంత్రం అంటే ఏమిటి ?** లోకంలో మంత్రం అనే పేరుతో అనేక వ్యవహారాలున్నా వైదికపరిభాషలో మంత్రానికొక విలక్షణమైన స్వరూపం ఉంది. దీన్ని గురించి వైదిక వాఙ్మయంలో చాలా విచారం జరిగింది. మంత్రానికేమిటి లక్షణం? అని విశ్లేషణచేస్తూ కొందరు (విహితార్థాభిధాయకః మంత్రః) విధింపబడ్డ అర్థాన్ని వివరించి చెప్పేది మంత్రమన్నారు. విధి రూపమైన మంత్రాలకు ఈ లక్షణం సరిపోదు (అవ్యాప్తి అనే దోషం) కాబట్టి ఇది అందరికీ ఆమోదయోగ్యం కాలేదు.

పోనీ యాస్కుడు నిరుక్తంలో (౭-౩-౬) "**మన్త్రా మననాత్**" అన్నాడు కాబట్టి (మనన హేతుః మన్త్రః) మననం చెయ్యడానికి హేతువయ్యేది మంత్రం అంటే పోలేదా ? అని కొందరన్నారు. అమమ్మగాని ఆరకమైనలక్షణం బ్రాహ్మణాలకు కూడా ఉండటంవల్ల వాటిల్లో మంత్రలక్షణం పట్టవలసి వస్తుంది (అతి వ్యాప్తి అనే దోషం) బ్రాహ్మణగ్రంథాలను మంత్రభాగం క్రింద తీసుకోవడం కుదరదు. మరి, మంత్రాలకు చెప్పిన లక్షణం అవికాని బ్రాహ్మణాలకు కూడా పట్టడం ఉచితంకాదు కదా కనుక ఇంకో లక్షణం చెప్పవలసివచ్చింది.

యజ్ఞయాగాది కర్మలు చేస్తూ వాటి స్వరూపాన్ని స్మరించడం మొ॥ పనులకోసం యాజ్ఞికులు ప్రత్యేకంగా ఉచ్చరించే శబ్దాలే మంత్రాలు. ఈలక్షణం మంత్రాలన్నింటిలోనూ పడుతుంది దీనికి ఏ దోషాలు రావు.

**ఋషి, దేవత, ఛందస్సు, స్వరములుఇవివేదమంత్రములకుచతుర్బలములు.**

ప్రతి మంత్రమునకు నాలుగు అంగములుండును. ఈ చతురంగ బలము అనునది యుండుటచేతనే అవి నాటినుండి నేటివరకు చెక్కు చెదరకుండా ఉన్నవి. అవి లేకుంటే ఏనాడో వాటిలో కల్పితాలు మార్పులు, చేర్పులు జరిగి యుండెడిది.

**ఋషి అంటే ఏమిటి? :** వేదస్థ ప్రతి మంత్రమునకు ఎవరో ఒక ఋషి ఉండవలయును. ఆ మంత్రములను అతడు సమాధి అవస్థలోకి వెళ్ళి ఆ మంత్రములోని దేవతను ప్రత్యక్షము చేసుకొని అనగా ఆ మంత్రములో ఉపదేశింపబడిన విషయమును తెలుసుకొనును. ఆ తెలుసుకున్న వారినే ఋషి అని వ్యవహరింతురు.

నిరుక్తకారుడు ఋషి శబ్ద నిర్వచన మిట్లు వివరించెను **ఋషిః దర్శనాత్** అనగా వేదమంత్రార్థములను దర్శించువాడని అభిప్రాయము. వీరిని మంత్రద్రష్టలని కూడా అంటారు. మంత్రద్రష్టలగు ఋషులు రెండు విధములుగా ఉంటారు. కొన్ని సూక్తాలలో ఆ మంత్రద్రష్టయగు ఋషి పేరు ఆ సూక్తస్థ మంత్రములలో స్పష్టముగా అగుపడును. ఉదాహరణమునకు శివసంకల్ప మంత్రములలో శివసంకల్ప అను ఋషి పేరు ఆయా మంత్రములలో స్పష్టముగా **తన్మే మనః శివ సంకల్పమస్తు** అని గలదు. ఆయా మంత్రముల చివర ఆయా పర్యాయములు అగుపడుచున్నది. ఈమంత్రములకు దేవత, స్వరము ఇవ్వబడినది. వీటి దేవత అనగా ఆ మంత్రములోని విషయము మనో విజ్ఞానములో నిండి యున్నందువలన వాటి దేవత మనస్సు అని గ్రహించవలెను.

కొన్ని సూక్తస్థ మంత్రములందు ఋషి నామధేయము అగుపడదు. ఆ ఋషి పేరు విడిగానే వేరుగా వ్రాయబడును. అటువంటి మంత్రములసంఖ్య చాలా ఎక్కువ. ఉదాహరణమునకు **ఈశా వాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్. తేన త్యక్తేన భుఞ్జీథాః మా గృధః కస్య స్విద్ధనమ్.** యజు. అ. ౪౦. మం. ౧ ఈ మంత్రమునకు ఋషి దీర్ఘతముడు. కాని ఇతని పేరు మంత్రమందు అగుపడడములేదు. అందువలన ఇటువంటి ఋషులను సామాన్య ఋషులు అని అంటారు.

**దేవత అంటే ఏమిటి ?:** ప్రతి మంత్రములో నిహితమై మనకు మంత్రములోనే దేవత స్పష్టముగా దృష్టిగోచర మగుచుండును. దేవత అనగా మంత్రములో దేని గురించి ఎక్కువగా మనకు తెలియజేయబడునో దానినే ఆ మంత్రదేవత అని పిలువబడును. ఉదాహరణమునకు గాయత్రీమంత్రము ఇచ్చట వ్రాయబడుచున్నది. దానిని మనము ధ్యానించినచో అందులోని దేవత నామము చూచినచో అగుపడును. వినినచో వినపడును మరియు ధ్యానించినచో దర్శనమగును.

**ఓమ్ భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి .**
**ధియో యో నః ప్రచోదయాత్ .** యజు. అ. ౩౬. మం. ౩

ఈ మంత్రమందున్న దేవత సవితా అనగా ఆధ్యాత్మికార్థము చేయునపుడు సకల జగత్తును పుట్టించువాడు పరమేశ్వరుడు అని భావము. సవితా అనగా లౌకిక సూర్యునికి కూడా వర్తించును. అధిభౌతికార్థముగా వించినప్పుడు లౌకిక సూర్యార్థము గ్రహింపబడవలయును.

దేవత శబ్దమునకు ౨౪ విభక్తులుండును. అందువలన మంత్రములో దేవత ఏ విభక్తిలో ఉన్నదో తెలుసుకొనవలయును. దేవత ప్రతి మంత్రమునకు ప్రథమా విభక్తి ఏకవచనములోనే ఉండవలసిన అవసరము లేదు. అద్వైత మంత్రస్థ దేవతలను దర్శనము చేసుకోగలడు. ఉదాహరణమునకు గాయత్రీ మంత్రముయొక్క దేవత సవితా. కాని

మనకు మంత్రమునందు 'సవితుః' షష్ఠీ ఏకవచనములో నున్నది. అన్ని దేవతలు షష్ఠీ ఏకవచనములో నుండనవసరములేదు. అదేవిధముగా అన్నీ ప్రథమా విభక్తి ఏకవచనములో నుండనవసరములేదు. ఒక్కొక్కప్పుడు దేవత మంత్రములో అసలే అగుపడదు. దానిని మనము సందర్భము మరియు ప్రకరణానుసారముగా కనుగొనవలయును.

**ఛందస్సు అనగానేమి? :** ఛందశ్శాస్త్ర విషయము చాల గంభీరమైనది. వేదపు సమస్త మంత్రములకు ప్రధానముగా ఏడు విధములైన ఛందస్సులుండును. గాయత్రీ, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతీ, పంక్తి, త్రిష్టుప్, జగతీ.

**ఛందస్సుతో మంత్రార్థ సంబంధము :** ప్రతి ఛందస్సు అక్షరముల సంఖ్య మరియు ప్రతి ఛందస్సు పేరు యౌగిక అర్థము మరియు యోగరూఢి అర్థములు తెలిసియుండవలయును. ఉదాహరణమునకు గాయత్రీ అనగానే ౨౪ అక్షరములు గల్గియున్నదని మరియు దాని యౌగికార్థము **గాయంతం త్రాయతే** అని త్వరితముగా స్ఫురించవలెను. ఏల యనగా వేదమంత్రములలో అనేక విద్యలు ఛందస్సుల నామధేయములలో మరియు వాటి యందున్న అక్షర సంఖ్యలతో ఉపదేశింపబడినవి.

**దేవతలు ఛందస్సుకంటె ముఖ్య :** ఒక్కొక్కప్పుడు అధ్యేత ఛందస్సు అక్షరముల సంఖ్య నెక్కువలోపడి ఛందస్సును నిర్ణయించలేని పరిస్థితి ఏర్పడును. ఇట్టి క్లిష్ట పరిస్థితిని అధిగమించుటకు ఈ దిగువ మంత్రముల ద్వారా ఛందో నిర్ణయము చేసుకోగలరు.

**అగ్నేర్గాయత్ర్యభవత్సయుగ్ ఉష్ణిహయా సవితా సంబభూవ।**

**అనుష్టుభా సోమ ఉక్థైర్మహస్వాన్ బృహస్పతేర్బృహతీ వాచమావత్॥** ఋ.౧౦.౧౩౦.౪

విరాణ్మిత్రావరుణయోరభిశ్రీరింద్రస్య త్రిష్టుబిహ భాగో అహ్నః।

విశ్వాన్దేవాన్ జగత్యా వివేశ తేన చాక్లృప్ర ఋషయో మనుష్యాః॥ ॥౫॥ ఋ.౧౦.౧౩౦.౫

వీటి భావార్థమిట్లు వ్రాయబడుచున్నది :

| | | | | | |
|---|---|---|---|---|---|
| ౧. మంత్రదేవత | | అగ్ని అయినచో ఛందస్సు | | గాయత్రీ | అగును. |
| ౨. | ,, | సవితా | ,, | ఉష్ణిక్ | ,, |
| ౩. | ,, | సోమ | ,, | అనుష్టుప్ | ,, |
| ౪. | ,, | బృహస్పతి | ,, | బృహతీ | ,, |
| ౫. | ,, | మిత్రావరుణులు | ,, | పంక్తి | ,, |
| ౬. | ,, | ఇంద్ర | ,, | త్రిష్టుప్ | ,, |
| ౭. | ,, | విశ్వేదేవాః | ,, | జగతీ | యగును. |

ఇవ్విధముగా దేవతలను ఆధారముగా జేసుకొని ఛందస్సు నిర్ణయము గురించి పైన పేర్కొనబడిన ఋగ్వేద మంత్రములు మనకెంతో ఉపకరించు చున్నవి.

ఛందః శాస్త్ర రచయితైన పింగళాచార్యుడు సైతము పైన పేర్కొనబడిన వేదమంత్రములను పురస్కరించుకొని ఛందో నిర్ణయ సూత్రమును యిట్లు వ్రాసెను.

**అగ్నిః సవితా సోమో బృహస్పతిర్మిత్రా వరుణా వింద్రా విశ్వేదేవా దేవతాః ॥**

పింగళ ఛందశ్శాస్త్రము అధ్యాయము ౩ సూ.౬౩

ఈ సూత్ర భావార్థము పైన చెప్పబడిన వేదమంత్రములతో ఏకీభవించుచున్నది. అందువలన పునః ఇచ్చట వ్రాయబడడములేదు.

ఋషి, దేవత, ఛందస్సు మరియు స్వరము వేదమంత్రములకు చతురంగబలముగా యున్నందువలనే ఈ అనాది ఈశ్వరీయ సంహితలు చెక్కుచెదరకుండా ఉన్నవి.

**స్వరం అంటే ఏమిటి ?** వేదమంత్రాల్లో ఉండే అచ్చులకు ఉచ్చారణను బట్టి ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే పేరుతో మూడురకాలైన స్వరాలుంటాయి. ఏకశ్రుతిని కూడ ఒక స్వరంగా కొందరంగీకరించారు. అచ్చులతో చేరటంవల్లనే హల్లులకు స్వరసంబంధం ఏర్పడుతున్నది కాని వాటికి స్వరం లేదు. అచ్చులకే స్వరాలనే పేరున్నది. ఇవి మూలపాఠాన్ని సంరక్షించడానికి, సందర్భానికి తగిన అర్థాన్ని నిర్ణయించుకోవడానికి ఉపయోగిస్తాయి. ఒకే పదానికి స్వరభేదాన్ని బట్టి అర్థం కూడ మారిపోతుంది.

తాలువు (దవడ) మొదలైన స్థానాలకు పై భాగంలో పుట్టిన అచ్చు 'ఉదాత్తమని', తాలువు మొదలైనవాటికి దిగువ పుట్టిన అచ్చు 'అనుదాత్తమని', ఈ ఉదాత్తానుదాత్తధర్మాలు రెండు కలసిఉన్న అచ్చు 'స్వరిత మని' పాణిని తన అష్టాధ్యాయిలో చెప్పాడు. ఇక నాల్గోది 'ఏకశ్రుతి'. దీనికే 'ప్రచయ' మని కూడా పేరు. ఇందులో ఉదాత్త - అనుదాత్త స్వరితలక్షణాలేవీ కనపడవు. ఉదాత్త - అనుదాత్త స్వరాలు రెండూ స్వతంత్రమైనవి చూడండి.

**అగ్నిమీళే పురోహితమ్** (ఋ. ౧-౧-౧) ఇక్కడ " మీ " అనే అక్షరం పైన గీత ఉన్నది. అది స్వరితానికి గుర్తు. " పు" అనే అక్షరానికి అడుగున గీతఉన్నది. అది అనుదాత్తస్వరానికి గుర్తు. ఉదాత్తస్వరానికి ప్రత్యేకమైన గుర్తులేదు. ఇదే నియమం.

**౧. ఉదాత్తం :** అథర్వవేదంలోను, ఋగ్యజుర్వేదాల్లోనూ ఉదాత్త స్వరానికి ప్రత్యేకమైన గుర్తు ఉండదు. సామాన్యంగా అనుదాత్తవర్ణానికి ముందుండేది ఉదాత్తం అవుతుంటుంది.

**అగ్నే యం యజ్ఞమధ్వరమ్** (ఋ. ౧-౧-౪)

ఈ మంత్రంలో " అ " అనే వర్ణం ఉదాత్తం. అలాగే అనుదాత్త వర్ణాలైన " గ్నే" " య " " ధ్వ" అనే వర్ణాలకు ముందుండటంవల్ల " యం" " జ్ఞ " " రొ" అనే వర్ణాలు ఉదాత్త స్వరం కలవి. సామవేదంలో ఉదాత్త వర్ణానికి పైన ౧ అనే అంకెను వేస్తారు.

**౨. అనుదాత్తం :** ఋగ్యజుర్వేదాల్లోను అథర్వ వేదంలోను ఇది అక్షరానికి అడుగున ఉండే గీతద్వారా తెలియజేయబడుతుంది. ఉదా : " అగ్నిం " ఇక్కడ "అ" అనే అక్షరం అనుదాత్తం. సామవేదంలో అనుదాత్తవర్ణానికి పైన 3 అనే అంకెను వేస్తారు ( కొందఱు ౨ వేస్తారంటారు. ) . యజుర్వేదంలోను శతపథబ్రాహ్మణంలో స్వరాంకన పద్ధతిని ఇంకోరకంగా కొందఱు చెబుతారు.

**౩. స్వరితం :** ఉదాత్తానుదాత్తస్వరాల సమ్మిశ్రమమే స్వరితం. (గ్రీకుభాషలోని సర్కంఫ్లెక్స్ స్వరితంలాగానే ఉంటుంది. ఋగ్యజురథర్వ వేదాల్లో స్వరితవర్ణంపైన నిలువుగీతతోను ("అగ్నిం" "మీళే" ఇక్కడ మీ అనే అక్షరం స్వరితం) సామవేదంలో ౨ అంకెతోను గుర్తింపబడుతుంది. (కొందఱు 3 వేస్తారంటారు). ఇది ౧. సన్నిధిజం ౨. జాత్యం ౩. అభినిహితం ౪. క్షైప్రం ౫. ప్రశ్లిష్టం ౬. తైరోవ్యంజనం ౭. వైవృత, పాదవృత్తం ౮. తైరోవిరామం ౯. తథా భాష్యమని తొమ్మిది విధాలని ప్రాతిశాఖ్యం చెబుతున్నది.

**౪. ఏకశ్రుతి ప్రచయం :** ఏకశ్రుతిలో ఉదాత్తానుదాత్తస్వరిత కార్యాలేవీ కనపడవు. సామాన్యంగా స్వరితవర్ణం తరువాత వచ్చే వర్ణంలో ఏ గుర్తులేకపోతే వాటిని ఏకశ్రుతి వర్ణాలనుకోవచ్చు చూడండి:

**హోతారం రత్నధాతమమ్** (ఋ. -౧-౧-౧)

ఇక్కడ "తా" స్వరితవర్ణం. దాని తరువాతనున్న రం ర అనే రెండు వర్ణాలు ఏకశ్రుతివర్ణాలు. ఇవి అనుదాత్త వర్ణాలతో పోలి ఉంటాయి.

**స్వరం వల్ల ఏం ప్రయోజనం ?** ఈ స్వరం కేవలం వైదికభాషకు మాత్రమే కాదు; పూర్వం లౌకికభాషలో కూడా పాటింపబడేది. ఇప్పటికీ మన సంభాషణల్లో కొన్ని పదాలను ఒత్తిపలకడంద్వారా, దీర్ఘం తీయడం ద్వారా అర్థ భేదం రావడం గమనిస్తూనే ఉన్నాం. వేదాల్లో స్వరభేదాన్నిబట్టి అర్థభేదం ఎంతో కనపడుతుంది . చూడండి.

**హవో వృత్రం జయా అపః** (ఋ. ౧-౮౦-౩)
**జయో మే సవ్య ఆహితః** (అ. ౭-౫౨-౮)

పై రెండు మంత్రాల్లోను "జయ" అనే ఒకే పదం ఉన్నా స్వరంలో తేడా ఉంది ఋగ్వేదమంత్రంలోని "జయా" అనే పదంలో 'జ' ఉదాత్తం కనుక ఆ పదం ఆద్యుదాత్తం (మొదటి ఉదాత్తవర్ణం కలది). కనుక ఓ ఇంద్రా! నీవు నీటిని జయింతువు గాక ! అని క్రియాపదంగా అర్థం చెప్పాలి. ఇక అథర్వమంత్రంలోని 'జయ' అనే పదంలో 'య' ఉదాత్తం కాబట్టి అది అంతోదాత్తం (చివర ఉదాత్త వర్ణం కలది) ఇది క్రియాపదం కాదు. దీనికి 'జయం' అని అర్థం. "జయం నా ఎడమ చేతిలో ఉంది" అని అర్థం. వేదభాష్యకారులంతా ఈ స్వరనియమములను దృష్టిలో పెట్టుకొనే వ్యాఖ్యానిస్తారు. స్వరభేదంవల్ల అర్థమెలా మారుతుందో చూడండి :

| | పదం | అర్థం |
|---|---|---|
| ౧. | జఠరః | అగ్ని |
| | జఠరః | పొట్ట |
| ౨. | సత్యమ్ | నిజము |
| | సత్యమ్ | దరిద్రము |
| ౩. | జ్యేష్ఠః | ప్రశంసింపదగినవాడు |
| | జ్యేష్ఠః | వయసులో పెద్దవాడు |

ఇలా పదం ఒకటిగా కనపడినా స్వరభేదంవల్ల అర్థభేదం వస్తుంది. ఏ అర్థంలో ప్రయోగించాలో తెలుసుకోవాలంటే స్వరస్వరూపం అవగతం కావాలి.

స్వరజ్ఞానం లేకపోవడంవల్ల ప్రయోజనం కలగకపోగా అనర్థాలు సంభవించే ప్రమాదం లేకపోలేదు. పాణినీయశిక్షలో స్వరజ్ఞానలోపంవల్ల కలిగే ప్రమాదం ఇలా అభివర్ణింపబడింది. చూడండి :

**ఇన్ద్రశత్రుర్వర్ధస్వ** ( తై. ౨-౪-౧౨-౧)

ఈ మంత్రంలో "ఇన్ద్రశత్రుః" అనే పదానికి ఇంద్రుని శత్రువు (చంపేవాడు ) అని తత్పురుష సమాసం చెప్పాలి. అలా చెప్పాలంటే అది అంతోదాత్తం ( చివర ఉదాత్తస్వరం కలది ) కావాలి. కాని ఆద్యుదాత్తంగా (మొదట ఉదాత్తస్వరం కలదిగా ) ప్రయోగింపబడింది. సమాసం మారిపోయి తత్పురుషం కాస్తా బహువ్రీహి అయింది. ఇంద్రుడు చంపేవాడుగా ఎవరికి ఉన్నాడో వాడు అనే విరుద్ధార్థం ఏర్పడింది. కనుక ప్రమాదాలు తప్పాలంటే స్వరజ్ఞానం తప్పనిసరి అని తెలుస్తున్నది.

**వేదానికి కాలనిర్ణయం చేయవచ్చా ?**

మానవుల రచనలకు కాలనిర్ణయం చేయవచ్చు. కాని అపౌరుషేయాలు, నిత్యసత్యాలు, భగవంతుని నిశ్వాసరూపాలైన వేదాలకు కాలనిర్ణయం చేయబూనడం హాస్యాస్పదం. కనుక వేదాలు అనాదులు అనంతాలు నిత్యాలు అని వైదికుల దృఢ విశ్వాసం.

**సంహితలలో ముందు వెనుక లున్నాయా ?**

వైదిక వాఙ్మయంలో పరిశోధనలు చేసిన పాశ్చాత్యులు వేద సంహితలన్నింటిలో ఋక్సంహిత చాలా ప్రాచీనమైందని చెబుతారు. వారి దృష్టిలో రెండవమండలం మిగతా మండలాలంత ప్రాచీనం కాదు. ఋక్సంహితకు పరిశిష్టంలాంటిది పదవమండలం. సామసంహితలో గల చాల మంత్రాలు ఋక్సంహితలోనివే. ఋక్సంహితకంటే శుక్లయజుస్సంహిత నవీనమైనది. అథర్వసంహిత మిగతా మూడు వేదాలకు

పరిశీలించాలంటిది.

వైదిక సంప్రదాయవిదులు ఈసిద్ధాంతాన్ని అంగీకరించరు. వారిలా అంటారు. ఇది కేవలం సంహితల బాహ్యస్వరూపాన్ని మాత్రం చూసినప్పుడు కలిగే భ్రమ. ఋక్సంహితలోనే ఇతర వేదాల ప్రస్తావన ఎన్నోచోట్ల కనిపిస్తున్నది. **యజ్ఞాత్తస్మాదజాయత** (ఋ. ౧౦-౯౦-౯) **తమేవ ఋషిం తము బ్రహ్మాణమాహుర్యజ్ఞన్యం సామగాముక్థశాసమ్** (ఋ. ౧౦-౧౦౭-౬), **ఋక్సామాభ్యామభిహితౌ** (ఋ.౧౦-౮౫-౧౧), **గాయత్రాము సభ్యమ్** (ఋ. ౫-౧౨౩-౧) **రథన్తరమాజభారా వసిష్ఠః** (ఋ.౧౦-౧౮౧-౧), **రథన్తరే సూర్య మ్పర్యపశ్యత్** (ఋ.౧-౧౪-౨౫).

పై ఉదాహరణలద్వారా ఋక్సంహితలో ఇతర వేదప్రస్తావం స్పష్టంగా తెలుస్తున్నది. వేదరాశినుంచి ఋక్కులన్నింటిని కూర్చి సంహితగా రూపొందించినవాటికే ఇతర వేదాలు సంకులావస్థలో ఉన్నాయి. మానవుడు చేసిన రచనకాదు కాబట్టి మానవరచనా ధర్మాలను నిత్యమైన వేదంలో ఆరోపించడం న్యాయంకాదు. గనుక వేదాలలో ముందువెనుకలుండటం అసంభవం.

**వేదాంగాలేవి? ఏమిటి వాటి ప్రయోజనం?**

అతిగంభీరమైంది వేదం. దాన్ని సరిగా అర్థంచేసుకోవడానికి ఏర్పడినవే వేదాంగాలు. అవి శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛన్దస్సు, జ్యోతిషమని ఆరు. వేదానికి ఛందస్సు పాదాలు, కల్పం హస్తాలు, జ్యోతిషం నేత్రం, నిరుక్తం శ్రవణేంద్రియం, శిక్ష ప్రాణం వ్యాకరణం ముఖం అని పాణినీయశిక్ష చెబుతున్నది. ఈ అంగాల స్వరూపం తెలియందే వేదప్రారయం సరిగా అర్థంకాదు. వేదసంహితలు, బ్రాహ్మణాలు, ఈ ఆరు వేదాంగాలు అపరవిద్యలు. పరమపురుషార్థమైన బ్రహ్మజ్ఞానాన్ని కలిగించే ఉపనిషత్తులు పరవిద్యలు. (ము. ౧.౧.౪.౫.)

**శిక్ష :** వేదంలోని అకారాది వర్ణాలను, ఉదాత్తాదిస్వరాలను, హ్రస్వాది మాత్రలను, స్థాన ప్రయత్నాది బలాలను, నిషాదాదిసామను వికర్ష గాది సన్తానాన్ని తెలియజేసేది శిక్ష. ఇవి సుమారు ముప్ఫై గ్రంథాలు దొరుకుతున్నాయి. అందులో యాజ్ఞవల్క్య - వాసిష్ఠ కాత్యాయనీయ - పారాశరి- మాండవ్య-నారదీయ-శౌనక-గతమీ-పాణినీయశిక్షలు ప్రధానమైనవి.

**కల్పం :** శ్రౌతసూత్రగ్రంథాలకు కల్పమని పేరు. వీటిని కల్పసూత్రాలని కూడా అంటారు. శ్రుతిప్రతిపాదితమైన యజ్ఞయాగాదుల ప్రయోగాలను వివరిస్తాయి. శాంఖాయన - ఆశ్వలాయన - మశక - లాట్యాయన - దాక్షాయణ - కాత్యాయన - ఆపస్తంబ - వైతానశ్రౌతసూత్రాలు ప్రసిద్ధాలు.

**వ్యాకరణం :** ఇది శబ్దాలలోని ప్రకృతి - ప్రత్యయాలను వివరిస్తూ పద స్వరూపాన్ని నిష్కృష్టంగా చెప్పి దానిద్వారా అర్థనిశ్చయాన్ని పొందడానికి ఉపయోగిస్తుంది. రక్షోహాగమలఘ్వసందేహాలు దీనికి ప్రయోజనంగా చెప్పబడ్డాయి.

౧. **రక్ష :** వేదరక్షణ వ్యాకరణానికి ప్రథమ ప్రయోజనం. వర్ణలోప, ఆగమ, వికారాలను బాగా తెలుసుకున్నవాడు వేదాలను రక్షించి, వాటి అర్థాన్ని తెలుసుకోగలుగుతాడు.

౨. **ఊహ :** యజ్ఞయాగాల్లో లింగవిభక్తులను అవసరమైన చోట్ల మార్చాలంటే వ్యాకరణం తెలిసి ఉండాలి.

౩. **ఆగమం :** వేదాంగాలలో వ్యాకరణం ప్రధానం. సాంగంగా వేదం చదువుకోవాలి అనడంవల్ల ప్రధానమైన వ్యాకరణం చదవడం తప్పనిసరి అని తెలుస్తున్నది. కనుక ప్రధానాంగాన్ని చదవడం ద్వారా విధిని గౌరవించిన ఫలం కలుగుతుంది.

౪. **లాఘవం :** వ్యాకరణజ్ఞానం లేనిదే ఊహాపోహం ద్వారా శబ్దజ్ఞానం కలుగదు. కనుక శబ్దజ్ఞానం తేలికగా కలగడానికి వ్యాకరణం చదవాలి.

౫. **అసందేహం :** యజ్ఞయాగాదులు చేసేటప్పుడు పదాలకు సరైన అర్థాన్ని నిర్ణయించాలంటే వ్యాకరణం తప్పకుండా కావాలి.

**నిరుక్తం :** అర్థావబోధకలగడంలో ఇతరాపేక్ష లేకుండా ఎక్కడ పదాలు నిర్వచింపబడ్డాయో అది నిరుక్తం. యాస్క మహర్షి దీని రచయిత. ఇది ౧. నైఘంటుక ౨. నైగమ ౩. దేవతాకాండలని మూడు భాగాలు. మొదటికాండలో పృథివ్యాదిలోకాలు, దిక్కులు, కాలాలు మొ॥ వాటికి సంబంధించిన శబ్దాలు చెప్పబడ్డాయి. రెండవకాండలో మనుష్యులు వారి అవయవాలు మొ॥శబ్దాలు వివరింపబడ్డాయి. మూడవకాండలో పై రెంటిలోని బహుత్వ ప్రాస్వత్వాది ధర్మాలకు సబంధించిన పేర్లు చెప్పబడ్డాయి.

**ఛన్దస్సు :** గాయత్రి మొ॥ ఛందస్సుల జ్ఞానం ఛన్దశ్శాస్త్రపరిచయం లేనిదే కలగదు. ఆయా మంత్రాలకు ఋషి, ఛన్దస్సు, దేవత తెలియకుండా యజ్ఞయాగాదుల్లో ప్రయోగించడం అధ్యాపనం చేయడం చాలా తప్పని ప్రతిమంత్రానికి వీటిని తెలుకోవాలని కాత్యాయన సర్వానుక్రమణి (౧-౧) చెబుతున్నది. అది తెలుసుకోవడానికి ఛన్దో గ్రంథాలుపయోగపడతాయి.

**జ్యోతిషం :** జ్యోతిశ్శాస్త్రజ్ఞానం లేనిదే ఏ యజ్ఞం ఎప్పుడు చేయాలో సరిగా నిర్ణయించుకోవడం కుదరదు. వేదంలో ప్రత్యేకకాలాల్లో చేయవలసిన యాగాలు కొన్ని ఉన్నాయి. ("సంవత్సరమేతద్ వ్రతం చరేత్" తై. ఆ. ౧-౩౨-౧, **వసన్తే బ్రాహ్మణోఽగ్నీనాదధీత**...తై. సం. ౫-౬-౫-౧). వాటిని సరిగా ఆచరించడానికి కాలనిర్ణయం కావాలి. అది జ్యోతిశ్శాస్త్రంపై ఆధారపడి ఉంది. కనుక ఈ ఆరు అంగాలు వేదాన్ని అధ్యయనం చేయడానికి అర్థాన్ని తెలుసుకోవడానికి బాగా ఉపయోగిస్తాయి.

**ప్రాతిశాఖ్యాలంటే ఏమిటి ?**

ప్రాతిశాఖ్యలు వేదరక్షణకోసం ఏర్పడ్డాయి. ప్రతి శాఖకు సంబంధించిన వర్ణసమామ్నాయం, స్వర - వ్యంజనసంఖ్య, స్వరోచ్చారణ పద్ధతులు, సంధులు, ప్రగృహ్యసంజ్ఞలు, పదవిభాగ నియమాలు, వాటికి అపవాదాలు, శబ్దవ్యుత్పత్తులు, నిర్వచనాలు ఇందులో వివరించబడతాయి. కాబట్టి వీటికి ప్రాతిశాఖ్యలని పేరు. ప్రాచీన భారతీయుల సంస్కృతభాషోచ్చారణ పద్ధతులను యథాతథంగా మనం వీటిద్వారా తెలుసుకోవచ్చు. ప్రాచీనభాషల ధ్వని సిద్ధాంతాలను తెలిసికోవాలనే భాషాశాస్త్రజ్ఞులకు నిజంగా ఇవి ఎంతో ఉపకారం చేస్తాయి.

వేదశాఖలకన్నింటికీ ప్రత్యేకమైన ప్రాతిశాఖ్యలుండేవని చెబుతారు. శాఖలకే నిలువనీడలేక నశించిపోయినప్పుడు ప్రాతిశాఖ్యంకు చోటెక్కడ దొరుకుతుంది? ఆ విజ్ఞానమంతా బూడిదపాలైంది. కాలగర్భంలోకి పోయినవి పోగా ఇప్పటికీ అయిదు ప్రాతిశాఖ్యలు దొరుకుతున్నాయి.

౧. **ఋక్ప్రాతిశాఖ్యమ్ :** అన్నింటిలో ప్రధానమైంది ఋక్సంహితకు సంబంధించిన ఋక్ప్రాతిశాఖ్యం. దీనికి పార్షదసూత్రము అని కూడ పేరు. ఛందస్సుకు ఇందులోగల వివరణ ప్రశంసనీయం. ఇది శౌనక ప్రణీతమని చెబుతారు. ఇందులో మూడు అధ్యాయాలున్నాయి. ఇది ఫ్రెంచి భాషలో ఎ. ఎగ్నియర్ చేత ౧౮౫౮ లో ప్రచురింపబడింది. దీన్ని ఎఫ్. మాక్స్‌ముల్లర్ జర్మన్ టిప్పణితో ౧౮౬౯ లో ప్రచురించాడు.

౨. **తైత్తిరీయ ప్రాతిశాఖ్యమ్ :** ఇది ఇరవైనాలుగధ్యాయాలు కలది. చాల సాంకేతికంగా ఉంటుంది. దీనికి "త్రిరత్న" భాష్యం ఉంది. దీని స్వరూపం ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఉంది.

౩. **శుక్లయజుః ప్రాతిశాఖ్యమ్ :** ఇది కాత్యాయనముని ప్రణీతం. ఎనిమిది అధ్యాయాలుగల ఈ ప్రాతిశాఖ్యానికి ఉవటుడు "మాతృమోదం" అనే భాష్యం వ్రాశాడు. ఇది ఆఱు ఖండాలుగా కాశీనుంచి ప్రచురింపబడింది.

౪. **సామప్రాతిశాఖ్యమ్ :** సామసంహితకు సంబంధించిన ప్రాతిశాఖ్యాన్ని పుష్పర్షి వ్రాశాడు. శాకటాయనుడు వ్రాసిన 'ఋక్తంత్రమ్' ప్రసిద్ధం. దీనిద్వారా ఇంకా కొన్ని గ్రంథాలేర్పడ్డాయి. వాటిలో 'పుష్పసూత్రమ్' అనేది ముఖ్యమైనది. దీన్ని ప్రాతిశాఖ్యం అని కూడా అంటారు. ఇందులో పది ప్రపాఠకాలు, పదకొండు కండికలు ఉన్నాయి. సామగానానికి సంబంధించిన వివరాలు దీనిలో ఇవ్వబడ్డాయి. సామతంత్రం, పంచవిధసూత్రం అనేవి దీనికి పరిశిష్టాలు.

౫. **అథర్వ ప్రాతిశాఖ్యమ్ :** అథర్వవేదానికి రెండు ప్రాతిశాఖ్యలు. రెంటిలో బాగా ముఖ్యమైంది **"శౌనకీయ చతురధ్యాయీ"** అని పిలువబడుతోంది.

**అనుక్రమణికలంటే ఏమిటి ?**

అనుక్రమణికలనే ఈ గ్రంథాలు వేదాల స్వరూపాన్ని ఉన్నది ఉన్నట్లుగా కాపాడటానికే ఏర్పడ్డాయి. అంత మాత్రమే కాకుండా ఇవి వేదార్థాన్ని తెలుసుకోవడానికి కూడా ఉపయోగపడతాయి. ఒక్కొక్క వేదాన్ని దర్శించిన మహర్షులెవరు ? ఈ మంత్రాలకు దేవతలెవరు ? ఈ సంహితలో ఏ యే ఛందస్సులున్నాయి ? ఈ సంహితావిభాగం ఎలా ఉంది ? ఇలాంటి ప్రశ్నలకు సమాధానాలు మనకు అనుక్రమణికల్లో లభిస్తాయి.

**భారతీయుల వేదార్థానుశీలనపద్ధతి :**

వేదాలు రహస్యార్థమయాలనే భావన భారతీయులలో ఎప్పటినుంచో ఉంది. అందుకనే ఋక్కులు "నిణ్యాని" (రహస్యస్తోత్రాలు) అని చెప్పబడినాయి. యాస్కుని నిరుక్తానికి ముందే శాకపూణి మొ॥ వారు వేదార్థాలను వివరించినారు. నిరుక్తరచనాకాలం నాటికే వేదార్థానుశీలనం మనదేశంలో అనేక విధాలుగా జరుగుతున్నట్లు తెలుస్తున్నది.

వేదాలను అధియజ్ఞ, అధిదైవత, అధ్యాత్మపరంగా భారతీయులైన సంప్రదాయ విదులు అర్థం చేసుకున్నారు. కనుకనే వేదాలన్నింటిలోను మూడు అర్థాలున్నాయని **"త్రయోఽర్థాః సర్వవేదేషు"** అని పురాణాలు చెబుతున్నాయి. ఈ మూడు మార్గాలలోను వేదమంత్రాలకు భాష్యాలేర్పడ్డాయి.

**వేదాలు ఏదో ఒక కాలానికి పరిమితమైనవా ?**

పురాతనమైన ఈ వేదరాశి ఇంతగా ఆధునిక విజ్ఞానం విస్తరించిన ఈ రోజుల్లో కూడ లోకానికి ప్రమాణమౌతుందా ? అని కొందరంటున్నారు. పెరిగిన ఆధునిక విజ్ఞానాన్ని సరిగా మంచిదృష్టితో ఉపయోగించుకుంటే మానవుడి భౌతికావసరాలను కొంతవరకు అది తీర్చగలుగుతుంది. దుర్వినియోగం చేస్తే సమాజంలో సంక్షోభాలను సృష్టించి అశాంతికి కారణమౌతుంది. కాని ఆధ్యాత్మికచైతన్యం కలిగించడానికి, మానవునిలో సత్ప్రవృత్తిని పెంచడానికి ఉదాత్తమైన సంస్కృతిని నెలకొల్పడానికి వేదవిజ్ఞానం ఎంతైనా అవసరం. కనుక వేదాలు ఈ కాలం ఆ కాలం అనకుండా అన్ని కాలాల్లోను సృష్టి ఉన్నంతవరకు పరమప్రమాణంగానే ఉంటాయి.

**పురాణాదివిద్యలు వేదజ్ఞానం కోసమేనా ?**

ప్రాచీనభారతీయుల దృష్టిలో వేదాలకు అత్యున్నత స్థానం ఉండేది. మానవజీవన వికాసాలకు వారు వేదాలను కేంద్రాలుగా భావించారు. వేదంలో చెప్పబడ్డ ధర్మాన్ని, తత్త్వాన్ని, సంస్కృతిని జీవనాడిగా పెట్టుకొని, దాన్ని ఉపబృంహణం (బీజభూతంగా ఉన్న తత్త్వాన్ని విస్తరించి చెప్పడం) చేయడానికే ఇతరవిద్యలన్నీ ఏర్పడ్డాయి. ఇతిహాసపురాణాలు వేదార్థోపబృంహణానికే ఏర్పడినట్లు మహాభారతం చెబుతున్నది. వేదాన్ని ఎలాబడితే అలా అర్థంచేసుకోవడానికి వీల్లేదు. దాన్ని ఉపబృంహణం చేసిన ఇతర వాఙ్మయాన్ని కూడా

దృష్టిలో పెట్టుకొని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించాలి. లోకకల్యాణకరం, అనల్పం, దివ్యమైన వేదార్థాన్ని వివరించడం కోసమే తరువాత వాఙ్మయమంతా ఏర్పడింది. వేదతత్త్వమే ప్రాచీన భారతీయుల భావనలలో, జీవనంలో సంస్కృతిలో ప్రతిబింబిస్తూండేది. అందుకే వారి జీవితాల్లో చాలా మటుకు శాంతికి కరువుండేదికాదు.

**వేదాల్లో ఏకదేవతావాదం :**

వేదాలుపైకి బహుదేవతావాదాన్ని ప్రతిపాదిస్తున్నట్లు కనపడ్డా వాటిల్లో ప్రతిపాదింపబడింది ఏకదేవతావాదమే. ఈ విషయాన్ని వేదభాష్యకారులు బాగా గుర్తించారు. కాని బహుళ ప్రచారంలో ఉన్న యజ్ఞయాగాది పద్ధతులను, వైదికధర్మాన్ని దృష్టిలో పెట్టుకొని అధియజ్ఞపరంగాను, అధిదైవతపరంగాను తమ తమ భాష్యాలను వ్రాశారు. అయినా అక్కడక్కడ వస్తుతత్త్వమైన ఆధ్యాత్మికార్థాన్ని చెప్పకుండా ఉండలేకపోయారు.

వారిదృష్టిలో వివిధదేవతానామాలతో పిలవబడే పరమేశ్వరుడే ఏకదేవత. ఆయనలో గల గుణకర్మల ననుసరించి ఆయా పేర్లతో ఆయన్ను పిలవడం ఆరాధించడం హవిస్సుల సమర్పించడం జరుగుతోంది. అందుకనే ఋగ్వేదం "ఏకం సత్ విప్రా బహుధావదన్తి" (౧-౧౬౪-౪౬). పరమేశ్వరుడు ఒక్కడే. విప్రులు ఆయన వివిధ దేవతలుగా చెబుతున్నారు అని పేర్కొంటున్నది.

**పాశ్చాత్యుల వేదార్థానుశీలనం :**

పాశ్చాత్యులెందరో వేదాలనర్థంచేసుకోవాలని అద్వితీయమైన పరిశ్రమచేశారు. భారతీయధర్మాన్ని, తత్త్వాన్ని ఆవాహనచేసుకోవడానికి వారెంతో శ్రద్ధను ప్రదర్శించారు. అది నిర్వ్యాజమైన శ్రద్ధకాదని భారతీయులు అనుమానించకపోలేదు. అయినా వేదవాఙ్మయాన్ని వెలుగులోకి తీసుకొనిరావడానికి చేసిన పరిశ్రమ అభినందించదగినది. పాశ్చాత్యులు ఇంతపరిశ్రమచేసి లోకానికి వేదవాఙ్మయాన్ని అందించినా ఎందుకు భారతీయులకు కనువిప్పు కలిగింది? వారిపేర్లు చెప్పుకొని కాలక్షేపం చేసేవారేకాని నిజమైన భక్తివిశ్వాసాలతో ఎందరు భారతీయులు ఈ వాఙ్మయానికి సేవ చేయడానికి ముందుకు వస్తున్నారు? ఇది చాల దురదృష్టకరమైన విషయం.

వేదవాఙ్మయ పరిశోధకులుగా పేరుపొందిన పాశ్చాత్యులందరూ న్యాయమైన మార్గంలో తమ పరిశోధనను కొనసాగించలేరు. ఏకొందరికో తప్ప మిగిలావరందరికీ భారతీయ వేదభాష్యాల పైన ఉండవలసినంత గౌరవాదరాలు లేవు. వైదిక గ్రంథప్రచురణద్వారా వారుచేసిన సేవను ప్రశంసించవచ్చునే గాని, ఆస్తికత్వాన్ని, ధార్మికదృక్పథాన్ని నిరాదరించే వారి వ్యాఖ్యానపద్ధతి అన్నివిధాలా యోగ్యమైనదని ఎలా అనగలం? వేదార్థవిచారణలో ఐతిహాసికసరణిని అవలంబించి వారు అన్నింటికీ కాలనిర్ణయాన్ని చేశారు. ఈ పద్ధతిని సంప్రదాయవిదులు అంగీకరించరు.

**సమాజదృష్టి :**

ఎవరికివారు బ్రతుకుతెరువుకోసం తెంపరలాడుతున్న ఈ దీన సమాజంలో వేదాలు ఎవరికీ పట్టలేదు. ఇప్పటికే అసంఖ్యాకమైన సంప్రదాయాలు నామరూపాలు లేకుండా కాలగర్భంలో కలిసి పోయినాయి. అక్కడక్కడ మిణుకుమిణుక్కుమంటున్న ఈ వేద విజ్ఞానాన్ని ఎవరు పట్టుపట్టి పదిమందికీ తెలియజేస్తారు? తెలుసుకోవాలనే జిజ్ఞాస కొందరికి ఉన్నా వారికి వివరించి విడమరచి చెప్పగలవారెందరున్నారు? వేదం చదువుకున్నవారికి చాలామందికి వారు చదివిన వేదమహిమను గురించి లోకానికి చెప్పగలిగే స్తోమతలేదు. శాస్త్రాలు చదివినవారికి వేదం కొరుకుడుపడదు. ఆంగ్లభాషాపరిచయం కలవారికి చాలామందికి వేదాలపై పాశ్చాత్యదృక్పథం తప్ప ఇంకోటి మనసులో పడదు. పాశ్చాత్యుల రచనలు చాలవరకు వైదికసంస్కృతిని లోకానికి చాటడమనే ముసుగులో దాన్ని విమర్శించడానికే కంకణం కట్టుకున్నాయి. అయితే కొన్ని వాచ్యంగా ఆ పనిచేస్తే కొన్ని వ్యంగ్యంగా చేస్తున్నాయి. ఇంతో అంతో వేదవాఙ్మయంమీద అభిమానం ఉండి తెలుసుకోవాలనుకునే సామాన్యప్రజలకు వేదంలోని సారాంశం అందుబాటులో లేదు.

**వేద విజ్ఞానం - అతిపరం :**

భారతీయసంస్కృతికి విజ్ఞానానికి , జీవనవిధానానికి వేదాలు పునాదులని చెప్పేవాళ్ళేకాని, ఆ వేదాలలో ఏమున్నది ? అని ఎవరైనా ఉత్సాహవంతులు ప్రశ్నిస్తే వారికి మనశ్శాంతికలిగేటట్లు సమాధానం చెప్పేవాళ్ళు కరువైనారు. దానివల్ల సమాజంలో మన ప్రాచీన వాఙ్మయం పైన చిన్న చూపేర్పడింది. అది అలా అలా పవిత్రమైన వేదవాఙ్మయవినాశానికే దారితీసింది. నూటికి ౯౦ పాళ్లు ఇప్పటికే నశించిపోయింది. ఇప్పటికైనా ఏమేమి నశించిపోయిందో, ఏది మిగిలిఉందో కనీసం తెలుసుకుందామనుకుంటే భారతీయ సంప్రదాయాన్ననుసరించి వ్రాసినపుస్తకాలేవీ లేవు. పాశ్చాత్యుల రచనలోని దృక్పథం, చాపల్యం వేళ్ళూనుతున్నాయి. ఆంగ్లభాషతో పరిచయం ఉన్నవారు కొంతమంది వాటిని చదివి, నిజం చెప్పినా నమ్మలేని స్థితిలోకి దిగజారారు.

శుభం

వేదోఽఖిలో ధర్మమూలమ్

ఓ౩మ్

కృణ్వంతో విశ్వమార్యమ్

వేదమూలమిదం జ్ఞానమ్

# ఋగ్వేద - సంహిత

**(ఋషి, దేవత, ఛన్దస్సు, స్వరము, మంత్రానుక్రమణిక, పరిచయం సహితముగా)**


లిప్యనువాదకులు, సంపాదకులు, పరిశోధకులు

*సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద*

**ఆచార్య వట్టి కృష్ణారెడ్డి** ఎం.ఏ.,ఎం.ఎడ్. (పి.హెచ్‌డి.)

ప్రధానాచార్యులు

*శ్రీ బిజ్జ అనంతయ్య స్మారక ప్రాచ్యకళాశాల, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా.*

## ఋగ్వేద పరిచయము

# ఋగ్వేద పరిచయము

### ఋక్ అంటే ఏమిటి ?

శాఖోపశాఖలుగా విస్తరించిన వైదిక లౌకిక వాఙ్మయమహావృక్షానికి బీజభూతమైంది ఋగ్వేదం. దేనివల్ల దేవత స్తుతింపబడుతుందో అది ఋక్ (**ఋచ్యతే స్తూయతే దేవతా యయా సా ఋక్**) అనడం వల్ల 'ఋక్' శబ్దానికి 'స్తుతి' అని అర్థం. '**ఋచ = స్తుతౌ**' అనే ధాతువు నుంచి ఈ శబ్దం ఏర్పడింది. ఆయా యజ్ఞాల నిర్వహణకోసం ఏర్పడి, అక్కడక్కడా ఉన్న ఈ ఋక్కులన్నీ ఒక్కచోట కూర్చబడ్డాయి. ఈ ఋక్కుల కూర్పునే 'ఋక్సంహిత' అంటారు. జైమిని అర్థాన్ని బట్టి పాదవ్యవస్థకలది 'ఋక్' అంటాడు. పాదబంధంతో, వృత్తబంధంతో ఉండే అర్థ యుక్తమైన మంత్రం 'ఋక్' అనబడుతుంది.

### ఋగ్వేద సంక్షిప్త పరిచయము

**వేదచతుష్టయములో** ఋగ్వేదము ప్రధానమైనది. సంహితాసర్వస్వములో ఋగ్వేదమే సగభాగ మాక్రమించును. పరిగణనకు ప్రాచీనతకు కూడ ఋగ్వేదమే ప్రథమము. సామవేదములోని సూక్తము లన్నియు నించుమించుగా ఋగ్వేదము లోనివే. అథర్వణవేదములో సుమారు 1200 వరకు ఋగ్వేదంలోని సూక్తములే మరల వినిపించును. యజుర్వేద ములో కూడ ఋగ్వేదమంత్రము లెన్నియో గోచరించును. ఈ విధముగా ఇది వేదములన్నిటికి మూలమనిపించును. "**తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే**" ఇత్యాది శ్రుతివచనముల వలన నిదియే ముందుదయించినట్లు తెలియును. "**యద్వై యజ్ఞస్య సామ్నాయజుషా క్రియతే శిథిలం తద్ యద్ ఋచా తద్ దృఢమ్**" అని యజుస్సామముల ప్రయోగముచే యజ్ఞక్రియకు శైథిల్య మేర్పడుననియు ఋక్ప్రయోగముచే నది సుదృఢముగా సంతరింపబడుననియు చెప్పుటవలన దీని మహాత్మ్యమెట్టిదో విశద మగుచున్నది.

ఛందోనియమము కలిగి పాదవ్యవస్థతో నున్న మంత్రములకు ఋక్కులని పేరు. "**అర్చ్యతే ప్రశస్యతే అనేన దేవ విశేషః ఇతి ఋక్**" అని దీనివలన దేవతలు ప్రశంసింపబడుదురని నిర్వచింపబడినది. 'సంహిత' యనగా 'సంకలన' మని యర్థము. ఋక్కులన్నియు ఒకచోట సంగ్రహింపగా నేర్పడిన గ్రంథమే ఋగ్వేదసంహిత. పతంజలి ననుసరించి ఋగ్వేదమునకు 21 శాఖలు. చరణవ్యూహము ననుసరించి వీనిలో శాకల, బాష్కల, శాంఖాయన, మాండూకేయ, ఆశ్వలాయన శాఖ లైదును ముఖ్యమైనవి.

నేడు మనకు శాకల శాఖకు సంబంధించిన సంహిత మాత్రమే లభ్యమగుచున్నది. కాగా ఋగ్వేదసంహిత యనగా శాకల సంహిత యనియే గ్రహింపవలెను. ఇది 8 అష్టకములుగా విభక్తమైనది. అష్టకమున కెనిమిది చొప్పున దీనిలో 64 అధ్యాయము లున్నవి. ప్రతి అధ్యాయము కొన్ని వర్గలుగా విభజింపబడినది. కాగా మొత్తము 2006 వర్గ లిందున్నవి. మూడు మొదలు తొమ్మిది వరకు ఒక్కొక్క వర్గలో ఋక్కులు లేక మంత్రములుండును. ఋక్సంహితను వేరొకపద్ధతిలో కూడ విభజించిరి. ఈ పద్ధతిలో ఇది పది మండలములుగా పేర్కొనబడును. మండలము లన్నియూ చేరి 85 అనువాకములగును. అవి తిరిగి 1017 సూక్తములుగా విభజింపబడెను. కొన్ని మంత్రములు చేరి ఒక సూక్తమగును. అట్టి మంత్రములు ఋగ్వేదములో 10580 1/4 కలవని అనుక్రమణికలు లెక్కించినవి. శబ్దాలసంఖ్య 153826, అక్షరాల సంఖ్య 432000. వైదికసాహిత్యపరిరక్షణకై మనపూర్వులెంత జాగరూకులై యుండిరో తెలియుట కిది చాలును.

ఋక్సంహితలోని రెండవమండలము నుండి ఏడవమండలము వరకు గల భాగములొక్కొక్కటి ఒక్కొక్క ఋషివంశము వారిచే దర్శింపబడిన మంత్ర భాగములుగా పేర్కొనబడినవి. ఇవి వరుసగా గృత్సమద, విశ్వామిత్ర, వామదేవ, అత్రి, భరద్వాజ, వసిష్ఠఋషివంశములవి. ఈ కారణముచేత వీనికి వంశ మండలములు లేక గోత్రమండలములని పేరువచ్చినది. ఋగ్వేదములోని ఎనిమిదవ మండలము కణ్వ - అంగిరస గోత్రికులు దర్శించినది. సోమ (పవమాన) దేవతనుగూర్చి వేర్వేరు ఋషులు దర్శించిన మంత్రములన్నియూ ఒక చోట చేర్చి తొమ్మిదవ మండలములో సంగ్రహించిరి. అది కారణముగా దీనిని సోమ (పవమాన) మండల మని పేర్కొందురు. ప్రథమ మండలములో సుమారు ఇరువదిముగ్గురు ఋషులు దర్శించిన మంత్రములున్నవి. దశమ మండలములో

సుమారు ఇరువదిముగ్గురు ఋషులు దర్శించిన మంత్రములున్నవి. దశమ మండలములో కూడ ఎందరో ఋషులు దర్శించిన మంత్రములు సంగ్రహింపబడినవి. ఈ మండలములో కొందరు రాజర్షులు ఋషికలుకూడ పేర్కొనబడిరి. భాష, వర్ణ్య విషయము మున్నగు వానినిబట్టి ప్రథమ మండలములో కొంత భాగమును, దశమమండల మంతయును అర్వాచీన రచనమని అభిజ్ఞులు చెప్పుదురు.

ఋగ్వేదములోని మంత్రము లన్నియు స్వర ప్రాధానములు. ఈ స్వరము లయాత్మకముగా గోచరించును. మంత్రములు సుమారు పదునైదు వరకు గల వేర్వేరు ఛందములలో రచింపబడినవి. వైదికచ్ఛందము అక్షర గణనము, పాదవ్యవస్థ, పాదాంత్యవర్ణములలో కొంత వరకు గురు - లఘు క్రమ విన్యాసము మున్నగు లక్షణములతో నుండును. వైదికసూక్తములలో కొన్ని విషమచ్ఛందములుకూడ గోచరించును. కొన్ని ప్రగాథచ్ఛందములుగా రూపించును. సూక్తాంతమున ఛందము మారి సూక్తసమాప్తిని సూచించుచుండును.

వేదము ధర్మమూలము. ధర్మము యజ్ఞరూపమున ననుష్ఠింపబడను. యజ్ఞసిద్ధియే వేదములకు పరమలక్ష్యము. యజ్ఞములో ఆయా దేవతలు తత్తత్స్తుతి పరములైన మంత్రములచే ఆహ్వానింపబడి హవిర్భాగము లందజేయబడుదురు. ఋగ్వేదములో నట్టి దేవతాస్తుతిపరములైన మంత్రములే ముఖ్యముగా సంగ్రహింపబడినవి. యజ్ఞములో హోతయీ మంత్రములను పఠించి ఆయా దేవతలను స్తుతించుచుండును. అగ్నిముఖమున వారు తమ తమ యజ్ఞ భాగములందుకొందురు.

వైదికదేవతలు పృథివ్యంతరిక్షద్యుః స్థానీయులుగా ముప్పిధములు. పృథివీస్థానీయ దేవతగా అగ్ని ఋగ్వేదములో సుమారు రెండు వందల మంత్రములచే స్తోత్రము చేయబడెను. అంతరిక్ష స్థానీయదేవతలలో ఇంద్రుడు ప్రధానముగా వర్ణింపబడెను. అట్లే ద్యుఃస్థానీయయులలో సూర్యుడు ముఖ్యముగా స్తుతింపబడెను. వేరు వేరు నామములతో వీరే మరల మరల వర్ణింపబడు చుందురు. ఋగ్వేదము 1-139-11 ననుసరించి పృథివీ స్థానీయులు 11, అంతరిక్షస్థానీయులు 11, ద్యుస్థానీయులు 11, మొత్తము 33గురు దేవతలు ముఖ్యులు. శతపథ బ్రాహ్మణములో వసురుద్రాదిత్యులు ద్యావా పృథివీద్వయములతో కలిపి 33గురు దేవతలుగా పేర్కొనబడిరి. ఋగ్వేదములోనే స్థానాంతరమున (3-9-9, 10-52-6) దేవతల సంఖ్య 3339 గా చెప్పబడినది. విశాల మహిమాన్వితులు అనంత శక్తి సంపన్నులు అయిన దేవతల సంఖ్య ఎట్లు ఎంతని చెప్పినను అది ఔపచారికమే అనియు, వాస్తవమున కందరువేరి ఒకే నిత్య సత్యమైన పరమతత్త్వమున కంగరూపము లనియు చెప్పుదురు. **"మహాభాగ్యాత్ దేవతాయాః ఏక ఏవ ఆత్మా బహుధా స్తూయతే, ఏకస్యాత్మనోఽన్యే దేవాః ప్రత్యంగాని భవంతి"** అని నిరుక్తములో ఇదే విషయ ముల్లేఖింపబడినది. **"తస్యా మహాభాగ్యాత్ ఏకైకస్యా నామధేయాని భవంతి"** అని ఆ ఒకే పరమాత్మకు విభిన్న నామ (రూప)ములు కల్పింపబడినవని దుర్గాచార్యుడు వ్యాఖ్యానించెను. **"మహద్దేవానామసురత్వమేకమ్"** అని ఋగ్వేదము 3-35-22 లో కూడా ఇదే సత్యముద్ఘోషింపబడెను. కాగా, ఋగ్వేదములో వర్ణించిన దేవతలందరును "ఏకం సత్" అని చెప్పబడిన ఒకే ఒక పరతత్త్వమునకు పరి పరి విధములుగా కల్పించుకొనిన నామరూపాత్మకమైన విభూతిబాహుళ్య మనియే యెంచవలెను. కాగా వర్ణించిన దేవతా భౌతికస్వరూపముతోపాటు, తదధిష్ఠానదేవతాసత్త్వరూపమును, తన్మూలమైన పరమాత్మతత్త్వమును కూడ ప్రతి మంత్రమునందుముద్దేశింపబడినవనియే తెలియవలెను. ఈ దృష్టితో చూచినచో వేదములో వర్ణించిన ఇంద్రాగ్ని వరుణాదిత్య పవమాన మరుదశ్వినులేమి, అదిత్యుషస్సరస్వత్యాది దేవతలేమి, మన్యుశ్రద్ధాదులేమి, అన్నియు ఒకే పరమాత్మకు చెందిన, తదభిన్నమైన శక్తులుగా రూపించును. వేదములో ఆయా దేవతలు విభవాత్మైశ్వర్యమండితులుగను, ఋతస్వరూపులుగను, సత్యసూనులగను వర్ణింపబడిరి. ఏ దేవతను వర్ణించినపుడా దేవతయే అన్నిటిని మించిన దేవతగా వర్ణింపబడును. తిరిగి ఒక దేవతకింకొక దేవతతో అభేదముచెప్పబడును. వేర్వేరుగా వర్ణించుచునే చివర కన్నియు ఒకటే అని చెప్పబడుచుండును. ఒకటి సత్యమై తక్కిన వసత్యములగుటగాని, ఒక దేవత కింకొక దేవత హీనసమగుట కాని లేదు. స్త్రీ పురుష విభేదముకూడ పరతత్త్వములో గోచరింపదు.

ఒకే దేవతను పరి పరి విధములుగా కల్పించినట్లే వేర్వేరు దేవతలనొకే దేవతగా సాక్షాత్కరింపజేసికొనుటయు గోచరించును.

దేవతాస్వరూపవిషయమున నిట్టి సంక్లిష్టరహస్య కల్పన యుండుటచేతనే దీనిపరిజ్ఞాన విషయమున నత్యంత జాగరూకులై యుండవలెనని సనాతనులు హెచ్చరించెదరు. దేవతాస్వరూపము తెలియనిదే మంత్రమును వినియోగించి ప్రయోజనము లేదని ఘంటాఘోషముగా చెప్పుదురు.

**వేదితవ్యం దైవతం హి మంత్రే మంత్రే ప్రయత్నతః ।**
**దైవతజ్ఞో హి మంత్రాణాం తదర్థ మవగచ్ఛతి ॥**

**నహి కశ్చి దవిజ్ఞాయ యాథాతథ్యేన దైవతమ్ ।**
**లౌక్యానాం వైదికానాం వా కర్మణాం ఫలమశ్నుతే ॥**

అని బృహద్దేవతలో ప్రతిమంత్రమునకు చెప్పిన దేవతనెరిగినవారికే మంత్రార్థమవగతమగుననియు, దాని యథార్థ్యమెరుగనిదే ఆచరించిన లౌకిక వైదిక కర్మలకు ఫలము శూన్యమనియు చెప్పిన పంక్తులు వైదిక ధర్మమును, వేదమంత్రములను గూర్చి చర్చించునపుడు ముఖ్యముగా గమనింపదగినవి.

వేదము సకల విజ్ఞానమునకు మూలము, వైదికార్యుల అధిభౌతిక, అధిదైవిక, ఆధ్యాత్మిక సంపదౌన్నత్యము లేవి తెలియవలెనన్నను వేదమే పరమాధారము. ఋగ్వేదములో ఆనాటి లౌకిక జీవితమును పారలౌకిక విశ్వాసమును పరమార్థచింతనమునుకూడ అద్దములో వలె దర్శింపవచ్చును. దశమమండల మీరీతి విషయములెన్నిటినో తెలియజేయును. సృష్టిరహస్యమును గూర్చిగహనగంభీరమైన విచికిత్స నొనర్చు నాసదీయసూక్తమీ మండలములో 129వ సూక్తము. దీనిలో సృష్ట్యాదిలో అసత్ గాని సత్ గాని లేదనియు, పృథివ్యాకాశములు గోచరింపవనియు, ఆవరణశూన్యమైన తత్ స్థితిలో జలమున్నదేమో తెలియదనియు, మృత్యువుగాని, అమరత్వముగాని దివారాత్రవిభేదముగాని లేవనియు చెప్పి, "**ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కించనాస**" అని వాయుశూన్యమైన ఆ స్థితిలో ఆత్మావలంబనముచే శ్వాస ప్రశ్వాస లొనర్చుచున్న ఆ పరతత్త్వ మొక్కటి తప్ప మరేదియు లేదనియు వర్ణింపబడెను. ఇదే మండలములోని 120వ సూక్తము హిరణ్యగర్భ సూక్తము. దీనిలో పరమ పురుషవిచికిత్స యొనర్చబడెను. ఇందులోని మంత్రములన్నియు "**కస్మై దేవాయ హవిషా విధేమ**" అను ధ్రువ వాక్యముతో నంతమగు చుండును. 'కస్మై' అనుపదమున కెవరికి అని కాక, నామరూపాదుల కందక అనిర్వచనీయమై వెలుగుపరబ్రహ్మతత్త్వమునకే అను అర్థ మనుసంధింపవలె నని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు. ఈ సూక్తములో సృష్టికిముందే హిరణ్యగర్భుడు వెలసె ననియు, అతడే పురుషుడనియు, ఈ విశ్వమున కతడే భర్త, ధర్త, శాసకుడు, సర్వము ననియు, ఆ పురుషుడే దేవాదిదేవుడనియు వర్ణింపబడినది.

"**పురుష ఏవేదం సర్వం యద్భూతం యచ్చ భవ్యం**" అని పురుష ( పరబ్రహ్మ ) త్త్వమే యీ గోచరాగోచర సర్వ ప్రపంచముననియు, జరిగినది జరుగనున్నదికూడ ఆ పురుషుడే అనియు అతడీ విశ్వమంతటినీ ఆవరించినను పైగా కొంత మిగిలియుండుననియు, అతనిలో నొక చతుర్థ భాగ మీ భూతసృష్టియనియు మిగిలిన మూడు భాగములు అమృతశీలమైన దివమనియు, అతని నుండియే యీ విరాడ్రూప ముదయించిన దనియు, తిరిగి దీని నుండియే అతడువెలసెననియు చెప్పి వర్ణించు పురుషసూక్తమీ మండలములో 90వ సూక్తము. చాతుర్వర్ణ్యప్రశంస యిదే సూక్తములో స్పష్టముగా తొలిసారి వినిపించును.

ఈ మండలములోని 'నదీసూక్తము' లో గంగాయమునలు వర్ణింపబడినవి, దానసూక్తములో '**కేవలాఘో భవతి కేవలాదీ**' అని తనకు తానై వండుకొని వేరొకరికి పెట్టక భుజించువాడు పాపమునే భుజించునని చెప్పబడినది. ఋగ్వేదములోని దానసూక్తములలో ఎందరో దాతలు ప్రశంసింపబడిరి. దానమాహాత్మ్య ముగ్గడింపబడినది. అట్లే 'ద్యూతకారవిలాపసూక్తము'లో "**అక్షైర్మా దీవ్యః కృషి మిత్ కృషస్వ, విత్తే రమస్వ బహుమన్యమానం**" అని జూదమాడవలదనియు, కష్టపడి కృషిచేసి ధనధాన్యములంది

గౌరవముగా జీవింపవలసినదనియు నుపదేశింపబడెను. ఈ సూక్తములో జూదాని యవస్థ అత్యంత దయనీయముగా వర్ణింపబడెను. 'అరణ్యానీ' సూక్తములో ప్రాకృతిక దృశ్యము లతి మనోహరముగా వర్ణింపబడినవి. 'ఓషధీసూక్త' ములో రోగనివారణోపాయములతోపాటు ఔషధులెంతగనో వర్ణింపబడినవి.

భౌతికవిషయములయ్యును పారలౌకికతత్త్వముతో మేళవించు వివాహము, అంత్యేష్టివంటి లౌకికకర్మలకు సంబంధించు సూక్తము లీ మండలములో కనిపించును. వైదికార్యులు కన్యలను గౌరవించిరి. ధనధాన్యములిచ్చి సాలంకారముగా కన్యాదానము లొనర్చిరి. దౌహిత్రులను వారసులుగా నంగీకరించిరి. స్త్రీని గృహస్వామినిగా, సామ్రాజ్ఞిగా పేర్కొనిరి. విదుషీమణులైన లోపాముద్ర, ఘోష, విశ్వవార, లోమశ, శచి మున్నగు వారు మంత్రద్రష్టలైన ఋషికలుగా నెంచబడిరి. స్త్రీలు యజ్ఞకార్యములలో పాల్గొనుచుండిరి. వీరపత్నులై, వీరమాతలై మనుట వారి యాదర్శము. వేదకాలమునాటి ప్రజలు ఆత్మకు చావులేదని యెఱుగుదురు. సత్కర్మలకు సద్గతులును, దుష్కర్మలకు దుర్గతులును, ఫలములని గుర్తించిరి. దేవయాన పితృయాన మార్గములను, పితృలోకమును గూర్చి వారూహించి తెలిసికొనిరి.

జలప్రళయ దాశరాజ్ఞ యుద్ధాదులు వర్ణించు కథానకసూక్తములతో పాటు ఋగ్వేదములో కొన్ని సూక్తములు సంవాదరూపమున కూడనున్నవి. వీనిలో ఊర్వశీ పురూరవ సంవాదము, సరమాపణి సంవాదము, యమ యమీ సంవాదము నంటివి మిక్కిలి ప్రసిద్ధములు. ఇవి తరువాతిపురాణ సాహిత్యములో విస్తరించి వర్ణింపబడినవి.

వైదికార్యుల కాముష్మికచింత ఎంతయెక్కువో ఐహికచింతకూడ అంతయెక్కువ. వారి రెంటిని సమానముగా నరచేతికి దెచ్చుకొనిరి. "**జీవేమ శరదశ్శతం**" అని చెప్పుచునే, "**వ్యశేమ దేవహితం యదాయుః**" అని తీర్మానించుకొనిరి. శాంతికాములై సంపత్సౌఖ్యప్రదాయకమైన ఐకమత్యము నుద్బోధించును...

**సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః ।**

**సమానమస్తు వో మనో యథా వస్సుసహాసతి ॥**

అని లోకుల పరస్పరాధ్యవసాయములు, హృదయములు, మనస్సులు ఏకీభవించి సంఘీభావము పెంపొందవలెనను సదాశయము వెల్లడించిరి.

**సంహితా ప్రశంస :**

ఇప్పుడు ప్రచారంలో ఉన్న ఋక్సంహిత శాకలమహర్షిచేత మండల సూక్తరూపంలో విభజింపబడింది. శౌనకుడుకూడ ఇలాగే మండల - సూక్తవిభాగం చేసినట్లు ప్రసిద్ధి ఉంది. సామాన్యంగా సూక్తమంటే మంచిమాట అని అర్థం. ఇక్కడ కొన్ని ఋక్కుల సమూహం సూక్తమనబడుతుంది. ఈ సూక్తాలు ౧. ఋషిసూక్తం, ౨. దేవతాసూక్తం, ౩. ఛందస్సూక్తం, ౪. అర్థసూక్తమని నాలుగు రకాలు. ఒకే ఋషి దర్శనంచేసిన మంత్రసమూహానికి ఋషిసూక్తమని పేరు. ఒకే దేవతకు సంబంధించిన మంత్రసమూహం దేవతాసూక్తమనబడుతుంది. సమానమైన ఛందస్సులో చెప్పబడిన మంత్రసమూహం ఛందస్సూక్తమని పిలువబడుతుంది. ఒక విషయం పూర్తయ్యేవరకు చెప్పబడ్డ మంత్రాలన్నింటికి అర్థసూక్తమని వ్యవహారం.

**విషయం :**

వేదాల్లో చెప్పబడనివిషయం ఏముంటుంది? అందులోనూ ప్రపంచవాఙ్మయానికే మూలభూతమైన ఋగ్వేదంలో బీజప్రాయంగానైనా అభివర్ణింపబడని తత్త్వమేముంటుంది? ప్రపంచోత్పత్తిని గురించి వర్ణించిన 'నాసదీయసూక్తం' ఋగ్వేదం మొత్తానికే తలమానికంలాంటిది. ప్రపంచసృష్టితత్త్వాన్ని గురించి ఇందులో గల అనాటి వారి భావనలు ప్రపంచప్రసిద్ధులైన తాత్వికులెందరికో ఆశ్చర్యాన్ని కలిగించాయి. తరువాత అదేమాదిరి సృష్టిని గురించి చెప్పిన సూక్తం పురుషసూక్తం. ఇందులో విశ్వోత్పత్తిరహస్యం ఎంతో రమణీయంగా వర్ణింపబడింది. జీవుల సముత్పత్తి, వారి బంధమోక్షాలు, ప్రకృతిరహస్యాలు, ఆయా దేవతల స్తుతులు మొ॥ విషయాలెన్నో ఈ వేదంలో వున్నాయి.

ఈ సంహితలో ఏదైనా వస్తుతత్వాన్ని వర్ణించడానికి ఉపయోగించిన సంవాదరూపమైన సూక్తాలు ఎంతో విశిష్టమైనవి. లోకంలో అందరికీ ఉపయోగించే జ్ఞానాన్ని ఋక్సంహిత మనకందిస్తున్నది. ఆకాశయానం (౧-౧౧౬-౩) రాజధర్మం (౧౦-౧౨౪-౩-౪)

లోకహితంకోసం చేయవలసిన ఏకపత్నీవ్రతం, వివాహబంధం యొక్క వైశిష్ట్యం, స్త్రీగౌరవం, ఆశ్రమవ్యవస్థ, పునర్జన్మ, ఆయుర్వేదవిజ్ఞానం మొ॥ అనేక విషయాలు ఋక్సంహితలో ప్రధానంగా వర్ణింపబడ్డాయి.

**ఉపవేదం :**

ఋగ్వేదానికి ఆయుర్వేదం ఉపవేదం. దీనికి ౧. శల్య ౨. శాలాక్య ౩. కాయచికిత్స ౪. భూతవిద్య ౫. కౌమారభృత్య ౬. అగద ౭. రసాయన ౮. వాజీకరణాలనే పేరుతో ఎనిమిది అంగాలున్నాయి. ఇందులో చరక-సుశ్రుత-వాగ్భట - అష్టాంగ హృదయ- శార్ఙ్గధరసంహితా - మాధవనిదాన, భావప్రకాశాదులు ప్రసిద్ధగ్రంథాలు.

**మొత్తం శాఖలు :**

ఋగ్వేదానికి మొత్తం ౨౧ శాఖలుండేవని '**ఏకవింశతిధా బాహ్వృచమ్**' అని మహాభాష్యకారుడైన పతంజలిమాట. వాటిల్లో శాకల బాష్కల - ఆశ్వలాయన - శాంఖాయన మాండూకేయాలనే ఐదుశాఖలు ప్రచారంలో ఉండేవని చరణవ్యూహం పేర్కొంటున్నది? అందులో ఆశ్వలాయన - శాంఖాయన శాఖలు శాకల శాఖకంటె పెద్దగా విభిన్నమైనవి కావు.

శాకలశాఖలో పదకొండు వాలఖిల్యసూక్తాలు, ఖిలసూక్తాలుగా అంగీకరింపబడ్డాయి. వాటిని ఆశ్వలాయనశాఖలో ఖిల సూక్తాలుగా కాకుండా మూలగ్రంథంగానే స్వీకరించారు. శాంఖాయనశాఖలో కూడా వాటిలో కొన్ని మంత్రాలను వదిలేసి మిగతా వాటిని మూలగ్రంథంగానే పరిగణించారు. ఇదే శాకల శాఖతో ఈ రెండు శాఖలకు గల భేదం.

మాండూకేయశాఖలో ఇతరశాఖలకంటె ఏయే విశేషాలున్నాయో చరిత్రకందలేదు.

ప్రధానమైన ఈ శాఖలకు కొన్ని ఉపశాఖలున్నాయి. అందులో శాకల శాఖకు : ౧. ముద్గల ౨. గాలవ ౩. శాలీయ ౪. వాత్స్య ౫. శైశిరశాఖలు ఉపశాఖలు. బాష్కలశాఖకు : ౧. బౌధ్య ౨. అగ్నిమాఠర ౩. పరాశర ౪. జాతూకర్ణ్యశాఖలు ఉపశాఖలు. శాంఖాయనశాఖకు : ౧. కౌషీతకి ౨. మహాకౌషీతకి ౩. శాంబవ్య శాఖలు ఉపశాఖలు. ఇవికాక ౧. బహ్వృచ ౨. పైంగ్య ౩. ఉద్దాలక (అరుణ) ౪. శతబలాక్ష ౫. గజ ౬. బాష్కలి (భారద్వాజ) ౭. ఐతరేయ ౮. వాసిష్ఠ ౯. సులభ ౧౦. శౌనకశాఖలున్నట్లు తెలుస్తున్నది.

**దొరుకుతున్న శాఖలు :**

ప్రస్తుతం మనకు దొరుకుతున్న శాఖలు శాకల బాష్కల శాఖలనేవి రెండు. వీటికి పరస్పరం పెద్దగా చెప్పతగినన్ని భేదాలు లేవు శాకలశాఖలోని ఎనిమిది సూక్తాలు అధికంగా బాష్కలశాఖలో కనబడుతున్నాయని, ప్రథమమండలంలో కొంత గ్రంథభాగం బాష్కలశాఖలో వేరేస్థానంలో ఉన్నదని ఇదే ఈ రెండు శాఖలకు చెప్పదగిన భేదమని కొందరి అభిప్రాయం. ఇప్పటి సంహితాపాఠంలో ఇలాంటి విశేషాలు ఏమీ కన్పడవు. మొత్తంమీద ఋగ్వేదానికి ఏర్పడిన ఐదు శాఖల్లోను ప్రస్తుతం దొరుకుతున్న శాకలపాఠం పరంపరాప్రాప్తమైనది, అన్నివిధాల సరైనదని పండితులందరి విశ్వాసం.

**మొదలు - చివర :**

ఈ ఋక్సంహిత '**అగ్నిమీళే పురోహితం**' అనే అగ్నిసూక్తంతో ప్రారంభమై '**సమానీవ ఆకూతిః**' అనే సంజ్ఞాన మంత్రంతో పూర్తవుతున్నది.

**వేదవిభాగం :**

ప్రాచీనకాలంలో ఋక్కులు, యజుస్సులు, సామలు అన్నీ విడివిడిగా లేకుండా కలిసిపోయి ఒకే ఒక వేదరాశిగా ఉండేవి. అలాంటి మంత్రసమూహాన్నంతా ఆ రోజుల్లో మహర్షులు అధ్యయనం చేసేవారు. వారి అధ్యయనంలో ఋక్కులు యజుస్సులు, సామలు విడివిడిగా లేకపోయినా అన్నీ కలిసి ఉండేవి. కాలంగడచింది. అంతటి వేదరాశిని అధ్యయనం చేసే ఓపిక సామాన్యుల్లో సన్నగిల్లింది. వేద వ్యాసుడు ఇలాంటి సుకుమారమతుల సౌకర్యంకోసం వేదరాశిలో అక్కడక్కడా ఉన్న ఋక్కులనన్నింటినీ ఏరి ఒకచోట కూర్చాడు. అది ఋగ్వేదమయింది. యజుస్సులన్నీ ఒకచోట కూర్చాడు అది యజుర్వేదమయింది. సామలన్నీ కలసి సామవేదమయింది. అథర్వమంత్రాలన్నీ కలసి అథర్వవేదమైంది. ఇలా కూర్చడాన్నే సంధానం అంటారు. ఈ కూర్పునే సంహిత అంటారు. వీటిని పైల-వైశంపాయన - జైమిని - సుమంతులనే తన నల్గురు శిష్యులకు ఉపదేశించాడు వేదవ్యాసుడు. ఈ విషయాన్ని మహీధర భట్టభాస్కర దుర్గాచార్యులు వారి భాష్యాల్లో వివరీకరించారు.

అయితే ఆ రోజు ఆయన కూర్చిన సంహిత మళ్ళా ఎన్నో మార్పులకు గురైంది. ఆయా వేదాలను కొందరు మహర్షులు క్రమబద్ధంగా మళ్ళామళ్ళా కూరుస్తూవచ్చారు.

ఇలా ప్రతి వేదానికి సంహితాపాఠం దొరుకుతున్నది. దీన్నే మనం ఋక్సంహిత, యజుస్సంహిత, సామసంహిత, అథర్వసంహిత అని పిలుస్తుంటాం.

**సంహితాలక్షణం :**

సంహితాలక్షణాన్ని ఋగ్వేదప్రాతిశాఖ్యం, యజుర్వేదప్రాతిశాఖ్యం అష్టాధ్యాయి ఇలావివరిస్తున్నాయి. "**పదప్రకృతిః సంహితా**" (ఋ. ప్రా. ౨-౧) "**వర్ణానామేకప్రాణయోగః సంహితా**" (వాజ. ప్రా. ౧-౧౫౮) "**పరస్సన్నికర్షః సంహితా**" (అష్టా ౧-౪-౧౦౯)

**సంహితా భేదం :**

ఈ సంహితలు స్థూలంగా ౧. నిర్భుజసంహిత ౨. ప్రతృణ సంహిత అని రెండు రకాలు. ఇందులో మొదటిదైన నిర్భుజసంహితనే ఆర్షసంహిత అని కూడా అంటారు నిర్భుజసంహితలో పాఠం యథాక్రమంగా ఇలావుంటుంది.

**అగ్నిమీడే పురోహితమ్ :**

ప్రతృణ సంహిత, ౧. పదసంహిత ౨. క్రమసంహిత అని రెండు రకాలుగా ఉంటుంది. ఇది పదసంహితాపాఠం :

**అగ్నిం ఈడే, పురః హితమ్**

క్రమసంహితాపాఠం ఇలాఉంటుంది :

**అగ్నిం ఈడే, ఈడే, పురోహితమ్, పురోహితమితి పురః . హితమ్.**

ఈ క్రమసంహితాపాఠం , తరువాత చెప్పే జట మొ॥ ఎనిమిది వికృతి పాఠాలకు మూలభూతమైంది. ఈ క్రమపాఠం బాభ్రవ్యుడనే మహర్షి మొదట చేసినట్లు ప్రసిద్ధి.

**ఎనిమిది వికృతులు :**

ఇక్కడ ప్రసిద్ధమైన ఒక ఋగ్వేదమంత్రానికి సంహితాపాఠం, పదపాఠం, క్రమపాఠం ఎలాఉంటుందో వివరించి జట మొ॥ ఎనిమిది వికృతుల స్వరూపం ప్రతిపాదించబడుతుంది.

**౧. సంహితా పాఠం :**

ఓషధయస్సంవదన్తేసోమేనసహరాజ్ఞా
యస్మైకృణోతి బ్రాహ్మణస్తంరాజన్పారయామసి (ఋ. ౧౦-౯౭-౨౨)

**౨. పదపాఠం :**

ఓషధయః। సం। వదన్తే। సోమేన। సహ। రాజ్ఞా।
యస్మై। కృణోతి। బ్రాహ్మణః। తం। రాజన్। పారయామసి।

**౩. క్రమపాఠం:**

క్రమంగా రెండుపదాలను కలిపి చెప్పడమే క్రమపాఠం. ఇది ముక్తపదగ్రస్తంలాగా ఉంటుంది. దీన్నే యోగరూఢమైన సంహిత అని కూడా అంటారు. చూడండి.

ఓషధయః। సం। సం వదంతే। వదంతే సోమేన। సోమేన సహ।

సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా। యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం।

తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి।

ఈ క్రమపాఠంపైన ౧. జట ౨. మాల ౩. శిఖ ౪. రేఖ ౫. ధ్వజం ౬. దండం ౭. రథం ౮. ఘన అని ఎనిమిది వికృతపాఠాలు ఏర్పడాయని వ్యాడి శైశిరీయశాఖలో చెప్పాడు. వీటిల్లో జట దండం అనే రెండు వికృతులు చాలా ముఖ్యమైనవి. వీటి ద్వారానే మిగతా వికృతులు ఏర్పడుతున్నాయి. శిఖాపాఠం జటను అనుసరిస్తుంది. శిఖను దండ, మాలా, రేఖా, ధ్వజపాఠాలు అనుసరిస్తాయి. ఘనపాఠం దండపాఠాన్ని అనుసరిస్తుంది.

**పంచసంధులు :**

జటాపాఠంలో ౧. అనుక్రమం ౨. ఉత్క్రమం ౩. వ్యుత్క్రమం ౪. అభిక్రమం ౫. సంక్రమం అని అయిదు సంధులుంటాయి. వీటి స్వరూపం ఇలావుంటుంది.

౧. అనుక్రమం - ౧+౨; ౨+౩
౨. ఉత్క్రమం - ౨+౨; ౩+౩
౩. వ్యుత్క్రమం - ౨+౧; ౩+౨
౪. అభిక్రమం - ౧+౧; ౨+౨
౫. సంక్రమం - ౧+౨; ౨+౩

(మంత్రంలోని పదాల క్రమసంఖ్యనైన చూపబడింది.)

| అనుక్రమం | ఉత్క్రమం | వ్యుత్క్రమం | అభిక్రమం | సంక్రమం |
|---|---|---|---|---|
| ౧-౨ | ౨-౨ | ౨-౪ | ౧-౧ | ౧-౨ |

ఓషధయః సం సం సంసమోషధయః ఓషధయః ఓషధయః ఓషధయః సం
౧ ౨ ౨ ౨ ౨ ౧ ౧ ౧ ౧ ౨
సం వదన్తే వదన్తే వదన్తే వదన్తే సం సం సం సం వదన్తే
౨ ౩ ౩ ౩ ౩ ౨ ౨ ౨ ౨ ౩
వదన్తే సోమేన సోమేన సోమేన సోమేన వదన్తే వదన్తే వదన్తే వదన్తే సోమేన
౩ ౪ ౪ ౪ ౪ ౩ ౩ ౩ ౩ ౪
సోమేన సహ సహ సహ సహ సోమేన సోమేన సోమేన సోమేన సహ
౪ ౫ ౫ ౫ ౫ ౪ ౪ ౪ ౪ ౫
సహ రాజ్ఞా రాజ్ఞా రాజ్ఞా రాజ్ఞా సహ సహ సహ సహ రాజ్ఞా
౫ ౬ ౬ ౬ ౬ ౫ ౫ ౫ ౫ ౬
రాజ్ఞేతి రాజ్ఞా
౬ ౬

౪. జటాపాఠం : అనులోమ విలోమ క్రమంలో మంత్రాన్ని మూడుసార్లు చదవడాన్నే జటాపాఠం అంటారు.

అనులోమం ౧-౨+ విలోమం ౨+౧ అనులోమం ౧+౨

(క్రమం ౧-౨+ వ్యుత్క్రమం ౨-౧+ సంక్రమం ౧=౨)

ఓషధయస్ సం సమోషధయ ఓషధయస్ సమ్।
౧ ౨ ౨ ౧ ౧ ౨

సం వదన్తే వదన్తే సం సం వదన్తే॥
౨ ౩ ౩ ౨ ౨ ౩

వదన్తే సోమేన సోమేన వదన్తే వదన్తే సోమేన
౩ ౪ ౪ ౩ ౩ ౪

సోమేన సహ సహ సోమేన సోమేన సహ
౪ ౫ ౫ ౪ ౪ ౫

సహ రాజ్ఞా రాజ్ఞాసహ సహ రాజ్ఞా రాజ్ఞేతి రాజ్ఞా
౫ ౬ ౬ ౫ ౫ ౬ ౬ ౬

యస్మై కృణోతి కృణోతి యస్మై యస్మై కృణోతి
౭ ౮ ౮ ౭ ౭ ౮

కృణోతి బ్రాహ్మణో బ్రాహ్మణః కృణోతి కృణోతి బ్రాహ్మణః
౮ ౯ ౯ ౮ ౮ ౯

బ్రాహ్మణస్తం తం బ్రాహ్మణో బ్రాహ్మణస్తం
౯ ౧౦ ౧౦ ౯ ౯ ౧౦

తం రాజన్ రాజస్తం తం రాజన్
౧౦ ౧౧ ౧౧ ౧౦ ౧౦ ౧౧

రాజన్పారయామసి పారయామసి రాజన్ రాజన్పారయామసి
౧౧ ౧౨ ౧౨ ౧౧ ౧౧ ౧౨

పారయామసీతి పారయామసి।
౧౨ ౧౨

౫. మాలాపాఠం :

ఈ మాపాఠాలు ౧. క్రమమాల ౨. పుష్పమాల అని రెండు రకాలు. ఇందులో సగం ఋక్కు మొదటినుంచి చివరకు క్రమ విపర్యాసం చేస్తూ చెప్పడమే క్రమమాలాపాఠం.

క్రమమాలాపాఠం :

| | |
|---|---|
| ఓషధయః సం౧ | ౨ రాజ్ఞేతి రాజ్ఞా |
| సంవదన్తే ౩ | ౪ రాజ్ఞా సహ |
| వదన్తే సోమేన ౫ | ౬ సహ సోమేన |
| సోమేన సహ ౭ | ౮ సోమేన వదన్తే |
| సహ రాజ్ఞా ౯ | ౧౦ వదన్తే సం |
| రాజ్ఞేతి రాజ్ఞా ౧౧ | ౧౨ సమోషధయః |
| యస్మైకృణోతి ౧౩ | ౧౪ పారయామసీతి పారయామసి |
| కృణోతి బ్రాహ్మణః ౧౫ | ౧౬ పారయామసి రాజన్ |
| బ్రాహ్మణస్తం ౧౭ | ౧౮ రాజంస్తం |
| తం రాజన్ ౧౯ | ౨౦ తం బ్రాహ్మణః |
| రాజన్ పారయామసి ౨౧ | ౨౨ బ్రాహ్మణః కృణోతి |
| పారయామసీతి పారయామసి ౨౩ | ౨౪ కృణోతి యస్మై |

౬. పుష్పమాలాపాఠం :

క్రమవ్యుత్క్రమ సంక్రమాలు మూడు ఆవృత్తిని పొందడమే పుష్పమాలాపాఠం. ఇందులో పూలమాలలో లాగా పదాలు కూర్చ బడతాయి. ఇది జటాపాఠం లాంటిదే. కాని ప్రతి పదానికి విరామం, 'ఇతి' అనే పదాన్ని చేర్చడమే ఇందులో విశేషం. కొందరు పద సంధుల్లో కూడా 'ఇతి' అనే పదాన్ని చెబుతుంటారు.

| క్రమం (విరామం) | వ్యుత్క్రమం (విరామం) | సంక్రమం |
|---|---|---|
| ౧. ఓషధయః సం | సమోషధయః | ఓషధయః సం ఇతి (విరామం) |
| ౨. సం వదన్తే | వదన్తే సం | సంవదన్తే ఇతి (విరామం) |
| ౩. వదన్తే సోమేన | సోమేన వదన్తే | వదన్తేసోమేన ఇతి (విరామం) |
| ౪. సోమేన సహ | సహ సోమేన | సోమేన సహ ఇతి (విరామం) |
| ౫. సహ రాజ్ఞా | రాజ్ఞా సహ | సహ రాజ్ఞా ఇతి (విరామం) |
| ౬. రాజ్ఞేతి రాజ్ఞా | | |

౭. శిఖాపాఠం :

జటాపాఠానికి చివర, పైపదాన్ని చేరుస్తూ ఉండటమే శిఖాపాఠం.

ఓషధయః సం, సమోషధయః, ఓషధయః సం - వదన్తే।

సం వదన్తే, వదన్తే సం, సం వదన్తే - సోమేన।

వదన్తే సోమేన, సోమేన వదన్తే, వదన్తే సోమేన - సహ।

సోమేన సహ, సహ సోమేన, సోమేన సహ - రాజ్ఞా।

సహ రాజ్ఞా, రాజ్ఞా సహ, సహ రాజ్ఞా రాజ్ఞేతి రాజ్ఞా।

౮. రేఖాపాఠం :

రెండు పదాలను, మూడుపదాలను, నాలుగు పదాలను అయిదు పదాలను విడివిడిగా క్రమంగాను, తలక్రిందుగాను చెప్పడమే రేఖాపాఠం.

| | |
|---|---|
| ౨ పదాలు | ఓషధయః సం। సమోషధయః। ఓషధయః సం। |
| ౩ పదాలు | సం వదన్తే సోమేన। సోమేన వదన్తే సం। సం వదన్తే। |
| ౪ పదాలు | వదన్తే సోమేన సహ రాజ్ఞా। రాజ్ఞా సహ సోమేన వదన్తే। |
| | వదన్తే సోమేన। సోమేన సహ। సహరాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా। |

౯. ధ్వజపాఠం :

ఒక ఋక్కులో ఆదిపదాన్ని ఉచ్చరించి తరువాత ఋక్కులోని చివరపదాన్ని చెప్పడంగాని, లేక వర్గంలోని మొదట చివరపదాలను క్రమంగా చెప్పుతూ పోవడంగాని ధ్వజపాఠం అవుతుంది.

| ఆదిక్రమం | చివరిపదంతో చెప్పడం |
|---|---|
| ౧. ఓషధయః సం | ౨. పారయామసీతి పారయామసి |
| ౩. సం వదన్తే | ౪. రాజన్ పారయామసి |
| ౫. వదన్తే సోమేన | ౬. తం రాజన్ |
| ౭. సోమేన సహ | ౮. బ్రాహ్మణస్తం |
| ౯. సహ రాజ్ఞా | ౧౦. కృణోతి బ్రాహ్మణః |
| ౧౧. రాజ్ఞేతి రాజ్ఞా | ౧౨. యస్మై కృణోతి |
| ౧౩. యస్మై కృణోతి | ౧౪. రాజ్ఞేతి రాజ్ఞా |
| ౧౫. కృణోతి బ్రాహ్మణః | ౧౬. సహ రాజ్ఞా |
| ౧౭. బ్రాహ్మణస్తం | ౧౮. సోమేన సహ |
| ౧౯. తం రాజన్ | ౨౦. వదన్తే సోమేన |
| ౨౧. రాజన్ పారయామసి | ౨౨. సం వదన్తే |
| ౨౩. పారయామసీతి పారయామసి | ౨౪. ఓషధయః సం |

దండపాఠం :

ఋక్కులో సగాన్ని తీసుకొని ముందు క్రమంగాను, తరువాత తలక్రిందులుగాను మళ్ళా క్రమంగాను చెప్పి తరువాతిపదాన్ని జోడిస్తూ చెప్పుకుపోవడం దండపాఠం అవుతుంది.

౨. ఓషధయః సం। సమోషధయః॥

౩. ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సమోషధయః

౪. ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన సోమేన వదన్తే సమోషధయః।

౫. ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహసోమేన। వదన్తే సమోషధయః

౬. ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా రాజ్ఞా సహ సోమేన వదన్తే సమోషధయః।

ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ।

సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।

రథపాఠం :

పాదక్రమాన్ననుసరించి ఋక్కులోని ఉత్తరార్థాన్ని కలిపి దండపాఠంలాగా చెప్పితే అది రథపాఠమవుతుంది. ఈ పాఠం ద్విచక్రరథపాఠం, త్రిచక్రరథపాఠం, చతుశ్చక్రరథపాఠమనే భేదంతో మూడురకాలు. త్రిచక్రరథపాఠం ప్రతిపాదంలోను సమాన పదసంఖ్య ఉండే గాయత్రీఛందస్సులో ఉన్న మంత్రానికే కుదురుతుంది. చతుశ్చక్రరథపాఠం పాదాన్ని బట్టి ఏర్పడుతుంది.

ద్విచక్రరథపాఠం :

| పూర్వార్థం | | ఉత్తరార్థం |
|---|---|---|
| I | ౧. | ఓషధయః సం।యస్మై కృణోతి। ( ఒకేపాద క్రమం) |
| | | సమోషధయః।కృణోతి యస్మై। ( తలక్రింది) |
| II | ౧. | ఓషధయః సం। యస్మై కృణోతి |
| | | (రెండు పాదాలుండే క్రమం) |
| | ౨. | సం వదన్తే। కృణోతి బ్రాహ్మణః .. |

III ౧. వదన్తే నమోషధయః బ్రాహ్మణః కృణోతి యస్మై

(తలక్రిందు)

౨. సం వదన్తే కృణోతి బ్రాహ్మణః ,,

౩. ఓషధయః సం। యస్మై కృణోతి (మూడుపాదాలుండే క్రమం)

౪. వదన్తే సోమేన సోమేన వదన్తే నమోషధయః।

తం బ్రాహ్మబ్రాహ్మణస్తం కృణోతి యస్మై। (తలక్రిందు)

IV ౧. ఓషధయః సం। యస్మై కృణోతి (నాలుగుపాదాలుండే క్రమం)

౨. సం వదన్తే। కృణోతి బ్రాహ్మణః ,,

౩. వదన్తే సోమేన। బ్రాహ్మణస్తం ,,

౪. సోమేన సహ। తం రాజన్ ,,

సహ సోమేన వదన్తే నమోషధయః। రాజంస్తం బ్రాహ్మణః కృణోతి యస్మై।

(తలక్రిందు)

౧. ఓషధయః సం। యస్మై కృణోతి (అయిదుపాదాలుండే క్రమం)

౨. సం వదన్తే। కృణోతి బ్రాహ్మణః ,,

౩. వదన్తే సోమేన। బ్రాహ్మణస్తం ,,

౪. సోమేన సహ। తం రాజన్ ,,

౫. సహ రాజ్ఞా రాజన్ పారయామసి ,,

రాజ్ఞేతి రాజ్ఞా। పారయామసీతి పారయామసి।

(సమాప్తి)

**ఘనపాఠం :**

మంత్రం చివరినుంచి క్రమంగా మొదటిదాకా చెప్పి, మొదటినుంచి మళ్లీ చివరదాకా చెప్పడాన్నే ఘనపాఠమంటారు. ఈ ఘనపాఠం ౧. ఘనమని, ౨. ఘనవల్లభ మనీ మొదట రెండురకాలు. మళ్లా అవి ఒక్కొక్కటి రెండు రకాలు. మొత్తం ఘనపాఠాలు నాలుగు విధాలు.

I పూర్వార్ధం

౧. రాజ్ఞేతి రాజ్ఞా। సహ రాజ్ఞా। సోమేన సహ। వదన్తే సోమేన। సం వదన్తే ఓషధయః సం

(చివరినుంచి మొదటికి)

సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా రాజ్ఞేతి రాజ్ఞా

(మొదటినుంచి చివరకు)

II. ఉత్తరార్థం

౨. పారయామసీతి పారయామసి। రాజన్ పారయామసి। తం రాజన్ బ్రాహ్మణస్తం। కృణోతి బ్రాహ్మణః। యస్మై కృణోతి।

(చివరినుంచి మొదటికి)

కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి పారయామసీతి పరయామసి। (మొదటినుండి చివరకు)

వేదానికి సంబంధించిన పై పాఠాలను అధ్యయనం చేసిన వారిని ఆయా పేర్లతో పిలుస్తారు. ఉదా: క్రమపాఠం చదివిన వారిని క్రమపాఠి అంటారు. ఘనపాఠం చదివిన వారిని ఘనపాఠి' అంటారు.

ఇలా సంహితాపాఠం, పదపాఠం, క్రమపాఠం అని మూడు ప్రకృతిపాఠాలుండగా, వాటిల్లో క్రమపాఠంపైన పెరిగిన వికృతి పాఠాలు ఎనిమిది. ఇవన్నీ అన్ని వేదాలకు సంబంధించినవి. మరి, దేనికి ఈ పాఠాలు ఏర్పడ్డాయి? ఏమిటి వీటి ప్రయోజనం?

**ప్రయోజనం :**

కాత్యాయనుడు తన ప్రాతిశాఖ్యలో మంత్రాన్ని యథాతథంగా స్మరించడంకోసమే క్రమపాఠమని ఇలా చెప్పాడు. '**క్రమః స్మృతి ప్రయోజనః**' ( కా.ప్రా. ౪-౧౮).

ద్రష్టలైన మహర్షులు ఋక్కులను దర్శనంచేసిన చాలా కాలానికి దానికి సంహితాపాఠం ఏర్పడింది. ఈ పాఠంలో సంధినియమాలతో ఋక్కులలోని పదాలన్నీ సంధింపబడి ఉంటాయి. కాలక్రమేణ తరాలు గడిచే కొద్దీ ఈ సంహితాపాఠంలో ఏదైనా మార్పు రావచ్చు. పదాల్లో ఏదైనా మార్పు సంభవం. అసలు సంహితా పాఠమే నశించిపోవచ్చు. కనుక దీన్నెలాగైనా కాపాడుకోవాలి. ఏమిటి ఉపాయం ? అందుకే ఏర్పడింది పదపాఠం. సంధినియమాలతో సంధింపబడిన సంహితాపాఠంలోని పదాలను విభజించి చూపెడుతుంది ఈ పాఠం. సంహితాపాఠం ఏర్పడటానికి ముందుండే వేదస్వరూపాన్ని మనం ఈ పదపాఠంలో చూడొచ్చు.

ఈ పదపాఠం సంహితాపాఠం ఏర్పడిన కొద్దికాలానికి ఏర్పడింది దీనివల్ల ఋగ్వేదంలో ఏది మూలాంశం ? ఏది ప్రక్షిప్తభాగం అనే విషయం మనకు తెలుస్తుంది.

సంహితాపాఠసంరక్షణంకోసం ఏర్పడిన ఇంకొక ఉపాయమే క్రమపాఠం. ఇది కూడ

పదపాఠంలాగా ప్రాచీనమైనదే. ఈ క్రమపాఠంలో పదపాఠంలో ఉన్న ఒక్కొక్కపదం ముందు వెనకపదాలతో కలిపి రెండు సార్లు ఉచ్చరింపబడుతుంది.

ఇలాగే జటాదివికృతి పాఠాలు కూడా సంహితాసంరక్షణకోసం ఏర్పడినవే. ఇంకా సంహితాసంరక్షణకోసం తీసుకున్న జాగ్రత్తల్లో ప్రాతిశాఖ్యనిర్మాణం చెప్పదగింది. ఈ ప్రాతిశాఖ్యలు పదపాఠంలో విశ్లేషణాన్ని పొందిన పదాలు మళ్లా కలిసినప్పుడేర్పడే వర్ణవికారాదులను వివరిస్తున్నాయి.

ఇలా సంహితాస్వరూపపరిరక్షణోద్దేశ్యంతో ఏర్పడిందే పరిశిష్ట రూపంలో ఏర్పడిన అనుక్రమణి. సంహితాపాఠంలోని విషయాలను క్రమంగా వివరిస్తూ అందులోని సూక్తాలను, మంత్రాలను, పదాలను, అక్షరాలను కూడ ఇది లెక్క వేసి చెబుతుంది. ఇందువల్ల సంహితలో ఏ మార్పువచ్చినా వెంటనే తెలిసిపోతుంది.

ఇలా చరిత్రకందని కాలంలో ఏర్పడ్డ ఋగాదిసంహితలు అనేక పాఠవిశేషాలతో సంరక్షింపబడి ప్రపంచంలో ఏ సాహిత్యానికీ దొరకని రక్షణను పొంది, చెక్కుచెదరకుండా ఈనాటికీ మనకు లభిస్తున్నాయి.

**మంత్రద్రష్టలగు మహర్షులు:**

శబ్దాత్మకమైన పరబ్రహ్మస్వరూపం నిత్యమైంది. దీనికి ఆదికాని అంతంకాని లేదు. పరమాత్మ ఉచ్ఛ్వాసనిశ్శ్వాసరూపాలే వేదాలని పెద్దలు చెబుతారు. మన ఇంద్రియాలకు గోచరించే సత్యాలు అత్యల్పమైనవి. తపస్సంపన్నులైన మహర్షులు ఇంద్రియాలకు గోచరింపని వస్తువులను కూడ సమాధిదశను పొంది తెలుసుకోగలిగారు. అలా వారు ఋజుః ప్రవృత్తికలవారై నిర్మలాంతఃకరణాలతో కనుగొన్న జ్ఞానఖండికలే ఈ వేదమంత్రాలు. వారు మంత్రాలను రచించలేదు. అనంతవిశ్వంలో భగవంతుని ఊపిరిగా సంచరిస్తున్న శబ్దతరంగాలను తమశక్తితో పసికట్టి, వాటిని తరతరాలుగా లోకకళ్యాణం కలగడం కోసం మనకందించారు. అందుకే వారు సామాన్యులుకాని, కేవలం ఋషులు కాని కారు. అసామాన్యులు, మంత్రదర్శనం చేయజాలిన మహామహిమగల మహర్షులు. భగవంతుని ప్రేరణ వల్లనే ఈ వేదవాక్కులు వారి హృదయాల్లో ప్రవేశించినాయని ఋగ్వేదం చెబుతోంది.

ప్రపంచంలోని మానవపుస్తకభాండాగారంలో మొట్టమొదట ఆవిర్భవించిన గ్రంథరత్నం ఋగ్వేదం. ఈ ఋక్సంహితల్లో మంత్రాలను దర్శించిన మహామహులు ఎందరో వున్నారు. కారు, వారు ఆ మంత్రాలను రచించారని కొందరు ఆధునికులు అభిప్రాయపడుతున్నారు. వేదాలు పౌరుషేయాలని (మానవులచే వ్రాయబడ్డాయని) వారివాదం. వేదాలు అపౌరుషేయాలు (మానవులచే రచింపబడనివి) అనే సాంప్రదాయికుల అభిప్రాయానికి ఇది విరుద్ధమైంది. ఇక్కడ ఒక విశేషాన్ని మనం గమనించాలి. సాంప్రదాయికులు కొందరు వేదాలు పౌరుషేయాలని అంగీకరించి, ఆ పురుషుడు సామాన్యమానవుడు కాదు పరమపురుషుడైన భగవంతుడే అని సిద్ధాంతీకరించారు.

వేదాలు మనకందించే జ్ఞానం దివ్యమైంది. భూత - భవిష్యత్ - వర్తమాన కాలాల్లో మొక్కవోని ప్రామాణ్యంకలది. కాబట్టి కావ్యాదులను రచించే సామాన్యకవులకు, వారికి భేదాన్ని అంగీకరిస్తూ వారిని ద్రష్టలుగా స్వీకరించి వారికొక విశిష్ట స్థానమివ్వడము ముమ్మాటికీ సముచితం. భాషాతత్త్వజ్ఞులు, ప్రామాణికులైన పాణిన్యాదిమహర్షులు కూడా వారిని ద్రష్టలుగానే పేర్కొనడం గమనించదగిన విషయం. మొత్తం ఈ ఋక్సంహితను సుమారు ౪౦౩ మంది మహర్షులు దర్శించారు.

## ఛందస్సు

ఛందస్సు అనే పదం 'ఛద్' అనే ధాతువు నుంచి రూపొందింది. ఈ ధాతువుకు 'ఆహ్లాదం' అని అర్థం. కనుక ఛందస్సు అంటే (సంతోషం) కలిగించే వాక్సమూహం. ఈ సంతోషం ఆ వాక్సమూహం లోని గురులఘువులవల్ల వాటి ఆవృత్తి వల్ల, వాటి నియమపూర్వక విచ్ఛేదంవల్ల కలుగుతున్నది. ఇవన్నీ ఆ శబ్దసమూహంలోని లయను అభివ్యక్తం చేయడం ద్వారా ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాయి.

ఛందస్సులో నియతవిచ్ఛేదం అనేకరకాలుగా ఉన్నది. అందులో ఆ వాక్సమూహాన్ని లయానుగుణమైన పాదాలుగా, గణాలుగా విభజించడం ప్రధానమైంది. గణాలు గురులఘువుల కూడికవల్ల ఏర్పడుతున్నాయి. అక్షరాలకు గురుత్వంగాని వాటి ఉచ్చారణ కాలాన్ని బట్టి చెప్పబడుతుంది. ఆయా పాదాల్లో గురు లఘువులుండే స్థానాల మార్పువల్ల ఛందస్సులో అనేకరకాల గమనాలు ఏర్పడుతుంది. కాబట్టే (ఛందః పాదౌ తు వేదస్య) వేద పురుషునికి ఛందస్సు పాదాలు అని వర్ణింపబడింది.

పాదంలో ఉండే అక్షరసంఖ్యను బట్టి ఛందస్సు పేర్కొన బడుతోంది. ఛందస్సులో సాధారణంగా నాలుగు పాదాలుంటాయి. పాదంలో ౧ మొదలు ౨౬ వరకు అక్షరాలుంటాయి. కనుక ౨౬ ఛందస్సులు ఉన్నాయి. అవి సామాన్యంగా నాలుగు వర్గాలుగా విభజింపబడ్డాయి.

౧ వ వర్గం: (౧) ఉక్త (౨) అత్యుక్త (౩) మధ్య (౪) ప్రతిష్ఠ (౫) సుప్రతిష్ఠ. వీటికి అనార్షచ్ఛందస్సులని పేరు.

౨ వ వర్గం: (౬) గాయత్రి (౭) ఉష్ణిక్ (౮) అనుష్టుప్ (౯) బృహతి (౧౦) పంక్తి (౧౧) త్రిష్టుప్ (౧౨) జగతి. వీటికి బృహచ్ఛందస్సులని పేరు.

౩ వ వర్గం : (౧౩) అతిజగతి (౧౪) శక్వరి (౧౫) అతిశక్వరి (౧౬) అష్టి (౧౭) అత్యష్టి (౧౮) ధృతి (౧౯) అతిధృతి. వీటికి అతిచ్ఛందస్సులని పేరు.

౪ వ వర్గం : (౨౦) కృతి (౨౧) ప్రకృతి (౨౨) ఆకృతి (౨౩) వికృతి (౨౪) సంకృతి (౨౫) అభికృతి (౨౬) ఉత్కృతి. వీటికి కృతిచ్ఛందస్సులని పేరు (౧-౨౬) వరుస సంఖ్యలు ఆయా ఛందస్సుల్లో ఒకపాదంలోని అక్షరాల సంఖ్యను తెలుపుతున్నాయి. ) ఋగ్వేదంలోని ౨,౩ వర్గాల్లోని ఛందస్సులు మాత్రమే ఉన్నాయి.

ఛందోవిజ్ఞానంతో కూడిన వైదిక కర్మానుష్ఠానం ప్రశస్తమైంది కనుక ఛందస్సు చాల ఆవశ్యకమైంది ఛందస్సు వేదాంగంగా పరిగణింపబడింది. ఋగ్వేదంలోని ఛందస్సు 'ఋక్ప్రాతిశాఖ్యం' ౧౬,౧౭,౧౮ పటలాల్లో వివరింపబడింది. నిదానసూత్రాలు వైదికచ్ఛందస్సుల పేర్లను, వాటి స్వభావాల్ని వివరిస్తున్నాయి ఇందులో వేదఋక్కులకు సంబంధించిన అనుక్రమణిక ఉంది. ఛందో గ్రంథాల్లో పింగళమహర్షి రచించిన ఛందోసూత్రం మొట్టమొదటిది. దాన్నే వేదాంగమైన ఛందస్సుగా పరిగణించారు. కాత్యాయనుని సర్వానుక్రమణికలో ఋగ్వేదంలోని ఛందస్సు సమగ్రంగా వివరించబడింది.

ఋగ్వేదంలోని పురుషసూక్తంలో ఛందస్సు ఆవిర్భావం తెలుపబడింది. **"తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః ఋచః సామాని జజ్ఞిరే ఛందాంసి జజ్ఞిరే తస్మాత్ యజుః తస్మాత్ అజాయత"** (౧౦-౯౦-౯) 'సర్వహుత్' యజ్ఞంనుంచి ఋక్కులు, సామలు పుట్టాయి. దానినుంచే ఛందస్సులు జనించాయి. యజస్సులు పుట్టాయి. ఇక్కడ ఛందాంసి అంటే గాయత్ర్యాది ఛందస్సులు అని సాయణుడు వివరించాడు. అథర్వవేదమని పాశ్చాత్యపండితులు భావించారు.

**ఛందోవికాసపరిణామాలు :**

వైదికచ్ఛందస్సుల్లో ముఖ్యమైన బృహచ్ఛందస్సుల (గాయత్రి....జగతి) నుంచే లౌకిక సాహిత్యంలోని శ్లోకం, వృత్తాలు ఏర్పడ్డాయి. వేదవాఙ్మయంలోమొట్టమొదటి ఛందస్సు మధుచ్ఛందుని ద్వారా రూపొందింది :

**అగ్నిమీడే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్ హోతారం రత్నధాతమమ్ ॥**

ఇది గాయత్రీఛందస్సు. ఇందులో ౮ అక్షరాలుగల ౩ పాదాలున్నాయి. మొత్తం అక్షరాలు ఇరవైనాలుగు. లౌకికవాఙ్మయంలో వాల్మీకిమహర్షి ముఖం నుంచి ఛందస్సు ఇలా ఆవిర్భవించింది :

**మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః।**
**యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్॥** రామా. బాల. ౨-౧౫.

ఇది అనుష్టుప్ఛందస్సు. ఇందులో ౩౨ అక్షరాలున్నాయి. అవి ౮ అక్షరాలు గల ౪ పాదాలుగ విభజింపబడ్డాయి. ఇది శ్లోకంగా ప్రసిద్ధికెక్కింది. శ్లోకమనే పదం ప్రస్తుతి చేయడంలో సార్థకమవుతున్నది. అష్టాక్షర, త్రిపదయైన వైదికగాయత్రియే లౌకికఛందస్సులో చతుష్పద అనుష్టుప్ శ్లోకంగా రూపొందింది. దీని లక్షణమిది.

౧. అక్షరాలు సమానంగా ఉండటం ౨. నాలుగు పాదాలుండటం ౩. లయతో కూడి ఉండటం

మూడు పాదాలు గల గాయత్రీఛందస్సు లౌకిక సాహిత్యంలో అంతర్ధానమైంది . వైదిక త్రిష్టుప్ నుంచే లౌకికఛందస్సులోని ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్ర, ఉపజాతి మొ॥ వృత్తాలు వికసించాయి. లౌకిక వంశస్థవృత్తం, వైదికజగతీవికాసమే. వైదికఅనుష్టుప్ లౌకిక సాహిత్యంలో సుశ్లోకంగా వర్ధిల్లింది.

పురాణేతిహాసధర్మశాస్త్రాది రచనల్లో ఈ అనుష్టుప్‌శ్లోకానికే ప్రథమస్థానం. క్షేమేంద్రుడు శాస్త్రాలు, నీతికావ్యాలు, పురాణాదులు ప్రశస్తార్థమైన అనుష్టుప్ఛందస్సులో రచించాలని సూచించాడు. రామాయణ భారతాదులు, పురాణాలు, మన్వాది ధర్మశాస్త్రాలు, అనుష్టుప్ఛందస్సులోనే రచింపబడ్డాయి. రామాయణంలో ప్రధానంగా అనుష్టుప్ఛందస్సు సర్గాంతంలోను కొన్ని విశేషసందర్భాల్లో మాత్రమే భిన్నవృత్తాలు ఉపయోగింపబడ్డాయి.

వైదిక ఛందస్సు పాదంలోని అక్షరసంఖ్యచేత గుర్తింపబడుతుండేది. ఆ ఛందస్సులన్నీ ౪ అక్షరాల తారతమ్యం కల్గి ఉన్నాయి. గాయత్రి ౨౪, ఉష్ణిక్ ౨౮, అనుష్టుప్ ౩౨ బృహతి ౩౬ మొదలైనవి. పింగళమహర్షి లక్షణం చెప్పడంలో సౌలభ్యం కోసం గణాల (త్రికము) పద్ధతిని ప్రవేశపెట్టాడు. లౌకికఛందస్సులోని వృత్తాలన్నీ గణబద్ధాలే.

వైదికఛందస్సు ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనే స్వరాలపైన, లౌకికఛందస్సు గురులఘు వర్ణాలపైన లేక అక్షరాల హ్రస్వ దీర్ఘాలపైన ఆధారపడి ఉంటుంది. వైదిక వాఙ్మయం గేయరూపంలో ఉంటే లౌకిక వాఙ్మయం పాఠ్యరూపంలో ఉంది. వీటికి కేంద్రంలో ఉన్న ఆదికావ్యమైన రామాయణం "పాఠ్యే గేయే చ మధురమ్" (రామా. బాల. ౪-౮) అని కీర్తింపబడుతున్నది.

భారతీయ సంప్రదాయం వైదికచ్ఛందస్సుకు పవిత్రతను సమకూర్చింది. అభిజ్ఞాన శాకుంతలంలో కాశ్యపుడు ఋక్ఛందస్సు నాశ్రయించి గర్భవతియైన శకుంతలను ఆశీర్వదించాడు.

ఈ పవిత్రభావమే రాను రాను వైదికచ్ఛందస్సు లౌకిక వాఙ్మయంలో అంతర్గానమవడానికి కారణమై ఉంటుంది.

ఇంతకు ముందు పేర్కొన్న ౨ వ వర్గానికి సంబంధించిన గాయత్రి మొ॥ ఏడు ఛందస్సులు దైవి, ఆసురి, ప్రాజాపత్య, యాజుషి, సామ్ని, ఆర్చి, బ్రాహ్మి అని ఏడురకాలుగా విభజింపబడ్డాయి. వాటి స్వరూపాన్ని ఈ పట్టిక తెలియచేస్తుంది.

| సంఖ్య | పేరు | గాయత్రి | ఉష్ణిక్ | అనుష్టుప్ | బృహతి | పంక్తి | త్రిష్టుప్ | జగతి |
|---|---|---|---|---|---|---|---|---|
| ౧ | దైవి | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ |
| ౨ | ఆసురి | ౧౫ | ౧౪ | ౧౩ | ౧౨ | ౧౧ | ౧౦ | ౯ |
| ౩ | ప్రాజాపత్య | ౮ | ౧౨ | ౧౬ | ౨౦ | ౨౪ | ౨౮ | ౩౨ |
| ౪ | యాజుషి | ౬ | ౭ | ౮ | ౯ | ౧౦ | ౧౧ | ౧౨ |
| ౫ | సామ్ని | ౧౨ | ౧౪ | ౧౬ | ౧౮ | ౨౦ | ౨౨ | ౨౪ |
| ౬ | ఆర్చి | ౧౮ | ౨౧ | ౨౪ | ౨౭ | ౩౦ | ౩౩ | ౩౬ |
| ౭ | బ్రాహ్మి | ౩౬ | ౪౨ | ౪౮ | ౫౪ | ౬౦ | ౬౬ | ౭౨ |

ఒక ఛందస్సులో ఉన్నమంత్రంలో ఒక అక్షరం తగ్గిపోతే 'నిచృత్' అని అంటారు. రెండక్షరాలు తగ్గితే 'విరాట్' అంటారు. లక్షణంకంటే ఒక అక్షరం ఎక్కువగా ఉంటే 'భురిక్' అని పేరు. రెండక్షరాలు ఎక్కువైతే 'స్వరాట్' అవుతుంది. ఇలా గాయత్రీఛందస్సులో ఏ మార్పువస్తే ఏ పేరుతో దాన్ని పిలుస్తామో ఈ క్రింద పట్టిక వివరంగా తెలియజేస్తుంది. అలాగే మిగతా ఛందస్సులను గ్రహించాలి.

పాదంలోని అక్షర సంఖ్యను బట్టి ఛందస్సులు రెండురకాలు. సమానమైన అక్షరసంఖ్యకల పాదాలు ఏ ఛందస్సులో ఉంటే అవి సమఛ్ఛందస్సులు. ఉదా- గాయత్రి, అనుష్టుప్, పంక్తి, త్రిష్టుప్, జగతి మొదలైనవి. అక్షరసంఖ్య విషమంగా ఉండే పాదాలుకల ఛందస్సులు విషమఛ్ఛందస్సులు. ఉదా - ఉష్ణిక్, పురఉష్ణిక్ కకుప్, బృహతి, అతిశక్వరి, అత్యష్టి మొదలైనవి.

| అక్షరాలు | గాయత్రి | పేరు |
|---|---|---|
| ౧. | దైవి | -- |
| ౨. | ,, | భురిక్ |
| ౩. | ,, | స్వరాట్ |
| ౪. | యాజుషి | విరాట్ |
| ౫. | ,, | నిచృత్ |
| ౬. | ,, | -- |
| ౭. | ,, | భురిక్, ప్రాజాపత్య, నిచృత్ |
| ౮. | ప్రాజాపత్య | -- |
| ౯. | ,, | -- |
| ౧౦. | ,, | స్వరాట్, సామ్ని, విరాట్ |
| ౧౧. | సామ్ని | నిచృత్ |
| ౧౨. | ,, | -- |
| ౧౩. | ,, | భురిక్, ఆసురి, విరాట్ |
| ౧౪. | ,, | స్వరాట్,, నిచృత్ |
| ౧౫. | ఆసురి | -- |
| ౧౬. | ,, | భురిక్, ఆర్చి విరాట్ |
| ౧౭. | ,, | స్వరాట్, ఆర్చి నిచృత్ |
| ౧౮. | ఆర్చి | -- |
| ౧౯. | ,, | భురిక్ |
| ౨౦. | ,, | స్వరాట్ |
| ౨౧. | పాదనిచృత్ | -- |
| ౨౨. | ఆర్షి | విరాట్ |
| ౨౩. | ,, | నిచృత్ |
| ౨౪. | ,, | -- |
| ౨౫. | ,, | భురిక్ |
| ౨౬. | ,, | స్వరాట్ |
| ౩౪. | బ్రాహ్మి | విరాట్ |

| అక్షరాలు | గాయత్రీ | పేరు |
|---|---|---|
| ౩౫. | ,, | నిచృత్ |
| ౩౬. | ,, | -- |
| ౩౭. | ,, | భురిక్ |
| ౩౮. | ,, | స్వరాట్ |

ఋక్సంహితలోని ఛందస్సులను వాటి భేదాలను ఇక్కడ సంగ్రహంగా పరిశీలిద్దాం.

౨౬ ఛందస్సులలో గాయత్రి ప్రథమగణ్యమైంది. "గాయత్రీ ఛందసామహమ్" (భ. గీ. ౧౦-౩౫) అని శ్రీకృష్ణుడు దాని ప్రాశస్త్యాన్ని వెల్లడించాడు. ఋగ్వేదంలోని మొట్టమొదటి ఋక్కు గాయత్రీ ఛందస్సులో వెలువడింది. ఋషి మధుచ్ఛందుడు. దేవత అగ్ని.

I. గాయత్రీ : 3 పాదాలు ౮+౮+౮ = ౨౪ అక్షరాలు

అగ్నిమీడే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్।
హోతారం రత్నధాతమమ్ ॥ (౧-౧-౧)

౧. అతినిచృత్ : ౭+౬+౭ = ౨౦ అక్షరాలు

పురూతమం పురూణాం స్తోతౄణాం వివాచి।
వాజేభిర్వాజయతామ్॥ (౬-౪౫-౨౯)

౨. పాదనిచృత్ : ౭+౭+౭ = ౨౦ అక్షరాలు.

క్వ నః సుమ్నా నవ్యాంసి మరుతః క్వ సువితా।
క్వో౩ విశ్వాని సౌభగా ॥ (౧-౩౮-౩)

౩. వర్ధమానా : ౬+౭+౮=౨౧ అక్షరాలు

ఓర్వప్రా అమర్త్యా నివతో దేవ్యుద్వతః।
జ్యోతిషా బాధతే తమః॥ (౧౦-౧౨౭-౨)

౪. విరాట్ : ౯+౬+౭=౨౨ అక్షరాలు

యత్రోత బాధితేభ్యశ్చక్రం, కుత్సాయ యుధ్యతే।
ముషాయ ఇంద్రసూర్యమ్॥ (౪-౩౦-౪)

౫. యవమధ్యా విరాట్ : ౭+౮+౭=౨౨ అక్షరాలు

మిమీహి శ్లోకమాస్యే, పర్జన్య ఇవ తతనః।
గాయ గాయత్రముక్థ్యమ్॥ (౧-౩౮-౧౪)

౬. నిచృత్ : ౮+౮+౭ = ౨౩ అక్షరాలు

నకిరింద్ర త్వదుత్తరో, న జ్యాయాం అస్తి వృత్రహన్।
నకిరేవా యథా త్వమ్ ॥ (౪-౩౦-౧)

౭. యవమధ్యా గాయత్రీ: ౭+౧౦+౭=౨౪ అక్షరాలు

స సున్వే యో వసూనాం యో రాయామానేతా య
ఇళానాం సోమో యః సుక్షితీనామ్॥(౯-౧౦౮-౧౩)

౮. ఉష్ణిగ్గర్భా : ౬+౭+౧౧=౨౪ అక్షరాలు

తామే అశ్వ్యానాం హరీణాం నితోశనా।
ఉతో ను కృత్వ్యానాం నృవాహసా ॥(౮-౨౫-౨౩)

౯. భురిక్ : ౮+౧౦+౭ = ౨౫ అక్షరాలు

విద్వాంసా విదురః పృచ్ఛేదవిద్వానిత్థాపరో అచేతాః।
నూ చిన్ను మర్తే అక్రౌ॥ (౧-౧౨౦-౨)

౧౦. భురిక్ పదపంక్తి : ౫+౫+౫+౫+౬=౨౬ అక్షరాలు.

ఘృతం న పూతం తనూరరేపాః శుచి హిరణ్యమ్।
తత్తే రుక్మో న, రోచత స్వధా వః ॥ (౪-౧౦-౬)

II. ఉష్ణిక్ : మూడు పాదాలు. ౮+౮+౧౨ = ౨౮ అక్షరాలు.

అగ్నే వాజస్య గోమత, ఈశానః సహసో యహో।
అస్మే ధేహి జాతవేదో మహిశ్రవః ॥ (౧-౭౯-౪)

౧. కకుమ్న్యంకుశిరా - నిచృత్ : ౧౧+౧౨+౪=౨౭ అక్షరాలు.

దధిర్ష్వస్వ దధిర్వసు దధిర్వాజేషు పురుహూత
వాజినమ్। నూన మథ ॥ (౮-౪౬-౧౫)

౨. కకుప్ : ౮+౧౨+౮ = ౨౮ అక్షరాలు

యుష్మాకం స్మా రథాం అను, ముదే దధే మరుతో
జీరదానవః।వృష్టీ ద్యావో యతీరివ ॥ (౫-౫౩-౫)

౩. పుర ఉష్ణిక్ : ౧౨+౮+౮ = ౨౮ అక్షరాలు

తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్।
పశ్యేమ శరదః శతం, జీవేమ శరదః శతమ్ ॥
(౭-౬-౧౬)

౪. పిపీలికామధ్యా : ౧౧+౬+౧౧ = ౨౮ అక్షరాలు.

హరీ యస్య సుయుజా నివ్రతా వేరర్వంతాను శేపా

ఉభా రజీ న కేశినా పతిర్దన్ ॥ (౧౦-౧౦౫-౨)

౫. తనుశిరా : ౧౧+౧౧+౬ = ౨౮ అక్షరాలు.

ప్ర యా ఘోషే భృగ వాణేవ శోభే,
యయా వాచా యజతి పజ్రియో వామ్ ।
ప్రైషయుర్న విద్వాన్ ॥ (౧-౧౨౦-౫)

౬. అనుష్టుప్ గర్భా : ౫+౮+౮+౮ = ౨౯ అక్షరాలు.

పితుం ను స్తోషం మహో ధర్మాణం తవిషీం ।
యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వ మర్దయత్ ।
(౧-౧౮౭-౧)

III. అనుష్టుప్ : ౪ పాదాలు. ౮+౮+౮+౮ = ౩౨ అక్షరాలు

సం గచ్ఛధ్వం సం వదధ్వం, సం వో మనాంసి
జానతామ్ దేవా భాగం యథాపూర్వే, సంజానానా
ఉపాసతే ॥ (౧౦-౧౯౧-౨)

౧. కావిరాట్ : ౯+౧౨+౯=౩౦ అక్షరాలు.

తా విద్వాంసా హవామహే వాం,
తా నో విద్వాంసా మన్మ వోచేతమద్య ।
ప్రార్చద్దయమానో యువా కుః ॥ (౧-౧౨౦-౩)

౨. ౧. విరాట్ : ౧౦+౧౦+౧౦=౩౦ అక్షరాలు.

శ్రుధీ హవం విపిపానస్యాద్రే
ర్బోధా విప్రస్యార్చతో మనీషామ్ ।
కృష్వా దువాంస్యంతమా సచేమా ॥ (౭-౨౨-౪)

౨. ౨. విరాట్ : ౧౧+౧౧+౧౧=౩౩ అక్షరాలు.

అగ్న ఇంద్రశ్చ దాశుషో దురోణే,
సుతావతో యజ్ఞమిహోపయాతమ్ ।
అమర్ధంతా సోమపేయాయ దేవా ॥ (౩-౨౫-౪)

౩. మహాపదపంక్తి : ౬ పాదాలు : ౫+౫+౫+౫+౫+౬=౩౧ అక్షరాలు.

తవస్యాదిష్యగ్నే, సందృష్టిరిదా చిదహ్న ఇదా చిదక్తోః ।
శ్రియే రుక్మో న, రోచత ఉపాకే ॥ (౪-౧౦-౫)

౪. విరాట్ : ౪ పాదాలు. ౮+౮+౮+౭ = ౩౧ అక్షరాలు.

ఋతావానం విచేతసం, పశ్యంతో ద్యామివ స్తృభిః ।
విశ్వేషా మధ్వరాణాం హస్కర్తారం దమే దమే ॥
(౪--౩)

౫. వస్తారపంక్తి : ౯+౧౦+౧౩=౩౨ అక్షరాలు.

వివ్యచ్మి పిక్యాశవ దేవా వ్యషట్ కృతస్యాద్యుతవ్య
ద్రప్సో పాతం చ నహ్యసో యువం చ రభ్యసో నః ॥
(౧-౧౨౦-౪)

౬. కృతి : ౧౨+౧౨+౮ = ౩౨ అక్షరాలు.

మా కస్మై ధాతమభ్యమిత్రిణే నో
మా కుత్రా నో గృహేభ్యో ధేనవో గుః ।
స్తనాభుజో అశిశ్వీః ॥ (౧-౧౨౦-౮)

౭. పిపీలికామధ్యా : ౧౨+౮+౧౨=౩౨ అక్షరాలు.

పర్యూ షుప్ర ధన్వ వాజసాతయే పరి వృత్రాణి సక్షణి
ర్ద్విషస్తరధ్యా ఋణయా న ఈయసే ॥
(౯-౧౧౦-౧)

౪. బృహతి : ౪ పాదాలు. ౮+౮+౧౨+౮ ౩౬ అక్షరాలు.

ఆఘోయోషేవ సూనర్యుషా యాతి ప్రభుంజతీ ।
జరయంతీ వృజనం పద్వదీయత ఉత్పాతయతి
పక్షిణః ॥ (౧-౪౮-౫)

౧. పిపీలికామధ్యా : ౧౩+౮+౧౩=౩౪ అక్షరాలు.

అభి వో వీరమంధసో మదేషు గాయ, గిరా మహా
విచేతసం ఇంద్రం నామ శ్రుత్యం శాకినం వచో యథా ॥
(౮-౪౬-౧౪)

౨. ఊర్ధ్వబృహతి : ౧౨+౧౨+౧౨ = ౩౬ అక్షరాలు.

అజీజనో అమృత మర్త్యేష్వా
ఋతస్య ధర్మన్నమృతస్య చారుణః ।
సదా సరో వాజమచ్ఛా సనిష్యదత్ ॥ (౯-౧౧౦-౪)

౩. పురస్తాత్ : ౧౨+౮+౮+౮=౩౬ అక్షరాలు.

అధీన్న్వత్ర సప్తతిం చ సప్త చ।
సద్యో దిదిష్ట తాన్వః, సద్యోదిదిష్ట పార్థ్యః,
సద్యో దిదిష్ట మాయవః ॥ (౧౦-౯౩-౧౫)

౪. ఉపరిష్టాత్ : ౮+౮+౮+౧౨=౩౬ అక్షరాలు.

న త మంహో న దురితం, దేవాసో అష్టమర్త్యం।
సజోషసో యమర్యమా, మిత్రో నయంతి వరుణో
అతిద్విషః ॥ (౧౦-౧౨౬-౧)

౫. న్యంకుసారిణీ / స్కంధగ్రీవ / ఉరోబృహతి : ౮+౧౨+౮+౮=౩౬.

ఈజానమిద్ ద్యౌర్గూర్తా, వసురీజానం భూమి రభి
ప్రభూషణి ఈజానం దేవావశ్వినా వభి
సుమ్నైరవర్ధతాం ॥ (౧౦-౧౩౨-౧)

౬. విష్టార : ౮+౧౦+౧౦+౮=౩౬ అక్షరాలు.

యువం హ్యాస్తం మహో రన్యువం వా యన్నిరతతం
సతమ్ తానో వసూ సుగోపా స్యాతం పాతం నో
వృకాదఘాయోః ॥ (౧-౧౨౦-౭)

౭. విషమపదా : ౯+౮+౧౧+౮ = ౩౬ అక్షరాలు.

సవితః సునవితరుగ్ర, చిత్ర చేతిష్ఠ సూనృత।
ప్రాసహా సమ్రాట్ సహురిం సహంతం,
భుజ్యుం వాజేషు పూర్వ్యమ్ ॥ (౮-౪౬-౨౦)

౮. బృహతి : (౮+౮+౧౨+౮) సతో బృహతి : (౧౨+౮+౧౨+౮)

ఒకదాని వెంట ఒకటి జంటయిగా ఉంటే ప్రగాథ
అనబడుతుంది. ఉదా ॥ ౭-౮౧-౧,౨,౩,౪,౫,౬
౭-౯౬-౧,౨. ఇట్టి ప్రగాథలు
౮ వ మండలంలో ఎక్కువగా ఉన్నాయి.

౫.పంక్తి : ౪ పాదాలు. ౧౨+౮+౧౨+౮ = ౪౦ అక్షరాలు. యం త్వా దేవాసో మనవే
దధురిహయజిష్ఠం హవ్యవాహన।
యం కణ్వో మేధ్యాతిథిర్ధనస్పృతం
యం వృషా యముపస్తుతః॥ (౧-౩౬-౧౦)
దీన్ని సంతంస్తం అంటారు.

౧. విరాట్ : ౧౦ x ౪ = ౪౦ అక్షరాలు

మన్యే త్వా యజ్ఞియం యజ్ఞియానాం
మన్యే త్వా చ్యవన మచ్యుతానామ్।
మన్యే త్వా సత్వనా మింద్ర కేతుం
మన్యే త్వా వృషభం చర్షణీనామ్ ॥ (౮-౯౬-౪)

౨. విపరీతసతోబృహతి : ౮+౧౨+౮+౧౨= ౪౦ అక్షరాలు.

య ఋష్వః శ్రావయత్సఖా విశ్వేత్స వేద జనిమా
పురుష్టుతః తం విశ్వే మానుషా యుగేంద్రం హవం
తే తవిషం యతస్రుచః ॥ (౮-౪౬-౧౨)

౩. ఆస్తార : ౮+౮+౧౨+౧౨ = ౪౦ అక్షరాలు.

అగ్నిం న స్వవృక్తిభి
ర్హోతారం త్వా వృణీమహే।
యజ్ఞాయస్తీర్ణ బర్హిషే వి వో మదే
శీరం పావకశోచిషం వివక్షసే ॥ (౧౦-౨౧-౧)

౪. ప్రస్తార : ౧౨+౧౨+౮+౮=౪౦ అక్షరాలు
ఉత నో దేవా వశ్వినా శుభస్పతీ ధామభిర్మిత్రావరుణా ఉరుష్యతామ్।
మహః స రాయ ఏషతేఽతి ధన్వేవదురితా ॥ (౧౦-౯౩-౬)

౫. సంస్తార : ౧౨+౮+౮+౧౨=౪౦ అక్షరాలు.

పితు భృతో న తంతుమి త్సుదానవః ప్రతి
దధ్మోయజామసి ఉషా అప స్వసుస్తమః సం వర్తయతి
వర్తనిం సుజాతతా ॥ (౧౦-౧౭౨-౩,౪)

౬. విష్టార : ౮+౧౨+౧౨+౮ = ౪౦ అక్షరాలు.

అగ్నే తవ శ్రవో వయో
మహి భ్రాజంతే అర్చయో విభావసో।
బృహద్భానో శవసా వాజముక్థ్యం
దధాసి దాశుషే కవే ॥ (౧౦-౧౪౦-౧)

౭. పథ్యాపంక్తి : ౫ పాదాలు. ౮x౫=౪౦ అక్షరాలు

మాదయస్వ సుతే స చా శవసే శూర రాధసే ।
విద్మా హి త్వా పురూ వసుముప కామాన్ త్ససృజ్మహే
ఉథా నో ఉవితా భవ ॥(౧-౮౧-౮)

౬. త్రిష్టుప్ : ౪ పాదాలు . ౪x౧౧-౪౪ అక్షరాలు

యో జాత ఏవ ప్రథమో మనస్వాన్
దేవో దేవాన్ క్రతునా పర్యభూషత్ ।
యస్య శుష్మాద్రోదసీ అభ్యసేతాం
నృమ్ణస్య మహ్నా స జనాస ఇంద్రః ॥ (౨-౧౨-౧)

౧. ఏకపదా : ౧౧ అక్షరాలు.

అపిక్ష్యం యజమానో న హోతా । (౪-౧౭-౧౫)

౨. ద్విపదా : ౨x౧౧=౨౨ అక్షరాలు.

అగ్నే భవ సుషమిధా సమిద్ధ,
ఉత బర్హి రుర్వియా విస్తృణీతామ్ ॥ (౭-౧౭-౧)

౩. విరాట్ : ౪ పాదాలు. అక్షరాలక్రమం లేదు. ౪౨ అక్షరాలు.

ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం
మర్త్యంచ హిరణ్యయేన సవితా రథేనా దేవో యాతి
భువనాని పశ్యన్॥ (౧-౩౫-౨)

౪. వివృత్ : ౪ పాదాలు. అక్షరక్రమం లేదు, ౪౩ అక్షరాలు.

బ్రహ్మణస్పతే త్వమస్య యంతా
సూక్తస్య బోధి తనయంచ జిన్వ ।
విశ్వం తద్భద్రం యదవంతి దేవా
బృహద్వదేమ విదథే సువీరాః ॥ (౨-౨౩-౧౯)

౫. అభిసారిణీ : ౧౦+౧౦+౧౨+౧౨=౪౪ అక్షరాలు.

యో వాచా వివాచో మృధ్రవాచః
పురూ సహస్రా శివా జఘాన ।
తత్తది దస్య పౌంస్యం గృణీమసి
పితేవ యస్తవిషీం వావృధే శవః ॥ (౧౦-౨౩-౫)

౬. విరాట్పూర్వా/పంక్త్యుత్తరా : ౧౦+౧౦+౮+౮+౮=౪౪ అక్షరాలు.

ఏవేంద్రాగ్నిభ్యా మహావి హవ్యం
శూష్యం ఘృతం న పూతమద్రిభిః ।
తా సూరిషు శ్రవో బృహద్రయిం గృణత్సు దిధృత
మిషం గృణత్సు దిధృతమ్ ॥ (౫-౮౬-౬)

౭. మహాబృహతి : ౮+౮+౧౨+౮+౮ = ౪౪ అక్షరాలు

బృహద్భిరగ్నే అర్చిభిః , శుక్రేణ దేవ శోచిషా ।
భరద్వాజే సమిధానో యవిష్ఠ్య,
రేవన్నః శుక్ర దీదిహి ద్యుమత్పావక దీదిహి ॥
(౬-౪౮-౭)

౮. భురిక్ : ౪ పాదాలు. అక్షరక్రమం లేదు. ౪౫ అక్షరాలు.

బృహస్పతే అతి యదర్యో
అర్హాద్ద్యుమ ద్విభాతి క్రతుమజ్జనేషు ।
యద్దీదయచ్ఛవస ఋతప్రజాత
తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్ ॥ (౨-౨౩-౧౫)

౯. స్వరాట్ : ౪ పాదాలు. అక్షరక్రమం లేదు ౪౬ అక్షరాలు.

ధామన్తే విశ్వం భువన మధి శ్రిత
మంతః సముద్రే హృద్యంతరాయుషి ।
అపామనీకే సమిథే య ఆభృత
స్తమశ్యామ మధుమంతం త ఊర్మిమ్ ॥
(౪-౫౮-౧౧)

౭. జగతి : ౪ పాదాలు ౧౨+౧౨+౧౨+౧౨=౪౮ అక్షరాలు

గణానాం త్వా గణపతిం హవామహే,
కవిం కవీనాముపమ శ్రవస్తమం ।
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత,
ఆ నః శృణ్వన్నూతిభిః సీద సాదనమ్॥ (౨-౨౩-౧)

౧. ఉపజగతి : ౧౨+౧౨+౧౧+౧౧ = ౪౬ అక్షరాలు

సో చిన్ను వృష్టిర్యూథ్యా స్వా సచాఁ ఇంద్రః
శ్మశ్రూణి హరితాభిప్రుష్ణుతే ।

అవ వేతి సుశ్రయం సుతే మధూదిద్,
ధూనోతి వాతో యథా వనమ్ ॥ (౧౦-౨౩-౪)

౨. విరాట్ : ౪ పాదాలు. అక్షరక్రమం లేదు. ౪౬ అక్షరాలు.

రేవాశ్చిత్తే అసుర్య ప్రచేతసో
బృహస్పతే యుక్తియం భాగమానశు ॥
ఉస్రా ఇవ సూర్యో జ్యోతిషా మహో
విశ్వేషామిజ్జనితా బ్రహ్మణామసి ॥ (౨-౨౩-౨)

౩. విధృత్ : ౪ పాదాలు. అక్షరక్రమం లేదు. ౪౭ అక్షరాలు.

అభిబాధ్య పరిరాపస్తమాంసి చ
జ్యోతిష్మంతం రథమృతస్య తిష్ఠసి ।
బృహస్పతే భీమ మమిత్ర దంభనం
రక్షోహణం గోత్రభిదం స్వర్విదమ్ ॥ (౨-౨౩-౩)

౪. మహాపంక్తి : ౬ పాదాలు. ౮x౬=౪౮ అక్షరాలు

మహి వో మహతామవో వరుణ మిత్ర దాశుషే ।
యమాదిత్యా అభిద్రుహో రక్షథానేమఘం నశ
దనేహసో వ ఊతయః సు ఊతయో వ ఊతయః ॥
(౮-౪౭-౧)

౫. సతో బృహతి : ౫ పాదాలు. అక్షరక్రమం లేదు.

౧౨+౧౨+౮+౮+౮=౪౮ అక్షరాలు.

ఆ యః పప్రౌ భానునా రోదసీ ఉభే ధూమేన ధావతే
దివి తిరస్తమో దదృశ ఊర్మ్యాస్వా శ్యావా
స్వరుషో వృషా శ్యావా అరుషో వృషా ॥ (౬-౪౮-౬)

ఈ విధంగా ఋగ్వేదకాలం నాటికే ఛందస్సులో, కావ్యరచనాకళలో ఎంతో వైవిధ్యం అభివృద్ధి, గోచరిస్తున్నాయి.

వైశిష్ట్యం

పవిత్రమైన ఋగ్వేదం ఇంకా ఇతర వేదగ్రంథాలు ఆ పరమ పురుషుని నిశ్వాసరూపాలని "అరే ఉన్య మహతో భూతస్య నిశ్వసితమేతద్యద్ ఋగ్వేదః అని బృహదారణ్యకోపనిషత్తులో (IV-౫-౧౧) మనం చదువుతున్నాం. ఇతర వేదాల్లాగానే ఋగ్వేదం కూడా దోషరహితమైంది, అనాదియైన జ్ఞానాన్ని మనకందించే మహాగ్రంథం. ఇది మానవులచే రచింపబడలేదని (అపౌరుషేయం) భగవంతునిచే ఇవ్వబడిందని ప్రాచీన వైదిక సంప్రదాయం అభిప్రాయపడుతోంది. వైదిక ఋషిపుంగవుల అనుభూతికి గోచరించిన దివ్యవాణి ఇది. ప్రపంచాన్ని సృష్టించి మానవజాతిని కొన్ని నియమాలతో (౧౦-౯౦-౧) నడిపించిన భగవంతునితో ఈ మహర్షులు తమ ప్రార్థనద్వారా చాల సన్నిహిత సంబంధం కలవారు. పద్యరూపంలో ఆవిష్కరింపబడ్డ సత్యమే ఈ వేదం. ఇది ఉదాత్తం అనుదాత్తం, స్వరితం అనే మూడు ముఖ్య స్వరాలతో ఉచ్చరింపబడుతోంది.

వైదిక సంప్రదాయాన్ననుసరించి ఇది అష్టకాలుగాను, మండలాలుగాను విభజింపబడుతోంది. బహ్వృచుల గ్రంథాలతో సంబంధం లేకుండానే ఐతరేయ-కౌషీతకీబ్రాహ్మణాలు, ఆరణ్యకాలు, ఆశ్వలాయనగృహ్య-శ్రౌతధర్మసూత్రాలు, ఇవన్నీ కలిసిన ఋగ్వేద వాఙ్మయం విస్తృతమై సువిశాలమై, ఆర్యధర్మాన్ని అంచనా వేయడంలో చాల ముఖ్యమైన స్థానాన్ని ఆక్రమిస్తున్నది.

ఋగ్వేదం చాలా ప్రాచీనం, విస్తృతమైన విజ్ఞానానికి మహాగ్రంథం కావడం వల్ల సామవేదానికి ౯౫ శాతం యజుర్వేదానికి ౨౫ శాతం అథర్వవేదానికి ౨౦శాతం కూడా ముఖ్యమైన ఆధారం కాగలిగింది.

సంసారసాగరాన్ని దాటి, ఇంద్రియనిగ్రహంతో అతీంద్రియ జ్ఞానాన్ని పొంది ద్రష్టలైన మహర్షులు భగవదనుగ్రహంవల్ల అనుభూతిని పొంది ఉచ్చరించినవే మంత్రరూపంలో ఉన్న ఈ స్తుతులని ఇంతకు పూర్వమే చెప్పబడింది.

ఋగ్వేదసూక్తాలద్వారా వారు దర్శించి లోకానికందించిన సత్యం ఏమిటి ? ఈ మహాత్ములు (విప్రాః కవయః) ఒకే ఒక సత్పదార్థం అనేక రూపాలలో వర్ణింపబడ్డట్లు నిజయోత్సాహంతో ప్రకటించారు. ఆ పరబ్రహ్మను, అగ్ని, యముడు, మాతరిశ్వ (౧-౧౬౪-౪౬) ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, సుపర్ణమనే ఒక పక్షిగా సంకేతం చేయబడ్డ ఒక దివ్యశక్తి అని వారు పిలిచారు. (౧౦-౧౧౪-౫). ఆనందపరవశులైన ఆ ద్రష్టలు ఒకే ఒక దివ్యపక్షిగా అతన్ని ఎన్నో రకాలుగా దర్శించారు. ఒకే ఒక అగ్ని రాజేయబడి పెరుగుతున్నాడు. ఒకే ఒక సూర్యుడు ప్రతివాడికి కనబడుతున్నాడు. ఒకే ఉషస్సు లోకాన్నంతా ప్రకాశింపజేస్తున్నది. ఆ ఒక్క పరబ్రహ్మ ఈ లోకంలో (౮-౫౮-౨) వ్యాపించిఉన్నది.

ఏయే రూపాల్లో భగవంతుణ్ణి మనం తెలుసుకుంటున్నామో ఆ పేర్లే ఆయనకు పెట్టబడ్డాయనే సిద్ధాంతాన్ని ఋగ్వేదం గట్టిగా అంగీకరిస్తున్నది.

ఆ పరతత్త్వం సచేతనం అచేతనం (౧౦-౧౨-౯); సత్పదార్థం అసత్పదార్థం కూడా (౧౦-౫-). అతడే భూమండలాన్ని తూర్పునుంచి పశ్చిమం వరకు ఆక్రమించిన యజ్ఞపురుషుడు (౧౦-౯౦-౫). భగవంతుడు మానవశరీరంలో నివసించడంవలన పురుషుడనబడుతున్నాడు. ఒక పక్షిలాగా ఆయన పురాలన్నిటిలో తిరుగుతూ ఉన్నాడు (పురాణ్యారు పురిశయః). అందువల్లనే అతడు సార్థకమైన పురుషశబ్దంతో పిలవబడుతున్నాడు. (బృ.ఉ. ౨-౫-౧౮). అదేవిధంగా భగవత్ప్రాణాన్ని లోపల ఇముడ్చుకొని ఉన్న మానవుడు కూడా పురుషుడని వ్యవహరింపబడుతున్నాడు.

ఆ పరమపురుషుని ప్రభావాన్ని లోకానికి తెలియజేయడానికే ఋగ్వేదసంస్కృతి యజ్ఞవ్యవస్థను ప్రవేశపెట్టింది. విశ్వమానవ కళ్యాణం కోసం ఆత్మసమర్పణం చేసుకోవడమే యజ్ఞభావనలోని ప్రధానతాత్పర్యం. అహివృత్రుడు ఇంద్రునిచేత చంపబడటం అనే సాంకేతికసంఘటన ఒక జీవిపై ఇంకో జీవి ఆధిక్యతను తెలియజేస్తున్నది. అగ్నిహోత్రయాగం చేసినవాడు తనలోని లోభం, దురాశ మొ॥ దుర్గుణాలను అణచి, మోహాన్ని కోపాన్ని తగ్గించుకుంటాడు. యాగశాలలో చేరిన ప్రజలందరు పరస్పర సహకారభావాన్ని పెంచుకోవాలని ఉపదేశించడమే ఈ యజ్ఞప్రక్రియ ప్రధానోద్దేశ్యం. తమలో అంతర్యామిగా ఉన్న భగవంతుని తెలుసుకోవడంద్వారా అందరూ తప్పక ఒకటౌతారనే సత్యాన్ని ప్రతివారు ఈయజ్ఞంవల్ల తెలుసుకోగలుగుతారు.

ఋగ్వేదంలోని ధార్మిక సాంఘిక - తాత్త్విక సూక్తాలలోని సూక్ష్మాంశాధ్యయనం నిర్వివాదంగా ఒక ఆదర్శసిద్ధాంతాన్ని మనకు తెలియజేస్తుంది. ఒక్కటే అయిన పరబ్రహ్మకు ఎందరో అయిన జీవులకు మధ్యలో ఉన్న సంబంధరూపమే వైదిక భావనామయమైన ఆ సిద్ధాంతం. 'విశ్వం ఏకమ్ (౩-౫౪-౮) 'విశ్వసత్యమ్ (౨-౨౪-౧౨) 'కృణ్వన్తో విశ్వమార్యమ్ (౯-౬౩-౫) మొ॥ ఋగ్వేదవాక్యాలలో ఈ స్వభావాన్ని మనం పరిశీలించవచ్చు. నిజంలాగా కనబడుతున్న భిన్నత్వంలోని ఏకత్వాన్ని ఈ ఆదర్శసిద్ధాంతం తెలియజేస్తున్నది. జాతినిర్మాతలు లోకంలోని ప్రతి సారుణ్ణి చక్కని వ్యక్తిత్వం గలవాణ్ణిగా తయారుచేయడానికి కృషిచేయాలి. ఈ విశ్వసత్యాన్ని బోధించే గ్రంథాలలో ఋగ్వేదం ప్రపంచంలోనే మొట్టమొదటిదనడం అతిశయోక్తి కాదు.

విశ్వమానవకల్యాణం కోసం ఋగ్వేదద్రష్టలు ఈనాటి సాంఘిక - ధార్మిక - ఆధ్యాత్మికభావనా స్వరూపంగల ముఖ్య సిద్ధాంతమైన భిన్నత్వంలో ఏకత్వాన్ని దర్శించి, ఆచరించి, బోధించారు. ఇది కేవలం వారికి ఋతతత్త్వం పైన ఉన్న విశ్వాసం వల్లనే జరిగింది.

ఈ ఋతం అవెస్తాలోని అశ తో పోల్చబడింది. ఋతశబ్దాన్ని ఇలా మూడువిధాలుగా వ్యాఖ్యానించారు. ౧. యజ్ఞప్రక్రియ (సత్యం, జలం, రాశిచక్రం), ౨. విశ్వక్రమం, ౩. ప్రపంచం యొక్క సమమైన సత్యమైన నడకకు సంబంధించిన నైతికక్రమం. ఇందులో మూడవదానివల్ల నైతికాదర్శాలకు ఆచరణకు ఒక చక్కని సమన్వయం కుదురుతుంది. ఋతం కలిగి, ఋతాన్ని నిలబెట్టి, ఋతాన్ని కలిగించే దేవతలు తేజస్సును, సత్యాన్ని వ్యాపింపచేయడానికి, అంధకారాన్ని, దౌర్జన్యాన్ని పారద్రోలడానికి (౧-౧౫౨-౩) సమష్టి ద్వారా విశ్వక్రమాన్ని కాపాడడానికి పెడుతున్నారని ఋగ్వేదంలో మనం తరచుగ చదువుతుంటాం. ఈ దేవతలు మానవుల అంతరంగాలలో ఉండే ఆలోచనలు గ్రహించి, మంచివారికి - చెడ్డ వారికి (౨-౨౭-౩) ధార్మికులకు - అధార్మికులకు కపటులకు-నిష్కపటులకు నిజాయితీపరులకు - మోసగాళ్లకు (౮-౧౮-౧౫) మధ్య ఉండే తేడాను గుర్తిస్తారు.

ఋతాన్ని లోకంలో నిలపడమే వరుణునికి ఆదిత్యులకు స్వధర్మం. వరుణుడు రక్షకుడు, దయామయుడు, మంచిప్రవృత్తికల దేవత. ఆదిత్యసూక్తాలు వరుణుని మోక్షప్రణాళికను ఒకనైతికమార్గంలో వివరిస్తున్నాయి. మనలోని తేజస్సును లేక భగవత్ప్రాణరూపమైన అభయమైన జ్యోతిస్సును ఆవాహన చేసుకోవడమే (౨-౨౭-౧౧) ఆ మార్గం. ఈ ప్రక్రియలో మనం నీతిమార్గంతో ప్రారంభమైన దేవతావాదంతో పూర్తయ్యే ఉన్నతమైన నీతిరసాస్వాదం చేస్తున్నాం.

ఆర్యధర్మంలోని ధర్మతత్త్వానికి పునాదియైన ఋతమనే ఆదర్శంతోపాటు, ఆధ్యాత్మికతత్త్వాలైన బ్రహ్మ, ఆత్మ, కర్మ, పునర్జన్మ మొదలైన విషయాలను కూడా ఋగ్వేదసూక్తాలలో మనం గుర్తించవచ్చు. నేటి హిందూతత్త్వశాస్త్రానికి మూలసిద్ధాంతాలు ఋగ్వేదంలోని పదవమండలంలో విశేషంగాను, ఇతరమండలాల్లో సామాన్యంగాను కనబడుతున్నాయి.

భారతీయులకు అత్యంత పవిత్రగ్రంథమైన ఋగ్వేదంలో కనబడే ఆకర్షణీయమైన సామెతలద్వారా ప్రపంచవిజ్ఞానానికి ఋగ్వేదంచేసిన ఉపకారం ఎలాంటిదనే విషయాన్ని మనం తెలుసుకోవచ్చు.

(అ) నేను మట్టితో కట్టిన ఇంట్లోకి ఎప్పుడు పోకుందునుగాక ఓ సార్వభౌమా ! వరుణా ! మాకు సంతోషాన్ని అను గ్రహించు (౭-౮౯-౧).

(ఆ) కన్నులున్నవాడే లోకాన్ని చూడగలుగుతాడు, గుడ్డివాడు చూడలేడు (౧-౬౪-౧౬).

(ఇ) శాంతికరమైన బహుమతు(హవిస్సు) లిచ్చేవాడు అమరత్వాన్ని పొందుతాడు. (౧-౧౨౫-౬).

(ఈ) ప్రార్థనే నాకు ముఖ్యకవచం (౬-౭౫-౧౯).

(ఉ) మంచిమార్గంలో నడిచే దేవతల అనుగ్రహపాత్రులే, లోకంలో ప్రశంసించబడే మహాత్ములు (౧-౮౯-౨).

ఇలాంటివి ఋగ్వేదంలో కోకొల్లలుగా ఉన్నాయి. ఇంతెందుకు నిజంగా ఋగ్వేదం జ్ఞానానికి, ప్రతిభకు ఒక పెన్నిధిలాంటిది.

ఋగ్వేదసంహిత కేవలం నైతిక-ధార్మిక-ఆధ్యాత్మిక భావనలకే ఉపకారం చేయలేదు. భారతీయ సమాజనిర్మాణానికి కూడా ఎంతో ఉపకరించింది. ఋగ్వేదసంహితలో వర్ణింపబడ్డ సాంఘిక జీవనవిధానాన్ని అర్థంచేసుకోకుండా ఈనాటి సమాజాన్ని అర్థంచేసుకోవడం సాధ్యంకాని విషయం. ఎందువల్లనంటే ప్రజలవలంబించే అనేక వృత్తులు (వ్యవసాయం, చేనేత, పశురక్షణ, నౌకనిర్మాణం మొ॥) పితృప్రధానమైన కుటుంబవ్యవస్థ, స్త్రీపురుషుల సమానత్వం, శ్రమపడటంలోని గౌరవం, కళాపోషణ, సుస్థిరసమాజనిర్మాణం (౧౦-౧౮౩-౫) ఉన్నత భావనలతో, ఆచరణలతో దౌర్భాగ్యాన్ని, దారిద్ర్యాన్ని నిర్మూలించడం(౧౦-౧౫౫-౧) ఈ లక్షణాలే ఆనాటి సంఘంలో అడుగడుగునా కనబడతాయి. ఈ లక్షణాలు ఈనాటి సమాజానికి కూడా అవసరమైనవికావా?

## కవితాసౌందర్యం

సకలవాఙ్మయబీజభూతమైన ఋక్సంహితను కవితాగవాక్షంలోంచి పరిశీలించినపుడు నిండుగా తీర్చిదిద్దబడ్డ కవితాసుందరి మనకందులో ప్రత్యక్షమౌతుంది. సహృదయులకు చమత్కారాన్ని అందించగల ఈ సుందరిసౌందర్యం ఎన్నోవిధాలుగా మన మనో నేత్రాల నాకర్షిస్తుంది. కొన్నిచోట్ల తియ్యందనపు మూటలవంటి మాటలతోను, వస్తుస్వరూప స్వభావాలను మన కళ్లకు కట్టినట్లు బొమ్మలు గీచి చూపే రమణీయమైన వర్ణనలతోను, ఆనందాల అంచుల్లోకి తీసుకుపోగలిగే మధురాతిమధురమైన భావనలతోను, అందమైన అలంకారాలతోను, ఏపటాటోపంలేని చక్కని మకుట మాణిక్యాలతోను ఇంకెన్నెన్నో రీతులతోను, నడకలతోను ఆ ఆకర్షణ చిరస్మరణీయమౌతుంది.

ఋక్సంహితలోని కవితాసౌందర్యాన్ని పైన చెప్పినట్లు సంగ్రహంగా ఇక్కడ సందర్శిద్దాం

౧. పలుకుబళ్లు :

ఈ సంహితలోని పలుకుబళ్లు ఎంతో సరసంగా సుందరంగా ఉంటాయి. చూడండి :

ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధా ని దధే పదమ్। సమూఢమస్య పాంసురే ॥

(౧-౨౨-౧౭)

త్రివిక్రమావతారాన్ని ధరించిన విష్ణువు ఈ జగత్తునంతా తన పాదాలతో మూడువిధాలుగా ఆక్రమించాడు. ధూళితో కూడిన ఆయన పాదాలలో భూమి, ఆకాశం స్వర్గమనే మూడు ఇమిడి పోయాయి. కథనపద్ధతి ఎంత సుందరంగా ఉందో చూడండి.

తద్ విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః।
దివీవ చక్షురాతతమ్॥ (౧-౨౨-౨౦)

సర్వవ్యాపకమైన పరమేశ్వర పరమపదాన్ని దివ్యసూరులు ఏ అడ్డులేని ఆకాశంలో వ్యాపించిన దృష్టినిలాగా ఎల్లప్పుడు దర్శిస్తూనే ఉంటారు. ఇక్కడ మాటలపొందిక ఎంత ముద్దుగా ఉందో గమనించండి.

౨. వర్ణనలు :

ఇంద్రాదిదేవతలను స్తుతించే ఋక్కుల్లో సందర్భానుసారంగా వారి స్వరూప - స్వభావ - ప్రభావాల వర్ణనలు మనకెంతో సంతోషాన్ని కలిగిస్తాయి. ప్రథమమండలంలోని ౧౧వ సూక్తంలో ఇంద్రుని స్వరూపస్వభావాదులు ఎంతో చక్కగా వర్ణింపబడ్డాయి. చూడండి.

ఇంద్రుడు సముద్రంలాగా అన్నిచోట్ల వ్యాపించి ఉన్నాడు. రథులలో అందరిలో మహారథి. సకలసంపదలకు అధిపతి. సన్మార్గంలో నడిచేవారిని ఎప్పుడు రక్షించేవాడు. అతడు యుద్ధాల్లో పరాజయం ఎఱుగనివాడు. ఎటువంటి శత్రువునైనా జయించగలవాడు. తనను స్తుతించేవారికి సకలసంపదలనివ్వడం అతని స్వభావం నవయౌవనం అతనిలో ఎల్లప్పుడు ఉంటుంది. గొప్పమేధావి. మహాబలసంపన్నుడు. ఇలా ఇంద్రుడికి సంబంధించిన అనేక లక్షణాలు ఈ సూక్తంలో చక్కగా అభివర్ణింపబడ్డాయి.

వేదాల్లో అగ్నికి ప్రముఖమైన స్థానం ఉంది. ఋక్సంహితలో ప్రథమమండలంలోని ౧౨వ సూక్తం అగ్నిహోత్రుని లక్షణాలనెలా మనకు విశదీకరిస్తున్నదో చూడండి.

అగ్ని దేవదూత. యజమానికోరికతో అతడు దేవతల నాహ్వానిస్తాడు. అతడు సకలధనసంపన్నుడు. మంచిపనులను సాధించడంలో అతనికతడేసాటి. గొప్పప్రజ్ఞావంతుడు. ప్రజలనుంచి పెద్దలనెప్పుడూ అతడు గమనిస్తూ, యజమాని దేవతలకర్పించిన హవిస్సులను వారికి అందజేస్తాడు. అతడు సకలజనప్రీతిపాత్రుడు. ప్రజలతరఫున దేవతలందరిని యజ్ఞానికాహ్వానించి వారితోపాటు వచ్చి యజ్ఞవేదికనలంకరిస్తాడు. తేజస్సంపన్నుడైన అగ్ని యజమానిశత్రువులను భస్మం చేస్తాడు. ఇతడికి జుహువు ముఖంలాంటిది. యజమానుడి కుటుంబాన్ని చక్కగా కాపాడతాడు. నిత్యయౌవనం కలవాడు. ఎప్పుడూ నిజమే చెబుతూ, అనేక రోగాలను పోగొడతాడు.

ఇలా అగ్నిలోని గుణగణాలన్నింటిని పూసగుచ్చినట్లు వర్ణించుకుంటూ అతణ్ణి స్తుతి చేస్తాడు మహర్షి.

**౩. భావనలు :**

ఋక్సంహితలోని భావనాపటిమ నిజంగా మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. అసమానతలను తొలగించుకొని ఈ సమాజాన్ని వారు ఎంత సుందరస్వప్నంగా భావించారో ఒకమారు చూడండి.

**అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే ।**
**సం భ్రాతరో వావృధుః సౌభగాయ ॥** (౫-౬౦-౫)

వీరిలో (మరుత్తులలో) పెద్దవారని చిన్నవారని భేదభావం లేదు. అందరూ కలిసి చక్కని సోదరప్రేమతో కలసిమెలసి ఉండి మంచి సౌభాగ్యంతో వృద్ధిపొందుతున్నారు.

ఇందులో ఆ సమాజంలో ఎంతటి ఐకమత్యం ఉన్నదనే అంశం మనకు స్పష్టమౌతుంది.

అలాగే వారిలో ఉన్న ఐకమత్యభావనను ఒకసారి దర్శించండి.

**సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్ ।**
**దేవా భాగం యథా పూర్వే సంజానానా ఉపాసతే ॥** (౧౦-౧౯౧-౨)

మీరు కలసి ఉండండి. ఒకేమాటమీద నిలబడండి. ఒకరి నొకరు అర్థం చేసుకొని మనస్సులు కలిపి ప్రవర్తించండి. దేవతలిలా పరస్పరం విరోధంలేకుండా వారి వారి హవిస్సులను వారు పరిగ్రహిస్తున్నారో మీరు కూడా అలాగే మీ మీ సంపదలను మీరు అనుభవించండి ।

**౪.శబ్దాలంకారాలు :**

అర్థాపేక్షలేకుండా వింటున్నప్పుడే సహృదయులను ఆకట్టుకోజాలినవి శబ్దాలంకారాలు. ప్రయోగింపబడ్డ శబ్దాలవైచిత్ర్యమే వీటిలో వినేవారిని ఆకట్టుకొంటుంది. ఇవి అనేకరకాలు. అలంకార శాస్త్రంలో ౧. వృత్త్యనుప్రాస ౨. ఛేకానుప్రాస ౩. లాటానుప్రాస ౪. యమకం ౫. ముక్తపదగ్రస్తమని వాటిని ఐదురకాలుగా విభజిస్తారు. మనకు ఋగ్వేదంలో లీలభూతంగా వీటల్లో కొన్నింటి స్వరూపం గోచరిస్తుంది.

**౧.౨ యమకం - వృత్త్యనుప్రాస:**

ఈఋక్కులో చూడండి చక్కని యమకం వృత్త్యనుప్రాస ఎలా ఉన్నాయో ।

**అమినతీ దైవ్యాని వ్రతాని ప్రమినతీ మనుష్యా యుగాని**
**ఈయుషీణాముపమా శశ్వతీనామాయతీనాం ప్రథమోషా వ్యద్యౌత్ ॥** (౧-౧౨౪-౨)

ఈ ఋక్కులో మొదటి రెండుపాదాల్లో రెండుపార్లు 'మినతీ' అనే అక్షరసమూహం మూడు నాలుగు పాదాల్లో 'తీనాం' అనే అక్షరసమూహం రెండుసార్లు ప్రయోగింపబడి చక్కని లయను సమకూర్చింది. ఇదే యమకాలంకారం. అలాగే ఒకటి రెండు పాదాల్లోని 'ని' అనే అక్షరం మూడుపార్లు ఆవృత్తమైంది. అందువల్ల ఋక్కులో చక్కని నడక కనబడుతోంది. ఇది వృత్త్యనుప్రాస. ద్వితీయమండలంలోని పన్నెండవసూక్తంలో వృత్త్యనుప్రాసలు కోకొల్లలు.

ఇంకో చిత్రమైన వృత్త్యనుప్రాస చూడండి :

**అవోచామ కవయే మేధ్యాయ వచో వన్దారు వృషభాయ వృష్ణే** (౫-౧-౧౨)

ఇందులో 'వ' అనే వర్ణం ఆరుసార్లు రావడం. అందులోను 'వృ' అని రెండుపార్లు వినపడడం 'య' అనే వర్ణం మూడుపార్లుఆవృత్తం కావడం ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తున్నది.

ఇంకొక వృత్త్యనుప్రాస చూడండి:

**పాతా సుతమిన్ద్రో అస్తు సోమం ప్రణేనీరుగ్రో జరితారమూతీ ।**
**కర్తా వీరాయ సుష్వయ ఉ లోకం దాతా వసుస్తువతే కీరయే చిత్ ॥**
**గన్తేయాన్తి సవనా హరిభ్యాం బభ్రిర్వజ్రం పపిః సోమం దదిర్గాః ।**
**కర్తా వీరం నర్యం సర్వవీరం శ్రోతా హవం గృణతః స్తోమవాహాః** (౬-౨౩-౩౪)

ఈ ఋక్కుల్లో 'తా' కారం అనేకసార్లు ఆవృత్తమై మంచి నడకను సమకూర్చింది.

**౧.౩. లాటానుప్రాస :**

ప్రథమమండలంలో ౧౬౭ వ సూక్తంలోని మొదటి ఋక్కులో 'సహస్రం' అనే పదం నాలుగుపార్లు ఆవృత్తమౌతున్నది. ఇది ఒకరకమైన లాటానుప్రాస. ఇదుగో చూడండి.

**సహస్రంత ఇన్ద్రోతయో నః సహస్రమిషో హరివో గూర్తతమాః ।**
**సహస్రం రాయో మాదయధ్యై సహస్రిణ ఉప నో యన్తు వాజాః ॥**

ఇందులో 'సహస్ర' పదం ప్రతి పాదంలోను వినబడుతుంటే ఒక చక్కని ఊపు ఏర్పడి చెవికింపుగా ఉంటుంది.

**వృషాసి దివో వృషభః పృథివ్యా**
**వృషా సిన్ధూనాం వృషభః స్తియానామ్** (౬-౪౪-౨౧)

ఇందులో 'వృష' అనే పదం నాలుగుపార్లు ఆవృత్తమై వినడానికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తున్నది. ఇది లాటానుప్రాస. ఇలాగే ఏడవమండలంలో త్రిష్టుప్ఛందస్సులో నడిచిన ౩౫వ సూక్తమంతా లాటానుప్రాసలతో నిండి ఉంటుంది. 'శం' 'నః' అనే పదాలు, ౧౩ ఋక్కుల్లో ప్రతిపాదంలోను ఆవృత్తమై ఒక చక్కని అందాన్ని అందిస్తున్నాయి.

ఇలాగే "విశ్వదేవః దివం పవమానః" అనే పదాలు ప్రతి ఋక్కులోను తిరిగి తిరిగి రాగా

చక్కని లాటానుప్రాసాలంకారానికి ఆశ్రయమౌతున్నది తొమ్మిదవమండలంలో మూడవసూక్తం.

౧.౪. మకుటాలు :

ఈ శబ్దాలంకారాలు కాక ఋగ్వేదంలో మనకు కొట్టవచ్చినట్లు కనబడేవి ఒకే మకుటంతో ఉండే మన శతకాల్లాగా కనబడే ఋక్కులు. ఇలాంటివి దాదాపు ప్రతిమండలంలోను కొద్దోగొప్పో కనబడుతూనే ఉంటాయి. బహుశా చివరిపాదాన్ని ఒకేరకంగా చెప్పే స్తోత్రాలను, శతకాలను చెప్పటం ప్రారంభించినవారికి ఈ ఋక్కులు స్ఫూర్తినిచ్చి ఉంటాయనుకోవడంలో తప్పులేదేమో కొన్ని ఇక్కడ ఉదహరిస్తాను చూడండి.

౧. మరుద్భి రగ్న ఆ గహి (౧-౧౯)
౨. ఉలూఖలసుతానామవేద్విన్ద్ర జల్గులః (౧-౨౮)
౩. ద్యుమ్నైరభి ప్రణోనుమః (౧-౭౮)
౪. అర్చన్ననుస్వరాజ్యమ్ (౧-౮౦)
౫. అపనః శోశుచదఘమ్ (౧-౯౭)
౬. ఇషం స్తోతృభ్య ఆ భర (౫-౬)
౭. అయం స యో మ ఇన్ద్ర తే సుతః పిబ (౬-౪౩)
౮. ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ (౮-౩౩)
౯. అన్తి షద్భూతు వామవః (౮-౭౩)
౧౦. అథా నో వస్యసస్కృధి (౯-౪)
౧౧. మదేషు సర్వధా అసి (౯-౧౮)
౧౨. తత్ త ఆ వర్తయామసీహ క్షయాయ జీవసే (౧౦-౫౮)

పై పన్నెండు మకుటాలు ఆయా సూక్తాల్లో పూర్తిగా అన్ని ఋక్కుల్లోను, కొన్ని సూక్తాల్లో మాత్రం కొన్ని ఋక్కుల్లోను చివరి పాదంగా కనబడుతున్నాయి. చదివేటప్పుడు ఇవి చక్కగా చెవికింపుగా ప్రతిమంత్రంలోను వినపడుతుంటాయి.

౧.౫. అర్థాలంకారాలు :

అర్థాలంకారాలు, అక్షర సముప్పుకు పడిపోకొని గోచరించవు. ఇవి కూడా ఋక్సంహితలో అడుగడుగునా కనపడతాయి. బహుశః ఏ అలంకారం లేని ఋక్కులే లేవేమోననిపిస్తుంది.

౧) ఉపమ (Simile) :

ఉపమాలంకారం అలంకారలన్నింటికి బీజంలాంటిదని, మిగతావన్నీ దీనినుంచి ఏర్పడినవని ఆలంకారికుల అభిప్రాయం. కనుకనే అలంకారనిరూపణలో దానికి ప్రథమస్థానం లభిస్తున్నది.

ఉపమానానికి (దేనితో పోలుస్తున్నామో అది ) ఉపమేయానికి (పోల్చబడే వస్తువు) ఉచితమైన, చక్కని పోలిక కుదిరితే అది ఉపమాలంకారమౌతుంది.

స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ।
సచస్వా నః స్వస్తయే ॥ (౧-౧-౯)

ఓ పరమేశ్వరా! కొడుకుకు మంచి చేయాలి, దగ్గరగా ఉండి ఎప్పుడూ కాపాడాలని తండ్రి ఎలా అనుకుంటాడో, నీవు కూడా అలాగే మమ్మల్ని వెన్నంటి కాపాడి మాకు సకల శుభాలను కలిగించమని ప్రార్థిస్తున్నాడు మహర్షి. ఇక్కడ "తండ్రిలాగా" అని చక్కని ఉపమానాన్ని ప్రయోగించాడు. ఇలాంటి ఉపమలు ఋగ్వేదంలో కోకొల్లలు. ఇక్కడ "ఇవ" ఉపమావాచకంగా (పోలికను తెలిపే శబ్దంగా ) మనకు కనబడుతుంది. ఋగ్వేదం నాటికే "ఇవ" అనే దాన్ని ఉపమావాచకంగా ప్రయోగించడం ఉన్నదని మనం గుర్తించవచ్చు. ఇక్కడ వాడిన ఉపమానం చాలా ఉచితమైంది అందమైంది కూడాను.

సూర్యో దేవీముషసం రోచమానాం।
మర్యో న యోషామభ్యేతి పశ్చాత్॥(౧-౧౧౫-౨)

కుత్సమహర్షి చెప్పిన సూర్యస్తుతి పరమైన సూక్తంలోని ఋక్కు ఇది. ఇందులో ఉదయానికి ముందు సూర్యుడు ఉషస్సును అనుసరించి పోవడం, "ఒక రసికుడు నవమోహనాంగియైన ఒక అందాలరాశి వెంట పోయినట్లు" అని చమత్కారంగా పోల్చబడింది. తెలతెలవారలోతున్నది. ఉషోదయం అయింది. ఉషస్సువెంటబడి వస్తున్నాడా! అన్నట్లు బాలభానుడు దాని వెంటవెంటనే ఉదయిస్తున్నాడు. ఈ సందర్భానికి తగిన చక్కని ఉపమానం ఇక్కడ కుదిరింది.

వైదిక సాహిత్యంలో చాలాచోట్ల 'న' అనే శబ్దం ఉపమావాచకంగా ప్రయోగించబడింది. పై ఋక్కులో మనం ఇలాంటి ప్రయోగం చూడవచ్చు. లౌకిక భాషలో కాలక్రమేణా ఈ ప్రయోగం తెరమరుగైంది.

వైదిక భాషలోనే "యథా" అనే దాన్ని ఉపమావాచకంగా ప్రయోగించడం ప్రారంభమైంది. ఋక్సంహితలో ఇలాంటి ప్రయోగాలు మనకు కనబడుతున్నాయి. అదే ఒరవడిలో లౌకిక భాషలో ఈ ప్రయోగం ప్రవేశించింది.

ఐదవమండలంలో ఒకసూక్తం చూడండి. ఈ సూక్తంలో సప్తవధ్రి అనే మహర్షి అశ్వినీ దేవతలను స్తుతిచేస్తున్నాడు. ఇతడొక మంత్రద్రష్ట. దాయాదులు రాత్రంతా ఇతణ్నొక పెట్టెలో వేసి తాళం పెట్టి భార్యతో కలవకుండా చేశారు. ప్రతి ఉదయం దాంట్లోంచి బయటకులాగి చావచితక తన్నేవాళ్ళు. ఎన్నో రాత్రులిలా గడిచాయి. అతడికి విముక్తి లేదు. చివరకు అతడికి ఉపాయం తట్టింది. అశ్వినీ దేవతలను పెట్టెలో ఉండే స్తుతించాడు. వారు వచ్చి అతణ్ణి విడిపించారు. రాత్రంతా హాయిగా భార్యతో కాలక్షేపం చేసి భయంతో తెల్లవారేటప్పటికి పెట్టెలో కూర్చున్నాడు. తరువాత భార్య గర్భవతి కాగా సుఖప్రసవం కలగాలని అశ్వినీ దేవతలను స్తుతిస్తాడు. ఆ సందర్భంలోనిది ఈ ఋక్కు.

**యథావాతః పుష్కరిణీం సమింగయతి సర్వతః।**
**ఏవా తే గర్భ ఏజతు నిరైతు దశమాస్యః॥** (౫-౭౮-౭)

ఎలా మందమారుతం పుష్కరిణినంతటిని బాగా కదిలించి వేస్తుందో, అలా నీ గర్భం ఇటు అటు కదలాలి. పదిమాసాలు నీ కడుపులో ఉన్న శిశువు చక్కగా బయటకు రావాలి. ఇక్కడ గర్భాన్ని పుష్కరిణితో పోల్చడం ఎంతో అందంగా ఉంది. పుష్కరిణిలోంచి పద్మం వికసించినట్లు శిశువు ఉత్పన్నం కావడం ఎంతో సహజంగా ఉంది. ఆ నాటికే పుష్కరిణి ఎంత ప్రసిద్ధమైందో ఇక్కడ మనం గమనించవచ్చు.

**౨. అతిశయోక్తి (Hyperbole) :**

అతిశయమంటే ఉత్కర్ష. చదివేవాళ్ళకు ఒక చక్కని చమత్కారాన్ని అందించడమన్నమాట. ఉక్తి అంటే పలుకుబడి. అలాంటి చమత్కారం ఉండేట్టు చెప్పడాన్నే అతిశయోక్తి అంటారు. లేనిదాన్ని గొప్పగా చెప్పడమే ఇందులో కనబడుతుంది. చూడండి.

**యదిన్ద్ర యావతస్త్వమేతావదహమీశీయ।**
**స్తోతారమిద్దిధిషేయ రదావసో న పాపత్వాయ రాసీయ॥** (౭-౩౨-౧౮)

"ఓ దేవేంద్రా ! నీకెన్ని సిరిసంపదలున్నాయో నీదయవల్ల నాకు కూడా అన్ని సంపదలేర్పడతాయి. అప్పుడు నీవు నీ భక్తులకు సకలైశ్వర్యాలిచ్చినట్లే నేను కూడా భగవంతుణ్ణి స్తుతించే భక్తులను పోషిస్తాను. పాపులకు ఏరకమైన సహాయం చేయను" అన్నాడు మహర్షి.

ఇందులో అసంభావితమైన ఇంద్రుని ఐశ్వర్యాన్ని తను పొందగలననుకోవడం, అతనిలాగానే తాను కూడ భక్తులను కాపాడుతాననుకోవడం అతిశయోక్తి. మానవుని ఆశాలత ఆనాడే మొగ్గతొడిగిందనడానికి ఈ అతిశయోక్తి ఒక చక్కని నిదర్శనం.

**(3) రూపకం (Metaphor) :**

ఉపమానోపమేయాలకు అభేదాన్ని చెప్పడం రూపకమవుతుంది. ఉదా : ముఖచంద్రుడు మొ॥ బొమ్మ గీయకముందు 'గోడ' అంటాం. గోడమీద బొమ్మగీసిన తరువాత అదిగో వెంకటేశ్వరస్వామి అంటామే గాని గోడ అనం. అంటే బొమ్మ గోడను ఆవరించి దానితో ఒకటైపోయిందన్నమాట. దీన్నే రూపకం అంటారు. చూడండి :

**యః కుక్షిః సోమపాతమః సముద్ర ఇవ పిన్వతే** (౧-౮-౭)

సోమపానం బాగాచేయగల ఇంద్రుడనే ఉదరం సముద్రంలాగా పెరిగిపోతున్నదని ఇంద్రుని ఉదరానికి అభేదం చెప్పడంలో ఇక్కడ రూపకాలంకారం. కొందరు ఇక్కడ 'ఇంద్రస్య' అని అధ్యాహారం చేసుకొని కూడా వ్యాఖ్యానం చేశారు. అప్పుడు రూపకం కాదు.

**౪.) ఉత్ప్రేక్ష : (Poetical fancy)**

హేతువుగానిది హేతువుగాను, వస్తువుగానిది వస్తువుగాను, ఫలంగానిది ఫలంగాను ఎక్కడ సంభావింపబడుతుందో అది ఉత్ప్రేక్షాలంకారం. ఇది కవి బుద్ధివైభవాన్ని చాటి చెబుతుంది. "సంభావనా స్యాదుత్ప్రేక్షా" అని దీన్ని నిర్వచిస్తారు. ఋగ్వేదం నాటికే ఈ రకమైన వాక్యభంగి మనకు బాగా కనబడుతుంది. చూడండి :

**అప్యేదు భియా గిరయశ్చ దృళ్హా ద్యావా చ భూమా జనుషస్తుజేతే ।** (౧-౬౧-౧౪)

"ఇంద్రుడు తమరెక్కలు నరుకుతాడేమోనన్న భయంచేత పర్వతాలు నిశ్చలంగా దృఢంగా అయిపోయినాయి. భూమ్యాకాశాలు కూడ అప్పుడే ఆవిర్భవించిన ఆ ఇంద్రుని భయంచేతనే వణికిపోతున్నాయి." అంటున్నాడు మహర్షి.

ఈ ఋక్కులో పర్వతాలు చలనం లేకుండా దృఢంగా ఉండటం, భూమ్యాకాశాలు కంపించిపోవడం ఇంద్రునిభయంవల్లనని సంభావింపబడుతోంది. ఇవాది శబ్దాలు లేకుండా కూడా ఆ సంభావనం గమ్యమౌతోంది, కాబట్టి ఇది ఉత్ప్రేక్షాలంకారం.

**౫) అర్థాన్తరన్యాసం (Corroboration)**

ఒక సామాన్యవిషయాన్ని చెబుతూ ప్రత్యేకంగా ఒక విశేష విషయాన్ని చెప్పడం, లేక విశేషవిషయాన్ని చెబుతూ అది లోకంలో సామాన్యమేనని సామాన్యవిషయాన్ని వెంటనే చెప్పడం అర్థాన్తర న్యాసాలంకారం. విశేషాన్ని ముందు చెప్పి దాన్ని సామాన్యంతో సమర్థించడం ఈ క్రింది ఋక్కులో మనకు కనబడుతుంది. చూడండి :

**మా త్వా సోమస్య గల్దయా సదా యాచన్నహం గిరా।**
**భూర్ణిం మృగం న సవనేషు చుక్రుధం క ఈశానం న యాచిషత్॥** (౮-౧-౨౦)

"ఓ ఇంద్రా ! ప్రభువువు, సింహంలాగా భయంకరుడవు అయిన నిన్ను ఎప్పుడూ యాచిస్తున్నాము. కనుక నీకు నామీద కోపంరావడం సహజం. అయితే యజ్ఞాల్లో నీకు సోమరసాన్ని అర్పించడంచేత, నీ గుణగణాలను స్తుతించడంచేత నీ కోపాన్ని పోగొడుతున్నాము. అయినా లోకంలో తన స్వామిని ఎవరు యాచించకుండా ఉంటారు? అందరు దేవుని యాచిస్తూనే ఉంటారు." అంటూ విశేషాన్ని సామాన్యంతో సమర్థిస్తూ ఇక్కడ మహర్షి మంచి అర్థాంతరన్యాసాలంకారాన్ని ప్రయోగించాడు.

**౬) వ్యతిరేకం : (Contrast or Prenity)**

ఉపమానానికి ఉపమేయానికి సాదృశ్యం చెప్పి, వాళ్ళ భేదం చెపితే అది వ్యతిరేకాలంకారమౌతుంది. పోలికగల రెండింటికి తేడా చెప్పడమన్నమాట. చూడండి:

**మూరా అమూర న వయం చికిత్వో మహిత్వమగ్నే త్వమఙ్గ విత్సే (౧౦-౪-౪)**

"ఓ మహాజ్ఞానీ ! చైతన్యవంతుడా! అగ్నిదేవా! మూఢులమైన మేము నీ మహాత్మ్యాన్ని తెలుసుకోలేక పోతున్నాం. నీ మహాత్మ్యం నీకు మాత్రమే బాగా తెలుసు. నీకంటే ఇతరుల కెలా తెలుస్తుంది?" అని అగ్నిహోత్రుని మహాత్మ్యాన్ని స్తుతిస్తున్నాడు మహర్షి.

ఇక్కడ అగ్నిహోత్రునికి తమకు ఉన్న భేదం స్పష్టంగా గోచరిస్తున్నది. ఆయన మహాజ్ఞాని. మానవులు మూఢులు. కనుక ఆయన మహాత్మ్యం వీళ్ళు తెలుసుకోలేరు. ఈ విషయాన్ని చెప్పి అది నీకుమాత్రమే తెలుసు. నీకంటే ఇతరుల కెలా తెలుస్తుంది ? అనడం వ్యతిరేకాలంకారమౌతున్నది.

ఇలా ఋక్సంహితలో ప్రతిసూక్తంలోను ఎన్నో పలుకుబళ్ళు, వర్ణనలు, అలంకారాలు కోకొల్లలుగా మనకు కనబడతాయి. కొన్నిమాత్రం మచ్చుకు ఇక్కడ ప్రస్తావింపబడ్డాయి. ఇంకా తెలుసుకోవాలనే ఉత్సాహం కలవాళ్ళకు ఇది కేవలం మార్గదర్శకం మాత్రమే.

## మండలాలు - సంగ్రహసమీక్ష :

ఛందోబద్ధమైన ఋక్కులనబడే మంత్రాలసముదాయమే ఋక్సంహిత. చరిత్రకందనికాలంలో ప్రకృతిలోని అనేక పదార్థాల్ని వాటి అద్భుతశక్తిప్రాభవాలను చూసి ఆనందించి, వాటి వెనుకగల దేవతామూర్తుల్ని వారి తాత్త్వికస్వరూపాన్ని దర్శించిన మహర్షుల స్తోత్రసంపుటి అది. ఎవరెలా వ్యాఖ్యానిస్తే వారికలా కనబడే ఈ అర్ష విజ్ఞానకోశం అపౌరుషేయమని - ఏ వ్యక్తిచేతను తన బుద్ధిబలం తో ఆలోచించి వ్రాయబడ్డది కాదని మహనీయులైన మహర్షులచేత తపశ్శక్తితో దర్శింపబడిందని మన విశ్వాసం. ఇది ఎంతో సమంజసం. కాని భాష, పదసముదాయం, ఛందస్సు, రీతి, వ్యాకరణం, భావవిశేషాలు మొ॥ వాటిని బట్టి ఇది ఒకప్పుడు ఋషుల చేత రచింపబడిందై ఉండవచ్చునని కొందరు విమర్శకుల వాదం. ఎందరో ఋషుల అనుభవాలైన ఈ ఋక్కులు మొదట వేటికవే ముక్తకాలుగా ఉండి తరువాత ఒకచోట కూర్చబడి సంహితలుగా రూపొందించబడ్డాయి. సంహిత అంటే కూర్పు అని అర్థం. ఈ కూర్పులో ఓ చక్కని క్రమం కనబడుతుంది.

ఋక్సంహిత రెండురకాలుగా విభజింపబడుతున్నది. మొదటిది అష్టకవిభాగం. ఈ విభాగం అధ్యయనానికి చాలా సులభంగా ఉన్నా కొత్తగా ఏర్పడింది. అన్ని శాస్త్రీయమైందవడానికి వీల్లేదు.

రెండవది మండల విభాగం. ఇది చాలా శాస్త్రీయమైంది. చరిత్రాత్మకమైన విలువ గలది. ఋగ్వేదబ్రాహ్మణంలోనే ఋగ్వేద మండలాలను గూర్చిన ప్రసంగం ఉంది. అందువల్లనే ఈ విభాగం చాలా ప్రాచీనమైందని వెల్లడవుతోంది. ఈ విభాగం ప్రకారం ఋక్సంహిత ౧౦ మండలాలుగా విభజింపబడింది .

ఈ సంహితలో ప్రతిసూక్తానికి ఋషి, దేవత, ఛందస్సు మొదట్లోనే చెప్పబడుతుంది. వీటిని బాగా అర్థం చేసుకోకపోతే మండల విభాగంలోని వైశిష్ట్యం సరిగా అర్థంకాదు. ఋగ్వేదపాఠంలో గాని, పారాయణంలోగాని, జపహోమాదుల్లోగాని, ఋషి దేవత ఛందస్సులను తప్పక చెప్పితీరాలి. ఇది ఋగ్వేదం ప్రత్యేకత.

ఈ సంహితలోని ౧౦ మండలాల్లోను, ౨ నుంచి ౭ వరకుగల ౬ మండలాలు కూర్పులోని తీరునుబట్టి స్వభావాన్నిబట్టి ఒకేరకంగా కనబడతాయి. ౧,౮,౯,౧౦, మండలాలు ఒక్కొక్కటి ఒక్కొక్క పద్ధతిలో అమర్చబడ్డాయి.

పై ఆరు మండలాలను "ఋషిమండలాలు, వంశమండలాలు, కులమండలాలు" అని పిలుస్తూ ఉంటారు. దీనికి కారణం ప్రతి మండలం ఒక్కొక్క ఋషిచేతగాని లేక ఆ ఋషివంశపువారిచేతగాని దర్శించబడ్డ మంత్రాలసముదాయంగా కనబడటమే. వేరే ఋషి దర్శించిన మంత్రం మచ్చునకొకటి కూడా ఇందులో కనబడదు. ఈ ఆరుమండలాలకు వరుసగా గృత్సమదుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు, అత్రి, భరద్వాజుడు, వశిష్ఠుడు ఋషులు.

ఈ మండలాలలో కొన్ని సాధారణధర్మాలు సమంగా కనబడతాయి. ఉదాహరణకు - వీటిలో ప్రతిమండలంలోను మొదట కొన్ని సూక్తాలు అగ్నిని సంబోధిస్తున్నాయి. తరువాత

గల కొన్ని సూక్తాలు ఇంద్రుని సంబోధిస్తున్నాయి. ఆటుతర్వాతనే ఇతర దేవతాపరాలైన సూక్తాలు కూర్చబడ్డాయి.

ఎనిమిదవ మండలపు కూర్పులోని ౧౦-౩ సూక్తాల్లో కణ్వుడు గాని కణ్వవంశీయులైన ఋషులుగాని మూడువంతులకు పైబడిన సూక్తాలకు ఋషులుగా ఉన్నారు.

తొమ్మిదవ మండలం తన ప్రత్యేకతను స్పష్టంగా చాటి చెప్తుంది. ఈ మండలంలోని అన్ని సూక్తాలు తప్పనిసరిగా పవమానసోమదేవతను గూర్చి సంబోధింపబడ్డాయి. అందువల్లనే దీనిని "పవమానమండలం" అని వ్యవహరిస్తూ ఉంటారు. అయితే ఈ సూక్తాల ఋషులు మాత్రం కొత్తవారు కారు. ౨ నుంచి ౭ వరకు గల ఋషి మండలాలకు వరుసగా ద్రష్టలైన గృత్సమదుడు మొదలైన ఋషులే ఈ సూక్తాలకు కూడా ఋషులుగా ఉన్నారు. దీనిని బట్టి చూస్తే ఋషి మండలాల్లోని పవమాన సోమదేవతాకాలైన సూక్తాల్ని ఒకటిగా చేర్చి తొమ్మిదవమండలంగా కూర్చారన్నది స్పష్టమౌతుంది. ఈ మండలంలోని సూక్తాలు ఛందానుసారంగా అమర్చబడ్డాయి. ౧-౬౭ గాయత్రి, ౬౮-౮౬ జగతి, ౮౭-౯౭ త్రిష్టుప్, ౯౮-౧౧౪ అనేక వృత్తాలు ఇందులో మనకు కనబడుతున్నాయి.

మొదటి మండలంలో ఒక్కొక్క ఋషి దర్శించిన సూక్తాలను ఒక్క సముదాయంగ స్వీకరించి అలాంటి ౧౪ సూక్తసముదాయాలు కూర్చబడ్డాయి. ఈ సూక్తసముదాయాలలో సూక్తాల్ని అమర్చడం ఆ యా సూక్తాల్లో స్తుతింపబడే దేవతలననుసరించి చేయబడింది. కాగా ౧౧ సూక్తాలుగల మొదటి సూక్త సముదాయంలో, మొదటి సూక్తం అగ్నిని, రెండవది వాయువును, మూడవది అశ్వినులను ఇంద్రుని, ౪ నుంచి ౧౧ వ సూక్తం వరకు ఇంద్రుని స్తుతిస్తున్నాయి. అంటే ఋషిమండలాలను అమర్చినక్రమంలో సూక్తసముదాయాలలో సూక్తాల్ని మార్చారన్నమాట.

పదవమండలంలో సూక్త మంత్రాలసంఖ్య తప్ప మరి ఏనియమం కనబడదు. ఈ మండలంలోగల ౧౯౧ సూక్తాల్లో ౧ నుంచి ౮౪ వరకుగల సూక్తాలు కొన్ని సముదాయాలుగా విభజింపబడ్డాయి. ఈ సూక్త సముదాయాలలో ముందుదానికన్నా తరువాత సూక్త సముదాయం తక్కువ సూక్తాలు కలదిగా ఉంటుంది. ౮౫ నుంచి ౧౯౧ వరకుగల సూక్తాలు విడిసూక్తాలే. అయితే వీటిలో కూడా ముందు సూక్తంకన్నా తరువాత సూక్తంలో మంత్రాలసంఖ్య తగ్గుతూ ఉంటుంది. మొదటి మండలంలోనూ పదవమండలంలోనూ సూక్త సంఖ్య ఒకటే.

ఋక్సంహితలోని విషయపరిశీలనం చాలా కష్టమైనపని. ఇందులో లేనిది లేదన్నట్లుగా అన్ని విషయాలు గనపడతాయి. వేదార్థాన్ని వివరిస్తూ వచ్చిన పరంపర ఏకారణానో మధ్యలో విచ్ఛిన్నమవడం వల్ల చాలా వేల సంవత్సరాలవెనక ఏర్పడ్డ ఈ మంత్రాల అసలుఅర్థం ఏమిటన్నది విమర్శకులకందకుండా ఉంది. పశువులకాపరులతో సమానమైన అనాగరికులైన ఆర్యులు ప్రకృతిని, దానిలోని శక్తిని చూచి అర్థంకాక, వారికి వచ్చినరీతిలో భయంకరం ఆశ్చర్యకరమైన ప్రకృతిని భావించుకున్న తీరుకు శబ్దరూపమే ఈ మంత్రాలు అని కొందరి వాదం. లక్ష్మణరేఖలా ఒక గీత గీసుకొని దానికి పూర్వం నాగరికత, మానసికపరిపక్వత ఉండకూడదని నిర్ధారణ చేసుకొనేటందుకు మంత్రాలను వ్యాఖ్యానించేవారి పాశ్చాత్యమైన మతం ఇది.

అలాకాక మంత్రాల ఉచ్చారణద్వారా వాటిలోని అతి మానుషమైన శక్తివల్ల ఆ యా దేవతలను సాక్షాత్కరింపుకొని వివిధ యజ్ఞయాగాదులద్వారా వారిని సంతృప్తులను చేయడానికి ఉపయోగపడేవి మంత్రాలు అని మరికొందరి భావన.

బాహ్యరూపంలో ప్రకృతి, దేవతలు అర్థంగా భాసించినా వాటి వెనక నిగూఢంగా ఆధ్యాత్మవిషయాలు దాచబడ్డాయి. ఆ విషయపరంగానే వేదాల్ని వ్యాఖ్యానించాలని మరికొందరి మతం.

కాగా ప్రతి మంత్రానికి మూడురకాలైన అర్థాల్ని వివరించవచ్చు. ౧. ఆధిభౌతికార్థం, ౨. ఆధిదైవికార్థం, ౩. ఆధ్యాత్మికార్థం. ఉదాహరణకు ఉషస్సూక్తంలోని ఉషశ్శబ్దానికి ప్రతి ఉదయం సాక్షాత్కరించే "అరుణోదయ" మని ఆధిభౌతికార్థం. మనుష్యులను నిద్రనుంచి మేల్కొలిపి జాగృతులను చేస్తూ ఉపకరించే ఉషఃకాలాధిపతియైన 'ఉషోదేవత' అని ఆధిదైవికార్థం. మనుష్యుల అహంకార మమకారాదిరూపమైన అజ్ఞానాన్ని పారింపజేసి ఆత్మస్వరూప సాక్షాత్కారానికి ఉపయోగించే "ఆత్మతత్త్వజ్ఞానం" అని ఆధ్యాత్మికమైన అర్థం. ఈ మూడర్థాలను స్వీకరించి సూక్తంలోని ప్రతి మంత్రానికి మూడురకాల వ్యాఖ్యానం కొనసాగించవచ్చు.

వైజ్ఞానిక రంగంలో చాలా ముందుకు పోయామన్న ఈ కాలపు విజ్ఞానానికి సమంగానో ఎక్కువగానో అనేక విషయాలు ఋఙ్మంత్రాల్లో కనబడతాయి. మనకర్థంకానివన్నీ ఆ మంత్రద్రష్టల అనాగరికతకు తార్కాణాలనుకోవడం ఉచితం కాదేమోననిపిస్తుంది. ఈ మంత్రాలకు సంబంధించిన సరైన అర్థాన్ని అవగాహన చేసుకోవడం వైజ్ఞానికంగా ఇంకా పురోగమిస్తేగాని కుదరదేమో!

ఋక్సంహితలోని విషయాలను అన్ని దృక్పథాలనుంచి పరిశీలించడం ప్రస్తుతం కానిపని. కాబట్టి అందరికీ సులభంగా అర్థమయ్యేవి,ఎంతో కొంత దేశకాలానుసారంగా అందరికీ

ఆసక్తిని పెపొందించేవి మండలాలవారీగా కొన్నిమాత్రమే ఇక్కడ పేర్కొన బడుతున్నాయి. దీనిని కొలబద్దగా తీసుకొని వేదంలో ఉండే విషయాలు ఇంతేనని మాత్రం భ్రమపడకూడదు. పరిచయంకోసం కొన్నింటిని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

## మొదటిమండలం

అందరికీ వందనాలు :

అనాటివ్యక్తిలో ఉండే గొప్పతనాన్ని గుర్తించడం, ప్రపంచంలో పరమాత్మను సందర్శించడం ఆనాటివారి ఆలోచనలలో మనకు స్పష్టంగా కనబడుతుంది.

పెద్దలకు - చిన్నలకు, యువకులకు-వృద్ధులకు నమస్కారం. యజ్ఞాలచేత దేవతలకు ప్రీతిని కలిగించినప్పటికీ, పెద్దలకు, మనకన్నా గొప్పవారికి గౌరవాన్నివ్వడంలో మాత్రం ఏమరుపాటు లేకుండా ఉందాం! (౧-౨౭-౧౩)

రండి! రండి! :

భగవంతుణ్ణి అన్వేషించడం ఆరాధించడం చక్కని మార్గం. ఆ మార్గంలోకి అందఱు ఆహ్వానింపబడేవారు అనాడు.

సర్వస్వరూపుడైన ఈశ్వరుని అన్వేషించేవాడికి చక్కనిమార్గం ఉంది. ఇది రాజమార్గం. ఎత్తుపల్లాలు ముళ్ళులేని మార్గం. ఓ అన్వేషులారా! ఈ వైదిక విజ్ఞానమార్గంలో ఒడుదుడుకులు లేవు. రండి! (౧-౪౧-౪)

ఈశ్వరస్వరూపం :

భగవంతుని స్వరూపం వాచామగోచరం అనే భావం ఋగ్వేదం నాటికి బాగా ప్రజల్లో నాటుకున్నది.

ఈశ్వరా! ఈ భూమి మఱి పదిరెట్లు పెద్దదైనా, ఈ భూమి మీది ప్రాణులన్నీ రాత్రింబవళ్ళు నీ గొప్పతనాన్ని కీర్తించినా, నీ శక్తిని, జ్ఞానాన్ని, పరాక్రమాన్ని పూర్తిగా వర్ణించలేవు. సర్వవ్యాపకమైన నీ స్వరూపంతో భూమిని, ద్యులోకాన్ని అంతటినీ వ్యాపించి ఉన్నావు. సకల ప్రపంచానికి నీవే నియంతవు. భూలోకద్యులోకాలు రెండూ కలిసినా నీస్వరూపంతో పోలవు. సముద్రం-రోదసి కలసి కూడా నీ గాంభీర్యాన్ని అణుమాత్రంగానైనా పొందలేవు (౧-౫౨-౧౧,౧౩,౧౪).

కన్నతండ్రి :

దేవుడు మనల్ని ఎప్పుడూ కాపాడుతున్నాడనే నమ్మకం అందఱిలోను ఉండేది. కన్నతండ్రిలా ఈశ్వరుడు భూలోకద్యులోకాలలో ఉండే సమస్తప్రాణులను ఉద్ధరించడానికి రెండు చేతులనూ చాచుతున్నాడు. తనసుంచే పుట్టిన ఈ రెండులోకాలను కాపాడటమే అతని ధ్యేయం. ఎవడు తనునిలా భావిస్తే అతనికి తను అలాగే భాసిస్తాడు (౧-౯౫-౭).

కాలచక్రం :

అనాటివారు కాలాన్ని ఎంతచక్కగానో పరిశీలించారు. కాలమనే నిత్యమైన చక్రానికి పన్నెండు ఆకులు (నెలలు) ఉన్నాయి. నిరంతరం తిరుగుతూ ఉండే ఈ చక్రానికి ఏడువందల ఇరవైమంది కొడుకులు (౩౬౦+౩౬౦=౭౨౦ పగళ్ళు, రాత్రులు) ఉన్నారు (౧-౧౬౪-౧౧).

జీవుడు - దేవుడు :

మనకు దేవునికి ఉన్న తేడాను ఎంతో స్పష్టంగా పరిశీలించారు ఋగ్వేదద్రష్టలు.

ఒకరిమీద మఱి ఒకరికి అత్యంతప్రేమగల రెండు పక్షులు (జీవాత్మ పరమాత్మలు) ఎల్లప్పుడు ఒక చెట్టునే (దేహం) ఆశ్రయించి ఒకచోటనే నివసిస్తున్నాయి. వాటిలో ఒకటి (జీవాత్మ) ఆ చెట్టున కాసినఫలాన్ని (కర్మఫలాన్ని) ఆస్వాదిస్తున్నది. మఱి ఒకటి (పరమాత్మ) తినకుండానే (కర్మఫలానుభవం లేకుండా) స్వప్రకాశమై భాసిస్తున్నది. (౧-౧౬౪-౨౦).

ఋగ్వేదతాత్పర్యం :

ఆత్మతత్త్వాన్ని తెలుసుకోవడం చాలా ముఖ్యమనే భావన అనాడే ఉన్నది.

అన్నికాలాల్లోను అన్ని దేశాల్లోను ఉండేది ఆత్మతత్త్వం. దీనినుంచే సమస్తమైన దేవతలు పుడుతున్నారు. దీనికధీనులై మసలుతున్నారు. అట్టి ఆత్మతత్త్వం తెలియనివాడికి ఋగ్వేదంవల్ల ఏమి ప్రయోజనం? ఆత్మతత్త్వాన్ని తెలిసిన వ్యక్తికే నిజమైన ఆనందం (౧-౧౬౪-౩౯).

శ్రుతి :

దేవుడు, జగత్తు వేదంపైనే ఆధారపడి ఉన్నారని ఋగ్వేదం నొక్కి చెబుతున్నది.

అన్నిచోట్ల వ్యాపించి ఉండే ఈశ్వరుడులాగా శ్రుతి అనబడే వేదం కూడా అన్నిచోట్ల వ్యాపించి ఉంది. ఒకటి మొదలు అనంతాలైన శబ్దాలుగల ఈ శ్రుతి అనేకవిధనిగూఢార్థాలతో నిండి ఉంది. శ్రుతినుంచే సమస్త పవిత్రగ్రంథాలు పుట్టాయి. దీని వల్లనే నాల్గుదిక్కులు ప్రకాశవంతంగా ఉన్నాయి. దీనినుంచే సమస్తజగత్తుకు కారణమైన ఈశ్వరుడు ఏర్పడుతున్నాడు. ఈ జగత్తు శ్రుతివల్లనే జీవిస్తున్నది (౧-౧౬౪-౪౧,౪౨).

## రెండవమండలం

**శుభాకాంక్ష :**

ఈ మండలంలో సామూహికంగా అందరికి మంచి కలగాలనే భావం ఇలా కనబడుతున్నది.

ఓ ఈశ్వరా ! మాకు అన్నిటికన్నా శ్రేష్ఠమైన ధనాలనివ్వు. వివేకవంతులమైన మాకు మాకర్తవ్యాన్ని తెలియజేయి. మాలో సన్నిహితుడవై ఉండు. మితిలేని ఐశ్వర్యాన్ని, ఆరోగ్యాన్ని మధురమైన వాక్కును ప్రసాదించు. ప్రతి ఒక్కరోజును మంచిరోజుగా చేయి. (౨-౨౧-౬).

**మంచిదోవలో పెట్టే బృహస్పతి :**

ఓ బృహస్పతీ ! నీవు మమ్మల్ని సన్మార్గంలో పెట్టికాపాడుతున్నావు. నిన్ను శరణుపొంది నీకు స్వాత్మసమర్పణం చేసుకొన్న వానికి పాపం, భయం, ఆపద, నాశం, శత్రువులు, చెడుమిత్రులు ఉండరు. మా సత్ప్రవర్తనకు ప్రతిబంధకమైన అంతఃశత్రువులను నాశం చేయి. నీవు మారక్షకుడవు. మంచిమార్గంలో మమ్మల్ని చేర్చి జ్ఞానాన్ని ప్రసాదించు. జ్ఞానాన్ని పొంది నిన్ను మరింతగా సేవించగలం. చెడుమార్గాన్ని పట్టిస్తున్న మా అజ్ఞానాన్ని దూరం చేసి మా మార్గాన్ని నిష్కంటకం చేయి (౨-౨౩-౪,౫,౬,౭).

**అన్నివైపులనుంచి అభయం :**

భగవద్భక్తుడు తన రక్షణకోసం ఆలోచించనక్కరలేదని ఆనాటివారి దృఢ విశ్వాసం.

సర్వేశ్వరుడు అన్నివిధాలైన ఉపద్రవాలను పోగొడతాడు. భగవంతుని అనుగ్రహం గలవాడికి ఎటువైపునుంచి ఎలాంటిభయం కలుగదు. వాడికి అన్నీ శుభాలే కలుగుతాయి. ఓ ఈశ్వరా! నీవు శత్రునాశకుడవు ! మాకు అన్నివైపులనుంచి అభయాన్నివ్వు (౨-౪౧-౧౦,౧౧,౧౨,).

## మూడవమండలం

ఈమండలంలో అగ్ని మనకు సర్వస్వాన్ని ఇచ్చేవాడుగా కీర్తింపబడ్డాడు (౩-౧-౧౫).

**దుష్టశిక్షణ - శిష్టరక్షణ :**

భగవంతుడు దుష్టులను శిక్షించడం శిష్టులను రక్షించడం ఈ మండలంలో పేర్కొనబడింది.

సర్వశక్తీ! భగవంతుడా ! అన్నిదిక్కులలో ఉండే క్రూరులను సమూలంగా నాశనంచేయి. ఎవడైనా సరే, మంచివాడిని రక్షించు, (౩-౩౦-౧౭).

## నాల్గవమండలం

**సత్పురుషులు :**

ఈ మండలంలో సత్పురుషుల ప్రవృత్తిని గురించి ఒక చక్కని పరిశీలన మనకు కనబడుతుంది. రైతు గుట్టలుగుంపులో తను కూర్చోడానికనువైన విశాలమైన చెట్లుగలవేవి, అలాంటి చెట్లులేనివేవి అని ఎలా తెలుసుకుంటాడో అలాగే సత్పురుషులు జ్ఞానం నుంచి అజ్ఞానాన్ని విడిగా తెలుసుకొంటున్నారు. వారు ఈశ్వరుని దర్శించడానికై ఎల్లప్పుడూ మంచిపనులే చేస్తారు. కమ్మరివాడు ఖనిజాన్ని కరిగించి శుభ్రం చేసినట్లు ఆధ్యాత్మికతత్త్వజ్ఞానంతో వారు తమను తాము పవిత్రీకరించుకొంటున్నారు. అనేకసార్లు ఆత్మప్రకాశాన్ని పొంది దానిని తమచుట్టూ ప్రసరింపచేసుకోవడానికి ఆధ్యాత్మికసంపత్తులో ఆత్మవిచారాన్ని సాగిస్తూ వైదికజ్ఞానాన్ని పొందుతున్నారు. (౪-౨-౧౧,౧౭).

**వైదిక విజ్ఞాన స్రవంతి :**

వైదిక విజ్ఞానవాహిని యొక్క తత్త్వం ఈ మండలంలో ఎంతో అందంగా పరిశీలించబడింది.

అజ్ఞానం చేత కప్పబడి ఉన్న జ్ఞానాన్ని దేవతలు కనుక్కున్నారు. మూడు స్వరూపాలు గల ఈ జ్ఞానంలో ఒక అంశాన్ని ఇంద్రుడు, ఇంకో అంశాన్ని సూర్యుడు, మరొక అంశాన్ని ఋషులు తమ తపఃశక్తిచేత కనుగొన్నారు. పరమాత్మనుంచి ప్రవాహంలాగా వచ్చే వేదాలలో జ్ఞానమంతా దాచబడి ఉంది. ఈశ్వరానుగ్రహం లేనివారు దాన్ని కనుక్కోలేరు. ఈశ్వరానుగ్రహం చేతనే మేము తెలుసుకుంటున్నాము. ధ్యానంచేసేవాడి మనస్సునుంచి నదీప్రవాహాల్లాగా ఈ జ్ఞానాలు వేగంగా వస్తున్నాయి. స్వప్రకాశస్వరూపుడైన పరమాత్మ యొక్క అలల్లాంటి ఈ జ్ఞానాలు, బోయవాని నుంచి భయపడిన మృగాల్లాగా వేగంగా పరుగెత్తుతున్నాయి. హిమతుషారంలాగా పల్లానికి ప్రవహించే నదిలాగా వేగంగా బలంగా ఆవిర్భవిస్తున్న ఈ జ్ఞానం, యుద్ధంలో అశ్వంలాగా ప్రతిబంధకాలను ఛేదించుకొని ముందుకు సాగుతున్నది. ప్రియతమ అయిన భార్య ప్రీతితో చిరునవ్వుతో భర్తను చేరుతున్నట్లు ఈ జ్ఞానప్రవాహరూపమైన వేదం ఈశ్వరుని చేరుతున్నది. ఈశ్వరుడు కూడా వేదాలపై అమితాదరాన్ని చూపుతున్నాడు. అనేక నగలంకారాలతో ముస్తాబు చేసుకొని ఈశ్వరుని చుట్టిముట్టి ఉన్న ఈ వేదాన్ని, అలంకరించుకొని వరుని దగ్గరకు చేరిన కన్యలాగా మేము భావిస్తున్నాను. ఎనలేని విజ్ఞాన కోశమైన వేదం మాకు ఎంతో పవిత్రతను చేకూర్చాలి (౪-౫౮-౪-౧౦).

## ఐదవమండలం

**వేదాలు ఎవరిని ప్రేమిస్తాయి :**

భగవంతుని గుర్తించినవాళ్ళే వేదాలు ప్రేమిస్తాయని ఈ మండలంలో చక్కగా వివరించబడింది. ఎవడు ఎప్పుడూ పరమాత్మను గుర్తిస్తున్నాడో వాడిని ఋక్కులు ప్రేమిస్తున్నాయి. ఎవడు ఎప్పుడూ ఈశ్వరుని గుర్తిస్తున్నాడో వాడిని సామలు ప్రేమిస్తున్నాయి. అట్టి వాడికి తమ స్నేహితుడుగా ఉంటానని దేవుడు మాట ఇస్తున్నాడు. అగ్ని ఈశ్వరుని ఎల్లప్పుడూ గుర్తించాడు. కనుక వానిని ఋక్కులు ప్రేమించాయి. అగ్ని ఈశ్వరుని ఎల్లప్పుడు ప్రేమించాడు. కాబట్టి వానిని సామలు ప్రేమించాయి. అగ్నికి చెలికాడుగా ఉంటానని భగవంతుడు చెప్పాడు (౫-౪౪-౧౪,౧౫).

## ఆరవమండలం

**ప్రపత్తి :**

భగవంతునికి భక్తుడు ఆత్మార్పణం చేయడమనేది ఈ మండలంలో మనకు స్పష్టంగా గోచరిస్తున్నది.

భగవంతుని దివ్య గుణసంపత్తిని వింటూ, అతని దివ్యనామాన్ని సంకీర్తిస్తూ, అతని పాదాలపై వినయంతో ఆత్మసమర్పణం చేసుకొన్న వాళ్లు తప్పక ఆయన సాక్షాత్కారంవల్ల కలిగే ఆనందాన్ని పొందుతారు (౬-౧-౪).

**నేను పరమాత్మను గురించి ఏం చెప్పగలను ?**

పరమాత్మ వాచామగోచరుడు, మనశక్తికి అందనివాడనే విషయం ఆనాడు బాగా గుర్తింపబడింది.

"నాహృదయంలో వెలుగుతున్న జ్యోతిస్సునుంచి నా చెవులు దూరంగా పోతున్నాయి. నా నేత్రాలు కూడా చూడలేకున్నాయి. నా మనస్సు చెదిరి పోతున్నది. నేను ఆ పదార్థానికి చాలా దూరంగా ఉన్నాను. నేను అలాంటి పదార్థాన్ని గురించి ఎలా చెప్పగలను? ఏమని ఆలోచించగలను ?" (౬-౯-౬).

**సంఘం - సామాన్యమానవుడు :**

ఆనాటి సంఘాన్ని గురించి, సామాన్యమానవుల్ని గురించి చక్కని పరిశీలన ఇందులో మనకు కనబడుతుంది.

సంఘాన్ని ప్రేమించు. గౌరవించు. ఆకలితో బాధపడే అనాథలను రక్షించు. సత్కార్యాలను చేయడానికి కావలసిన సామర్థ్యాలు నీకు కలగాలి. శాశ్వతమైన ధర్మం విలువలను పరిరక్షిస్తూ అందరికీ ఉపకారం చేస్తూ జీవనం సాగించు మూర్ఖతతో, హింసతో రాక్షసత్వంతో మనుష్యుల్ని వశపరచుకొనే వ్యక్తి మనుష్యుల్నేమీ చేయలేడు. అన్నీ తెలిసిన ఆ పరతత్త్వం సామాన్య మానవుల్ని రక్షించే భారాన్ని స్వీకరించాలి. ఆయనకు ఏ దిశనుంచి ఏ ఆపదా రాకుండా ఉండాలి (౬-౭౫,౯-౧౯).

## ఏడవమండలం

**అప్పులబాధ :**

అప్పులతో బాధపడటం మానవుడికి ఈనాడు కొత్తకాదు. ఆనాడు కూడా అప్పులతో బాధపడటం ఉన్నది.

అప్పులను తీర్చే ధనం నిజంగా గొప్పవస్తువు. అంతులేని సంపదలకు మనమధిపతులం కావాలి. అప్పులేనివాడు సుఖజీవి (౭-౪,౭-౮).

**విష్ణుస్తుతి :**

తననోటినుంచి వచ్చే ప్రతిమాట దేవుని స్తుతించేది కావాలని, ఆయన ప్రజలకు సేవచేసే శక్తిని తనకివ్వాలని ఆనాడు కోరుకున్నట్లు ఇక్కడ కనబడుతోంది.

నీవు విశ్వరూపాన్ని ధరించినప్పుడు వర్ణించడానికి వీలుకానంతగా పెరుగుతున్నావు. ఏ ఒక్కడూ కొంచెం కూడా నీ మహత్వాన్ని తెలుసుకోలేడు. మాకు రెండు లోకాలు మాత్రమే తెలుసు. వాటి పైలోకాలను నీవే తెలుసుకున్నావు. ఓ విష్ణూ! వషట్కారంతో నిన్ను ఆహ్వానిస్తున్నాను. నా ప్రార్థన మన్నించు. నేను పలికే ప్రతిమాట నీకొక స్తుతి అయ్యేట్లు చెయ్. నీ అనుగ్రహాన్ని నాకు శాశ్వతంగా ప్రసాదించు. విష్ణువును శరణుపొందిన మానవుడు దుఃఖాన్ని పొందుతాడా ? లేదు. త్రికరణాలతో విష్ణువును సేవించే వాడు ప్రజలందరిని సేవిస్తున్నాడు. ఓ విష్ణూ! నీవు మాకు అనేక విధాలైన సంపదలనివ్వావు. అలాగే అతిశ్రేష్ఠమైన జ్ఞానాన్ని, స్వార్థం లేకుండా ప్రజలకు సేవచేసే శక్తిని కూడా ప్రసాదించు (౭-౯౯-౧-౭,౭-౧౦౦-౧-౨).

## ఎనిమిదవమండలం

**కళ్ళుతెరచి చూడు :**

భగవంతుడు తన విశ్వరూపాన్ని భక్తునికి ఇలా వివరిస్తున్నాడు :

కళ్ళు తెరచి చూడు. నేను నీ ఎదుట ఉన్నాను. ఈ విశ్వంలోని సకలపదార్థాలు నాలో ఉన్నాయి. సత్యాన్ని దర్శించగలిగిన వాళ్ళు స్తుతించేదంతా నా స్వరూపమే. జ్ఞానాన్ని ప్రసాదిస్తూ వారిని నేనే కాపాడుతున్నాను. (౮-౧౦౦-౪).

మూర్ఖులనుంచి కాపాడండి :

వివేకం కలవాళ్ళు అజ్ఞానులకు దూరంగా పారిపోవడం ఆనాటికే ఉంది.

ఓ మిత్రా వరుణాలారా! ఎవడు శ్రద్ధతో విచారించడానికి ఇష్టపడడో, ఎవడు ఆధ్యాత్మికవాదంలో పాల్గొనడో, అలాంటి అజ్ఞాని బాహువులనుంచి మమ్మల్ని రక్షించండి (౮-౧౦౧-౪).

## తొమ్మిదవమండలం

**పవమానసోముడు:**

ఆనాడు సంఘంలో ప్రసిద్ధమైన అనేక లౌకికోపమానాలతో ఇందులో పవమానసోముడు వర్ణింపబడ్డాడు.

పవిత్రస్వరూపుడవైన సోముడా ! సమస్తప్రాణులు నీ నుంచి పుట్టినవే. నీవే ఈ సకల జగత్తుకు అధిపతివి. మా నివాసానికి ఈ భూమిని ఈ దేహాన్ని నిర్మించింది నీవే. నీవే అందరిని పవిత్రుల్ని చేస్తున్నావు. ఐహికాముష్మికాలతో వశించని సంపదను మాకివ్వు. కొత్తగా పుట్టిన తన దూడమీద ఆవు ఎలా ప్రేమగా ఉంటుందో, అలా నీపైనే మానవులందరూ ప్రేమతో ఉండి ఆనందిస్తున్నారు.

చంటిబిడ్డ తల్లిదండ్రులచేతుల్లోకి, జారుడు ప్రియురాలిదగ్గరకు, పెండ్లికుమార్తె వరునిదగ్గరకు వేగంగా పరుగెత్తినట్లు పవమాన సోముడు తన భక్తుల దగ్గరకు త్వరగా పరుగెత్తి వస్తున్నాడు. సొంతంగా ఇల్లు కట్టుకొన్నవాడు అందులో నివసించాలని కోరుకున్నట్లు పవిత్రహృదయంలో నివసించడానికి పవమానసోముడు త్వరపడుతున్నాడు (౯-౩౬-౨౦,౯-౧౦౦-౨౨, ౯-౧౦౧,౧౪,౧౫).

## పదవమండలం

**జూదగాడు:**

జూదగాడి మనస్తత్వాన్ని ఎంతచక్కగానో వర్ణిస్తూ ఆనాటి సాంఘికజీవనాన్ని మనకన్నులకు కడుతున్నది ఈ సందర్భం.

దేవతలకు సోమంలాగా నాకు ఈ విభీతకవృక్షంలో కాసిన పాచికలు చాలా ఇష్టం. నాతో నా స్నేహితులతో నా భార్య చాలా మంచిగా ఉండేది. ఆమె నన్నెప్పుడూ బాధించలేదు. కానీ కేవలం జూదం మీది ప్రేమతో నేనామెను బాధించాను. దూరం చేసుకున్నాను. అత్త ద్వేషిస్తున్నది. జూదంలో సర్వస్వాన్ని పోగొట్టుకునే వాడికి మిత్రులెవరూ ఉండరంటూ భార్య దగ్గరకు రానీయడంలేదు. ముసలిదైన గుర్రంలాగా నా బ్రతుకు నిష్ఫలమైంది.

జూదంలో ఓడిపోయినవాడి భార్యను ఇతరులు గూడా ఎంతో అలుసుగా చూస్తారు. తల్లి తండ్రి- అన్నదమ్ములు మాకు - వాడికి సంబంధం లేదంటూ పట్టుకుపొమ్మని అధికారులకు చెబుతారు. ఒక్కొక్కప్పుడు ఇకమీదట జూదమాడకూడదని నిర్ణయించుకుంటాను. కాని పాచికల శబ్దం వినపడగానే సంకేతశబ్దం విన్న వ్యభిచారిణిలాగా జూదమాడే చోటుకు పోతున్నాను.

ప్రతి జూదగాడు ఈ రోజు తప్పకగెలుస్తాను అనుకుంటూనే ఆటలో ప్రవేశిస్తాడు. పాచికలు అతని కోరికను పెంచుతాయి. చివరకు తనసొమ్మునంతా ఇతరులకిచ్చి పోతాడు. పాచికలు ద్రోహబుద్ధిగలవి. జూదగాని ఆశను రేకెత్తిస్తున్నాయి. గెలిచినవాళ్ళ కూడా తాత్కాలికంగా సంతోషపరచినా చివరకు నాశనం చేస్తున్నాయి. అవి ఎవని ఆగ్రహానికి లొంగవు. రాజుకూడా వాటికి లొంగవలసిందే. పాచికలు భూమిమీద పడినా జూదగాని మనస్సును పైపైకి తోస్తున్నాయి. వాటికి చేతులు లేకపోయినా చేతులుగలవాళ్ళను కూడా ఓడిస్తున్నాయి. స్వయంగా చల్లనివైనా ఆకాశం నుంచి పడిన నిప్పుకణికల్లాగా హృదయాలను కాలుస్తున్నాయి.

జూదగాని భార్య, తల్లి తీరనిదుఃఖానికి గురి అవుతున్నారు. అప్పులవాళ్ళు ఎప్పుడూ వెంటబడుతూనే ఉంటారు. చేతిలో చిల్లిగవ్వలేక రాత్రిళ్ళు ఇతరుల ఇళ్ళలో ప్రవేశించి దొంగతనానికి పాల్పడుతున్నాడు. జూదగాడు డబ్బుగల దంపతులను చూసి ఈర్ష్యపడుతున్నాడు. సర్వస్వాన్ని కోల్పోయి, గెలిచినవానికి చేతులెత్తి నా దగ్గర ఏమి లేదని చెబుతున్నాడు.

ఓ జూదగాడా జూదమాడకు ! వ్యవసాయం చేసుకో. దానివల్ల కలిగే సంపదతో తృప్తిపడు. ఇది భగవంతుడు మనకిచ్చిన తీర్పు, సందేశం. ఓ దేవతలారా ! మాకు మిత్రులై ఆనందాన్నిచ్చి మమ్మల్ని రక్షించండి. ఈ పాచికలకు మళ్ళా ఎప్పుడూ మమ్మల్ని బానిసలను కానీయకండి (౧౦-౩౪,౧-౧౪).

**మీరు గుర్తించలేరు :**

దేవుణ్ని గుర్తించలేకపోవడం ఆనాటికే ఉన్నది. ఆ విషయంలో చేస్తున్న హెచ్చరిక ఇక్కడ కనబడుతుంది.

ఎవడు ఈ సకలజగత్తును సృష్టించాడో వాడిని మీరు తెలుసుకోలేకపోతున్నారు. మీకు ఆ పరమాత్మకు చాలా తేడా ఉంది మంచుపొరలాంటి అజ్ఞానంచేత కప్పబడ్డ మీరుతూరకే మాట్లాడుతున్నారేగాని ఆయనను గుర్తించలేకపోతున్నారు ( ౧౦-౮౨-౭)

**శ్రామికుడు :**

రైతులకు మంచిపంట కావాలని ప్రార్థించడం ఆనాడు ఉంది.

మేఘాలు తియ్యని నీటినిచ్చినట్లు, తేనెటీగలు మధురమైన తేనెనిచ్చినట్లు నీవు పశువులలో పాలను సృష్టించావు. పగలంతా చెమటోడ్చి శ్రమించిన శ్రామికునకు అలాగే ధాన్యాదియుక్తమైన సంపదనివ్వు (౧౦-౧౦౬-౧౦).

**సమసమాజ నిర్మాణం :**

వర్గభేదం ఉండకూడదు. దరిద్రనారాయణులను సేవించాలి అని ఈనాడు మనం అనుకునే మాటలు కొత్తవికావు. ఋగ్వేదమే ఈ వాదానికి నాంది పలికింది.

దరిద్రుడే చస్తాడు, ధనికుడు చావడన్న నియమంలేదు. ప్రతివాడికి చావు తప్పదు. తనకున్నదాన్ని పంచియిచ్చేవాడి ఐశ్వర్యం ఎప్పుడూ తరగదు. అలా చెయ్యని వాడికి మిత్రుడనే వాడుండడు. కడుపు చేతపట్టుకుని కళ్లల్లో ప్రాణాన్ని పెట్టుకొని అన్నార్తుడై వచ్చిన బీదవాడికి అన్నం పెట్టక కలిగి ఉండీ తానొకడే తినే ధనికుని విషయంలో ఎవరికీ సద్భావం ఉండదు. అన్నంకోరి వచ్చిన పేదవాడి ఆకలితీర్చి తాను భుజించేవ్యక్తికి ఎప్పుడూ ఏ కొరతా రాదు. అన్ని వైపులనుంచి వాడికి సహాయం లభిస్తుంది. అతనికే మిత్రులు అధికంగా తోడ్పడతారు. తన తోటివారికి, బంధువులకు, సేవకులకు అన్నం పెట్టనివాడు మిత్రుడేకాడు.

ధనికుడైనవాడు తను ప్రయాణించవలసిన దూరాన్ని గుర్తు పెట్టుకొని తనధనాన్ని లేనివాడికి పంచి ఇవ్వాలి. రథంలోని చక్రంలాగా సంపదలు క్షణంలో వస్తున్నాయి. క్షణంలో పోతున్నాయి. ఎవడు మానవతాహీనుడై క్రూరుడై ధాన్యాదులను కేవలం తన ఒక్కడి కోసమే దాచి ఉంచుకుంటాడో నేను నిజం పలుకుతున్నాను వాడు తప్పక నశిస్తాడు. ఒక సామాన్య మానవుడు తనకన్నా రెండురెట్లు ధనం గలవాడిని ఆశ్రయిస్తాడు. రెండురెట్లు ధనం గలవాడు మూడు రెట్లు ధనం గలవాడిని, వాడు నాల్గు రెట్లు ధనం గలవాడిని ఇలాగే తనకన్నా గొప్పవాడిని ప్రతివాడూ ఆశ్రయిస్తున్నాడు. ఈ తత్త్వంతెలిసి ధనికుడైనవాడు గర్వపడకూడదు. చేతులు రెండూ ఒకేమాదిరిగా ఉన్నా సమానమైన పని చేయలేవు. రెండావులు ఒకేసారి ఈనినా సమానమైన పాలు ఇవ్వలేవు. కవలలే అయినా ఒకేరకమైన బలం ఇద్దరిలో ఉండదు. అలాగే అందరూ మానవులే అయినా, అందరూ దాతలు కాలేరు (౧౦-౧౧౭-౧,౯)

**సమత్వం :**

మన అందరి ఆశలు ఒకటిగా ఉండాలి.

మన అందరి హృదయాలు ఒకటి కావాలి.

మన అందరి ఆలోచనలు ఒకత్రాటిపై నడవాలి.

మన మందరం ఒకటై మంచి స్నేహితులం కావాలి. (౧౦-౧౯౧-౪)

**-శుభం**

# ఋగ్వేద-సంహితా

## అథ ప్రథమం మణ్డలమ్

### అథ ప్రథమాష్టకే-ప్రథమోఽధ్యాయః

ప్రథమోఽనువాకః (౧) ప్రథమం సూక్తమ్

ఋషిః - మధుచ్ఛన్దాః॥ దేవతా - అగ్నిః॥ ఛన్దః-౧,౩-౫, ౭, గాయత్రీ;
౨ పిపీలికామధ్యానివృద్గాయత్రీ, ౬ నివృద్గాయత్రీ; ౮ యవమధ్యావిరాడ్గాయత్రీ;
౯ విరాడ్గాయత్రీ॥ స్వరః - షడ్జః॥

అథ ప్రథమో వర్గః ॥౧॥

౧. అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్ । హోతారం రత్నధాతమమ్ ॥ ౧

౨. అగ్నిః పూర్వేభిరృషిభిరీడ్యో నూతనైరుత । స దేవాఁ ఏహ వక్షతి ॥ ౨

౩. అగ్నినా రయిమశ్నవత్ పోషమేవ దివేదివే । యశసం వీరవత్తమమ్ ॥ ౩

౪. అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి । స ఇద్దేవేషు గచ్ఛతి ॥ ౪

౫. అగ్నిర్హోతా కవిక్రతుః సత్యశ్చిత్రశ్రవస్తమః । దేవో దేవేభిరా గమత్ ॥ ౫

అథ ద్వితీయో వర్గః ॥౨॥

౬. యదఙ్గ దాశుషే త్వమగ్నే భద్రం కరిష్యసి । తవేత్ తత్ సత్యమఙ్గిరః ॥ ౬

౭. ఉప త్వాగ్నే దివేదివే దోషావస్తర్ధియా వయమ్ । నమో భరన్త ఏమసి ॥ ౭

౮. రాజన్తమధ్వరాణాం గోపామృతస్య దీదివిమ్ । వర్ధమానం స్వే దమే ॥ ౮

౯. స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ । సచస్వా నః స్వస్తయే ॥ ౯

(౨) ద్వితీయం సూక్తమ్

ఋషిః - మధుచ్ఛన్దాః॥ దేవతా ౧-౩ వాయుః, ౪-౬ ఇన్ద్రవాయూ; ౭-౯ మిత్రావరుణౌ॥ ఛన్దః
౧,౨ పిపీలికామధ్యానివృద్గాయత్రీ; ౩-౫, ౭-౯ గాయత్రీ;
౬ నివృద్గాయత్రీ॥ స్వరః - షడ్జః॥

అథ తృతీయో వర్గః ॥ ౩ ॥

౧౦. వాయవా యాహి దర్శతేమే సోమా అరంకృతాః । తేషాం పాహి శ్రుధీ హవమ్ ॥ ౧

౧౧. వాయ ఉక్థేభిర్జరన్తే త్వామచ్ఛా జరితారః । సుతసోమా అహర్విదః ॥ ౨

౧౨. వాయో తవ ప్రపృఞ్చతీ ధేనా జిగాతి దాశుషే । ఉరూచీ సోమపీతయే ॥ ౩

౧౩. ఇన్ద్రవాయూ ఇమే సుతా ఉప ప్రయోభిరా గతమ్ । ఇన్దవో వాముశన్తి హి ॥ ౪

౧౪. వాయవిన్ద్రశ్చ చేతథః సుతానాం వాజినీవసూ । తావా యాతముప ద్రవత్ ॥ ౫

అథ చతుర్థో వర్గః ॥౪॥

౧౫. వాయవిన్ద్రశ్చ సున్వత ఆ యాతముప నిష్కృతమ్ । మక్ష్విత్థా ధియా నరా ॥ ౬

౧౬. మిత్రం హువే పూతదక్షం వరుణం చ రిశాదసమ్ । ధియం ఘృతాచీం సాధన్తా ॥ ౭

౧౭. ఋతేన మిత్రావరుణావృతావృధావృతస్పృశా । క్రతుం బృహన్తమాశాథే ॥ ౮

౧౮. కవీ నో మిత్రావరుణా తువిజాతా ఉరుక్షయా । దక్షం దధాతే అపసమ్ ॥ ౯

(౩) తృతీయం సూక్తమ్

ఋషిః : మధుచ్ఛన్దాః॥ దేవతా - ౧-౩ అశ్వినౌ; ౪-౬ ఇన్ద్రః; ౭-౯ విశ్వేదేవాః; ౧౦-౧౨
సరస్వతీ॥ ఛన్దః-౧,౩,౫-౧౦,౧౨ గాయత్రీ; ౨ నివృద్గాయత్రీ; ౪,౧౧
పిపీలికామధ్యానివృద్గాయత్రీ॥ స్వరః-షడ్జః॥

అథ పఞ్చమో వర్గః ॥ ౫ ॥

౧౯. అశ్వినా యజ్వరీరిషో ద్రవత్పాణీ శుభస్పతీ। పురుభుజా చనస్యతమ్॥ ౧

౨౦. అశ్వినా పురుదంససా నరా శవీరయా ధియా। ధిష్ణ్యా వనతం గిరః॥ ౨

౨౧. దస్రా యువాకవః సుతా నాసత్యా వృక్తబర్హిషః। ఆ యాతం రుద్రవర్తనీ॥ ౩

౨౨. ఇంద్రా యాహి చిత్రభానో సుతా ఇమే త్వాయవః। అణ్వీభిస్తనా పూతాసః॥ ౪

౨౩. ఇంద్రా యాహి ధియేషితో విప్రజూతః సుతావతః। ఉప బ్రహ్మాణి వాఘతః॥ ౫

౨౪. ఇంద్రా యాహి తూతుజాన ఉప బ్రహ్మాణి హరివః। సుతే దధిష్వ నశ్చనః॥ ౬

అథ షష్ఠో వర్గః॥ ౬॥

౨౫. ఓమాసశ్చర్షణీధృతో విశ్వే దేవాస ఆ గత। దాశ్వాంసో దాశుషః సుతమ్ ౭

౨౬. విశ్వే దేవాసో అప్తురః సుతమా గన్త తూర్ణయః। ఉస్రా ఇవ స్వసరాణి॥ ౮

౨౭. విశ్వే దేవాసో అస్రిధ ఏహిమాయాసో అద్రుహః। మేధం జుషన్త వహ్నయః॥ ౯

౨౮. పావకా నః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ। యజ్ఞం వష్టు ధియావసుః॥ ౧౦

౨౯. చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్। యజ్ఞం దధే సరస్వతీ॥ ౧౧

౩౦. మహో అర్ణః సరస్వతీ ప్ర చేతయతి కేతునా। ధియో విశ్వా వి రాజతి॥ ౧౨

**ద్వితీయోఽనువాకః**

## (౪) అథ చతుర్థం సూక్తమ్

ఋషిః- మధుచ్ఛన్దాః॥ దేవతా - ఇన్ద్రః॥ ఛన్దః - ౧,౨, ౪-౬ గాయత్రీ;
౩ విరాడ్గాయత్రీ; ౧౦ నివృద్గాయత్రీ॥ స్వరః-షడ్జః॥

అథ సప్తమో వర్గః॥ ౭॥

౩౧. సురూపకృత్నుమూతయే సుదుఘామివ గోదుహే। జుహూమసి ద్యవిద్యవి॥ ౧

౩౨. ఉప నః సవనా గహి సోమస్య సోమపాః పిబ। గోదా ఇద్రేవతో మదః॥ ౨

౩౩. అథా తే అన్తమానాం విద్యామ సుమతీనామ్। మా నో అతి ఖ్య ఆ గహి॥ ౩

౩౪. పరేహి విగ్రమస్తృతమింద్రం పృచ్ఛా విపశ్చితమ్। యస్తే సఖిభ్య ఆ వరమ్॥ ౪

౩౫. ఉత బ్రువన్తు నో నిదో నిరన్యతశ్చిదారత। దధానా ఇంద్ర ఇద్దువః॥ ౫

అథ అష్టమో వర్గః॥ ౮॥

౩౬. ఉత నః సుభగాఁ అరిర్వోచేయుర్దస్మ కృష్టయః। స్యామేదింద్రస్య శర్మణి॥ ౬

౩౭. ఏమాశుమాశవే భర యజ్ఞశ్రియం నృమాదనమ్। పతయన్మన్దయత్సఖమ్॥ ౭

౩౮. అస్య పీత్వా శతక్రతో ఘనో వృత్రాణామభవః। ప్రావో వాజేషు వాజినమ్॥ ౮

౩౯. తం త్వా వాజేషు వాజినం వాజయామః శతక్రతో। ధనానామింద్ర సాతయే॥ ౯

౪౦. యో రాయో౩వనిర్మహాన్త్సుపారః సున్వతః సఖా। తస్మా ఇంద్రాయ గాయత॥ ౧౦

## (౫) పఞ్చమం సూక్తమ్

ఋషిః- మధుచ్ఛన్దాః॥ దేవతా- ఇన్ద్రః॥ ఛన్దః- ౧ విరాడ్గాయత్రీ; ౨ ఆర్చ్యుష్ణిక్; ౩
పిపీలికామధ్యానివృద్గాయత్రీ; ౪,౧౦ గాయత్రీ; ౫-౭,౯ నివృద్గాయత్రీ; ౮
పాదనివృద్గాయత్రీ॥ స్వరః - ౧,౩-౧౦ షడ్జః; ౨ ఋషభః॥

అథ నవమో వర్గః॥ ౯॥

౪౧. ఆ త్వేతా ని షీదతేంద్రమభి ప్ర గాయత। సఖాయః స్తోమవాహసః॥ ౧

౪౨. పురూతమం పురూణామీశానం వార్యాణామ్। ఇంద్రం సోమే సచా సుతే॥ ౨

౪౩. స ఘా నో యోగ ఆ భువత్స రాయే స పురంధ్యామ్। గమద్వాజేభిరా స నః॥ ౩

౪౪. యస్య సంస్థే న వృణ్వతే హరీ సమత్సు శత్రవః। తస్మా ఇంద్రాయ గాయత॥ ౪

౪౫. సుతపావ్నే సుతా ఇమే శుచయో యన్తి వీతయే। సోమాసో దధ్యాశిరః॥ ౫

అథ దశమో వర్గః॥ ౧౦॥

౪౬. త్వం సుతస్య పీతయే సద్యో వృద్ధో అజాయథాః। ఇంద్ర జ్యైష్ఠ్యాయ సుక్రతో॥ ౬

౪౭. ఆ త్వా విశంత్వాశవః సోమాస ఇంద్ర గిర్వణః । శం తే సంతు ప్రచేతసే ॥ ౭

౪౮. త్వాం స్తోమా అవీవృధన్ త్వాముక్థా శతక్రతో । త్వాం వర్ధంతు నో గిరః ॥ ౮

౪౯. అక్షితోతిః సనేదిమం వాజమింద్రః సహస్రిణమ్ । యస్మిన్ విశ్వాని పౌంస్యా ॥ ౯

౫౦. మా నో మర్తా అభి ద్రుహన్ తనూనామింద్ర గిర్వణః । ఈశానో యవయా వధమ్ ॥ ౧౦

## (౬) షష్ఠం సూక్తమ్

ఋషిః-మధుచ్ఛందాః॥ దేవతా-౧-౩,౧౦ ఇంద్రః; ౪,౬,౮,౯ మరుతః; ౫,౭ మరుత ఇంద్రశ్చ॥ ఛందః-౧,౩,౫-౭,౯,౧౦ గాయత్రీ; ౨ విరాడ్గాయత్రీ; ౪,౮ నివృద్గాయత్రీ॥ స్వరః-షడ్జః॥

**అథ ఏకాదశో వర్గః ॥ ౧౧ ॥**

౫౧. యుంజంతి బ్రధ్నమరుషం చరంతం పరి తస్థుషః । రోచంతే రోచనా దివి ॥ ౧

౫౨. యుంజంత్యస్య కామ్యా హరీ విపక్షసా రథే । శోణా ధృష్ణూ నృవాహసా ॥ ౨

౫౩. కేతుం కృణ్వన్నకేతవే పేశో మర్యా అపేశసే । సముషద్భిరజాయథాః ॥ ౩

౫౪. ఆదహ స్వధామను పునర్గర్భత్వమేరిరే । దధానా నామ యజ్ఞియమ్ ॥ ౪

౫౫. వీళు చిదారుజత్నుభిర్గుహా చిదింద్ర వహ్నిభిః । అవింద ఉస్రియా అను ॥ ౫

**అథ ద్వాదశో వర్గః ॥ ౧౨ ॥**

౫౬. దేవయంతో యథా మతిమచ్ఛా విదద్వసుం గిరః । మహామనూషత శ్రుతమ్ ॥ ౬

౫౭. ఇంద్రేణ సం హి దృక్షసే సంజగ్మానో అబిభ్యుషా । మందూ సమానవర్చసా ॥ ౭

౫౮. అనవద్యైరభిద్యుభిర్మఖః సహస్వదర్చతి । గణైరింద్రస్య కామ్యైః ॥ ౮

౫౯. అతః పరిజ్మన్నా గహి దివో వా రోచనాదధి । సమస్మిన్నృంజతే గిరః ॥ ౯

౬౦. ఇతో వా సాతిమీమహే దివో వా పార్థివాదధి । ఇంద్రం మహో వా రజసః ॥ ౧౦

## (౭) సప్తమం సూక్తమ్

ఋషిః-మధుచ్ఛందాః॥ దేవతా-ఇంద్రః॥ ఛందః-౧,౩,౫-౭ గాయత్రీ; ౨,౪ నివృద్గాయత్రీ; ౮,౧౦ పిపీలికామధ్యా నివృద్గాయత్రీ; ౯ పాదనివృద్గాయత్రీ॥ స్వరః-షడ్జః॥

**అథ త్రయోదశో వర్గః ॥ ౧౩ ॥**

౬౧. ఇంద్రమిద్గాథినో బృహదింద్రమర్కేభిరర్కిణః । ఇంద్రం వాణీరనూషత ॥ ౧

౬౨. ఇంద్ర ఇద్ధర్యోః సచా సంమిశ్ల ఆ వచోయుజా । ఇంద్రో వజ్రీ హిరణ్యయః ॥ ౨

౬౩. ఇంద్రో దీర్ఘాయ చక్షస ఆ సూర్యం రోహయద్దివి । వి గోభిరద్రిమైరయత్ ॥ ౩

౬౪. ఇంద్ర వాజేషు నోఽవ సహస్రప్రధనేషు చ । ఉగ్ర ఉగ్రాభిరూతిభిః ॥ ౪

౬౫. ఇంద్రం వయం మహాధన ఇంద్రమర్భే హవామహే । యుజం వృత్రేషు వజ్రిణమ్ ॥ ౫

**అథ చతుర్దశో వర్గః ॥ ౧౪ ॥**

౬౬. స నో వృషన్నముం చరుం సత్రాదావన్నపా వృధి । అస్మభ్యమప్రతిష్కుతః ॥ ౬

౬౭. తుంజేతుంజే య ఉత్తరే స్తోమా ఇంద్రస్య వజ్రిణః । న వింధే అస్య సుష్టుతిమ్ ॥ ౭

౬౮. వృషా యూథేవ వంసగః కృష్టీరియర్త్యోజసా । ఈశానో అప్రతిష్కుతః ॥ ౮

౬౯. య ఏకశ్చర్షణీనాం వసూనామిరజ్యతి । ఇంద్రః పంచ క్షితీనామ్ ॥ ౯

౭౦. ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః । అస్మాకమస్తు కేవలః ॥ ౧౦

## తృతీయోఽనువాకః (౮) అథ అష్టమం సూక్తమ్

ఋషిః-మధుచ్ఛందాః॥ దేవతా-ఇంద్రః॥ ఛందః-౧,౫,౮ నివృద్గాయత్రీ; ౨ విరాడ్గాయత్రీ; ౩,౪,౬,౭,౯ గాయత్రీ; ౧౦ వర్ధమానా గాయత్రీ॥ స్వరః-షడ్జః॥

**అథ పంచదశో వర్గః ॥ ౧౫ ॥**

౭౧. ఏంద్ర సానసిం రయిం సజిత్వానం సదాసహమ్ । వర్షిష్ఠమూతయే భర ॥ ౧

౭౨. ని యేన ముష్టిహత్యయా ని వృత్రా రుణధామహై । త్వోతాసో న్యర్వతా ॥ ౨

౭౩. ఇంద్ర త్వోతాస ఆ వయం వజ్రం ఘనా దదీమహి । జయేమ సం యుధి స్పృధః॥ ౩

౭౪. వయం శూరేభిరస్తృభిరింద్ర త్వయా యుజా వయమ్ । సాసహ్యామ పృతన్యతః॥ ౪

౭౫. మహాఁ ఇంద్రః పరశ్చ ను మహిత్వమస్తు వజ్రిణే । ద్యౌర్న ప్రథినా శవః ॥ ౫

**అథ షోడశో వర్గః ॥ ౧౬ ॥**

౭౬. సమోహే వా య ఆశత నరస్తోకస్య సనితౌ । విప్రాసో వా ధియాయవః ॥ ౬

౭౭. యః కుక్షిః సోమపాతమః సముద్ర ఇవ పిన్వతే । ఉర్వీరాపో న కాకుదః ॥ ౭

౭౮. ఏవా హ్యస్య సూనృతా విరప్శీ గోమతీ మహీ । పక్వా శాఖా న దాశుషే ॥ ౮

౭౯. ఏవా హి తే విభూతయ ఊతయ ఇంద్ర మావతే । సద్యశ్చిత్ సంతి దాశుషే ॥ ౯

౮౦. ఏవా హ్యస్య కామ్యా స్తోమ ఉక్థం చ శంస్యా । ఇంద్రాయ సోమపీతయే ॥ ౧౦

## (౯) అథ నవమం సూక్తమ్

ఋషిః-మధుచ్ఛన్దాః॥ దేవతా-ఇంద్రః॥ ఛందః-౧,౩,౭,౧౦ నిచృద్గాయత్రీ; ౨,౪,౮, ౯ గాయత్రీ; ౫,౬ పిపీలికామధ్యానిచృద్గాయత్రీ॥ స్వరః-షడ్జః ॥

**అథ సప్తదశో వర్గః ॥ ౧౭ ॥**

౮౧. ఇంద్రేహి మత్స్యంధసో విశ్వేభిః సోమపర్వభిః । మహాఁ అభిష్టిరోజసా ॥ ౧

౮౨. ఏమేనం సృజతా సుతే మందిమింద్రాయ మందినే । చక్రిం విశ్వాని చక్రయే ॥ ౨

౮౩. మత్స్వా సుశిప్ర మందిభిః స్తోమేభిర్విశ్వచర్షణే । సచైషు సవనేష్వా ॥ ౩

౮౪. అసృగ్రమింద్ర తే గిరః ప్రతి త్వాముదహాసత । అజోషా వృషభం పతిమ్ ॥ ౪

౮౫. సం చోదయ చిత్రమర్వాగ్రాధ ఇంద్ర వరేణ్యమ్ । అసదిత్ తే విభు ప్రభు ॥ ౫

**అథ అష్టాదశో వర్గః ॥ ౧౮ ॥**

౮౬. అస్మాన్త్సు తత్ర చోదయేంద్ర రాయే రభస్వతః । తువిద్యుమ్న యశస్వతః ॥ ౬

౮౭. సం గోమదింద్ర వాజవదస్మే పృథు శ్రవో బృహత్ । విశ్వాయుర్ధేహ్యక్షితమ్ ॥ ౭

౮౮. అస్మే ధేహి శ్రవో బృహద్ ద్యుమ్నం సహస్రసాతమమ్ । ఇంద్ర తా రథినీరిషః ॥ ౮

౮౯. వసోరింద్రం వసుపతిం గీర్భిర్గృణంత ఋగ్మియమ్ । హోమ గంతారమూతయే ॥ ౯

౯౦. సుతేసుతే న్యోకసే బృహద్ బృహత ఏదరిః । ఇంద్రాయ శూషమర్చతి ॥ ౧౦

## (౧౦) అథ దశమం సూక్తమ్

ఋషిః - మధుచ్ఛన్దాః॥ దేవతా-ఇంద్రః॥ ఛన్దః -౧-౩, ౫ విరాడనుష్టుప్; ౪ భురిగుష్ణిక్; ౬ ,౮ నిచృదనుష్టుప్; ౭, ౯-౧౨ అనుష్టుప్॥ స్వరః -౧-౩, ౫-౧౨ గాన్ధారః; ౪ ఋషభః॥

**అథ ఏకోనవింశో వర్గః ॥ ౧౯ ॥**

౯౧. గాయంతి త్వా గాయత్రిణోఽర్చంత్యర్కమర్కిణః ।
బ్రహ్మాణస్త్వా శతక్రత ఉద్ వంశమివ యేమిరే ॥ ౧

౯౨. యత్ సానోః సాన్వారుహద్ భూర్యస్పష్ట కర్త్వమ్ ।
తదింద్రో అర్థం చేతతి యూథేన వృష్ణిరేజతి ॥ ౨

౯౩. యుక్ష్వా హి కేశినా హరీ వృషణా కక్ష్యప్రా ।
అథా న ఇంద్ర సోమపా గిరాముపశ్రుతిం చర ॥ ౩

౯౪. ఏహి స్తోమాఁ అభి స్వరాభి గృణీహ్యా రువ ।
బ్రహ్మ చ నో వసో సచేంద్ర యజ్ఞం చ వర్ధయ ॥ ౪

౯౫. ఉక్థమింద్రాయ శంస్యం వర్ధనం పురునిష్షిధే ।
శక్రో యథా సుతేషు ణో రారణత్ సఖ్యేషు చ ॥ ౫

౯౬. తమిత్సఖిత్వ ఈమహే తం రాయే తం సువీర్యే ।

స శక్ర ఉత నః శకదింద్రో వసు దయమానః ॥ ౬

అథ వింశో వర్గః ॥ ౨౦ ॥

౯౭. సువివృతం సునిరజమింద్ర త్వాదాతమిద్యశః ।

గవామప వ్రజం వృధి కృణుష్వ రాధో అద్రివః ॥ ౭

౯౮. న హి త్వా రోదసీ ఉభే ఋఘాయమాణమిన్వతః ।

జేషః స్వర్వతీరపః సం గా అస్మభ్యం ధూనుహి ॥ ౮

౯౯. ఆశ్రుత్కర్ణ శ్రుధీ హవం నూ చిద్దధిష్వ మే గిరః ।

ఇంద్ర స్తోమమిమం మమ కృష్వా యుజశ్చిదంతరమ్ ॥ ౯

౧౦౦. విద్మా హి త్వా వృషంతమం వాజేషు హవనశ్రుతమ్ ।

వృషంతమస్య హూమహ ఊతిం సహస్రసాతమామ్ ॥ ౧౦

౧౦౧. ఆ తూ న ఇంద్ర కౌశిక మందసానః సుతం పిబ ।

నవ్యమాయుః ప్ర సూ తిర కృధీ సహస్రసామృషిమ్ ॥ ౧౧

౧౦౨. పరి త్వా గిర్వణో గిర ఇమా భవంతు విశ్వతః ।

వృద్ధాయుమను వృద్ధయో జుష్టా భవంతు జుష్టయః ॥ ౧౨

## (౧౧) ఏకాదశం సూక్తమ్

ఋషిః - జేతా మాధుచ్ఛందసః ॥ దేవతా - ఇంద్రః ॥ ఛన్దః - ౧-౩,౯ విద్యదనుష్టుప్ ; ౪,౬ అనుష్టుప్; ౫ భురిగుష్ణిక్; ౭ విరాడనుష్టుప్ స్వరః - ౧-౪, ౬-౮ గాంధారః ౭ ఋషభః

అథ ఏకవింశో వర్గః ॥ ౨౧ ॥

౧౦౩. ఇంద్రం విశ్వా అవీవృధంత్సముద్రవ్యచసం గిరః ।

రథీతమం రథీనాం వాజానాం సత్పతిం పతిమ్ ॥ ౧

౧౦౪. సఖ్యే త ఇంద్ర వాజినో మా భేమ శవసస్పతే ।

త్వామభి ప్ర ణోనుమో జేతారమపరాజితమ్ ॥ ౨

౧౦౫. పూర్వీరింద్రస్య రాతయో న వి దస్యంత్యూతయః ।

యదీ వాజస్య గోమతః స్తోతృభ్యో మంహతే మఘమ్ ॥ ౩

౧౦౬. పురాం భిందుర్యువా కవిరమితౌజా అజాయత ।

ఇంద్రో విశ్వస్య కర్మణో ధర్తా వజ్రీ పురుష్టుతః ॥ ౪

౧౦౭. త్వం వలస్య గోమతోఽపావరద్రివో బిలమ్ । త్వాం దేవా

అబిభ్యుషస్తుజ్యమానాస ఆవిషుః ॥ ౫

౧౦౮. తవాహం శూర రాతిభిః ప్రత్యాయం సింధుమావదన్ ।

ఉపాతిష్ఠంత గిర్వణో విదుష్టే తస్య కారవః ॥ ౬

౧౦౯. మాయాభిరింద్ర మాయినం త్వం శుష్ణమవాతిరః ।

విదుష్టే తస్య మేధిరాస్తేషాం శ్రవాంస్యుత్తిర ॥ ౭

౧౧౦. ఇంద్రమీశానమోజసాభి స్తోమా అనూషత ।

సహస్రం యస్య రాతయ ఉత వా సంతి భూయసీః ॥ ౮

## చతుర్థో ఽనువాకః (౧౨) ద్వాదశం సూక్తమ్

ఋషిః - మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - అగ్నిః ॥ ఛందః - ౧,౨, ౭-౯, ౧౧,౧౨

గాయత్రీ, ౪,౧౦ పిపీలికామధ్యానిచృద్ గాయత్రీ ౬ విరాడ్గాయత్రీ ౩-౫ నిచృద్ గాయత్రీ॥
స్వరః-షడ్జః॥

అథ ద్వావింశో వర్గః ॥ ౨౨ ॥

౧౧౧. అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్ । అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥ ౧

౧౧౨. అగ్నిమగ్నిం హవీమభిః సదా హవన్త విశ్పతిమ్ । హవ్యవాహం పురుప్రియమ్ ॥ ౨

౧౧౩. అగ్నే దేవాఁ ఇహా వహ జజ్ఞానో వృక్తబర్హిషే । అసి హోతా న ఈడ్యః ॥ ౩

౧౧౪. తాఁ ఉశతో వి బోధయ యదగ్నే యాసి దూత్యమ్ । దేవైరా సత్సి బర్హిషి ॥ ౪

౧౧౫. ఘృతాహవన దీదివః ప్రతి ష్మ రిషతో దహ । అగ్నే త్వం రక్షస్వినః ॥ ౫

౧౧౬. అగ్నినాగ్నిః సమిధ్యతే కవిర్గృహపతిర్యువా । హవ్యవాడ్జుహ్వాస్యః ॥ ౬

అథ త్రయోవింశో వర్గః ॥ ౨౩ ॥

౧౧౭. కవిమగ్నిముప స్తుహి సత్యధర్మాణమధ్వరే । దేవమమీవచాతనమ్ ॥ ౭

౧౧౮. యస్త్వామగ్నే హవిష్పతిర్దూతం దేవ సపర్యతి । తస్య స్మ ప్రావితా భవ ॥ ౮

౧౧౯. యో అగ్నిం దేవవీతయే హవిష్మాఁ ఆవివాసతి । తస్మై పావక మృళయ ॥ ౯

౧౨౦. స నః పావక దీదివోఽగ్నే దేవాఁ ఇహా వహ । ఉప యజ్ఞం హవిశ్చ నః ॥ ౧౦

౧౨౧. స నః స్తవాన ఆ భర గాయత్రేణ నవీయసా । రయిం వీరవతీమిషమ్ ॥ ౧౧

౧౨౨. అగ్నే శుక్రేణ శోచిషా విశ్వాభిర్దేవహూతిభిః । ఇమం స్తోమం జుషస్వ నః ॥ ౧౨

## (౧౩) త్రయోదశం సూక్తం

ఋషిః - మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - ఇధ్మః సమిద్ధో వాఽగ్నిః; ౨ తనూనపాత్; ౩ నరాశంసః; ౪ ఇళః ; ౫ బర్హిః ; ౬ దేవీర్ద్వారః ; ౭ ఉషాసానక్తా ౮ దైవ్యా హోతారా, ప్రచేతసా ; ౯ తిస్రో దేవ్యః - సరస్వతీళాభారత్యః ౧౦ త్వష్టా ; ౧౧ వనస్పతిః ; ౧౨



స్వాహాకృతయః ॥ ఛన్దః - ౧-౬, ౧౦ గాయత్రీ ; ౭,౮,౧౧ ౧౨ పిపీలికామధ్యా నిచృత్ గాయత్రీ, ౯ నిచృద్ గాయత్రీ ॥ స్వరః - షడ్జః॥

అథ చతుర్వింశో వర్గః ॥ ౨౪ ॥

౧౨౩. సుసమిద్ధో న ఆ వహ దేవాఁ అగ్నే హవిష్మతే । హోతః పావక యక్షి చ ॥ ౧

౧౨౪. మధుమన్తం తనూనపాద్ యజ్ఞం దేవేషు నః కవే । అద్యా కృణుహి వీతయే ॥ ౨

౧౨౫. నరాశంసమిహ ప్రియమస్మిన్ యజ్ఞ ఉప హ్వయే । మధుజిహ్వం హవిష్కృతమ్ ॥ ౩

౧౨౬. అగ్నే సుఖతమే రథే దేవాఁ ఈళిత ఆ వహ । అసి హోతా మనుర్హితః ॥ ౪

౧౨౭. స్తృణీత బర్హిరానుషగ్ ఘృతపృష్ఠం మనీషిణః । యత్రామృతస్య చక్షణమ్ ॥ ౫

౧౨౮. వి శ్రయన్తామృతావృధో ద్వారో దేవీరసశ్చతః । అద్యా నూనం చ యష్టవే ॥ ౬

అథ పఞ్చవింశో వర్గః ॥ ౨౫ ॥

౧౨౯. నక్తోషాసా సుపేశసాస్మిన్ యజ్ఞ ఉప హ్వయే । ఇదం నో బర్హిరాసదే ॥ ౭

౧౩౦. తా సుజిహ్వా ఉప హ్వయే హోతారా దైవ్యా కవీ । యజ్ఞం నో యక్షతామిమమ్ ॥ ౮

౧౩౧. ఇళా సరస్వతీ మహీ తిస్రో దేవీర్మయోభువః । బర్హిః సీదన్త్వస్రిధః ॥ ౯

౧౩౨. ఇహ త్వష్టారమగ్రియం విశ్వరూపముప హ్వయే । అస్మాకమస్తు కేవలః ॥ ౧౦

౧౩౩. అవ సృజా వనస్పతే దేవ దేవేభ్యో హవిః । ప్ర దాతురస్తు చేతనమ్ ॥ ౧౧

౧౩౪. స్వాహా యజ్ఞం కృణోతనేన్ద్రాయ యజ్వనో గృహే । తత్ర దేవాఁ ఉప హ్వయే ॥ ౧౨

## (౧౪) చతుర్దశం సూక్తమ్

ఋషిః మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - విశ్వేదేవాః ॥ ఛన్దః - ౧-౬,౯ గాయత్రీ; ౭,౮ పిపీలికామధ్యానిచృద్ గాయత్రీ; ౧౦,౧౧ విరాడ్ గాయత్రీ ; ౧౨ నిచృద్గాయత్రీ ॥
స్వరః - షడ్జః ॥

అథ షడ్వింశో వర్గః ॥ ౨౬ ॥

౧౩౫. ఐభిరగ్నే దువో గిరో విశ్వేభిః సోమపీతయే । దేవేభిర్యాహి యక్షి చ ॥ ౧

౧౩౬. ఆ త్వా కణ్వా అహూషత గృణంతి విప్ర తే ధియః । దేవేభిరగ్న ఆ గహి ॥ ౨

౧౩౭. ఇంద్రవాయూ బృహస్పతిం మిత్రాగ్నిం పూషణం భగమ్ । ఆదిత్యాన్మారుతం గణమ్ ॥ ౩

౧౩౮. ప్ర వో భ్రియంత ఇందవో మత్సరా మాదయిష్ణవః । ద్రప్సా మధ్వశ్చమూషదః ॥ ౪

౧౩౯. ఈళతే త్వామవస్యవః కణ్వాసో వృక్తబర్హిషః । హవిష్మంతో అరంకృతః ॥ ౫

౧౪౦. ఘృతపృష్ఠా మనోయుజో యే త్వా వహంతి వహ్నయః । ఆ దేవాంత్సోమపీతయే ॥ ౬

అథ సప్తవింశో వర్గః ॥ ౨౭ ॥

౧౪౧. తాన్యజత్రాఀ ఋతావృధోఽగ్నే పత్నీవతస్కృధి । మధ్వః సుజిహ్వ పాయయ ॥ ౭

౧౪౨. యే యజత్రా య ఈడ్యాస్తే తే పిబంతు జిహ్వయా । మధోరగ్నే వషట్కృతి ॥ ౮

౧౪౩. ఆకీం సూర్యస్య రోచనాద్విశ్వాందేవాఀ ఉషర్బుధః । విప్రో హోతేహ వక్షతి ॥ ౯

౧౪౪. విశ్వేభిః సోమ్యం మధ్వగ్న ఇంద్రేణ వాయునా । పిబా మిత్రస్య ధామభిః ॥ ౧౦

౧౪౫. త్వం హోతా మనుర్హితోఽగ్నే యజ్ఞేషు సీదసి । సేమం నో అధ్వరం యజ ॥ ౧

౧౪౬. యుక్ష్వా హ్యరుషీ రథే హరితో దేవ రోహితః । తాభిర్దేవాఀ ఇహా వహ ॥ ౨

## (౧౫) పంచదశం సూక్తమ్

ఋషిః – మేధాతిథిః కాణ్వః ॥ దేవతా – ౧,౫ ఇంద్రః ; ౨ మరుతః ౩ త్వష్టా; ౪ ,౧౨ అగ్నిః, ౬ మిత్రావరుణౌ, ౭-౧౦ ద్రవిణోదాః , ౧౧ అశ్వినౌ ॥ ఛందః – ౧,౧౨ నివృద్గాయత్రీ , ౨,౪ భురిగ్గాయత్రీ , ౩,౫ - ౧౦ గాయత్రీ, ౧౧ పిపీలికామధ్యానివృద్గాయత్రీ ॥ స్వరః – షడ్జః ॥

అథ అష్టావింశో వర్గః ॥ ౨౮ ॥

౧౪౭. ఇంద్ర సోమం పిబ ఋతునా త్వా విశంత్వింధవః । మత్సరాసస్తదోకసః ॥ ౧

౧౪౮. మరుతః పిబత ఋతునా పోత్రాద్యజ్ఞం పునీతన । యూయం హి ష్ఠా సుదానవః ॥ ౨

౧౪౯. అభి యజ్ఞం గృణీహి నో గ్నావో నేష్టః పిబ ఋతునా । త్వం హి రత్నధా అసి ॥ ౩

౧౫౦. అగ్నే దేవాఀ ఇహా వహ సాదయా యోనిషు త్రిషు । పరి భూష పిబ ఋతునా ॥ ౪

౧౫౧. బ్రాహ్మణాదింద్ర రాధసః పిబా సోమమృతూఀరను । తవేద్ధి సఖ్యమస్తృతమ్ ॥ ౫

౧౫౨. యువం దక్షం ధృతవ్రత మిత్రావరుణ దూళభమ్ । ఋతునా యజ్ఞమాశాథే ॥ ౬

అథ ఏకోనత్రింశో వర్గః ॥ ౨౯ ॥

౧౫౩. ద్రవిణోదా ద్రవిణసో గ్రావహస్తాసో అధ్వరే । యజ్ఞేషు దేవమీళతే ॥ ౭

౧౫౪. ద్రవిణోదా దదాతు నో వసూని యాని శృణ్విరే । దేవేషు తా వనామహే ॥ ౮

౧౫౫. ద్రవిణోదాః పిపీషతి జుహోత ప్ర చ తిష్ఠత । నేష్ట్రాదృతుభిరిష్యత ॥ ౯

౧౫౬. యత్త్వా తురీయమృతుభిర్ద్రవిణోదో యజామహే । అధ స్మా నో దదిర్భవ ॥ ౧౦

౧౫౭. అశ్వినా పిబతం మధు దీద్యగ్నీ శుచివ్రతా । ఋతునా యజ్ఞవాహసా ॥ ౧౧

౧౫౮. గార్హపత్యేన సంత్య ఋతునా యజ్ఞనీరసి । దేవాందేవయతే యజ ॥ ౧౨

## (౧౬) షోడశం సూక్తమ్

ఋషిః – మేధాతిథిః కాణ్వః ॥ దేవతా – ఇంద్రః ॥ ఛందః – ౧,౨,౪,౬-౮ గాయత్రీ, ౩,౫ పిపీలికామధ్యానివృద్గాయత్రీ, ౯ విరాడ్గాయత్రీ ॥ స్వరః – షడ్జః ॥

అథ త్రింశో వర్గః ॥ ౩౦ ॥

౧౫౯. ఆ త్వా వహంతు హరయో వృషణం సోమపీతయే । ఇంద్ర త్వా సూరచక్షసః ॥ ౧

౧౬౦. ఇమా ధానా ఘృతస్నువో హరీ ఇహోప వక్షతః । ఇంద్రం సుఖతమే రథే ॥ ౨

౧౬౧. ఇంద్రం ప్రాతర్హవామహ ఇంద్రం ప్రయత్యధ్వరే । ఇంద్రం సోమస్య పీతయే ॥ ౩

౧౬౨. ఉప నః సుతమా గహి హరిభిరింద్ర కేశిభిః । సుతే హి త్వా హవామహే ॥ ౪

౧౬౩. సేమం నః స్తోమమా గహ్యుపేదం సవనం సుతమ్ । గౌరో న తృషితః పిబ ॥ ౫

అథ ఏకత్రింశో వర్గః ॥ ౩౧ ॥

౧౬౪. ఇమే సోమాస ఇందవః సుతాసో అధి బర్హిషి । తాఀ ఇంద్ర సహసే పిబ ॥ ౬

౧౬౫. అయం తే స్తోమో అగ్రియో హృదిస్పృగస్తు శంతమః । అథా సోమం సుతం పిబ ॥ ౭

౧౬౬. విశ్వమిత్సవనం సుతమింద్రో మదాయ గచ్ఛతి । వృత్రహా సోమపీతయే ॥ ౮

౧౬౭. సేమం నః కామమా పృణ గోభిరశ్వైః శతక్రతో । స్తవామ త్వా స్వాధ్యః ॥ ౯

## (౧౭) సప్తదశం సూక్తమ్

ఋషిః- మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - ఇన్ద్రావరుణౌ ॥ ఛందః - ౧,౩,౭,౯ గాయత్రీ, ౨ యవమధ్యావిరాడ్గాయత్రీ, ౪ పాదనిచృద్గాయత్రీ, ౫ భురిగార్షీగాయత్రీ, ౬ నిచృద్గాయత్రీ, ౮ పిపీలికామధ్యానిచృద్గాయత్రీ ॥ స్వరః - షడ్జః ॥

అథ ద్వాత్రింశో వర్గః ॥ ౩౨ ॥

౧౬౮. ఇంద్రావరుణయోరహం సమ్రాజోరవ ఆ వృణే । తా నో మృళాత ఈదృశే ॥ ౧

౧౬౯. గంతారా హి స్థోఽవసే హవం విప్రస్య మావతః । ధర్తారా చర్షణీనామ్ ॥ ౨

౧౭౦. అనుకామం తర్పయేథామింద్రావరుణ రాయ ఆ । తా వాం నేదిష్ఠమీమహే ॥ ౩

౧౭౧. యువాకు హి శచీనాం యువాకు సుమతీనామ్ । భూయామ వాజదావ్నామ్ ॥ ౪

౧౭౨. ఇంద్రః సహస్రదావ్నాం వరుణః శంస్యానామ్ । క్రతుర్భవత్యుక్థ్యః ॥ ౫

అథ త్రయస్త్రింశో వర్గః ॥ ౩౩ ॥

౧౭౩. తయోరిదవసా వయం సనేమ ని చ ధీమహి । స్యాదుత ప్రరేచనమ్ ॥ ౬

౧౭౪. ఇంద్రావరుణ వామహం హువే చిత్రాయ రాధసే । అస్మాంత్సు జిగ్యుషస్కృతమ్ ॥ ౭

౧౭౫. ఇంద్రావరుణ నూ ను వాం సిషాసంతీషు ధీష్వా । అస్మభ్యం శర్మ యచ్ఛతమ్ ॥ ౮

౧౭౬. ప్ర వామశ్నోతు సుష్టుతిరింద్రావరుణ యాం హువే । యామృధాథే సధస్తుతిమ్ ॥ ౯

పంచమోఽనువాకః

## (౧౮) అష్టాదశం సూక్తమ్

ఋషిః- మేధాతిథిః కాణ్వః ॥ దేవతా -౧-౩ బ్రహ్మణస్పతిః, ౪ బ్రహ్మణస్పతిరింద్రశ్చ సోమశ్చ, ౫ బ్రహ్మణస్పతిః సోమేంద్ర దక్షిణాః, ౬-౮ సదసస్పతిః ౯ సదసస్పతిర్నారాశంసో వా ॥ ఛందః- ౧ విరాడ్గాయత్రీ, ౨,౭,౯ గాయత్రీ ౩,౬,౮ పిపీలికామధ్యానిచృద్గాయత్రీ, ౪ నిచృద్గాయత్రీ, ౫ పాదనిచృద్గాయత్రీ, స్వరః - షడ్జః

అథ చతుస్త్రింశో వర్గః ॥ ౩౪ ॥

౧౭౭. సోమానం స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే । కక్షీవంతం య ఔశిజః ॥ ౧

౧౭౮. యో రేవాన్యో అమీవహా వసువిత్పుష్టివర్ధనః । స నః సిషక్తు యస్తురః ॥ ౨

౧౭౯. మా నః శంసో అరరుషో ధూర్తిః ప్రణఙ్మర్త్యస్య । రక్షా ణో బ్రహ్మణస్పతే ॥ ౩

౧౮౦. స ఘా వీరో న రిష్యతి యమింద్రో బ్రహ్మణస్పతిః । సోమో హినోతి మర్త్యమ్ ॥ ౪

౧౮౧. త్వం తం బ్రహ్మణస్పతే సోమ ఇంద్రశ్చ మర్త్యమ్ । దక్షిణా పాత్వంహసః ॥ ౫

అథ పంచత్రింశో వర్గః ॥ ౩౫ ॥

౧౮౨. సదసస్పతిమద్భుతం ప్రియమింద్రస్య కామ్యమ్ । సనిం మేధామయాసిషమ్ ॥ ౬

౧౮౩. యస్మాదృతే న సిధ్యతి యజ్ఞో విపశ్చితశ్చన । స ధీనాం యోగమిన్వతి ॥ ౭

౧౮౪. ఆదృధ్నోతి హవిష్కృతిం ప్రాంచం కృణోత్యధ్వరమ్ । హోత్రా దేవేషు గచ్ఛతి ॥ ౮

౧౮౫. నరాశంసం సుధృష్టమమపశ్యం సప్రథస్తమమ్ । దివో న సద్మమఖసమ్ ॥ ౯

## (౧౯) ఏకోనవింశం సూక్తమ్

ఋషిః - మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - అగ్నిర్మరుతశ్చ ॥ ఛన్దః - ౧,౩-౮ గాయత్రీ, ౨ నిచృద్గాయత్రీ, ౯ పిపీలికామధ్యానిచృద్గాయత్రీ ॥ స్వరః - షడ్జః ॥

అథ షట్త్రింశో వర్గః ॥౩౬॥

౧౮౬. ప్రతి త్యం చారుమధ్వరం గోపీథాయ ప్ర హూయసే। మరుద్భిరగ్న ఆ గహి॥ ౧

౧౮౭. నహి దేవో న మర్త్యో మహస్తవ క్రతుం పరః। మరుద్భిరగ్న ఆ గహి॥ ౨

౧౮౮. యే మహో రజసో విదుర్విశ్వే దేవాసో అద్రుహః। మరుద్భిరగ్న ఆ గహి॥ ౩

౧౮౯. య ఉగ్రా అర్కమానృచురనాధృష్టాస ఓజసా। మరుద్భిరగ్న ఆ గహి॥ ౪

౧౯౦. యే శుభ్రా ఘోరవర్పసః సుక్షత్రాసో రిశాదసః। మరుద్భిరగ్న ఆ గహి॥ ౫

అథ సప్తత్రింశో వర్గః ॥౩౭॥

౧౯౧. యే నాకస్యాధి రోచనే దివి దేవాస ఆసతే। మరుద్భిరగ్న ఆ గహి॥ ౬

౧౯౨. య ఈఙ్ఖయన్తి పర్వతాన్ తిరః సముద్రమర్ణవమ్। మరుద్భిరగ్న ఆ గహి॥ ౭

౧౯౩. ఆ యే తన్వన్తి రశ్మిభిస్తిరః సముద్రమోజసా। మరుద్భిరగ్న ఆ గహి॥ ౮

౧౯౪. అభి త్వా పూర్వపీతయే సృజామి సోమ్యం మధు। మరుద్భిరగ్న ఆ గహి॥ ౯

# ప్రథమాష్టకే - ద్వితీయోఽధ్యాయః

## (౨౦) వింశం సూక్తమ్

ఋషిః - మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - ఋభవః ॥ ఛన్దః - ౧,౨,౬,౭ గాయత్రీ, ౩ విరాడ్గాయత్రీ, ౪ నిచృద్గాయత్రీ ౫,౮ పిపీలికామధ్యానిచృద్గాయత్రీ ॥ స్వరః - షడ్జః ॥

అథ ప్రథమో వర్గః ॥ ౧ ॥

౧౯౫. అయం దేవాయ జన్మనే స్తోమో విప్రేభిరాసయా। అకారి రత్నధాతమః॥ ౧

౧౯౬. య ఇన్ద్రాయ వచోయుజా తతక్షుర్మనసా హరీ। శమీభిర్యజ్ఞమాశత॥ ౨

౧౯౭. తక్షన్నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథమ్। తక్షన్ధేనుం సబర్దుఘామ్॥ ౩

౧౯౮. యువానా పితరా పునః సత్యమన్త్రా ఋజూయవః। ఋభవో విష్ట్యక్రత॥ ౪

౧౯౯. సం వో మదాసో అగ్మతేన్ద్రేణ చ మరుత్వతా। ఆదిత్యేభిశ్చ రాజభిః॥ ౫

అథ ద్వితీయో వర్గః ॥౨॥

౨౦౦. ఉత త్యం చమసం నవం త్వష్టుర్దేవస్య నిష్కృతమ్। అకర్త చతురః పునః॥ ౬

౨౦౧. తే నో రత్నాని ధత్తన త్రిరా సాప్తాని సున్వతే। ఏకమేకం సుశస్తిభిః॥ ౭

౨౦౨. అధారయన్త వహ్నయోఽభజన్త సుకృత్యయా। భాగం దేవేషు యజ్ఞియమ్॥ ౮

## (౨౧) ఏకవింశం సూక్తమ్

ఋషిః మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - ఇన్ద్రాగ్నీ ॥ ఛన్దః ౧,౩,౪,౬, గాయత్రీ ౨ పిపీలికామధ్యానిచృద్గాయత్రీ , ౫ నిచృద్గాయత్రీ ॥ స్వరః - షడ్జః

అథ తృతీయో వర్గః ॥ ౩॥

౨౦౩ ఇహేన్ద్రాగ్నీ ఉప హ్వయే తయోరిత్స్తోమముశ్మసి। తా సోమం సోమపాతమా॥ ౧

౨౦౪ తా యజ్ఞేషు ప్ర శంసతేన్ద్రాగ్నీ శుమ్భతా నరః। తా గాయత్రేషు గాయత॥ ౨

౨౦౫ తా మిత్రస్య ప్రశస్తయ ఇన్ద్రాగ్నీ తా హవామహే। సోమపా సోమపీతయే॥ ౩

౨౦౬ ఉగ్రా సన్తా హవామహ ఉపేదం సవనం సుతమ్। ఇన్ద్రాగ్నీ ఏహ గచ్ఛతామ్॥ ౪

౨౦౭ తా మహాన్తా సదస్పతీ ఇన్ద్రాగ్నీ రక్ష ఉబ్జతమ్। అప్రజాః సన్త్వత్రిణః॥ ౫

౨౦౮ తేన సత్యేన జాగృతమధి ప్రచేతునే పదే। ఇన్ద్రాగ్నీ శర్మ యచ్ఛతమ్॥ ౬

## (౨౨) ద్వావింశం సూక్తమ్

ఋషిః మేధాతిథిః కాణ్వః ॥ దేవతా - ౧ - ౪ అశ్వినౌ, ౫-౮ సవితా, ౯,౧౦ అగ్నిః, ౧౧ దేవ్యః, ౧౨ ఇన్ద్రాణీ వరుణాన్యగ్నాయ్యః, ౧౩,౧౪ ద్యావాపృథివ్యౌ, ౧౫ పృథివీ, ౧౬ విష్ణుర్దేవో వా, ౧౭-౨౧ విష్ణుః ॥ ఛన్దః - ౧-౩,౭.౧౨,౧౭,౧౮ పిపీలికామధ్యానిచృద్

గాయత్రీ, ౪,౫,౭,౯- ౧౧,౧౩,౧౪,౧౬,౨౦,౨౧ గాయత్రీ, ౬,౧౯ నిచృద్గాయత్రీ,
౧౫ విరాడ్ గాయత్రీ,॥ స్వరః॥ షడ్జః॥

అథ చతుర్థో వర్గః ॥ ౪ ॥

౨౦౯ ప్రాతర్యుజా వి బోధయాశ్వినావేహ గచ్ఛతామ్ । అస్య సోమస్య పీతయే ॥ ౧

౨౧౦ యా సురథా రథీతమోభా దేవా దివిస్పృశా । అశ్వినా తా హవామహే ॥ ౨

౨౧౧ యా వాం కశా మధుమత్యశ్వినా సూనృతావతీ । తయా యజ్ఞం మిమిక్షతమ్ ॥ ౩

౨౧౨ నహి వామస్తి దూరకే యత్రా రథేన గచ్ఛథః । అశ్వినా సోమినో గృహమ్ ॥ ౪

౨౧౩ హిరణ్యపాణిమూతయే సవితారముప హ్వయే । స చేత్తా దేవతా పదమ్ ॥ ౫

అథ పఞ్చమో వర్గః ॥ ౫ ॥

౨౧౪ అపాం నపాతమవసే సవితారముప స్తుహి । తస్య వ్రతాన్యుశ్మసి ॥ ౬

౨౧౫ విభక్తారం హవామహే వసోశ్చిత్రస్య రాధసః । సవితారం నృచక్షసమ్ ॥ ౭

౨౧౬ సఖాయ ఆ ని షీదత సవితా స్తోమ్యో ను నః । దాతా రాధాంసి శుమ్భతి ॥ ౮

౨౧౭ అగ్నే పత్నీరిహా వహ దేవానాముశతీరుప । త్వష్టారం సోమపీతయే ॥ ౯

౨౧౮ ఆ గ్నా అగ్న ఇహావసే హోత్రాం యవిష్ఠ భారతీమ్ । వరూత్రీం ధిషణాం వహ ॥ ౧౦

అథ షష్ఠో వర్గః ॥ ౬ ॥

౨౧౯ అభి నో దేవీరవసా మహః శర్మణా నృపత్నీః । అచ్ఛిన్నపత్రాః సచన్తామ్ ॥ ౧౧

౨౨౦ ఇహేన్ద్రాణీముప హ్వయే వరుణానీం స్వస్తయే । అగ్నాయీం సోమపీతయే ॥ ౧౨

౨౨౧ మహీ ద్యౌః పృథివీ చ న ఇమం యజ్ఞం మిమిక్షతామ్ । పిపృతాం నో భరీమభిః ॥ ౧౩

౨౨౨ తయోరిద్ఘృతవత్పయో విప్రా రిహన్తి ధీతిభిః । గన్ధర్వస్య ధ్రువే పదే ॥ ౧౪

౨౨౩ స్యోనా పృథివి భవానృక్షరా నివేశనీ । యచ్ఛా నః శర్మ సప్రథః ॥ ౧౫

అథ సప్తమో వర్గః ॥ ౭ ॥

౨౨౪ అతో దేవా అవన్తు నో యతో విష్ణుర్విచక్రమే । పృథివ్యాః సప్త ధామభిః ॥ ౧౬

౨౨౫ ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధా ని దధే పదమ్ । సమూఢమస్య పాంసురే ॥ ౧౭

౨౨౬ త్రీణి పదా వి చక్రమే విష్ణుర్గోపా అదాభ్యః । అతో ధర్మాణి ధారయన్ ॥ ౧౮

౨౨౭ విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే । ఇన్ద్రస్య యుజ్యః సఖా ॥ ౧౯

౨౨౮ తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః । దివీవ చక్షురాతతమ్ ॥ ౨౦

౨౨౯ తద్విప్రాసో విపన్యవో జాగృవాంసః సమిన్ధతే । విష్ణోర్యత్పరమం పదమ్ ॥ ౨౧

## (౨౩) త్రయోవింశం సూక్తమ్

ఋషిః మేధాతిథిః కాణ్వః॥ దేవతా - ౧ వాయుః, ౨,౩ ఇన్ద్రవాయూ, ౪ - ౬ మిత్రావరుణౌ, ౭-౯ ఇన్ద్రో మరుత్వాన్, ౧౦-౧౨ విశ్వేదేవాః, ౧౩-౧౫ పూషా, ౧౬ - ౨౨ ఆపః, ౨౩,౨౪ అగ్నిః॥ ఛన్దః-౧-౧౮ గాయత్రీ, ౧౯ పురఉష్ణిక్, ౨౦ అనుష్టుప్, ౨౧ ప్రతిష్ఠాగాయత్రీ, ౨౨-౨౪ అనుష్టుప్ ॥ స్వరః - ౧-౧౮,౨౧ షడ్జః, ౧౯ ఋషభః, ౨౦,౨౨-౨౪ గాన్ధారః॥

అథ అష్టమో వర్గః ॥ ౮ ॥

౨౩౦ తీవ్రాః సోమాస ఆ గహ్యాశీర్వన్తః సుతా ఇమే । వాయో తాన్ప్రస్థితాన్పిబ ॥ ౧

౨౩౧ ఉభా దేవా దివిస్పృశేన్ద్రవాయూ హవామహే । అస్య సోమస్య పీతయే ॥ ౨

౨౩౨ ఇన్ద్రవాయూ మనోజువా విప్రా హవన్త ఊతయే । సహస్రాక్షా ధియస్పతీ ॥ ౩

౨౩౩ మిత్రం వయం హవామహే వరుణం సోమపీతయే । జజ్ఞానా పూతదక్షసా ॥ ౪

౨౩౪ ఋతేన యావృతావృధావృతస్య జ్యోతిషస్పతీ । తా మిత్రావరుణా హువే ॥ ౫

అథ నవమో వర్గః ॥౯॥

౨౩౫ వరుణః ప్రావితా భువన్మిత్రో విశ్వాభిరూతిభిః । కరతాం నః సురాధసః ॥ ౬

౨౩౬ మరుత్వంతం హవామహ ఇంద్రమా సోమపీతయే । సజూర్గణేన తృంపతు ॥ ౭

౨౩౭ ఇంద్రజ్యేష్ఠా మరుద్గణా దేవాసః పూషరాతయః । విశ్వే మమ శ్రుతా హవమ్ ॥ ౮

౨౩౮ హత వృత్రం సుదానవ ఇంద్రేణ సహసా యుజా । మా నో దుఃశంస ఈశత ॥ ౯

౨౩౯ విశ్వాన్దేవాన్హవామహే మరుతః సోమపీతయే । ఉగ్రా హి పృశ్నిమాతరః ॥౧౦

అథ దశమో వర్గః ॥ ౧౦॥

౨౪౦ జయతామివ తన్యతుర్మరుతామేతి ధృష్ణుయా । యచ్ఛుభం యాథనా నరః ॥ ౧౧

౨౪౧ హస్కారాద్విద్యుతస్పర్యతో జాతా అవంతు నః । మరుతో మృళయంతు నః ॥౧౨

౨౪౨ ఆ పూషంచిత్రబర్హిషమాఘృణే ధరుణం దివః । ఆజా నష్టం యథా పశుమ్॥౧౩

౨౪౩ పూషా రాజానమాఘృణిరపగూళ్హం గుహా హితమ్ । అవిందచ్చిత్రబర్హిషమ్ ॥ ౧౪

౨౪౪ ఉతో స మహ్యమిందుభిః షడ్యుక్తాఀ అనుసేషిధత్ । గోభిర్యవం న చర్కృషత్॥ ౧౫

అథ ఏకాదశో వర్గః ॥ ౧౧॥

౨౪౫ అంబయో యంత్యధ్వభిర్జామయో అధ్వరీయతామ్ । పృంచతీర్మధునా పయః॥౧౬

౨౪౬ అమూర్యా ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ । తా నో హిన్వంత్వధ్వరమ్॥౧౭

౨౪౭ అపో దేవీరుప హ్వయే యత్ర గావః పిబంతి నః । సింధుభ్యః కర్త్వం హవిః ॥ ౧౮

౨౪౮ అప్స్వంతరమృతమప్సు భేషజమపాముత ప్రశస్తయే । దేవా భవత వాజినః ॥౧౯

౨౪౯ అప్సు మే సోమో అబ్రవీదంతర్విశ్వాని భేషజా । అగ్నిం చ విశ్వశంభువమాపశ్చ విశ్వభేషజీః॥౨౦

అథ ద్వాదశో వర్గః ॥ ౧౨॥

౨౫౦ ఆపః పృణీత భేషజం వరూథం తన్వే౩ మమ । జ్యోక్చ సూర్యం దృశే ॥ ౨౧

౨౫౧ ఇదమాపః ప్ర వహత యత్కిం చ దురితం మయి ।
యద్వాహమభిదుద్రోహ యద్వా శేప ఉతానృతమ్ ॥ ౨౨

౨౫౨ ఆపో అద్యాన్వచారిషం రసేన సమగస్మహి ।
పయస్వానగ్న ఆ గహి తం మా సం సృజ వర్చసా ॥ ౨౩

౨౫౩ సం మాగ్నే వర్చసా సృజ సం ప్రజయా సమాయుషా ।
విద్యుర్మే అస్య దేవా ఇంద్రో విద్యాత్సహ ఋషిభిః ॥ ౨౪

## షష్ఠోఽనువాకః (౨౪) చతుర్వింశం సూక్తమ్

ఋషిః- శునఃశేప ఆజీగర్తిః కృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః దేవతా- ౧ ప్రజాపతిః, ౨ అగ్నిః, ౩-౫ సవితా భగో వా, ౬-౧౫ వరుణః ॥ ఛందః- ౧,౨,౬-౧౫ త్రిష్టుప్, ౩-౫ గాయత్రీ॥ స్వరః- ౧,౨,౬-౧౫ ధైవతః, ౩-౫ షడ్జః॥

అథ త్రయోదశో వర్గః ॥౧౩॥

౨౫౪ కస్య నూనం కతమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ ।
కో నో మహ్యా అదితయే పునర్దాత్పితరం చ దృశేయం మాతరం చ ॥ ౧

౨౫౫ అగ్నేర్వయం ప్రథమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ ।
స నో మహ్యా అదితయే పునర్దాత్పితరం చ దృశేయం మాతరం చ ॥ ౨

౨౫౬ అభి త్వా దేవ సవితరీశానం వార్యాణామ్ । సదావన్భాగమీమహే ॥ ౩

౨౫౭ యశ్చిద్ధి త ఇత్థా భగః శశమానః పురా నిదః । అద్వేషో హస్తయోర్దధే ॥ ౪

౨౫౮ భగభక్తస్య తే వయముదశేమ తవావసా । మూర్ధానం రాయ ఆరభే ॥ ౫

అథ చతుర్దశో వర్గః ॥ ౧౪॥

౨౫౯ నహి తే క్షత్రం న సహో న మన్యుం వయశ్చనామీ పతయన్త ఆపుః ।
నేమా ఆపో అనిమిషం చరన్తీర్న యే వాతస్య ప్రమినన్త్యభ్వమ్ ॥ ౬

౨౬౦ అబుధ్నే రాజా వరుణో వనస్యోర్ధ్వం స్తూపం దదతే పూతదక్షః ।
నీచీనాః స్థురుపరి బుధ్న ఏషామస్మే అన్తర్నిహితాః కేతవః స్యుః ॥ ౭

౨౬౧ ఉరుం హి రాజా వరుణశ్చకార సూర్యాయ పన్థామన్వేతవా ఉ ।
అపదే పాదా ప్రతిధాతవేఽకరుతాపవక్తా హృదయావిధశ్చిత్ ॥ ౮

౨౬౨ శతం తే రాజన్ భిషజః సహస్రముర్వీ గభీరా సుమతిష్టే అస్తు ।
బాధస్వ దూరే నిరృతిం పరాచైః కృతం చిదేనః ప్ర ముముగ్ధ్యస్మత్ ॥ ౯

౨౬౩ అమీ య ఋక్షా నిహితాస ఉచ్చా నక్తం దదృశ్రే కుహ చిద్దివేయుః ।
అదబ్ధాని వరుణస్య వ్రతాని విచాకశచ్చన్ద్రమా నక్తమేతి ॥ ౧౦

అథ పఞ్చదశో వర్గః ॥ ౧౫ ॥

౨౬౪ తత్త్వా యామి బ్రహ్మణా వన్దమానస్తదా శాస్తే యజమానో హవిర్భిః ।
అహేళమానో వరుణేహ బోధ్యురుశంస మా న ఆయుః ప్ర మోషీః ॥ ౧౧

౨౬౫ తదిన్నక్తం తద్దివా మహ్యమాహుస్తదయం కేతో హృద ఆ వి చష్టే ।
శునఃశేపో యమహ్వద్గృభీతః సో అస్మాన్రాజా వరుణో ముమోక్తు ॥ ౧౨

౨౬౬ శునఃశేపో హ్యహ్వద్గృభీతస్త్రిష్వాదిత్యం ద్రుపదేషు బద్ధః ।
అవైనం రాజా వరుణః ససృజ్యాద్విద్వాఁ అదబ్ధో వి ముమోక్తు పాశాన్ ॥ ౧౩

౨౬౭ అవ తే హేళో వరుణ నమోభిరవ యజ్ఞేభిరీమహే హవిర్భిః ।
క్షయన్నస్మభ్యమసుర ప్రచేతా రాజన్నేనాంసి శిశ్రథః కృతాని ॥ ౧౪

౨౬౮ ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం వి మధ్యమం శ్రథాయ ।
అథా వయమాదిత్య వ్రతే తవానాగసో అదితయే స్యామ ॥ ౧౫

## (౨౫) పఞ్చవింశం సూక్తమ్

ఋషిః- శునఃశేప ఆజీగర్తిః ॥ దేవతా - వరుణః ॥ ఛన్దః- గాయత్రీ ॥ స్వరః- షడ్జః ॥

అథ షోడశో వర్గః ॥ ౧౬ ॥

౨౬౯ యచ్చిద్ధి తే విశో యథా ప్ర దేవ వరుణ వ్రతమ్ । మినీమసి ద్యవిద్యవి ॥ ౧

౨౭౦ మా నో వధాయ హత్నవే జిహీళానస్య రీరధః । మా హృణానస్య మన్యవే ॥ ౨

౨౭౧ వి మృళీకాయ తే మనో రథీరశ్వం న సన్దితమ్ । గీర్భిర్వరుణ సీమహి ॥ ౩

౨౭౨ పరా హి మే విమన్యవః పతన్తి వస్యఇష్టయే । వయో న వసతీరుప ॥ ౪

౨౭౩ కదా క్షత్రశ్రియం నరమా వరుణం కరామహే । మృళీకాయోరుచక్షసమ్ ॥ ౫

అథ సప్తదశో వర్గః ॥ ౧౭ ॥

౨౭౪ తదిత్సమానమాశాతే వేనన్తా న ప్ర యుచ్ఛతః । ధృతవ్రతాయ దాశుషే ॥ ౬

౨౭౫ వేదా యో వీనాం పదమన్తరిక్షేణ పతతామ్ । వేద నావః సముద్రియః ॥ ౭

౨౭౬ వేద మాసో ధృతవ్రతో ద్వాదశ ప్రజావతః । వేదా య ఉపజాయతే ॥ ౮

౨౭౭ వేద వాతస్య వర్తనిమురోరృష్వస్య బృహతః । వేదా యే అధ్యాసతే ॥ ౯

౨౭౮ ని షసాద ధృతవ్రతో వరుణః పస్త్యాస్వా । సామ్రాజ్యాయ సుక్రతుః ॥ ౧౦

అథ అష్టాదశో వర్గః ॥ ౧౮ ॥

౨౭౯ అతో విశ్వాన్యద్భుతా చికిత్వాఁ అభి పశ్యతి । కృతాని యా చ కర్త్వా ॥ ౧౧

౨౮౦ స నో విశ్వాహా సుక్రతురాదిత్యః సుపథా కరత్ । ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥ ౧౨

కండికలే మంత్రములు. ఈ సంహితలోని మొదటి అధ్యాయమునకు ప్రజాపతియు, అంతిమాధ్యాయమునకు దంధ్య అథర్వణుడును ఋషులుగా చెప్పబడిరి. సంహితలో చేర్చుకున్నను 100 అధ్యాయములు గల శతపథబ్రాహ్మణము ఈ సంహితకే సంబంధించును. కాణ్వసంహితలో ఈ సంహితలో కన్న 111 కండికలు ( మంత్రములు) హెచ్చు. ఆ సంహితలో కూడ ఖిల్య శుక్రీయ మంత్రములు కలసియే యున్నవి. కాణ్వులొకప్పుడు ఉత్తరప్రదేశములో నుండినట్లు సాహిత్యకాధారములు సాక్ష్యమిచ్చును. నేడు దక్షిణదేశములో స్వల్పముగా నున్నట్లు వినికిడి. సాయణాచార్యుడు కాణ్వసంహితకు భాష్యము వ్రాసెను. వాజసనేయమునకు ఉవ్వట మహీధరాదుల భాష్యములు దొరుకుచున్నవి. గత శతాబ్దంలో మహర్షి దయానంద సరస్వతీ స్వామి యజుర్వేదమునకు సంపూర్ణ భాష్యమును వ్రాసెను. ప్రస్తుతము ఈ భాష్యమే ప్రామాణికమైనదని పండితుల అభిప్రాయము.

వాజసనేయసంహితలో అనేక యజ్ఞములు వివరింపబడినవి. దర్శపూర్ణ మాసేష్టులు, అగ్నిహోత్రము, చాతుర్మాస్యము మున్నగునవి మొదట వర్ణింపబడినవి. ఇవి హవిర్యాగములు. ఆ మీద అగ్నిష్టోమాది సోమ యాగములు వర్ణింపబడినవి. సోమయాగములో సోమలతను దెచ్చి, విధ్యుక్తముగా నూరి రసము గ్రహించి, దానిలో పాలు మున్నగునవి కలిపి, ప్రాతర్మధ్యాహ్న సాయం సవనములు జరుపుదురు. ఒకే దినములో పూర్తియగు యజ్ఞమునకు ఏకాహ మని పేరు. ఇట్లే సవనము, సత్రము మున్నగునవి ఆ యా యజ్ఞనిర్ణీతకాలమును బట్టి కొన్ని దినములు మొదలు సంవత్సరము, లేదా ఇంకను ఎక్కువ కాలము వరకు జరుగువట్టి యాగములు. జ్యోతిష్టోమము, వాజపేయము మున్నగునవి మిక్కిలి శ్రేష్ఠమైన యజ్ఞములు. రాజ్యాభిషేకము, రాజసూయము మున్నగునవి కూడ ఈ సంహితలో వర్ణింపబడినవి. రాజసూయములో అక్షక్రీడవంటి ప్రసంగములు కొన్నియుండును. అగ్నిచయన మను యాగములో 10,000 ఇటికలు పేర్చి గరుడాకృతిగా వేదిని నిర్మింతురు. దీనికి ఆధ్యాత్మికార్థముకూడ వివరింపబడినది. శతరుద్రీయము రుద్రయాగమునకు సంబంధించును. ఏకోద్దిష్ట సౌత్రామణ్యాది యజ్ఞములు కూడ ఈ సంహితలో వివరింపబడినవి. సౌత్రామణిలో సురాప్రయోగము కూడ జరుగును. పురుషమేధాదులు ఖిల్యాధ్యాయములలో చెప్పబడినవి. పురుషమేధములో 186 వరకు ఆలంభనము లుండును. కాని ఇవన్నియు ప్రతీకాత్మకములు. 'నృత్తాయ సూతంగీతాయ శైలూషం' మున్నగు వాక్యములలో చెప్పబడిన ఆలంభనములు ఆనాటి వృత్తులను, కళలను వివరించును. పురుషసూక్తములో ఈ సంహిత మరికొన్ని మంత్రములు అధికముగా చూపును. సర్వమేధము, అశ్వమేధము మున్నగు యజ్ఞములు చక్రవర్తులు నిర్వహింపదగినవిగాను, రాష్ట్రీయతా భావనిర్మాణ క్షమములైనవిగాను ఈ సంహితలో వర్ణింపబడినవి. ఇందలి 34వ అధ్యాయమునకు శివసంకల్పోపనిషత్తని పేరు. 35 నుండి 39 వరకు గల అధ్యాయములు పితృమేధాదిపాకయజ్ఞ ములకు సంబంధించినవి. అంతిమాధ్యాయమున ప్రసిద్ధమైన ఈశావాస్యోపనిషత్తు వినిపించును. సంహితలో చోటుచేసికొనిన ఉపనిషత్తు ఇది ఒక్కటియే. సమస్త ఉపనిషద్విజ్ఞానమునకు మూలమనదగిన ఇందలి మొదటి రెండు శ్లోకములు (మంత్రములు) గాంధీమహాత్మునికి మిక్కిలి ప్రియమైన నిత్యానుసంధాన శ్లోకములు. భగవద్గీతకువలె ఈ శ్లోకములకు కూడ నేడు మిక్కిలి ప్రచారమబ్బినది. ఇట్టి ఉపనిషత్తుతో బ్రహ్మప్రాప్తియే పరమలక్ష్యమని సూచించుచు ఈ సంహిత ముగియును. కాణ్వసంహితలో కూడ ఇంచుమించుగా ఇదే విషయములు వర్ణింపబడినవి. పాంచరాత్రాగమములకు కాణ్వసంహితతో సన్నిహిత సంబంధ మున్నట్లు చెప్పుదురు.

## కృష్ణయజుస్సంహిత

కృష్ణయజుర్వేదమునకు చెప్పిన శాఖలలో నేడు మనకు తైత్తిరీయ, మైత్రాయణీ, కఠశాఖలకు సంబంధించినంతవరకు సంపూర్ణసంహితలు లభించుచున్నవి. కపిష్ఠల - కఠశాఖకు చెందిన సంహిత అసంపూర్ణముగా దొరకుచున్నది. వీనిలో తైత్తిరీయశాఖ మిక్కిలి ప్రసిద్ధము. తిత్తిరిచే ప్రచారమునకు తేబడినశాఖ యగుటచే నిది తైత్తిరీయమని పిల్వబడెనని చెప్పుదురు. ఇది సమగ్రమైన వేదశాఖ. అనగా దీనికి సంబంధించినంతవరకు సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకము, ఉపనిషత్తు, శ్రౌతసూత్రములు, గృహ్యసూత్రములు మున్నగు సాహిత్యమంతయు లభించుచున్నది.

తైత్తిరీయసంహిత ఏడు కాండలుగా విభజింపబడినది. ఇవి తిరిగి ౬౫౧ అనువాకములుగను, ౨౧౯౮ కండికలుగను విభజింపబడినవి. ఇది సాయణునిశాఖ. ఈ సంహితకే అతడు తొలుదొల్త భాష్యము వ్రాసెను. అధియజ్ఞమేకాక, అధ్యాత్మ, అధిదైవపరములైన అర్థములుకూడ అతని భాష్యములో ఆ యా సందర్భముల ననుసరించి వ్రాయబడినవి. తైత్తిరీయసంహితకు శాకల్యుడు క్రమపాఠము వ్రాసెను. గాంగ్యుడు పదపాఠము చేర్చెను. కొందరీ పదపాఠమును ఆత్రేయ విరచితమని చెప్పుదురు. ఈ శాఖానుయాయులలో పెక్కువంది ఆపస్తంబసూత్రులు. ఈ సంహితలో మంత్ర బ్రాహ్మణములు కలసియుండును. కృష్ణయజుస్సంహిత లన్నిటికిని ఈ ధర్మము సమానము

తైత్తిరీయసంహితలో కూడ ఎన్నో యజ్ఞములు చెప్పబడినవి. పౌరాడాశము, యాజమానము, వాజపేయము, రాజసూయము మున్నగునవి దీనిలో విస్తరించి వర్ణింపబడినవి. వాజసనేయసంహితలో వలె దీనియందును పిపీలికా వర్ణనమున్నది. ఒకచోట దీర్ఘరాత్రుల ప్రసంగము గోచరించును. సుదాసుని వృత్తాంతము, పాంచాల కౌంతేయాదుల ప్రశంసలు, వరాహోద్ధార వర్ణనము, కాలకంజాసురుని కథ, చండామార్కులచర్చ మున్నగు పౌరాణికప్రసంగము లిన్నియూ ఈ సంహితలో వినిపించును. అశ్వమేధమువంటి యాగములు కొన్ని దీర్ఘకాలికములు. అట్టి యాగములలో రాత్రులందు ఇతిహాసపురాణములు పఠించుట విధి. ఇట్టి కథాసముదాయమునకు పారిప్లవ మని పేరు. ఇవి ఋత్విగ్గణమును, యజమానుని అలసట ప్రమాదమునుండి కాపాడి, యజ్ఞానుష్ఠానము నందుత్సాహులుగా నుంచును.

కృష్ణయజుర్వేదమునకు చెందిన వేరొక శాఖ మైత్రాయణీ శాఖ. దీనికి 'కలాపశాఖ' అని నామాంతరమున్నది. దీని ఉపశాఖలలో మను, వరాహశాఖలు ప్రసిద్ధములు. మనుస్మృతి, వరాహకల్పసూత్రము అనునవి వీనికి సంబంధించిన గ్రంథములు. మైత్రాయణీ సంహిత మంత్రబ్రాహ్మణాత్మకమై ౪ కాండలు, ౫౪ ప్రపాఠకములు, ౬౩౪ అనువాకములు కలిగి, ౨౧౪౪ మంత్రములతో నున్నది. దీనిలో ౧౭౦౧ వరకు ఋగ్వేదమంత్రములే తిరిగి వినిపించును. ఈ సంహితలోని ఖిలభాగములో మొదట చెప్పిన యాగములే మరి కొంత విపస్తరించి వర్ణింపబడినవి.

కృష్ణయజుర్వేదీయ కాఠకశాఖ పూర్వమొకప్పుడు మాధ్యదేశమున మిక్కిలి ప్రచారములో నుండినట్లు 'గ్రామే గ్రామే కాఠకం కాలాపకం చ ప్రోచ్యతే' అను పతంజలివాక్యము సాక్ష్యమిచ్చుచున్నది. కఠసంహితలో ఇఠమిక, మాధ్యమిక, ఓరమిక, యాజ్యానువాక్య, అశ్వమేధాద్యనువచనకాండ అని అయిదు ఖండములున్నవి. ఈ ఖండములలోని అవాంతరభాగములకు స్థానకములని పేరు. అవి తిరిగి అనువచన, అనువాక, మంత్ర భాగములుగా విభజింపబడినవి. ఈ సంహితలో కూడ పురోడాశ, అధ్వర, పశుబంధ, వాజపేయ, రాజసూయాదులతోపాటు సావిత్రి, పంచచూడ, స్వర్గదీక్ష, ఆయుష్యపాత్ర, ప్రాయశ్చిత్త, సవ, సౌత్రామణ్యాదులెన్నో యజ్ఞయాగములు వివరింపబడినవి. దీనిలో పురోడాశ బ్రాహ్మణము, యజమాన బ్రాహ్మణము మున్నగు బ్రాహ్మణ భాగములు గోచరించును.

చరణవ్యూహము ననుసరించి చరకశాఖలో ప్రాచ్యకఠులును, కపిష్ఠల కఠులును అంతర్గతులని భావింపబడుదురు. పాణిని కపిష్ఠలుడను ఋషిని పేర్కొనెను. నిరుక్తవ్యాకర్త దుర్గాచార్యుడు తాను కపిష్ఠలవాసిష్ఠుడని చెప్పుకొనెను. కురుక్షేత్రప్రాంతమున కపిష్ఠలమను గ్రామముండినట్లు బృహత్సంహితాదుల వలన తెలియుచున్నది. బహుశః ఈ శాఖీయులా ప్రాంతమునకు చెందినవారు కావచ్చును. ఏది ఎట్లున్నను ఈ కపిష్ఠలకఠశాఖకు చెందిన సంహిత ప్రతి ఒకే ఒకటి మిక్కిలి అసంపూర్ణముగా నేడు దొరుకుచున్నది కాఠకసంహితతో దీనికి చాల భేదము కనిపించుచున్నది. దీనిలోని స్వరాంకన పద్ధతి కూడ ఋగ్వేదస్వరాంకనపద్ధతిని పోలి కాన్పించును.

కృష్ణయజుస్సంహిత లన్నియు ఇంచుమించుగా ఒకే విషయమును వివరించును. క్రమము మాత్రము భిన్నముగా నుండును. ఋగ్వేదమునకువలె యజుర్వేదమునకు వివరణ గ్రంథము లంతగా లేవు. ఆ కారణమున, యజుస్సూక్తములకు ఋష్యాదులు సరిగా తెలియవు.

సూత్ర గ్రంథములలో నప్పటప్పట కొందరు కాండర్షులు పేర్కొనబడిరి. అట్టివారిలో ప్రాజాపత్య, సౌమ్య, ఆగ్నేయ, వైశ్వదేవ, స్వాయంభువాదులు కొందరు ప్రసిద్ధులు. అట్లే సాంహితీ, వారుణీ, యాజ్ఞికీ మున్నగు దేవతలుకూడ క్వాచిత్కముగా చెప్పబడిరి. యజుర్వేదములో దేవతాబాహుళ్య మెట్లున్నను, ప్రతి చిన్న విషయమును - అది చేతన ప్రాణియైనను, జడపదార్థమైనను - దేవతాత్మగనే భావించి, దానితో సాన్నిహిత్య మేర్పరచుకొను ప్రయత్నము కానవచ్చును. ఈ విశ్వమంతటను ఒకే ఒక శక్తి, ఒకే ఒక ఆత్మ నిండియున్నదను విశ్వాసముతో పాటు, ప్రాప్తమైనదేదో అది ఆ పరమాత్మ ప్రసాదించినదే అను నిశ్చయము కలిగి, ఉత్సాహముతో కర్మాచరణ మొనర్చును జీవితమును ప్రశాంతముగా నడుపుకొను పద్ధతి గోచరించును. రాజసూయాశ్వమేధాది యజ్ఞముల ద్వారా రాష్ట్రీయత, దేశభక్తివంటి ఉదాత్త భావములు ప్రచారమునకు తెచ్చినట్లు కనిపించును. ఆనాటి సమాజములో విద్వాంసులు గౌరవింపబడిరి. బ్రహ్మచారిణులు, సుశీలలు అయిన కన్యలే వివాహమునకు యోగ్యులని యెంచబడిరి. నృత్తగీత వాద్యాది, కళలతోపాటు ఆయా వృత్తులుకూడ ఆనాటి కొన్నో వెలసినవి. యజ్ఞవిధాన వైవిధ్యముతో పాటు, యజ్ఞాంగములను, వాటినిగూర్చి వివరించు సూత్ర వాఙ్మయమును కూడ విస్తారముగా వెలయసాగినవి.

### మంత్రద్రష్టలగు మహర్షులు

శుక్లయజుర్వేదంలో యజ్ఞాల కర్మకలాపాన్ని నిర్దేశించే వచన భాగాలు (యజుస్సులు) ప్రార్థనలు (ఋక్కులు) ఉన్నాయి. ఇవి ఛందోబద్ధాలై మంత్రాలనబడుతూ ఉత్తమసాహిత్యశిల్పంతో నిండి ఉన్నాయి. ప్రతిమంత్రానికి ద్రష్టయైన ఋషి, ఛందస్సు, అధి దేవత ఉన్నారు. ఈ విషయాలను కాత్యాయనుని "సర్వానుక్రమణీ" చక్కగా వర్ణించింది. మంచిసంప్రదాయంచేత రక్షింపబడి, మనకు లభించిన ఈ అనుక్రమణి ప్రామాణికమైంది.

ఋషి అతీంద్రియద్రష్టయైన ప్రజ్ఞాశాలి. అంటే సామాన్య మానవునికి ఏ విధంగాను కనిపించని మంత్రాలనబడే శబ్దరాశిని జ్ఞాన నేత్రంద్వారా సందర్శించి, వెల్లడించిన మహామహుడు. ఈ శుక్ల యజుస్సంహితలోని మంత్రాలను దర్శించి, వెల్లడించిన ఋషుల సంఖ్య ౨౭. వీళ్లల్లో ఏకకుటుంబీకులు, సగోత్రికులు, గురుశిష్యులు జంటకవులు, స్త్రీలు కూడా ఉన్నారు. ఈ ఋషులందరు దార్శనికులైన మహాకవులు. వారి ప్రతిభ సర్వతోముఖమైంది. వారికి సత్యాన్ని సూటిగా స్పష్టంగా దర్శించే శక్తి, దాన్ని సమగ్రంగా వర్ణించే సామర్థ్యం ఉంది. వారికి మార్గదర్శకమైన రచనలు లేవు. పూర్వుల వల్ల, పూర్వరచనల వల్ల ఏర్పరచుకొన్న అభిప్రాయాలూ లేవు. స్వయంప్రతిభతో సత్యాన్ని, దేవతలను సందర్శించి, వర్ణించి కవులయ్యారు. వారు ద్రష్టలుగ, మహర్షులుగ గౌరవింపబడుతున్నారు.

'కవిర్మనీషీ పరిభూః స్వయంభూః' అని పరమాత్మపరంగా ఉన్న కవిశబ్దం, ఆయన సాక్షాత్కారం పొందిన ఋషిపరంగా రూఢిని పొందింది. వేదవాఙ్మయంలో ఋషులే కవులు. కాబట్టే 'కవయః క్రాంతదర్శినః' (కవులు దూరపు దృష్టిగలవారు) 'నానృషిః కురుతే కావ్యమ్' (ఋషి కానివాడు కావ్యాన్ని రచించలేడు) అనే లోకోక్తులు ఏర్పడ్డాయి.

## ఛందస్సు

వేదాలలోని మంత్రాలన్నీ ఛందోబద్ధాలు. కాబట్టి వేదాలను తెలుసుకోవడానికి ఛందోజ్ఞానం తప్పనిసరి. అందుకనే ఛందస్సు ఒక వేదాంగంగా పేర్కొనబడింది. వేదానికి 'ఛందః' అనే సార్థక నామధేయం ఇందువల్లనే కలిగింది.

వేదాల్లోని మంత్రాలకు పాదవిభజనచేసి ఆ పాదాలకు గురులఘు అక్షరసంఖ్యను బోధించే శాస్త్రం ఛందస్సు. ఇది మహేశ్వరుని చేత చెప్పబడింది. శివునివల్ల నందీశ్వరుడు, అతనివల్ల సనత్కుమార, అగస్త్య బృహస్పతి, ఇంద్ర, వాసుకి, పింగళులనే వాళ్లు సంప్రదాయ క్రమంలో శాస్త్రాన్ని నేర్చుకున్నారు. పింగళునిచేత వ్రాయబడ్డ ఛందశ్శాస్త్రానికి 'ఛందోవిచితి' అని పేరు. పింగళుడు వేదమంత్రాల ఛందస్సును లౌకికఛందస్సును కూడ వివరించాడు. పింగళుని ఛందశ్శాస్త్రానికి హైందవి హలాయుధుడు వ్యాఖ్యను రచించారు. వైదికఛందస్సు ఋక్ ప్రాతిశాఖ్యలో కూడ వివరింపబడి ఉంది. కాత్యాయనుని సర్వానుక్రమణిలో (౩వ అధ్యాయం) శుక్లయజుర్వేద వాజసనేయిసంహితలోని ఛందస్సు సమగ్రంగా వివరింపబడింది.

మంత్రం ఒకటినుండి ఎనిమిది పాదాలవరకు ఉంటుంది. ఒకపాదంలో ౬ నుండి ౧౨ అక్షరాలవరకు ఉంటాయి. అక్షరమంటే ఒక అచ్చు. హల్లుతోకూడిన అచ్చు. అనుస్వారంతో కూడిన అచ్చు. పాదపూరణంకోసం పదవిభజన చేయడం సరికాదు. అక్షరాల సంఖ్యలో ఎక్కువగాని తక్కువగాని ఉన్నప్పుడు తగినరీతిలో ఉచ్చరించాలి. చూడండి :

వర్ధమానం స్వేదమ్ (ఋ. ౧-౧-౮)

ఇది గాయత్రీపాదం. కాని ఏడు అక్షరాలే ఉన్నాయి. కనుకగ స్వేదమ్‌కు బదులుగ సువీదమ్ అని ఉచ్చరించి ఎనిమిది అక్షరాలుగా లెక్కించాలి. సంయుక్తాక్షరాలు రెండు అచ్చులుగా ఉచ్చరింపబడతాయి. ఉదా: 'త్ర్యమ్బ' అనే పదం త్రియమ్బ అని ఉచ్చరింపబడుతుంది. కొన్ని

సందర్భాలలో స్వరభక్తి ఒక అక్షరంగా గ్రహింపబడుతుంది. ఉదా: 'ఇంద్ర' అనే పదం 'ఇందర' అని ఉచ్చరింపబడుతుంది. ఎనిమిది అక్షరాలు కల పాదాంతంలో షష్ఠి బహువచన ప్రత్యయమైన 'అమ్' 'అఅమ్' అని ఉచ్చరించబడుతుంది.

వేదమంత్రాలు వివిధఛ్ఛందస్సులలో ఉన్నాయి. మంత్రాలలోని అక్షరసంఖ్యను బట్టి వాటికి వేర్వేరు పేర్లు కలిగాయి. వాటిలో ముఖ్యమైనవి గాయత్రి (౨౪ అక్షరాలు), ఉష్ణిక్ (౨౮), అనుష్టుప్ (౩౨), బృహతి (౩౬), పంక్తి (౪౦), త్రిష్టుప్ (౪౪), జగతి (౪౮) అనే ఏడు ఛందస్సులు.

ఇవి కాకుండా అతిఛ్ఛందస్సులు అని పిలువబడుతున్న మరొక ఏడు ఛందస్సులు ఉన్నాయి. వీటికి యజుస్సులు అనే పేరు కూడా ఉంది. ఇవి అన్నీ వాజసనేయిసంహితలో ప్రయోగింపబడ్డాయి. అవి అతిజగతి (౫౨), శక్వరి (౫౬), అతిశక్వరి (౬౦), అష్టి (౬౪), అత్యష్టి (౬౮), ధృతి (౭౨), అతిధృతి (౭౬). ఇవికాక మరొక ఏడుగణాతి ఛ్ఛందస్సులు శుక్లయజుర్వేదంలో ప్రయోగింపబడ్డాయి. అవి కృతి (౮౦), ప్రకృతి (౮౪), ఆకృతి (౮౮), వికృతి (౯౨), సంకృతి (౯౬), అభికృతి (౧౦౦) ఉత్కృతి (౧౦౪).

శుక్లయజుర్వేదవాజసనేయి సంహితలోని ఛందస్సులు, వాటి విశేషాలు కొన్నింటిని ఇక్కడ గమనిద్దాం. ఈ ఛందస్సులలో గాయత్రి ప్రధానమైంది.

**౧. గాయత్రి :** ౩ పాదాలు. ౮+౮+౮=౨౪ అక్షరాలు

౧. తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్ (౩-౩౫)

**౨. గాయత్రి ఉష్ణిక్ గర్భ** ౬+౭+౧౧=౨౪ అక్షరాలు

ఋతశ్చ సత్యశ్చ ధ్రువశ్చ ధరుణశ్చ,
ధర్తాచ విధర్తాచ విధారయః (౧౭-౮౨)

౩. గాయత్రిబృహత్యామధ్యే ఉ వసావసావే ( ౩-౮-౧౭)

౪. గాయత్రి అపపావసావా (౫-౩౫)

**౫. పాదనిచృత్ గాయత్రి :** ౭+౭+౭=౨౧ అక్షరాలు.

అమూర్యా ఉపసూర్యే, యాభిర్వా సూర్యః సః, తానో హిన్వన్త్వ
ధ్వరమ్ (౬-౨౪)

**౬. ప్రతిష్ఠాగాయత్రి :** ౮+౭+౬=౨౧

త్వమగ్నే వ్రతపా అసి, దేవ ఆ మర్త్యేష్వ,
త్వం యజ్ఞేష్వీడ్యః (౪-౧౬)

**౭. స్వరాట్ గాయత్రి :** ౮+౮+౧౦=౨౬ అక్షరాలు

సముద్రస్య త్వాఽవకయాగ్నే పరివ్యయామసి పావకో
అస్మభ్యం శివో భవ (౧౭-౪).

**౮. పదపంక్తిగాయత్రి:** ౫+౫+౫+౫+౬=౨౬ అక్షరాలు.

ఏభిర్నో అర్కైర్భవా నో అర్వాఙ్ స్వర్ణజ్యోతిః అగ్నే
విశ్వేభిః సుమనా అనీకైః (౧౫-౪౬).

**౯. విరాట్ శంకుమతి గాయత్రి** (౧౨-౭౩) దీన్ని మహీధరుడూ
ఆర్షీగాయత్రి అని పేర్కొన్నాడు.

**౧౦. గాయత్రి శంకుమతి:** ౮+౮+౫=౨౧ అక్షరాలు

యుక్తేన మనసా వయందేవస్య సవితుః సవే స్వర్గ్యాయ శక్త్యా
(౧౧-౨)

**౧౧. ఏకపదా గాయత్రి :**

అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిః స్వాహా (౩-౯)

**౧౨. ద్విపదా గాయత్రి :**

శంన ఇంద్రాపూషణా వాజసాతౌ శమింద్రాసోమాసువితాయ శం
యోః (౩౬-౧౧)

ఉదుత్యం జాతవేదసం దేవం వహంతి కేతవః
దృశే విశ్వాయ సూర్యం స్వాహా (౭-౪౧).

ఇక్కడ మూడవ పాదంలో ౭ అక్షరాలే ఉన్నాయి గనుక
విసర్గం పాదపూరణం కోసమే ఉచ్చరింపబడుతున్నది.

**II. ఉష్ణిక్ :** మూడుపాదాలు ౮+౮+౧౨=౨౮ అక్షరాలు లేక నాలుగు
పాదాలు ౭+౭+౭+౭ = ౨౮ అక్షరాలు.

౧. త్ర్యాయుషం జమదగ్నేః
కశ్యపస్య త్ర్యాయుషం
తన్నో అస్తు త్ర్యాయుషమ్ (౩-౬౨).

౨. ౮+౧౦+౧౦=౨౮ అక్షరాలు

ప్రగాహుదగధరాక్షర్వతస్త్వ దిశ ఆ ధావంతు
అంబ విష్ఫుర సమరీర్విదామ్ (౬-౩౬)
౩. ౮+౮+౧౪=౩౦ అక్షరాలు (౧౧-౯).
౪. ౧౯+౧౦=౨౯ అక్షరాలు (౧౨-౫౭)
౫. ౧౪+౧౫=౨౯ అక్షరాలు (౧౨-౫౯) దీన్ని
మహీధరుడు ఆర్షీ ఉష్ణిక్ అని పేర్కొన్నాడు.
౬. ౧౦+౯+౯=౨౮ అక్షరాలు (౧౭-౮౦).
౭. ౧౮+౧౨=౩౦ అక్షరాలు (౩౮-౧౨) దీన్ని
మహీధరుడు స్వరాట్ ఉష్ణిక్ అని వ్యవహరించాడు.

౮. ఉష్ణిక్ విషమపాద :
అగ్నే స్వాహా కృణుహి జాతవేద ఇంద్రాయ హవ్యమ్
విశ్వేదేవా హవిరిదం జుషంతామ్ (౨౭-౨౨).

౯. పుర ఉష్ణిక్ : ౧౨+౮+౮=౨౮ అక్షరాలు.
అప్స్వంతరమృతమప్సు భేషజమపాముత
ప్రశస్తిష్వశ్వా భవత వాజినః (౯-౬).

౧౦. వర్ధమానా ఉష్ణిక్ : ౬+౭+౮+౯=౩౦ అక్షరాలు.
కోఽసి కతమోఽసి కస్యాసి కో నామాసి
యస్యతే నామామన్మహి యం త్వా సోమేనాతీతృపామ (౭-౨౯)

౧౧. అనుష్టుప్ గర్భోష్ణిక్ :
పితుం ను స్తోషం మహో ధర్మాణం తవిషీమ్
యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వమర్దయత్ (౩౪-౭)

౧౨. పరోష్ణిక్ : ౮+౮+౧౨=౨౮ అక్షరాలు (౧౮-౫౪).

౧౩. కకువ్మతి పరోష్ణిక్ : (౧౪-౨౨).

౧౪. కకుభ్ : ౮+౧౨+౮=౨౮ అక్షరాలు.
భేషజమసి భేషజం గవేఽశ్వాయ పురుషాయ భేషజమ్
సుఖం మేషాయ మేష్యై (౩-౫౯)

III. అనుష్టుప్ : నాలుగు పాదాలు ౮+౮+౮+౮=౩౨ అక్షరాలు
౧ అయమగ్నిః పురీష్యో రయిమాన్ పుష్టివర్ధనః
అగ్నే పురీష్యాభి ద్యుమ్నమభి సహ ఆ యచ్ఛస్వ (౩-౪౦)

౨. పూర్ణరూపా అనుష్టుప్ : ౯+౧౧+౧౨=౩౨ అక్షరాలు
యాసేన వో యామమభ్యాం తథ్ వోవిశ్వేదా విధజాతు
ఋతస్య పథా ప్రేత చంద్రదక్షిణా (౭-౪౫).
ఇక్కడ మూడుపాదాలే ఉన్నాయి అయినా౩౨
అక్షరాలుండటం వల్ల పూర్ణ.

౩. పిపీలికా మాధ్యకృతి అనుష్టుప్ :
అజీజనో హి పవమాన సూర్యం విధారే శక్మనా పయః
గోజీరయా రంహమాణః పురంధ్యా (౨౨-౧౮).

౪. అనుష్టుప్ విరాట్ ఛందః:
అషాఢోఽసి సహమానా సహస్వారాతీః సహస్వ
పృతనాయతః సహస్రవీర్యాఽసి సా మా జిన్వ (౧౩-౨౬)

౫. ఏకపదా విరాట్ : ౧౦ అక్షరాలు.
జుషేణో అపూరాజ్యస్య వేతు స్వాహా (౫-౩౫)

౬. ద్విపదా విరాట్ : ౨౦ అక్షరాలు (౨-౨౧).
యుక్త్వాయ సవితా దేవాన్ స్వర్యతో ధియా దివమ్
బృహజ్జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్ (౧౧-౩).
ఇక్కడ౮+౭+౮+౮=౩౧ అక్షరాలు కనుక ఏకఊన అనుష్టుప్.

౭. ఏకాధికానుష్టుప్ : ౮+౯+౮+౮ = ౩౩ అక్షరాలు.
సుజాతో జ్యోతిషా సహ శర్మ వరూథమాసదత్స్వః
వాసో అగ్నే విశ్వరూపం సం వ్యయస్వ విభావసో (౧౧-౪౦).
ఇక్కడ రెండవపాదంలో ౯ అక్షరాలున్నాయి. కనుక
ఏకాధికానుష్టుప్.

IV. బృహతి : ౪ పాదాలు. ౮+౮+౧౨+౮= ౩౬ అక్షరాలు.
౧. కదాచన స్తరీరసి, నేంద్ర సశ్చసి దాశుషే
ఉపోపేన్ను మఘవన్ భూయ ఇన్నుతే,
దానం దేవస్య పృచ్యత (౮-౨)

౨. పురస్తాద్ బృహతి : ౧౨+౮+౮+౮ = ౩౬ అక్షరాలు.
పరి మాగ్నే దుశ్చరితాద్బాధస్వా మా సుచరితే భజ
ఉదాయుషా స్వాయుషోదస్థామమృతాం అను (౪-౨౮).

౩. పిపీలికామధ్యా బృహతీ : ౧౩+౯+౧౪ = ౩౬ అక్షరాలు లేక
౧౩+౮+౧౩=౩౪ అక్షరాలు.
పృథివ్యా అహముదంతరిక్షమారుహమంతరిక్షాద్దివ
మారుహం దివో నాకస్య పృష్ఠాత్ స్వర్జ్యోతిరగామహమ్ (౧౭-౬౭).

౪. న్యంకుసారిణీ బృహతీ : ౮+౧౨+౮+౮ = ౩౬ అక్షరాలు.
అయమగ్నిర్గృహపతిర్గార్హపత్యః ప్రజాయా వసువిత్తమః అగ్నే
గృహపతేఽభి ద్యుమ్నమభి సహ ఆయచ్ఛస్వ (౩-౩౯).
దీనికే స్కంధగ్రీవా, ఉరోబృహతీ అనే పేర్లున్నాయి.
ఇందులో ౮+౧౨+౯+౮= ౩౭ అక్షరాలు కూడాఉంటాయి.

౫. పథ్యా బృహతీ : ౮+౮+౧౨+౮ = ౩౬ అక్షరాలు.
శ్వాత్రా స్థ వృత్రతురో రాధోగూర్తా అమృతస్య పత్నీః
తా దేవీర్దేవత్రేమం యజ్ఞం నయతో పహూతాః సోమస్య
ఇక్కడ ౮+౯+౧౨+౯ = ౩౮ అక్షరాలుండడంవల్ల ద్వ్యధికా
అంటేరెండక్షరాలు ఎక్కువ గలది.

౬. ఉపరిష్టాద్ బృహతీ : ౮+౮+౮+౧౨ = ౩౬ అక్షరాలు.
ఊర్ధ్వ ఊషుణ ఊతయే తిష్ఠ దేవో న సవితా
ఊర్ధ్వో వాజస్య సనితా యదంజిభిర్వాఘద్భిర్విహ్వయామహే
(౧౧-౪౨)

౭. ఊర్ధ్వ బృహతీ : ౧౨+౧౨+౧౨ = ౩౬ అక్షరాలు (౪-౩౩).
౮. సతో బృహతీ : ౧౨+౮+౧౨+౮ = ౪౦ అక్షరాలు (౧౨-౧౦౮).
౯. విపరీతా బృహతీ : ౮+౧౨+౮+౧౨ = ౪౦ అక్షరాలు (౬-౩౩).
౧౦. మహాబృహతీ : ౧౨+౮+౮+౮+౮ = ౪౪ అక్షరాలు. (౧౯-౭౨).
౧౧. మహాబృహతీ త్రిష్టుప్ : (౧౨-౮).
౧౨. ఏకోన ఊర్ధ్వ బృహతీ : ౧౦+౧౩+౧౨ = ౩౫ అక్షరాలు.
ఉప్రావేతం ధూర్షాహౌ యుజ్యేథామనశ్రూ అవీరహణౌ
బ్రహ్మచోదనౌ స్వస్తి యజమానస్య గృహాన్గచ్ఛతమ్(౪-౩౩).

౫. పంక్తి : ఐదుపాదాలు. ౮+౮+౮+౮ = ౪౦ అక్షరాలు.
౧. భవతం నః సమనసౌ సచేతసావరేపసౌ
మా యజ్ఞం హింసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ
శివౌ భవతమద్య నః (౫-౩).

౨. పంక్తి విరాట్ : ౧౦+౧౦+౧౦+౧౦ = ౪౦ అక్షరాలు.
ఉత్క్రామ మహతే సౌభగాయాస్మాదాస్థానాద్ ద్రవిణోదా
వాజిన్ వయం స్యామ సుమతౌ పృథివ్యా అగ్నిం ఖనంత ఉపస్థే
అస్యాః (౧౧-౨౧).

౩. పంక్తి త్రిష్టుప్ : (౮-౬౧).
౪. మహా పంక్తి : (౩-౧౮).
౫. త్ర్యవసానా మహాపంక్తి: (౩-౪౩).
౬. ప్రస్తార పంక్తి : ౧౨+౧౨+౮+౮ = ౪౦ అక్షరాలు (౮-౪౩).
౭. ఆస్తార పంక్తి : ౮+౮+౧౨+౧౨ = ౪౦ అక్షరాలు ( ౪-౨౩).
౮. విష్టార పంక్తి : ౮+౧౨+౧౨+౮ = ౪౦ అక్షరాలు (౧౨-౧౬౦).
౯. సంస్తార పంక్తి: ౧౨+౮+౮+౧౨ = ౪౦ అక్షరాలు. (౩౬-౧౨)
౧౦. ఏకాధికా పంక్తి : ౮+౭+౮+౯+౯ = ౪౧ అక్షరాలు.
దేవీరాపో అపాంనపాద్యో వ ఊర్మిర్హవిష్య ఇంద్రియావాన్
మదింతమః తం దేవేభ్యో దేవత్రా దత్త శుక్రపేభ్యో
యేషాం భాగ స్థ స్వాహా (౬-౨౭).
౧స్వాహా ౨అవేది యజుస్సు.

VI. త్రిష్టుప్ : ౪ పాదాలు. ౧౧+౧౧+౧౧+౧౧ = ౪౪ అక్షరాలు.
౧. యా తే ధామాని హవిషా యజంతి
తా తే విశ్వా పరిభూరస్తు యజ్ఞమ్
గయస్ఫానః ప్రతరణః సువీరో౽
వీరహా ప్రచరా సోమ దుర్యాన్ (౪-౩౭).

౨. విరాడ్రూపా త్రిష్టుప్ : (౧౧-౨౭).
౩. యవమధ్యా త్రిష్టుప్ : (౧౬-౫౧).
౪. పురస్తాజ్జ్యోతి త్రిష్టుప్ : (౧౭-౭౪).
౫. మధ్యేజ్యోతి త్రిష్టుప్ : (౧౨-౬౫).
౬. ఉపరిష్టాజ్జ్యోతి త్రిష్టుప్ :

ఋతావానం మహిషం విశ్వదర్శతమగ్నిం సుమ్నాయ
దధిరే పురో జనాః శ్రుత్కర్ణం సప్రథస్తమం త్వా గిరా
దైవ్యం మానుషా యుగా (౧౨-౧౧౧).

౭. మహాబృహతీ త్రిష్టుప్ : (౧౨-౮).

౮. పంక్తి త్రిష్టుప్: (౮-౬౧).

**VII. జగతీ :** నాలుగు పాదాలు. ౧౨+౧౨+౧౨+౧౨ = ౪౮ అక్షరాలు.

౧. అగ్నే నయ సుపథా రాయే అస్మాన్
విశ్వాని దేవ వయునాని విద్వాన్
యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ (౪౦-౧౬).

౨. మహాపంక్తి జగతీ : ౬ పాదాలు. ౮+౮+౮+౮+౮+౮ = ౪౮ అక్షరాలు.
ఏజతు దశమాస్యో గర్భో జరాయుణా సహ
యథాయం వాయురేజతి యథా సముద్ర ఏజతి
ఏవాయం దశమాస్యో అస్రజ్జరాయుణా సహ (౮-౨౮).

౩. ఏకోనా జగతీ : (౩-౧౫)

**VIII. అతిచ్ఛందస్సులు:**

౧. అతిజగతీ : ౫౨ అక్షరాలు (౯-౩౯)
౨. శక్వరి: ౫౬ అక్షరాలు (౩౪-౫౧).
౩. అతిశక్వరి : ౬౦ అక్షరాలు (౧౯-౭౬)
౪. అష్టి : ౬౪ అక్షరాలు : (౧౯-౪౮).
౫. అత్యష్టి : ౬౮ అక్షరాలు (౪-౧).
౬. ధృతి : ౭౨ అక్షరాలు (౧౬-౬౪)
౭. అతిధృతి : ౭౬ అక్షరాలు (౧౧-౯).
౮. కృతి : ౮౦ అక్షరాలు (౧౨-౪).
౯. ప్రకృతి : ౮౪ అక్షరాలు (౫-౨).
౧౦. ఆకృతి : ౮౮ అక్షరాలు (౧౫-౬౪).
౧౧. వికృతి ౯౨ అక్షరాలు (౨౧-౬౧).
౧౨. సంకృతి : ౯౬ అక్షరాలు. ఈ సంహితలో ప్రయోగించబడలేదు.
౧౩. అభికృతి : ౧౦౦ అక్షరాలు (౨౭-౪౫).
౧౪. ఉత్కృతి : ౧౦౪ అక్షరాలు (౧౪-౬).

**IX . యజుస్సులు :**

౧. ఇషేత్వా ,
౨. ఊర్జేత్వా-దైవీ అనుష్టుప్ (౩ అక్షరాలు).
౩. వాయవస్థ - దైవీబృహతీ (౪ అక్షరాలు).
౪. దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వమఘ్న్యా ఇంద్రాయభాగం ప్రజావతీ రనమీవా అయక్ష్మా మా వస్తేన ఈశత మాఘశంసో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీః (యజుస్సు).
౫. యజమానస్య పశూన్ పాహి- యాజుషీబృహతీ. ౯ అక్షరాలు (౧-౧).

ఇలా వాజసనేయిసంహితలోని ౧-౧ లో ఇన్ని ఛందస్సులు ఉన్నాయి. శుక్లయజుర్వేద కాలంనాటికే ఇలా ఛందస్సు శైలూషిలాగా అనేక భంగిమలతో నడయాడనేర్చింది. వాజసనేయిసంహితను దర్శించిన మహర్షుల బహుముఖపాండిత్యం ప్రశంసనీయంగా ఉంది. ఛందోరచనలో వాళ్లు పాటించిన కౌశల్యం ఆదర్శప్రాయం.

**ఛందస్సు ప్రయోజనాలు :**

కవిత్వానికి సౌందర్యాన్ని కలిగించేది ఛందస్సు. వచనం కంటె ఛందోబద్ధమైన రచన గుర్తుంచుకోవడానికి చాలా అనుకూలంగా ఉంటుంది. నియమపూర్వకమైన విన్యాసం ఉండటంవల్ల ఇది ధారణకు ఎంతో వీలుగా ఉంటుంది. మంత్రజపాలలో ఆయా మంత్రాల ఛందోవిశేషజ్ఞానం ఎంతో ఆవశ్యకం. ఛందోజ్ఞానం లేకుండా చేసే జపాదులు ఫలించవు. ఛందోబద్ధంగా ఉండటం చేతనే వేదాలు లిఖితరూపంగా లేకపోయినప్పటికీ శ్రుతులనబడుతూ అనాదినుంచి స్వస్వరూపాన్ని కోల్పోకుండా యథావి స్వరూపంతో చెక్కు చెదరకుండా స్థిరంగా ఉండగల్గాయి.

## వైశిష్ట్యం

అనాదినుంచి భారతీయులు ఆధ్యాత్మికతత్త్వచింతన చేస్తూనే ఉన్నారు. వేదాలు వీరికి పరమప్రమాణాలు. అందులో యజుర్వేదం విశిష్టపేయం. అంటే ఇంటికి గోడలాగా యజ్ఞక్రియలలో ఉపయోగించే ప్రధానవేదం. అందులోనూ యాజ్ఞికులలో ప్రధానమైన అధ్వర్యుడుపయోగించే వేదం. కాబట్టి అధ్వర్యువేదమని పేరు పొందింది. ఈ యజుర్వేదం శుక్లయజుర్వేదమని, కృష్ణయజుర్వేదమని రెండు రకాలుగా ప్రచారంలో ఉన్నది. దక్షిణదేశంలో

కృష్ణయజుర్వేదం, ఉత్తరదేశంలో శుక్లయజుర్వేదం బహుళప్రచారంలో ఉన్నాయి.

శుక్లయజుర్వేదసంహితకు వాజసనేయసంహిత అని పేరు. ఈ సంహితలో యజ్ఞప్రక్రియకుపయోగించే మంత్రాలు కూర్చబడ్డాయి. కృష్ణయజుర్వేదంలో సంహితాగ్రంథం, బ్రాహ్మణగ్రంథం సంకీర్ణంగా ఉండగా, శుక్లయజుర్వేదంలో మంత్రాలన్నీ సంహితా భాగంలోను బ్రాహ్మణగ్రంథం వేరుగాను ఉన్నది.

ఈ వాజసనేయసంహితలో రెండు శాఖలు ప్రచారంలో ఉన్నాయి. ౧. మాధ్యందినశాఖ ౨. కాణ్వశాఖ. రెండు శాఖల్లోను మంత్రాలన్నీ ఇంచుమించు సమానంగా ఉన్నా పాఠప్రవచనాల్లో తేడా ఉన్నది. మంత్రపాఠంలో రెండు శాఖలకు ముందువెనకల్లో తేడాలున్నాయి. పఠన క్రమంలో తేడాలున్నాయి. పాఠభేదం గద్యాత్మకమైన అర్థవాదభాగంలోనే ప్రత్యేకంగా కనబడుతుంది. పద్యాత్మక భాగంలో అనగా ఋక్కులనబడేమంత్రాల్లో కనబడదు.

ఈ శుక్లయజుర్వేదంలో నలభై అధ్యాయాలున్నాయి. అందులో మొదటి పద్దెనిమిది అధ్యాయాలు వేరుగా ఉన్న బ్రాహ్మణ భాగంలో వ్యాఖ్యానింపబడ్డాయి. మిగిలిన ఇరవైరెండధ్యాయాల్లో పదిహేడు అధ్యాయాలకు బ్రాహ్మణ భాగం విరళంగాను, ఐదుఅధ్యాయాలకు బ్రాహ్మణ భాగం లేకపోవడం కన్పడుతుంది. ఇది గాక, చివటి ఇరవైరెండధ్యాయాలు కృష్ణయజుర్వేదంలో బ్రాహ్మణారణ్యక భాగాలుగా కన్పడుతున్నాయి. కాత్యాయనునిక్కష్ణయజుర్వేదానుక్రమణికలో ౨౬వ అధ్యాయం నుంచి ౩౫వ అధ్యాయం వరకు ౧౦ అధ్యాయాలు ఖిలభాగమని చెప్పబడింది. వాజసనేయ సంహితలోని ౪౦ అధ్యాయాల్లోను మొదటి ౨౦ అధ్యాయాలు యజ్ఞప్రక్రియకుపయోగించేవి ౨౬వ అధ్యాయం మొదలు ౨౯ అధ్యాయము వరకు మొదటి ఇరవైఐదధ్యాయాలకు వ్యాఖ్యానరూపంగా కనపడతాయి. 30 నుంచి 3౯వ అధ్యాయం వరకు ఉన్న తొమ్మిది అధ్యాయాలు నరమేధ, పితృయజ్ఞ, విశ్వజిద్యాగాది విషయాలను ప్రతిపాదిస్తున్నాయి. నలభైయవ అధ్యాయం ఈశావాస్యోపనిషత్తు. శుక్లయజుర్వేదంలో ఋక్కులు చాలా చెప్పబడ్డాయి. అంతేకాదు యజ్ఞాంలో ఏ సందర్భంలో ఏ ఋక్కు పఠించాలో చక్కగా వర్ణించబడింది. కాబట్టి శుక్లయజుర్వేదసంహితలు రెండింటిలో ఇంచుమించు చాలుగవభాగం ఋఙ్మంత్రాలు, మిగిలిన మూడువంతులు అర్థవాదరూపంగా గాని యజ్ఞక్రియా బోధకంగా గాని కనపడుతుంది.

ఇంతవరకు మనం శుక్లయజుర్వేద స్వరూపాన్ని గురించి తెలిసికొన్నాం. ఈ వేదం యజ్ఞక్రియాస్వరూపాన్ని బోధిస్తుందని చెప్పబడింది. యజ్ఞమంటే దేవతలకు హవిర్భాగాలిచ్చే క్రియాకలాపం. పరమేశ్వరుడొక్కడే అయినా వర్షం ఇచ్చేటప్పుడు ఇంద్రుడని, అపమృత్యువును జయించటానికి మృత్యుంజయుడు లేక రుద్రుడని, లోకసృష్టికారకుడై సూర్యుడుగాను, ఈప్రకారం మిత్రావరుణులని, అగ్ని అని అనేక దేవతాస్వరూపాలు కలవాడుగా చెప్పబడుతున్నాడు. ఆయా దేవతలను హవిర్దానంచేత ఆరాధించే క్రియాకలాపమే యజ్ఞం. ఈ యజ్ఞాలు ఏడు పాకయజ్ఞాలని, ఏడు హవిర్యజ్ఞాలని, ఏడు సోమయజ్ఞాలని వైదికసంప్రదాయం.

ఇలా దేవతారాధనాప్రధానంగా కృష్ణయజుర్వేదం లాగా శుక్లయజుర్వేదమున్నప్పటికీ, ఐహికజీవితసంబంధమైన విషయాల కోసం కూడ దేవతారాధనం చెప్పబడింది. అనావృష్టి సందర్భంలో వర్షంకోసం వరుణ జపాదులు, శత్రుజయంకోసం విహవ్యమంత్రాలు, జయలు, రాష్ట్రభృత్తులు, అభ్యాతానములనే మంత్రాలు ఉపదేశించబడ్డాయి. ఈప్రకారం ఐహికజీవితోపయోగం కోసం చెప్పబడ్డ మంత్రాలు చాలా ఉన్నాయి. మానవజీవితానికి ఐహికాముష్మికాలు రెండూ ముఖ్యమైనవే. ఆయా వేదాల సంహితాభాగాలు చాలావరకు ఐహికోపయోగంకోసం, ఆరణ్యకోపనిషద్భాగాలు ఆ ముష్మికంకోసం ఉద్దేశింపబడ్డాయి. నవీనులకు వేదాల విషయంలో ఒక సందేహం కలుగవచ్చు. అతీంద్రియసత్యాలను ఉపనిషన్ముఖంగా ప్రతిపాదించడంలో వారి కాక్షేపం లేదుగాని, ఐహికజీవితంలో పుత్రసంపత్తికోసం, పశుసంపత్తికోసం, అర్థసంపత్తికోసం అలాగే అనావృష్టి లేకుండా వర్షం కోసం, యుద్ధంలో జయంకోసం, శత్రునాశనంకోసం ప్రార్థనలు చేసే ఈ వేదమంత్రాలు నిజంగా ఆయా ఇష్టసిద్ధిని కలిగిస్తాయా? అని, కాని ' More things are wregth by prayer than the world dreams of ' అని ఒక పాశ్చాత్యకవి చెప్పినట్లు, అల్పశక్తిగల మానవుడు, సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్త్వాది గుణాలుగల పరమేశ్వరుని ఆరాధించాలని, ఆ ఆరాధన కేవలం లౌకికభాషలో గాక గొప్పశక్తికల దివ్య మంత్రాలద్వారా ఆరాధిస్తే తప్పక ఫలితం ఉంటుందని మహర్షులతాత్పర్యం. వేదాలలో విశ్వాసంలేని బౌద్ధచార్వాకాదులు హేళనా పూర్వకంగా ఇలా ఆక్షేపిస్తారు. ఒకడు ఒకనదికి ఇవతలిఒడ్డున ఉండి ఓ పరమేశ్వరా! నన్ను అవతలిఒడ్డుకు తీసుకొని పొమ్మని ప్రార్థిస్తే ఆ ప్రార్థన సిద్ధిస్తుందా? అని దానికి ఇది సమాధానం - ( గామానయ దేవదత్త! ) దేవదత్త! ఆవుని తీసుకొనిరా! అని శబ్దప్రయోగం చేయగానే దేవదత్తుడు ఆవును తీసికొని వస్తున్నాడు కాదా ! లౌకికశబ్దానికే అంతటి శక్తి కన్పడుతుండగా స్వరఛ్ఛందోబద్ధమై మహర్షులచేత దర్శింపబడిన ఈ వైదిక మంత్రాలకు ఆ శక్తి ఎందుకుండకూడదు? కాబట్టి మంత్రోచ్చారణలో స్వరవర్ణాదిలోపం లేని మంత్రాలు శబ్ద ప్రధానాలై శక్తిమంతాలై ఆయుధాల్లాగా పనిచేస్తాయని మహర్షులు చెప్పారు.

మంత్రాలు మహర్షులచేత దర్శింప బడ్డాయని సంప్రదాయం. మహర్షులు తీవ్రతపోనిష్ఠలో నుండగా ఆ మంత్రాలు శ్రుతిగోచరాలైనాయి. అందుచేతనే వేదాలకు శ్రుతులు అనే పేరేర్పడింది.

ఈ యజుర్వేదంలో చెప్పబడ్డ విహవ్యమంత్రాలు చాలా ప్రసిద్ధాలు. అవి ఈ వేదానికొక విశిష్టతను చేకూర్చాయి. వాటి ప్రభావాన్ని వివరించే ఈ సంఘటన గమనించదగింది.

'విశ్వామిత్రజమదగ్నీ వసిష్ఠేనాఽస్పర్ధేతాం.
స ఏతజ్జమదగ్నిర్విహవ్యమపశ్యత్...
యద్విహవ్యఙ్ శస్యతే. ఇంద్రియం
వీర్యం యజమానో భ్రాతృవ్యస్య వృఙ్క్తే

ఒకప్పుడు విశ్వామిత్ర జమదగ్ని మహర్షులు వసిష్ఠునితో స్పర్ధపడ్డారు. అప్పుడు జమదగ్ని మహర్షి తపోవిశిష్టబలంతో విహవ్య మనే మంత్రాన్ని దర్శించాడట. ఆ విహవ్యమంత్రాన్ని జపించినవాడు శత్రువుయొక్క ఇంద్రియబలాన్ని, వీర్యాన్ని సంహరించగలడట. ఇటువంటి లౌకికాలౌకిక ప్రయోజనాలను చేకూర్చే విశిష్టమంత్రాలుగల సంహిత శుక్లయజుస్సంహిత. ఇది బహుముఖమైన వైశిష్ట్యం కలది.

## తత్త్వం :

తత్త్వమంటే సత్యమనీ, యథార్థమని అర్థం. కేవలం భౌతిక సుఖాలకు మాత్రం దాసులుగాక భారతీయులు ఈ ప్రపంచం, సృష్టి, జీవితం, మరణం, ప్రకృతి, మనస్సు, పరతత్త్వం దాని మహిమ మొ॥ వాటి యథార్థస్వరూపమేమై ఉంటుందని వాటి తత్త్వాన్వేషణ చేశారు. ఈనాడు మనకు దొరుకుతున్న అనేక తాత్త్వికసూత్రాలకు సిద్ధాంతాలకు వేదాలలోనే బీజప్రాయంగా పునాదులు పడ్డాయి. ఈ విశేషాలను శుక్లయజుస్సంహితలో మనం ఎంతవరకు గ్రహించవచ్చో ఇక్కడ విశ్లేషణ చేసి చూద్దాం.

### ౧. పరతత్త్వం :

ఇంద్రుడు, సవిత, మిత్రావరుణులు, సోముడు, రుద్రుడు మొ॥ దేవతల నీ సంహిత ఆయా సందర్భాలలో ప్రస్తావించినా, ఈ నామరూపాలలో ఉండే ఒక పరతత్త్వం వారి దృష్టికందనిది కాదు. 'భువనస్య పతయే స్వాహా అధిపతయే స్వాహా'(౯-౨౦), 'ఈశావాస్యమిదం సర్వమ్'(౪౦-౧) అనే చోట్ల ఈభావన స్పష్టంగా కనబడుతుంది. 'భువనపతి' అంటే జగత్పరిపాలకుడని, 'అధిపతి' అంటే సర్వలోకప్రభువని మహీధరుడు వివరించాడు.

వేదాలన్నింటిలోను జగన్నిర్వాహకుడుగా ప్రసిద్ధుడైన పరమేశ్వరుడే తన ప్రీతికోసం యజ్ఞాన్ని నియోగిస్తున్నాడని (౧-౬) చెబుతూ ఇంద్రుడు మొ॥ దేవతల కంటే అతీతమైన పరతత్త్వాన్ని ఈ సంహిత ప్రతిపాదిస్తున్నది. పరబ్రహ్మ విజ్ఞానానందస్వభావుడు. ఆయన తత్త్వం నిత్యం, సత్యం, శాశ్వతం, దానికంటె భిన్నమైందంతా అశాశ్వతమైంది. ఈ తత్త్వాన్ని ఆనాటివారు గుర్తించారు (౧౦-౨౭). ప్రపంచం స్థావరజంగమాత్మకమని, దీనికి అధిపతి సర్వజ్ఞుడైన పరమాత్మ అని వారు చక్కగా గుర్తించారు(ఈశానమస్య జగతః స్వర్దృశమీశానమిన్ద్ర తస్థుషః ౨౭-౩౫).

### ౩. జీవితం - మరణం:

లోకంలో భయాలన్నింటిలోకి మృత్యుభయం చాల పెద్దది. దాన్ని ఏ జీవి తప్పించుకోలేదు. ఆనాటివారు దీనికి అపవాదం కాలేకపోయినా, తాము అపమృత్యువు పాలు కాకుండా ఉండేటట్లు అనుగ్రహించుమని వారిలా త్ర్యంబకుణ్ణి ప్రార్థించేవారు.

"పండిన దోసకాయ ఎలా తీగనుంచి ఎవరి ప్రయత్నం లేకుండా అలా తేలిగ్గా ఊడిపోతుందో, అలా నేను అపమృత్యువు బారినుంచి తప్పించుకొని స్వచ్ఛందంగా, అనాయాసంగా మరణించాలి. స్వర్గం నుంచిగాని, మోక్షం నుంచిగాని, తిరిగి నేను పతితుణ్ణి కాకూడదు"(౩-౬౦).

అనాయాసమరణం కోరేవారు త్ర్యంబకానుగ్రహం కోసం ఎప్పుడూ స్మరించే ఈ మంత్రం చాల ప్రసిద్ధమైంది.

మానవ జీవితం గాలిబుడగలాగా అశాశ్వతమైందని తెలిసికొని, వారు పూర్ణాయుష్యం కోసం దేవతల నాశ్రయించారు. తమకు నూరు సంవత్సరాలు వచ్చేవరకు దేవతలను రక్షణ నిమిత్తం దగ్గరే ఉండమని కోరారు. అప్పుడు వారికి వార్ధక్యం వస్తుందట. తమ వార్ధక్య దశలో వారి పిల్లలు సంతానం కలిగి తండ్రులై ఉండాలిట. అంతవరకు దైవానుగ్రహంవల్ల పూర్ణాయుష్యంతో ఉండాలని వారి ప్రార్థన (౨౫-౨౨). ఆనాడు శతవృద్ధుకూడా ముసలితనం లేకుండా బాగా ఆరోగ్యంగా ఉండేవాడని, నూరు సంవత్సరాలకు ముసలితనం వచ్చేదని దీన్ని బట్టి తెలుస్తుంది.

#### ౩.౧౧ కవితా సౌందర్యం

కవిత్వం ఒక కాలానికి ఒక వ్యక్తికి పరిమితమైంది కాదు. అది ప్రకృతిలోని ఒక ధర్మం. ప్రకృతితోనే పుట్టింది. ప్రకృతితోనే జీవిస్తోంది. ప్రకృతిలోని ప్రతివస్తువులోనూ అందం ఉంది. చెట్టులో అందం ఉంది. పుట్టలో అందం ఉంది. కనుక్కోగలిగితే అందం అన్నిచోట్లా ఉంది. అలాగే ప్రకృతిసిద్ధమైన పదార్థంలోనూ అందం ఉంది. అందంలేని పదమంటూ ఒకటి లేదు. అందం గల పదాలంటూ విడిగా లేవు. కాబట్టే ప్రసిద్ధులైన కవుల రచనల్లో కూడా

మనం ప్రతిరోజూ వాడే పదాలే వాడబడుతుంటాయి. ప్రతిరోజూ మనం చూసేవస్తువులే వర్ణింపబడతాయి. కాని కవిచేత పడినప్పుడే ఆ పదానికి అందం కొట్టవచ్చినట్లు కనబడుతుంది. దానికి కారణం కవిశక్తి. కాబట్టే కొందరే కవులు కాగలిగారు.

భాషనేర్పినవాడే భాషలోని వైచిత్ర్యాన్ని చమత్కారాన్ని మానవుడు నేర్పాడు. ఒకే అర్థాన్ని వివిధ రీతుల్లో వివరించాడు. ఒక్కొక్క రీతిలో ఒక్కొక్క విశేషాన్ని చమత్కారాన్ని చవిచూశాడు. అలా తన మాటల్లోని వైచిత్ర్యాన్ని ప్రదర్శించడంలోనే ఎన్నో వక్రోక్తుల్ని గుర్తించగలిగాడు.

ప్రకృతిలోని అనేకకోట్ల వస్తుజాలంలో ఒక వస్తువుకు మరో వస్తువుకూ ఏదో ఒక అంశంలో అంతో ఇంతో పోలిక ఉంటూనే ఉంది. స్వరూపంలోని పోలిక, స్వభావంలోని పోలిక, ఆచరణలోని పోలిక, ఆలోచనలోని పోలిక ఇలా ఎన్నో పోలికలు। పోలిక అనేది అనాదిగా ఉంటూ వచ్చిందే అయినా అది గుర్తించబడినప్పుడూ, గుర్తించబడి శబ్దంలో చెప్పబడినప్పుడూ, పోలికగల రెండు వస్తువులకూ మరింత శోభ ఏర్పడుతుంది. గుర్తించి చెప్పేవాడి హృదయంలో దాన్ని తెలుసుకొనేవాడి హృదయంలో ఎంతో ఆనందం వెల్లివిరుస్తుంది. ఈ ప్రకృతిసిద్ధమైన ధర్మాన్నే ఉపమ అంటాం. అట్టి ఈ ఉపమ మరెన్నో స్వరూపాల్ని సంతరించుకొంది. ఎన్నెన్నో స్వరూపాలతో ప్రతిరోజూ మనం మాట్లాడే వాక్యాల్లో సాక్షాత్కరిస్తూనే ఉంది.

కాగా ప్రకృతిలోని ఈ పోలిక ఉందా లేదా? దాన్ని ఇతడే కనుక్కొన్నాడనే నియమముందా? అందుకే వేదకవికూడా తాను చూసిన సృష్టిలో ఎన్నో విచిత్రాలు కనుక్కున్నాడు. దాన్ని ఎన్నోవిధాలుగా భావన చేశాడు. తన భావాలకు శాబ్దిక రూపాన్ని ఇచ్చి మనకందించాడు. మనం కనుక్కొనేవి గాని అతను కవులకు కవి. క్రాంతదర్శుడే కాదు. అతిక్రాంతదర్శుడు కూడా।

కావ్యానికి శబ్దం అర్థం రెండూ శరీరం. ఈ రెండింటిలో శబ్దం బాహ్యం. ఇతరవేదాల్లోలా గానే శుక్లయజుస్సంహితలో కూడా శబ్దం ద్వారా కల్గిన చమత్కారం చాలాస్పష్టంగా కనపడుతుంది. ప్రతి ఒక్క అక్షరానికి తన ప్రక్కన ఉన్న ప్రతి ఒక అక్షరంతోనూ పొంతన కుదిరినట్లు కనబడుతుంది. అంతే కాక శబ్దంవల్ల చమత్కారాన్ని కొన్ని వేల రెట్లుగా పెంచడానికి వేదకవి ఎన్నో ప్రక్రియల్ని చేపట్టినట్లు తెలుస్తుంది.

౧. ఒక పదాన్ని గాని, పదసముదాయాన్నిగాని తగిన వ్యవధానంతో ఎన్నోసార్లు ప్రయోగించాడు.

'విదసి వసో౽సి ధీరసి దక్షిణాసి క్షత్రియాసి యజ్ఞియాసి అదితిరసి'
(౪-౧౯)

'.అసి' అన్న పదాన్ని వదలకుండా మరలమరల దగ్గర దగ్గరగా ప్రయోగించడం వాక్యానికి ఒకరకమైన ఊపును పొంపును చేకూర్చింది. ఈ 'అసి' అనే పదం ఇంతటితో ఆగలేదు. రెండు మూడధ్యాయాలదాకా మళ్లా మళ్లా వస్తూనే ఉంది. అలాగే

అను త్వా మాతా మన్యతా మను పితాను భ్రాతా సగర్భ్యోను సఖా స యూథ్యః॥
(౪-౨౦)

అలాగే

సింహ్యసి సపత్నసాహీ దేవేభ్యః కల్పస్వ సింహ్యసి సపత్నసాహీ దేవేభ్యః
శుంధస్వ సింహ్యసి సపత్నసాహీ దేవేభ్యః శుంభస్వ॥ (౫-౧౦)

సింహ్యసి అన్న ఈ పదం యింతటితో ఆగలేదు. ఇంకా సాగిపోతూనే ఉంది.

౨. రెండు మూడు అక్షరాలతోనే పూర్తి మంత్రాన్ని నిర్వహించాడు.:

ధూరసి ధూర్వ ధూర్వంతం ధూర్వతం యో౽స్మాన్।
ధూర్వతి తం ధూర్వ యం వయం ధూర్వామః॥ (౧-౮)

౩. అశ్యామ తం కామమగ్నే తవోతీ అశ్యామ రయిం రయివః సువీరమ్।
అశ్యామ వాజమభి వాజయంతో౽శ్యామ ద్యుమ్నమజరాజరం తే॥ (౧౮-౭౪)

పై మంత్రంలో ఒకే క్రియాపదంతో అన్ని పాదాలు ప్రారంభించే ఈ ఎత్తుగడ చాలా మనోహరంగా ఉంటుంది.

౪. యుష్మచ్ఛబ్దంతోనే మొదలయ్యే అనేక మంత్రాల్ని వరుసగా సమకూర్చడం కూడ మనకు కని పిస్తుంది. ౧౬వ అధ్యాయంలో ౫౪-౬౩ మంత్రాలు వరుసగా యే వృక్షేషు,. యే భూతానాం యే పథాం, యే తీర్థాని, యే౽న్నేషు, యంగిరిత్రా వంటి యే అనే పదాలతో ప్రారంభమై ఆ మంత్రసముదాయానికి చక్కని అందాన్ని ఆపాదిస్తున్నాయి. ఒక్క యుష్మచ్ఛబ్దంతోనే కాక ఇతర శబ్దాలతో కూడా ఈ ప్రక్రియ అవలంబించబడింది. ౧౬,౧౮ అధ్యాయాలయిన రుద్రాధ్యాయ చమకాధ్యాయాల శబ్ద సౌందర్యం తెలియని వారు చాలా అరుదుగా ఉంటారు.

కాగా పూర్వాపరవాక్యాల్నిగాని, ఒక మంత్రంలో వాళ్ళ పాదాల్ని గాని వాయిగు కోరాం మంచి క్రమంగా తీర్చి దిద్దడంలో వేదకవి చాలా శ్రద్ధ తీసుకొన్నాడు.

ఇటువంటి పద - పదసముదాయాల ఆవృత్తి, కవి, మానసిక, ప్రవృత్తివల్లనో, ఆ యా పదార్థాల కివ్వాల్సిన ప్రాధాన్యతవల్లనో, ఆవేదన ఆవేశం మొదలైన బహుభావసంపత్తివల్లనో

ఏర్పడి ఉండవచ్చు. ఏది ఏమైనా శుక్లయజుస్సంహితలోని శబ్దపరమైన చమత్కారానికి ఉదాహరణలివ్వాల్సివస్తే ఒకమారు మొదటినుండి చివరివరకు అన్ని మంత్రాల్నీ వల్లించాల్సివస్తుంది.

అనుభవం అన్నిటినీ మించిన ఉదాహరణం. పండితుడూ - పామరుడూ, ఆస్తికుడూ - నాస్తికుడూ, సహృదయుడూ - అసహృదయుడూ, ఎవరైనా కానీ, శ్రావ్యమైన కంఠంతో సస్వరంగా పలుగురు కలిసి శుక్లయజుస్సంహిత పారాయణం చేస్తూండగా వింటే స్తబ్ధులై - ఆ శబ్ద సౌందర్యానికి ముగ్ధులై ఆ శ్రుతి మాధుర్యాన్ని మాటల్లో చెప్పలేనంతగా అనుభవిస్తారు. అంటారు - అబ్బ! వేదాలు వినటానికి ఎంతహాయిగా ఉంటాయి! అని. రీతిశయ్యాపాకం అని పేరుతో పిలవివారే ఈ సౌందర్యం ఇంతటిదనటానికి వేరే ప్రమాణాలు అవసరంలేదు. ఇంతటి ఈ వేదకవిశక్తికి స్వరం, ఛందస్సు మరింత తోడ్పడతాయి.

౫. ఉపమ :

అర్థ పరమైన చమత్కారాన్ని కూడా వేదకవి విస్మరించలేదు. వివిధ వక్రోక్తులతో యీ సొంపును సంతరించాడు. అందుకు మాటిమాటికి అందరికీ అనువైనది ఉపమ. శుక్ల యజుస్సంహితలో శతాధిక ఉపమలు కన్పడుతున్నాయి. వాటిలో కొన్ని ముఖ్యమైన వాటిని, వాటి చమత్కారాన్ని క్లుప్తంగా పర్యాలోచిద్దాం.

౧. అక్రందదగ్నిః స్తనయన్నివ ద్యౌః క్షామా రేరిహద్వీరుధః సమంజన్।
సద్యో జజ్ఞానో వి హీ మిద్ధో అఖ్యదా రోదసీ భానునా భాత్యంతః॥

(౧౨-౬)

శబ్దం చేస్తున్న అగ్ని గర్జిస్తున్న మేఘంలా ఉందట! మన దృష్టిలో వీటికి సామ్యం లేకపోయినా వేదకవి దృష్టిలో కావాల్సినంత ఉంది. అగ్ని ప్రజ్వరిల్లుతున్నప్పుడు మేఘం వర్షిస్తున్నపుడు ఏర్పడే శబ్దంలో సాదృశ్యాన్ని అనుభవించాడు. భూమిని భూమిమీద వృక్షలతాదులను మొట్టమొదట వ్యాపించడం రెంటిలోను సమం. పుట్టీ పుడుతూనే రెండూ ప్రకాశిస్తాయి. మెరుపు అనే అగ్నితో మేఘం - తనరూపంతో అగ్నీ, అంతరిక్షాన్ని ఆక్రమించడం సమమే. మరి మేఘానికి అగ్నికీ సామ్యం లేకపోవడం ఏమిటి? అందుకే ఈ చక్కని సావయవోపమను భావసేశాడు అంతేకాదు. అంతకన్నా మధురమైన శబ్దంతో వవ కందించాడు. ౧౧క్షామా రేరిహత్ ౨౨ అనడంలో తాత్పర్యం భూమిని కబళించేస్తున్నదనటం. అగ్నిలోని వ్యాపించే స్వభావానికి ఎంత చక్కని శబ్ద చిత్రణ!

౨. మాతేవ పుత్రం బిభృతాప్స్వేనమ్। (౧౨-౩౫)

ఇలాంటి మాతాపుత్రవిషయమైన ఉపమలు ఎన్నో ఉన్నాయి. కానీ దీన్ని చూడండి.

౩. యో వః శివతమో రసః తస్య భాజయతేహ నః
ఉశతీరివ మాతరః॥

అలాన్ని ప్రార్థిస్తున్నాడు. మీలో అత్యంత ప్రధానమైన, కేవల సుఖానికి హేతువైనదేది ఉన్నదో దానికి మేము భోక్తలమయ్యేటట్లు మమ్మల్ని అనుగ్రహించండి. దీనికి దృష్టాంతం బిడ్డలపైన ప్రేమగల తల్లులు. తల్లి బిడ్డకోసమై సారవంతమైన ఆహారాన్ని స్వీకరిస్తుంది. దానినుంచి సారవంతమైన రక్తాన్ని సృష్టించి, మరి దానినుంచి కూడా సారవంతమైన అంశాన్ని పాలుగా బిడ్డకందిస్తుంది. కవిలోని ఈ భావన శివతమం రసం అన్న శబ్దాలలో చక్కగా ప్రతిఫలిస్తుంది. అసలు రసమంటేనే మిక్కిలి సారవంతమైన అంశం అని అర్థం. దానికి మరో విశేషణం ౧శివతమం౨ అని. మరి బిడ్డకు దీనిని మించిన శుభదాయకమేమున్నది?

తప్పటడుగులతో ఇటూ అటూ తిరిగి వచ్చిన చంటిపిల్లలకు తల్లిపడిని మించిన ఆశ్రయం- ఆనందం- శుభం - మరేదీలేదు. అలాగే భస్మరూపంతో వృథివీకణాల్ని పొందిన అగ్నిని మరల తన పుట్టినిల్లయిన ఉఖలో ఉండుమనాలి అని బుజ్జగిస్తున్నాడు.

౪. పునరాసద్య సదన మపశ్చ పృథివీ మగ్నే।
శేషే మాతుర్యథోపస్థే౽న్తరస్యాం శివతమః॥ (౧౨-౩౯)

౫. కువిదఙ్గ యవమన్తో యవం చిద్యథా దాన్త్యను పూర్వం వియూయ।
ఇహేహైషాం కృణుహి భోజనాని యే బర్హిషో నమ ఉక్తిం యజన్తి॥

(౧౦-౩౨)

రైతులు పండిన మొత్తం భూమినుంచి వారి వారి పంటను వారి వారికి విడదీసి ఇస్తారు. నీవుకూడా నీకు హవిస్సునిచ్చే యజమానులందరికీ వారి వారి భోగ్యవస్తువును వారి వారికే యివ్వవలసిందని అగ్నిని ప్రార్థిస్తున్నాడు.

౬. అభో దృగ్నిప్సుమిధా అవాం ప్రతి ధేనుమివాయతీ ముషాసమ్।
యహ్వా ఇవ ప్రవయాముజ్జిహానాః ప్రభానవః సిస్రతే నాకమచ్ఛ॥ (౧౫-౨౪)

తన తల్లిని దూడ చాలాదూరం మంచే గుర్తిస్తుంది. అంతేకాదు; ఎంతో ఆతతో ఉరుకుతూ

తెచ్చిందన్నట్లుగా ఎదురుచూస్తుంది లేచి గంతులేస్తుంది. అలాగే తమోగుణాత్మకమైన రాత్రి ముగిసి తెల్లవారవస్తూందనగానే మానవులు ఎంతో ప్రేమతో ఆనందంతో ఆ ఉదయాన్ని గుర్తిస్తారు, ఆహ్వానిస్తారు. హవ్యంచేత ప్రీతుడైన అగ్ని యజమానుల్ని ఎంత ప్రేమిస్తాడో, ఎంతటి గుర్తింపు చూపుతాడో అన్నదానికి ఈ ఉపమానాలు చక్కని ప్రతిబింబాలు. ఆరాధకునకు ఆరాధ్యునిమీద ప్రేమ - ఒక బాధ్యత. కాని ఆరాధ్యునకు ఆరాధకునిమీద ప్రేమ - అంతకన్నా గొప్పది. ఈ మంత్రంలోని మూడవ ఉపమ తరచు మనం చూచే దృశ్యానికి అనువాదం. ఎత్తైన చెట్ల కొమ్మలనుంచి గుంపులు గుంపులుగా ఎగిరిపోయే పక్షుల్లా అగ్ని జ్వాలలు ఆకాశాన్ని వ్యాపిస్తున్నాయట! ఎంతటి స్వభావ మధురమైన సాదృశ్యభావన!

౭. ఉదగ్నే తిష్ఠ ప్రత్యాతనుష్వ న్యమిత్రాఁ ఓషతాత్ తిగ్మహేతే।
యో నో అరాతిꣳ సమిధాన చక్రే నీచా తం ధక్ష్యత సం న శుష్కమ్
(౧౩-౧౨)

ఎండిపోయిన చెట్టును అగ్ని త్వరగా నలువైపుల వ్యాపించి కాల్చివేస్తుంది. అలాగే తన శత్రువులను కాల్చి వేయుమని ప్రార్థిస్తున్న ఈ కవి మాటలలోని దూకుడు చూడండి, ఎంత కోట్లవచ్చినట్లు కనబడుతుందో!

౮. అగ్నే తమద్యాశ్వం న స్తోమైః క్రతుం న భద్రం
హృదిస్పృశం ఋధ్యామా త ఓహైః॥ (౧౫-౪౪)

సత్పురుషులు ఒక సంకల్పంచేసిన తర్వాత మనసులో మళ్ళా మళ్ళా దాన్ని వృద్ధిపొందిస్తూనే ఉంటారు ఇలా ఆ సంకల్పం కార్య రూపందాల్చేవేళకు పెరిగి పెరిగి ఎంతో గొప్పదవుతుంది. అలాగే ఈ యజ్ఞాన్ని నేను అంతగొప్పగా ఆచరిస్తానని ప్రతిజ్ఞ చేశాడు వేదకవి. మహనీయుల సత్సంకల్పంతో ఉపమ తన సంకల్పానికి మరింత సౌందర్యాన్ని చేకూర్చింది. అశ్వమేధంలో స్తోత్రసంఖ్య చాలా హెచ్చు. అందుకే పెంపుచేయడానికి వైదికోదాహరణంగా దానిని ప్రస్తావించాడు.

౯. ద్రుపదాదివ ముముచానః స్విన్నః స్నాతో మలాదివ।
పూతం పవిత్రేణేవాజ్యమాపః శున్ధన్తు మైనసః (౨౦-౨౦)

పాదుకలను విడిచినవాడు పాదుకాదోషంనుంచి, స్నానం చేసినవాడు చెమటవల్ల కలిగినదోషంనుంచి, శుభ్రమైన వస్త్రంతో వడగట్టిన ఆజ్యం కీటకాలనుంచి ఎలావిడబడుతున్నదో ఓ జలాల్లారా! అలా నన్ను పాపంనుంచి విముక్తుణ్ణి చేయండి!

ఇందులోని మున్ముందైన మూడు ఉపమానాలు మనం నిత్య జీవితంలో అనుభవించే సామాన్యవిషయాలు. కాని పాపవిముక్తి అసామాన్యమైంది. తను ప్రార్థించే దైవానికి అదీ అంతటి పనేనని కాబోలు అలా ప్రార్థించాడు.

ఓషధులను వాడడం కోసం చెప్పబడ్డ ఓషధిసూక్తంలో చక్కని ఉపమలు ఎన్నో ఉన్నాయి. ఒక్కొక్కటి ఎంతో చమత్కారాన్ని చేకూరుస్తుంది. చూడండి.

ఆవుల నపహరించడానికి వచ్చిన దొంగ కోష్ఠంలో మూలమూలకు మరొకరికి తెలియకుండా తిరుగుతాడు. అలానే ఓషధులు కూడా మనకు తెలియకుండానే శరీరంలో ప్రతిభాగాన్ని చేరి అక్కడ ఉన్న వ్యాధిని కట్లు విప్పి పారద్రోలేస్తాయి. (౧౨-౮౪).

ఉరికంబానికి ఎక్కించిన వధ్యుడు ఉరితీయడానికి ముందే ముంచెత్తే దుఃఖంవల్ల చచ్చిపోతాడు. అలా ఓషధుల్ని సేవించడానికి చేతులో పట్టుకున్నంత మాత్రాన్నే రోగాలు నశించాయట! కారణం లేకుండానే కార్యం సిద్ధించిందట! అతిశయోక్తితోకూడిన ఈ ఉపమ మరింత అతిశయాన్ని సంతరించుకుంది. (౧౨-౮౫).

శత్రువుల మర్మాన్ని భేదించగల శరకవచధారియైన శూరుడు తను ఏ శత్రు సమూహంలో ప్రవేశించినా అక్కడున్న శత్రువుల నందరినీ ఎలా హతమారుస్తాడో అలా మీరు ఏ శరీరాన్ని పొందినా అందులోని రోగాల్ని సమూలంగా నాశనం చెయ్యమని ఓషధుల్ని అభ్యర్థించాడు (౧౨-౮౬).

౬. కల్పన :

ఇందులోని కల్పనల్లో విదగ్ధతకు కొరతలేదు. రూపయౌవన లావణ్య సంపన్నలైన అభిసారికలు సునాయ మనస్కలై చిరునవ్వులు చిలకరిస్తూ ప్రియుణ్ణి జేరినట్లుగా, శృంగారభావాలను ఒలకపోస్తూ ఘృతధారలు అగ్నిని చేరుకున్నాయట! తమ రాకతో అగ్నిని ఉద్దీప్తుణ్ణిగా చేశాయట! తనుకోరి తన దగ్గరికి చేరిన యువతిని నాయకుడు ఉపేక్షించగలడా ? అగ్నికూడా ఉపేక్ష చేయకుండా ఘృతధారల్ని తనలో చేర్చుకున్నాడట! ఎంతటి లలితమైన కల్పన! (౧౭-౯౬).

ఇలా ఎన్నో ఉపమానాలు - ఎన్నో కల్పనలు - ఎన్నో రమణీయభావాలు మనకు కనబడతాయి. శుక్ల యజుస్సంహితలో

౭. స్వభావోక్తి :

స్వభావోక్తులు కూడా కావాల్సినన్ని.

**ఉత్తిష్ఠన్నోజసా సహ పీత్వీ శిప్రే అవేపయః** (౮-౩౯).

ఇంద్రుడు సోమం త్రాగి లేస్తూ ముక్కుపుటాల్ని ఎగరవేశాడు. ప్రీతికరమైన ఆహారాన్ని తీసుకున్నపుడు ముక్కు పుటాల్లో కలిగే సంకోచవ్యాకోచాల్లాంటి చాలా స్వల్పమైన విషయాలనుకూడా ఆదరించి చెప్పడం స్వాభావికతను సమకూర్చింది. సుకుమారమైన హాస్యం కూడా ఇందులో కనబడుతుంది.

**ఉతస్య వాజీ క్షిపణిం తురణ్యతి గ్రీవాయాం బద్ధో అపికక్ష ఆసని।**
**క్రతుం దధిక్రా అనుసంతవీత్వత్ పథామంకాంస్యన్వాపనీఫణత్స్వాహా॥**

**ఉతస్మాస్య ద్రవతః తురణ్యతః పర్ణం న వేరనువాతి ప్రగర్ధినః।**
**శ్యేనస్యేవ ధ్రజతో అంకసం పరి దధిక్రావ్ణః సహోర్జా తరిత్రతః స్వాహా॥**
(౯-౧౪,౧౫)

లౌకిక కవులకు కూడా ఆదర్శమైన వేదకవి చేసిన అశ్వవర్ణన ఇది. నోట్లో కళ్ళెం. వీపున పర్యాణం. మెడలో, వక్షంలో పాశబంధం. కొరడాను త్వరపెడుతూ పరుగిడుతోందట! రౌతు మనసునెరిగి ఎత్తు పల్లాల్ని సరిచేసుకొని పరుగిడుతోందట! ఇలా పరుగెత్తే అశ్వం వేగానికి కొంబర్లలాగా వాయువేగంవల్ల పైకి ఎగిరిన రెండు అస్తరణపు కొనలు రెక్కల్లా ప్రకాశిస్తూ అశ్వానికి డేగ పోలికను సమకూరుస్తున్నాయట! గమ్యంతో పోటీ పడి ఎప్పుడు దాన్ని చేరుతానా అన్న ఆకాంక్షతో పరుగిడుతోందట!

౮. ప్రశ్నోత్తరిక :

ఈ రెండలంకారాల తర్వాత ఎక్కువగా మనకు కనబడేది ప్రశ్నోత్తరిక, ప్రశ్నోత్తరికలనే సర్వశాస్త్రాలకు పుట్టినిల్లుగదా ! వేదం. ఉత్తరగర్భ అయిన ఈ ప్రశ్నోత్తరికలోని సొగసు చూడండి.

**కోఽసి కతమోఽసి కస్యాసి కో నామాసి?** (౭-౨౯)

ఇందులో-కః అసి? నీ వెవడవు అని ప్రశ్న. కః అసి : నీవు ప్రజాపతివి అగుచున్నావు అని సమాధానము. ఆ వాక్యమే ప్రశ్న - ఆ వాక్యమే సమాధానం. ఇది కాక ౧-౬,౭--౪౮,౧౭-౧౮,౨౦,౨౩-౯,౨౩-౪౭ మంత్రాల్లో కూడా ఈ ప్రశ్నోత్తరికావైచిత్ర్యం కానవస్తుంది. ౨౩-౪౫ నుంచి ౨౩-౬౨ వరకు గల ౨౦ మంత్రాలు బ్రహ్మోద్యప్రకరణం అని పిలవబడుతున్నాయి. దీనిలో ప్రతి మంత్రంలోనూ ప్రశ్న సమాధానాలు కనబడతాయి. అంతేగాక వేదాల్లోని నాటకీయతకు కూడ ఈ ప్రకరణం చక్కని మచ్చుతునక.

౯. శ్లేష :

వక్రోక్తి ప్రధానమైన శ్లేషాదులను కూడా ఎక్కువగా గ్రహింపబడ్డాయి.

**హంసః శుచిషద్ వసురంతరిక్షసద్ హోతా వేదిషద్ అతిథిర్దురోణసత్।**
**నృషద వరసద్ ఋతసద్వ్యోమసద్ అబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్॥** (౧౦-౨౪)

రాజసూయానికి అంగంగా రాజు రథం నుండి క్రిందికి దిగేటప్పుడు వినియోగింపబడే మంత్రం ఇది. ఇందులో హంసః అన్న పదానికి సూర్యుడూ అని, పరమాత్మ అని రెండర్థాలూ వివక్షింపబడ్డాయి. దాన్నిబట్టి తరువాత ఉండే విశేషణాలు కన్నిటికీ కూడ సూర్యపరంగా రథపరంగా రెండర్థాలు వివక్షింపబడ్డాయి.

**సుపర్ణోఽసి గరుత్మాన్** (౧౨-౪)

అగ్నిచయనంలోని మంత్రం యిది. అగ్ని పక్ష్యాకారంగా పేర్చబడ్డాడు. అందుకే గరుత్మంతుడనే పక్షిగానే అగ్నినిరూపణ అయితే అవయవాలకు రూపణం జరిగింది. మరి అవయవాలకు కూడా ఈ రూపణ చేయాలి గదా ! అందుకే త్రివృత్తే శిరః మొ॥ వాక్యాలతో అగ్ని అవయవాలన్నింటికి పక్ష్యవయవాలతో రూపణచేసి-

**సుపర్ణోఽసి గరుత్మాన్దివంగచ్ఛ స్వః పత**

మంచిరెక్కలుగల గరుత్మంతుడవే పక్షివి గదా నీవు! కనుక ద్యులోకానికి, స్వర్గానికి ఎగిరిపో! అని అగ్నిని ప్రార్థించాడు. ఇందులో పరిణామచ్ఛాయలు కూడా ఉన్నాయనవచ్చు. అలాగే

**ఇమం స్తన మూర్జస్వన్తం ధయాపాం ప్రపీనమగ్నే సరిరస్య మధ్యే**(౧౩-౪౨)

అన్నమంత్రంలో స్రుక్కు సుస్తనంగా రూపణ చేస్తాడు. రెంటికీ సమానధర్మం రసవంతమైయుండటం, ఘృతంతో, పాలతో నిండియుండటం. ఈ స్రుక్-స్థానాన్ని పానంచేయుమని అగ్నిని ప్రార్థించాడు.

౧౦. అతిశయోక్తి :

మరి అతిశయపు మాటలు కూడా ఈ సంహితలో మెండే.

ద్యామగ్రేణా స్పృక్షః (౬-౨)

నీవు నీపైభాగంతో ద్యులోకాన్ని తాకావని ద్యులోకానికి యూపానికిలేని సంబంధాన్ని ఉందని చెపుతాడు.

**వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్।**

**దక్షిణా శ్రద్ధామాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే ॥ (౧౯-౩౦)**

దీంట్లో కారణమాల స్పష్టమేకదా!

ఇలా ఎన్నో వక్రోక్తి ప్రభేదాలతో అడుగడుగునా చమత్కరిస్తుంటాడు వేదకవి. మరోవిధమైన సౌందర్యాన్ని గమనిద్దాం!

యునక్త సీరా వియుగా తనుధ్వం కృతే యోనౌ వపతేహ బీజమ్।

గిరా చ శ్రుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్సృణ్యః పక్వమేయాత్ ॥ (౧౨-౬౮)

ఓ రైతులారా! నాగలి నొగలు కలపండి. ఎద్దుల్ని కట్టండి. దున్నిన భూమిలో విత్తువేయండి. ఇరుగో! అన్నట్లు ఎదిగివచ్చిన పంటను కోయండి. ధాన్యాదులు మెండుగా పండాలి! ఎంత కమ్మని ఏరువాక పిలుపు!

శుక్లయజుస్సంహితలో వీరరసమే తరచు వ్యక్తమవుతుంది. ఇంద్రాదుల్ని వర్ణించేటప్పుడు వారిలోని ఉత్సాహశక్తి స్పష్టంగా కనపడుతుంది. ఉత్సాహమే వీరానికి స్థాయి. ఉత్సాహం ఏ విషయంగా ఉన్నా అది ఒక వీరరసప్రభేదం కావడానికి సందేహం లేదు. అప్రతిరథసూక్తంలో (౧౭-౩౩-౪౪) యుద్ధాన్ని ఎంతో ఓజోయుతంగా వర్ణించాడు. వీరరసానికిది మచ్చుతునక. శృంగారం కూడా కొన్ని స్థలాల్లో కనబడుతుంది. ఒకటి రెండు ఉదాహరణలు పైన ఇచ్చాను.

వచనసౌష్ఠవం ఔచిత్య వక్రోక్తిసంభరితం అయిన మంత్రవాఙ్మయాన్ని దర్శించిన మహాకవి వివశ అగ్నిని ఇలా ప్రార్థించాడు :

**అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్।**

**యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥**

(౪౦-౧౬)

ఓ అగ్నీ! మమ్ము దేవయానమార్గం ద్వారా మోక్షాన్ని పొందించు. సమస్తమైన సమ్యగ్జ్ఞానాలను మాకు అనుగ్రహించు. మా శ్రేయః ప్రతిబంధకమైన పాపాన్ని నశింపజేయి. నీకు మరల మరల నమస్కారాలు సమర్పిస్తున్నాం.

## అధ్యాయాలు - సంగ్రహసమీక్ష

'యజుర్యజనాత్' అని సాయణాచార్యుడు చెప్పాడు. యాగాన్ని నెరవేర్చేది యజుర్వేదం. వేదార్థజ్ఞానానికి యజ్ఞానుష్ఠానమే ప్రయోజనం. యజ్ఞంలో యజుర్వేదమే ప్రధానమైంది. ఇది వేదమూర్ధన్యమవడానికి 'యజ్ఞస్య మాత్రాం విమిమీత ఉ త్వః' అని ఋగ్వేదం (౧౦-౭౧-౧౧) సాక్ష్యం పలుకుతున్నది. అధ్వర్యుడు అభిషవ గ్రహణాది క్రియలచేత యజ్ఞశరీరాన్ని నిర్మిస్తున్నాడు. ఋగ్వేదంలో (౧౦-౪౧-౩) అధ్వర్యుడు 'సుహస్త్య,' 'మధుపాణి' అని పిలువబడ్డాడు. అధ్వరం యునక్తీత్యధ్వర్యుః అకారలోపంతో అధ్వర్యుః' అంటే యజ్ఞానికి 'నేత' అని అర్థం.

యజ్ఞంలో అందరి పనులను సరిగా సవరించుకొంటూ నడిపించేవాడు అధ్వర్యుడు. అతడు యజుస్సులను పఠిస్తాడు. కాబట్టి యజుర్వేదానికి 'అధ్వర్యువేద' మని పేరు. యాగాన్ని నడిపించే బాధ్యత అధ్వర్యునిది. యాగాలను విభజిస్తూ ఆ యాగకర్మల వ్యాఖ్యానాన్ని బ్రాహ్మణ భాగాలు బోధిస్తాయి. ఆ బ్రాహ్మణ భాగంతో మంత్రాలను కలిపి కూర్చినందువల్ల యజుర్వేద సంహితాపాఠంలోనే బ్రాహ్మణం కలిసిపోయింది. దీనిచేత మంత్రబ్రాహ్మణాత్మకో హి వేదః 'అనే లక్షణం వేరువేరుగా ఉన్న ఇతర వేదాలకంటే మంత్రబ్రాహ్మణాలు రెండూ కలిసి ఉన్న యజుర్వేదంలోనే సార్థకమవుతున్నది.

కర్మకాండవిషయంలో యజుర్వేదమే ప్రాధాన్యం వహించింది. కర్మల అనుపూర్వి, స్వరూపం యజుర్వేదంలోనే ఉంది. కనుక యజుర్వేదం గోడలాంటిది. ఋక్సామలు దానిపైన గీచిన బొమ్మల్లాంటివి. యజుర్వేదం సనాతనమైంది. సకల యజ్ఞ కలాపానికి ఆధారభూతమైంది.

### యజుశ్శాఖలు :

యజుర్వేదం ప్రవర్తక - ప్రవచనభేదాలతో అనేక శాఖలు కలది. యజుర్వేదశాఖలు ౧౦౧ వీటిలో కృష్ణ యజుర్వేద శాఖలు ౮౬. శుక్ల యజుర్వేద శాఖలు ౧౫. కృష్ణయజుశ్శాఖకు ఉపశాఖలు గూడ ఏర్పడ్డాయి. అందుచేత యజుశ్శాఖలు మొత్తం ౧౦౦. ఏకశతమధ్వర్యు శాఖాః అని పతంజలి మహాభాష్యంలో పేర్కొన్నాడు. వీటిలో సంహితాపాఠభేదంవల్ల వెలసినవి రెండే శాఖలు. ప్రవర్తకుల పేర్లవల్ల మిగతావి ఏర్పడ్డాయి.

యజుర్వేదం సంప్రదాయభేదం చేత రెండు విధాలైంది. బ్రహ్మ సంప్రదాయం 'కృష్ణయజుస్సని', ఆదిత్యసంప్రదాయం 'శుక్లయజుస్సు' అని వ్యవహరింపబడుతున్నది. ప్రకరణ సంకీర్ణత్వముచేత బుద్ధి మాలిన్యానికి హేతువైంది కృష్ణయజుశ్శాఖ అని, ప్రకరణాల ఏర్పాటు విశదంగా ఉన్నది శుక్లయజుశ్శాఖ అని శుక్ల యజుః ప్రాతిశాఖ్య పరిశిష్ట భాష్యకారుడు నిర్వచించాడు. కృష్ణశుక్లయజుశ్శాఖలు రెండింటిలోను అధ్వర్యవప్రయోగమే ప్రతిపాదింపబడింది. అయినా అని మంత్రపాఠ భేదాలతో ప్రయోగవిశేషంతో చాలా భిన్నంగా ఉన్నాయి. ఈ ప్రయోగవైవిధ్యం అనుష్ఠానభేదంచేత వ్యవస్థితమై ఉంది. యజుర్వేదానికి కాఠక, కపిష్ఠ (ష్ఠ) లకఠ, మైత్రాయణీ, తైత్తిరీయ. వాజసనేయ అనే శాఖలున్నాయి. వీటిలో మొదటి నాలుగు కృష్ణయజుర్వేదానికి చెందినవి. వాజసనేయశాఖ శుక్లయజుర్వేదానికి చెందింది.

## శుక్లయజుర్వేదం (వాజసనేయసంహిత) :

వేదవ్యాసమహర్షి వైశంపాయనునికి యజుర్వేదాన్ని బోధించాడు. వైశంపాయనునివల్ల యాజ్ఞవల్క్య మహర్షి యజుర్వేదాన్ని అధ్యయనం చేశాడు. విధివిలాసం చేత గురువుతో వివాదపడి యాజ్ఞవల్క్యుడుచదువుకున్న వేదాన్ని పరిత్యజించాడు. ఈ సంహితా పాఠానికే కృష్ణయజుర్వేద మని తైత్తిరీయసంహిత అని పేరు ఏర్పడింది. అనంతరం యాజ్ఞవల్క్యుడు ఉగ్రతపస్సు చేసి సూర్యుని సంతృప్తిపరిచాడు. ఆదిత్యుడు సంతసించి యజుర్వేదాన్ని ఉపదేశించాడు. కాబట్టి ఇది వాజసనేయశాఖ అని పేరు పొందింది.

వంశబ్రాహ్మణంలో 'ఆదిత్యానీమాని శుక్లాని యజూంషి.' వాజస నేయేన యాజ్ఞవల్క్యేన ఆఖ్యాయంతే అని ఉన్నది. ఈ వేదవాక్యాలు ఆదిత్యునిచేత అధ్యాపనం చేయబడ్డ కారణంచేత 'ఆదిత్యాని' అని అనబడ్డాయి. 'వాజః' అంటే అన్నం. 'అన్నం వై వాజః' అని శ్రుతి. సనిః అంటే దానం. వాజస్య సనిః వాజసనిః అన్నదాత అని అర్థం. తస్య పుత్రః ఆయన కుమారుడు వాజసనేయుడు. ఈ వాజస నేయునికే యాజ్ఞవల్క్యుడని నామధేయం. ఇతడు బ్రహ్మరాతుడు, వాజసని అనే పేర్లు కల దేవరాతుని కుమారుడు. వాజసని కుమారుడైన యాజ్ఞవల్క్యమహర్షి శుక్లయజుశ్శాఖా ప్రవర్తకుడు కావటంచేత దీనికి 'వాజసనేయ సంహిత' అనే పేరు కలిగింది.

### శుక్లయజుర్వేద శాఖలు :

యాజ్ఞవల్క్యుడు శుక్లయజుర్వేదాన్ని కాణ్వుడు మొ॥ పదిహేనుగురు శిష్యులకు ఉపదేశించాడు. వారిద్వారా శుక్లయజుర్వేదానికి ౧౫ శాఖలు ఏర్పడ్డాయి.

శుక్లయజుర్వేదంలో కర్మకాండ, బ్రహ్మకాండ (జ్ఞానకాండ) అని రెండు విభాగాలున్నాయి. సంహిత, శతపథబ్రాహ్మణం కర్మకాండ అని, ఈశావాస్యోపనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తులు బ్రహ్మకాండ అని వ్యవహరింపబడుతున్నాయి.

ఈ వాజసనేయసంహితకు పదపాఠం ఉంది. కాణ్వసంహితకు సాయణాచార్యుడు (వేదార్థప్రకాశ), అనంతాచార్యుడు (వేదార్థదీపిక) భాష్యాలను వ్రాశారు. మాధ్యందినసంహితకు ఉవటుడు, మహీధరుడు (వేదదీపం) భాష్యాలను చేశారు. మహర్షి దయానందుడు శుక్లయజుర్వేదానికి సంపూర్ణ భాష్యం వ్రాశాడు.

### మాధ్యందిన వాజసనేయసంహిత :

వాజసనేయసంహితలో ౪౦ అధ్యాయాలున్నాయి. వీటిల్లో ౧౯౭౫ మంత్రాలు ఉన్నాయి. ౧-౩౯ అధ్యాయాలు కర్మవిధులను బోధించగా, ౪౦వ అధ్యాయం బ్రహ్మజ్ఞానాన్ని బోధిస్తుంది. దీనికి 'ఈశావాస్యోపనిషత్తు' అని పేరు. ఈ సంహితలోని ౧౬ వ అధ్యాయం శతరుద్రీయం, ౩౧వ అధ్యాయం 'పురుషసూక్తం'. ౩౪ వ అధ్యాయంలోని మొదటి ఆరు మంత్రాలు 'శివసంకల్పం' గా ప్రసిద్ధినందాయి.

వాజసనేయసంహిత కర్మకాండతో ప్రారంభమై బ్రహ్మకాండతో ముగిసింది. బ్రహ్మకాండకే ప్రాధాన్యం అంగీకరించాల్సి ఉన్నా, చిత్తశుద్ధిలేని పురుషునికి బ్రహ్మకాండలో అధికారంలేదు. కాబట్టి చిత్తశుద్ధియానెన్నిన అధికారాన్ని సంపాదించడానికి కర్మలను బోధించాలి. కనుక కర్మకాండ మొదట చెప్పబడింది.

ప్రకృతికర్మలు, వికృతికర్మలు అని కర్మలు రెండు విధాలు. ఏ కర్మలో అంగాలన్నీ సంపూర్ణంగా ఉపదేశింపబడతాయో అది ప్రకృతి. వికృతికర్మలో అయా కర్మలకు

సంబంధించిన విశేషాంగాలు మాత్రమే ఉపదేశింపబడతాయి. మిగిలిన అంగాలన్నింటినీ ప్రకృతి కర్మనుంచి అతిదేశం చేసుకోవాలి. ఆ కారణంచేత వికృతులకు ప్రకర్షలేదు.

అగ్నిహోత్రం, ఇష్టి, సోమం అనేవి ప్రకృతికర్మలు. వీటిలో ఆయా కర్మకు సంబంధించిన అంగాలన్నీ సంపూర్ణంగా ఉపదేశించబడ్డాయి. ఇందులో అగ్నిహోత్రం, సోమయాగం, దర్శపూర్ణమాసేష్టి మీద ఆధారపడి ఉన్నాయి. కనుక దర్శపూర్ణమాసేష్టి ముఖ్యమైంది.

ఈ సంహితలో ఆధ్వర్యవాలు, యాజమానాలు, హౌత్రాలు అని మూడు విధాలైన దర్శపూర్ణమాసేష్టి మంత్రాలు ఉన్నాయి. శుక్లయజుర్వేదశాఖీయ శతపథ బ్రాహ్మణం ఈ మంత్రాలతో కూడిన దర్శపూర్ణ మాసేష్టితో ప్రారంభమైంది.

**అధ్యాయాల వివరణ :**

ఈ సంహితలోని ౧-౨ అధ్యాయాల్లో దర్శపూర్ణమాసేష్టిమంత్రాలు, పితృయజ్ఞమంత్రాలు ఉన్నాయి. దర్శపూర్ణమాసేష్టి ఏకాహం (ఒక్కరోజు చేసే యజ్ఞం). అగ్నిసోములు ప్రధానదేవతలు. పాలు, పెరుగు, నెయ్యి, పురోడాశం ప్రధాన హవ్యాలు.

3వ అధ్యాయంలో అగ్న్యుపస్థాన, చాతుర్మాస్య యజ్ఞాలు చెప్పబడ్డాయి. గార్హపత్యాగ్ని హోత్రం గృహస్థజీవితానికి మూలాధారం. యజమాని ప్రాతస్సాయంసంధ్యలలో అగ్నిహోత్రాన్ని పూజించాలి. చాతుర్మాస్యయజ్ఞాలు మూడు. వసంతర్తు ప్రారంభంలో వైశ్వదేవం (మరుత్తు అధిదేవత), వర్షఋతువులో వరుణప్రఘాస (వరుణుడు), శరదృతువులో సాకమేధం (రుద్రత్ర్యంబక) చేస్తారు.

౪వ అధ్యాయంలో అగ్నిష్టోమయాగానికి సంబంధించిన ఋత్విక యజమానుల శాలాప్రవేశమంత్రాలు ఉన్నాయి.

౫ లో సామిక వేదినిర్మాణం, ఆతిథ్యం, యూపనిర్మాణం వర్ణించబడ్డాయి.

౬ లో యూపసంస్కారం, సోమాభిషవ మంత్రాలు ఉన్నాయి.

౭ లో ఉపాంశుగ్రహం మొదలైన యజ్ఞాలలో చెప్పాల్సిన దక్షిణాదాన మంత్రాలున్నాయి.

౮ లో తృతీయ సవనంలోని ఆదిత్యగ్రహాదిమంత్రాలు ఉన్నాయి. వైదికయజ్ఞాలలో ప్రధానమైనవి సోమయజ్ఞాలు. వీటిలో అగ్నిష్టోమం ప్రధానమైంది. ఇది ఏకాహం. మిగతా ఆరు యజ్ఞాలు దీన్నుంచి ఏర్పడ్డవే. అవి ఉక్థ్య, షోడశి, అత్యగ్నిష్టోమ, అతిరాత్ర, అప్తోర్యామ, వాజపేయాలు. అగ్నిష్టోమం ఋతుసంబంధమైన యజ్ఞం. ఇది వసంత ఋతువులో చేయబడుతుంది. సోమలతను కొనడం, ఊరేగింపుగా యజ్ఞశాలకు తీసుకొనిరావడం, ఆతిథ్యం, సోమరసాన్ని తయారుచేయడం, దేవతల కర్పించడం, సోమపానం ఇందులో ప్రధానాంగాలు. అగ్నిసోములు ప్రధాన దేవతలు. ఇంద్రునికి ప్రముఖస్థానం ఉంది. సోమయాగంలో అరణి (అగ్నిని ఉత్పత్తిచేసే సాధనం) ఊర్వశీ పురూరవులుగా వర్ణింపబడింది.

౯,౧౦ అధ్యాయాలలో వాజపేయ, రాజసూయ, సౌత్రామణి యజ్ఞాలు చెప్పబడ్డాయి. వాజపేయం (విజయపానం) సోమయాగాలలో ఒకటి. అహీనయాగం (రెండు మొదలు పన్నెండు రోజుల వరకు చేసేయజ్ఞం) ౧౭ రథాల పందెం, అందులో యజమాని విజయం ముఖ్యాంగాలు. యజమాని కళత్ర ద్వితీయుడై పవిత్రమైన విజయధ్వజాన్ని అధిరోహిస్తాడు. ధ్వజంపై నున్న చక్రం సూర్యునికి ప్రతీకగా ఉంటుంది.

రాజసూయం రాజులు తమ సార్వభౌమత్వాన్ని చాటడానికి చేసే యాగం; అహీనం. రాజు పులితోలు పరచిన ఉదుంబర (మేడికఱ్ఱ) సింహాసనంపై కూర్చుంటాడు. ఋత్విక్కులు, ప్రజాప్రతినిధులు క్రమంగా రాజుపై నీళ్ళు, నెయ్యి, తేనె మొదలైన వాటిని ప్రోక్షిస్తారు. ఈ విధంగా రాజపవిత్రీకరణం జరుగుతుంది. రాజు అధ్వర్యునితో పాచికలాడటం ముఖ్యాంశం. తరువాత దశపేయం ఉంటుంది. రాజసూయం చేయడంచేత రాజు ప్రజాపతితో తాదాత్మ్యం పొందుతాడు. రాజసూయంలో రత్నహవిస్సు అనే కలాపంవల్ల అధికారులకు రత్నినః (రత్నాలు కలవారు) అనే పేరు కలిగింది. వారు పురోహిత, సూత, సంగ్రహీత, అక్షావాప, క్షత్రి, గోవికర్తన, పాలాగల, తక్ష, రథకారాదులు.

౧౧-౧౮ అధ్యాయాల్లో అగ్నిచయనం సాంగోపాంగంగా వివరించబడింది. అగ్నిచయనంలో వేదికానిర్మాణం సోమయాగంతో కలిపి చేస్తారు. ఇందులో ౧౦,౮౦౦ ఇటుకలతో రెక్కలు విప్పి ఉన్న డేగ ఆకారంలో అగ్నివేదిక నిర్మింపబడుతుంది. అగ్ని ప్రధానదైవం. ఇటుకలు తయారుచేయడం నుంచి వేదినిర్మాణం వరకు గల అన్నికార్యాలు మంత్రాలతో ఉత్సవంగా చేస్తారు. ఇందులో రుద్రవైశ్వానర దేవతలకు ప్రముఖస్థానం ఉంది.

౧౬ వ అధ్యాయంలో శతరుద్రీయం అనే మంత్రాలున్నాయి. ఇందులో రుద్రుని శతనామావళి పేర్కొనబడింది. తర్వాతికాలంలో ఇవి అన్నీ శివునికి చెందినాయి. వీటిలో ముఖ్యమైన శివ-ఈశాన మహాదేవ అనే పేర్లు చెప్పబడలేదు. శతరుద్రీయం ఉపనిషత్తుగా, శైవానికి చెందిన ప్రముఖగ్రంథంగా పరిగణింపబడుతోంది.

వేదోऽఖిలో ధర్మమూలమ్ | ఓ3మ్ | కృణ్వంతో విశ్వమార్యమ్

వేదమూలమిదం జ్ఞానమ్

# సామవేద - సంహిత

(ఋషి, దేవత, ఛన్దస్సు, స్వరము, మంత్రానుక్రమణిక, పరిచయము సహితముగా)


భాష్యానువాదకులు, సంపాదకులు, పరిశోధకులు

*సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద*

**ఆచార్య వంష్టి కృష్ణారెడ్డి** ఎం.ఏ.,ఎం.ఎడ్. (పి.హెచ్‌డి.)

ప్రధానాచార్యులు

*శ్రీ బిజ్జ అనంతయ్య స్మారక ప్రాచ్యకళాశాల, షాద్‌నగర్, మహబూబ్‌నగర్ జిల్లా.*

# సామవేద పరిచయము

# సామవేద పరిచయము

"వేదానాం సామవేదోఽస్మి" అని శ్రీకృష్ణభగవానుడు చెప్పిన గీతావాక్యము వలన సామవేదమునకుగల ఉత్కృష్టత స్పష్టమగుచున్నది. ఛాందోగ్యములో "సామ్న ఉద్గీథో రసః" అని చెప్పబడినది. ఉద్గీథ అనగా ఓంకారము. "ప్రణవః సర్వవేదేషు", "ఓంకారః సర్వవేదానాం" ఇత్యాది వచనముల వలన ఓంకార ప్రాశస్త్యము తెలుపడును. ఇట్టి ఓంకారమాత్మకమైన దగుటచేతనే సామవేదము వేదముల కెల్ల తలమానికము వంటిదని భావింపబడుచున్నది. "సామాని యో వేత్తి స వేదతత్త్వమ్" అని సామమెరిగిన వానికే తత్త్వజ్ఞాన మబ్బునని చెప్పబడినది. ఋగ్వేదములో పలుచోట్ల సామము ప్రశంసింపబడినది. వైరూప, బృహద్, రైవత, గాయత్రి భద్రాది సామములు కొన్ని ఋగ్వేదములో పేర్కొనబడినవి. యజుర్వేదములో రథంతర, వైరాజ, వైఖానస, వామదేవ్య, శాక్వర, రైవత, అభీవర్తాది సామములు పేర్కొనబడినవి. "ఋచం సామ యజామహే" అని అథర్వవేదము కూడ సామమును కీర్తించినది. ఐతరేయమున వైధస, కారవ, శ్యైతాజయ, అగ్నిష్టోమీయ సామములు స్మరింపబడినవి. "న సామ యజ్ఞో భవతి" అని సామము లేనిదే యజ్ఞమే లేదని చెప్పబడినది.

సామవేదములోని మంత్రములు నాటికి కొన్ని పేర్ల వరకు ఋగ్వేదము నుండి గ్రహింపబడినవే "ఋచి అధ్యూఢం సామ" అని ఋక్కులనే ఆధారముగాగొని సామము తేర్పడుటచే ఛాందోగ్యమున వీనికి పతిపత్నీభావ మూహింపబడినది. బృహదారణ్యకములో "సా చ అమశ్చేతి తత్ సామ్నః సామత్వమ్" అని ఋక్కులపై గాంధారాది స్వరములు చేర్చినందున సామమేర్పడు నదియు కనుకనే అది 'సామము', అనగా 'గానము', అని పిల్వబడుననియు చెప్పబడినది. "గీతిషు సామాఖ్యా" అని జైమినిగేయమంత్రములకే సామమను పేరు వర్తించునని చెప్పెను. వేదవ్యాసుని వద్ద మొదలు ఈ సామవేదమును జైమిని చదివెను. అతని వద్దనుండి యిది అతని శిష్యప్రశిష్యులకు సంక్రమించెను. శిష్యబాహుళ్యము శాఖా బాహుళ్యమునకు దారితీసి యిది సహస్రశాఖలుగా విస్తరిల్లెను. ఒకప్పుడు దీనికి ఉదీచ్యప్రాచ్యశాఖ లని రెండు ముఖ్యశాఖా భేదము లుండెను. కాని నేడు సామవేదులు దాక్షిణాత్య ప్రతీచ్యశాఖానుయాయులుగనే కాన్పింతురు. శాఖలు కూడ మూడే మిగిలినవి. వానిలో కౌథుమశాఖ గుజరాతులోని నాగర బ్రాహ్మణులలో నిలిచినది. రాణాయణీ శాఖ మహారాష్ట్రములోను, దక్షిణమున రామేశ్వర ప్రాంతమునను మిగిలినది. జైమినిశాఖ కర్ణాటకమున ప్రచారములో నున్నది. ఈ మూడిటి సంహితయును అచ్చయినవి.

**మొదలు - చివర :**

ఈ సంహిత "అగ్న ఆయాహి వీతయే" అనే అగ్నిదేవతా మంత్రంతో ప్రారంభమై "స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః" అనే స్వస్తి మంత్రంతో పూర్తవుతున్నది.

సామసంహిత పూర్వార్చికమని, ఉత్తరార్చికమని రెండుగా విభజింపబడింది. ఋక్కుల సమూహానికే ఆర్చిక మని పేరు పూర్వార్చికంలో ఆరు ప్రపాఠకాలున్నాయి. ప్రతి ప్రపాఠకం రెండు అధ్యాయాలుగా విభజింపబడింది. అలా పూర్వార్చికంలో మొత్తం ౧౨ అధ్యాయాలున్నాయి. మొదటి ఐదు ప్రపాఠకాలలోను, ప్రతి ప్రపాఠకంలో పది దశతులుంటాయి. పదిమంత్రాలున్న భాగానికి 'దశతి' అని పేరు. ఆరవ ప్రపాఠకంలోను తొమ్మిది దశతులు మాత్రమే ఉన్నాయి. ఇలా పూర్వార్చికంలో ఆరు ప్రపాఠకాలు, పన్నెండు అధ్యాయాలు, ఏభైతొమ్మిది దశతులు ఉన్నాయి.

అందులో మొదటి పన్నెండు దశతుల్లో అగ్నిస్తుతి కనబడుతుంది. తరువాతి ముప్పైఆరు దశతుల్లో సోమపానం చేసే ఇంద్రుడు స్తుతింపబడ్డాడు. చివరి పదకొండు దశతుల్లో సోమస్తుతి గోచరిస్తుంది.

ఉత్తరార్చికంలో తొమ్మిది ప్రపాఠకాలున్నాయి అందులో ప్రతి ప్రపాఠకంలోను అర్ధ మనే పేరుతో రెండుగాని లేక మూడుగాని విభాగాలున్నాయి. వీటికే అధ్యాయాలని కూడా పేరు. ప్రతి విభాగంలోను దాదాపు మూడు మంత్రాలున్నాయి. ఇందులోని ప్రతి మొదటి మంత్రం ప్రథమార్చికంలో కూడ కనబడుతుంది. ఇందులో మొదటి అయిదు ప్రపాఠకాల్లో రెండేసి అధ్యాయాల చొప్పున, చివరి నాలుగు ప్రపాఠకాల్లో మూడేసి అధ్యాయాల చొప్పున మొత్తం తొమ్మిది ప్రపాఠకాల్లో ౨౨ అధ్యాయాలున్నాయి.

ఈ రెండు ఆర్చికాలకు మధ్య 'మహానామ్న్యార్చిక' మనే పేరుతో పదిమంత్రాలున్నాయి. మిగతావాటిలాగా వీటికి ఋషి దేవత ఛందస్సులు కనబడవు. ఈ మంత్రాల్లోను ఇంద్రస్తుతే చేయబడింది.

ఈ సంహితలోని పూర్వార్చికంలోగల ఆరు ప్రపాఠకాల్లోని మంత్రాలు మొత్తం ౫౮౫. ఉత్తరార్చికంలోని తొమ్మిది ప్రపాఠకాల్లో గల మంత్రాలసంఖ్య ౧౨౨౦. ఇవిగాక కొందరు విమర్శకులు అరణ్యక-కాండలోని ౫౫, మహానామ్న్యార్చికంలోని పది మంత్రాలు కలిపి మొత్తం సామసంహితలోని మంత్రాలు ౧౮౭౦ అంటారు.

ఈ మంత్రాల్లో చాలాభాగం ఋక్సంహిత ఎనిమిది తొమ్మిది మండలాల్లోనుంచి తీసుకోబడ్డ ఋక్కులే ఉన్నాయి. అవి సుమారు ౧౫౦౪ ఉంటాయని కొందరు విమర్శకుల అభిప్రాయం. ఋగ్వేదంలో కనబడకుండా కేవలం సామవేదంలోనే స్వతంత్రంగా ఉన్నమంత్రాల సంఖ్యను గురించి కూడా అభిప్రాయ భేదాలున్నాయి. కొందరు ఇవి ౯౯ ఋక్కులంటే వింటర్నిజ్ ప్రభృతులు ౭౫ అంటున్నారు.

| పూర్వార్చికం | | | ఉత్తరార్చికం | | |
|---|---|---|---|---|---|
| ప్రపాఠకాలు | దశతులు | మంత్రాలు | ప్రపాఠకాలు | దశతులు | మంత్రాలు |
| ౧ | ౧౦ | ౯౬ | ౧ | ౧౨ | ౧౨౪ |
| | | | ౨ | ౧౨ | ౧౧౧ |
| ౨ | ౧౦ | ౯౭ | ౩ | ౧౪ | ౧౪౫ |
| | | | ౪ | ౧౩ | ౧౪౨ |
| ౩ | ౧౦ | ౯౯ | ౫ | ౨౧ | ౧౭౦ |
| ౪ | ౧౦ | ౯౮ | ౬ | ౧౫ | ౧౪౨ |
| | | | ౭ | ౧౨ | ౧౨౮ |
| ౫ | ౧౦ | ౯౬ | ౮ | ౧౩ | ౧౪౭ |
| ౬ | ౯ | ౯౯ | ౯ | ౮ | ౧౧౧ |
| మొత్తం | ౫౯ | ౫౮౫ | ౯ | ౧౨౦ | ౧౨౨౦ |

అరణ్యకకాండలోని మంత్రాలు ౫౫, మహానామ్న్యార్చికంలోని మంత్రాలు ౧౦. వాటిని పూర్వార్చిక, ఉత్తరార్చిక మంత్రాలలో కలిపితే మొత్తం మంత్రాలు ౧౮౭౦ దశతులు ౧౭౯ ప్రపాఠకాలు౧౫.

సామసంహితలన్నియు ఆర్చికము లనియు, గానము లనియు రెండు విధములు. ఋక్కులకే ఆర్చికములని పేరు. కాగా, ఆర్చికములలో సామగానమున కుపకరించు మంత్రములన్నియు సంగ్రహింపబడినవనియు, గానసంహితలో అవేమంత్రములు గేయరూపములో సంతరింపబడినవనియు తెలియవగును. సామగానము ౪ విధములు. (౧) గ్రామ గేయగానము. ఇది గ్రామములో పాడదగినది. దీనిని వేయగానమనికూడ పేర్కొందురు. (౨) అరణ్యగేయగానము. ఇది అరణ్యములో పాడదగినది. గ్రామగేయ అరణ్యగేయములకు ప్రకృతిగానము లని వ్యవహారము. వీని ననుసరించి (౩) ఊహగానము, (౪) ఊహ్యగానము అనునవి వికసించును. మొదటి రెండును పూర్వార్చికమునకును, చివరిరెండును ఉత్తరార్చికమునకు సంబంధించును. సామగానవిధానము ఉత్తరార్చికములో కొంత వివరింపబడినది. ఋక్ ప్రాతిశాఖ్య, తైత్తిరీయ బ్రాహ్మణ, సామవిధాన బ్రాహ్మణ, పుష్పసూత్ర, సామసూత్ర, నారదశిక్షాదులలో మరికొంత విస్తారముగా ఈ విషయము వర్ణింపబడినది.

నారదీయశిక్షలో సామస్వరములు ౭ చెప్పబడినవి. అట్లే ౩ గ్రామములు, ౨౧ మూర్ఛనలు, ౪౯ తానములు పేర్కొనబడినవి. సామసప్త స్వరములు. వేణువులో వరుసగా మ గ రి స ని ధ ప అను స్వరములకు సరిపోవును. సామగాన పాఠములలో స్వరములు ౧ నుండి ౭ వరకు అంకెలువేసి చూపబడును. ఉచ్చైస్తరము స్వరము ౧౧ అంకెతో చూపబడును. సామమంత్రములలో స్వరచిహ్నములుంచు పద్ధతి దీనికి భిన్నము. గానభాగములో సంగీతానుకూలముగ చేసిన మార్పులు సామవికారములని పిలువబడును. అవి ఈ క్రిందిపద్ధతిలో ఆరు విధములుగా నుండును.

(౧) వికారము - 'అగ్నే' అనుటకు బదులు ఓగ్నాయి అనుట.

(౨) విశ్లేషణము - 'వీతయే' అనుటకు వో యితోయా౨యి అనుట.

(౩) వికర్షణము - 'యే' అనుదానిని యా 2, 3, యి, అని పొడిగించుట.

(౪) అభ్యాసము - 'తయే' అనుచోట తోయాయి, తోయాయి అని రెండు సార్లు పలుకుట.

(౫) విరామము - 'గృణానో హవ్యదాతయే' అను పదమును గృణానోహ, వ్యదాతయే అని విరిచి చదువుట.వెలకొనును. ఈ గానరసమునకు శోభనరసము చేయగాత ఇచ్చునట్లుండును. యజ్ఞములో సామగానాది ప్రసంగములు చాల రసవంతములు.

సోమమనునది ఒక లత. ఋగ్వేదములో ఈ లత మూజవానపర్వత ప్రాంతమునను కురుక్షేత్రములోని శర్యణావత్ ప్రదేశములోను దొరకునని చెప్పబడినది. ఇది నదీతీరములలో నాచువలె పెరుగునట. పర్వత ప్రాంతములో లతవలె పెరుగునట. దీనికి పర్వతావృధ, గిరిష్ఠ మున్నగు పేర్లు చెప్పబడినవి. చంద్రునితో పోల్చుచు చంద్రకళలతో పాటు పెరుగుచు తరుగుచు నుండు ఆకులు గలదిగా వర్ణింపబడినది. కొందరిది అరటిదుంపవంటి దుంప అనియు, లతగా ప్రాకునదనియు, నీటిలో తేలునదనియు, దీనికి గొడుగువలె ఆకులుండు ననియు, అధర్మపరులకిది కనబడదనియు చెప్పుదురు. నిజమునకిది యీనాడు కనబడదు. అప్పటినుండియే ఈ లత దేశములో మృగ్యమైనట్లున్నది. అందుకే దీనికి అనుకల్పములు చెప్పెను. ఈ అనుకల్ప విధి ననుసరించి యీనాటి యజ్ఞములలో సోమలతకు మారుగా కారుగపునో లిప్పుటానో వాడుదురు.

సోమయాగములో సోమాహరణమే ఒక పెద్ద కలాపము. సోమాహరణ సూక్తములకు పావమానసూక్తములని పేరు. సోమలతను అధ్వర్యుడును యజమానియు కొందరు దానిని 36 అంగుళముల పొడవు, 24 అంగుళముల వెడల్పు గల అభిషవణ ఫలకముమీద కృష్ణాజినము పరచి, దానిపై నుంచెదరు. ఆ మీద దానిని అభిమంత్రించిన నీటితో తడుపుదురు నాలుగు శిలాయంత్రములతో నూరుదురు. తరువాత దానిని ఆహవనీయపాత్రలో వేసి నీరు ఒత్తి లతను పిండి నీళ్ళలో కలుపుదురు. కనపడిన లతకు ఋజీష అని పేరు. దీనిని దశాపవిత్ర వస్త్రములో మూటగట్టినట్లు కట్టి రసము ధారగా పడునట్లు పడియగట్టుదురు. ఈ విధముగా పిండిన రసము ముందు దేవతలకిచ్చి హోమముచేసి వషట్కారములు చెప్పుదురు. ఆ మీద హోమావశేషమును ఉద్గాత, యజమాని, బ్రహ్మ, సహస్రకుడు గ్రహింతురు. ఆయా దేవతల కర్పించునపుడు సోమరసమును పాలు, పెరుగు, పేలు సువర్ణరజము మున్నగువానితో కలిపి అర్పించెదరు. యజ్ఞదినములలో ఈ కలాపము దినమునకు మూడుసార్లు జరుపుదురు. సోమరసమును మధువని, మధుమత్ అని, పీయూషమని వ్యవహరింతురు. ఆయా వస్తువులు కలిపినపుడు దీనిని ఆశిర, గవాశిర, యవాశిర మున్నగు పేర్లతో వ్యవహరింతురు.

సూత్రములలో సోమరస భేదములు ఇరువది నాలుగు వరకు వేదోక్తములుగా వర్ణింపబడినవి. ఇది సువర్ణపాత్రలో త్రాగవలసినదిగా చెప్పబడినది. దీనివలన హర్షోత్సాహములే కాదు బ్రహ్మజ్ఞానోదయమున కనుకూలించు స్వస్థత కలుగునని వివరింపబడినది. ఇది అమృతము. విశుద్ధ బుద్ధియు నిర్మల జ్ఞానమును దీని ఫలములు

ఇది చిత్తస్వాస్థ్య మిచ్చునదియు తెలియజేయు మంత్రములు ఋగ్వేదములో పలుచోట్ల కన్పించును. పైగా ఆధ్యాత్మికముగా అర్థము వివరించునపుడు సోమరసమునకు నిర్మలజ్ఞానము, బ్రహ్మానందరసము మున్నగు సాంకేతికార్థములు గ్రహింతురు.

సామవేదము ముఖ్యముగా యజ్ఞప్రయోగమునకే ఏర్పడినట్లుండును. దీని మంత్రములన్నియు ఋగ్వేదమునుండి గ్రహించినవే. గానమే దీని సొంతము. అయినను గానము ప్రణవనిర్మితమై తత్పరిణామమై తదేకాంబలమై వెలయు చుండుటచేత సామము సర్వోత్కృష్టమైన విద్యగా భావింపబడుచున్నది. ఛాందోగ్యమున సామసారమగు ఉద్గీథవిద్య, ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక, సంపదలకు మెరుగు సమకూర్చునదిగా వర్ణింపబడినది. సోమయాగములో సోమదేవతాకమైన మంత్రము లెన్నియో సామవిధానము ననుసరించి గానముచేయబడును. బహిష్పవమానాది సూక్తములవంటి (ఋత్విజులందరు సామూహికముగా గానము చేయునట్టి) ప్రసంగము లీ యజ్ఞములలోవలె దర్శ, పూర్ణమాసాదులలో కలుగును. ఇట్లే యజమాని కిష్టకామ్యార్థము లొనగూర్చుటకై, ఆయా దేవతల నుద్దేశించి తత్తత్ స్తుతిపరములైన సూక్తములు గానముచేయుదురు. ఒక్కొక్క దేవత కొక్కొక్క విధమైన స్తోభాక్షరములు ప్రయోగింతురు. గానముచేయు ఋత్విగ్విభేదము ననుసరించి యిట్టి సామస్తోత్రములను ప్రస్తావభక్తి ఉద్గీథభక్తి అనికూడ

వ్యవహరింతురు. సామము దేవతలకు ప్రియమైనది. లోకవ్యవహారములో కూడ సామముగా ప్రియముపలుకుట, వినయము సమకూర్చుట అనియే అర్థము. శ్రుతి కూడ 'యత్ ఖలు **సాధు తత్ సామ"** అని ఏది సాధువో అనగా ఏది శుభావహమో శోభనమో అదియే సామమని కీర్తించినది.

సామాన్యంగా వేసే లెక్కలో సామవేదం మూడోదైనా ఋగ్వేదంతో దీనికున్న సన్నిహితసంబంధాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు, ఋగ్వేదం తరువాత రెండవస్థానం సామవేదానికి లభిస్తుంది. చారిత్రికంగా దీనికంత ప్రాధాన్యం లేదు. ఎందువల్లనంటే ఇందులో మంత్రాలు ఎక్కువ భాగం ఋగ్వేదంలోని ఎనిమిది తొమ్మిది మండలాలనుంచే స్వీకరింపబడ్డాయి.

సామవేదం కూడా యజుర్వేదంలాగా యజ్ఞాచరణంలో బాగా ఉపయోగపడుతుంది. ఎక్కువగా ఇందులోని మంత్రాలు సోమయాగంలో ఉద్గాతలచేత గానం చేయబడతాయి.

**సామ అంటే ఏమిటి ?**

'సామ' అనే పదానికి 'గాన' మని అర్థం. ఋక్కులే రాగబద్ధంగా గానం చేయబడితే, సామలని వ్యవహరించబడతాయి . అర్థాన్ననుసరించి పాదబద్ధంగా ఉండే మంత్రానికి 'ఋక్కు' అని ఋక్కు స్వరబద్ధమై స్తోభవర్ణాలతో కలిపి గానం చేయబడేటప్పుడు 'సామ' అనబడుతుందని, జైమిని "గీతిషు సామాఖ్యా" ( మీ. ద. ౨.౧.౩౬.) అని సూత్రీకరించాడు.

**విషయం :**

సామవేదంయొక్క ప్రధాన ప్రయోజనం యజ్ఞయాగాదుల్లో ఆయా గానాలద్వారా ఉపయోగపడటం. ఈ సంహితలోని మంత్రాలకు, ఋక్కులకు స్వరభేదంవల్ల స్వరూపభేదం ఏర్పడింది. గానలక్షణాలతో ఈ మంత్రాలను గానంచేసే విధానం గానగ్రంథాల్లో వివరింపబడింది. వర్ణాలను త్రిప్పి త్రిప్పి ఉచ్చరించడం, అక్షరాలను దీర్ఘంతీసి పఠించడం, మధ్యలో కొత్త అక్షరాలను వేయడం మొదలైన సంగీతశాస్త్రంలో పాటింపబడే విశేషాలన్నీ వీటిల్లో వివరింపబడ్డాయి. సోమయాగానికి సంబంధించిన విశేషాలు మనమిందులో గమనించవచ్చు. ఋక్కులు గానానుగుణంగా ఇందులో ఉపయోగింపబడటంవల్ల ఋగ్వేదప్రమేయానికి దీనికి తేడా చాలా తక్కువ అని అనుకోవచ్చు.

**ఉపవేదం :**

సామవేదానికి ఉపవేదం గాంధర్వవేదం. ఈ గాంధర్వ వేదం సామగానాన్ని సంగీతాన్ని కూడా వివరించింది. నృత్య గీత వాద్యాలను (తౌర్యత్రికం), సప్తస్వరాలను, మూడుగ్రామాలను ౨౧ మూర్ఛనలను, ౪౯ తానాలను ప్రతిపాదిస్తున్న ఈ వేదం భారతీయ సంగీతశాస్త్రానికి మూలభూతమైందని నారదీయ సామశిక్షద్వారా తెలుస్తున్నది.

**మొత్తం శాఖలు :**

సామవేదానికి వెయ్యి శాఖలున్నట్లు తెలుస్తుంది. వ్యాకరణ మహాభాష్యకారుడైన పతంజలి సహస్రవర్త్మా సామవేదః అన్నాడు. ఇక్కడ వర్త్మపదం వెయ్యిరకాల గానాలను చెబుతుంది గాని శాఖలను చెప్పదని కొందరి అభిప్రాయం. కాని శ్రీమద్భాగవతం చరణవ్యూహ పరిశిష్టం, విష్ణుపురాణం ఈ వేదంలో ఒకప్పుడు వెయ్యి శాఖలున్నట్లు పేర్కొంటున్నాయి. ఇందులో చాలా శాఖలు కాలగర్భంలో కలిసిపోయాయి.

సామవేదానికి వెయ్యి శాఖలున్నట్లు దివ్యావదాన మహాబౌద్ధ గ్రంథం కూడ ఇలా పేర్కొంటున్నది

౧. శిలపల్కా : పంచవింశతి : ౨౫

౨. కౌథుమానాం శతం ౧౦౦

౩. మహాసమానాం పంచశతాని ౫౦౦

౪. సాత్యముగ్రాణాం శతం ౧౦౦

౫. లౌకాక్షాశ్చత్వారింశత్ ౪౦

౬. బ్రహ్మసమానాం శతం౧౦౦

౭. మహాయోజికానాం శతం ౧౦౦

౮. సమస్త వేదానాం శతం ౧౦౦

### మొత్తం ౧౦౦౦ శాఖలు.

చరణవ్యూహపరిశిష్టంలో సామవేదానికి ౧. రాణాయనీయ ౨. శాట్యాయనీయ ౩. శాట్యముగ్ర ౪. కల్పం ౫. మహాకల్పం ౬. లాంగల ౭. కౌథమీయ ౮. గౌతమీయ ౯. జైమినీయ భేదంతో తొమ్మిది శాఖలున్నట్లు చెప్పబడింది. ఇదే గ్రంథం ఇంకొక శాఖాక్రమాన్ని కూడా ఇలా పేర్కొంటున్నది. ౧. రాణాయనీయ ౨. శాట్యముగ్ర ౩. కాలేయ ౪. మహాకాలేయ ౫. లాంగలాయన ౬. శార్దూల ౭. కౌథుమభేదంతో ఏడుశాఖలు.

రాణాయని, సాత్యముగ్రి, దుర్వాసుడు, భాగురి, (గౌ) భారుండి, గౌల్గులవి, భానుమన్యవుడు, దారాలుడు, గార్గ్యసావర్ణి, వార్షగణ్యుడు, కుథుమి, శాలిహోత్రుడు, జైమిని అని సామగానాచార్యులు పదమూగ్గురిని చరణవ్యూహటీకలో మహిదాసు పేర్కొంటున్నాడు.

### ఇప్పుడు దొరుకుతున్నవి :

ఇప్పుడు రాణాయనీయ, కౌథుమ, జైమినీయ శాఖలు మూడు మాత్రం దొరుకుతున్నాయి. గౌతమశాఖకూడా మనదేశంలో ఏదో భాగంలో ఉండేదని చెబుతారు. మూడు వందల సంవత్సరాలకు పూర్వం శార్దూలశాఖ ఉన్నదని, తరువాత నశించిపోయిందని వేదపండితులు చెబుతున్నారు.

మంత్ర - బ్రాహ్మణ - శ్రౌత- స్మార్త సూత్రాలు ప్రాతిశాఖ్యం రాణాయనీయ శాఖకు కౌథుమశాఖకంటే భిన్నంగా లేవు. జైమినీయశాఖకు వేఱుగా ఉన్నాయి.

### శాఖలు – దేశవ్యాప్తి

సామసంహితను ప్రచారం చేసినవాళ్లలో ముఖ్యుడు జైమిని. ఈయన వేదవ్యాసునిద్వారా సామవేదాన్ని అధ్యయనం చేశాడు ఇతని జన్మస్థానం ద్వైతవనం జైమిని తన కుమారుడైన సుమంతునికి సామవేదాన్ని బోధించాడు. సుమంతుని ద్వారా అతని కొడుకు 'సుత్వ'. సుత్వద్వారా అతని కుమారుడు సుకర్మ ఈ వేదాన్ని అధ్యయనంచేసి పరంపరను కాపాడారు.

సుకర్మ ఎంతమందికో ఈ వేదాన్ని నేర్పి సుమారు ౧౦౦౦ సంహితలకు ప్రచారకుడైనాడు ఇంద్రప్రకోపం (బహుశ భూకంపంవల్ల) ఈ సుకర్మ శిష్యులుండే ప్రాంతమంతా భూగర్భంలో కలిసిపోయింది. ౧౦౦౦ శాఖలూ అంతరించిపోయాయి. తరువాత ఇతనికి పౌష్యంజి, కోసల దేశాధిపతియైన హిరణ్యనాభుడనే ఇద్దరు శిష్యులేర్పడ్డారు. సుకర్మ వీరిద్దఱికి చెరి ౫౦౦ శాఖలను అధ్యాపనం చేశాడు. పౌష్యంజి సంప్రదాయానికి ఉత్తరదేశీయ సామపరంపర అని, హిరణ్యనాభ సంప్రదాయానికి ప్రాచ్యదేశ పరంపర అనే పేరు ప్రసిద్ధి వచ్చాయి.

ఈ పౌష్యంజికి ౧. లౌగాక్షి ౨. కుథుమి ౩. కుసీది ౪. లాంగలి అని నల్గురు శిష్యులు. ఇందులో లౌగాక్షికి ౧. రాణాయని ౨. తాండ్య ౩. అనోవైన (మూలచారి) ౪. సకైతిపుత్ర ౫. సాత్యముగ్రులనే అయిదుగురు శిష్యులున్నారు. సువాను అనేవాడు కూడ ఇతనికి ఆరవ శిష్యుడని బ్రహ్మాండపురాణం పేర్కొంటున్నది.

ఇలా జైమిని శిష్యపరంపరద్వారా భారతదేశమంతటా వెయ్యి శాఖలతో వ్యాప్తిలోకి వచ్చిన సామవేదానికి ఎక్కడా ఆశ్రయంలేక ఇప్పుడు ఎంతో దీనస్థితిలో ౩ శాఖలుమాత్రం రెపరెపలాడుతున్నాయి అవికూడ అల్పకాలం నిలుస్తాయని నమ్మకంలేదు.

కుథుమిమహర్షిచేత ప్రవర్తింపజేయబడింది కౌథుమశాఖ. రాణాయని ప్రవర్తకుడుగ గలది రాణాయనశాఖ. జైమినిద్వారా ప్రచారంలోకి వచ్చింది జైమినీయశాఖ.

నశించిపోయిన శాఖలు పోగా ప్రస్తుతం తమిళనాడు, బెంగాల్, బీహార్, గుజరాత్ రాష్ట్రాల్లో వ్యాపించి, అక్కడ పఠన పాఠనాదుల్లో ఉన్న శాఖ కౌథుమశాఖ. తమిళనాడు (తిరునల్వేలి), కేరళలో జైమినీయ శాఖ వ్యాపించింది. కర్ణాటక రాష్ట్రంలోను, ఆంధ్రప్రదేశ్‌లోని సింహాచలప్రాంతంలోను (ఒకే ఒక కుటుంబంలో) వ్యాప్తిలోనున్న శాఖ రాణాయనీయ శాఖ. ఈ రాణాయనీయ శాఖ ఒకప్పుడు మహారాష్ట్రలో ప్రచారంలో ఉండేదని తెలుస్తున్నది.

శార్దూలం సాతానికి సంబంధించిన వివరాలు కొన్ని కాశీలో దొరకడంవల్ల ఈ శాఖకు ఆ ప్రాంతంలో ప్రచారం ఉండేదని తెలుస్తున్నది.

### సామవిశేషాలు

సామసంహితా శరీరానికి ఈ స్తోభాక్షరాలు, శరీరమంతటా నిండి శరీరాన్ని బిగువుగా ఉంచే రోమాల్లాంటివని సామవిధాన బ్రాహ్మణం పేర్కొంటున్నది.

దీనికి సంబంధించినగానం 'ప్రకృతి' అని 'ఊహ' అని రెండు రకాలు. 'గ్రామగేయము' ని (గ్రామంలో గానం చేయతగింది) 'అరణ్యగేయ' మని (అరణ్యంలో గానం చేయదగింది) ప్రకృతి రెండు విధాలు. దీనినే 'గానసంహిత' అని కూడ అంటారు. గ్రామగేయమనే భాగానికి సంబంధించిన ఊహాకే ఊహగాన మని, అరణ్యగేయ భాగానికి చెందిన ఊహాకే రహస్యగాన 'మని వ్యవహారం. ప్రకృతిలో ఏడు గానాలున్నాయని, ఊహ ఏడు తంత్రాలతో కూడినదని సర్వానుక్రమణిక చెబుతుంది.

౧. గాయత్రం ౨. ఆగ్నేయం ౩. ఐన్ద్రం ౪. పావమానం ౫. అర్కపర్వ, ద్వంద్వపర్వ, వ్రతపర్వ అని మూడుపర్వాలు ౬. శుక్రియం ౭. మహానామ్ని అని ప్రకృతిలో మొత్తం ఏడుగానాలు.

ఊహలో ౧. దశరాత్రం ౨. సంవత్సరం ౩. ఏకాహం ౪. అహీనం ౫. సత్రం ౬ ప్రాయశ్చిత్తం ౭. క్షుద్రమని ఏడు తంత్రాలున్నాయి.

సామగానం చేసేటప్పుడు సప్తస్వరాలను, మూడుగ్రామాలను, ౨౧ మూర్ఛనలను, ౪౯ తానాలను దృష్టిలో పెట్టుకోవాలి. ఉద్గాతలు యజ్ఞాల్లో మంద్ర, మధ్యమ, తారస్థాయిల్లో ఉదయ - మధ్యాహ్న-సాయంకాలాల్లో స్తోత్రరూపమైన గానం చేస్తారు.

ఒక ఋక్కును తీసుకొని స్వరబాహుళ్యంతో చేసే గానానికే సామ అనిపేరు. ప్రకృతిలో ఒక ఋక్కుకు ఒక 'సామ' గానం చేయడం జరుగుతుంటుంది. కాని కొన్నిచోట్ల ఒకే ఋక్కులో రెండు మూడు, నాలుగు ఇలా పదహారు సామల దాకా గానం చేయడం కూడా ఉంది. ఒకచోట పద్దెనిమిది సామగానాలు కూడా అనేక పద్ధతుల్లో ఒకే ఋక్కుకు ఉన్నాయి. ఈగానలాగాలకే 'రథన్తరసామ,' "బృహత్సామ," 'వామదేవ్యసామ' అని అనేకరకాల పేర్లున్నాయి.

ఋక్కును సామగానం చేసేటప్పుడు అందులో ఉండే అయిదుభాగాలను బాగా అర్థం చేసుకోవాలి. అవి ౧. ప్రస్తావం ౨. ఉద్గీథం ౩. ప్రతిహారం ౪. ఉపద్రవం ౫. నిధనం అని పిలవబడతాయి.

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే నిహోతా సత్సి బర్హిషి
అనే మంత్రాన్ని గానం చేసేటప్పుడు ఈ ఐదు భాగాలు ఎక్కడున్నాయో చూడండి :
౧. హుం అగ్నా ౩ (ప్రస్తావం).
ఇక్కడ హుం శబ్దంతో ప్రారంభించడానికే ప్రస్తావం అనిపేరు.
౨. ఓం ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే (ఉద్గీథం).
ఇక్కడ ఓం శబ్దంతో ఆరంభించి ఋత్విక్కు గానం చేస్తాడు.
౩. నిహోతా సత్సి బర్హిషి ఓమ్ (ప్రతిహారం).
ఓం చివఱ వచ్చేట్లు ఋత్విక్కు గానం చేస్తాడు.
౪. నిహోతా సత్సిబ (ఉపద్రవం) ఇది ఉద్గాతచేత గానం చేయబడుతుంది.
౫. ర్హిషి ఓమ్ (నిధనం)
దీన్ని ప్రస్తోత, ఉద్గాత, ప్రతిహర్త ము॥ అంతా కలిసి గానం చేస్తారు.
సామగానంలో ఔ, హా, వా, హో అనే శబ్దాలు ప్రత్యేకమైన అర్థం ఏదీ లేకపోయినా గేయం శిథిలం కాకుండా సాగడానికి ఉపయోగపడతాయి.

సామవేదం గానప్రధానమైంది కావడంవల్ల ఇతర వేదాల్లో లాగా జటాదివికృతిపాఠాలు ఇందులో నిలబడలేదు. కేవలం పదపాఠం స్తోభపదపాఠంమాత్రమే ఇందులో మనకు కనబడుతున్నాయి. సామగానప్రభావం ముందు ఇతరపాఠాలకు తావు లేకపోయింది.

## మంత్రద్రష్టలగు మహర్షులు

మానవులకు పరమశ్రేయస్సాధనాలు వేదాలు. మహర్షులు గొప్ప తపస్సుచేసి దీక్షతో దివ్యమైన శక్తిని సంపాదించుకొని, వేదమంత్రాలను తమ దృష్టికి తెచ్చుకొన్నారు. అందుకే వారిని మంత్రద్రష్టలంటారు. ఋషి అంటేనే ద్రష్ట. వేదమంత్రాలను ఎవరూ రచించలేదు. అవి అపౌరుషేయాలు. అంటే ఎవరి (పురుషుని) చేతను రచింపబడనివి. అందువల్ల ఋషులు వాటికి ద్రష్టలే గాని కర్తలుకారు. వేదమంత్రాలను ప్రత్యక్షంగా చూసి, ఇతరులకు తెలియజేయగల వారే మంత్రద్రష్టలైన మహర్షులు.

ప్రస్తుతం సామసంహితను దర్శించిన ఋషులెవరు ? వారెన్ని మంత్రాలను దర్శించారు? ఇతర సాహిత్యాల్లో ఏవిధంగా వారు వర్ణింపబడ్డారు? అనే విషయాలిక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

సామసంహితను దర్శించిన మహర్షులు నూటయాభైమందికి పైగా ఉన్నారు. అందులో కొందరే ముఖ్యంగా పేర్కొనదగినవారు. వారు వసిష్ఠుడు, వామదేవుడు, భరద్వాజుడు, మేధాతిథి, కణ్వుడు, విశ్వామిత్రుడు, గోతముడు, శునశ్శేపుడు, శౌభరి, ప్రస్కణ్వుడు, జమదగ్ని, నృమేధుడు, ప్రగాథుడు, కశ్యపుడు, రేభుడు, అత్రి, వాలఖిల్యులు.

## ఛందస్సు

శిక్ష, వ్యాకరణం మొదలైన ఆరువేదాంగాలలో ఛందశ్శాస్త్రం ఒకటి. అది వేదపురుషునికి పాదస్థానంగా చెప్పబడింది. ఛందస్సుకు సంబంధించిన అనేకగ్రంథాలు పూర్వం ప్రచారంలో ఉండేవి అందులో చాలా గ్రంథాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

ఋక్ ప్రాతిశాఖ్యం మొదలైన కొన్ని ప్రాచీనగ్రంథాలలో ఇతర విషయాలతోపాటు ఛందోరీతులు కూడా నిరూపింపబడ్డాయి. పింగళుడూ, జయదేవుడూ ప్రసిద్ధంగా 'ఛందస్సూత్రం' అనే పేరుతో రచించిన రెండు గ్రంథాలు వైదిక - లౌకిక ఛందస్సులను విపులంగా నిరూపిస్తున్నాయి. అందులోనూ పింగళుని గ్రంథమే ఛందశ్శాస్త్రాల్లో పరమప్రామాణికంగా ఆదరింపబడుతున్నది.

అక్షరపరిమాణమే ఛందస్సు ('యదక్షరపరిమాణం తచ్ఛందః' - ఋక్ సర్వానుక్రమణి ౨-౬) అని కాత్యాయనుడు ఛందశ్శబ్దానికి నిర్వచనం చెప్పాడు. ఇందువల్ల అక్షరసంఖ్యా పరిమితితో గూడిన పాదాల పరిమితిని బట్టి ఛందస్స్వరూపం గ్రహింపబడుతుందని తెలుస్తున్నది. 'అక్షరేణ మిమతే సప్తవాణీః' (౧-౧౬౪-౨౪) అన్న ఋగ్వేదవచనమే పై నిర్వచనానికి మూలం.

ఛందస్సుపేరు వినగానే ఆ మంత్రంలో ప్రయోగించిన అక్షరాలసంఖ్య మనకు తెలియాలి. అలా తెలియకపోతే అక్కడ ప్రయోగింపబడ్డ ఛందస్సంజ్ఞ గౌణమే గాని ముఖ్యం కాదు అని గ్రహించాలి.

'మాత్రికచ్ఛందస్సు,' 'అక్షరచ్ఛందస్సు' అని ఛందస్సు రెండు రకాలు. అక్షరాలతోపాటు గురులఘురూపాలైన మాత్రలను గూడా లెక్కపెట్టవలసిన ఛందస్సును 'మాత్రికచ్ఛందస్సు' అంటారు. మాత్రలతో నిమిత్తంలేకుండా అక్షరసంఖ్యను మాత్రమే గణించవలసిన ఛందస్సు అక్షరచ్ఛందస్సు అవలడుతుంది(?). వైదికచ్ఛందస్సులన్నీ అక్షరచ్ఛందస్సులే. ఉదాహరణకు సామవేదంలోని ప్రథమమంత్రం ఇది:

అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్య దాతయే । నిహోతా సత్సి బర్హిషి ।
(సా. సం౧.౧.౧)

ఈ ఛందస్సును 'గాయత్రి' అంటారు. ఇందులో మూడు పాదాలూ, ఒక్కొక్క పాదానికి ౮ చొప్పున ౩x౮ =౨౪ అక్షరాలూ వుంటాయి. 'అగ్నిమీళే పురోహితం' అన్న ఋగ్వేద ప్రథమమంత్రం గూడా గాయత్రిచ్ఛందస్సే. ఛందస్సులలో గాయత్రి చాలా ప్రశస్తం. అందుకే కృష్ణభగవానుడు గాయత్రీ ఛందసామహమ్ (భ.గీ. ౧౦-౩౫) అని తన విభూతిగా గాయత్రిని పేర్కొన్నాడు.

అధికభాగం ఋగ్వేదంలోని మంత్రాలే సామవేదంలో సంగ్రహించబడ్డాయి. కాబట్టి ఋగ్వేదచ్ఛందస్సుల పరిశీలనవల్ల సామవేదచ్ఛందస్స్వరూపం గూడా గోచరిస్తుంది. పైన ఉదాహరింపబడిన సామవేద ప్రథమ మంత్రం ఋగ్వేదాంతర్గతమే
(ఋ. సం. ౬-౧౬.౧౦).

౨౪ అక్షరాలు గల 'గాయత్రి' మొదలు, ౧౦౪ అక్షరాలు గలఉత్కృతి అనే ఛందస్సు వరకూ మొత్తం ౨౧ ఛందస్సులు వేదాలలో ప్రయోగింపబడ్డాయి. ఇందులో ఒక ఛందస్సుకంటే మరొక ఛందస్సులో క్రమంగా నాలుగేసి అక్షరాలు ఎక్కువగా వుంటాయి. ఛందస్సుల పేర్లతోపాటు అక్షరసంఖ్యాక్రమం ఈ దిగువ సూచించినట్లు ఉంటుంది :

| ప్రథమ సప్తకం | ద్వితీయ సప్తకం | తృతీయ సప్తకం |
|---|---|---|
| (౧) గాయత్రి-౨౪ | (౮) అతిజగతి-౫౨ | (౧౫) కృతి-౮౦ |
| (౨) ఉష్ణిక్-౨౮ | (౯) శక్వరి-౫౬ | (౧౬) ప్రకృతి-౮౪ |
| (౩) అనుష్టుప్-౩౨ | (౧౦) అతిశక్వరి-౬౦ | (౧౭) ఆకృతి-౮౮ |
| (౪) బృహతి-౩౬ | (౧౧) అష్టి-౬౪ | (౧౮) వికృతి-౯౨ |
| (౫) పంక్తి-౪౦ | (౧౨) అత్యష్టి-౬౮ | (౧౯) సంకృతి-౯౬ |
| (౬) త్రిష్టుప్-౪౪ | (౧౩) ధృతి-౭౨ | (౨౦) అతికృతి-౧౦౦ |
| (౭) జగతి-౪౮ | (౧౪) అతిధృతి-౭౬ | (౨౧) ఉత్కృతి-౧౦౪ |

పై పట్టికలో 'కృతి' మొదలు 'ఉత్కృతి' వరకుగల తృతీయ సప్తకంలోని ఛందస్సులు ఋగ్వేద (శాకల) సంహితలో కనిపించవు. యజుర్వేదంలో ఇవి కనిపిస్తాయి.

'గాయత్రి' మొదలు 'అత్యష్టి' వరకూ గల ౧౨ రకాల ఛందస్సులు సామవేదంలో విరివిగా ఉపయోగింపబడ్డాయి. ఆయా ఛందస్సులలో ఎన్నో అవాంతర భేదాలు ఉన్నాయి. ఈ భేదాలలో గూడా అనేకం మనకు సామవేదంలో కనిపిస్తాయి. ఒక్క పూర్వార్చికంలోనే మూడుకాండల్లోనూ కలిపి గాయత్రి ఇంచుమించు ౨౦౦ సార్లు ప్రయోగింపబడింది. బృహతి ౧౨౦ సార్లు ప్రయుక్తమయింది. ఇతరచ్ఛందస్సులు అంతకంటే తక్కువసార్లు ప్రయోగింపబడ్డాయి.

౧. గాయత్రి :

గాయత్రిలో పాదనిచృత్, అతిపాదనిచృత్, వర్ధమానా, ప్రతిష్ఠా, వారాహీ, నాగీ, త్రిపాద్విరాట్ ఇత్యాదిగా అనేక భేదాలున్నాయి. ఉదాహరణకు - పాదానికి ౧౧ అక్షరాల చొప్పున మూడు పాదాలుండే ఛందస్సును 'త్రిపాద్ విరాట్' అంటారు. ఈ క్రింది సామవేదమంత్రం ఈ గాయత్రీభేదానికి చెందిందే:

అగ్నిం నరో దీధితిభిరరణ్యోర్హస్తచ్యుతం జనయత ప్రశస్తమ్ ।
దూరేదృశం గృహపతి మథవ్యుమ్ (సా. సం. ౧.౭.౧౦)

౨. ఉష్ణిక్ :

ఉష్ణిక్ ఛందస్సులో 'కకుబుష్ణిక్,' 'పుర ఉష్ణిక్' ఇత్యాది భేదాలున్నాయి. మూడుపాదాల్లోనూ ౮+౧౨+౮ = ౨౮ చొప్పున అక్షర సంఖ్య ఉంటే 'కకుబుష్ణిక్'

అంటారు. అలాకాక ౧౨+౮+౮ = ౨౮ అక్షరాలు చొప్పున ఉంటే 'పుర ఉష్ణిక్' అనబడుతుంది. కకుబుష్ణిక్ ఉదాహరణ:

యో న ఇదమిదం పురా ప్రవస్య ఆనినాయ తము వస్తుషే।
సఖాయ ఇంద్ర మూతయే ।(సా. సం. ౫.౨.౨)

లౌకికమువృత్తచ్ఛందస్సులలో ప్రతిదానికి నాల్గుపాదాలుంటాయి. అందువల్ల గాయత్రిలోని ౨౪ అక్షరాలూ ౬ అక్షరాలుగల నాలుగు పాదాలుగానూ, ఉష్ణిక్‌లోని ౨౮ అక్షరాలూ ౭ అక్షరాలుగల నాలుగు పాదాలుగానూ విభజింపబడి 'తనుమధ్యా' 'మదలేఖా' ఇత్యాది సంజ్ఞలతో వ్యవహరింపబడుతున్నాయి. లౌకిక ఛందోభేదాల స్వరూపాలు వృత్తరత్నాకరాది గ్రంథాలలో విశదంగా నిరూపింపబడింది.

### ౩. అనుష్టుప్ :

అనుష్టుప్ఛందస్సులలో ౪ పాదాల ఛందస్సులేకాక త్రిపాద్ అనుష్టుప్పులు గూడా వేదంలో ప్రయోగింపబడివున్నాయి. ఆయా పాదాలలోని అక్షరసంఖ్యను బట్టి **'పురస్తాజ్జ్యోతి,' 'ఉపరిష్టాజ్జ్యోతి'** ఇత్యాదిగా చాలా అనుష్టుప్ - భేదాలున్నాయి.

ఆదికావ్యమైన రామాయణంలో అధికంగా అనుష్టుప్పే ప్రయుక్తమయింది. పురాణవాఙ్మయంలో ఎక్కువభాగం ఈ ఛందస్సులోనే వ్రాయబడింది. లౌకికానుష్టుప్పుల్లో ప్రతి పాదంలోను ౫వ అక్షరం లఘువుగా వుండాలి, (పంచమం లఘు సర్వత్ర) ఇత్యాదినియమాలు తర్వాతికాలంలో ఏర్పడ్డాయి.

### ౪. బృహతి :

బృహతీఛందస్సులో గూడా పాదసంఖ్యలోనూ, అక్షర సంఖ్యలోనూ వున్న భేదాన్ననుసరించి అనేకభేదాలు ఏర్పడ్డాయి. సాధారణ బృహతీఛందస్సుతోపాటు, **'సతోబృహతీ,' 'ఉపరిష్టాద్ బృహతీ,' 'స్కంధోగ్రీవీ బృహతీ'** మొదలైనభేదాలు సామవేదంలో ప్రయోగింపబడ్డాయి.

### ౫. పంక్తి :

పంక్తిఛందస్సులో **'విష్టారపంక్తి'** వంటి అవాంతర భేదాలు, త్రిష్టుప్‌లో 'విరాట్స్థానా' వంటి భేదాలూ సామసంహితలో అరుదుగా కనపడతాయి. 'జగతి' మొదలైన తరువాతి ఆరు ఛందస్సులలో కొన్నింట ఐదుపాదాలు, మరికొన్నింట ఏడు పాదాలు గూడా వుంటాయి. ఆయా పాదాలలోని అక్షరసంఖ్యా విషయంలో అనేకమతభేదాలున్నాయి. ఆయా భేదాలకు తగిన లక్ష్యాలు ఋగాదివేదాలలో అక్కడక్కడా కనపడతాయి.

పైన పేర్కొన్న ౧౨ రకాల ఛందస్సులేకాక వివిధఛందస్సుల సమ్మేళనంవల్ల ఏర్పడే ప్రగాథఛందస్సులు గూడా సామవేదంలో విరివిగా వాడబడ్డాయి. ఇలాంటి ప్రగాథలు ఉత్తరార్చికంలోనే ఎక్కువగా కనిపిస్తున్నాయి.

విషమా బృహతీ + సమా సతో బృహతీ, విషమా కకుప్ + సమా సతో బృహతీ, బృహతీ + సతో బృహతీ, అనుష్టుప్ + గాయత్రీ (అనుష్టుమ్ముఖః ప్రగాథః), ఇలాంటివి సామసంహితలో ప్రయోగింపబడిన ప్రగాథలు.

### ప్రగాథలంటే ఏమిటి ?

**ఋక్ప్రాతిశాఖ్యం, ఋక్సర్వానుక్రమణి, నిదానసూత్రం** మొదలైన ప్రాచీన గ్రంథాలలో ప్రగాథఛందస్సుల వివరణ లభిస్తున్నది. రెండు లేక మూడు ఛందస్సులు ఇందులో ప్రగ్రథనం చేయబడుతాయి. కాబట్టి వీటికి ప్రగాథలని వ్యవహారం కల్గింది.

గాయత్రికంటే తక్కువసంఖ్యగల అక్షరాలతో గూడిన ఛందస్సులు (౧) ఉక్తా (౨) అత్యుక్తా (౩) మధ్యా (౪) ప్రతిష్ఠ (౫) సుప్రతిష్ఠ అని ఐదు ఉన్నాయి. వీటిలో క్రమంగా ౪,౮,౧౨,౧౬,౨౦ చొప్పున అక్షరసంఖ్య ఉంటుంది. ఈ ఐదు ఛందస్సులను 'ప్రాక్‌గాయత్రీ పంచకం' అని వ్యవహరిస్తారు. ఋగ్వేదంలో సామవేదంలో గానీ ఈ ఛందస్సులు ప్రయోగింపబడలేదు. అథర్వవేదంలోని ౨౦వ కాండలో వీటిని ప్రయోగించడంజరిగింది. లోకంలో ఇవి ప్రయోగార్హాలా, కాదా అన్న విషయం మతభేదాలున్నాయి. వృత్తరత్నాకరం - తృతీయాధ్యాయంలో ఇతర అవాంతరభేదాలతో సహా మొదటనే నిరూపింపబడ్డాయి.

అక్షరసంఖ్యానియమాన్ని పాటించే వైదికఛందస్సులలో ఎక్కడైనా ఒకపాదంలో అక్షరసంఖ్య తగ్గితే వ్యూహంతో దాని పూర్తిచేసుకోవాలని ఛందశ్శాస్త్రకారులు సూచించారు.

లౌకిక సంస్కృతకావ్యాలలో ప్రయోగింపబడిన వివిధ ఛందస్సులకు మూలం వైదికఛందస్సులే. గ్రీకు లాటిన్ భాషలలోని ఛందస్సులు గూడా వైదికఛందస్సులతో అనేకవిధాల సామ్యం కలిగివున్నాయి.

### వైశిష్ట్యం

**'వేదానాం సామవేదోఽస్మి'** (భ.గీ. ౧౦-౨౨) అని శ్రీకృష్ణుని మాట. ఇందువల్ల ఇతరవేదాలకులేని ప్రాశస్త్యం సామవేదానికున్నదని స్పష్టమవుతున్నది. మహాభారతంలోని అనుశాసనపర్వంలో కూడ **'సామవేదశ్చ వేదానాం'** (౧౪-౩౦౭) అన్న ప్రశంస కనిపిస్తున్నది.

సామవేద ప్రశస్తికి ముఖ్యకారణం అందలి గాన స్వరూపమే. వృక్షానికి పుష్పం శోభ కల్గించినట్లే గానమయమైన సామవేదం వేద వాఙ్మయానికంతటికీ అపూర్వమైన సౌందర్యం

కల్గిస్తున్నది. అందువల్లనే 'సామవేద ఏవ పుష్పం' (౩.౩.౧) అని ఛాందోగ్యం ఈ వేదాన్ని పుష్పంతో పోల్చింది.

ఋక్కులకూ, సామవేదానికీ ఉన్న సంబంధం అత్యంత సన్నిహితం'యా ఋక్ తత్సామ' అన్న ప్రమాణాన్ని బట్టి ఋక్సంగ్రహమే సామవేదమని తెలుస్తున్నది.'సామాహమస్మి ఋక్ త్వం' (అ.సం ౧౪.౨.౭౧) అని అథర్వవేదం ఋక్ సామలను దంపతులుగా వర్ణించడం కూడా ఉంది. .

'సా చ అమశ్చేతి తత్సామ్నః సామత్వం' అని సామశబ్దం నిర్వచింపబడింది.'సా' అంటే ఋక్కు 'అమ' అంటే స్వరం. ఋక్కుతో సంబంధపడిన షడ్జాదిస్వరం ఎక్కడ ఉంటుందో అదే సామ. ఇతరవేదాలు కేవలం మంత్రమయాలు. సామవేదం ఋక్కుల నాశ్రయించి వున్నా ప్రధానంగా గానమయం. కేవల మంత్రాలకూ, కేవల గానానికీ సామసంజ్ఞ లేదు. గానాత్మకమైన మంత్రాలకే ఆపేరు చెల్లుతుంది. 'గీతిషు సామాఖ్యా' (మీ.ద. ౨.౧.౩౬) అన్న జైమిని సూత్రంలోని ఆంతర్యం ఇదే.

**విభాగం :**

సామవేదంలో పూర్వార్చికం, ఉత్తరార్చికం అని రెండు విభాగాలున్నాయి.'అర్చిక' మంటే ఋక్కులసమూహం అని అర్థం.

పూర్వార్చికంలోని మొదటి పన్నెండు దశకాలలో అగ్నిని స్తుతించే మంత్రాలూ, చివరి పదకొండు దశకాలలో సోమస్తుతిచేసే మంత్రాలూ, మధ్యలోని ౩౬ దశకాలలో ఇంద్రస్తుతిపరాలైన మంత్రాలూ చేర్చబడ్డాయి. దైవతకాండవిభాగాన్ననుసరించి వీటిని ఆగ్నేయ కాండం ఐంద్రకాండం, పవమానకాండం అంటారు.

స్వర చిహ్నాలు :

ఉదాత్తాది స్వరాలను గుర్తించడంలో ఋగ్వేద సామవేదాలకు తేడా ఈ క్రింది విధంగా పాటింపబడుతున్నది.

ఋగ్వేదంలో అధోరేఖతో నిర్దేశింపబడే అనుదాత్తస్వరం సామవేదంలో'౩' అన్న సంఖ్యతో గుర్తింపబడుతుంది. ఋగ్వేదంలో అనుదాత్తానికంటే పరమైన ఉదాత్తానికి ఎలాంటి చిహ్నమూ వుండదు. సామవేదంలో అది '౧' అన్న అంకెతో నిర్దేశింపబడుతుంది. ఋగ్వేదంలో ఊర్ధ్వరేఖతో గుర్తింపబడే స్వరితస్వరం సామవేదంలో'౨' అన్న అంకెతో నిర్దిష్టమవుతుంది.

ఉదాహరణకు :

అగ్న ఆయాహి వీతయే (ఋ.సం. ౬.౧౬.౧౦)

౨ ౩ ౧ ౨ ౩ ౧ ౨
అగ్న ఆయాహి వీతయే (సా.సం. ౧.౧.౧)

ఈవిధంగా స్వర చిహ్నలను ప్రదర్శించడంలో రెండు వేదాలకూ భేదమున్నా, ఉదాత్తాదిస్వరాలలో మాత్రం ఎలాంటి భేదమూ లేదు.

సామవేదంలోని పై చిహ్నలు స్వరాన్ని నిర్దేశించడానికుపయోగించేవే కాని గాన నిర్దేశకాలు కావు. గానవిధానం సామగాన గ్రంథాలలో నిరూపింపబడివున్నది. సామగానానికి ముఖ్యకారణ భూతాలైన మంత్రాలు మాత్రమే సామవేదంలో పై స్వరచిహ్నలతో సంగ్రహింపబడ్డాయి.

**శాఖలు :**

వ్యాకరణ మహాభాష్యంలో పతంజలి సామవేదానికి వెయ్యిశాఖలున్నాయని చెప్పాడు. మరికొందరు పతంజలివచనం సామ సంహితలోని గానవైవిధ్యాన్ని మాత్రమే సూచిస్తుందిగాని శాఖా భేదాన్ని సూచించదని చెబుతున్నారు.'వర్త్మన్' శబ్దానికి'మార్గం,' అని అర్థమే గాని 'శాఖ' అని అర్థం లేదని వారి అభిప్రాయం. ఏది ఎలా ఉన్నా ఇతర వేదాలకంటే సామవేదానికి శాఖాభేదాలు చాలా ఎక్కువ అన్న విషయంలో సందేహం లేదు.

సామతర్పణ విధిలో (౧)రాణాయన (౨) శాట్యముగ్ర్య (౩) వ్యాస (౪) భాగురి (౫) ఔలుండి (౬) గౌల్గులవి (౭) భానుమానౌపమన్యవ (౮) కారాటి (౯)మశకగార్గ్య (౧౦) వార్షగవ్య (౧౧)కుథుమ (౧౨) శాలిహోత్ర (౧౩) జైమినులు అనబడే పదముగ్గురు సామగానాచార్యులు పేర్కొనబడ్డారు..

కాలక్రమంలో ఇందలి అనేకశాఖలు లోపించాయి. పైశాఖలో మనకిప్పుడు (౧) రాణాయనీయ (౨) కౌథుమీ (౩) జైమినీయాలనేమూడు శాఖలకు సంబంధించిన సంహితలు మాత్రమే లభిస్తున్నాయి.

రాణాయనీయ - కౌథుమశాఖలలో గానపద్ధతిభేదమే కాని మంత్రభేదం లేదు. ఒకవర్గంవారు ప్రపాఠక - అర్ధప్రపాఠక - దశతీ-భేదాలతో మంత్రాలను పరిగణిస్తే మరొక శాఖవారు అధ్యాయాలు ఖండాలు అనే భేదంతో లెక్కిస్తారు. ఒక్కొక్కచోట మాత్రం స్వరభేదమూ, పాఠభేదమూ కనిపిస్తాయి.ఉదాహరణకు - కౌథుమీయులు'హాఉ ' అని ఉచ్చరిస్తే రాణాయనీయులు'హావు' అంటారు. 'రాఇ' 'రాయి' అనేచోట కూడా ఇంతే.'హో ' 'హా' ఇలాంటి ఉచ్చారణ భేదాలు కూడా వున్నాయి. జైమినీయ సంహితలో మాత్రం పాఠ భేదాలు ఎక్కువగా గోచరిస్తాయి.

**స్వర ప్రయోగం:**

౭ స్వరాలూ, ౩ గ్రామాలూ, ౨౧ మూర్ఛనలూ, ౪౯ తానాలూ ఇవన్నీ కలిసి స్వరమండలమవుతుందని నారదీయశిక్ష పేర్కొంటున్నది.

ఈ స్వరమండల పరిధిలోనే ఉద్గాతలు సామగానం చేస్తారు అలా చేసేటప్పుడు వికారం, విశ్లేషణం, వికర్షణం, అభ్యాసం, విరామం, స్తోభం అనే ఆరు సామవికారాలను వాళ్లు ఉపయోగిస్తారు. గానసమయంలో వర్ణాలకు ద్విరుక్తి, దీర్ఘీకరణం మొదలైన మార్పులు ఈ సామవికారాలను ఆశ్రయించే జరుగుతాయి.

సామగానంలో సప్తస్వర ప్రయోగం సాధారణంగా అవరోహణ క్రమాన్ని అనుసరించి వుంటుంది. నారదీయశిక్షలో సామస్వర నిర్ణయం ఇలా చేయబడింది:

**యః సామగానాం ప్రథమస్స వేణోర్మధ్యమః స్వరః।**

**యో ద్వితీయస్స గాంధారస్తృతీయస్త్వృషభః స్మృతః॥**

**చతుర్థః షడ్జ ఇత్యాహుః పంచమో ధైవతో భవేత్।**

**షష్ఠో నిషాదో విజ్ఞేయః సప్తమః పంచమః స్మృతః॥**

పై స్వరాలను గమనించి స్వరనిపుణులైనవారు సామగానం చేస్తారు.

సామగానానికి సంబంధించిన గానగ్రంథాలు (౧) గ్రామగానం (౨) ఆరణ్యకగానం (3) ఊహగానం (౪) ఊహ్యగానం అనే పేర్లతో ప్రసిద్ధిచెందాయి. శాఖాభేదాన్ననుసరించి గాన సంఖ్యలో గూడా భేదాలున్నాయి.

సామగానంలో నైపుణ్యం సంపాదించటానికి గట్టి పరిశ్రమ అవసరం. అందుకే ఋగ్వేదం(౫.౪౪.౧౪) సోమరులు సామగానంలో ప్రావీణ్యం సంపాదించ లేరని చెబుతున్నది.

**కవితాసౌందర్యం**

ఒక వస్తువులోని సౌందర్యం మనం చూసే చూపును బట్టి అనుభూతిలోకి వస్తుంది. పలుకుబళ్ళు, రీతులు, వృత్తులు, భావాలు, భాష, శబ్దార్థాలంకారాలు వగైరాలన్నింటిలో ఉండే అపురూపాన్ని బట్టి ఆ రచనలోని కవితాసౌందర్యాన్ని మనం అవలోకించవచ్చు. ఇలాంటి పరిశీలన చేయడానికి కావ్యాల్లో అవకాశం ఎక్కువగా ఉంటుంది. అలా అని వైదికవాఙ్మయంలో ఆ అందచందాలు తక్కువ అని అనడానికి వీల్లేదు. లౌకికసాహిత్యానికి ఇందులోను అది ఒక అడుగు ముందే ఉంది. ఇప్పుడు ఎంతగానో పెరిగిన లౌకికవాఙ్మయానికి ప్రాచీన వైదికవాఙ్మయం పునాది లాంటిది.

కేవలం వైదికకర్మానుష్ఠానానికే పరిమితమై, యజ్ఞయాగాల్లో అక్కడక్కడ చదివే మంత్రాలుగానే ఆ వాఙ్మయాన్ని సంకుచిత భావంతో చూడటం సరైన పనికాదు. అందులోని సాహిత్యపరమైన సౌందర్యాన్ని మనం సందర్శించవలసిన అవసరం ఎంతైనా ఉంది. చరిత్రకందని కాలంలోనే భారతీయుల భావనలు ఎంతో మృదువైనవి సరసమైనవని పాశ్చాత్యులు ఎంతగానో ప్రశంసించిన తరువాత కూడా మనం వేదాల్లో ఏముంది ? అని చిట్లిస్తూ కళ్ళు తెరవక పోవడం విచారకరం.

ఏవో కొద్ది మంత్రాలు తప్ప సామసంహిత అంతా ఋక్కులమయమే. కాబట్టి పలుకుబళ్ళు, ఇతర భావనలు మళ్లా ఇక్కడ ప్రస్తావించవలసిన పనిలేదు. వివరాలు ఆ సంహితనుంచే గ్రహించవచ్చు చమత్కారవహంగా ఉండే కొన్ని శబ్దార్థాలంకారాలను పరిశీలిస్తూ, ఆ సంహిత సౌందర్యప్రవంతిలో కొద్ది బిందువులను మాత్రం ఇక్కడ మనం అనుభూతికి తెచ్చుకుందాం.

**1. శబ్దాలంకారాలు :**

శబ్దాలు ప్రబంధ బాహ్యస్వరూపాన్ని తీర్చిదిద్దుతాయి. ఒక దివ్యసుందరమూర్తిలో కనబడే అందచందాలు, వంపుసొంపుల వయ్యారాలు ఒక చూపులోనే అందరినీ ఆకట్టుకొన్నట్టు మృదు మధురంగా చక్కని ఊపుతో ప్రయోగింపబడ్డ శబ్దపరంపర చెవిని బడినంతమాత్రానే శ్రోతలను ఆకర్షిస్తుంది. శబ్దపరమైన ఈ ఆకర్షణ ఈనాడు మనకు కొత్త కాదు. వేదకాలంనాటికే అది మానవుల అనుభూతికి అందింది. మిగత సంహితల్లో లాగానే సామసంహితలో కూడ మనకు ఇలాంటి శబ్దాలంకారాలు కుప్పలు తెప్పలుగా కనబడుతున్నాయి.

**(౧) వృత్త్యనుప్రాస :**

ఒకే హల్లు అనేకమార్లు వస్తే సామాన్యంగా అది వృత్త్యను ప్రాస అవుతుంది. ఈ క్రింది మంత్రంలో 'య' 'త' అనే అక్షరాలు అనేకసార్లు ఆవృత్తిని పొంది చక్కని వృత్త్యను ప్రాస ఏర్పడింది. చూడండి-

పభాయ ఆ నిషీదత పునానాయ ప్రగాయత

శిశుంన యజ్ఞైః పరి భూషత శ్రియే॥ (ఉ. ౪.౧౨.౧)

అలాగే ఈ క్రింది మంత్రాల్లో 'స' 'ర' 'వ' మొదలైన అక్షరాలు ఎన్నో సార్లు ఆవృత్తాలై చెవికింపైన చక్కని వృత్త్యను ప్రాసను సంతరిస్తున్నాయి. అంతేకాక 'వాజ్యక్షాః' సహస్ర అనే పదాలు రెండుసార్లు ప్రయోగింపబడి చక్కని లాటానుప్రాసను కూడా మనకందిస్తున్నాయి. చూడండి.

ప్ర వాజ్యక్షాః సహస్రధార స్తిరః పవిత్రం వి వారమవ్యమ్।

స వాజ్యక్షాః సహస్రరేతా అద్భిర్మృజానో గోభిః శ్రీణానః॥ ( ఉ. ౪.౨.౧౧.౧)

ఒక్క వృత్త్యనుప్రాస మాత్రం కాక, ఇటు లాటాను ప్రాస అటు ఛేకానుప్రాస కూడా ఒకే మంత్రంలో ఇమిడి వినేవాళ్ళకు ఎంతో ఆనందాన్నందించే ఈ క్రింది మంత్రం శబ్దాలంకారప్రస్తావనలో మనం తప్పక చూడదగింది:

ఇమా ఉత్వా సుతేసుతే నక్షన్తే గిర్వణో గిరః గావో వత్సం న ధేనవః॥ (పూ.

౩.౧.౮) ఇందులో 'సుతే సుతే' అవటంలో లాటానుప్రాస, 'గిర్వణో గిరః' అవటంలో ఛేకానుప్రాస, మూడవపాదంలో 'వ' అనే అక్షరం మూడు సార్లు ఆవృత్తం కావడంలో వృత్త్యనుప్రాస, ఇలా ఈ సామలో అనుప్రాసత్రయం మన చెవులకు విందు చేస్తున్నది.

**(౨) లాటానుప్రాస :**

అర్థభేదం లేకుండా తాత్పర్యభేదం మాత్రముండేటట్లు ఒక పదం రెండుసార్లు ప్రయోగింపబడితే అది లాటానుప్రాస అనే శబ్దాలంకారం అవుతుంది.

ఇలాంటివే కాక ఇంకా అనేకరకాల లాటానుప్రాసలుసామసంహితలో అడుగడుగునా కనబడతాయి. సంగ్రహంగా కొన్నింటిని మాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాము.

**యజ్ఞా యజ్ఞా వో అగ్నయే గిరా గిరా చ దక్షసే।**
**ప్రప్ర వయమమృతం జాతవేదసం ప్రియం మిత్రం న శంసిషమ్॥**
**(పూ. ౧.౪.౧)**

ఈ మంత్రంలో 'యజ్ఞా యజ్ఞా' అని 'గిరా గిరా' అని రెండు సార్లు ఒకే పదం అర్థభేదం లేకుండా ప్రయోగింపబడటం ఒకవిధమైన లాటానుప్రాస. అలాగే 'పాహి' అనే పదం నాలుగుసార్లు ప్రయోగింపబడి ఈ క్రింది మంత్రానికి ఎంత చక్కని ఊపును తీసుకువచ్చిందో ఒకసారి గమనించండి:

**పాహి నో అగ్న ఏకయా పాహ్యుత ద్వితీయయా।**
**పాహి గీర్భిస్తిసృభిరూర్జాం పతే పాహి చతసృభిర్వసో॥ (పూ. ౧-౪-౨)**

అర్థభేదం లేకుండా 'భద్ర' పదాన్ని, 'వృష' పదాన్ని చాలాసార్లు ప్రయోగిస్తూ వినడానికి ఎంతో హాయిని కలిగించే ఈ సామ మంత్రాలు ఎంత సుందరంగా ఉన్నాయో!

**భద్రో నో అగ్నిరాహుతో భద్రా రాతిః సుభగ భద్రో అధ్వరః।**
**భద్రా ఉత ప్రశస్తయః॥ (పూ. ౨.౨.౫)**

**వృషా సోమ ద్యుమాం అసి వృషా దేవ వృషవ్రతః।**
**వృషా ధర్మాణి దధ్రిషే॥ (పూ. ౬.౨.౮)**

ఇలాగే ఒకే పదాన్ని చాలాసార్లు ప్రయోగిస్తూ లాటాను ప్రాసల నందించే మంత్రాలను ఎన్నింటినో మన సామ సంహితలో చూడవచ్చు.

మహామనీషులైన మహర్షుల అలౌకిక దర్శనానికందిన మంత్రాలలో ఏనాడో ఇన్ని అలంకారాలు ఇమిడి ఉండడం నిజంగా మన భాగ్య విశేషం.

**(3) ఛేకానుప్రాస :**

వివిధ్నమైన అర్థాలుగల రెండక్షరాలు మధ్యలో వ్యవధానం లేకుండా వెంటవెంటనే ప్రయోగింపబడితే అది ఛేకానుప్రాస అవుతుంది. ఈ క్రిందిమంత్రంలో 'ఇన్ద్ర' పదం మూడుసార్లు ప్రయుక్తమై లాటానుప్రాస అమరగా, దానికి అర్కేభిరర్కిణః అని ఛేకానుప్రాస ఎంత సౌందర్యాన్ని సంతరిస్తున్నదో చూడండి:

**ఇన్ద్రమిద్ గాథినో బృహదిన్ద్ర మర్కేభిరర్కిణః ఇన్ద్రంవాణీరనూషత॥ (పూ. ౩.౧.౫)**

ఇలాగే వృత్త్యనుప్రాసతో కలసిన లాటానుప్రాసలు కూడా ఈ సంహితలో ఎన్నో ఉన్నాయి.

ఎన్నో పదాలు అర్థభేదం లేకుండా ఒకే వరుసలో అలాగే ప్రయోగింపబడటం ఈ క్రింది మంత్రంలో స్పష్టంగా కనబడుతుంది.

**తరత్స మన్దీ ధావతి ధారా సుతస్యాన్ధసః తరత్ స మన్దీ ధావతి॥**
**(పూ. ౬.౨.౪.)**

'జనితా' అనే పదాన్ని ఏడుసార్లు ప్రయోగిస్తూ శ్రోతలను అట్టే ఆకర్షిస్తున్న ఈ క్రింది మంత్రం ఎంత వీనులవిందుచేస్తున్నదో గమనించండి:

**సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః।**
**జనితాగ్నేర్జనితా సూర్యస్య జనితేన్ద్రస్య జనితోత విష్ణోః॥ (ఉ. ౩.౬.౫)**

**(౪) యమకం:**

అర్థభేదంతో అక్షరాల సమూహం మళ్లా మళ్లా ప్రయోగింపబడితే అది యమకమనే శబ్దాలంకారం. అక్షరసమూహం ఆవృత్తి కావడంతో మధ్య వ్యవధానం ఉండటమే ఛేకానుప్రాసకు దీనికి భేదం.

ఇలాంటి యమకాలు ఈ సంహితలో ఎక్కువగా కనపడవు. ఈ క్రిందిమంత్రం చూడండి:

**అంజతే వ్యంజతే సమంజతే క్రతుం రిహన్తి మధ్వాభ్యంజతే॥**

ఇక్కడ 'అంజతే' అనే పదం వ్యవధానంతో నాలుగుసార్లు ప్రయోగింపబడి చక్కని యమకశోభను సంతరించింది. ఇలాగే లాటానుప్రాసతో కలిసిన యమకప్రయోగం చూడండి:

**పవ్యస్వ మధుమత్తమ ఇన్ద్రాయ సోమ క్రతువిత్తమో మదః।**
**సోమం వీరాయ శూరాయ॥ (పూ. ౨.౩.౯)**

'వాతా' అనే అక్షరసమూహం వ్యవధానంతో రెండుసార్లు ప్రయుక్తమై యమకంగా ఏర్పడగా 'భు' అనే వర్ణం ఆవృత్తమై వృత్త్యనుప్రాసగా మంచి ఆకర్షణను కలిగించిన ఈ క్రిందిమంత్రం పరిశీలించండి:

**వాత ఆ వాతు భేషజం శమ్భు మయోభు నో హృదే ప్ర న ఆయూంషి తారిషత్॥**
**(పూ. ౨.౯.౧౦)**

### 2. మకుటాలు :

తరువాతకాలంలో ఎంతగానో విస్తరించిన శతకవాఙ్మయానికి బీజాలు ఋగ్వేదంలో లాగానే సామవేదంలో మనకు కనబడతాయి. చాలా మంత్రాల చివరిపదాలు ఒకేరకమైన వాక్యంతో పూర్తి కావడం ఇక్కడ గమనార్హం. సామసంహితలో ఇలాంటి మకుటాలుగల మంత్రసమూహాలు సుమారు ఆఱు కనబడతాయి. ఆ దశతిలో ఎన్ని మంత్రాలు ఒకే మకుటంతో ఉన్నాయనేది అంత ముఖ్యమైన విషయంకాదు. కాని ఒకే రకమైన వాక్యాన్ని ఆవృత్తి చేస్తూ ఏకొన్ని మంత్రాలు నడిచినా అదొక ప్రత్యేకమైన శోభను కలిగిస్తుందనడంలో అతిశయోక్తిలేదు. ఆమకుటాలనారింటిని ఇక్కడ ఉదాహరిస్తున్నాను. చూడండి.

1. అథావో వస్యసస్కృధి ఉ. ౪.౨.౧-౧౦
2. తరత్స మన్దీ ధావతి ఉ. ౪.౨.౧-౪
3. వసు స్పార్హం తదా భర ఉ.౪.౩.౧-౩
4. ఇన్ద్రాగ్నీ తస్య బోధతమ్ ఉ. ౪.౩.౧-౩
5. మదేషుసర్వధా అసి ఉ. ౪.౬.౧-౩
6. సత్రమా పురుస్పృహమ్ ఉ. ౪.౯.౧౦

### 3. అర్థాలంకారాలు :

అలంకారశాస్త్రంలో ఎన్నెన్నో అర్థాలంకారాలు చెప్పబడ్డాయి. వేదకాలంనాటికే ఈ అలంకారాలకొక స్వరూపం ఏర్పడింది. కాకపోతే ఇన్ని వైవిధ్యాలు ఆనాడు లేకపోవచ్చు. కాలక్రమేణ మానవుడు తన బుద్ధిబలంతో అలంకారశాస్త్రంలో ఎన్నో విలక్షణమైన విభాగాలను చేశాడు. సామసంహితలో ఎన్నో అర్థాలంకారాలున్నాయి. మచ్చుకు కొన్నింటినిమాత్రం సంగ్రహంగా ఇక్కడ పరిశీలిస్తాం

#### 1. ఉపమా :

ఆనాటికీ ఈనాటికీ ఉపమాలంకారం అలంకారాలన్నింటికి మూలభూతమైందనడంలో ఎవరికీ అభిప్రాయభేదం లేదు. అలాంటి ఉపమలు ఈ సంహితలో ఎన్నో కనబడతాయి చూడండి.

**తం వః సఖాయో మదాయ పునానమభి గాయత శిశుం న హవ్యైః స్వదయన్త గూర్తిభిః ॥**
(ఉ. ౪..౧)

ఈ సామలో చక్కని ఉపమాప్రయోగం కనబడుతోంది

"ఓ ఋత్విక్కులారా! మీరు సోమదేవతను చక్కగా స్తుతి చేయండి అని చెప్పి అనేకాలంకారాలతోను, పాలతోనూ చిన్నపిల్లవానిని సంతోషపెట్టి ప్రసన్నుణ్ణిగా చేసుకున్నట్లు ఈ దేవతను యజ్ఞాలతోను, హవిస్సులతోను, స్తుతులతోను ప్రసన్నుణ్ణిగా చేసుకోండి" అనే భావంకల ఈ సామలో "శిశుంన" అనే పదంద్వారా రమణీయమైన ఉపమానాన్ని అందించారు. ఇక్కడ 'న' అనేది ఉపమా వాచకం.

**సంవత్స ఇవ మాతృభిరిన్దుర్హిన్వానో అజ్యతే దేవావీర్మదో మతిభిః పరిష్కృతః ॥**
(ఉ. ౪.౬.౨)

లేగదూడను తల్లి ఆవు ఆప్యాయంగానాలుకతో నాకుతూ తడిపివేస్తుంటుంది. దేవరక్షకుడు, మదకరుడు, బాగా అలంకరించుకొన్న ఈ సోముడు అలాగే మన నాలుకలపైనుంచి పుట్టిన స్తుతులచే త తడిపి వేయబడుతున్నాడు. చూడండి ఉపమానం ఎంత ఆర్ద్రంగా ఉందో!

#### 2 మాలోపమ :

ఉపమేయం ఒకటిగానే ఉండి ఉపమానాలు మాత్రం మాలలాగా ఒకటికంటే ఎక్కువగా ఉంటే అది మాలోపమ. ఈ క్రింది మూడు సామలలో ఎలాంటి మాలోపములున్నాయో ఒక్కసారి పరిశీలించండి.

**ప్ర స్వానాసో రథా ఇవార్వన్తో న శ్రవస్యవః సోమాసో రాయే అక్రముః ॥**
(ఉ. ౪.౨.౧.౪)

**హిన్వానాసో రథా ఇవ దధన్విరే గభస్త్యోః భరాసః కారిణామివ ॥** (ఉ. ౪.౨.౧.౫)

**రాజానో న ప్రశస్తిభిః సోమాసో గోభిరంజతే యజ్ఞో న సప్త ధాతృభిః ॥**
(ఉ ౪.౮.౬)

ఈ మూడు సామల్లోను ఉపమేయం సోమరసం. అది ప్రతి సామలోను రెండు ఉపమానాలతో పోల్చబడింది. కనుక ప్రతిసామ మాలోపమకు లక్ష్యమవుతున్నది చూడండి:

వ్వుడు చేస్తూ వస్తున్న రథాల్లాగా గుఱ్ఱాల్లాగా సోమలతలో మంచి పిండబడే సోమరసాలు వస్తున్నాయి.

యాగభూమికి తరలి వస్తున్న రథాల్లాగా, సంభారాలను మోసుకువస్తున్న ఋత్విక్కుల్లాగా, ఋత్విక్కుల భుజాలపై సోమరసాలు ధరింపబడ్డాయి.

మంచిస్తుతులచే రాజుల్లాగా, ఏడు హోత్రాలచేత యజ్ఞంలాగా సోమరసాలు ఆవుపాలచేత సంస్కరింపబడుతున్నాయి. ఈ ఉపమానాలు పరిశీలిస్తే ఎంతో లోతైన భావన వాటివెనక ఉన్నట్లు మనకర్థమవుతుంది.

### ౩. ఉల్లేఖం :

ఒకే వస్తువు అనేక విధాయా చెప్పబడితే అది ఉల్లేఖాలంకారమౌతుంది. ఒకరకమైన ఉల్లేఖం ఈ క్రింది సామలో కనబడుతుంది:

బ్రహ్మా దేవానాం పదవీః కవీనామృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్।
శ్యేనో గృధ్రాణాం స్వధితిర్వనానాంసోమః పవిత్రమత్యేతి రేభన్ ॥

( ఋ. ౩.౧.౧౯.౨)

'సోముడు దేవతలకధిపతి, కవులలో శ్రేష్ఠుడు, విప్రుల్లో ఋషి, మృగాల్లో మహిషం, పక్షుల్లో డేగ, శస్త్రాల్లోస్వధితి అనే కత్తి అని అనేక విధాయా చెప్పడం వల్ల ఇది ఒక ఉల్లేఖాలంకారమౌతుంది.

### ౪. స్వభావోక్తి :

జాతి గుణ క్రియాదులు ఉన్నవి ఉన్నట్లే చక్కగా వర్ణింపబడటమే స్వభావోక్త్యలంకారం. ఈ సామలో చూడండి ఎంత చక్కని స్వభావోక్తి కనపడుతుందో!

**అయం దక్షాయ సాధనోఽయం శర్ధాయ వీతయేఽయం దేవేభ్యో మధుమత్తరః సుతః**

( ఋ. ౪.౬.3)

ఈ సోమరసం బలానికి సాధనం. దేవతలకు రుచికరమైన ఆహారం. ఇది మంచి వేగాన్ని కలిగిస్తుంది. చక్కగా పిండబడ్డ ఈ రసం మధురాతిమధురంగా ఉండి దేవతలను తృప్తిపరిపిస్తుంది. ఇలా సోమరసస్వభావం చక్కగా వివరింపబడటం వల్ల ఇది స్వభావోక్త్యలంకారమని చెప్పవచ్చు.

సామసంహితలో ఉన్న చాలా మంత్రాలు కొద్ది తేడాలతో ఋక్సంహితలోను దొరుకుతాయి. ఇక్కడ పేర్కొన్న మంత్రాలు సోమసంహితలోను ఉండటంచేత వీటిని ఆ సంహితలోనివిగానే ఉదాహరించడం జరిగింది.

ఇలాగే సామసంహితలో కవితాసామగ్రి ఎంతగానో మనకు దొరుకుతుంది. నిజంగా సామగానం ఎంతో హాయినిస్తుంది. సామగానంకంటే మధురమైంది సోమపానం. సోమపానంకంటే అతి మధురమైంది సామకవితా సౌందర్యామృతరసపానం. ఒక్కసారైనా ఆ సౌందర్యాన్ని అనుభూతిలోకి తెచ్చుకోలేకపోతే ఈ జన్మకు పరమార్థం శూన్యం.

### ఆర్చికలు - సంగ్రహపరీక్ష

సామవేదసంహితలు ఒకప్పుడు అనేకములుండెనని చెప్పుదురు. పురాణములందు ఈ సంహితలు సహస్రముగా పేర్కొనబడినవి. 'సహస్రవర్త్మా సామవేదః' అని సర్వానుక్రమణిలో తెల్పబడియున్నది. అయినను కౌథుమీశాఖ, రాణాయనీశాఖ, జైమినీయ శాఖ అను మూడు మాత్రమే మనకిప్పుడు దొరకుచున్నవి. కొందరీ సంహిత ఏడు శాఖలైనదనియు. వానిలో కడపటి రాణాయనీయశాఖ మరి తొమ్మిది శాఖలుగా విస్తరిల్లినదనియు, అందు కౌథుమీశాఖ ఘూర్జరదేశమునందును, జైమినీయశాఖ కర్ణాటకదేశమందును, రాణాయనీయశాఖ మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశములందును ఎక్కువగా వ్యాపించినవనియు చెప్పుచున్నారు.

వీనిలో మిక్కిలి ప్రసిద్ధమైన కౌథుమీశాఖ రెండు భాగములుగా విభజింపబడినది. ఈ భాగములకు 'ఆర్చిక' లని పేరు. ఆర్చిక అనగా ఋక్కుల సమూహము. మొదటిదానికి పూర్వార్చిక అనియు, రెండవదానికి ఉత్తరార్చిక అనియు పేర్లు.

పూర్వార్చిక ఆరు ప్రపాఠకములుగా విభజింపబడినది. ఒక్కొక్క ప్రపాఠకము మరల రెండేసి అధ్యాయములుగను, ఒక్కొక్క అధ్యాయము అయిదేసి దశతులుగను విభజింపబడినవి 'దశతి' అనగా పది ఋక్కుల సమూహము. ఆరవప్రపాఠకమునందలి రెండవ అధ్యాయమున నాలుగుదశతులు మాత్రమే ఉన్నవి. ఈ విధముగా పూర్వార్చికలో మొత్తము ఆరు ప్రపాఠకములు, పన్నెండు అధ్యాయములు, ఏబదితొమ్మిది దశతులు ఉన్నవి. కొన్ని దశతులలో పూర్తిగా పది ఋక్కులు లేనికారణముచ కాబోలు పూర్వార్చిక యందలి మొత్తము ఋక్కుల సంఖ్య ౫౮౫ గా చెప్పబడినది.

ఉత్తరార్చికలో తొమ్మిది ప్రపాఠకములున్నవి. మొదటి అయిదు ప్రపాఠకములందును రెండేసి అధ్యాయములును, చివరి నాల్గు ప్రపాఠకములందును మూడేసి అధ్యాయములును కలవు. మొత్తము అధ్యాయముల సంఖ్య ౨౨. ఋక్కుల సంఖ్య ౧౨౨౫. కొందరు పరిశీలకులు దీనికి ఏబది యైదు మంత్రములతో కూడిన 'ఆరణ్యక కాండమును,' పది ఋక్కులతో కూడిన "మహానామ్న్యార్చిక"ను చేర్చియుండిరి. ఈ విధముగా మొత్తము ఋక్కుల సంఖ్య ౧౮౭౫ అగును. కొందరు మొత్తము ఋక్కుల సంఖ్య ౧౮౧౦యే అనియు అందుండి పునరుక్తములను తొలగించినచో మొత్తము ౧౫౪౯ ఋక్కులుండుననియు చెప్పుచున్నారు దీనిలో ౭౫ తప్ప మిగిలినవన్నియూ ఋగ్వేద సంహితయందలివే. ముఖ్యముగా అవి ౮-౯ మండలములనుండి గ్రహింపబడినవి.

ఇందలి పెక్కుఋక్కులు గాయత్రీ ఛందమునందును, కొన్ని గాయత్రీ, జగతీ పాదములతో కూడిన ప్రగాథచ్ఛందము నందును కలవు. ఈ ఛందములలోని గేయములన్నియూ మొదటి నుండియూ గానమున కుద్దేశింపబడినవే. ఋగ్వేదమున లేని

౭౫ ఋక్కులును , కొన్ని ఇతర సంహితలనుండియు , కొన్ని వివిధ కర్మకాండ గ్రంథములనుండియూ గ్రహింపబడినవి.

వానిని దర్శించిన ఋషులు శ్రుతర్షి, తృణపాణి, వర్ష హవ్యుడు, ముక్తవాహ ద్వితుడు, ఆయుల్ త్వాహి మున్నగువారు. ఇక సామవేద సంప్రదాయ ప్రవర్తకులనేకులు. వంశ బ్రాహ్మణమను గ్రంథము ౨ ఋషి పట్టికలు ఇచ్చినది. మొదటిదానిలో ౬౨ గురువు రెండవదానిలో ౧౫ గురువు కనపడ్తురు. వీరుగాక సామగానాచార్యులు సామగాన ప్రవచన కర్తలు మరికొందరు కలరు.

ఋగ్వేదమునుండి గ్రహింపబడిన ఋక్కులు కూడా అందలి క్రమమునుసరించి కాక అవి ఉపయోగింపవలసిన మతకర్మల కనుగుణముగా సేకరింపబడినవి. ఈ ఋక్కులకును మనకిప్పుడు లభించు ఋగ్వేదమునందలి ఋక్కులకును కొన్ని పాఠభేదములు కనిపించును పాడునపుడు కొన్ని అక్షరములను దీర్ఘీకరించుటచేతను పునరుక్తము చేయుటచేతను, అధికముగా చేర్చుటచేతను, ఋత్విజుల సౌకర్యమునకై ఏర్పడిన స్వరభేదములచేతను అవి మార్పుచేయబడి ఉన్నవి.

పూర్వార్చికయందలి ఋక్కుల క్రమమునుసరించు గాన గ్రంథములు రెండు కలవు. వీనికి 'గ్రామ గేయ గాన గ్రంథము,' ''అరణ్య గాన గ్రంథము'' అని నామములు. 'ఊహగానము', 'ఊహ్యగానము' అను నామములుగల మరి రెండు గానగ్రంథములు ఉత్తరార్చికయందలి ఋక్కులననుసరించుచున్నవి . ఉత్తరార్చికయందలి ఋక్కులు పూర్వార్చికయందలి ఋక్కులకంటే ఎక్కువ సక్రమముగా మండి త్రిపదములుగా కూర్చబడినవి. వీనియందలి మొదటి పాదము సాధారణముగా పూర్వార్చిక యందుండిన ఋక్కుయొక్క పునరుక్తిగానే గోచరించును.

యజుర్వేదమునందలి మంత్రములవలనే సామవేదమునందలి ఋక్కులను సోమయాగ సందర్భమున పఠించుటకుద్దేశింపబడినట్టివే. ఋగ్వేదమునందలి ఉపయోగింపబడిన సందర్భమునకును ఇందలి సందర్భమునకును సాదృశ్యముండదు. వాని ప్రాముఖ్యము ప్రత్యేక కర్మలకు సంబంధించి యుండుటచే వానిలో ఒండొంటికి అంతర్గమైన సంబంధం అంతగా కనిపించదు స్వరముల విషయముకూడా వీనికిని ఋగ్వేదములందలి వానికినీ చాలా భేదముగోచరించును. అందుచే సామవేదమును సోమయాగ సందర్భమున ఉద్గాతలను ఋత్విజులు పఠించు ఋక్కుల సముదాయము అని చెప్పవచ్చును. పైన పేర్కొనబడిన గాన గ్రంథములందలి ఋక్కుల సంఖ్యను వానిని గానము చేయు విధానమును అనుసరించి పెంపొందింపవచ్చును. (పూర్వార్చికయందలి మొదటి ౧౨ దశతులను అగ్నికిని, చివరి దశతులు సోమునికిని, మధ్యనున్న ౩౬ దశతులును సోమపాయి అయిన ఇంద్రునికిని సంబోధింపబడినవి). ఉత్తరార్చికలో పునరుక్తము చేయబడిన పూర్వార్చికయందలి ఋక్కులకును ఋగ్వేదమునందలి ఋక్కులకును సన్నిహితతర సంబంధము కనిపించును. ఋగ్వేదమునందలి ఋక్కులచే ప్రత్యేకముగా ప్రభావితములైన ఉత్తరార్చికయందలి ఇతర ఋక్కులతో సామరస్యము కల్పించుటకై అవి అట్లు మార్చబడి ఉండునని ఊహింపవచ్చును.

పూర్వార్చికయందలి ఋక్కులకును ఋగ్వేదమునందలి వానికిని ఎక్కువ భేదముండుటకు అవి మొదట ఋగ్వేదమునుండి సంగ్రహింపబడిన తరువాత స్వతంత్రమును ప్రత్యేకమునైన సంప్రదాయమును అనుసరించి పఠింపబడి ఉండుటయే కారణమై ఉండును. శతపథబ్రాహ్మణమునందలి ఉత్తర భాగము వెలసినప్పటికే సామవేదపూర్వార్చికయందలి భాగములు ప్రచారమునందు ఉండెననుటకు సూచనలున్నవి. యజుర్వేదమునందలి తైత్తిరీయ వాజసనేయ సంహితలకంటే సామవేదము ప్రాచీనతరమనుటకు వాజసనేయమునందు ఋగ్వేదమునందలి ఋక్కులకంటే భిన్నములైన పాఠములుగల సామవేదభాగములు కనిపించుటయే నిదర్శనము.

ఋగ్వేద సామవేదములందలి ఋక్కులలోని పాఠభేదములకు వాని ఉపయోగమునందలి భేదమే హేతువు. సామవేదమునందలి ఋక్కుల ప్రధానప్రయోజనము సంగీతమే. పూర్వోత్తరార్చికలు రెండును ఆ సంగీతమును బోధించుటకే ఉద్దేశింపబడినవి. ఉద్గాతయైన ఋత్విజుడుగా ఉండగోరు పండితుడు ఆర్చికలద్వారా ముందు సంగీతమును నేర్చుకొనవలయును. అప్పుడే అతడు యాగసమయము నందు పాడవలసిన విధమున వానిని గానముచేయగలుగును.

పూర్వార్చికయందలి ౫౮౫ ఋక్కులందును వివిధరాగము లిమిడి యున్నవి.

సామమను పదము సాధారణముగా వేదమునకే వాడబడుచున్నను 'రాగము' లేక 'గానము' అనియే దాని నిజమైన అర్థము. వేదతత్త్వవేత్తలు ఋక్కునకును గానమునకునుగల సంబంధము తెల్పుచు ఋక్కునుండియే గానము పుట్టినదని చెప్పుదురు. దీనివలన ఋక్కును రాగమునకు యోని అనియు వారు తెల్పుదురు. ఏదైన ఋక్కును వివిధ రాగములతో పాడుటకును, పెక్కు ఋక్కులను ఒకేరాగమున పాడుటకును అవకాశమున్నను కొన్నిఋక్కులను ప్రత్యేక రాగములకే యోనులని వర్ణింతురు. పూర్వార్చికయందలి ౫౮౫ ఋక్కులను వివిధములైన (సుమారు రెట్టింపు ౧౧౨౦) రాగములలో పాడవచ్చును.

ఉత్తరార్చికలో ౪౦౦ మంత్రములున్నవి. ఒక్కొక్క మంత్రమున మూడేసి ఋక్కులుండును. వీనినుండియే యాగసమయములందు పాడబడు స్తోత్రములను

**మొదలు - చివర :**

ఈ సంహిత ''యేత్రిషప్తాః పరియన్తి'' అనే వాచస్పతిదేవతాకమైన మంత్రంతో మొదలై ''పవాయ్యం తదస్వినా కృతం'' అనే అశ్వినీ దేవతాక మంత్రంతో పూర్తవుతుంది.

**సంహితావిభాగం:**

అథర్వసంహిత ఇరవై కాండలుగ విభజింపబడింది. కాండం ప్రపాఠకాలుగా, అనువాకాలుగా, దశతులుగా, సూక్తాలుగా విభాగం చేయబడింది. ఈ సంహితలో (శౌనకశాఖ) ౭౩౬ సూక్తాలు, ౫,౯౮౭ మంత్రాలు ఉన్నాయి. అందులో సుమారు ౧౨౦౦ మంత్రాలు ఋగ్వేదంనుంచి యథాతథంగా తీసుకోబడ్డాయి. అందులో చాలాభాగం పది - ఎనిమిది ఒకటవ మండలాల్లోనుంచి, కొద్దిభాగం ఇతరమండలాల్లోనుంచి పరిగ్రహింపబడ్డాయి. ఇరవయ్యోకాండలో ౧౪౩ ఋగ్వేదసూక్తాలున్నాయి. అందులో ౧౨ సూక్తాలు తప్ప మిగతా సూక్తాల్లో ఋగ్వేదంలో ఉన్న (ఆనుపూర్వి) క్రమం కనపడదు. ఇతరకాండల్లో ఉన్న మంత్రాలు ఎంతో మార్పు చేయబడ్డాయి.

| కాండసంఖ్య | సూక్తసంఖ్య | మంత్రసంఖ్య | కాండసంఖ్య | సూక్తసంఖ్య | మంత్రసంఖ్య |
|---|---|---|---|---|---|
| ౧ | ౩౫ | ౧౫౩ | ౧౧ | ౧౦ | ౩౬౭ |
| ౨ | ౩౬ | ౨౦౭ | ౧౨ | ౫ | ౩౦౪ |
| ౩ | ౩౧ | ౨౩౦ | ౧౩ | ౪ | ౧౮౮ |
| ౪ | ౪౦ | ౩౨౪ | ౧౪ | ౨ | ౧౩౯ |
| ౫ | ౩౧ | ౩౭౬ | ౧౫ | ౧౮ | ౨౨౦ |
| ౬ | ౧౪౨ | ౪౫౪ | ౧౬ | ౯ | ౧౦౩ |
| ౭ | ౧౨౩ | ౧౮౬ | ౧౭ | ౧ | ౩౦ |
| ౮ | ౧౦ | ౨౯౩ | ౧౮ | ౪ | ౨౮౩ |
| ౯ | ౧౦ | ౩౧౩ | ౧౯ | ౭౨ | ౪౫౬ |
| ౧౦ | ౧౦ | ౩౫౦ | ౨౦ | ౧౪౩ | ౯౪౧ |

## మంత్రద్రష్టలగు మహర్షులు

అథర్వవేదానికి పూర్వం ''అథర్వాఙ్గిరస'' అనేపేరు ఉండేది అథర్వుడు, అంగిరసుడు అనేవారి వంశాలకు చెందిన ఇరవైమంది ఋషులు ఈ వేదంలోని అధిక సంఖ్యాకాలైన మంత్రాలను కనుక్కోవడంచేత దీనికి ఆపేరువచ్చింది

'ఋషి' అనేపదానికి 'ద్రష్టః' అంటే సామాన్యులు చూడలేని విషయాలను తన తపోబలం చేత చూడగలిగినవాడు, అని అర్థం. వేదానికి సంబంధించినంతవరకు 'ఋషి' శబ్దానికి తన తపోబలం చేత వైదికమంత్రాలను కనుగొని వాటిని యథాతథంగా, తనకు గోచరించిన విధంగా, తరువాతివారికి అందజేసినవాడు అని అర్థం. ఋగ్యజుస్సామవేదాలలోని వివిధమంత్రాలను కనుగొన్న ఋషులు ఎందరో ఉన్నట్లే అథర్వవేదాన్ని దర్శించిన మహర్షులు కూడ చాలా మంది ఉన్నారు.

నేడు అధికప్రచారంలో ఉన్న అథర్వవేద శౌనకీయశాఖలోని ౭౩౬ సూక్తాలలో ౫,౯౮౭ మంత్రాలు ఉన్నాయి. ఈవేదం ౨౦ కాండలుగా విభజింపబడింది. ఇరవయ్యోకాండలో ఉన్న ఋక్కులన్నీ ఋగ్వేదంలో కూడా ఉన్నాయి. ఇవి కాకుండా మిగిలినకాండల్లో ఉన్న ఏడువందలలో ఒకవంతు ఋక్కులు కూడా ఋగ్వేదంలో ఉన్నవే. ఈ రెండు వేదాలలోనూ సమంగా ఉన్న ఋక్కులకు సంబంధించినంతవరకు ఋషులు కూడా తుల్యులే అయివుండాలని భావించడంసహజం. కాని కొన్ని ఋక్కులఋషులు వేరువేరుగా చెప్పబడి ఉన్నారు. ఈ వేదానికి సంబంధించిన ఋషుల నామధేయాలు మాత్రమే కాని, వీరి వైయక్తిక చరిత్రనుగూర్చి మనకేమీ తెలియదు.

**ఛందస్సు**

అర్థాన్ని తెలుసుకోకుండా వేదాన్ని పఠించడం వల్ల కలిగే ఫలం అసంపూర్ణంగా ఉంటుంది, వేదమంత్రాలు అనేకచ్ఛందస్సులలో ఉండటంవల్ల వేదార్థజ్ఞానాన్ని పొందాలంటే ఛందశ్శాస్త్రజ్ఞానం అత్యవసరమవుతుంది. ఛందశ్శాస్త్రపరిచయం లేకపోతే, యజన - యాజన, అధ్యయన - అధ్యాపనాది వైదికకర్మలలో పొరపాటు రావడానికి అవకాశముంది. ఇలాంటి దోషాలవల్ల కలిగే అనర్థాలు అనేకాలని వేదమే చెబుతున్నది.

ఛందశ్శాస్త్రజ్ఞానం చాలా ఆవశ్యకమని పాణినీయశిక్షలో ఇలా స్పష్టంగా చెప్పబడింది.

**అర్థం ఛందశ్చ దైవత్యం వినియోగం పునః పునః ।**

**వేదితవ్యం ప్రయత్నేన బ్రాహ్మణేన విశేషతః ॥**

ఛందశ్శాస్త్రం చతుర్దశవిద్యలలో ఒక విలక్షణమైన విద్యగా చేర్చబడింది :

పై శ్లోకంలోని 'అంగాని' అనేపదంలో వేదాంగాలు చెప్పబడుతున్నాయి. ఈవేదాంగాలు శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అని ఆరు. ఈ అంగాలు ఆరు అవయవాలని, వేదం అవయవి (అవయవాలు కలది) అని పాణినీయశిక్ష ప్రతిపాదించింది.

వేదశరీరానికి ఛందస్సు పాదాలు. కల్పం హస్తాలు, జ్యోతిషం కన్ను, నిరుక్తం చెవులు, శిక్షఘ్రాణం, వ్యాకరణం నోరు వంటివి మానవశరీరంలో కరచరణాద్యవయవాలకెంత

ప్రాధాన్యమివ్వబడుతోంది, వేదం ఏంలో శిక్షాదిషడంగాలకంత ప్రాధాన్యమివ్వవలసి ఉంది.

'ఛందః పాదౌతు వేదస్య' అని చెప్పబడినందువల్ల, ఛందస్సుతో సంబంధంలేని వేదశరీరం, పాదాలులేని మానవశరీరంలాంటిదని గ్రహించాలి. మానవశరీరంలో పాదాలకుగల ప్రాధాన్యం చాల ఎక్కువ. పాదాలు లేని మానవుని ప్రయాస అనుభవంతోనే తెలియవలసింది. ఇక వేదశరీరానికి పాదస్థానీయమైన ఛందశ్శాస్త్రంయొక్క ఉత్పత్తి వైదికఛందస్సుల లక్షణాలు, అందులోని భేదాలు, ఉదాహరణలు, అథర్వసంహితలోని ఛందోవిశేషాలు ఇక్కడ పరిశీలిద్దాం.

సమస్తవిద్యలకు అధినాథుడైన ప్రమథనాథుడు ఈ ఛందశ్శాస్త్రాన్ని నందికేశ్వరునికి ఉపదేశించినట్లు, అగస్త్యుడు ఇంద్రుడు, వాసుకి, పింగళుడు, బృహస్పతి, సనత్కుమారుడు మొదలైనవాళ్లు నందికేశ్వరుని ద్వారా ఈ శాస్త్రోపదేశాన్ని పొందినట్లు తెలుస్తున్నది.

ప్రస్తుతం లభిస్తున్న ఛందశ్శాస్త్ర గ్రంథాలలో పింగళాచార్యుని చేత రచింపబడ్డ 'పింగళఛందస్సూత్రం' ప్రాచీనమైందని గుర్తించ బడుతున్నది. దీనిలోని సూత్రాలు వేదమంత్రాలలోని పాదవిభాగాన్ని అక్షరసంఖ్యానియమాన్ని ప్రతిపాదిస్తున్నాయి. ఈ శాస్త్రంలో కొన్ని వర్ణాల సముదాయాలకు కొందరు దేవతలతో సామ్యం చెప్పబడింది. ఉదాహరణకు లఘు(IUI) గురు లఘు రూపమైన జ గణానికి సూర్యునితోను, గురు లఘు గురు (UIU)రూపమైన 'ర' గణానికి అగ్నితోను, లఘు లఘు గురు(IIU)రూపమైన స గణానికి వాయువుతోను సామ్యం కల్పింపబడింది. అక్షరాల సముదాయానికే'గణం' అని వ్యవహారం.

ఛందోలక్షణాలు బ్రాహ్మణగ్రంథాలలో చెప్పబడి ఉన్నప్పటికి విశేషంగా శాంఖాయన శ్రౌతసూత్రాలలోను, ఋగ్వేదప్రాతిశాఖ్యంలోని చివరి మూడు పటలాల్లోను, సామవేదనిదానసూత్రంలోను వివరింపబడ్డాయి. వైదిక కాలానికి తరువాతదైన పింగళ ఛందస్సూత్రం వైదికఛందస్సులతో బాటు లౌకిక వృత్తలక్షణాలను కూడ సూచిస్తున్నది

గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్, జగతి అనేవి ఏడు వైదికఛందస్సులు.

**౧. గాయత్రి :**

సాధారణంగా ఈ ఛందస్సులో మూడుపాదాలు ఉంటాయి. ఒక్కొక్కపాదంలో ఎనిమిది అక్షరాలు. మొత్తం అక్షరాల సంఖ్య ౩X౮=౨౪.

**అప్సుయో యస్త్వద్భధిత్వాయమో అధ్వరీయతామ్**

**వృత్రాతీర్మఘూనాపయః (౧-౪-౪-౧)**

ఈ లక్షణాల సంఖ్యలోని హెచ్చు తగ్గుల ననుసరించి గాయత్రీ ఛందస్సు పాదనిచృత్, అతిపాదనిచృత్, నాగీ, వారాహి, వర్ధమాన ప్రతిష్ఠ మొదలైన భేదాలను పొందుతున్నది.

**౨. ఉష్ణిక్ :**

ఈ ఛందస్సులోనూ మూడే పాదాలు. ఈమూడు పాదాలలో ఎనిమిది అక్షరాలతో ఉండే పాదాలు రెండు. పన్నెండక్షరాలతో ఉండే పాదం ఒకటి. మొత్తం అక్షరాల సంఖ్య ౮+౮+౧౨=౨౮.

**తం తే మదం గృణీ మసివృషణం పత్సు సాహసిమ్ ।**

**ఉ లోకకృత్నుమద్రివో హరిశ్రియమ్ ॥** (౨౦-౫-౬౧-౧).

మళ్లా అక్షరభేదాన్నిబట్టి ఇది కకుప్ - పురఉష్ణిక్ - పరోష్ణిక్ - మొ॥ ప్రభేదాలను కలిగి ఉంది. ఏడక్షరాలతో ఉన్ననాలుగుపాదాలకు కూడ ఉష్ణిక్ అనే వ్యవహారం ఉంది.

**౩. అనుష్టుప్ :**

నాలుగు పాదాలతో ఉండే ఈ ఛందస్సులో ఒక్కొక్క పాదంలో ఎనిమిది అక్షరాలుంటాయి.

మొత్తం అక్షరాల సంఖ్య ౪X౮ = ౩౨.

**యే త్రిషప్తాః పరియన్తివిశ్వా రూపాణి బిభ్రతః**

**వాచస్పతిర్బలా తేషాంతన్వో అద్య దధాతు మే ॥** (౧-౧-౧-౧)

ఎనిమిది అక్షరాలతో ఒకపాదం, పన్నెండక్షరాలతో రెండు పాదాలు మొత్తం మూడు పాదాలతో ౩౨ అక్షరాలతోనే వేరొక అనుష్టుప్ ఛందస్సు కూడ ఉంది.

**౪. బృహతి :**

ఈ ఛందస్సులో పన్నెండక్షరాలు ఉండే పాదమొకటి, ఎనిమిది అక్షరాలు కల పాదాలు మూడు ఉంటాయి. మొత్తం అక్షరాల సంఖ్య ౧౨+౮+౮+౮=౩౬.

**యది కర్తం పతిత్వా సంశ్రే యదివాశ్మ ప్రహృతో జఘాన**

**ఋభూరథస్యేవాంగానిసం దధత్ పరుషా పరుః ॥** (౪-౧౨-౭)

పథ్యా, న్యంకుసారిణీ, ' ఉపరిష్టాత్ బృహతి, పురస్తాత్ బృహతి, మహాబృహతి మొదలైన అవాంతరభేదాలిందులో కనిపిస్తున్నాయి.

**౫. పంక్తి :**

రెండుపాదాలు పన్నెండక్షరాలతోను, రెండుపాదాలు ఎనిమిది అక్షరాలతోను ఉన్న ఛందస్సు 'పంక్తి' అని పిలువబడుతోంది. మొత్తం అక్షరాల సంఖ్య ౧౨+౧౨+౮+౮ = ౪౦.

**భూమిర్మాతాఽదితిర్నో జనిత్రం భ్రాతా**

**న్తరిక్ష మభి శస్త్యా నః ద్యౌర్నః పితా త్ర్యావృం భవాతి జామి**

**మృత్వా మావ పత్సిలోకాత్ ॥** (౬-౧౨౦-౨)

సతఃపంక్తి - ఆస్తారపంక్తి - ప్రస్తారపంక్తి - విస్తారపంక్తి - సంస్తార పంక్తి - అక్షరపంక్తి - పదపంక్తి మొ ॥ ఇందులోని అవాంతరభేదాలు.

**౬. త్రిష్టుప్ :**

ఇందులో పన్నెండక్షరాలతో ఒకపాదం ఎనిమిది అక్షరాలతో నాలుగు పాదాలు మొత్తం ౫ పాదాలుంటాయి. మొత్తం అక్షరాల సంఖ్య ౧౨+౮+౮+౮+౮ = ౪౪

**ఇంద్రో రాజా జగతశ్చర్షణీనామధిక్షమి విషురూపం**

**యదస్తి తతో దదాతిదాశుషే వసూని చోదద్**

**రాధ ఉపస్తుతశ్చి దర్వాక్ ॥(౧౯-౫-౧)** పురస్తాత్ జ్యోతి - మధ్యేజ్యోతి - మొదలైనవి ఇందులోని భేదాలు.

**౭. జగతి :**

ఈ ఛందస్సులో ఒక్కొక్క పాదానికి ఎనిమిది అక్షరాల చొప్పున ఆరు పాదాలుంటాయి. మొత్తం అక్షరాలసంఖ్య ౬X౮ =౪౮.

**వం తా నశ స్తి నరభాతి తస్కరో వాసామామి**

**త్రో వ్యధిరా దధర్షతి। దేవాంశ్చ యాభిర్యజతే**

**దదాతి చ జ్యోగిత్తాభిః స చతే గోపతిః సహ ॥** (౪-౨౧-3)

ఇందులో జ్యోతిష్మతి, పురస్తాత్ జ్యోతి, మధ్యేజ్యోతి మొ ॥ భేదాలున్నాయి.

అథర్వవేదం ఋగ్వేదంలాగా పూర్తిగా ఛందోమయం కాక గద్యపద్యాత్మకమై ఉంది. ఛందోమయమైన భాగాల్లో ఋగ్వేదంలో ఉపయోగించబడ్డ ఛందస్సులే వాడబడ్డాయి. స్వల్పసంఖ్యలో ప్రస్తారపంక్తి, పురస్తాత్ బృహతి, విరాట్, **అతిజగతి**, మొదలైన నూతనచ్ఛందస్సులు స్వీకరించబడ్డాయి. ఈ వేదంలో పూర్తిగా ఛందోబద్ధాలు కానటువంటి కొన్ని మంత్రాలు, గద్యమా? పద్యమా? అనే సంశయాన్ని కలిగిస్తుంటాయి. ఛందస్సు సందిగ్ధంగా ఉన్నప్పుడు 'అగ్ని'దేవతకు సంబంధించినదైతే ఆ మంత్రంలోని ఛందస్సు గాయత్రి అని లేక సవితృ దేవులకు సంబంధించినదైతే ఉష్ణిక్ అని వ్యవస్థను కల్పించుకోవలసి ఉంటుంది. ఛందస్సులకు దేవతలతోను, స్వరాలతోను, వర్ణాలతోను, గోత్రాలతోను సంబంధాన్ని ఛందశ్శాస్త్రజ్ఞులు ఇలా చెబుతున్నారు.

**కవితాసౌందర్యం**

విశ్వసాహిత్యంలో వైదికవాఙ్మయం ఎంత ప్రాచీనమైందో, అంతశ్రేష్ఠమైందిగా కూడా పరిగణింప బడుతున్నది. పరిశోధకులు అనేకదృక్కోణాల నుంచి వేదాల ప్రాశస్త్యాన్ని **పరిశీలించటం** జరుగుతున్నది.

ప్రాచీన వేదసంహితల్లోనే కవితాచమత్కృతిని పుణికి పుచ్చుకొన్న మంత్రాలు అనేకం గోచరిస్తున్నాయి. అందువల్ల సమస్త ధర్మాలకూ మూలంగా పరిగణింపబడే వేదంలోనే తర్వాతి కాలంలో ఎంతగానో అభివృద్ధిచెందిన రమణీయమైన కావ్యవాఙ్మయానికి మూలమైన బీజాలు నిక్షిప్తమై వున్నాయనడంలో సందేహం లేదు.

వేదాల్లోనే 'కావ్యం' అనేపదం చాలాసార్లు ప్రయోగింపబడింది జల్లెడతో జల్లించి మేలైన పిండిపదార్థాన్ని వేరుచేసినట్లు కవులు ప్రతిభతో సందర్భశుద్ధిగల పదాలను ఎన్నుకొని కవిత్వం చెప్పితే ఆ కవిత్వం అర్థవంతమై సహృదయులను ఆకట్టుకొనేవిధంగా రాణిస్తుందని ఋగ్వేదం చెబుతున్నది **సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచ మక్రత।**

**అత్రా సఖాయః సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి ॥**

ఋ. ౧౦-౭౧-౨

ఈ అభిప్రాయంతోనే తర్వాతి అలంకారికులు మళ్లీ మార్చటానికి వీలుగాని పదాలను ప్రయోగించడంలోనే కవుల గొప్పతనం ఇమిడివుందని స్పష్టంగా చెప్పారు.

అథర్వవేదానికి యజ్ఞక్రియాకలాపంతో ఎక్కువ సంబంధంలేదు. జనన మరణ వివాహాది సంస్కారాలు, రాజ్యాభిషేకం, శత్రునిరోధం, రోగనివారణం మొ ॥ క్రియలలో వినియోగించే మంత్రాలే ఈ వేదంలో ఎక్కువగా గోచరిస్తాయి. అభిచారిక క్రియలను ముఖ్యంగా వివరించే వేదమిది.

అథర్వసంహితలో ఇంచుమించు ఆరు వేల మంత్రాలున్నాయి. అందులో **కవితాశోభను** ప్రదర్శించే భాగాలు కోకొల్లలు. శత్రువులను భేదించడంలో అథర్వవేదమంత్రాలు పరమాయుధాలని మనుధర్మశాస్త్రం పేర్కొన్నది. అందుకు తగినట్లే పదప్రయోగంలోనూ, పద్యనిర్మాణంలోనూ సందర్భోచితమైన స్ఫూర్తి ఈసంహితలో అక్కడక్కడా వ్యక్తమవుతున్నది.

ఇతరవేదాలకు యజ్ఞాలతోనే ఎక్కువ సంబంధం. ఈ వేదం అలాకాక అనేక విషయాలను వివరిస్తుంది కాబట్టి ఆయావిషయాలకు తగిన నానావిధ పదజాలం ఇందులో చోటు చేసుకొన్నది. పదప్రయోగంలోని వైవిధ్యం కూడా ఈసంహితకు ఎనలేని శోభచేకూర్చిందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

కవితకు శోభ కలిగించేవాటిల్లో వర్ణన ఒక ప్రధానమైన అంశం. **వర్ణనానిపుణుడే** కవి అనబడతాడు అందుకే ఆలంకారికులు మహాకావ్యాలలో **అష్టాదశవర్ణనలు** వుండాలన్నారు.

అథర్వసంహితలో వర్ణనావైశిష్ట్యాన్ని ప్రదర్శించే సందర్భాలు చాలా వున్నాయి. ౪ వ కాండలోని ౧౬ వ సూక్తం వరుణ దేవతను ఇలా వర్ణిస్తున్నది:

"వరుణుడు శత్రువులకు నియంత వాళ్ళుచేసే అన్యాయాలన్నిటినీ ఆయన దగ్గరనుంచి చూసినట్టే గ్రహిస్తాడు. చరాచరమైన సకలజగత్తూ ఆయనకు కరతలామలకం. ఎదురుగా

నిలిచేవాడూ, పారిపోయేవాడూ, మోసంచేసేవాడూ, కనిపించకుండా తిరిగేవాడూ, కష్టజీవనంతో ప్రవర్తించేవాడూ - ఇలాంటివాళ్లనందరినీ వరుణుడు పరిశీలిస్తూనే వుంటాడు. ఇద్దరు ఒకచోట చేరి రహస్యంగా ఏమి మాట్లాడుకున్నా సర్వజ్ఞుడైన వరుణుడు దాన్ని చక్కగా గ్రహిస్తాడు. అందువల్ల తప్పుడుపనులకు పాలుపడకముందే వాళ్లను ఆయన నిగ్రహిస్తాడు. ఈ భూమి ఆయన సొంతంలోనే ఉన్నది. సువిశాలమైన ఆకాశంకూడా ఆయన అధీనంలోనే ఉంది. అంతేకాదు ; పూర్వపశ్చిమ సముద్రాలే ఆవరుణుడికి కుక్షిభాగాలు. జగమంతటా వ్యాపించివున్న ఆదేవుడు ఈ చిన్నతటాకంలోని నీళ్లలోకూడా దాక్కొని వుంటాడు. చెడుమార్గంలో సంచరించే అనర్థకారులైన శత్రువులను వరుణుని పాశాలు వదలవు. ఆయనగూఢచారులు భూలోకానికి వచ్చి వెయ్యి కళ్లతో ఇక్కడి వృత్తాంతాన్ని గమనిస్తూ వుంటారు. భూమ్యాకాశాల మధ్య వుండే ప్రాణిలోకాన్నంతటినీ ఆయన కళ్లారా చూస్తూ వుంటాడు. జూదగాడు పాచికలను ఆడించినట్లే జీవులను వాళ్ల పాపపుణ్యకర్మల ననుసరించి ఆయన ఆడిస్తూవుంటాడు." (౪.౧౬.౧, ౬).

ఇలాంటి వర్ణనలు వైదికకవుల ప్రతిభకు గీటురాళ్లు-పై వర్ణనకు సంబంధించిన ఈ క్రింది మూడుమంత్రాలను ఉదాహరిస్తు ప్రముఖవేదపండితుడు మాక్డొనెల్ ఇంత అందమైన వర్ణన వేదాలలో కూడా ఇతరత్రా ఎక్కడా లేదని శ్లాఘించాడు.

**ఉతేయం భూమిర్వరుణ స్య రాజ్ఞఉతాసౌ ద్యౌర్బృహతీ దూరే అన్తా ।**
**ఉతో సముద్రౌ వరుణ స్య కుక్షీఉతాస్మిన్నల్ప ఉదకే నిలీనః ॥౪॥**
**త ద్యో ద్యామతిసర్పాత్ పరస్తా న్నస ముచ్యాతై వరుణ స్య రాజ్ఞః ।**
**దివస్పశః ప్రచర న్తీదమస్య సహస్రాక్షా అతి పశ్యన్తి భూమిమ్ ॥౪॥**
**సర్వం తద్రాజా వరుణో విచష్టేయదంతరా రోదసీ యత్పరస్తాత్ ।**
**సంఖ్యాతా అస్య నిమిషో జనానామక్షానివశ్వఘ్నీ నిమినోతి తాని ॥౬॥**

ఈసంహితలోని ద్వాదశ కాండలో ౬౩ మంత్రాలు గల ప్రథమసూక్తం భూమిని అత్యద్భుతంగా వర్ణిస్తున్నది వైదికసాహిత్య పరిశోధకులందరూ ఈ సూక్తంలోని వర్ణనావైచిత్రిని ముక్తకంఠంతో శ్లాఘించారు. అందులోని ఒక మంత్రం ఇది.

**యస్యాం గాయన్తి నృత్యన్తి భూమ్యాం మర్త్యా వ్యైలబాః ।**
**యుధ్యన్తే యస్యామాక్రందో యస్యాం వదతి దుందుభిః ।**
**సా నో భూమిః ప్ర ణుదతాం సపత్నానసపత్నం మా పృథివీ కృణోతు ॥**
(౧౨.౧.౪౧).

దీని తాత్పర్యమిది - "ఏభూమి మీద మనుష్యులు ఆడుతూ పాడుతూ వుంటారో, ఎక్కడయుద్ధానికి తలపడుతూ వుంటారో, ఎక్కడ ఆక్రందనలూ, దుందుభిధ్వనులూ వినిపిస్తూ వుంటాయో, ఆ భూమి మాశత్రువులను తరిమికొట్టుగాక ! నన్ను శత్రువుల బారి నుండి తప్పించుగాక."

ఇక్కడ భూతలంమీది ఆటపాటలతోబాటు ఆక్రందనాలనూ, యుద్ధకాలంలోని దుందుభిధ్వనులనూ కూడా వర్ణించడం వల్ల ఈ ప్రపంచం సుఖదుఃఖాలకు నిలయ మన్న సత్యం స్ఫురిస్తున్నది. శాకుంతలంలో చంద్రాస్తమయంతోబాటు అదేసమయంలో జరుగుతున్న సూర్యోదయాన్ని కూడా వర్ణించిన కాళిదాసుని భావం ఈ కోవకు చెందిందే.

పై పృథివీసూక్తంలోని వర్ణనతో పోల్చి చూస్తే ఈ ధోరణిలో సాగిన రమణీయమైన వర్ణనలు తరువాతవచ్చిన కావ్యజగత్తులో కూడా మనకు అందుగానే గోచరిస్తాయి. చెట్లూ, వరిపొలాలూ, వివిధమృగాలూ, పశుపక్షులూ, నదులూ, కొండలూ, గుట్టలూ మారుతున్న ఋతువులూ, రాత్రింబవళ్లూ, యజ్ఞయాగాలూ మొదలైన భూతలంలోని విశేషాలన్నీ ఇందులో మనోజ్ఞంగా వర్ణింపబడ్డాయి.

వర్ణనలతోపాటు కావ్యసౌందర్యానికి అలంకారాలు గూడా ఎంతో ఉపకరిస్తాయి- ఋగ్వేదకాలం నుండీ వేదసంహితలలో ఉపమ మొదలైన అలంకారాల ప్రయోగం విస్తృతంగానే కన్పిస్తున్నది.

అథర్వసంహితలోని ఐదవకాండలో దుందుభిని వర్ణించే సూక్తంలో మాలారూపమైన ఉపమాలంకార ప్రయోగం ఎంత సొంపుగా వుందో చూడండి.

**యథా మృగాః సంవిజన్త ఆరణ్యాః పురుషాదధి**
**యథా వృకాదజావయో ధావన్తి బహు బిభ్యతీః ।**
**యథా శ్యేనాత్పతత్రిణః సంవిజంతేఅహర్దివి సింహస్య స్తనథోర్యథా ।**
**ఏవా త్వం దుందుభే ఽమిత్రానభిక్రందప్రత్రాసయాథో చిత్తాని మోహయ ॥**
(౫.౨౧.౪.౬.)

"వేటగాణ్ణి చూసి అడవిమృగాలు పారిపోయినట్లు, తోడేలుకు భయపడే మేకలు పరుగెత్తినట్లు, డేగను చూసి సింహగర్జన విన్నవాటిలాగా పక్షులు ఎగిరిపోయినట్లూ - ఓదుందుభీ! నీధ్వనితో శత్రువులను భయపెట్టి పారదోలు ! వాళ్లకు చిత్తక్షోభం కలిగించు!"

ఇలాంటి అలంకారప్రయోగాలవల్ల మంత్రాలకు కావ్యశోభ కల్గడమే కాకుండా అర్థవ్యక్తీకరణలో స్పష్టతగూడా సిద్ధించింది.

ఇక్కడ మరొక విశేషమేమంటే పైన ఉదాహరించిన మూడు మంత్రాలలోనూ ఉత్తరార్థం

పునరుక్త మయింది. ఇలాంటి పునరుక్తులు ఈవేదంలో అక్కడక్కడా కానవస్తాయి. మంత్రప్రయోక్త యొక్క దృఢనిశ్చయాన్ని తెలపటానికి ఉపయోగింపబడిన పునరుక్తులు ఈ సందర్భంలో భూషణాలే కాని దూషణాలుకావు.

ఈ సంహితకున్న మరొక ప్రాముఖ్యమేమంటే - ఆత్మస్వరూపాన్ని విపులంగా నిరూపించే ఉపనిషత్తులలోని అత్యున్నతభావాలకు మూలబీజాలు ఇందులో పుష్కలంగా వున్నాయి. పదవకాండలోని అధ్యాత్మ దేవతాకమైన ఎనిమిదవ సూక్తం ఈ భావాలకు నిలయం. అందలి ఈ క్రింది మంత్రం ఆత్మానాత్మల తత్వాన్ని ఆలంకారికమైనశైలిలో నిరూపిస్తున్నది.

**పుండరీకం నవద్వారం త్రిభిర్గుణేభి రావృతమ్ ।**
**తస్మిన్యద్యక్ష మాత్మన్వత్ తద్వై బ్రహ్మవిదో విదుః ॥(౧౦-౮-౪౩).**

తొమ్మిది ద్వారాలతో కూడిన త్రిగుణాత్మకమైన పద్మంలో ఉన్న ఆత్మను బ్రహ్మజ్ఞులే తెలుసుకోగలరని దీని భావం.

ఇక్కడ ఉపమేయమైన మానవశరీరం వాచ్యంగా పేర్కొన బడకుండా పద్మంతో పోల్చబడింది. సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలు ఆత్మను దేహంలో బంధిస్తున్నాయని వేదాంతుల సిద్ధాంతం. అభివృద్ధి చెందిన కావ్యశైలికి ఇదొక చక్కని నిదర్శనం.

మానవుణ్ణి అధికంగా పీడించేది మృత్యుభయం. సకల ప్రాణులూ మృత్యుభీతిలోనే అల్లాడుతున్నాయి. ఈ భయాన్ని తొలగించుకోవాలంటే ఈశరీరం తాను కానని, నిత్య స్వరూపుడూ, జరామరణాదిరహితుడూ అయిన ఆత్మే తానని తెలిసికోవాలి. ఆత్మజ్ఞానం తప్ప సంసారచక్రంనుంచి తప్పించుకోనటానికి మరొక మార్గం లేదు. ఇది సకలోపనిషత్తుల ప్రబోధసారం. ఈ పరమతత్వాన్ని పై సూక్తంలోని చివరిమంత్రం ఇలా బోధిస్తున్నది.

**అకామో ధీరో అమృతః స్వయంభూరసేన తృప్తోన కుతశ్చనోనః ।**
**తమేవ విద్వాన్న బిభాయ మృత్యోరాత్మానం ధీరమజరం యువానమ్ ॥**
(౧౦ ౮-౪౪)

అంటే "కామరహితుడూ, ధీరుడూ, స్వయంభువూ అయిన ఆత్మ సర్వసమర్థుడై ఆత్మానందంతో తృప్తుడైవున్నాడు. వార్ధక్యాదిదుర్దశలు లేకుండా నిత్యయువకుడైన అట్టి ఆత్మను తెలిసికొన్న వాడికి మృత్యుభయం లేనే లేదు."

అజ్ఞాననివారణకోసం ఆత్మజ్ఞానం అవశ్యకమనేది ఇందులోని పరమార్థం. శరీరం శాశ్వతం కాకపోయినా నిత్యాత్మజ్ఞానానికి సాధనంగా మాత్రం ఉపయోగపడుతుంది. అందుకే "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని చెప్పేడు మహాకవి. శరీరారోగ్యాన్ని ఉద్దేశించిన ఎన్నో మంత్రాలు ఈసంహితలో సాక్షాత్కరిస్తాయి. కాని రోగనివారణకు ప్రయోగింపబడే ఈ క్రిందిమంత్రాలలో భావతీవ్రతకు తగినట్లు అలంకారాలుకూడా ప్రయోగింపబడ్డాయి.

**యథాబాణః సుసంశితః పరాపతత్యాశుమత్ ।**
**ఏవాత్వం కాసే ప్ర పత పృథివ్యా అను సంవతమ్ ॥**

**యథాసూర్యస్య రశ్మయః పరాపతన్త్యాశుమత్ ।**
**ఏవా త్వం కాసే ప్ర పత సముద్రస్యాను విక్షరమ్ ॥** (౬-౧౦౫-౨;౩).

"ఓ కాసరోగమా ! పదునైనబాణం విల్లునుండి విడిబడి మహావేగంతో ఎలా భూమిని భేదించుకొని పోతుందో, అలాగే నీవు ఈ పురుషుణ్ణి వదలి ఆభూమివరం గుండా పాతాళందనుకా వెళ్ళు ! సూర్యకిరణాలు ఎలా లోకాలోకపర్యంతం శీఘ్రంగా వెళ్తాయో అలాగే నీవు వీణ్ణి విడిచి సముద్రం వరకూ వెళ్ళు !"

పదప్రయోగం వ్యర్థంగా కాక భావగర్భితంగా వుంటేనే కావ్యం శోభిస్తుంది. అందుకే మేటికవులు పదప్రయోగంలో ఎంతో జాగరూకులై వుంటారు.

మంచి భర్తకావాలని కోరుకునే వధువుకు ఆశీర్వదిస్తుయోగ్యుడైన పతి ఆమెకు లభించాలని చేస్తున్న ఈ క్రింది ఆశీర్వాదం ఎంతో భావగర్భితంగా వుంది.

**ధాతా దాధార పృథివీం ధాతా ద్యాముత సూర్యమ్ ।**
**ధాతాస్యా అగ్రువై పతిం దధాతు ప్రతికామ్యమ్ ॥(౬ ౬౦ ౩)**

"పృథివినీ, ఆకాశాన్నీ, సూర్యుణ్ణీ ధరిస్తున్న సృష్టికర్త ఈ కుమారికి ఈమెకోరదగు తగిన పతిని ప్రసాదించుగాక !"

పృథివ్యాదులను ధరించే ధాత వధువుకు వరుణ్ణి చేకూర్చాలనడంలో ఆమె చేసుకోబోయే భర్త ఆమెనావిధంగా భరించేవాడూ వుండాలనీ, వారి కుటుంబం విచ్ఛిన్నం కాకుండా నిలిచివుండాలనీ వ్యక్తమవుతున్నది.

ఇలాంటి సాభిప్రాయపదప్రయోగమే పరికరము పరికరాంకురము అన్న అలంకారాలుగా తర్వాతికాలంలో సాహిత్యశాస్త్రజ్ఞులు సిద్ధాంతీకరించటానికి హేతువైంది.

దాంపత్యం ఎలావుండాలో నిర్దేశిస్తూ మరొక మంత్రం ఇలా చెబుతున్నది

**అమోహమస్మి సా త్వం**
**సామాహ మస్మ్యృక్త్వం ద్యౌరహం పృథివీ త్వమ్ ।**
**తావిహ సంభవావ ప్రజామా జనయావహై ॥ (౧౪-౨-౭౧)**

భర్త భార్యతో ఇలా అంటున్నాడు - "నేను సామము, నీవు ఋక్కువు, నేను ఆకాశాన్ని, నీవు భూమివి. మనం కలిసిమెలిసి జీవిస్తూ సంతానవంతులం కాదాం !"

సంసారంలో ఉండవలసిన అన్యోన్యతను పై మంత్రం నిరూపిస్తున్నది. వైదికకాలంనుంచి ఇలాంటి ఉజ్జ్వలభావాలుండటంవల్లనే ఈనాటికీ భారతీయుల గృహస్థజీవనం విచ్ఛిత్తికి దారితీయకుండా సుఖసంతోషాలకు కారణం కాగల్గుతున్నది.

ఇది ఈ వేదసంహిత లోకక్షేమంకోరి ప్రజలకు చేస్తున్నహితబోధకూడా చాలా శ్లాఘనీయమైవుంది

"సామ్మనస్యం కోరే ఓ ప్రజ లారా ! మీరు సమానజ్ఞానంకల్గి వుండండి ! సమంగా మనంలో పాలుపంచుకోండి ! మీమనస్సులు ఒకే రకమైన అర్థాన్ని గ్రహించుగాక! పూర్వం ఇంద్రాదిదేవతలు ఇలా పరస్పరం విరోధంలేకుండ వుండే ఇష్టఫలాన్ని పొంది సుఖించారు. మీ ఆలోచన, కార్యప్రవృత్తి, సంకల్పమూ, హృదయాలూ ఏక రూపంగా ఉండుగాక !"

ఈసందర్భంలోని మూడవ మంత్రమిది।

**సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః।**

**సమానమస్తు వో మనో యథావః సుసహాసతి॥(౬-౬౪-౩)**

రాజులాగా శాసించవల్సిన వేదం ఇక్కడ అత్యంతసౌమనస్యంతో సంమోపదేశం చేసింది. ఇలాంటి సదుపదేశాలున్న ఘట్టాలు ఇంకా ఎన్నో వున్నాయి. హితోపదేశంకూడ కావ్య ప్రయోజనాలలో ఒక ముఖ్యాంశంగా లాక్షణికులు పేర్కొన్నారుగదా !

నానావిధద్వేషభావాలతో సతమతమవుతున్న ఆధునిక ప్రపంచ ప్రజలకు అథర్వసంహిత కావించిన ఈసుసోపదేశం ఎంతైనా శిరోధార్యం.

## కాండలు - సంగ్రహసమీక్ష

నాలుగువేదంగా పరిగణింపబడిన అథర్వసంహిత ఇరవైకాండలుగా విభజింపబడింది. ఈ ఇరవై కాండలు సూక్తాలు, ప్రపాఠకాలు, అనువాకాలు, దశతులనే అవాంతరవిభాగాలతో ఉన్నాయి. ఇందులోని మంత్రాలు కేవలం ఋగ్వేదంలోలాగ పద్యరూపాలే కాక యజుర్వేదం మాదిరి గద్యరూపంలోకూడ ఉన్నాయి. విశేషంగా ౧౫,౧౬ కాండల్లో సుమారు ౫౦ మంత్రాలు, ఇతరకాండల్లో అక్కడక్కడ ముప్పైదాకా ఈ గద్య మంత్రాలు దొరుకుతున్నాయి ఇంకా కొన్నిచోట్ల పద్యమయమైన మంత్రాల మధ్యలో కొన్ని గద్యభాగాలుకూడా లేకపోలేదు

ఈసంహితలో మొదటి పదమూడు కాండలు మాత్రమే మొదట ఉండేవని, తరువాత మిగతావి చేర్చబడ్డాయని అందులోని విషయాలను, విభాగపద్ధతిని, దృష్టిలో పెట్టుకొని కొందరు పాశ్చాత్యులు అభిప్రాయపడ్డారు కాని విషయవిభాగసామ్యమున్నంతమాత్రాన అంతవరకే మూలగ్రంథమని నిర్ణయింపబూనటం సాహసమని భారతీయుల భావన.

మొదటి ఏడు కాండల విభాగం అందులో ఉన్న సూక్తాల మంత్రసంఖ్యనుబట్టి చేయబడిందని కొందరంటారు. మొదటి కాండలో నాలుగు, రెండవకాండలో ఐదు, మూడవకాండలో ఆరు, నాలుగవకాండలో ఏడు, ఐదవకాండలో ఎనిమిదినుంచి పద్దెనిమిది వరకు, ఆరవకాండలో మూడు, ఏడవకాండలో సగభాగంలో ఒక్కొక్కటిమాత్రమే ప్రతి సూక్తంలోను మంత్రాలు కనబడుతున్నాయి. ఎనిమిదినుంచి పదమూడు కాండలవరకు గల మంత్రాలు దీర్ఘవృందసూక్తాల్లో ఉన్నాయి. మొదటి పదమూడు కాండల్లోని విషయాలు చిందరవందరగా ఉన్నాయేగాని ఒకపద్ధతిప్రకారం చెప్పబడినట్లు లేవు.

ఇక పద్నాలుగునుంచి పద్దెనిమిదివరకు గల ఐదుకాండల్లో విషయం ఏదో ఒకపద్ధతిప్రకారం ఉన్నట్లు తోస్తుంది. వివాహానికి సంబంధించిన మంత్రాలు పద్నాల్గవకాండలో చెప్పబడ్డాయి. అందులో చాలావరకు ఋగ్వేదం పదో మండలాన్నుంచి తీసుకోబడినవే. పదిహేనవకాండ వ్రాత్యుడనే పేరుగల పరమాత్మను స్తుతిస్తుంది. పదహారు పదహేడవ కాండల్లో వశీకరణ మంత్రాలు చెప్పబడ్డాయి. ఈ రెండు చాల చిన్నవి. పదహారవకాండలో తొమ్మిది సూక్తాలు, పదిహేడవకాండలో ఒక్క అనువాకం మాత్రం ఉన్నది. పద్దెనిమిదవకాండం మరణానంతరం చేసే ఖననసంస్కారాన్ని గురించి, పితృదేవతలను గురించి వివరిస్తున్నది. ఇందులో మంత్రాలుకూడా ఋగ్వేదంలోని పదవమండలంలోని మంత్రాలతో పోలి ఉంటాయి.

ఇక పంతొమ్మిది, ఇరవై కాండలు ఆధునికాలుగా కనబడతాయి. పంతొమ్మిదో కాండలో పరిశిష్ట భాగాలుకూడా లేకపోలేదు ఇరవైయ్యవకాండలో ఋగ్వేదంలోని ఇంద్రస్తుతిపరాలైన సూక్తాలు కొన్ని యథాతథంగా కనబడతాయి. ఈ కాండలో సోమయాగానికి సంబంధించిన మంత్రాలుండటం చూస్తే దీనికి వేదత్వ ప్రతిపత్తి కల్పించడానికి ఇలా యజ్ఞసంబంధం ఏర్పరచారేమోననిపిస్తున్నదని పాశ్చాత్యపరిశోధకులు అభిప్రాయపడ్డారు. ఈ కాండలో "కుంతాపసూక్తాలు" నే పేరుతో పది సూక్తాలున్నాయి (౧౨౭-౧౩౬) ఇవి ఋగ్వేదంలోని దానస్తుతులను అనుకరిస్తూ ఉంటాయి.

ఇలా ఈ సంహితలోని ఇరవైకాండల స్వరూపం మనం సంగ్రహంగా తెలుసుకోవచ్చు. ఈకాండల్లో ప్రతిపాదింపబడిన విషయాలను స్థాలీపులాకంగా అక్కడక్కడ పరిశీలిస్తే ఈ సంహితలో గల అనాటి వారి విజ్ఞానం, ఆలోచనలు, ఆదర్శాలు, ఆచారాలు మొ॥ వాటిని మనము అర్థంచేసుకోవచ్చు. ముచ్చుకు కొన్నింటిని చూడండి :

## పుట్టింట్లోనే ఉండిపోని !

ఆడవారి మనసులో అసూయ ఏర్పడనంతవరకు బాగానే ఉంటుంది. అసూయ అడుగుపెడితే చాలు, ద్వేషం నేనిక్కడే ఉన్నానంటూ ప్రత్యక్షమౌతుంది. ద్వేషాగ్ని మనసులో రగులుకుంటే ఏమేమి చేస్తుందో ఎలా చెప్పగలం? తమ విరోధులను దురదృష్టవంతులను చేయడానికి వారు వాడిన పూలను, వంతులను, దంతధావన ద్రవ్యాన్ని, జుట్టును ఈ వేదంలోగల ప్రథమకాండలోని పద్నాల్గవ సూక్తాన్ని ఉచ్ఛరిస్తూ నేలలో పాతిపెట్టేవారు ఆనాటి వారు. దాని భావం గమనించండి :

పండబారిన చెట్టునుంచి అందరూ ఎలాపూలు కోసుకుంటారో అలా నేను ఈమె భాగ్యాన్ని అందచందాలను అపహరిస్తున్నాను. ఈమె భూమిలో బాగా పాతుకుపోయిన పర్వతంలాగా, చిరకాలం తల్లిదండ్రుల ఇంట్లోనే స్థిరంగా ఉండిపోవాలి. ఓ సోమా! ఈమెను మెట్టినింటినుంచి పుట్టినింటికి వెళ్ళగొట్టు. అదృష్టహీన అయిన ఈమెకట్టేసినట్లు జీవితాంతంవరకు అక్కడే ఉండిపోనీ : (౧.౧౪).

## క్రిమిరోగాల నరికడతాను !

క్రిములవల్ల మానవశరీరంలో అనేకరోగాలు కలుగుతున్నాయనే సత్యం ఈ వేదంలో గుర్తింపబడింది. ఆ రోగాలను పోగొట్టుకోవడానికి ఈ సూక్తం ఉపయోగపడుతుంది. చూడండి.

ఇంద్రుని క్రిమిరోగాలనన్నిటిని పోగొట్టగలడు. శనగలను రాతిమీద నూరినట్లు ఈశిలతో నా శరీరంలోని రోగాలనన్నింటిని చూర్ణం చేస్తాను. క్రిములుకొన్ని కంటికి కనపడతాయి. కొన్ని కంటికి కనపడవు, వలవేసి పట్టినట్లు పట్టి వాటినన్నింటిని నాశనం చేస్తాను. పేగుల్లోను, శిరస్సులోను, పడమలలోను, ఉండే క్రిములను ఈమంత్రంతో నాశనం చేస్తాను. కొండల్లో ఉండే క్రిములు పర్ణద్వారా అన్నపానీయాలద్వారా మనలో ప్రవేశిస్తున్నాయి. వాటి ఉత్పత్తినే నేను అరికడతాను (౨.౩౧).

## లోకాన్నెలా వశపరచుకోవాలి ?

తన చుట్టూ ఉన్న సమాజంలో చక్కని స్నేహబంధాలను నెలకొల్పడంద్వారా దానిపై తన ప్రభావాన్ని ప్రసరింపజేసి సహృదయం "సాంమనస్యం" అనే సూక్తంద్వారా దాన్ని వశపరచుకోవడం సాధ్యమని ఈ వేదం చెబుతుంది.

మీతో సహానహృదయంతో ప్రీతితో స్నేహంచేస్తున్నాను, మీరుకూడా ఆవుల్లాగ వత్సగుణంతో పరస్పరం స్నేహంగా ఉండండి. తండ్రిమాట వినే కొడుకు, పిల్లల భావాలనర్థంచేసుకొనే తల్లి, భర్తతో ప్రియంగా మాట్లాడే భార్య, తోడబుట్టినవారితో తగాదాపడని అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, ఇలా ప్రతివాళ్ళ ఇతరులనర్థంచేసుకుంటూ మంచిమాటలను మాట్లాడుకోండి : మీరు సమానహృదయంతో బండి చక్రంలో నాభికి చుట్టూ ఆకులున్నట్లు కలసి మెలసి ఉండండి : మిమ్మల్ని స్నేహమనే పాశంతో బంధించి వశపరచుకుంటున్నాను (3.30).

## ఎలా నిద్రకలిగించడం?

కొందరికి నిద్రకలిగించి తన కార్యాన్ని సాధించుకోవాలి ఎలా ? 'సహస్రశృంగ 'అనే సూక్తంతో అందరికీ నిద్రవచ్చేటట్లు చేయవచ్చు.

"వెయ్యి కిరణాలుగల సూర్యునిద్వారా పిల్లను నిద్రాపరవశుల్ని చేస్తున్నాను. గాలి ఎక్కువగా వీచకుండుగాక : నన్నెవరూ చూడకుండుగాక : ఓ వాయూ! నీవు ప్రాణవాయురూపంలో అందరి శరీరాల్లో సంచరిస్తున్నావు. చుట్టూ ఉన్నవారినందరినీ నిద్రలో మునిగేటట్లు చెయ్యి. అచేతనమైన ఈమహాభవనం ఎలా లోకాన్ని చూడలేదో అలాగే మీరంతా నన్ను చూడకుండా ఉండేటట్లు మీ కన్నులను నిద్రతో మూసేస్తున్నాను నా ప్రియురాలి తల్లి, తండ్రి, వాకిట్లో కాపలాకాసే కుక్క, చుట్టూ ఉన్నవాళ్ళ, చుట్టాలు అందరు సూర్యోదయం అయ్యేవరకు నిద్రలో మునిగిపోదురుగాక!" (౪.౫).

**విరిగిన ఎముకలను కలపడమెలా ?**

ఆయుధాలవల్ల శరీరావయవాలు తెగిపోయినప్పుడు, రక్తం ప్రవాహంలాగా కారిపోతున్నప్పుడు, ఎముకలు విరిగిపోయినప్పుడు'రోహిణ్యాసి' (౪-౧౨) అనే సూక్తంతో అభిమంత్రించిన లక్కనీళ్లతో ఆ భాగాలను ఉషఃకాలంలో తడపాలి. అలా చేస్తే తెగిన అవయవాలు, ఎముకలు అతుక్కుంటాయి.

## వర్షమెలా కురుస్తుంది?

కరువు విలయతాండవం చేస్తున్నది వర్షాలు పడటం లేదు. ఎలా వర్షాలను కురిపించడం? 'సముత్పతన్తు'(౪-౧౫) అనే సూక్తాన్ని ఉపయోగించి కొన్ని పనులు చేయడం ద్వారా వర్షాన్ని కురిపించవచ్చునని ఈ సంహిత చెబుతున్నది.

**ఓ జ్వరమా ! వెళ్ళిపో!**

జ్వరం తగిలినప్పుడు కలిగే బాధలను వివరిస్తూ, అలాంటి జ్వరం మమ్ములను వదిలి దూరంగా పోవాలని "అగ్నిస్తక్మానం (౫-౨౨)అనే సూక్తంతో అభిమంత్రించిన జావను రోగికి తాగించేవారు. పద్నాలుగు మంత్రాలుగల ఈ సూక్తంలో జ్వరస్వరూపం ఎంతో చక్కగా వివరింపబడింది, ఉదాహరణకు చూడండి!

" ఓ జ్వరమా! నీ సవసవనే సోదరునితోను, దగ్గనే చెల్లెలితోను, దురద అనే దాయాదితోను కలిసి ఇక్కడినుంచి దూరంగా వెళ్ళిపో."

**క్షయవ్యాధి నివారణం :**

రాజయక్ష్మ అంటే క్షయ. అదొక భయంకరమైన వ్యాధి. దాన్ని పోగొట్టడానికి పదిరకాల చెట్లముక్కలతోను, లక్కతోను బంగారంతోను తయారుచేయబడ్డ 'శకలమణి' ని 'యాబభ్రవః' (౮-౭) అనే సూక్తంతో అభిమంత్రించి రోగికి కట్టేవారు. దాంతో అతనికి ఆరోగ్యం కుదిరేది.

**అతిథి సేవాఫలం :**

ఈ సంహితలో తొమ్మిదవ కాండలోని మూడో అనువాకంలో (౨-౭) సూక్తాల్లో అతిథిమాహాత్మ్యం, అతిథిగౌరవం, ఆతిథ్యమివ్వడం యజ్ఞంతో సమానమనే విషయాలు చక్కగా చెప్పబడ్డాయి. ప్రాచీన భారతీయుల ఆతిథ్యాన్ని గురించి విశేషంగా తెలుసుకోదలచినవారు తప్పకుండా చదవవలసినవి ఈ సూక్తాలు. ఉదాహరణకు చూడండి:

గృహస్థు ఎవరినైనా తన ఇంటికి ఆతిథ్యమిస్తాను రమ్మని ఆహ్వానించి ఏ కారణంచేతనైనా అతడు ఆలస్యం చేస్తే, అతనికంటే ముందే భోజనం చేసినట్లైతే ఏం జరుగుతోంది? తన కుటుంబానికి సంబంధించిన ఇష్టాపూర్తఫలాలు, పాడిపంటలు, సంతానం, పశుసంపద, కీర్తిప్రతిష్ఠలు, సంపద, వివేకం, అన్నీ నాశనమైపోతాయి. అతిథి భోజనం చేసిన తరువాతనే తను భోజనం చేయాలి. కనుక ఏ పరిస్థితిలోను అతనికంటే ముందు తను భోజనం చేయకూడదు.(౯-౬)

**ఈ శరీరాన్ని భగవంతుడిచ్చాడు :**

మనకు ఈ శరీరం ఎలా వచ్చింది? ఈ విషయాన్ని గురించి అథర్వవేదం చర్చించినంతగా ఇంకా ఏ వేదంలోను చర్చింపబడలేదేమో! తొమ్మిదవకాండలో మొదటి అనువాకంలో రెండవసూక్తం ఎంతో విచిత్రంగా ఈ విషయాన్ని చర్చిస్తుంది. ఎన్నెన్ని ప్రశ్నలో 33 మంత్రాల్లో మన శరీరంలోని ప్రతి అవయవం పేరుపేరుకు చెప్పబడి 'దీన్నెవరిచ్చారు?' 'ఇదెలా ఏర్పడింది?' అని చాలా వరకు ప్రశ్న పరంపర కనబడుతుంది. చివరకు 'ఇది దేవుడిచ్చిన శరీరం' 'దీన్ని మనకు అనుగ్రహించి ఇందులో ఆయన ప్రవేశించాడు' అని ఎంతో చక్కగా చెప్పబడింది. ఇందులో ఎన్నో నూతనాంశాలు కనబడుతున్నాయి. మానవుడైన ప్రతివాడు ఒక్కసారైనా జీవితంలో చదవవలసిన సూక్తమిది.(౧౦-౨)

**అన్నమే అన్నం తింటున్నది :**

పదకొండవకాండలో అన్నం పరబ్రహ్మస్వరూపమని ప్రతిపాదించబడింది. మనం అన్నాన్ని తింటున్నామా? అన్నం మనల్ని తింటున్నదా? అని ప్రశ్నించి అన్నమే అన్నాన్ని తింటున్నదనే సిద్ధాంతం ఇందులో ఎంతో ఆశ్చర్యంగా చేయబడింది.

పన్నెండవకాండలో గల పృథివీసూక్తం అథర్వవేదానికే తిలకం లాంటిది. భూమికి సంబంధించిన ఎన్నో విశేషాలు ఎంతో చక్కగా ఈ సూక్తంలో ప్రస్తావించబడ్డాయి. (౧౨-౧) రాజు రాష్ట్రం క్షేమంగా ఉండాలని రోహిత దేవుడు పదమూడవకాండలో స్తుతించబడ్డాడు. ఉదయించే సూర్యునికే రోహితుడని పేరు.

ఈ సంహితలో మొదటినుంచి పంధొమ్మిదవ కాండవరకు అనేకమైన అభిచార కర్మలు, ఎన్నో లౌకికవిషయాలు ప్రతిపాదించబడి చివరికాండలో మాత్రం యజ్ఞయాగాలకు సంబంధించిన ఎన్నో విషయాలు చెప్పబడ్డాయి. లౌకికదృష్టితో పరిశోధనచేసే ఈనాటి పరిశోధకులకు అథర్వవేదం ఒక గనిలాంటిది. అందులో ఎన్నో రహస్యాలు, సమాజకల్యాణానికి అనుసరించవలసిన పద్ధతులు కుప్పలు కుప్పలుగా ఉన్నాయి. వాటిని అర్థంచేసుకొని ఉపయోగించుకోవడం, దాని ద్వారా లోకకల్యాణాన్ని సాధించడం బుద్ధిమంతుల కర్తవ్యం.

**-శుభం-**

# అథర్వవేద సంహితా

## ప్రథమం కాణ్డమ్

### అథ ప్రథమోఽనువాకః (౧) ప్రథమం సూక్తమ్

### మేధాజనన సూక్తమ్

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- వాచస్పతిః ॥ ; ఛన్దః :- ౧-౩ అనుష్టుప్; చతుష్పదావిరాడురో బృహతీ ॥

౧. యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః ।
వాచస్పతిర్బలా తేషాం తన్వో౽ అద్య దధాతు మే ॥ ౧

౨. పునరేహి వాచస్పతే దేవేన మనసా సహ
వసోష్పతే ని రమయ మయ్యేవాస్తు మయి శ్రుతమ్ ॥ ౨

౩. ఇహైవాభి వి తనూభే ఆర్త్నీ ఇవ జ్యయా ।
వాచస్పతిర్ని యచ్ఛతు మయ్యేవాస్తు మయి శ్రుతమ్ ॥ ౩

౪. ఉపహూతో వాచస్పతిరుపాస్మాన్ వాచస్పతిర్హ్వయతామ్ ।
సం శ్రుతేన గమేమహి మా శ్రుతేన వి రాధిషి ॥ ౪

### (౨) ద్వితీయ సూక్తమ్

### విజయ సూక్తమ్

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- పర్జన్యః ॥ ఛన్దః :- ౧-౨, ౪ అనుష్టుప్; ౩ త్రిపదా విరాణ్నామ గాయత్రీ ॥

౫. విద్మా శరస్య పితరం పర్జన్యం భూరిధాయసమ్ ।
విద్మో ష్వస్య మాతరం పృథివీం భూరివర్పసమ్ ॥ ౧

౬. జ్యాకే పరి ణో నమాశ్మానం తన్వం కృధి ।
వీడుర్వరీయోఽరాతీరప ద్వేషాంస్యాఽకృధి ॥ ౨

౭. వృక్షం యద్గావః పరిషస్వజానా అనుస్ఫురం శరమర్చన్త్యృభుమ్ ।
శరుమస్మద్యావయ దిద్యుమిన్ద్ర ॥ ౩

౮. యథా ద్యాం చ పృథివీం చాన్తస్తిష్ఠతి తేజనమ్ ।
ఏవా రోగం చాస్రావం చాన్తస్తిష్ఠతు ముఞ్జ ఇత్ ॥ ౪

### (౩) తృతీయ సూక్తమ్

### ఆరోగ్య సూక్తమ్

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- పర్జన్యాదయో మన్త్రోక్తాః ॥ ; ఛన్దః :- ౧-౫, పథ్యాపంక్తిః ౬, ౭, ౮, ౯ అనుష్టుప్; ॥

౯. విద్మా శరస్య పితరం పర్జన్యం శతవృష్ణ్యమ్ । తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం బహిష్టే అస్తు బాలితి ॥ ౧

౧౦. విద్మా శరస్య పితరం మిత్రం శతవృష్ణ్యమ్ । తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం బహిష్టే అస్తు బాలితి ॥ ౨

౧౧. విద్మా శరస్య పితరం వరుణం శతవృష్ణ్యమ్ । తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం బహిష్టే అస్తు బాలితి ॥ ౩

౧౨. విద్మా శరస్య పితరం చన్ద్రం శతవృష్ణ్యమ్ । తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం బహిష్టే అస్తు బాలితి ॥ ౪

౧౩. విద్మా శరస్య పితరం సూర్యం శతవృష్ణ్యమ్ । తేనా తే తన్వే౩ శం కరం
పృథివ్యాం తే నిషేచనం బహిష్టే అస్తు బాలితి ॥ ౫

౧౪. యదాన్త్రేషు గవీన్యోర్యద్వస్తావధి సంశ్రితమ్ ।
ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ ౬

౧౫. ప్ర తే భినద్మి మేహనం వర్త్రం వేశన్త్యా ఇవ ।

ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ ౭

౧౬. విషితం తే వస్తిబిలం సముద్రస్యోదధేరివ ।
ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ ౮

౧౭. యథేషుకా పరాపతదవసృష్టాధి ధన్వనః ।
ఏవా తే మూత్రం ముచ్యతాం బహిర్బాలితి సర్వకమ్ ॥ ౯

## (౪) చతుర్థం సూక్తమ్
## జల-సూక్తమ్

ఋషిః :- సిన్ధుద్వీపః కృతిర్వా ॥ ; దేవతా :-ఆపః ॥ ; ఛన్దః :- ౧-౩ గాయత్రీ; ౪ పురస్తాద్ బృహతీ ॥

౧౮. అమ్బయో యన్త్యధ్వభిర్జామయో అధ్వరీయతామ్ ।
పృఞ్చతీర్మధునా పయః ॥ ౧

౧౯. అమూర్యా ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ ।
తా నో హిన్వన్త్వధ్వరమ్ ॥ ౨

౨౦. అపో దేవీరుప హ్వయే యత్ర గావః పిబన్తి నః । సిన్ధుభ్యః కర్త్వం హవిః ॥ ౩

౨౧. అప్స్వన్తరమృతమప్సు భేషజమ్ ।
అపాముత ప్రశస్తిభిరశ్వా భవథ వాజినో గావో భవథ వాజినీః ॥ ౪

## (౫) పంచమం సూక్తమ్
## అపాం భేషజమ్

ఋషిః :- సిన్ధుద్వీపః కృతిర్వా ॥ దేవతా-ఆపః ॥ ఛన్దః - గాయత్రీ ॥

౨౨. ఆపో హి ష్ఠా మయోభువస్తా న ఊర్జే దధాతన । మహే రణాయ చక్షసే ॥ ౧

౨౩. యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః । ఉశతీరివ మాతరః ॥ ౨

౨౪. తస్మా అరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ ।
ఆపో జనయథా చ నః ॥ ౩

౨౫. ఈశానా వార్యాణాం క్షయన్తీశ్చర్షణీనామ్ । అపో యాచామి భేషజమ్ ॥ ౪

## (౬) షష్ఠం సూక్తమ్
## అపామ్ భేషజమ్

ఋషిః :- అథర్వా కృతిర్వా ॥; దేవతా :- ఆపః ॥; ఛన్దః :- ౧-౩ గాయత్రీ; పథ్యాపంక్తిః ॥

౨౬. శం నో దేవీరభిష్టయ ఆపో భవన్తు పీతయే । శం యోరభి స్రవన్తు నః ॥ ౧

౨౭. అప్సు మే సోమో అబ్రవీదన్తర్విశ్వాని భేషజా ।
అగ్నిం చ విశ్వశంభువమ్ ॥ ౨

౨౮. ఆపః పృణీత భేషజం వరూథం తన్వే౩ మమ ।
జ్యోక్ చ సూర్యం దృశే ॥ ౩

౨౯. శం న ఆపో ధన్వన్యాః శము సన్త్వనూప్యాః । శం నః ఖనిత్రిమా
ఆపః శము యాః కుమ్భ ఆభృతాః శివా నః సన్తు వార్షికీః ॥ ౪

## అథ ద్వితీయోఽనువాకః (౭) సప్తమం సూక్తమ్
## ధర్మ ప్రచార సూక్తమ్

ఋషిః :- చాతనః ॥ ; దేవతా :-౧-౨, ౪-౭ అగ్నిః ౩ ఇన్ద్రాగ్నీ ॥ ; ఛన్దః :- ౧-౪, ౬, ౭ అనుష్టుప్; ౫ త్రిష్టుప్ ॥

౩౦. స్తువానమగ్న ఆ వహ యాతుధానం కిమీదినమ్ ।
త్వం హి దేవ వన్దితో హన్తా దస్యోర్బభూవిథ ॥ ౧

౩౧. ఆజ్యస్య పరమేష్ఠిన్ జాతవేదస్తనూవశిన్ ।
అగ్నే తౌలస్య ప్రాశాన యాతుధానాన్ వి లాపయ ॥ ౨

౩౨. వి లపన్తు యాతుధానా అత్త్రిణో యే కిమీదినః ।
అథేదమగ్నే నో హవిరిన్ద్రశ్చ ప్రతి హర్యతమ్ ॥ ౩

౩౩. అగ్నిః పూర్వ ఆ రభతాం ప్రేన్ద్రో నుదతు బాహుమాన్ ।
బ్రవీతు సర్వో యాతుమానయమస్మీత్యేత్య ॥ ౪

౩౪. పశ్యామ తే వీర్యం జాతవేదః ప్ర ణో బ్రూహి యాతుధానాన్ నృచక్షః ।
త్వయా సర్వే పరితప్తాః పురస్తాత్ త ఆ యన్తు ప్రబ్రువాణా ఉపేదమ్ ॥ ౫

౩౫. ఆ రభస్వ జాతవేదో౭స్మాకార్థాయ జజ్ఞిషే ।
దూతో నో అగ్నే భూత్వా యాతుధానాన్ వి లాపయ ॥ ౬

౩౬. త్వమగ్నే యాతుధానాన్ ఉపబద్ధాఁ ఇహా వహ ।
అథైషామిన్ద్రో వజ్రేణాపి శీర్షాణి వృశ్చతు ॥ ౭

## (౮) అష్టమం సూక్తమ్

ఋషిః :- చాతనః ॥; దేవతా :- ౧, ౨, బృహస్పతిరగ్నీషోమౌ చ; ౩, ౪ అగ్నిః ॥
ఛన్దః :- ౧-౩ అనుష్టుప్; ౪ బార్హతగర్భా త్రిష్టుప్ ॥

౩౭. ఇదం హవిర్యాతుధానాన్ నదీ ఫేనమివా వహత్ ।
య ఇదం స్త్రీ పుమానకరిహ స స్తువతాం జనః ॥ ౧

౩౮. అయం స్తువాన ఆగమదిమం స్మ ప్రతి హర్యత ।
బృహస్పతే వశే లబ్ధ్వాగ్నీషోమా వి విధ్యతమ్ ॥ ౨

౩౯. యాతుధానస్య సోమప జహి ప్రజాం నయస్వ చ ।
ని స్తువానస్య పాతయ పరమక్ష్యుతావరమ్ ॥ ౩

౪౦. యత్రైషామగ్నే జనిమాని వేత్థ గుహా సతామత్త్రిణాం జాతవేదః ।
తాంస్త్వం బ్రహ్మణా వావృధానో జహ్యేషాం శతతర్హమగ్నే ॥ ౪

## (౯) నవమం సూక్తమ్
## వర్చఃప్రాప్తి సూక్తమ్

ఋషిః :- అథర్వా ॥; దేవతా :- ౧, ౨ వస్వాదయో మన్త్రోక్తాః ౩, ౪ అగ్నిః ॥;
ఛన్దః :- త్రిష్టుప్ ॥

౪౧. అస్మిన్ వసు వసవో ధారయన్త్విన్ద్రః పూషా వరుణో మిత్రో అగ్నిః ।
ఇమమాదిత్యా ఉత విశ్వే చ దేవా ఉత్తరస్మిన్ జ్యోతిషి ధారయన్తు ॥ ౧

౪౨. అస్య దేవాః ప్రదిశి జ్యోతిరస్తు సూర్యో అగ్నిరుత వా హిరణ్యమ్ ।
సపత్నా అస్మదధరే భవన్తూత్తమం నాకమధి రోహయేమమ్ ॥ ౨

౪౩. యేనేన్ద్రాయ సమభరః పయాంస్యుత్తమేన బ్రహ్మణా జాతవేదః ।
తేన త్వమగ్న ఇహ వర్ధయేమం సజాతానాం శ్రైష్ఠ్య ఆ ధేహ్యేనమ్ ॥ ౩

౪౪. ఐషాం యజ్ఞముత వర్చో దదే౭హం రాయస్పోషముత చిత్తాన్యగ్నే ।
సపత్నా అస్మదధరే భవన్తూత్తమం నాకమధి రోహయేమమ్ ॥ ౪

## (౧౦) దశమం సూక్తమ్
## అసత్య పాప విమోచన సూక్తమ్

ఋషిః :- అథర్వా ; దేవతా :- ౧ అసురః; ౨-౪ వరుణః ॥ ; ఛన్దః :- ౧, ౨ త్రిష్టుప్;
౩ కకుమ్మత్యనుష్టుప్; ౪ అనుష్టుప్ ॥

౪౫. అయం దేవానామసురో వి రాజతి వశా హి సత్యా వరుణస్య రాజ్ఞః ।
తతస్పరి బ్రహ్మణా శాశదాన ఉగ్రస్య మన్యోరుదిమం నయామి ॥ ౧

౪౬. నమస్తే రాజన్ వరుణాస్తు మన్యవే విశ్వం హ్యుగ్ర నిచికేషి ద్రుగ్ధమ్ ।
సహస్రమన్యాన్ ప్ర సువామి సాకం శతం జీవాతి శరదస్తవాయమ్ ॥ ౨

౪౭. యదువక్థానృతం జిహ్వయా వృజినం బహు ।
రాజ్ఞస్త్వా సత్యధర్మణో ముఞ్చామి వరుణాదహమ్ ॥ ౩

౪౮. ముఞ్చామి త్వా వైశ్వానరాదర్ణవాన్మహతస్పరి ।
సజాతానుగ్రేహా వద బ్రహ్మ చాప చికీహి నః ॥ ౪

## (౧౧) ఏకాదశం సూక్తమ్
## సుఖప్రసూతి సూక్తమ్

ఋషిః :- అథర్వా ; దేవతా :- పూషాదయో మన్త్రోక్తాః ॥ ; ఛన్దః :- ౧ పఙ్క్తిః; ౨
అనుష్టుప్ ; ౩ చతుష్పదోష్ణిగ్గర్భా కకుమ్మత్యనుష్టుప్; ౪-౬ పథ్యాపఙ్క్తిః ॥

౪౯. వషట్ తే పూషన్నస్మిన్త్సూతావర్యమా హోతా కృణోతు వేధాః ।
సిస్రతాం నార్యృతప్రజాతా వి పర్వాణి జిహతాం సూతవా ఉ ॥ ౧

౫౦. చతస్రో దివః ప్రదిశశ్చతస్రో భూమ్యా ఉత ।
దేవా గర్భం సమైరయన్ తం వ్యూఽర్ణువన్తు సూతవే ॥ ౨

౫౧. సూషా వ్యూఽర్ణోతు వి యోనిం హాపయామసి ।
శ్రథయా సూషణే త్వమవ త్వం బిష్కలే సృజ ॥ ౩

౫౨. నేవ మాంసే న పీవసి నేవ మజ్జస్వాహతమ్ ।
అవైతు పృశ్ని శేవలం శునే జరాయ్వత్తవేఽవ జరాయు పద్యతామ్ ॥ ౪

౫౩. వి తే భినద్మి మేహనం వి యోనిం వి గవీనికే ।
వి మాతరం చ పుత్రం చ వి కుమారం
జరాయుణావ జరాయు పద్యతామ్ ॥ ౫

౫౪. యథా వాతో యథా మనో యథా పతన్తి పక్షిణః ।
ఏవా త్వం దశమాస్య సాకం జరాయుణా పతావ జరాయు పద్యతామ్ ॥ ౬

## అథ తృతీయోఽనువాకః (౧౨) ద్వాదశం సూక్తమ్

## శ్వాసాది రోగనివారణ సూక్తమ్

ఋషిః :- భృగ్వంగిరాః ॥ ; దేవతా :- యక్ష్మనాశనమ్ ॥ ; ఛన్దః :- ౧ జగతీ; ౨, ౩ త్రిష్టుప్; ౪ అనుష్టుప్ ॥

౫౫. జరాయుజః ప్రథమ ఉస్రియో వృషా వాతభ్రజా స్తనయన్నేతి వృష్ట్యా ।
స నో మృడాతి తన్వ ఋజుగో రుజన్ య ఏకమోజస్త్రేధా విచక్రమే ॥ ౧

౫౬. అఙ్గేఅఙ్గే శోచిషా శిశ్రియాణం నమస్యన్తస్త్వా హవిషా విధేమ ।
అఙ్కాన్త్సమఙ్కాన్ హవిషా విధేమ యో అగ్రభీత్ పర్వాస్యా గ్రభీతా ॥ ౨

౫౭. ముఞ్చ శీర్షక్త్యా ఉత కాస ఏనం పరుష్పరురావివేశా యో అస్య ।
యో అభ్రజా వాతజా యశ్చ శుష్మో వనస్పతీన్త్సచతాం పర్వతాంశ్చ ॥ ౩

౫౮. శం మే పరస్మై గాత్రాయ శమస్త్వవరాయ మే ।
శం మే చతుర్భ్యో అఙ్గేభ్యః శమస్తు తన్వే౩ మమ ॥ ౪

## (౧౩) త్రయోదశం సూక్తమ్

## పరమాత్మకు నమస్కారమ్

ఋషిః :- భృగ్వంగిరాః ॥ ; దేవతా :- విద్యుత్ ॥ ; ఛన్దః :- ౧, ౨ అనుష్టుప్; ౩ చతుష్పాద్విరాడ్ జగతీ; ౪ త్రిష్టుప్పరా బృహతీ గర్భా పంక్తిః ॥

౫౯. నమస్తే అస్తు విద్యుతే నమస్తే స్తనయిత్నవే ।
నమస్తే అస్త్వశ్మనే యేనా దూడాశే అస్యసి ॥ ౧

౬౦. నమస్తే ప్రవతో నపాద్ యతస్తపః సమూహసి ।
మృడయా నస్తనూభ్యో మయస్తోకేభ్యస్కృధి ॥ ౨

౬౧. ప్రవతో నపాన్నమ ఏవాస్తు తుభ్యం నమస్తే హేతయే తపుషే చ కృణ్మః ।
విద్మ తే ధామ పరమం గుహాయత్ సముద్రే అన్తర్నిహితాసి నాభిః ॥ ౩

౬౨. యాం త్వా దేవా అసృజన్త విశ్వ ఇషుం కృణ్వానా అసనాయ ధృష్ణుమ్ ।
సా నో మృడ విదథే గృణానా తస్యై తే నమో అస్తు దేవి ॥ ౪

## (౧౪) చతుర్దశం సూక్తమ్

## కులవధూ-సూక్తమ్

ఋషిః :- భృగ్వంగిరాః ॥ ; దేవతా :- యమః ॥ ; ఛన్దః :- ౧ కకుమ్మత్యనుష్టుప్; ౨, ౪ అనుష్టుప్ ; ౩ చతుష్పదా విరాడనుష్టుప్ ॥

౬౩. భగమస్యా వర్చ ఆదిష్యధి వృక్షాదివ స్రజమ్ ।
మహాబుధ్న ఇవ పర్వతో జ్యోక్ పితృష్వాస్తామ్ ॥ ౧

౬౪. ఏషా తే రాజన్ కన్యా వధూర్ని ధూయతాం యమ ।
సా మాతుర్బధ్యతాం గృహేఽథో భ్రాతురథో పితుః ॥ ౨

౬౫. ఏషా తే కులపా రాజన్ తాము తే పరి దద్మసి ।
జ్యోక్ పితృష్వాసాతా ఆ శీర్ష్ణః సమోప్యాత్ ॥ ౩

౬౬. అసితస్య తే బ్రహ్మణా కశ్యపస్య గయస్య చ ।
అన్తఃకోశమివ జామయోఽపి నహ్యామి తే భగమ్ ॥ ౪

## (౧౫) పంచదశం సూక్తమ్

## సంఘటన మహాయజ్ఞ సూక్తం

ఋషిః :- అథర్వా॥ దేవతా :- సిన్ధ్వాదయో మంత్రోక్తాః ॥ ; ఛన్దః :- ౧ భురిగ్బృహతీ; ౨ భురిక్పథ్యా పంక్తిః; ౩, ౪ అనుష్టుప్ ॥

౬౭. సం సం స్రవన్తు సిన్ధవః సం వాతాః సం పతత్రిణః ।
ఇమం యజ్ఞం ప్రదివో మే జుషన్తాం సంస్రావ్యేణ హవిషా జుహోమి ॥ ౧

౬౮. ఇహైవ హవమా యాత మ ఇహ సంస్రావణా ఉతేమం వర్ధయతా గిరః ।
ఇహైతు సర్వో యః పశురస్మిన్ తిష్ఠతు యా రయిః ॥ ౨

౬౯. యే నదీనాం సంస్రవన్త్యుత్సాసః సదమక్షితాః ।
తేభిర్మే సర్వైః సంస్రావైర్ధనం సం స్రావయామసి ॥ ౩

౭౦. యే సర్పిషః సంస్రవన్తి క్షీరస్య చోదకస్య చ
తేభిర్మే సర్వైః సంస్రావైర్ధనం సం స్రావయామసి ॥ ౪

## (౧౬) షోడశం సూక్తమ్

## సంఘటన మహాయజ్ఞ సూక్తమ్

ఋషిః :- చాతనః ॥ ; దేవతా :- ౧ అగ్నిః, ౨ వరుణః, అగ్నిః ఇన్ద్రశ్చ; ౩, ౪ సీసమ్ ॥ ; ఛన్దః :- ౧-౩ అనుష్టుప్ ; ౪ కకుమ్మత్యనుష్టుప్ ॥

౭౧. యేఽమావాస్యాం౩ రాత్రిముదస్థుర్వ్రాజమత్రిణః ।
అగ్నిస్తురీయో యాతుహా సో అస్మభ్యమధి బ్రవత్ ॥ ౧

౭౨. సీసాయాధ్యాహ వరుణః సీసాయాగ్నిరుపావతి ।
సీసం మ ఇన్ద్రః ప్రాయచ్ఛత్ తదఙ్గ యాతుచాతనమ్ ॥ ౨

౭౩. ఇదం విష్కన్ధం సహత ఇదం బాధతే అత్రిణః ।
అనేన విశ్వా ససహే యా జాతాని పిశాచ్యాః ॥ ౩

౭౪. యది నో గాం హంసి యద్యశ్వం యది పూరుషమ్ ।
తం త్వా సీసేన విధ్యామో యథా నోఽసో అవీరహా ॥ ౪

ఇతి ప్రథమః ప్రపాఠకః ॥

***

## అథ ద్వితీయః ప్రపాఠకః

## అథ చతుర్థోఽనువాకః (౧౭) సప్తదశం సూక్తమ్

## రక్తస్రావం ఆపడానికి

ఋషిః :- బ్రహ్మా ॥ ; దేవతా :- యోషితో ధమన్యశ్చ ॥ ; ఛన్దః :- ౧ భురిగనుష్టుప్ ; ౧, ౩ అనుష్టుప్, ౪ త్రిపదార్షీ గాయత్రీ ॥

౭౫. అమూర్యా యన్తి యోషితో హిరా లోహితవాససః ।
అభ్రాతర ఇవ జామయస్తిష్ఠన్తు హతవర్చసః ॥ ౧

౭౬. తిష్ఠావరే తిష్ఠ పర ఉత త్వం తిష్ఠ మధ్యమే ।
కనిష్ఠికా చ తిష్ఠతి తిష్ఠాదిద్ధమనిర్మహీ ॥ ౨

౭౭. శతస్య ధమనీనాం సహస్రస్య హిరాణామ్ ।
అస్థురిన్మధ్యమా ఇమాః సాకమన్తా అరంసత ॥ ౩

౭౮. పరి వః సికతావతీ ధనూర్బృహత్యక్రమీత్ ।
తిష్ఠతేలయతా సు కమ్ ॥ ౪

## (౧౮) అష్టాదశం సూక్తమ్
## సౌభాగ్య వర్ధన సూక్తమ్

ఋషిః :- ద్రవిణోదాః ॥ ; దేవతా :- సవిత్రాదయో మన్త్రోక్తాః ॥ ; ఛన్దః :- ౧ ఉపరిష్టాద్విరాడ్ బృహతీ, ౨ నిచృజ్జగతీ; ౩ విరాడాస్తార పంక్తిః త్రిష్టుప్, ౪ అనుష్టుప్ ॥

౭౯. నిర్లక్ష్మ్యం౧లలామ్యం౧ నిరరాతిం సువామసి ।
అథ యా భద్రా తాని నః ప్రజాయా అరాతిం నయామసి ॥ ౧

౮౦. నిరరణిం సవితా సావిషక్ పదో ర్నిర్హస్తయోర్వరుణో మిత్రో అర్యమా।
నిరస్మభ్యమనుమతీ రరాణా ప్రేమాం దేవా అసావిషుః సౌభగాయ ॥ ౨

౮౧. యత్త ఆత్మని తన్వాం౧ఘోరమ్ అస్తి యద్వా కేశేషు ప్రతిచక్షణే వా ।
సర్వం తద్వాచాప హన్మో వయం దేవ స్త్వా సవితా సూదయతు ॥ ౩

౮౨. రిశ్యపదీం వృషదతీం గోషేధాం విధమాముత ।
విలీఢ్యం౧లలామ్యం౧తా అస్మన్నాశయామసి ॥ ౪

## (౧౯) ఏకోనవింశం సూక్తమ్
## శత్రునాశన సూక్తమ్

ఋషిః :- బ్రహ్మా ॥ ; దేవతా :- ౧ ఇన్ద్రః ; ౨ మనుష్యేషవః ; ౩ రుద్రః; ౪ దేవాః ॥ ; ఛన్దః :- ౧, ౪ అనుష్టుప్; ౨ పురస్తాద్ బృహతీ, ౩ పథ్యాపంక్తిః ॥

౮౩. మా నో విదన్ వివ్యాధినో మో అభివ్యాధినో విదన్ ।
ఆరాచ్ఛరవ్యా౧అస్మ ద్విషూచీ రిన్ద్ర పాతయ ॥ ౧

౮౪. విష్వఞ్చో అస్మచ్ఛరవః పతన్తు యే అస్తా యే చాస్యాః ।
దైవీర్మనుష్యేషవో మమా మిత్రాన్ వి విధ్యత ॥ ౨

౮౫. యో నః స్వో యో అరణః సజాత ఉత నిష్ట్యో యో అస్మాఀ అభిదాసతి।
రుద్రః శరవ్య౧యైతాన్ మమామిత్రాన్ వి విధ్యతు ॥ ౩

౮౬. యః సపత్నో యో౽సపత్నో యశ్చద్విషన్ఛపాతి నః ।
దేవాస్తం సర్వే ధూర్వన్తు బ్రహ్మ వర్మ మమాన్తరమ్ ॥ ౪

## (౨౦) వింశం సూక్తమ్
## ఇంద్రప్రార్థన

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- ౧ సోమో మరుతశ్చ ; ౨ మిత్రావరుణౌ ౩ వరుణః, ౪ ఇన్ద్ర ॥ ; ఛన్దః :- ౧ త్రిష్టుప్, ౧-౪ అనుష్టుప్ ॥

౮౭. అదారసృద్ భవతు దేవ సోమాస్మిన్ యజ్ఞే మరుతో మృడతా నః ।
మా నో విదదభిభా మో అశస్తిర్మా నో విదద్ వృజినా ద్వేష్యా యా ॥ ౧

౮౮. యో అద్య సేన్యో వధో౽ఘాయూనాముదీరతే ।
యువం తం మిత్రావరుణావస్మద్యావయతం పరి ॥ ౨

౮౯. ఇతశ్చ యదముతశ్చ యద్ వధం వరుణ యావయ ।
వి మహచ్ఛర్మ యచ్ఛ వరీయో యావయా వధమ్ ॥ ౩

౯౦. శాస ఇత్థా మహాఀ అస్యమిత్రసాహో అస్తృతః ।
న యస్య హన్యతే సఖా న జీయతే కదా చన ॥ ౪

## (౨౧) ఏకవింశం సూక్తమ్
## ప్రజా-పాలక-సూక్తమ్

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- ఇన్ద్రః ॥ ; ఛన్దః :-అనుష్టుప్ ॥

౯౧. స్వస్తిదా విశాం పతిర్వృత్రహా విమృధో వశీ ।
వృషేన్ద్రః పుర ఏతు నః సోమపా అభయంకరః ॥ ౧

౯౨. వి న ఇన్ద్ర మృధో జహి నీచా యచ్ఛ పృతన్యతః ।
అధమం గమయా తమో యో అస్మాఀ అభిదాసతి ॥ ౨

౯౩. వి రక్షో వి మృధో జహి వి వృత్రస్య హనూ రుజ ।

వి మన్యుమిన్ద్ర వృత్రహన్నమిత్రస్యాభిదాసతః ॥ ౩

౯౪. అపేన్ద్ర ద్విషతో మనోఽప జిజ్యాసతో వధమ్ ।
వి మహచ్ఛర్మ యచ్ఛ వరీయో యావయా వధమ్ ॥ ౪

## అథ పంచమోఽనువాకః (౨౨) ద్వావింశం సూక్తమ్

## హృద్రోగ-కామిలల-చికిత్స

ఋషిః :- బ్రహ్మా ॥ ; దేవతా :- సూర్యః, హరిమా హృద్రోగశ్చ ॥ ; ఛన్దః :- అనుష్టుప్ ॥

౯౫. అను సూర్యముదయతాం హృద్ద్యోతో హరిమా చ తే ।
గో రోహితస్య వర్ణేన తేన త్వా పరి దధ్మసి ॥ ౧

౯౬. పరి త్వా రోహితైర్వర్ణైర్దీర్ఘాయుత్వాయ దధ్మసి ।
యథాయమరపా అసదథో అహరితో భువత్ ॥ ౨

౯౭. యా రోహిణీర్దేవత్యా౩ గావో యా ఉత రోహిణీః ।
రూపంరూపం వయోవయస్తాభిష్ట్వా పరి దధ్మసి ॥ ౩

౯౮. శుకేషు తే హరిమాణం రోపణాకాసు దధ్మసి ।
అథో హారిద్రవేషు తే హరిమాణం ని దధ్మసి ॥ ౪

## (౨౩) త్రయోవింశం సూక్తమ్

## శ్వేత కుష్ఠనాశన సూక్తం

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- వనస్పతయః (రామా, కృష్ణా, అసిక్నీ చ)॥
ఛన్దః :- అనుష్టుప్ ॥

౯౯. నక్తంజాతాస్యోషధే రామే కృష్ణే అసిక్ని చ ।
ఇదం రజని రజయ కిలాసం పలితం చ యత్ ॥ ౧

౧౦౦. కిలాసం చ పలితం చ నిరితో నాశయా పృషత్ ।
ఆ త్వా స్వో విశతాం వర్ణః పరా శుక్లాని పాతయ ॥ ౨

౧౦౧. అసితం తే ప్రలయనమాస్థానమసితం తవ ।
అసిక్న్యస్యోషధే నిరితో నాశయా పృషత్ ॥ ౩

౧౦౨. అస్థిజస్య కిలాసస్య తనూజస్య చ యత్త్వచి ।
దూష్యా కృతస్య బ్రహ్మణా లక్ష్మ శ్వేతమనీనశమ్ ॥ ౪

## (౨౪) చతుర్వింశం సూక్తమ్

## కుష్ఠనాశన సూక్తమ్

ఋషిః :- బ్రహ్మా ॥ ; దేవతా :- ఆసురీ వనస్పతిః ॥ ; ఛన్దః :- ౧, ౩, ౪ అనుష్టుప్; ౨ నిచృత్పథ్యాపంక్తిః ॥

౧౦౩. సుపర్ణో జాతః ప్రథమస్తస్య త్వం పిత్తమాసిథ ।
తదాసురీ యుధా జితా రూపం చక్రే వనస్పతీన్ ॥ ౧

౧౦౪. ఆసురీ చక్రే ప్రథమేదం కిలాసభేషజమిదం కిలాసనాశనమ్ ।
అనీనశత్ కిలాసం సరూపామకరత్ త్వచమ్ ॥ ౨

౧౦౫. సరూపా నామ తే మాతా సరూపో నామ తే పితా ।
సరూపకృత్ త్వమోషధే సా సరూపమిదం కృధి ॥ ౩

౧౦౬. శ్యామా సరూపంకరణీ పృథివ్యా అధ్యుద్భృతా ।
ఇదమూ షు ప్ర సాధయ పునా రూపాణి కల్పయ ॥ ౪

## (౨౫) పంచవింశం సూక్తమ్

## శీతజ్వర దూరీకరణ సూక్తమ్

ఋషిః :- భృగ్వంగిరాః ॥ ; దేవతా :- యక్ష్మనాశనోఽగ్నిః ॥ ; ఛన్దః :- ౧

త్రిష్టుప్; ౨, ౩ విరాడ్ గర్భాత్రిష్టుప్; ౪ పురోఽనుష్టుప్ ॥

౧౦౭. యదగ్నిరాపో అదహత్ ప్రవిశ్య యత్రాకృణ్వన్ ధర్మధృతో నమాంసి ।
తత్ర త ఆహుః పరమం జనిత్రం స నః సంవిద్వాన్ పరి వృఙ్గ్ధి తక్మన్ ॥ ౧

౧౦౮. యద్యర్చిర్యది వాఽసి శోచిః శకల్యేషి యది వా తే జనిత్రమ్ ।
హ్రూడుర్నామాసి హరితస్య దేవ స నః సంవిద్వాన్ పరి వృఙ్గ్ధి తక్మన్ ॥ ౨

౧౦౯. యది శోకో యది వాఽభిశోకో యది వా రాజ్ఞో వరుణస్యాసి పుత్రః ।
హ్రూడుర్నామాసి హరితస్య దేవ స నః సంవిద్వాన్ పరి వృఙ్గ్ధి తక్మన్ ॥ ౩

౧౧౦. నమః శీతాయ తక్మనే నమో రూరాయ శోచిషే కృణోమి ।
యో అన్యేద్యురుభయద్యురభ్యేతి తృతీయకాయ నమో అస్తు తక్మనే ॥ ౪

## (౨౬) షడ్వింశం సూక్తమ్
## సుఖప్రాప్తి సూక్తమ్

ఋషిః :- బ్రహ్మా ॥ ; దేవతా :- ఇన్ద్రాదయో మంత్రోక్తాః ; ॥ ఛన్దః :- ౧, ౩ గాయత్రీ, ౨ త్రిపదాసామ్నీత్రిష్టుప్ (ఏకావసానా), ౪ పాదనిచృద్గాయత్రీ (ఏకావసానా) ॥

౧౧౧. ఆరేఽసావస్మదస్తు హేతిర్దేవాసో అసత్ । ఆరే అశ్మా యమస్యథ ॥ ౧

౧౧౨. సఖాసావస్మభ్యమస్తు రాతిః సఖేన్ద్రో భగః సవితా చిత్రరాధాః ॥ ౨

౧౧౩. యూయం నః ప్రవతో నపాన్మరుతః సూర్యత్వచసః ।
శర్మ యచ్ఛాథ సప్రథాః ॥ ౩

౧౧౪. సుషూదత మృడత మృడయా నస్తనూభ్యో మయస్తోకేభ్యస్కృధి ॥ ౪

## (౨౭) సప్తవింశం సూక్తమ్

ఋషిః :- అథర్వా (స్వస్త్యయనకామః) ॥ ; దేవతా :- ఇన్ద్రాణీ ॥ ఛన్దః :- ౧ పథ్యాపంక్తిః ; ౨-౪ అనుష్టుప్ ॥

౧౧౫. అమూః పారే పృదాక్వస్త్రిషప్తా నిర్జరాయవః ।
తాసాం జరాయుభిర్వయమక్ష్యావపి
వ్యయామస్యఘాయోః పరిపన్థినః ॥ ౧

౧౧౬. విషూచ్యేతు కృన్తతీ పినాకమివ బిభ్రతీ ।
విష్వక్ పునర్భువా మనోఽసమృద్ధా అఘాయవః ॥ ౨

౧౧౭. న బహవః సమశకన్ నార్భకా అభి దాధృషుః ।
వేణోరద్గా ఇవాభితోఽసమృద్ధా అఘాయవః ॥ ౩

౧౧౮. ప్రేతం పాదౌ ప్ర స్ఫురతం వహతం పృణతో గృహాన్ ।
ఇన్ద్రాణ్యేతు ప్రథమాజీతాముషితా పురః ॥ ౪

## (౨౮) అష్టావింశం సూక్తమ్
## దుష్టనాశన సూక్తం

ఋషిః :- చాతనః ; దేవతా :- ౧, ౨ (పూర్వార్ధస్య) అగ్నిః, ౨ (ఉత్తరార్ధస్య) ౪ యాతుధాన్యః ॥ ఛన్దః :- ౧,౨ అనుష్టుప్ ; ౩ విరాట్ పథ్యా బృహతీ; ౪ పథ్యాపంక్తిః ॥

౧౧౯. ఉప ప్రాగాద్ దేవో అగ్నీ రక్షోహామీవచాతనః ।
దహన్నప ద్వయావినో యాతుధానాన్ కిమీదినః ॥ ౧

౧౨౦. ప్రతి దహ యాతుధానాన్ ప్రతి దేవ కిమీదినః ।
ప్రతీచీః కృష్ణవర్తనే సం దహ యాతుధాన్యః ॥ ౨

౧౨౧. యా శశాప శపనేన యాఘం మూరమాదధే ।
యా రసస్య హరణాయ జాతమారేభే తోకమత్తు సా ॥ ౩

౧౨౨. పుత్రమత్తు యాతుధానీః స్వసారముత నప్త్యమ్ । అధా మిథో
వికేశ్యో౽వి ఘ్నతాం యాతుధాన్యో౽వి తృహ్యన్తామరాయ్యః ॥ ౪

## అథ షష్ఠోఽనువాకః (౨౯) ఏకోనత్రింశం సూక్తమ్

## రాజ్య సంవర్ధన సూక్తం

ఋషిః:- వసిష్ఠః ॥ ; దేవతా:- బ్రహ్మణస్పతిః; అభీవర్తమణిః ॥ ఛన్దః:- అనుష్టుప్ ॥

౧౨౩. అభీవర్తేన మణినా యేనేన్ద్రో అభివావృధే ।
తేనాస్మాన్ బ్రహ్మణస్పతేఽభి రాష్ట్రాయ వర్ధయ ॥ ౧

౧౨౪. అభివృత్య సపత్నానభి యా నో అరాతయః ।
అభి పృతన్యన్తం తిష్ఠాభి యో నో దురస్యతి ॥ ౨

౧౨౫. అభి త్వా దేవః సవితాభి సోమో అవీవృధత్ ।
అభి త్వా విశ్వా భూతాన్యభీవర్తో యథాససి ॥ ౩

౧౨౬. అభీవర్తో అభిభవః సపత్నక్షయణో మణిః ।
రాష్ట్రాయ మహ్యం బధ్యతాం సపత్నేభ్యః పరాభువే ॥ ౪

౧౨౭. ఉదసౌ సూర్యో అగాదుదిదం మామకం వచః ।
యథాహం శత్రుహోఽసాన్యసపత్నః సపత్నహా ॥ ౫

౧౨౮. సపత్నక్షయణో వృషాభిరాష్ట్రో విషాసహిః ।
యథాహమేషాం వీరాణాం విరాజాని జనస్య చ ॥ ౬

## (౩౦) త్రింశం సూక్తమ్

## ఆయుష్య వర్ధన సూక్తమ్

ఋషిః :- అథర్వా (ఆయుష్కామః) ॥ ; దేవతా :- విశ్వే దేవాః ॥ ఛన్దః :- ౧, ౨, ౪ త్రిష్టుప్; ౩ శాక్వరగర్భావిరాడ్ జగతీ ॥

౧౨౯. విశ్వే దేవా వసవో రక్షతేమముతాదిత్యా జాగృత యూయమస్మిన్ ।
మేమం సనాభిరుత వాన్యనాభిర్మేమం ప్రాపత్ పౌరుషేయో వధో యః ॥ ౧

౧౩౦. యే వో దేవాః పితరో యే చ పుత్రాః సచేతసో మే శృణుతేదముక్తమ్ ।
సర్వేభ్యో వః పరి దదామ్యేతం స్వస్త్యేనం జరసే వహాథ ॥ ౨

౧౩౧. యే దేవా దివి ష్ఠ యే పృథివ్యాం యే అన్తరిక్ష ఓషధీషు పశుష్వప్స్వ౧న్తః ।
తే కృణుత జరసమాయురస్మై శతమన్యాన్ పరి వృణక్తు మృత్యూన్ ॥ ౩

౧౩౨. యేషాం ప్రయాజా ఉత వానుయాజా హుతభాగా అహుతాదశ్చ దేవాః ।
యేషాం వః పఞ్చ ప్రదిశో విభక్తాస్తాన్ వో అస్మై సత్రసదః కృణోమి ॥ ౪

## (౩౧) ఏకత్రింశం సూక్తమ్

## దిక్పాలక సూక్తం

ఋషిః :- బ్రహ్మా ॥ ; దేవతా :- ఆశాపాలాః (వాస్తోష్పతయః) ॥ ఛన్దః :- ౧, ౨ అనుష్టుప్, ౩ విరాట్ త్రిష్టుప్; ౪ పరానుష్టుప్, త్రిష్టుప్ ॥

౧౩౩. ఆశానామాశాపాలేభ్యశ్చతుర్భ్యో అమృతేభ్యః ।
ఇదం భూతస్యాధ్యక్షేభ్యో విధేమ హవిషా వయమ్ ॥ ౧

౧౩౪. య ఆశానామాశాపాలాశ్చత్వార స్థన దేవాః ।
తే నో నిరృత్యాః పాశేభ్యో ముఞ్చతాంహసోఅంహసః ॥ ౨

౧౩౫. అస్రామస్త్వా హవిషా యజామ్యశ్లోణస్త్వా ఘృతేన జుహోమి ।
య ఆశానామాశాపాలస్తురీయో దేవః స నః సుభూతమేహ వక్షత్ ॥ ౩

౧౩౬. స్వస్తి మాత్ర ఉత పిత్రే నో అస్తు స్వస్తి గోభ్యో జగతే పురుషేభ్యః ।
విశ్వం సుభూతం సువిదత్రం నో అస్తు జ్యోగేవ దృశేమ సూర్యమ్ ॥ ౪

## (౩౨) ద్వాత్రింశం సూక్తమ్
## జీవన రసమ్

ఋషిః :- బ్రహ్మ ॥ ; దేవతా :- ద్యావాపృథివీ ॥ ఛన్దః :- ౧, ౩, ౪ అనుష్టుప్, ౨ కకుమ్మత్యనుష్టుప్ ॥

౧౩౭. ఇదం జనాసో విదథ మహద్ బ్రహ్మ వదిష్యతి ।
న తత్ పృథివ్యాం నో దివి యేన ప్రాణన్తి వీరుధః ॥ ౧

౧౩౮. అన్తరిక్ష ఆసాం స్థామ శ్రాన్తసదామివ ।
ఆస్థానమస్య భూతస్య విదుష్టద్ వేధసో న వా ॥ ౨

౧౩౯. యద్ రోదసీ రేజమానే భూమిశ్చ నిరతక్షతమ్ ।
ఆర్ద్రం తదద్య సర్వదా సముద్రస్యేవ స్రోత్యాః ॥ ౩

౧౪౦. విశ్వమన్యామభీవార తదన్యస్యామధి శ్రితమ్ ।
దివే చ విశ్వవేదసే పృథివ్యై చాకరం నమః ॥ ౪

## (౩౩) త్రయస్త్రింశం సూక్తమ్
## జల సూక్తమ్

ఋషిః :- శన్తాతిః ॥ ; దేవతా :- ఆపః ॥ ఛన్దః :- త్రిష్టుప్ ॥

౧౪౧. హిరణ్యవర్ణాః శుచయః పావకా యాసు జాతః సవితా యాస్వగ్నిః ।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ ౧

౧౪౨. యాసాం రాజా వరుణో యాతి మధ్యే సత్యానృతే అవపశ్యన్ జనానామ్ ।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ ౨

౧౪౩. యాసాం దేవా దివి కృణ్వన్తి భక్షం యా అన్తరిక్షే బహుధా భవన్తి ।
యా అగ్నిం గర్భం దధిరే సువర్ణాస్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ ౩

౧౪౪. శివేన మా చక్షుషా పశ్యతాపః శివయా తన్వోప స్పృశత త్వచం మే ।
ఘృతశ్చుతః శుచయో యాః పావకాస్తా న ఆపః శం స్యోనా భవన్తు ॥ ౪

## (౩౪) చతుస్త్రింశం సూక్తమ్
## మధు విద్య

ఋషిః :- అథర్వా ॥ ; దేవతా :- మధువనస్పతిః ॥ ఛన్దః :- అనుష్టుప్ ॥

౧౪౫. ఇయం వీరున్మధుజాతా మధునా త్వా ఖనామసి ।
మధోరధి ప్రజాతాసి సా నో మధుమతస్కృధి ॥ ౧

౧౪౬. జిహ్వాయా అగ్రే మధు మే జిహ్వామూలే మధూలకమ్ ।
మమేదహ క్రతావసో మమ చిత్తముపాయసి ॥ ౨

౧౪౭. మధుమన్మే నిక్రమణం మధుమన్మే పరాయణమ్ ।
వాచా వదామి మధుమద్ భూయాసం మధుసందృశః ॥ ౩

౧౪౮. మధోరస్మి మధుతరో మదుఘాన్మధుమత్తరః ।
మామిత్ కిల త్వం వనాః శాఖాం మధుమతీమివ ॥ ౪

౧౪౯. పరి త్వా పరితత్నునేక్షుణాగామవిద్విషే ।
యథా మాం కామిన్యసో యథా మన్నాపగా అసః ॥ ౫

## (౩౫) పఞ్చత్రింశం సూక్తమ్
## తేజోబల దీర్ఘాయు సూక్తమ్

ఋషిః :- అథర్వా (ఆయుష్కామః) ॥ ; దేవతా :- హిరణ్యమ్ ॥ ఛన్దః :- ౧-౩ జగతీ ౪ అనుష్టుబ్గర్భా చతుష్పదా త్రిష్టుప్ ॥

౧౫౦. యదాబధ్నన్ దాక్షాయణా హిరణ్యం శతానీకాయ సుమనస్యమానాః ।

తత్తే బధ్నామ్యాయుషే వర్చసే బలాయ దీర్ఘాయుత్వాయ శతశారదాయ ॥ ౧

౧౫౧. నైనం రక్షాంసి న పిశాచాః సహన్తే దేవానామోజః ప్రథమజం హ్యేతత్ ।
యో బిభర్తి దాక్షాయణం హిరణ్యం స జీవేషు కృణుతే దీర్ఘమాయుః ॥ ౨

౧౫౨. అపాం తేజో జ్యోతిరోజో బలం చ వనస్పతీనాముత వీర్యాణి । ఇన్ద్ర
ఇవేన్ద్రియాణ్యధి ధారయామో అస్మిన్ తద్ దక్షమాణో బిభరద్ధిరణ్యమ్ ॥ ౩

౧౫౩. సమానాం మాసామృతుభిష్ట్వా వయం సంవత్సరస్య పయసా పిపర్మి ।
ఇన్ద్రాగ్నీ విశ్వే దేవాస్తేఽను మన్యన్తామహృణీయమానాః ॥ ౪

॥ ఇతి ప్రథమం కాణ్డమ్ ॥

# అథ ద్వితీయం కాణ్డమ్

## అథ తృతీయః ప్రపాఠకః ॥

## అథ ప్రథమోఽనువాకః (౧) ప్రథమం సూక్తమ్

## గుహ్యావిద్య

ఋషిః :- వేనః ॥ ; దేవతా :- బ్రహ్మ, ఆత్మా ॥ ఛన్దః :- ౧, ౨, ౪, ౫ త్రిష్టుప్ ; ౩ జగతీ ॥

౧౫౪. వేనస్తత్ పశ్యత్ పరమం గుహా యద్ యత్ర విశ్వం భవత్యేకరూపం ।
ఇదం పృశ్నిరదుహజ్జాయమానాః స్వర్విదో అభ్యనూషత వ్రాః ॥ ౧

౧౫౫. ప్ర తద్ వోచేదమృతస్య విద్వాన్ గన్ధర్వో ధామ పరమం గుహా యత్ ।
త్రీణి పదాని నిహితా గుహాస్య యస్తాని వేద స పితుష్పితాసత్ ॥ ౨

౧౫౬. స నః పితా జనితా స ఉత బన్ధుర్ధామాని వేద భువనాని విశ్వా ।
యో దేవానాం నామధ ఏక ఏవ తం సంప్రశ్నం భువనా యన్తి సర్వా ॥ ౩

౧౫౭. పరి ద్యావాపృథివీ సద్య ఆయముపాతిష్ఠే ప్రథమజామృతస్య ।
వాచమివ వక్తరి భువనేష్ఠా ధాస్యురేష నన్వేషో అగ్నిః ॥ ౪

౧౫౮. పరి విశ్వా భువనాన్యాయమృతస్య తన్తుం వితతం దృశే కమ్ ।
యత్ర దేవా అమృతమానశానాః సమానే యోనావధ్యైరయన్త ॥ ౫

## (౨) ద్వితీయం సూక్తమ్

## ఏకేశ్వర సూక్తమ్

ఋషిః :- మాతృనామా ॥ ; దేవతా :- గన్ధర్వాప్సరసః ॥ ఛన్దః :- ౧ విరాడ్జగతీ;
౫ భురిగనుష్టుప్ ॥

౧౫౯. దివ్యో గన్ధర్వో భువనస్య యస్పతిరేక ఏవ నమస్యో విక్ష్వీడ్యః ।
తం త్వా యౌమి బ్రహ్మణా దివ్య దేవ నమస్తే అస్తు దివి తే సధస్థమ్ ॥ ౧

౧౬౦. దివి స్పృష్టో యజతః సూర్యత్వగవయాతా హరసో దైవ్యస్య ।
మృడాద్ గన్ధర్వో భువనస్య యస్పతిరేక ఏవ నమస్యః సుశేవాః ॥ ౨

౧౬౧. అనవద్యాభిః సము జగ్మ ఆభిరప్సరాస్వపి గన్ధర్వ ఆసీత్ ।
సముద్ర ఆసాం సదనం మ ఆహుర్యతః సద్య ఆ చ పరా చ యన్తి ॥ ౩

౧౬౨. అభ్రియే దిద్యున్నక్షత్రియే యా విశ్వావసుం గన్ధర్వం సచధ్వే ।
తాభ్యో వో దేవీర్నమ ఇత్ కృణోమి ॥ ౪

౧౬౩. యాః క్లన్దాస్తమిషీచయోఽక్షకామా మనోముహః ।
తాభ్యో గన్ధర్వపత్నీభ్యోఽప్సరాభ్యోఽకరం నమః ॥ ౫

## (౩) తృతీయం సూక్తమ్

## ఆరోగ్య సూక్తమ్

ఋషిః :- అంగిరాః ॥ ; దేవతా :- (ఆస్రావ) భేషజమ్ ॥ ఛన్దః :- ౧-౫
అనుష్టుప్; ౬ త్రిపాదస్వరాడుపరిష్టాన్మహాబృహతీ॥

౧౬౪. అదో యదవధావత్యవత్కమధి పర్వతాత్ ।
తత్ తే కృణోమి భేషజం సుభేషజం యథాససి ॥ ౧

౧౬౫. ఆదఙ్గా కువిదఙ్గా శతం యా భేషజాని తే ।
తేషామసి త్వముత్తమ మనాస్రావ మరోగణమ్ ॥ ౨

౧౬౬. నీచైః ఖనన్త్యసురా అరుస్రాణ మిదం మహత్ ।
తదాస్రావస్య భేషజం తదు రోగ మనీనశత్ ॥ ౩

౧౬౭. ఉపజీకా ఉద్భరన్తి సముద్రా దధి భేషజమ్ ।
తదాస్రావస్య భేషజం తదు రోగ మశీశమత్ ॥ ౪

౧౬౮. అరుస్రాణమిదం మహత్ పృథివ్యా అధ్యుద్భృతమ్ ।
తదాస్రావస్య భేషజం తదు రోగమనీనశత్ ॥ ౫

౧౬౯. శం నో భవన్త్వప ఓషధయః శివాః । ఇన్ద్రస్య వజ్రో అప హన్తు రక్షస
ఆరాద్ విసృష్టా ఇషవః పతన్తు రక్షసామ్ ॥ ౬

## (౪) చతుర్థం సూక్తమ్

## ఏకేశ్వర సూక్తం

ఋషిః :- అథర్వా ॥ ; దేవతాః:- జంగిడ్వంశః ॥ ఛన్దః:- ౧ విరాట్-ప్రస్తారపంక్తిః; ౨-౬ అనుష్టుప్ ॥

౧౭౦. దీర్ఘాయుత్వాయ బృహతే రణాయారిష్యన్తో దక్షమాణాః సదైవ ।
మణిం విష్కన్ధదూషణం జఙ్గిడం బిభృమో వయమ్ ॥ ౧

౧౭౧. జఙ్గిడో జమ్భాద్ విశరాద్ విష్కన్ధాద్ అభిశోచనాత్ ।
మణిః సహస్రవీర్యః పరిణః పాతు విశ్వతః ॥ ౨

౧౭౨. అయం విష్కన్ధం సహతే౽యం బాధతే అత్రిణః ।
అయం వో విశ్వభేషజో జఙ్గిడః పాత్వంహసః ॥ ౩

౧౭౩. దేవైర్దత్తేన మణినా జఙ్గిడేన మయోభువా ।
విష్కన్ధం సర్వా రక్షాంసి వ్యాయామే సహామహే ॥ ౪

౧౭౪. శణశ్చ మా జఙ్గిడశ్చ విష్కన్ధాదభి రక్షతామ్ ।
అరణ్యాదన్య ఆభృతః కృష్యా అన్యో రసేభ్యః ॥ ౫

౧౭౫. కృత్యాదూషిరయం మణిరథో అరాతిదూషిః ।
అథో సహస్వాన్ జఙ్గిడః ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥ ౬

## (౫) పఞ్చమం సూక్తమ్

## ఇంద్ర స్తోత్రమ్

ఋషిః :- భృగురాథర్వణః ॥ ; దేవతా :- ఇన్ద్రః ॥ ఛన్దః:- ౧ నిచృదుపరిష్టాద్ బృహతీ; ౨ విరాడుపరిష్టాద్ బృహతీ; ౩ విరాట్పథ్యా బృహతీ; ౪ జగతీపురో విరాట్ త్రిష్టుప్; ౫-౭ త్రిష్టుప్ ॥

౧౭౬. ఇన్ద్ర జుషస్వ ప్ర వహా యాహి శూర హరిభ్యామ్ ।
పిబా సుతస్య మతేరిహ మధోశ్చకానశ్చారుర్మదాయ ॥ ౧

౧౭౭. ఇన్ద్ర జఠరం నవ్యో న పృణస్వ మధోర్దివో న ।
అస్య సుతస్య స్వర్ణోప త్వా మదాః సువాచో అగుః ॥ ౨

౧౭౮. ఇన్ద్రస్తురాషాణ్మిత్రో వృత్రం యో జఘాన యతీర్న ।
బిభేద వలం భృగుర్న ససహే శత్రూన్ మదే సోమస్య ॥ ౩

౧౭౯. ఆ త్వా విశన్తు సుతాస ఇన్ద్ర పృణస్వ కుక్షీ విడ్ఢి శక్ర ధియేహ్యా నః ।
శ్రుధీ హవం గిరో మే జుషస్వేన్ద్ర స్వయుగ్భిర్మత్స్వేహ మహే రణాయ ॥ ౪

౧౮౦. ఇన్ద్రస్య ను ప్ర వోచం వీర్యాణి యాని చకార ప్రథమాని వజ్రీ । అహన్నహి
మన్వపస్తతర్ద ప్ర వక్షణా అభినత్ పర్వతానామ్ ॥ ౫

౧౮౧. అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష ।
వాశ్రా ఇవ ధేనవః స్యన్దమానా అఞ్జః సముద్రమవ జగ్ముర్ ఆపః ॥ ౬

